ఓం

శ్రీ గురుభ్యోనమః



శ్రీమద్భాగవత కృష్ణదేశికేంద్రులు

శ్రీమద్భాగవత కృష్ణదేశికేంద్రుల వారిచే రచింపబడిన

# శక్తిద్వయ నిరాసకంబైన
# శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థదరువులు

మరియు

## క్షరాక్షరోపాధి ద్వయ దోష రహిత పరమతత్త్వ కందములు
## టీక, దండాన్వయ, భావ, విశేష భావములు




రచయిత :

శ్రీ సమరస బోధానంద

నేమాని వెంకటరామం

వానపల్లి, మం॥ కొత్తపేట, జి॥ తూర్పుగోదావరి

శ్రీ గురుభ్యోనమః

**శ్రీమద్భాగవత కృష్ణదేశికేంద్రుల వారిచే**

రచింపబడిన

**శక్తిద్వయ నిరాసకంబైన**

# శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థదరువులు

మరియు

## క్షరాక్షరోపాధి ద్వయ దోష రహిత

## పరమ తత్త్వ కందములు

## టీక, దండాన్వయ, భావ, విశేష భావములు


రచయిత:

శ్రీ సమరస బోధానంద

**నేమాని వెంకటరామం**

వానపల్లి

కొత్తపేట మండలం

తూర్పు గోదావరి జిల్లా


వెల : 150-00


గ్రంథము లభించుస్థానము :

శ్రీ సచ్చిదానంద మద్దు వెంకటరెడ్డి గారు

శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర అచల ఆశ్రమం

గ్రామము: పోలుమల్ల, మదలం: నూతన్‌కల్, జిల్లా: నల్గొండ.

# గ్రంథకర్త నేమాని వెంకటరామం గారి సంక్షిప్త స్వీయచరిత్ర

ఈ గ్రంథకర్త నయిన నేను, తూర్పు గోదావరి జిల్లా కొత్తపేట మండలం, వానపల్లి గ్రామ కాపురస్థుడను. నితుందిలన గోత్రము, శ్రీ నేమాని సూర్యనారాయణావధాని దత్తత పుత్రుడను, వెంకటరామ నామ ధేయుడను. నేను ఎస్.ఎస్.ఎల్.సి. చదివి గ్రామాభివృద్ధి అధికారిగా ప్రభుత్వోద్యోగము 36 సం.లు చేసి, తేది. 30-11-1994లో పదవీ విరమణ చేసినాను. తూర్పుగోదావరి జిల్లా, తొస్సిపూడి గ్రామవాసులు, శ్రీ శివరామదీక్షిత గురుపారంపర్యులు, శ్రీ సమరస నిర్మల ప్రజ్ఞాన విలక్షణ, భారద్వాజస గోత్ర అరట్ల రామారాయ సద్గురు ప్రభువుల పాదపద్మములను ది. 8-8-1969 సం.రములో ఆశ్రయించి మంత్ర దీక్షను పొంది ధన్యుడనయితిని. 1989 సం.లో గురు దీక్షాధికారముతో అనుగ్రహింపబడితిని. నా దత్తత అక్క గారు శ్రీయాదార్థబోధోపదేశిక ఆచాళ్లమాణిక్యాంబ గారి పెంపకములో విద్యాబుద్ధులు నేర్చితిని. భారద్వాజస గోత్రములో జన్మించిన సుందరాంబ నామధేయపతితో 1953 సం.రములో వివాహము జరిగినది. ఈమె వలన ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుని పొందితిని. ఈమె కూడా గురుపుత్రురాలు అగుటచే ఈ గ్రంథము వ్రాయుటలో చేదోడు, వాదోడుగా సహకరించిరి.

నా జనక తల్లిదండ్రులు నితుందినస గోత్రము నేమాని వెంకటరమణమ్మ, సుబ్బన్న నామధేయులు. నేను ది. 26-9-1937 సం.రములో జన్మించితిని. నా మూడవ సం.రం వయసులో, నాతండ్రి గారి అన్నగారైన నేమాని సూర్యనారాయణ అవధాని గారి మగ సంతతి లేనందున దత్తత ఈయబడినాను. వీరు వేదపండితులు. ఆస్తికులు. నిత్యము వేదపారాయణ, ఈశ్వరారాధన, పంచాక్షరీ మంత్రోపాసనతో జీవితము నిరాడంబరముగా గడిపినారు. వీరియొక్క పుణ్యభాగ్యము అశీర్వచన సంస్కార బలముచే, ఇట్టి సద్గతి ప్రాప్తించినదని, త్రికరణశుద్ధిగ నమ్ముచున్నాను.

ఈ గ్రంథమును సద్గురు ప్రభువులైన శ్రీ సీతామహాలక్ష్మీ సమేత శ్రీ సమరస నిర్మల ప్రజ్ఞాన విలక్షణ రామారాయ సద్గురు ప్రభువుల పాద పద్మములకు నమస్సుమాంజలులతో అంకితము చేసికొనుచున్నాను.

ఇట్లు

బుధజన విధేయుడు

**సమరస బోధానంద నేమాని వెంకటరామం**

వానపల్లి

17-10-2010

# ముందుమాట

శ్రీ మద్రామదగు శివరామ దీక్షితాచల గురు పీఠ సంప్రదాయకులు, శ్రీమత్పరుశురామ సీతారామస్వామి వారి కరకమల సంజాతులైన, శ్రీమద్రాజాధిరాజ రాజ యోగీంద్రులైన శ్రీమద్భాగవతుల కృష్ణదేశికేంద్రులు శాలివాహన శకం 1765 సం.ము అనగా క్రీ.శ. 1843వ సం.ల శోభకృన్నామ సం.ర మార్గశిర బహుళ చవితి నాటికి "శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ పౌర్ణమి నాటికి" "క్షరాఽక్షరోపాధి ద్వయ దోషరహిత పరమతత్త్వ కందములు" 261 పద్యములను వ్రాసిరి. ఈ స్వహస్త లిఖిత గ్రంథము హైదరాబాదు శ్రీమత్పిల్లానాలక్ష్మణదేశికేంద్ర మందిరము నందు భద్రపరచబడియున్నది. శ్రీకృష్ణదేశికేంద్రుల వారి ఇంకా అనేక స్వహస్త లిఖిత గ్రంథములు కూడా ఆ మందిరము నందు భద్రపరచిబడియున్నవి. శ్రీకృష్ణదేశికేంద్రుల వారు క్రీ.శ. 1875 సం.రం ధాతృనామ సం.ర కార్తీక శుద్ధ దశమి శుక్రవారం రోజున నిర్వాణము చెందిరి. ఈ కందార్థములలో ఎరుక యొక్క నిజరూపము మిధ్య అని నిరసించుచూ, పరిపూర్ణ పరబ్రహ్మము శాశ్వతమైనదని నిరూపణచేయుచు, వేదాంత పంచదశి మొదలగు ఆర్షగ్రంథములలోని శ్లోకములకు సరియైన తర్జుమాతో శాస్త్ర జ్ఞానమునకు భిన్నము లేకుండగనే కాక, శాస్త్రములో ఎరుక, పరబ్రహమములను నిరూపించుటలో గల గజిబిజి, ఈ కందర్థాములలో లేకుండా చక్కగా తెలియపర్చిరి. వీటిభావము తేలికగా కనుపించుచున్నను, శాస్త్రజ్ఞానముచే విచారించవలసి యున్నది.

కాలక్రమములో అనేకమంది ఈ పద్యములను సరిగా అర్థము చేసికొనగల భాష, శాస్త్రజ్ఞానము లేనందున, ఎవరికి తోచిన విధము వారు ఈ పద్యములకు విపరీత భావములు చెప్పుచు, సంప్రదాయ విరుద్ధభావములతో పుస్తకములను ప్రచురించిరి. అందుచేత ఆ సద్గురుమూర్తి కరుణచేత వారి మనఃప్రేరణ చేత ఈ పద్యములకు సరియైన భావములు తెలియపర్చుటకై, పద్యము, కఠినపదములకు సరియైన నిఘంటు అర్థము, భావము, విశేషభావము, దండాన్వయములతో ఈ గ్రంథమును వ్రాసితిని. ఈ గ్రంథములోని భావములు కొందరికి సరిపడకపోవచ్చును. కాని భావము తప్పు, ఇది సంప్రదాయక భావము కాదు అని నిరసించక, చక్కగ విచారించి గ్రహించగలందులకు ప్రార్థించుచున్నాను. పరిపూర్ణ పరబ్రహ్మమే శాశ్వతమైనది. ఎరుక ఎంతమాత్రము ఉన్నది కాదు. ఉన్నట్లుగా కనిపించేదే కాని, విచారించినచో ఎంతమాత్రము ఉన్నది కాదు, లేనిది అని మాత్రమే వ్రాసినాను. సరిగా గ్రహించ ప్రార్థన.

ఈ గ్రంథమును వరంగల్‌లోని "శ్రీ సరస్వతి ఆఫ్‌సెట్ ప్రింటర్సు" వారు చక్కగా ప్రింటు చేసి సకాలములో మాకు అందించినందుకు వారికి కృతజ్ఞతలు చెప్పుకొనుచున్నాను.

శ్రీ గురుభ్యోనమః

# శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర ఆశ్రమం పోలుమల్ల.

## గౌరవ అధ్యక్షులు శ్రీ ఏలేటి మంగారెడ్డి గారి సంక్షిప్త

## జీవిత చరిత్ర

శ్రీ ఏలేటి మంగారెడ్డి గారు ప్రస్తుతం చిన నాగారం గ్రామకాపురస్థులు. సంపన్న కుటుంబీకులు, వీరి అసలు జన్మస్థలం నూతన్‌కల్ మండలం పోలుమళ్ల గ్రామం. వీరు శ్రీ ఏలేటి నరసయ్య శ్రీమతి అన్నమ్మ దంపతులకు 1956 సం.రములో వీరి తల్లిగారి గ్రామం ముకుందాపురంలో జన్మించిరి. వీరికి చిన్ననాటి నుండి ఇరుగుపొరుగు వారికి అవసరానికి సహాయపడటం, వీలైన దానధరమ్మములు చేయుట యందు ఆసక్తి గలవారు. వీరియొక్క చిన్ననాడే అనగా మూడవ సం.ర వయస్సులోనే తల్లిగారు మరణించిరి. 1977 సం.రంలో తండ్రిగారు మరణించిరి. పెద్దగా విద్యాభ్యాసం చేయ వీలుపడలేదు. కాని దానధర్మములు, సంఘములో మంచి పలుకుబడి కలిగి, తమకు వీలైన ఆర్ధిక సహాయము చేయుటలో కుతూహలము కల్గిన మనస్సు కలవారైరి.

1964 సం.రం పోలుమల్ల గ్రామం నుండి, నెల్లికుదురు మండలం రాజుల కొత్తపల్లి శివారు సీతారామపురం గ్రామమునకు మకాం మార్చిరి. 1969 సం.రం నుండి 1974 సం.ర వరకు కొద్దిపాటి చదువు మాత్రమే అభ్యసించిననూ, పెద్దబాలశిక్ష పూర్తిగా చదువుటచే సంఘములో తమ వంతు సహాయ సహకారములు అందించాలని, దైవభక్తి కలిగి ఉండాలని, నీతినియమప్రవర్తనతో మెలగాలని మనస్సు కలవారైరి. 1976 సం.రం నుండి భూముల కొలతలు వేయుటనేర్చి, ఆ పని చేయుచుండిరి. 1975 సం.రంలో శ్రీమతి సుభద్రాదేవితో వివాహము జరిగినది. వీరికి ఇద్దరు కుమారులు, ఒక్క కుమార్తె. పెద్దకుమారుడు వరప్రసాద్ బ్యాంక్ ఉద్యోగి, రెండవ కుమారుడు ఓంప్రకాశ్‌రెడ్డి ఇంజనీరింగు చదివి ప్రస్తుతం అమెరికాలో ఉద్యోగము చేయుచున్నాడు. అల్లుడు కూడా పెద్ద ఇంజనీరే. వీరు 1993 వరకు కె.సముద్రంలో ఇంజనీరింగ్ షాపు వ్యాపారము చేసిరి. 1995 వరకు శ్రీరాంసాగర్ భూములు కొల్తలు వేయు ఉద్యోగము చేసిరి. 1996 నుండి రైతులకు పట్టాదారు పాసుపుస్తకములు ఇచ్చుటకు 2008 సం.ర వరకు R.O.R. గా పనిచేసిరి.

P.T.O.

వీరు చక్కని ఆధ్యాత్మిక భక్తులు. శ్రీ పరమ శివానంద శ్రీరాంపాదిలి భద్రయ్య గారి వద్ద శిష్యులుగా చేరి, అచల పరిపూర్ణ బోధస్థులయిరి. వీరి ఆత్మీయ సోదరుడనైన నేను పోలుమళ్ళ గ్రామములో శ్రీ వేంకటేశ్వర ఆశ్రమ నిర్మాణము చేయటలో అధికమైన ఆర్థిక విరాళము అందజేసిన శ్రీ మంగారెడ్డి గారి జీవితచరిత్ర కొద్దిగా భక్తులకు పరిచయం చేయాలని సంకల్పము కలిగి ఈ విధముగా ప్రచురించినాను. ఆశ్రమ నిర్మాణము సహాయ సహకారములు అందించి, గురుభక్తుడనై గుర్వాశ్రమ నిర్మాణ సహకారము చేసినందుకు, తన జన్మ ధన్యత పొందినదని, శ్రీ మంగారెడ్డి గారు భావించిరి. అప్పటినుండి ఎవరికి ఏ సహాయము కావలసిన జాప్యము లేకుండగా చేయాలని సత్సంకల్పముతో, వారు సహాయము చేయుచున్నారు. ప్రస్తుతము, ఈ కందార్థవ్యాఖ్యాన గ్రంథము అచ్చువేయుటకు రూ. 30,000/- విరాళముగా ఇచ్చి అచ్చు వేయించుటకు ముఖ్య సహాయము చేసిరి. ఇటుపైన కూడా పోలుమళ్ళ అచల ఆశ్రమము పురోభివృద్ధికి వారు తమయొక్క తోడ్పాడు యెల్లవేళలా ఉంటుందని వాగ్ధానము చేసిరి.

ఇట్టి ధన్యజీవులయిన శ్రీ మంగారెడ్డి దంపతులకు వారి కుటుంబ సభ్యులకు, ఆయురారోగ్య ఐశ్వర్యములను, పరిపూర్ణజ్ఞానమును ప్రసాదించి, జన్మకర్మ నివారణ సిద్ధిరస్తుగ శ్రీ సద్గురు మూర్తి ప్రసాదించగలందులకు ప్రార్థిస్తూ... ఇక సెలవు.

ఇట్లు

పోలుమల్ల
10-10-2010

**శ్రీ సచ్చిదానంద భారతాంబాసమేత**
**మద్దుల వెంకటరెడ్డి**



శుద్ధ నిర్గుణతత్త్వ కందార్థ రచయిత

**శ్రీ మద్భాగవత కృష్ణదేశికేంద్రులు**



కందార్థ టీకార్థ భావ వ్యాఖ్యాన కర్త గురు ప్రభువులు

**శ్రీ సీతా మహాలక్ష్మీ సమేత**
**శ్రీసమరస నిర్మల ప్రజ్ఞాన విలక్షణ**
**రామారాయ సద్గురు ప్రభువులు**



కందార్థములకు టీక, భావ వ్యాఖ్యాన రచయిత

**శ్రీ సమరస బోధానంద**

**నేమాని వెంకటరామం దంపతులు**



శ్రీ దాసరోజు వీరాచారి - వాణి దంపతులు

బాశెట్టి గూడెం, హైదరాబాద్





శ్రీ తండ నిర్మల సమేత వెంకన్న దంపతులు

పాతర్లపహాడ్



శ్రీ జూలూరి యాదగిరి - నిర్మల దంపతులు
పాతర్ల పహాడ్





శ్రీ వల్లపు వాణి - సోమశేఖర్ దంపతులు
రిటైర్డ్ డి.ఇ. హైద్రాబాద్.



శ్రీ పరమ శివానంద శ్రీరాంపొదిలి భద్రయ్యార్యుల వారి శిష్యులు

శ్రీ నిత్యానంద పెరుమాండ్ల ఏకయ్య దంపతులు, రాజులకొత్తపల్లి.





శ్రీ వివేకానంద వెన్ను నాగయ్య గారి శిష్యులు

శ్రీ వేల్పుల మల్లయ్య దంపతులు, సీతారాంపురం




శ్రీ సమరస బోధానంద నేమాని వెంకటరామం గారి శిష్యులు

**శ్రీ దారం కుమారస్వామి, ప్రభావతి దంపతులు, తొర్రూరు.**





శ్రీ సరస సబోధానంద నేమాని వెంకటరామం గారి శిష్యులు

**శ్రీ నాళం కృష్ణమూర్తి-అనసూయ దంపతులు, తొర్రూరు.**



శ్రీ సమరస బోధానంద నేమాని వెంకటరామం గారి శిష్యులు

శ్రీ కుంభం శ్రీధర్ - రజిత దంపతులు, ఇనుగుర్తి.





శ్రీ కాత్రేవుల కొమురయ్య - ఎల్లమ్మ దంపతులు

కేసముద్రం



శ్రీమద్ దయానంద ప్రియశిష్యులు పొన్నాల రాజయార్య

అ॥ప॥ బొల్లు కేదారి - కళావతి దంపతులు, వరంగల్.





శ్రీ కందగట్ల లక్ష్మీకాంతారావు గారు

నకిరేకల్



శ్రీ పెద్దోళ్ళ మల్లారెడ్డి గారు

గాజులగూడ



నిత్యా సంతోషిణి

కృష్ణవేణి - వైరా





శ్రీ బాబు పంతులు గారు

గాజులగూడ



శ్రీ వస్త్రం వెంకటేశ్వర్లు - సమ్మక్క దంపతులు
తిమ్మాపురం





శ్రీ మిట్టకోల రాములు - వెంకటనరసమ్మ దంపతులు



శ్రీ సిరిగిరి సమ్మయ్య, శ్రీమతి సామలమ్మ, వెంకటమ్మ దంపతులు





శ్రీ యెనగందుల వెంకటయ్య దంపతులు

మరిపెడ



దారం ఉమారాణి - రాధాక్రిష్ణమూర్తి
దంపతులు, పడమటిగూడెం



శ్రీమతి కొంసమాంబ - (కీ.శే. చెన్నపరం సదానంద)
దంపతులు



## గ్రంథమునకు విరాళములు ఇచ్చిన దాతలు

1) శ్రీ కరుణానంద పోళం బసవరాజం గారు, కేసముద్రం రూ॥ 1516/-
2) శ్రీ ఓళం రాజగోపాలం గారు, కేసముద్రం రూ॥ 1116/-
3) శ్రీ ఓళం సత్యనారాయణ గారు, కేసముద్రం రూ॥ 1116/-
4) శ్రీ ప్రతాపని కృష్ణయ్య గారు, కేసముద్రం రూ॥ 1116/-
5) శ్రీ గార్లపాటి లక్ష్మారెడ్డి గారు, కేసముద్రం రూ॥ 1116/-
6) శ్రీ కొత్తపల్లి మోహన్‌రావు గారు, కేసముద్రం రూ॥ 1116/-
7) శ్రీ రాపోలు శంకరయ్య గారు, కేసముద్రం రూ॥ 1116/-
8) శ్రీ అనంతోజు సూర్యమణి సమేత కృష్ణయ్య హైద్రాబాద్ రూ॥ 1116/-
9) శ్రీమతి పరమానంద దేవకమ్మ గారు, హైద్రాబాద్ రూ॥ 1116/-
10) శ్రీ పబ్బతి సత్తయ్య గారు, నకిరేకల్ రూ॥ 1116/-
11) శ్రీ గురుకరుణానంద మోసరామారావు గారు రూ॥ 1116/-
విశాఖ, చిన్నవలస.
12) శ్రీ వల్లపు నరసయ్య గారు, పోలుమళ్ల రూ॥ 1116/-
13) శ్రీ పొట్టబత్తిని కోటయ్య గారు, పోలుమళ్ల రూ॥ 1116/-
14) శ్రీ దారం రాధాకృష్ణమూర్తి దంపతులు రూ॥ 1116/-
(పోలుమళ్ల ఆశ్రమ కోశాధికారి)

# శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థ దరువులు అక్షర క్రమం

ఓం శ్రీ గురుభ్యోనమః

# 1) సభావిజ్ఞాపన - (21)

1) జనులార, జనన మరణములను, దొలగన్ ద్రోయజాలు, లక్షణయుతమై! వినువారికి, కనువారికి । తనలా వెరిగించు, దీన్ని, తప్పక వింటే ॥ అప్పుడే వారలెప్పుడు గంటే ॥ కనుకవిన బుద్ధైతె వినుడీ చదివెద, మీకె । కనుగొన మనసైతే కనుడీ పుస్తకమంతా ॥ తప్పక వింటే । అప్పుడెవారలెప్పుడు గంటే॥

**అవతారిక :** గ్రంథకర్త అయిన శ్రీమద్భాగవత కృష్ణదేశికేంద్రుల వారు, ఈ గ్రంథము యెట్టి అర్హత కల్గినవారు చదువుకొన తగునో మరియు ఈ గ్రంథస్థ విషయము ఏమిటో, దీన్ని తెలుసుకొనుట వలన కలుగు ప్రయోజనమేమిటో ఈ పద్యములో చెప్పుచున్నారు.

**దండాన్వయం :** 1) జనులారా! లక్షణయుతమై దీన్ని తప్పక వింటే, వినువారికి జనన మరణములను తొలగన్ తన లావు ఎరిగించును, కనుక వినబుద్ధైతే పుస్తకమంతా చదివెద వినుడీ ॥ (వినేవారికి ఇది ఫలితము) 2) జనులారా లక్షణయుతమై దీన్ని కనువారికి వారలెప్పుడు గంటే అప్పుడే జనన మరణములను త్రోయజాలు / కనుక మీకే కనుగొన మనసైతే కనుడీ । (ఇది కనేవారికి కలిగే ఫలితము) ఈ విధముగా పద్యమును వినే వారికి ఎట్టి ఫలితము కలుగునో గ్రంథస్థ విషయమైన పరిపూర్ణ బ్రహ్మమును కనేవారికి కలిగే ఫలితమేదియో రెండు వాక్యములుగా దండాన్వయము చెప్పబడెను.

**టీక :** త్రోయజాలు=లేకుండా చేయవచ్చును; లావు = గొప్పతనము; దీన్ని = ఈ గ్రంథమును; గ్రంథ విషయమును.

**భావము :** ఓ జనులారా! జనన మరణములనే పునరావృత్తి దుఃఖము లేకుండా చేసికొనవచ్చును. శ్రద్ధ భక్తి, వినయ - విధేయతలు మొదలగు సాత్త్విక (జ్ఞాన) లక్షణములు కలిగి, నేను కందార్ధరూపముగా చెప్పే ఈ బోధ పూర్తిగా వినువారికి ఆ పరిపూర్ణ పరబ్రహ్మమును కనువారికి తిరిగి జన్మలేకుండాపోవును. ఎప్పుడు ఈ బోధ విని, వినిన విషయమును కనుట జరుగునో, అప్పుడే ఆ క్షణమునందే వారికి తన యొక్క లావు (గొప్పతనము) తెలియబడును. కనుక యిట్టి బోధను మీకు వినబుద్ధి కలిగినచో, నేను ఈ పుస్తకమంతయును చదివెదను శ్రద్ధగా వినండి, లేక

మీకే చదుకొన తలచినచో ఈ పుస్తకము ఆసాంతము విచారణపూర్వకముగా మీరే చదువుకొనుడు. (ఇది సామాన్యభావము)

**దండాన్వయ విధానములో భావము :** జనులారా! జ్ఞాని యొక్క లక్షణములు కలిగి వేదాంత విచారణకు అర్హులైనవారు, ఈ గ్రంథమును గురుముఖతా వినువారికి జనన మరణములనే పునరావృత్తి దుఃఖము; లేకుండగజేయుటలో ఈ గ్రంథము యెంత గప్పదియో తెలియబడును. అనగా పునరావృత్తి రహితమైన మార్గము సరియైన విధానము తెలియబడును. కనుక మీకు వినబుద్ధి కలిగినచో ఈ గ్రంథమంతా చదివి చెప్పెదను; శ్రద్ధగా వినండి (ఇది వినుట మాత్రమే జరిగిన వారికి కలిగే ఫలితము).

ఇంక జ్ఞాని లక్షణములు కలిగి అంటే సాధన చతుష్టయ సంపత్తి కలిగి ఈ గ్రంథ భావనమును గురుముఖతా విని, గ్రంథస్థ విషయమైన పరిపూర్ణ పరబ్రహ్మమును గురుకరుణచే కనిన వారికి, వారు ఆ విధముగా ఎప్పుడు కనెదరో ఆ క్షణమునందే జనన మరణములను లేకుండా చేసికొనగలరు. అనగా అట్లు కన్నవారికి పునరావృత్తి దుఃఖము పూర్తిగా నశించిపోవును. కనుక కనుగొన మనసు ఉన్నచో కనుడీ.

**విశేష భావము :** 1) జనులారా! "జ" అనగా పుట్టి "న" అనగా నశించేవారలారా. అనగా పుట్టుట, చచ్చుట అనే చక్రములో పడి జనన మరణ ప్రవాహము నుండి బయట పడలేక బాధపడుచున్న ఓ జనులారా! అని సంబోధన. ఈ గ్రంథము యొక్క ఫలితము పునరావృతి దుఃఖమును లేకుండాజేయును అని భావము.

**2) జనన మరణములను దొలగన్ ద్రోయజాలు :** శృతిః "తే బ్రహ్మలోకే పరాంతకాలే, పరామృతాత్, పరిముచ్యంతి సర్వే"

**వివరణ :** పరాంతకాలము - అనగా 1) కృతయుగము, 2) త్రేతాయుగము, 3)ద్వాపరయుగము, 4) కలియుగము. ఈ నాలుగు యుగముల కాలము ఒక మహాయుగము. అట్టి మహాయుగములు 17 మహాయుగముల కాలము ఒక మన్వంతరము. అట్టి 15 మన్వంతరముల కాలము సృష్టికర్తయిన బ్రహ్మకు ఒక పగలు. అంతేకాలము రాత్రి కాలము. ఈ పగలు రాత్రి కలిసి పరాంతకాలము.

ఆ లోకమందుండి, తిరిగి బ్రహ్మాండ ఆవిర్భావ సమయములో అందున్న సమస్తము విడిచిపెట్టబడును. అనగా అందున్న సమస్తలోకములు, లోకేశులు, లోకస్థులు, జీవులు అన్నియు తిరిగి పుట్టవలసినదే అని శృతి అర్థము అయినందున, ఎప్పటికిని జన్మకు రాకుండగ చేసుకొన వీలు కలుగదు అని బాధపడనక్కరలేదు. ఈ గ్రంథములో చెప్పినట్లుగా ఈ బోధ విని, కనినచో తిరిగి పురావృత్తి దుఃఖము ఎన్నటికి కలుగదు అని నిర్దుష్టముగా చెప్పుచున్నారు.

3) ఈ పద్యములో "జనన మరణములు లేకుండ చేసుకొనవచ్చును" అన్నారు కదా! ఆ వాక్యములో చెప్పినట్లు, మరణము లేకుండగ, అంటే ఈ సంప్రదాయకులలో ఎవరైనా చావు నుండి తప్పించుకున్నారా? లేదు, ప్రత్యక్షముగా కనిపించే మరణము నుండి తప్పించు కొనలేనప్పుడు, ప్రత్యక్షముగా తెలియని పునర్జన్మ నుండి తప్పించుకోగలరనుట ఎట్లు ? అని కొందరి ప్రశ్న కలదు. అంటే "జాతస్య హి ధృవోర్మృత్యుః ధృవం జన్మమృతస్యచ" అన్న గీతా వాక్యానుసారముగా, పుట్టినవానికి చావు తప్పదు, చచ్చిన వానికి తిరిగి పుట్టుకయు తప్పదు. అనగా చనిపోయిన తరవాత తిరిగి పుట్టవలసినదే. అయితే "జననము" అనగా చనిపోవుటకు కారణమైన ఒక అవస్థ. మరణమనగా తిరిగి పుట్టుటకు కారణమయిన అవస్థ. అంటే ఎవరైతే గురు కరుణచే చావు పుట్టుకలకు కారణమైన వస్తువును, దానికి అతీతమైన పరిపూర్ణమును, గురు కరుణచే విని కనగలరో అట్టి వారు చనిపోవుట, మరణించుట అనతగదు. అది కట్టిన వస్త్రము, విడిచినట్లుగా దేహత్యాగమైనను, జన్మించే వస్తువు కూడా నశించిపోవును కనుక పురావృత్తికి ఎంత మాత్రము అవకాశము లేదు. ఇది అట్టివారికి మాత్రమే స్వానుభవము కాగలదు. నిశ్చయము. పై వారికి తెలిసేది కాదు.

4) **లక్షణయుతమై వినువారికి :** లక్షణయుతము అనగా గురువు యందు శాస్త్రములయందు శ్రద్ధ, భక్తి, వినయ, విధేయతలు కలిగి అని చెప్పవచ్చును. మరియు ఈ బోధ తెలుసుకొనుటకు - జీవ లక్షణములు విడచి ఈశ్వరత్వమును పొందిన జ్ఞానులకు మాత్రమే అని చెప్పబడుచున్నందున, జ్ఞాని లక్షణములయిన 20 లక్షణములు భగవద్గీత 13వ అధ్యాయములో

చెప్పబడినట్లుగా, అట్టి జ్ఞాని లక్షణయుతమై వినువారికి అని భావము.

5) **తవలావెరిగించు** : అనగా తన లావు ఎరిగించు అని అర్థము. లావు అనగా గొప్పతనము. ఈ గ్రంథ భావమును గురు ముఖముగా విన్నవారికి తన గొప్పతనము తెలియబడును. అనగా ఇది వినుటకు పూర్వము, తాను ఈశ్వరత్వలక్షణములో ఉండుటచే, తానే సర్వకారణ బ్రహ్మయని భావించును. కాని ఈ గ్రంథ భావము తెలిసికొనిన పిదప నేను బ్రహ్మము కాదు, మూలములేని గుర్తెరిగే శరీరి'' అని తెలియబడుటయే తన లావెరిగించును అన్న వాక్యార్థము. మరియు తన అనే పదము గ్రంథమునకు కూడా అన్వయించవచ్చును. అప్పుడు మిగిలిన శాస్త్రముల కన్నా ఈ గ్రంథము ఎంత గొప్పదో తెలియబడును. వేదాంత శాస్త్రముల్లో మాయాశబళిత బ్రహ్మ, శాశ్వత బ్రహ్మ రెండు ఒకే పదముతో గజిబిజిగా చెప్పియున్నారు.

ఈ కందార్థ గ్రంథములో మాయాకబళిత బ్రహ్మమునకు "ఎరుక" అని, శాశ్వత బ్రహ్మమునకు పరిపూర్ణము, బట్టబయలు అనే పేర్లతో విడదీసి బ్రహ్మతత్వ నిరూపణ గజిబిజి లేకుండగా తిన్నని విధానములో చెప్పుటయే ఈ గ్రంథముయొక (లావు) గొప్పతనము, అని భావము.

6) **అప్పుడే వారలెప్పుడు గంటే** : "వారలెప్పుడు గంటే అప్పుడే'' అని దండాన్వయము. ఈ గ్రంథమును గురుముఖతః ఎప్పుడు విని హృదయమునకు ధృడపడునో, ఆ పరిపూర్ణమును కనగలడో ఆ క్షణమందే జన్మకారణమైన ఎరుక పూర్తిగా లేకపోవును. మిగిలిన మంత్రముల వలె ఇన్ని లక్షలు జపించినచో మంత్రాధిష్ఠాన దైవము సిద్ధించగలదు, అని చెప్పినట్లు కాదు, కనిన వెంటనే నీవు ఉండగానే "నేను లేకపోవును" అని భావము.

---

**అవతారిక** : రజస్తమో గుణ ప్రధానులయిన వారికి ఈ గ్రంథము రుచించదనియు, సత్త్వగుణ ప్రధానులైన వారు మాత్రమే ఈ గ్రంథము యొక్క భావమును గుర్తించగలరనియు, కనుక పదే పదే ఈ గ్రంథమును చదువుమని, వినుమని ప్రచారము చేయవద్దని చెప్పుచున్నారు.

**2) పద్యం : వినవలెనని కనవలెనని ! మనసందున కోర్కెగల్గు మనుజులె వినుడీ! వినజేసెద కనజేసెద । ఘనమగు యీ బోధ, వినకననొల్లనట్టీ ॥ మనుజులు, వచ్చిన త్రోవబట్టీ ॥ తినమంటే పులి వల్లదని లోకులన వింటి । గనుకనే వినవలెనన నోరాడదు విన॥ కననొల్ల నట్టి । మనుజులు చనుడొచ్చిన త్రోవబట్టీ ॥**

**దండాన్వయం :** వినవలెనని, కనవలెనని, మనసందున కోర్కెగల్గు మనుజాలె వినుడీ। (అట్టివారికి) ఘనమగు యీ బోధ వినజేసెద కనజేసెద। ఘనమగు యీ బోధ విన కననొల్ల నట్టి మనుజులు, వచ్చిన త్రోవ పట్టిచనుడు ॥( ) బ్రాకెట్టులో పదము అన్యాపదేశ శబ్దము.

**టీక :** పులి - పులి, పులుపు అని కూడ అర్థము.

**భావము :** (కనుక ఓ సభాసదులారా!) యీ గ్రంధస్థ విషయమును గురుముఖతః వినవలెననియు, అట్లు విన్నబోధను ఆచరణ పూర్వకముగా మననము చేయుచుండవలెననియు (లేక ఆ చెప్పిన బ్రహ్మతత్త్వమును చక్కగ కనవలెననియు) మనస్సులో ధృడముగా కోర్కెగలిగిన మనుజులు మాత్రమే వినండి. అట్టి వారికి మాత్రమే ఆ బ్రహ్మతత్త్వమును చక్కగా బోధించెదను, మరియు బ్రహ్మము కనరానిదనియున్న ఆ రహస్యమును జెప్పి కనజేసెదను, ఆవు పులి కథ, ఆవు తనను తినవద్దన్నప్పుడు పులి తింటాననియు, ఆవు తినమని అన్నప్పుడు పులి తిననని యు చెప్పబడినది, అనగా సత్త్వగుణ ప్రధానముయిన ఆవు మాటకు, రజో గుణ ప్రవృత్తి గల పులి వ్యతిరేక మాట చెప్పినది. అట్లే పులి వంటి రజోగుణులకు నేను వినమని జెప్పిననూ వినరు. కనుక పదే పదే ఈ బోధను వినుమని చెప్పుటకు నాకు నోరాడుట లేదు. అనగా చెప్పలేకున్నానని భావము.

పులి అంటే పులుపు అనే అర్థములో - తినుమని ద్రాక్ష పళ్ళు పెట్టినప్పుడు ఇవి పుల్లగా ఉండును, తినను అని చెప్పుచుందురు, కనుక పదే పదే వినమని చెప్పలేకున్నాను, అని కూడా భావము.

**విశేష భావము :** 1) వినవలెనని, కనవలెనని.... వినుడీ అనగా ఈ గొప్పదైన పరిపూర్ణ బోధ వినుటకు అర్హులు ఎవరనగా, జగత్కారణ బ్రహ్మమైన అఖండ ఎరుక వర్మ్క, సాంఖ్య, తారక, అమనస్క, మహావాక్య విచారణలచే ధృడపడినట్టి

జ్ఞానులు మాత్రమే అర్హులు, అట్టి అర్హులైన వారికి మాత్రమే వినజేసెద అన్నారు. ఇతరులు ఇహపరభోగములు వగైరా కామ్యముల యందు, మనస్సు గల వారై యుందురు. కనుక ఇట్టి వారు అనర్హులు అని భావము.

**2) చనుడొచ్చిన త్రోవబట్టీ** - అనగా ఏలాగున వచ్చినారో అలాగే వెళ్లండి, అంటే పూర్వము వలె రాకడ పోకడల తోనే ఉండండి అని ఒక భావము. ఈ పూర్ణ బోధలోకి రాకపూర్వము, భక్తి యోగ, కర్మ, భజన, వగైరా మార్గముల యందు మనస్సు కల వారై యుండిరో అట్టి వారు ఇంకనూ జ్ఞానమార్గమునకు అర్హులు కాకుండగ భక్తి యోగ ములందయే మనస్సు కల్గియున్నచో అట్టి వారికి ఈ పరిపూర్ణ బోధ రుచించదు. కనుక, అట్టి వారికి పుణ్య సంస్కారము వృద్ధి పొందే వర్కు గతంలో అనుసరించుచున్న మార్గములోనే ఉండుడు, అని మరొక అర్థము.

**3) తినుమంటే పులి వల్లదని .... నోరాడదు** : ఆవు, పులి కథలో వలె రజస్తమో గుణ ప్రధానులకు జ్ఞానము హృదయస్థము కాదు, ఒకవేళ ఏ కొద్ది సంస్కారము చేతనో, బోధ చెప్పుకున్నను, సంపూర్ణముగ వస్తు నిశ్చయ జ్ఞానము కలుగదు. పరబ్రహ్మమైన పరిపూర్ణమును ఎంత మాత్రము కనలేరు. కనుక సత్త్వ గుణ ప్రధానులు మాత్రమే జ్ఞానమునకు అర్హులు. అట్టి వారి సంస్కారముచే పరిపూర్ణ గురువును ఆశ్రయించగలరు. భక్తి ప్రచారయోగ్యము. జ్ఞానము ప్రచారయోగ్యము కాదు, సంస్కార జన్యమని గుర్తించవలెను.

---

**3) అవతారిక** : ఈ బోధ ఎంత వర్కు విచారించిన తరువాత నుండి ప్రారంభింపబడినదో, చెప్పుచున్నారు.

**3వ పద్యం : నను మిమువేగని పుస్తకముమ జేసితి, దీన్ని మీరు ముదమున వినుడం । చనుటయు, మిము నను మీరలు । గనుగొని వినిపించు మనుట । కల, యిట్టి మాటా । బోదను మేల్కగన, లేదెచ్చోట ॥ ఘనులారా యిటువంటి కలలో ముచ్చటలాడి । గొనకొని, మీరు మేల్కొని, మేల్కొల్పుడినన్ను । కల యిట్టి మాటా । బోధను మేల్కగన, లేదెచ్చోటా ।**

**పదవిభాగము** : నను మిము, నేగని, పుస్తకమును జేసితి। దీన్ని మీరు ముదమున వినుడు అంచు అనుటయు । మిము నను మీరలు గనుగొని వినుపించుము

అనుటయు కల । యిట్టి మాట, బోద అను మేల్కాన్ కన, ఎచ్చోటా లేదు । ఘనులారా । ఇటువంటి కలలో ముచ్చటలాడి, మీరు గొనకొని, మేల్కొని, నన్ను మేల్కొల్పుడీ॥

**టీక :** గొనకొని = ప్రయత్నించి, నను = ఆత్మను, మిము = జగత్తును, కని = విచారించి, ముదమున = సంతోషయముతో, బోధ అను మేల్న క్కన = జ్ఞానాతీతమైన పరిపూర్ణమును చూచినచో, ఘనులారా - మహా పుణ్య సంస్కారులారా ! కలలో - ఎరుకలో, ముచ్చటలాడి = విచారణ జేసి.

**భావము :** నను ఆత్మను, మిము - జగత్తును నేను విచారించి శ్రీకృష్ణ ప్రభువుల వారు గురుముఖతః విచారించి తెలుసుకొని, యీ గ్రంథమును వ్రాసితిరి. దీనిని మీరు చక్కగా వినండి అని అనుటయు, మిము - నను = జగత్తు, ఆత్మలను మీరు విచారించుకొనుచు యీ గ్రంథమును వినిపించుమనుటయు (ఇదంతా) ఒక కల. ఇట్టి కల పరిపూర్ణ బోధయనే మేల్కయందు ఎచ్చటను లేదు. ఓ మహానుభావులారా! యిటువంటి కలలోనే (ఎరుకలోనే) మనము యీ యెరుకను విచారించి తెలుసుకొని, యీ ఎరుకనే కల నుండి గట్టి ప్రయత్నము జేసి మేల్కొని, తదుపరి నన్ను మేల్కొల్పుడు.

**విశేష భావము :** ఈ పద్యములో "నను" అనగా నేను అనగా, ఆత్మ (నేను అను శబ్దము ద్వితీయ విభక్తి ప్రత్యయము చేరి "నను" శబ్దము) అని అర్థము. అట్టిచో "మిము" అనగా నాకు ఎదుటిది. నా నుండి బయట వికార రూపము అయినది. జగత్తు అని అర్థము. కనుక "నను మిమునేగని" అనగా ఆత్మ-జగత్తులను విచారించి యీ పుస్తకమును జేసితిని అని ఈ పద్యములో చెప్పిరి.

**వినుమనుట, వినిపంచుమనుట కల :** వినుమని చెప్పుచున్నది, ఎరుకే వినిపించమని అంటోన్నది కూడా ఎరుకే. ఎరుక కల వలె, లేక తోచినది కనుక" వినిపించమనుట కల" అన్నారు.

**కలలో ముచ్చటలాడి :** శబ్దము ఎరుక నుండి ఏర్పడినది. పరిపూర్ణ మందు శబ్దము లేదు. ఎరుక, ఎరుగును, ఎరిగించును. పరిపూర్ణము ఏమియు ఎరిగే లక్షణము లేదు. అందుచే ఎరుకలేనిది పరిపూర్ణము అన్నారు. ఎరుక లేదు కనుక పరిపూర్ణము తెలియబడుటకు వీలు కానిది. కనుకనే ఎరుకలోనే ఎరుక గురించి

విచారించుచున్నాము. కనుక కలలో జరిగే సమస్తము కలయే కనుక, కల అయిన ఎరుకలో జరిగే విచారణ సమస్తము కలయే అని యీ పద్యములో చెప్పిరి.

**యిట్టి మాట బోధను మేల్కగవ లేదెచ్చోటా :** కల - మేల్కయందు లేదు. అట్లే కల అయిన ఎరుక - మేల్కవంటి పరిపూర్ణ బోధ యందు ఎంత మాత్రము లేదు. అనగా ఎరుక పరిపూర్ణమును గనబోయినచో ఎంత మాత్రము ఉండదు. అనగా నేను "అనే కల వంటి ఎరుక, పరిపూర్ణమును చూడబోతే ఏమియు లేకుండా పోవును అని భావము.

5. ఇట్టి మేల్క అను బోధ పొందుటకు (అనగా కల నుండి మేల్కొనుటకు) చాలా గట్టి ప్రయత్నము చేయవలయును. మామూలు కల నుండి మేల్కొనుటకు ప్రయత్నించవలసిన పని లేదు. కాని ఎరుకనే కల నుండి మేల్కొనుటకు చాలా ప్రయత్నించవలయును. అందుకే గొనకొని - ప్రయత్నించి అని ఈ పద్యములో అన్నారు.

6. **"మీరు మేల్కొని నన్ను మేల్కొల్పుడి"** - శిష్యులను మేల్కొల్పుటకై మేల్కపొందిన గురు మూర్తి తిరిగి కలలో విచారణచేయుచున్నారు. అందుచే శిష్యులు మేల్కొనే వరకు గురువు కలలో విచారణ చేయుచుండును. కనుక శిష్యులు మేల్కొనినచో (మీరు మేల్కొని) గురుమూర్తి కల విచారణ చేయవలసిన పని లేదు. అదే గురుమూర్తిని మేల్కొల్పుట.

ఇది అభ్యాస విచారణ. 2) శిష్యుడు ఎరుకలో (అవిద్య)లో ఉండి మేల్క స్వరూపుడైన గురువు ఎరుక (కల) విచారణ చెప్పుచున్నాడు. అంటే అవిద్యా ఆవరణ లేకుండా పోవుటయే, ఎరుకనే కలకు మేల్క. అట్టి అవిద్య ఆవరణ యందున్న ప్రతిబింబిత చైతన్యము గురుమూర్తి. ఆవరణ అనే అవిద్యా ఉపాధి యున్నంత వరకే, అందు ప్రతిబింబ చైతన్యము ఉండి, లేని ఎరుక (అవిద్య) ఉన్నది అగుచున్నది. గురు కరుణచే అవిద్య ఆవరణ నశించిపోవుటయే "మీరు మేల్కొని" అన్న దానికి అర్థము. ఆవరణ ఉపాధిపోతే, అందలి ప్రతి బింబము వెంటనే లేకుండా పోవును. అదే గురుమూర్తిని మేల్కొల్పుట। నన్ను మేల్కొల్పుడీ అన్న దానికి అర్థము. అంటే ఎరుక అవిద్యోపాధితో సహా ఎంత మాత్రము లేదని చెప్పుటయే ఈ పద్య భావము.

**అవతారిక :** ఈ గ్రంథ రచన ఎందుకు చేసిరో, అనగా ఈ గ్రంథ భావము ధృడపడినచో కలిగే ఫలితమెటువంటిదో ఈ క్రింది పద్యము - అనగా 4, 5వ పద్యముల్లో మూడు ఫలితములుగా వివరించుచున్నారు.

**4వ పద్యము : ఒరులొరులు, నేను నేనని । యెరులను తన నెన్నడెరుగకున్న బయలులో । నరుదెంచి, తనను తాగని । పరులను గని లెస్స, నేను పరులని యనుచూ ॥ యెరిగే యెరుకే బయలుండ గనుచు ॥ నిరతము తానెందు నిల్వకుండుటకునై । విరచిస్తి । దీన్నెరుక వినెనా, నిల్వదు ॥ నేను పరులని యనుచూ యెరిగే యెరుకే బయలుండ గనుచూ ॥**

**దండాన్వయము :** ఒరులను తనను యెన్నడెరుగకున్న బయలులో ఒరలు - ఒరులు, నేను-నేనని, పరులని యనుచూ యెరిగే యెరుక, అరుదెంచి । తనను పరులను లెస్స తాగని । బయలుండ గనుచూ । నిరతము తాను ఎందూ నిల్వకుండుటకునై దీన్ని విరచిస్తి । దీన్ని ఎరుక వినెనా - నేను పరులని యనుచూ నిల్వదు ॥

**టీక :** నేను = ఆత్మ, ఒరులు = జగత్తు, ఎన్నడు = ఏ కాలమందున, అరుదెంచి = వచ్చి, గని = విచారించి, ఉండగనుచు = ఉన్నదని విచారించి చూచి, నిరతము = ఎల్లప్పుడు, లెస్స = బాగుగ.

**భావము :** ఇతరమును (జగత్తును) తనను ఏ కాలమందున యెరుగని పరిపూర్ణ పరబ్రహ్మములో, ఇతరమంతా ఇతరమేయని (అనాత్మయేనని, తాను ఆత్మయని యెరిగే యెరుక (తనకు తానుగ) యేర్పడి, తనను, ఇతరమైన జగత్తును బాగుగ విచారించి, పరిపూర్ణ పరబ్రహ్మమే యున్నది (శాశ్వతమైనది) అని విచారించి తెలుసుకొనిన ఎరుక, ఏ కాలమందున తాను ఎక్కడ లేకుండుటకై ఈ గ్రంథమును చక్కగా రచించితిని. ఈ గ్రంథ భావమును ఎరుక వినినచో, నేను ఆత్మనని గాని, నాకు ఇతరమైనదంతయు జగత్తే అని గాని అనుచు నిల్వదు.

**విశేష భావము :** నేను అనగా యెరుక, యెరుక అనగా తెలుసుకొనునది, తెలియబడునది, తెలివి అని అర్థము అనగా జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము అనే త్రిపుటి స్వరూపము. ఇదే యెరుక, ఇదియే జగదాధారము లేక జగదధిష్ఠాత దీనినే శ్రీ శివరామదీక్షితులు వారు "యెరుక" అనిరి.

దీనినే ఆత్మ జీవాత్మ అందురు. దీని నుండి ఏర్పడినదే జగత్తు, ఆత్మ నుండి అయిన జగత్తు కనుక ఆత్మను నేనని, జగత్తును ఒరులు అని ఈ పద్యములో చెప్పబడినది కాని ఆత్మ - జగత్తులు రెండును కారణ - కార్య స్వరూపములు కనకు, రెండునూ ఎరుకయే. దీనికి వ్యతిరిక్తమైనది (ఎరుకలేనిది) పరిపూర్ణము. కనుక పరిపూర్ణము మాత్రమే శాశ్వతమైనది. అది మాత్రమే ఉన్నది, తానులేనిదే ఉన్నట్లు తెలియబడే మిధ్యా స్వరూపము । అని తెలుసుకొనిన ఎరుక ఏ కాలమందున ఎచ్చటనూ లేకుండా పోవునని భావము. ఆ విధముగా తెలుపుట కొరకే ఈ గ్రంథ రచన చేయబడినదని శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు, ఈ పద్యములో తెలియపర్చుచున్నారు. ఈ గ్రంథ రచనకు ఇది ఒక కారణము.

---

**అవతారిక :** పై పద్యములో గ్రంథము ఎందుకు వ్రాసిరో ఒక కారణము చెప్పిరి. ఇంకనూ రెండు కారణములు ఈ పద్యములో చెప్పుచున్నారు.

**5వ పద్యము : ఎరుకను కలలోపల నే । వరుదెంచితి, మీరలట్లే యరుదెంచితిరీ। యెరుక జన నేను మీరలు । యెరుకతొ జను వారమనుచు । యెరిగేటి కొఱకూ ॥ గ్రంథము జేస్తి। నెరిగీయూ వరకూ ॥ గురు బోధంచను మేల్కొ, నరులార చే కొంటే। యెరుకనే కల జోలి నెరిగున్న నిల్వదం ॥ చెరిగేటి కొఱకూ ॥ గ్రంథము జేస్తి నెరిగి యూ వరకూ ॥**

**భావము :** యెరుక అనే కల యందు నేను వచ్చితిని. నావలెనే మీరు కూడ ఎరుకనె కలలోనే వచ్చిరి. కనుక ఎరుక లేక పోయినచో, ఎరుకతో వచ్చిన నేను - మీరు కూడా ఎరుకతోనే లేకపోవుదుము అని మీరు తెలిసికొనుటకై, యీ విషయము ఇది వరకే గురు ముఖతః తెలిసికొని, యీ గ్రంథము వ్రాసితిని, మరియు ఓనరులారా! యీ గురుబోధనే మేల్కొపొందినచో, యెరుకనే కల జోలి యెరిగున్నా, యెరుక లేకపోవును అని తెలియుటకై ఈ గ్రంథము వ్రాసితిని.

**విశేష భావము :** యెరుక అనే కల లోపలనే నేను వచ్చితిని । నానలెనే మీరందరూ యెరుక అనే కల లోపలనే వచ్చిరి. అంటే బ్రహ్మసూత్రము రెండులో "జన్మాద్యస్యయతః " అదే రెండవ బ్రహ్మసూత్ర ప్రకారము యీ సమస్తము దేని వల్ల ఏర్పడుచున్నదో అదే బ్రహ్మ అని చెప్పబడుచున్నది. ఆ జగత్కారణ బ్రహ్మనే యీ బోధలో యెరుక

అని చెప్పబడుచున్నది. ఇట్టి యెరుక కార్య-కారణ స్వరూపము, శాశ్వతమైన పరిపూర్ణ బ్రహ్మములో, యెరుక తనకు తానే లేనిదే తోచబడినది. అనగా "కల" వలె తనకు తానె లేనిదే ఏర్పడినది. కనుక యెరుకను కల అని ఈ పద్యములో చెప్పిరి. ఆ కల వంటి యెరుకలో నేను, మీరు సమస్త సృష్టి జరుగుచున్నది. యెరుక అనే కారణ బ్రహ్మమే కల అనినచో, కలలో తోచబడే సమస్తము కలే. అనగా లేనిదే ఉన్నట్లు తోచబడేదే. కనుక అట్టి ఎరుక అనే కల లోపలనే, నేను మీరు వచ్చితిమి. కనుక, నేను మీరు కూడా కలయే. శాశ్వతమైనది పరిపూర్ణము మాత్రమే. అనగా "నేను" అనే జీవాత్మ ఈశ్వరుడున్ను "మీరు" అనబడే సమస్త పిండ బ్రహ్మాండములు కూడా కారణ స్వరూపమైన ఎరుకయే. అనగా కల వంటిదే అని తెలుసుకొనుటకే ఈ గ్రంథము రచించితిని అని శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు రెండవ కారణముగా చెప్పిరి, మరియు,

**2) నరులారా !** అని సంబోధించిరి. అంటే అజ్ఞానులారా అని అర్థము. తానే బ్రహ్మ అనే అజ్ఞానముతో నున్న వారు కనుక నరులని సంబోధించిరి. అట్టి కల అనే అజ్ఞానము నుండి మేల్కొనుటకు గురుబోధ కావలయును. అందుచే "గురు బోధంచను మేల్క, నురులారా చేకొంటే" అని చెప్పబడినది. అనగా గురుబోధ అనే మేల్క వలన ఎరుక అనే కల లేకపోవును.

**3) "యెరుకనే కల జోలి యెరిగున్న నిల్వదు"** ఇది మూడవ కారణము అనగా గురుబోధ యెరిగిన పిదప, యెరుక కల వంటిదనియు, పరిపూర్ణ పరబ్రహ్మము - కారణ కార్యములు కానిదనియు, శాశ్వతమైనది అనియు తెలియబడును. అట్లు యెరుక లేనిదని ధృడపడిన పిదప, యెరుక పనులు చేయుచున్ననూ, తాను బ్రహ్మననే భావము యెంత మాత్రము ఉండదు. కనుక తాను చేసే కర్మలన్నియు కలలోపల జేసే పనులే అని తెలుసుకొనుటకై యీ గ్రంథము వ్రాసితిని అని మూడవ కారణముగా చెప్పిరి. అంటే ఈ మూడు కారణములే ఫలితములుగా తెలియవలెను.

**4) "యెరిగీ యీ వరకు"** - అనగా యీ బోధ, తన గురుముఖత, గురు కరుణచే సుశిక్షితులై తెలిసి, ఆరూఢుడై యీ గ్రంథమును వ్రాసితిని అని అర్థము. అంటే ఈ గ్రంథ భావము పరంపరానుగతమై శృతియుక్తమైనది అనియు ప్రమాణబద్ధమైనదని భావము.

**అవతారిక** : గ్రంథ రచనకు ముందుగా తన పరంపర గురువులను స్తోత్రము చేయుచున్నారు. ఇది శిష్టాచారము, 6, 7, 8 పద్యములలో పరంపర గురుస్తోత్రము.

**6వ పద్యము : శ్రీ మించు నచల బోధను । యే మహనీయుండు జేసి యెగజల్లినో యీ । భూమిన్ సుజనుల కొఱకా । రాముడు గన్వయజ, । శివరామ దీక్షితులన్ ॥ తలచి యప్పారావ్ గుణతతులన్ ॥ ప్రేమతో బొగడీవే భూమి నిర్జర పరశు । రామ సీతారామస్వామికి మ్రొక్కి ॥ శివ రామ దీక్షితులన్ । తలచి యప్పారావ్ గుణతతులన్॥**

**టీక** : శ్రీ - మించు, శ్రీ = ఐశ్వర్యము, సంపద, బుద్ధి, విషము, మించు = మించిన, అన్వయజ = వంశ మందు పుట్టిన, గుణతతులన్ = సద్గుణ సమూహము కలవారిని, భూమి నిర్జర = భూమి పై దేవతలు అనగా బ్రాహ్మణుడు.

**భావము** : శ్రీ మించిన (బుద్ధికి అతీతమైన, జ్ఞాన సంపదకు అతీతమైన) యీ పరిపూర్ణ బోధ, యీ భూమి పై శ్రీ రామడగు శివ రామ దీక్షితుల వారి వలన (పీఠ స్థాపన చేయబడి) వీరి నుండి శ్రీ కంబాలూరి అప్పబ్రహ్మం గారు, వీరి నుండి బ్రాహ్మణోత్తములైన పరశురామ సీతారామస్వాముల వారి చేతను యీ బోధ వ్యాపింపజేయబడినది. అట్టి స్వగురు, పరమగురు, పరమేష్ఠి గురువులకు నమస్కరించుచున్నాను, అని కృష్ణ దేశికేంద్రులు గురుత్రయమునకు నమస్కరించిరి.

**విశేషార్థము** : "శ్రీ మించు నచల బోధను" గ్రంథారంభమున సర్వవిఘ్న నివారణ కొఱకు, సమస్త సంపత్సిద్ధి కొఱకు, శ్రీ తో గంధారంభముచేయుట సంప్రదాయమైయున్నది. ఈ పరిపూర్ణ బోద శ్రీ అను అక్షరమునకు ఉన్న అర్థముల కన్నింటికి మించిన దైనందున శ్రీ అను అక్షరముతో, ప్రారంభించుచు మించిన అనుపదముచే యీ బోధ యొక్క గొప్ప తనమును చెప్పిరి. అనగా అచల బోధ - సంపదకు అతీతమైనది. ఐశ్వర్యమునకు అతీతమైనది, జ్ఞానమునకు అతీతమైనది, బుద్ధికి అతీతమైనది, విషమునకు అతీతమైనది, (అనగా కేవల అమృతము, నాశనము లేనిది) అని భావము.

ఇట్టి 'శ్రీమించు' అను పద ప్రయోగము కృష్ణ దేశికేంద్రుల వారు ఈ గ్రంథమునకు ఆరంభించిరి. ఇట్టి ప్రయోగము "నభూతో నభవిష్యత్" అని చెప్పవచ్చును.

**7వ పద్యము : శ్రీ మత్సీతారామ । స్వామి కృపన్ జెప్పనయ్యె, సద సద్రహితం । బేమి పదార్థమొ దానిని । యిమ్ముహి కందార్థములుగ, నివి వినరయ్యా ॥ ఓ జనులారా! యిటు గనరయ్యా ॥ వేమారు నేమిమ్ము వేడేదింతియ సుమ్మి । నా మీద కృప జేసి నను జదువుమని మీరలివి వినరయ్యా । ఓ జనులారా, యిటుగనరయ్యా ॥**

**దండాన్వయం :** నా మీద కృపజేసి, నను జదువమని, మీరలు యివి వినరయ్యా (అని) వేమారు నే మిమ్ము వేడీదింతియసుమ్మి ॥

**టీక :** సద సద్రహితంబైన = సత్, అసత్‌లు రహితమైన, అనగా ప్రతిబింబిత చైతన్యము + జగుత్తలు రెండు కలిసి యున్న జగదదిష్ఠానమైన ఎరుక లేనటువంటిది; వేమారు = అనేక పర్యాయములు (వేయి + మారు = వేమారు)

**భావము :** శ్రీ మద్గురు ప్రభువులైన పరశురామ సీతారామస్వామి కరుణ వలన సత్ + అసత్ రూపమైన ఎరుక రహితమైన, పరిపూర్ణ పరబ్రహ్మము గురించి చెప్పుచున్న యీ కందార్థములను, ఓ జనులారా ! మీ దృష్టియిటు మరల్చి వినండి, నా మీద దయయుంచి, నన్ను చదువమని (అనగా యీ బోధ నన్ను చెప్పమని) మీరు చక్కగా వినండి, అని పలుమార్లు నేను మిమ్ములను వేడుకొనుచున్నాను.

**విశేష భావము : 1)** తనయందున్న పరిశుద్ధమైన జ్ఞానమే గురు స్వరూపము. ఈ జ్ఞానము సమస్త బ్రహ్మాది పిపీలికాంతము వ్యాప్తమైయున్నదనియు, దానికి మించినదేదియు లేదని తెలిసి, అజ్ఞానము చేతనే సమస్త వాగ్విలాస సృష్టి జరుగుచున్నదని తెలిసిన జ్ఞానులు, తాను రచించేది ఆపరిశుద్ధమైన జ్ఞాన సత్తాచేతనే కనుక, అదే గురు కరుణ అని, ఆ గురు కరుణ చేతనే యీ గ్రంథము వ్రాయబడుచున్నదని శ్రీ కృష్ణ దేశి కేంద్రుల వారు ఈ పద్యములో చెప్పుచున్నారు.

**2) సదసద్రహితంబైన దేమి పదార్థమొ దానిని :** సత్ అనగా అమృతము, రసము, ప్రతిబింబిత చైతన్యము. అసత్ అనగా అశాశ్వతమైనది జడము, మాయ, ఈసత్ అనే బ్రహ్మప్రతిబింబిత చైతన్యము, అసత్ అయిన మాయ యందు ఏర్పడి, రెండును కలిసి ఉన్న పదార్థమే, సమస్త, సృష్టికి మూల పదార్థము. సత్, అసత్‌లు రెండు ఒక్కమారే కలిసి యేర్పడిన ఏక వస్తువు. రెండు పదార్థములు రెండు భిన్న ధర్మములు

కలిగిన నైనను, ఆ సదసత్పదార్థము, యెన్నడును రెండుగా విడబడియుండవు. బ్రహ్మతత్త్వమును తెలియ గోరు ముముక్షువు, మొట్టమొదటగా యీ సదసత్ బ్రహ్మమును చక్కగా విచారించి తెలుసుకోవలసినదిగా, దానినే బ్రహ్మమని చెప్పిరి. బ్రహ్మ సూత్ర భాష్యములో "యతోవా ఇమాని భూతాని జాయంతే । యేన జాతాని జీవంతి । యత్ప్రయంత్యభిసంవిశన్తి తద్బ్రహ్మ । తద్విజిజ్ఞాసస్వ" అనగా యీ సమస్త బ్రహ్మాండాదులన్నియు దేని నుండి పుట్టుచున్నవో, దేని సత్తాచేత పోషింపబడుచున్నదో, తిరిగి దేనియందు లయమొందుచున్నవో అదే బ్రహ్మ. ఆ బ్రహ్మమునే బాగా విచారంచి తెలుసుకొనుము, అని ఉపనిషత్తులులలో చెప్పబడినది. కాని జగత్కారణమైనది, సదసత్పదార్థము, అయిన మాయా శబళిత బ్రహ్మమే కాని శాశ్వతమైన బ్రహ్మ కాదని, పరిపూర్ణ పరబ్రహ్మములో, మాయా శబళిత బ్రహ్మము లేనే లేదని, ఈ విచారణ చేయమని" ఓ జనులారా యిటు గనరయ్యా" అనుచు యీ పరిపూర్ణ పరబ్రహ్మములో, మాయా శబళిత బ్రహ్మమైన సదసత్పదార్థాము లేదని తెల్పుటకు" సదసద్రహితంబైన దేమి పదార్థమొ దానిని" అనగా పరిపూర్ణ పరబ్రహ్మమును అని భావము.

3) **"ఓ జనులారా! యిటు గనరయ్యా"** - జ - పుట్టి, న-నశించుట, చావు పుట్టుకలతో కూడిన వారలారా! ఇంత వరకు సద సత్పదార్థ బ్రహ్మమునే విచారించిరి. ఇక అది వదలి యీ విచారణ చక్కగా చేయండి, జనన మరణ ప్రవాహము నుండి బయట పడవలెనంటే యీ విచారణ చేయవలసి యున్నది అని చెప్పుటకే "యిటు గనరయ్యా" అని చెప్పబడెను.

4) **"వేమారు వేడెదింతయుసుమ్మీ"** - గురుమూర్తి దయా స్వరూపుడు, సర్వులు తనవలెనే జన్మరహితులు కాగలరనే కోర్కెచే, యీ పరిపూర్ణ పరబ్రహ్మమును, బాగుగ గుర్తించి తరించమని జనులకు హితవాక్యముగా" వేడెదింతియ సుమ్మీ" అన్నారు.

5) **"వను జదువమని, మీర లివివినరయ్య"** - "శాస్త్రోజ్ఞోపి స్వతంత్రేణ బ్రహ్మజ్ఞానాన్వేషణం నకుర్యాత్" - అని శాస్త్ర వాక్యము అనగా బహుశాస్త్ర కోవిదుడైనను బ్రహ్మజ్ఞాన విషయమైన వేదాంత శాస్త్రమును స్వతంత్రముగా అధ్యయనము చేయరాదు. గురుముఖతః మాత్రమే అధ్యయనము చేయవలయునని, శాస్త్రములో చెప్పబడినది. కనుక ఈ గ్రంథమును నను చదువమనియు, మీరు వినండి అని వేడుకొనుచున్నాను.

**8వ పద్యము : శివరామ దీక్షితుల, శిష్య వరుండప్పయమంత్రి, యతని శిషువుడీ। భువి పరశురామ వంశో। ద్భవ సీతారాములతని, భక్తుడ సుమ్మీ ॥ తద్బోధ ప్రయుక్తుడ సుమ్మీ ॥ స్తవనీయులగు మీరుత్సాహముతో యీ గాథ। వినుడీ వే కందార్థములచే వినిపింతు ॥ భక్తుడ సుమ్మీ ॥ తద్బోధ ప్రయుక్తుడ సుమ్మీ ॥**

**టీక :** స్తవనీయులు = పొగడ దగినవారు, ప్రయుక్తుడు = ప్రచారము చేయువాడను;

**భావము :** శ్రీ శివరామ దీక్షితుల వారి శిష్యులు కంబాలూరి అప్పబ్రహ్మమంత్రివర్యులు, వీరి శిష్యులు పరశురామ సీతారామస్వామి, ఇట్టి శ్రీ సీతారామస్వామి వారి శిష్యులు (ఈ గ్రంథ రచయిత అయిన) శ్రీ భాగవత కృష్ణదేశికులు అని గురు పరంపరను చెప్పుచున్నారు. ఈ విధముగా వారి గురువు గారి చెప్పిన బోధను, యీ కందార్థములుగా ప్రకట పరచినట్లుగా చెప్పుచున్నారు. అట్టి బోధను యీ కందార్థ రూపముగా వినిపించుచున్నాను, మీరు ఉత్సాహముతో యీ బోధ వినుడీ, అని గ్రంథకర్త చెప్పుచున్నారు.

**9వ పద్యం : మనసిచ్చి వినుడీ యిక నొక। మనవిది, నా పాలిగురుని మదిలోపల నే। నునుచుకొని పెద్దలాజ్ఞను। పనిబూనుక జేస్తి నిట్టి। పద్యాము లిన్నీ ॥ తప్పొప్పులేర్పడ దిద్దుండన్నీ ॥ ఘనమతి మంతులు గనుకనే ప్రార్థిస్తి। నను మీ కటాక్షేక్షణముల వీక్షింపుచు ॥ పద్యాములిన్నీ। తప్పొప్పులేర్పడదిద్దుండన్నీ ॥**

**దండాన్వయము :** మనసిచ్చి వినుడు, యికన్ ఒక మనవి, ఇది నా పాలి గురుని మదిలోపల నునుచుకొని, పెద్దలాజ్ఞను పనిబూనుక యిట్టి ఇన్నీ పద్యములు చేస్తిని। తప్పులు ఒప్పులేర్పడ అన్నీ దిద్దుడీ। ఘన మతిమంతులు గనకుకనే (మిము) ప్రార్థిస్తి। నను మీ కటాక్ష ఈక్షణముల వీక్షింపుచు ఇన్ని పద్యములు తప్పు। ఒప్పులేర్పడ దిద్దుడీ ॥

**టీక :** మనవి = విన్నపము, పనిబూనుక - పనిగా ప్రయత్నించి (పనిగా భావించి)

కటాక్షేక్షణములు వీక్షింపుచు = దయాదృష్టితో చూచుచు.

**భావము :** అయ్యా! మనసు ఇచ్చట ఉంచి వినండి; అని మనవి చేసుకొనుచున్నాను. నా పాలిట సద్గురుమూర్తిని మనస్సులో ప్రార్థించుకొని, పెద్దల ఆజ్ఞానుసారముగా యీ పరిపూర్ణ బోధను పద్య రూపముగా రచించితిని. మీరు గొప్ప బుద్ధిమంతులు గనుక, నన్ను మీ దయా దృష్టితో జూచి, యీ పద్యములో ఏమైనా తప్పులున్నచో వాటిని ఒప్పులు అగునట్లు దిద్దవలసినదిగా ప్రార్థించుచున్నాను.

**విశేష భావము :** "పెద్దలాజ్ఞను పనిబూనక చేస్తిని" అనగా వీరి (గ్రంథకర్త అయిన శ్రీ భాగవతుల కృష్ణ దేశి కేంద్రుల వారి) గురు దేవుల అన్న గారైన శ్రీ పరశురామ నరసింహదాసు గారు "భద్రాద్రి రామశతకము" అను శతక గ్రంథమును రచించిరి. ఆ గ్రంథములో భక్తి మొదలుకొని జ్ఞాన పర్యంతము సమస్త బోధ చెప్పి, చివరన పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి కొద్దిగా వివరించిరి. వారు తమ శిష్యులయిన (శ్రీ భాగవత కృష్ణ దేశికేంద్రుల వారిని పరిపూర్ణ బోధను, ఎరుక విడచే విధానముల గూర్చి సంశయ రహితమగులాగున విశేషించి వ్రాయమని చెప్పియున్న కారణముగా ఆ పెద్దల ఆజ్ఞానుసారముగా యీ కందార్థ రచన చేసినట్లుగా ఈ పద్యములో చెప్పుచున్నారు.

2) ఇందులో ఏమైనా తప్పులున్నచో గొప్ప బుద్ధిమంతులైన సంప్రదాయకులను మాత్రమే దిద్దవలసినదిగా ప్రార్థించిరి.



**10వ పద్యము : విని మీరివి దిద్దుండని । పని బడి ప్రార్థించనేల, పరుసము నినుమి॥ ట్లనునె స్వర్ణము జైమని । తనకై తానౌను సన్నిధాన మందుంటె॥ తెల్పుడియను మాన మిందుంటే ॥ మనవి జేసునె పాలిమ్మని లేగ తల్లికి ॥ తనకై తానిచ్చును దయచేసిలా, సన్ని । ధాన మందుంటే॥ తెల్పుడియను మాన మిందుంటే ॥**

**టీక :** పరుసము = పరుసవేది, స్వర్ణము జైమని = బంగారముగా చేయమని, సన్నిధాన మందు = దగ్గరగా,

**పదవిభాగము :** పరుసమును ఇనుము స్వర్ణము జైమని ఇట్లు అనునె?

సన్నిధానమందుంటే తనకై తానౌను.

**భావము** : పరుసవేది సన్నిధానములో నున్న ఇనుము, తనను బంగారముగా చేయమని కోరకనే, సన్నిధానములో నున్న కారణముగా ఇనుము బంగారముగా అగుచున్నది. అట్లే లేగ దూడ తల్లి వద్దకు వెళ్లగానే అడగకుండగా దయతో పాలు ఇచ్చుచున్నది. ఆ విధముగా, యీ పద్యములను మీరు విని, యిందులో తప్పులు అనుమానములు ఏమైనా ఉన్నచో, వాటిని సరిదిద్దవలసినదిగా మిమ్ములను ప్రార్థించనవసరము లేదని భావము.

---

**11వ పద్యము : అప్పకవీయాద్యాంధ్రము । లొప్పగు మా ఘాది కావ్యమొగిజదివిక్రృతిన్ । తప్పనె కవులకు సమముగ । తప్పులు లేకుండ జెప్ప తరమౌన కృతిని ॥ ఊహను జేస్తి మరినేనీ కృతినీ ॥ గొప్ప పక్షుల తోటి కొదువ పక్షుల సాటె । కుప్పార వీధిని కుద్యాడేటందుకు ॥ తరమౌన కృతిని ॥ ఊహను జేస్తి మరినేనీ కృతినీ॥**

**పద విభాగము** : అప్పకవీయము ఆది ఆంధ్రములు, ఒప్పగు మాఘాధి కావ్యము ఒగిజదివి । కృతిన్ తప్పు అనె కవులకు తప్పులు లేకుండగ సమముగ కృతిన్ జెప్పతరమౌనా ? మరినేను ఈ కృతిని ఊహను జేస్తి। కుప్పార వీధిని కుద్యాడేటందుకు గొప్ప పక్షుల తోటి కొదువ పక్షులు సాటే ? .......

**టీక** : ఒప్పగు = గొప్పవగు, ఒగి = క్రమమముగ (చక్కగ) కృతిన్ = గ్రంథమును, కుప్పార వీధి = ఆకాశమార్గమున, కుద్యాడేటందుకు = ఎగుర గలందులకు, కొదువ = చిన్న.

**భావము** : గొప్ప గ్రంథములైన అప్పకవీయము మొదలగు తెలుగు లక్షణ కావ్యములను, మాఘము మొదలగు సంస్కృత లక్షణ కావ్యములను చదివి ఎట్టికవితలోనైనా తప్పులెంచగల మహాకవులకు సరిపడులాగున తప్పులు లేకుండగ గ్రంథము వ్రాయ నా తరమా? ఈ గ్రంథము నా గురుమూర్తి । నా ఊహకు తోపించిన విధముగ వ్రాయడమైనది. ఆకాశవీధిని పెద్ద పక్షులతో సమానముగా చిన్న పక్షులు ఎగురలేవుకాదా !

**విశేష భావము** : "అప్పకవీయము మాఘము మొదలగు కావ్యములు చదివిన మహాకావులకు సరిపోయేలాగున తప్పులు లేకుండగ రచించలేను" అని కృష్ణప్రభువు

ఈ పద్యములో చెప్పినంత మాత్రముచే శ్రీ కృష్ణ ప్రభువులు తక్కువ పండితులుగా లెక్కించరాదు. అది వీరి అనహంకారతకు నిదర్శనము "ఉపమా కాళిదాసస్య" అనులోకోక్తి ప్రకారము, కాళిదాసు మహాకవి వారి కవితా రచనలో ప్రతిశ్లోకములలోను ఉపమాన ఉపమేయములు కల్గియుండును. అట్లే శ్రీ కృష్ణదేశి కేంద్రుల వారి కందార్థములలో కూడా ఎక్కువ పద్యములలో ఉపమానములు చెప్పబడెను, సమాసములు, దండాన్వయము, క్రమాలంకారములు కల్గి యుండి, అతి తేలిక పద్యములో గంభీరభావము కల్గియున్నది. ఇట్టి కవిత్వ విషయములో వీరికి వీరే సాటి అనుట అతిశయోక్తి కానేరదు.

---

**12వ పద్యము : ఛందం బెరుగక పద్యము । లెందుకు జేసితివటంచు యెందరనిన, నే। సందేహించక జేసితి । నిందుల తప్పుంటె మీర, లివి దిద్దేరనుచూ ॥ నే జదివితె చెవి యొగ్గి వినుచు ॥ అందముగ చిత్తమందిట్లు తలపోసి । కందార్థముల మీ ముందర బెట్టితి ॥ యివి దిద్దేరనుచూ । నే జదివితె చెవి యొగ్గి వినుచు ॥**

**టీక :** ఛందంబు = ఛందశ్శాస్త్రము (అనగా పద్య రచనలోని గణములు, యతి, ప్రాశ నియమములను తెల్పు శాస్త్రము)

**భావము :** ఛందస్సు వగైరా పద్య నియమము తెలియకుండగ, పద్య రనచన ఎందుకు చేసితివి? అని యెంద రడిగెదరో అనే సందేహము లేకుండగ, యీ గ్రంథ రచన ఎందుకు చేసితిని అనగా, యీ పద్యములు మీరు విని, ఇందు తప్పు ఉంటే మీరు దిద్దెదరు కదాయని, నా మనసు నందు భావించి యీ కందార్థములను వ్రాసి మీ ముందర పెట్టితిని. యిందు తప్పులుంటె మీరు దిద్దెదరు గాక.

---

**13వ పద్యము : పునరుక్తి కల్గియుండిన । విని కోపము శాయ వలదు, వేడుకొనియెదన్ । వినువారు దూరపర్థము । గన వలె దగ్గరనటంచు, కల్పించి నామా ॥ తెలియక కాదీ గ్రంథములోనూ ॥ జననీ జనకులు తమ తనయుల పునరుక్తి । వినగోరుదురు తప్పించనక నేనది తెలిసి ॥ కల్పించినామా । తెలియక కాదీ గ్రంథములోనూ॥**

**టీక :** పునరుక్తి = పునః + ఉక్తి = చెప్పిన భావమునే తిరిగి తిరిగి చెప్పుటను పునరుక్తి అందురు. ఇది గ్రంథ రచనలో దోషముగా చెప్పబడును.

**భావము :** ఈ గ్రంథములో పునరుక్తి దోషము కలదు. అది విని మీరు కోపింపవద్దు. పునరుక్తి దోషము తెలియక చేసినది కాదు, తెలిసియే కల్పించినాను. ఎందుచేతననగా ఈ పద్యములో దూరపర్థము (గంభీర భావము లేక రహస్య భావము) అతి తేలికగా తెలసుకొనేందుకై ఒకసారి చెప్పిన భావము మరొక పద్యములో చెప్పుచు వ్రాసినాను. తల్లిదండ్రులు తమ చిన్న పిల్లలతో వచ్చీ రాని మాటలను ముద్దుగా తిరిగి తిరిగి ప్రశ్నించుచూ ఆనందించెదరు కదా ! కోపగించుకొనరు. అట్లే నా పునరుక్తి విషయమై పెద్దలైన మీరు కోపగించుకొనక, విని అందలి భావమును గ్రహించవలయును.

**విశేష భావము :** గ్రంథములో పునరుక్తి దోషము కలదనియు, తెలిసియే అట్లు కల్పించినాని యీ పద్యములో గ్రంథకర్త చెప్పుచున్నారు. పారమార్థిక బ్రహ్మతత్త్వము అతి సూక్ష్మమైనది, బుద్ధికి అతీతమైనది. అందుచే ఒక మారు చెప్పిన భావమునే మరొకటి రెండు పద్యములలో కూడా చెప్పియుండిరి. భావ గర్భిత విషయమును చక్కగా గ్రహించే నిమిత్తమై పునరుక్తి చేయబడినది అని గ్రహించవలెను.

**2) "వినువారు దూరపర్థము కనవలె దగ్గరవటంచు" :** దూర భావము తేలికగా తెలియగలందులకు అని ఒక భావము. దూరపు + అర్థము దూరముగా నున్న వస్తువు. సామాన్యముగా తెలియబడనంతటి దూరములో నున్న బ్రహ్మతత్త్వము. పోతనామాత్యుల వారు భాగవతములో "అల వైకుంఠపురంబులో నగరిలో నా మూల సౌధంబు దాపల" అని దైవము ఎక్కడోనున్నట్లుగా చెప్పబడినది. కాని సర్వవ్యాప్తమై ఎదుటనే యున్నదనియు। గురు కరుణచే అతి తేలికగా కననగును అనియు తెలియజెప్పుటకై "దూరపర్థము కనవలె దగ్గర" అని చెప్పియున్నారు.

---

**14వ పద్యము : ఇది ఆంధ్ర కవిత్వంబని । మదిరోయం దగదు, దీని మర్మమరయుడీ। పదియారు వన్నె పసిడిని । ముదమున తోల్పెట్టిమంచ, ముట్టా కుండుదురా॥ లోకుల చాత బట్టకుండుదురా॥ ఇది గాక కులహీను డిచ్చిన ద్రవ్యము । విదితముగ యెంత వేత్తలైనను దాన్ని । ముట్టకుండుదుర । లోకుల చాత బట్టకుండుదురా॥**

**టీక :** రోయందగదు = అసహ్యపడదగదు, మర్మము = రహస్యము (భావ రహస్యము) పసిడి = బంగారము, విదితముగ = అంగీకరించబడినది, తెలియబడినది.

**భావము :** ఇది ఆంధ్ర కవిత్వమె కదాయని, యీ గ్రంధస్థ విషయము గురించి తక్కువగా భావించవద్దు. యిందులోని రహస్య భావమును చక్కగా అర్థము చేసికొనుడు. పదహారు వన్నె బంగారమును, తోలు పెట్టిలో నుంచినంత మాత్రమున, ఆ బంగారము యొక్క విలువ తగ్గదు కదా. మరియు కులహీనుడిచ్చిన ధనము యెంతటి ఆచార పండితులైనను చేతులతో ముట్టకుండుందురా? అట్లే గొప్పదైన బ్రహ్మతత్త్వ విషయము తెలుగు కవిత్వములో చెప్పినంత మాత్రమున గ్రంథమునకు లోపము రాదు అని భావము.

**విశేష భావము :** తెలుగు భాష పురాతనమైనది కాదు. నన్నయాదుల నుండియే తెలుగు గ్రంథములు, రచన ప్రారంభింపబడినది. పురాతన గ్రంధములైన శాస్త్రములు, పురాణములు, సమస్త ఆర్ష సాహిత్యము సంస్కృత భాషలోనే వ్రాయబడినది. అందుచే వేద, వేదాంత శాస్త్రములలోని బ్రహ్మజ్ఞాన విషయము తెనుగుభాషలో చెప్పినది, ఇది ఋషిప్రోక్తము కాదు, తెనుగులో చెప్పబడినది ఇది. అధునాతనమైనదే కాని సనాతనమైన శాస్త్రము కాదు అని విడిచిపెట్టవద్దనియు, సనాతనమైన వేదాంత శాస్త్రమును ముముక్షువుల కందరికి సులువుగా గ్రహించగల్గేందుకే తెలుగులో రచించితిననియు, భాష వేరైనది కాని భావము ఒక్కటే అనియు, కనుక యీ గ్రంథమును కించపరచవద్దని శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు పండితలోకమునకు ఈ పద్యములో చెప్పినారు.

---

**15వ పద్యము - అవతారిక :** యీ పద్యములలోని తప్పులు ఉన్నచో ఎట్టి వారు దిద్దవలెనో 15,16,17 పద్యమములలో చెప్పుచున్నారు.

**15వ పద్యము : ఆసాంతము యీ గ్రంథము । ప్రాస, యతుల్, శబ్ద, గణము, భావము, యుక్తుల్ । జూచి సరిపడని చోటను । యీ సభలో పెద్ద లెల్ల, యిది దిద్దవలెను ॥ దిద్ది యిదే నా మది కద్దవలెను ॥ మీ సాటి వారికి వ్యాసాట లేదుంటే । నా సాటి వారి బ్రత్కే, సాటి గాకుండా ॥ నిది దిద్దవలెను । దిద్దియిదే నా మది కద్దవలెనూ ॥**

**టీక :** ఆసాంతము = అ లగాయతు, సా వరకు, అనగా మొదటి నుండి చివర వరకు అని భావము, వ్యాసట = ఎక్కువ అనే బాధ.

**భావము :** యీ సభలో పెద్దలైన వారు (శృతి, శాస్త్ర యుక్తి, బ్రహ్మ జ్ఞాన గరిష్టత కల్గి అనహంకారులైన వారు) యీ గ్రంథమును ఆసాంతము పరికించి, యతి, ప్రాస, యుక్తి, గణ, శబ్ద, భావము సరిపడని చోట్ల, నా మనో భావమునకు సరిపడునట్లుగా దిద్దవలెను. మీ వంటి పెద్దలకు, ఇది అధిక ప్రయాసగా భావించరాదు. మీ వంటి పెద్దలకే ప్రయాస అయితే, మా వంటి వారి బ్రతుకు ఎట్లు? కనుక ప్రయాస అని భావించక నా మనో భావమునకు సరిపడునట్లుగా (విరోధము గాకుండునట్లుగా దిద్దమని కోరుచున్నాను.) పరిపూర్ణ బోధ సిద్ధాంతమునకు విరోధము కాకుండగ దిద్దవలెనని ఆంక్ష.



**16వ పద్యము : తప్పొప్పులు రెంట్నెరుగని । తప్పు తవందుండి, దీన్ని తప్పని కూసే । తప్పుడు నరువకు జెప్పద । చప్పుడు చాలించమనుచు, సభ వారు వినగా ॥ సరె సరెనని సభ వారిట్లనగా ॥ చెప్పిన వినకుంటే తప్పు వానిదె సుమ్మి । తప్పు గలిగిన వెనుక గొప్ప వాడెట్లౌను ॥ సభ వారు వినగా సరె సరెనని సభవారిట్లనగా ॥**

**టీక :** తప్పు = నేను, ఒప్పు = పరిపూర్ణ పరబ్రహ్మము, (ఇధి గ్రాంథిక అర్థము కాదు, ఆధ్యాత్మిక విషయమైన యుక్తి భావము) చప్పుడు = శబ్దము (మాట్లాడుట)

**భావము :** తప్పు - ఒప్పు అనే రెంటి విషయము తెలియకపోవుట అనే తప్పు గలవాడు, యీ గ్రంథమును జూచి, తప్పుడు గ్రంథమ్మని కూసే నరునకు, నీ తప్పుడు మాటలు కట్టిపెట్టమని సభలోని వారు ఆమోదించులాగున సమాధానము చెప్పెదను. అట్లు చెప్పినను వినిపించుకొనక మూర్ఖుని వలె ఇది తప్పే అని అన్నచో, అట్టి తప్పు వానిదే కాని నాది కాదు. తప్పు కలిగిన వాడు గొప్పవాడు కాలేడు కదా! కనుక తప్పుడు నరుని విమర్శలను మనము లెక్కచేయ పనిలేదు అని భావము.

**విశేష భావము :** తప్పు అనగా యెరుక, ఒప్పు అనగా పరిపూర్ణము. ఎందుచేతననగా, జనన మరణములతో కూడి యుండుట తప్పు. జనన మరణముల నుండి తప్పించుకొనుట "ఒప్పు" జనన మరణములతో కూడి యుండునది "ఎరుక" కనుక యెరుకను "తప్పు" అని సూచించినారు. జనన మరణములు లేనిది పరిపూర్ణము కనుక పరిపూర్ణమును "ఒప్పు' అను పదముతో సూచించిరి.

మానవ జన్మకు వచ్చినందులకు, ఎరుక పరిపూర్ణములను తెలుసుకొని, జన్మరహిత స్థితికి పాటు పడుట మానవ ధర్మము. కనుక ఎరుక పరిపూర్ణముల నెరుగని మనుజుడు తప్పుడు నరుడు. ఎరుక రెండు రూపములు. సంస్కారముచే జ్ఞానియై గురుముఖతా పరిపూర్ణ పరబ్రహ్మము నెరిగేవాడు "ఎరుక" యే. జ్ఞాన సంబంధము యెంత మాత్రము లేక, కేవల లౌకిక ధర్మములతో నుండువాడు అజ్ఞాని. వీడును ఎరుకయే. ఇట్టి ఎరుక తప్పు, తిరిగి పునర్జన్మను పొందించేది, ఇట్టి వాడు ఎరుక పరిపూర్ణములను ఎంత మాత్రము యెరుగని "తప్పు" తనందున్నవాడు అని ఈ పద్యములో పేర్కొనబడినది. ఇట్టి వాడు ఈ గ్రంథము యొక్క సూక్ష్మ జ్ఞానమును ఎరుగక అహంకారయుతుడై ఈ గ్రంథమును తప్పుడు గ్రంధము అని అన్నచో, ఎరుక పరిపూర్ణములును ఎరుగని తప్పుడు నరునకి ఈ గ్రంథమును విమర్శించే హక్కు లేదని సభలోని పెద్దలు అంగీకరించులాగున, ఆ తప్పుడు నరుని చప్పుడు చేయవద్దని అనగా మాట్లాడే హక్కు లేదని కృష్ణ ప్రభువులు ఈ పద్యములో చెప్పినారు. అయినా మూర్ఖుడు కనుక తన తప్పు తెలియకుండగ, ఇది తప్పుడు గ్రంథమేనని దీని భావము తెలియని కుసంస్కారి అన్నచో, వాడు తప్పుడు మనిషి కనుక, వాని మాటలను మనము లెక్కచేయవద్దని, అట్టి వారితో వాదించతగదని గ్రంథకర్త భావముగా గ్రహించవలెను. గొప్ప వారి యొక్క అనగా బ్రహ్మజ్ఞులైన పండితులైన వారి విమర్శ గ్రహణీయము కాని, మూర్ఖుల విమర్శ గ్రహణీయము కాదు. పండితులనగా "పండితాః సమదర్శనః" - సర్వత్ర ఉన్నట్లు కనిపించుచున్నది లేని యెరుకయే, అభాస రూపమే. ఇందు ఒకటి ఎక్కువ, తక్కువ అనేది లేదు అని శాశ్వతమైనది పరిపూర్ణమే అని గురుముఖతా గ్రహించిన వారు మాత్రమే సమ దర్శకులు పండితుడు అని అర్థము.

**17) అవతారిక :** దుర్జనులు లేని తప్పులు వెదకి ఎత్తి చూపుటయు, సజ్జనులు తప్పులున్నచో సరి చేయుటయు, వారి ధర్మమని ఉదాహరణగా యీ పద్యములో చెప్పిరి.

**17వ పద్యము: ఇలుజొచ్చి గ్రామ సింహము । కల దొంతుల గూల్చు, నింట గరితలొరుగు దొంతులు జక్కజేతురట్లవె । యిల మ కవి జనోక్తి తప్పు, లెంచూ దుర్జనుడూ ॥ తప్పొప్పు గావించు సజ్జనుడూ ॥ తుల లేని బుద్ధిమంతులు సర్వజ్ఞులు మీరు । తెలుసు, వా తలపు నే తెలిపే దేమిక, తప్పు ॥ లెంచు దుర్జనుడూ । తప్పొప్పు గావించు సజ్జనుడూ ॥**

**టీక :** గ్రామసింహము = కుక్క, కల దొంతులు = "ఇంట కల దొంతులు" అని సమన్వయము. ఇంట్లో నున్న కుండ దొంతరలు, కూల్చును = పడవేయును, ఇంట గరితలు =ఇంట్లో ఉన్న ఆడువారు (గరిత = పతివ్రత, ఇల్లాలు నిఘంటు అర్థము) ఒరుగు దొంతులు = పడిపోయిన కుండ దొంతరలను, తప్పొప్పు గావించు = తప్పు, ఒప్పుగా మార్చును, తులలేని = సాటిలేని.

**దండాన్వయము :** 1) గ్రామ సింహము ఇలుజొచ్చి ఇంట కలదొంతులను కూల్చును. గరితలు ఒరుగు దొంతులు చక్కగ జేతురు ॥ 2) మీరు తులలేని బుద్ధిమంతులు సర్వజ్ఞులు నాతలపు తెలుసు, నే దెలిపే దేమిక ॥

**భావము :** కుక్కలు (పిలువనిదే) ఇంటిలో దూరి ఇంట్లో ఉన్న పాత్ర దొంతరలను కూల్చును. అట్లే దుర్జనులైన వారు యిట్టి గ్రంథములలో లేని తప్పులను వెదకి చూపి, ఇది తప్పుడు గ్రంథము అని చూపుదురు. ఇంట్లోని యిల్లాలు పడిపోయిన దొంతరలను చక్కజేసికొనునట్లుగా, సజ్జనులైన వారు ఇందులో తప్పులున్నచో వాటిని సరిజేయుదురు. సాటిలేని బుద్ధిమంతులు, పరిపూర్ణ భావజ్ఞులైన పెద్దలు మీరు. (లేని యెరుకను, ఉన్న పరిపూర్ణమును చక్కగా గుర్తించినవారే సర్వజ్ఞులు) అట్టి వారు మాత్రమే ఈ గ్రంథము పరిశోధించి తప్పులున్నచో దిద్దమని భావము.

**18వ పద్యము : తన గొప్ప నెంచరేమో । జనులని, తలపోసి సాధు జనకృత కవితల్ విన డితరులు వినగోరిన । విన కన రాదనుచు మనసు, విరచు దుర్జనుడూ ॥ విని వినిపించు వేడ్క, సజ్జనుడూ ॥ కన వొచ్చే ముంజేతి కంకాణాలకు వేరే ॥ ఘన నిల్చుటద్దము గావలెనా, మనసు ॥ విరచూ దుర్జనుడూ ॥ విని, వించువేడ్క సజ్జనుడూ॥**

**టీక :** కంకణాలు = చేతికి కట్టుకొను తోరణములు.

**భావము :** సాధుజనులైన వారు చెప్పెడు యీలాంటి గ్రంథస్థ విషయమును, దుష్ట జనులైన వారు వినరు. మరియు తమ గొప్ప తగ్గిపోవునేమో నని ఇతరులను వినకనరాదనుచు, మనసు విరిచివేయుదురు. సజ్జనులైతే తాము విని సంతోషించి, ఇతరులను కూడా వినమని ప్రోత్సహించెదరు. ఎదురుగా కనిపించే ముంజేతి కంకణమునకు అద్దమెందుకు? అన్నట్లుగా యీ గ్రంథము మంచిదో చెడ్డదో ముందు ముందు మీరే చూస్తారు కదా? అని ఒక భావము. లేక సజ్జనులు దుర్జనుల యొక్క విమర్శలు ఎలాగుండునో ముందు ముందు మీరే చూస్తారు కదా ? అని ఒక భావము.

**19వ పద్యము : ఆగామీకథయెట్లన । బాగుగ వివరింతు చెవుల పండువ గాగన్ । ఆగమ నిగమో పనిష । త్సాగర, మధితార్థమవల, సాంగో పాంగము గన్ ॥ దయతో వినుడీ సాంగోపాంగముగన్ ॥ ప్రాగర్థ చరమార్థ యోగములకు సం। యోగము గావించి నే గుర్తెరిగిన దంత ॥ సాంగో పాంగము గన్ । దయతో వినుడీ సాంగో పాంగముగన్ ॥**

**టీక :** ఆగామీ కథ = ముందు కథ అనగా ముందున్నది పరిపూర్ణము, పరిపూర్ణము గురించి చెప్పబోవునది ఏమనగా అని అర్థము. యోగము = జ్ఞానము. పండువు = పండుగ యొక్క రూపాంతరము; ఆగమ = శాస్త్రములు, నిగమ = వేదములు, మధిత = మధించగా (తెలియబడిన) అర్థము = వస్తువు. అనగా బ్రహ్మ. సాంగో పాంగముగన్ = అంగ ఉపాంగములతో సహా అనగా పూర్తిగా, ప్రాగర్థ = ముందున్న వస్తువు (పరిపూర్ణము), చరమార్థ = వెనుక నున్న వస్తువు = కర్మము, అనగా ఎరుక. (ఎరుక - కర్మ జ్ఞాన స్వరూపము కనుక) వస్తువు అనగా " వసతి ఇతి వస్తుః అనగా ఉన్నది, అనగా బ్రహ్మము. పరిపూర్ణము శాశ్వత బ్రహ్మము, ఎరుక లేని బ్రహ్మము.

**భావము :** ముందు జెప్పబోవు విషయమేమనగా - ఆగమములు, నిగమములు ఉపనిషత్తులు అను గొప్ప మహా సముద్రమును తరచగా తేలిన సారమునకు ఆవలి వస్తువును గూర్చి మీకు శ్రవణానందముగా విశదీకరించెదను. దయచేసి ఆసాంతము వినండి, వెనుక వస్తువునకు, ముందు వస్తువునకు, జంట చేసికొనుచు, గురుముఖతా తెలుసుకొన్న సమస్తము ఆసాంతము మీకు తెలియపర్చెదను. మీరును ఆసాంతము శ్రవణానందముగా వినండి.

**విశేష భావము :** వేదములు, శాస్త్రములు, ఉపనిషత్తులనే । మహా సముద్రమును మధించగా తేలిన సారము - ఈ సమస్త సృష్టికి మూలమైనది అవ్యక్తము అని చెప్పబడే బ్రహ్మమనియు, అదియే కారణ కార్యములుగా ఉన్నదనియు, అది స్వయంభు అనియు తేలినది. ఇది సగుణ - నిర్గుణ, ద్వంద్వ రూపము, సమస్త ప్రకృతికి మూలమైనది కనుక మూల ప్రకృతి. ఇది రస, బల స్వరూపము. జ్ఞాన - కర్మ స్వరూపము, భుక్తి - ముక్తి హేతువు. దీనికి ఆవల ఉన్నది పరిపూర్ణ పరబ్రహ్మము. ఇట్టి పరిపూర్ణమును గూర్చి విశదీకరించి, లేని ఎరుకను లేకుండ జేయుటయే గ్రంథ కర్త యొక్క ముఖ్యోద్దేశ్యము. ప్రాగర్థము = ముందువస్తువు. అనగా పరిపూర్ణము. చరమార్థము = వెనుక వస్తువు కర్మ స్వరూపము అనగా జగత్కారణ బ్రహ్మమైన

యెరుక. ఈ విధముగా పరిపూర్ణ నిరూపణ, ఎరుక నిరసనలతో ప్రతి పద్యములోను చెప్పుచున్నానని - ప్రాగర్థ చరమార్థ యోగములకు సంయోగము గావించి అని చెప్పినారు.

**20వ పద్యము : మోదమున ప్రొద్దుపోకకు । వాది ప్రతివాదుల..చు, వర గురుషుశిష్యుల్ । వాదించి రమచు వొకపం । వాదము గల్పిస్తి కలగ, వదలక వినుడీ। మొదటి మంచి తుద వెళ్ళ గనుడీ ॥ వేదాంతార్థాతీత వేత్తలు । మీరిందు । యేదేది సవరించుడిదె నా విజ్ఞాపన ॥ వదలకు వినుడీ । మొదటి మంచి తుదవెళ్లగనుడీ॥**

**టీక** : మోదమున = సంతోషముతో, ప్రొద్దు పోకకు = కాలక్షేపము నిమిత్తము, వర = శ్రేష్టమైన, సంవాదము = చర్చ, కలగ = కల వలె, విజ్ఞాపన = విన్నపము, వేదాంత + అర్థ + అతీత + వేత్తలు = అఖండ గురు స్వరూపమునకు లేక మూల ప్రకృతికి (జగత్కారణ బ్రహ్మమునకు) అతీతమైన పరిపూర్ణ బ్రహ్మమును గురుముఖతా గుర్తెరిగిన పండితులు.

**భావము** : సరదాగా కాలక్షేపము నిమిత్తమై, గురు శిష్యులే వాది, ప్రతివాది రూపులై వాదించుకొనినట్లుగ, ఒక సంవాద రూపముగ కలవలె కల్పించినాను. దీనిని మొదట నుంచి చివర వరకు విని విచారించండి. వేదాంత అర్థము (జగత్కారణ బ్రహ్మము)నకు అతీతమైన పరిపూర్ణ బ్రహ్మమును, గురుముఖత గుర్తించిన మీరు, యిందు ఏది సవరించవలెనో అది సవరించవలసినదిగా విజ్ఞాపన.

**విశేష భావము** : శ్రీకృష్ణ దేశికేంద్రులే గురు-శిష్య రూపముగా, వాది - ప్రతివాదులై, అనగా పూర్వపక్షి, సిద్ధాంతి రూపముగా ఏర్పడి, వాదించుకొనుచు వ్రాసినట్లుగా చెప్పిరి. ఇదంతయు కలవలె గ్రహించమన్నారు. చెప్పినది, విన్నది - "నేనే". నేను కలవంటిది కనుక నే చెప్పినది, నీవు విన్నది ఈ రెండును కలలో జరిగినట్లుగా భావించవలెను. పరిపూర్ణమందు ఏ శబ్దము లేదు. కనుక ఇదంతా కల అని భావించవలెను. ఇట్టి కలలో ముచ్చటించుకొని, పరిపూర్ణ బ్రహ్మమనే మేల్కొ పొందవలెను.

**2) వేదాంతార్థాతీత వేత్తలు :** వేదాంత అర్థ, అతీత వేత్తలు, వేదాంత అర్థము అనగా, సమస్త సృష్టికి మూల కారణము అయిన జగత్కారణ బ్రహ్మము. వేదాంతమనగా బ్రహ్మము. వేదాంతమనగా - జ్ఞానము, సృష్టి మూలమును గురించి చెప్పిన జ్ఞానము. ఇది విషయము, ఈ విషయమునకు విషయి అయినది జగత్కారణ బ్రహ్మము. అనగా వేదాంత అర్థము అనగా విషయము విషయిలతో (కారణ-కార్యరూపమయినది) కూడినది. ఇట్టి ద్వంద్వమునకు అతీతమైనది పరిపూర్ణము. ఇదే వేదాంతార్థ అతీతము. ఇట్టి పరిపూర్ణ బ్రహ్మమును గూర్చి చక్కగా గురుముఖముగా గ్రహించిన వారే వేత్తలు. ఇట్టి వేత్తలు మాత్రమే ఈ గ్రంథములో ఏదేది సవరించవలెనో వాటిని సరిదిద్దమని శ్రీ కృష్ణ దేశికేంద్రులు చెప్పుచున్నారు.



**21వ పద్యము : కొంచెములో సరిపుచ్చక । పెంచవవీ గ్రంథమనుచు, పెద్దలలుగకన్। మించిన వేడ్కతో వినుడీ । పెంచిన యర్థంబు దెల్పెద లోకులెల్లా ॥ అర్థము దెలసి మది నుల్లసిల్లా ॥ పెంచితి పెంచితి గొంచెము వెడలుపు । వుంచుండెనది లో తెంచించి, నా మదిని ॥ దెల్పెద లోకులెల్ల ॥ అర్థము దెలసి మది నుల్లసిల్లా ॥**

**దండాన్వయం :** కొంచెములో సరిపుచ్చక, ఈ గ్రంథము పెంచినవు, అనుచు పెద్దలు అలుగకన్, మించిన వేడ్కతో వినుడీ । పెంచిన అర్థంబునే దెల్పెద । ఎల్లా లోకులు అర్థము తెలిసి మదినుల్లసిల్లా పెంచితి ॥ కొంచెము వెడలుపు ఉంచుండే నది లోతంచు ఎంచీ పెంచితి ॥ ఎల్లా లోకులు అర్థము దెలసి మది నుల్లసిల్లా నామదిని దెల్పెద ॥

**టీక :** అలుగక = కోపింపక, వేడ్కతో = సంతోషముతో

**భావము :** గ్రంథమును కొద్దిలో సరిపుచ్చక, ఎందుకింతగా పెంచితివని పెద్దలైనవారు కోపించవద్దు. కారణము దెల్పెదను, ఆనందముగ వినుడు. లోకులకు ఈ పరిపూర్ణ బ్రహ్మ జ్ఞానము విశదీకరించి చెప్పినచో ధృడముగా తెలుసుకొనగలగుదురని ఈ గ్రంథమును విస్తారముగా పెంచితిని. వెడల్పు ఎక్కువగా వుండే నది లోతు తక్కువగును, తక్కువ వెడల్పుగా ఉండే నది లోతు ఎక్కువగా ఉండునని తెలసి, గ్రంథము చక్కగా తేలికగా తెలియబడుటకై ఎక్కువగా పెంచితిని.

**విశేష భావము :** "గుహ్యా ద్గుహ్యాతమం సారం" - బ్రహ్మము రహస్యాతి రహస్యము ఎవరికి చెప్పకూడనిది అని కాదు, ఎంతో నిగూఢము. సూక్ష్మాతి సూక్ష్మ బుద్ధికి గాని తెలియబడనిది అని అర్థము. అందుచే గ్రంధకర్త అట్టి పరిపూర్ణ పరబ్రహ్మమును విశదీకరించి చెప్పుటకున్ను, విషయము అందరు చక్కగా గుర్తించగలందులకున్ను విషయమును ఎక్కువగా విశదీకరించిరి. అందుచే దేశికుల మనోభావము అనగా, పరిపూర్ణ బ్రహ్మ జ్ఞానము, అందరికి తేలికగా పొరపాటు పడకుండులాగును ఈ గ్రంథమును విశదీకరించిరి.



## 1వ అధ్యాయము

# సంక్షిప్త భావము

శక్తి ద్వయ నిరాసకంబైర - అనగా జ్ఞాన శక్తి, క్రియాశక్తి అనే యీ రెండు శక్తులు లేని, లేక ఆవరణ శక్తి, విక్షేపశక్తి యీ రెండు శక్తులు లేని అనగా జ్ఞాన - కర్మ స్వరూపుమయిన ఎరుక (మాయ) ఎంత మాత్రము లేని, పరిపూర్ణ పరబ్రహ్మమును నిరూపణ చేయుచు, ఎరుక నిరసన జేయుటయే ఈ గ్రంథము యొక్క ముఖ్యోద్దేశము. ఇది పునర్జన్మ దుఃఖమును తప్పించుకొనవలెననే తీవ్ర ముముక్షువులకు మాత్రమే చెప్పబడుచున్నది. ఈ గ్రంథమును ఆసాంతముగా గురుముఖముగా వినవలయునని, విన్న వస్తువును చూడవలయునను కోర్కె గల ముముక్షువులు మాత్రమే దీనికి అర్హులని చెప్పుచున్నారు. ఇందులో గణ, ప్రాశ, యతి, భావము, యుక్తి మొదలగు లోపములున్నచో, గ్రంథకర్త మనో భావమునకు వ్యతిరిక్తము కాకుండగ ఈ పరిపూర్ణ బోధ పెద్దలైన వారు మాత్రమే దిద్దగలరని సూచించినారు. అర్ష గ్రంథములన్నియు సంస్కృత భాష యందుండి, అందు నిర్గుణ పరబ్రహ్మము, జగత్కారణ బ్రహ్మము రెంటికిని ఆత్మ, బ్రహ్మ అనే ఒక నామము చేతనే వ్యవహరించడమయినది. అందుచే నిస్సంశయముగా బ్రహ్మతత్త్వనిరూపణ తెలియబడుట లేదు. మరియు సంస్కృత పండితులకు మాత్రమే ఉపయోగపడుచున్నవి. సర్వులకు శాస్త్రములు అందుబాటులో లేవు. అందుచే సర్వులు బ్రహ్మ జ్ఞానమును తెలుసుకొని తరించే నిమిత్తమై సంస్కృత భాషలో చెప్పిన తత్త్వజ్ఞానమునే తెలుగులో శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు తెలుగు కందార్థ పద్యరీతిగా ఈ గ్రంథమును వ్రాసిరి. తెనుగు సాహిత్యము సనాతనమైనది కాదు. అర్ష సాహిత్య మంతయు సంస్కృత భాష యందుండుటచే ఈ గ్రంథముతెనుగు రచన. కనుక యిందు చెప్పబడిన బ్రహ్మ తత్త్వ జ్ఞానము సనాతనము కాదని భావించరాదు. భాష మారిననూ వస్తుజ్ఞానము సనాతనమైనదేనని చెప్పిరి. మరియు మాయ బ్రహ్మమును, నిర్గుణ పరబ్రహ్మమును ఒకే నామము కాకుండగ, ఆ రెంటికి బేధము తెలియుటకై "మాయ బ్రహ్మమును - "ఎరుక" అనియు నిర్గుణ బ్రహ్మమునకు పరిపూర్ణము లేక ఉత్తబట్ట బయలనియు నామములు పెట్టి, ఆ రెంటికి గల సారూప్య భేదములను తెలియపర్చుచూ, శాశ్వతమైనది పరిపూర్ణమనియు, లేనిది ఎరుకని నిరూపణ నిరసనలు జేసిరి. ఇట్టి పరిపూర్ణ పరబ్రహ్మమును గురుముఖతా గుర్తించిన నేను, కలమేల్కను చూచిలేకపోయినట్లుగా ఎరుక లేకపోవునని చెప్పిరి.

ఇది శ్రీ మద్భాగవత కృష్ణ దేశికేంద్ర విరచిత
ద్వైతా ఽ ద్వైత రహిత పరమ తత్త్వే
సభా విజ్ఞాపనం నామ ప్రథమోధ్యాయమునకు
భావ, విశేష భావ, టీక, దండాన్వయములు సమాప్తము

2వ అధ్యాయము

# గురు శిష్య అన్యోన్య దర్శనము

**22వ పద్యము :** అవతారిక - సాధన సంపత్తి పరుడైన వాడు మాత్రమే పరిపూర్ణ బోధ తెలుసుకొనుటకు అర్హుడని యీ పద్యములో తెలియపర్చిరి.

**22వ పద్యము : సాధన సంపత్తియు గల । సాధకు డొకవరుడు, ఘోర సంసారమువన్। బాధపడలేక తన, పుణ్యోదయమున, గురుని గాంచి, యురుతర భక్తిన్ ॥ శరణని మ్రొక్కి, మరి మరి యుక్తిన్ ॥ బోధ జేయుము పుణ్య పురుష మా బోంట్లకు । సాధించదగు ముఖ్య సాధనని పల్కె ॥ యురుతర భక్తిన్ । శరణని మ్రొక్కి, మరి మరి యుక్తిన్ ॥**

**దండాన్వయం :** సాధన సంపత్తియు గల .......... గరుని గాంచి, యురు తర భక్తిన్ శరణని మరి మరి మ్రొక్కి, పుణ్య పరుషా । మా బోంట్లకు సాధించదగు ముఖ్య సాధన యుక్తిన్ బోధ చేయుము అని పల్కె ॥

**టీక :** మరి మరి మ్రొక్కి = అనేక మార్లు నమస్కరించి, ఘోర సంసారమునన్ = జనన మరణ ప్రవాహ రూప దుఃఖమును; యురుతర భక్తిన్ = గొప్పదైన భక్తితో। యుక్తిన్ = న్యాయము, ఉపాయముతో.

**భావము :** సాధన చతుష్టయ సంపత్తి గల ముముక్షువు ఒకడు, జనన మరణ ప్రవాహ రూప దుఃఖ బాధ పడలేక, సద్బోధకై పరితపించుచుండగ, అతని పూర్వ పుణ్య విశేషమున శ్రీ అశరీర సద్గురుమూర్తి దర్శన భాగ్యము కలుగగా, ఆ సద్గురుమూర్తి పాద పద్మములపై బడి। సాష్టాంగ ప్రణామములు చేసి "హే సద్గురోత్తమా! పరమ పురుషా! నేను సాధన చతుష్టయ పరుడను, అయినను జనన మరణ ప్రవాహమును తరించు మార్గము యెరుగ జాలకున్నాను. నేను తమకు శరణాగతుడనగుచున్నాను. నేను ఇంకనూ సాధించవలసిన ముఖ్య సాధనయేదో తెలియజేసి, నన్ను తరింపజేయుమని ప్రార్థించెను.

**విశేష భావము : 1)** ఈ అధ్యాయము "సాధన చతుష్టయ సంపత్తి" గల సాధకుడు అను పద్యముతో ప్రారంభింపబడినది. బ్రహ్మ విద్య తెలుసుకొనుటకు సాధన సంపత్తి పరుడే అధికారి. సాధన చతుష్టయ పరుడు అయిన పిదపనే బ్రహ్మ విద్య అధికారి

అని శ్రీ శంకర భగవత్పాదుల వారు "శారీరక మీమాంస" గ్రంథములో వాఖ్యానించియున్నారు. కనుకనే శ్రీ కృష్ణ దేశికేంద్రులు వారు కూడా సాధన చతుష్టయ సంపత్తి పరుడైన శిష్యుడే పరిపూర్ణ బోధకు అధికారి యని నిష్కర్షచేస్తూ ఈ అధ్యాయముతో కందార్థ రీతి పరిపూర్ణబోధను ఉపక్రమించినారు. అనుబంధ చతుష్టయము 1) విషయము=బ్రహ్మజ్ఞానబోధ. 2) అధికారి = సాధన చతుష్టయ సంపన్నుడు, 3) సంబంధము = జీవ, బ్రహ్మములు ఒక్కటే అని, బ్రహ్మ అనగా జగత్కారణ బ్రహ్మము. దీనికి పరమైనది పరిపూర్ణబ్రహ్మము. 4) ఫలితము = పునరావృత్తి రహితమైన మోక్షము. ఘోర సంసారమగా - జన్మ పరంపరతో కూడి యుండి పునరావృత్తి రహితస్థితి తెలియకుండుట అని చెప్పవలెను మరియు సాధన చతుష్టయమును పట్టుదల ఓరిమితో సాధించినను । పునరావృత్తి మార్గము నిస్సంశయముగ తెలియపడకుండుట, పరబ్రహ్మము నామరూప క్రియా రహితము కనుక। జగత్కారణ బ్రహ్మము బ్రహ్మమేనా? కాదా? లేక రెండు ఒక్కటేనా మొదలగు సంశయములు శాస్త్ర అధ్యయనముచే। తీరక। వ్యాకులపడుట ఘోర సంసారమున బాధపడలేక అని కూడా చెప్పవచ్చును.

ఇట్టి సాధన చతుష్టయపరునకు ఈ పూర్ణ బోధ ప్రారంభించబడినందున అట్టి సాధకుడు సాంఖ్య, తారక, అమనస్క మహావాక్య విచారణలతో కూడిన ఆత్మబోధ పూర్తి అయినందున, కందార్థములలో ఆత్మబోధ చెప్పకుండగ పరిపూర్ణ బోధ మాత్రమే విశదీకరించిరి. అంతమాత్రముచే సాంఖ్యతారకాది ఆత్మబోధ అవసరము లేదని కాని। పనికిరాదని కాని భావించరాదు. ఆత్మబోధ అయిన పిదపనే పరిపూర్ణ బోధకు అర్హుడు అని తెలియవలెను. కనుకనే కృష్ణ ప్రభువుల గురువు గారైన శ్రీ పరశురామ నరసింహదాసు గారు. భద్రాద్రిరామ శతకములో "గురుడు బోధించు క్రమము" అన్న పద్యము ప్రకారము ఆత్మబోధ తరువాత మాత్రమే పరిపూర్ణ బోధ చెప్పవలయునని ఖండితముగా చెప్పియున్నారు.

**తన పుణ్యోదయమున** : పరిపూర్ణ బోధ చెప్పగల గురుమూర్తి శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడైన గురుమూర్తి అయి యుండవలెను. ఇట్టి పరమ గురువు లభించవలెనన్నచో శిష్యునికి తన పూర్వజన్మల పుణ్యసంస్కార ఫలము ఉండవలెను. అందుకే "అనేక జన్మాని జ్ఞానం లభ్యతే జ్ఞాన మనంతాని పూర్ణ బోధావశిష్యతే" అన్నారు. కనుక ఎంతో పుణ్య సంస్కారము ఉన్నవానికే ఈ బోధ గురువు లభ్యమగును.

**శరణని మ్రొక్కి :** భగవద్గీతలో అర్జునుడు వికలమానసుడై కర్తవ్యము తెలియని స్థితిలో శ్రీ కృష్ణభగవానులకు "శిష్యస్తేహం శాధిమాం" అన్న తర్వాతనే గీత బోధింపబడినది. అట్లే పునర్జన్మ భయముచే కంపితుడై। అది తప్పించుకొను మార్గము నిశ్చయముగా దొరకక, అట్టి భయమును పోగొట్టి పునరావృత్తి లేకుండా చేయగల సద్గురుమూర్తి లభించగానే అపరిమితానందముచే గురుమూర్తికి సాష్టాంగ ప్రణామపూర్వకముగా ప్రార్థించుటయే "శరణని మొక్కి" అన్న పదమునకు అర్థము.

**అనుబంధ చతుష్టయము =** 1) విషయము, 2) అధికారి, 3) సంబంధము, 4) ప్రయోజనము (సంబంధము - జీవ బ్రహ్మములు ఒక్కటేఅని) బ్రహ్మ అనగా జగత్కారణ బ్రహ్మము.

---

**23వ పద్యము : శరణాగతుడగు శిష్యుని। కరుణామృత దృష్టి చేతగని, మోదముము! ప్పిరిగొన, మృదు వాక్యములను। పరమ దయాళుండు గురుడు, భక్తా వినుమనెమా ॥ సంశయమిక బాధింపదనెను ॥ పరిపూర్ణ మొకటి, లేనెరుకనెదొకటి। పరిపూర్ణ మెరుకల నెరిగి యెరుకను మాను ॥ భక్తావినుమనెను। సంశయమిక బాధింపదెనను॥**

**టీక :** ముప్పిరి = మూడు పేటల (అనగా ఎక్కువగా)

**భావము :** శరణుజొచ్చిన ఆ శిష్యుని, పరమ దయామూర్తి అయిన గురుమూర్తి దయామృత దృష్టితో జూచి, సంతోషము పెల్లుబికే మధురవాక్యములతో, ఓ భక్తా! వినుము, ఇక సంశయముతో బాధపడనవసరము లేదు. నీ సంశయములన్నిటిని తీర్చెదను. పరిపూర్ణ బ్రహ్మమనునదొకటి, లేనెరుక అనేదొకటి కలవు. యీ పరిపూర్ణము, ఎరుకలరెంటిని ఎరిగి, యెరుకను విడచినచో నీ। కేవిధమైన సంశయము, బాధించదు అని చెప్పెను.

**విశేష భావము :** 1) కరుణామృత దృష్టి చేత గని - శిష్యుడు, అజ్ఞాని, గురుమూర్తి జ్ఞాన స్వరూపుడు, కనుక గురుమూర్తి తన శిష్యుని తనంతటి జ్ఞానస్వరూపునిగా చేయవలయున్నచో, గురుమూర్తి శిష్యునికి త్రివిధ దీక్షలను ప్రసాదించి జ్ఞానిగా తయారుచేయవలయునని శాస్త్రవాక్యము, శ్లో॥ వీక్షణ, ధ్యాన సంస్పర్శైః। మత్స్య భృంగ విహంగమాః। పోషయాతి స్వేకాన్ పుత్రః"। అన్నట్లుగా చేపలు చూపుచేతను। (దృక్దీక్ష) భృంగములు ధ్వనిచేతను (ధ్యానదీక్ష) పక్షులు (స్పర్శ) పొదుగుటచేతను।

(స్పర్శదీక్ష) తమ తమ పిల్లలను పోషించుకొనుచు, (గుడ్లను తమ రూపమునకు మార్చునట్లుగా) గురుమూర్తి 1) దృక్ దీక్ష (కరుణామృత దృష్టి చేతను) 2) ధ్యాన దీక్ష (బోధను తెలియపర్చి ధ్యానము చేయించి - ధ్యానమూలం గురోర్మూర్తిః) చేతను, 3) స్పర్శ దీక్ష - హస్తమస్తక సంయోగము చేతను, అనుమూడు దీక్షలను ప్రసాదించి, శిష్యుని తనంతటి జ్ఞానరూపునిగా చేయవలయును. అందుచే ఈ పద్యములో ఆ మూడింటిని చెప్పెను. 1) సంశయమిక బాధింపదు అనెను (అభయము) స్పర్శదీక్ష, 2) కరుణామృత దృష్టి చేత గని - దృక్‌దీక్ష, 3) మృదువాక్యములను వినుమనెను, ధ్యానదీక్ష. ఈ దీక్షాత్రయము దృక్, వాక్, స్పర్శదీక్షలనునవి యనియు కలదు.

2) పరమదయాళుండు గురుడు - గురుమూర్తి దయార్ద్రహృదయుడు, కోపముతో నుండరాదు. పరుష వాక్యములను పలుకుట, శపించుట పనికిరాదు. శిక్షణ, ఉపదేశములు ఈ రెండున్ను ఆత్మాన్నములు. కనుక శిష్యుని మందత్వ నివారణకై అవసరమును బట్టి శిక్షించినను అది కోపము చేత కాదు. శిష్యుని సంస్కరించుటకు కనుక అది కోపము కానేరదు. కోపము అనగా ప్రతీకారయోచన అని శాస్త్రార్థము. "మధు ప్రవక్ష్యామి, మధువదిష్యామి" అని వేదవచనము. అందుకే బ్రాహ్మణుని కోపము తాటాకుమంటవంటిది" (మంట ఆరిన వెనుక నిప్పు ఉండదు) దీర్ఘముగ మనస్సునందు కోపము నిలువ ఉండరాదు.

**24 అవతారిక :** 22వ పద్యములో "నేసాధించదగు ముఖ్య సాధన ఏది?" అని శిష్యుని ప్రశ్నకు జవాబుగా ఈ పద్యము చెప్పబడినది.

**24వ పద్యం : యే సాధన నీకెందుకు? వీసానికి పనికిరాదు. వినుమా, యయ్యా! నే సాధులచే విన్నది । యేసాధన లేని బోధ నెరిగింతు పోకూ ॥ సాధనలందు మరిగితె రాకూ ॥ యే సాధనల జోలినే నొల్లనని నీవు । బాస చేసితివేని, పరిపూర్ణ బోధనే ॥ నెరిగింతు పోకూ । సాధనలందు మరిగితే రాకూ ॥**

**టీక :** సాధనలు = అష్టాంగ యోగసాధనలు, వీసము = ఒకటిలో పదియారవ భాగము. (కొంచెము అని అర్థము) సాధులు = సత్‌వస్తువును గ్రహించి ఆరూఢులైన వారు అనగా బ్రహ్మజ్ఞానులు, జోలి = సంగతి, వృత్తాంతము, ఒల్లను = అంగీకరించను, బాస = ప్రతిజ్ఞ.

**భావము :** శిష్యా! యే సాధన నీకు అవసరము లేదు. పరిపూర్ణమెరిగి ఎరుకను విడచుటకు సాధనలతో పనిలేదు. యీ బోధకు సాధనలు కొంత వరకు అభ్యంతరమైనవే కనుక, నీవు సాధనలలో మరిగి ఉండి పోయినచో యీ బోధకు రావద్దు. యే సాధనలు జోలినేను పూనను అని నీవు ప్రతిజ్ఞ చేసినట్లైతేనే, యీ బోధను తెలియపర్చెదను. యీ బోధ సాధనలకతీతమైనది.

**విశేష భావము :** సాధనలు అనగా యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి అని 8 విధములైన సాధనలు. ముద్ర లక్ష్య భావములతో కూడినవి బ్రహ్మజ్ఞానము తెలిసికొనుటకు, అంతఃకరణశుద్ధి, చిత్తస్థైర్యము కావలయును. ఇవి పొందుటకు మాత్రము సాధన అవసరము. అంతః కరణశుద్ధి పొందిన పిదప, సాధనలు మాని జ్ఞానముమ తెలుసుకొనుటకు సద్గురు శుశ్రూషచే బ్రహ్మజ్ఞానమును గురుముఖతా విచారించి గ్రహించవలెను. బ్రహ్మము సాధ్య వస్తువు కాదు. సాధనాతీతమైనది, కనుక సాధనలు పనికిరాదని ఈ పద్యములో చెప్పబడినది "బ్రహ్మజిజ్ఞాస" "తద్విజిజ్ఞాస్వ" అని శృతి వాక్యములు, శృతి ఉపనిషద్వాక్యములను గురుముఖత విచారించి, తెలిసికొనదగినది బ్రహ్మము. సాధించి చూడగలిగినది, చేరగలిగినది ఎంతమాత్రము కాదు. విచారస్య ఫలం, అన్యథా భ్రమకారణం "బ్రహ్మము విచారణచే మాత్రమే తెలియదగినది. ఇతరమైన యోగసాధనలు పుట్టుకకే (ఎరుకకే) కారణమగును. బ్రహ్మము సిద్ధవస్తువు । సాధన (సాధ్య) వస్తువుకాదు.

---

**25వ పద్యము : గురువర పరిపూర్ణంబన । నెరుకననివి రెండు యెట్టి వెరుకోద్భవ, మెం । దెరుకజను చోటుయెయ్యది । యెరుకను నేనెట్లువిడతు, నెరిగించు మనెనా॥ అట్లనె గురుడెరిగింతుననెను ॥ చరణ ధూళిని రెండు కరముల గొని, తన । శిరమున ధరియించి శరణని యా శిష్యు ॥ డెరిగించుమనెను । అట్లనె గురుడెరిగింతుననెను॥**

**టీక :** ఉద్భవము = పుట్టుక, జనుచోట = లేకపోయే స్థానము.

**భావము :** ఓ గురుదేవా ! పరిపూర్ణమనగా యెట్టిదో? యెరుక అనగా ఎట్టిదో ? ఎరుక ఎక్కడ పుట్టుచున్నదో ? ఎరుక ఏ స్థానమందు లేక పోవుచున్నదో? ఆ ఎరుకను నేనేవిధముగా విడువగలనో ? ఇవన్నియు నాకు వివరముగా తెలియపర్చుడు

స్వామి। అని శిష్యుడు అడుగగా గురుమూర్తి ఆ విధముగానే తెలియపర్చెదను అని చెప్పెను. అంత శిష్యుడు పరమానందభరితుడై గురుపాద ధూళిని తన రెండు చేతులతోను గ్రహించి తన శిరస్సున ధరించి నమస్కరించెను.

**విశేష భావము** : "గురువర" అనగా శ్రేష్ఠమైన గురుదేవా ! అని భావము యీ పరిపూర్ణ బోధ చెప్పేగురుడు సామాన్యమైన గురుమూర్తి కాడు. చక్కని శ్రోత్రియుడు అనగా ఉపనిషత్ భావమును చక్కగా గుర్తించినవాడను, సదాచార సంపన్నుడైనవాడు, మరియు బ్రహ్మనిష్ఠుడు అయినవాడు, అనగా మాయను విడిచి, బ్రహ్మము నందే చరించువాడై యుండవలయును, మరియు బ్రహ్మమునందు అపరోక్షజ్ఞాన సంపన్నుడైయుండవలయును. అట్టి వారు మాత్రమే పునరావృత్తి రహితమైన మార్గమును చెప్పి ఎరుకను విడిపించగల్గినవారు, అందుచే యీ గురుమూర్తి సామాన్యుడుగా చెప్పబడక "గురువర" గురుశ్రేష్ఠా! అని సంబోధించిరి.

**26 అవతారిక** : శిష్యుని ప్రశ్నలు 4. ఒకటి - పరిపూర్ణమనగానేమి? 2) ఎరుక అనగా ఏమి? 3) ఎరుక ఉద్భవము ఎచ్చట ? 4) ఎరుకనునేవిడచేదెట్లా? ఈ నాలుగు ప్రశ్నలకు వరుసగా 1) అచల లక్షణము, 2) ఎరుక లక్షణము, 3) ఎరుకోత్పత్తి లక్షణము, 4) విరుక విడుపు లక్షణము అధ్యాయములుగా వివరించిరి. ఈ విధముగానే నీకు వివరించెదనని గురుమూర్తి శిష్యునికి సమాధానపరచెను.

**26వ పద్యము : మొదలచలము నెరిగించెద । విదితముగా లేని ఎరుక వివరింతు, పయిన్ । తుదకెరుకను విడిపించెద । మదిలో నామాట నమ్మి, మరివింటివేని ॥ చంచల బుద్ధి మానుంటి వేని ॥ పదుగురు నిమజాచి భళి, శెబాసీ త్రోవ । కెదురు లేదనేటట్టు యిదిగో నే జేసెద ॥ మరి వింటివేని । చంచల బుద్ధి మానుంటివేని ॥.**

**టీక** : విదితముగ = వివరముగ, తెలియబడులాగున, వివరింతును, విశదముగ తెలిపర్చెదను, పయిన్ = ఆ తరువాత.

**భావము** : శిష్యా! చంచల బుద్ధిమాని, నే చెప్పే బోధయందు నమ్మకముంచి (మనసు ఉంచి) నీవు విన్నచో, నీకు మొట్టమొదటగా పరిపూర్ణ పరబ్రహ్మము గురించి ఎరిగించెదను, తరువాత లేని యెరుక గురించి వివరముగా చెప్పెదను (ఎరుకోత్పత్తి,

ఎరుక లక్షణములు రెండు) చివరకు ఎరుకను విడిపించెదను. నీవు చంచలత్వమును మాని నమ్మిక కల్గి వినినచో, పదిమంది జూచి నీవు చెప్పే బోధ చాలా గొప్పది, దీనికి సమానమైనది గాని, అధికమైనది గాని మరే బోధలేదు. శెభాస్ అని మెచ్చుకొనే విధముగా నిన్ను సంస్కరించెదను అని గురుమూర్తి చెప్పెను.

**విశేష భావము** : శిష్యునికి మొట్టమొదటగా సర్వత్రా నిండిన పరిపూర్ణ పరబ్రహ్మమును, ఆ తరువాత లేని యెరుకను సవివరముగా తెలియపర్చి, ఆ తరువాత లేని ఎరుకను విడిపించెదను. (లేకుండా జేసెదను) పరిపూర్ణమును, లేని ఎరుకను తెలిసికొనేది ఎరుక చేతనే ఎరుక చేతనే సమస్తము ఎరిగి, ఆ యెరిగే యెరుకను విడుచుటయే పరిపూర్ణబోధ పద్ధతి.

**చంచలబుద్ధి మానుంటివేని** : గురువు నందు, శాస్త్రము నందు అచంచలమైన విశ్వాసము కలిగియున్నవానికే బ్రహ్మ జ్ఞానము తెలుసుకొననర్హుడు. గతంలో చేసిన యోగసాధనలు, విడచినవాడై గురువు చెప్పిన విధముగా ఆచరించుటయే చంచలత్వము మానుట.

**మొదలచలమునెరిగించెద** : శ్రీ శివాదీక్షితుల వారు తమ బృహద్వాశిష్ఠ గ్రంథములో " ఏ సిద్ధాంతము నమ్మినా మూలం లేని యీ గుర్తెరిగే శరీరం లేనిదనే రాజమార్గం లేదు. మూలం లేని గురెర్తీరిగే శరీరం నిలిపి యేమి చెప్పినా మునపటి గాడిద వాలకం పోదు. అందుచే మొట్టమొదటిగా బయలు ఉన్నది కదా అని నిత్యం నూరు మార్లు పది దినములు చెప్పవలె" అని వ్రాసినారు. కనుకనే శ్రీ కృష్ణదేశికేంద్రులు "మొదలచలము నెరిగించెద" అన్నారు.

**4) "పదుగురు నినుచూచి భళిశెబోస్"** : అనగా ఇచ్చట పది మంది అను పదమునకు బహుళవాచకముగా గుర్తించవలెను. అందరూ చూసి మెచ్చుకొనేలాగున అని అర్థము. అలాకాకుండ, పదుగురు అను పదమునకు సంఖ్యావాచకము గానే చెప్పవలెనన్నచో - సృష్ట్యాదిలో మహాఋషులు ఈ సృష్టికి మూలమేది? అని తర్కించుచు విచారణ జేసిరి. అప్పుడు ఈ సృష్టికి మూలం - సదసత్ పదార్థమనియు, సత్ పదార్థమనియు, అసత్ పదార్థమనియు, అహోరాత్రమనియు, అమృతమనియు, మృతామృతమనియు, ద్వైవ మనియు, ఇట్లు పదివాదములు ఏర్పడెను. దీనికే "దశవాదములు" అని పేరు. ఈ దశ వాదముల నుండి యేషడ్దర్శనములు వచ్చినవి. ఈషడ్దర్శముల నుండియే

షణ్మతములు ఏర్పడినవి కనుక ఆ పదివాదములవారు, నీ సిద్ధాంతమును విని, నీ సిద్ధాంతమే సరియైనది, మా పది సిద్ధాంథములు నీ సిద్ధాంతము ముందు తీసికట్టే అని ఆ పదుగురు నినుజూచి మెచ్చుకొనే లాగున నిన్ను తయారు చేసెదను, అని శ్రీ కృష్ణ దేశికేంద్రులు అన్నట్లుగా గుర్తించవలెను.

**5) "త్రోవకెదురు లేదనేటట్లు"** : అనగా ఈ మార్గమునకు ఎదురు లేదనేటట్లు అని అర్థము. మార్గము అనగా నడిచివెళ్లే దారి అని అర్థము. కనుక ఈ బోధను తెలిసికున్నంత మాత్రముచే కాదు, ఈ బోధలో ఉండవలసిన విధానములో నడుచుకొనే వారికి, ఆచరించు వారికి అని విశేష భావముగా గుర్తించవలెను.

---

**27వ పద్యము : మీరంతవారు గనుకనే । చేరితి మీ పాద సేవ సిద్ధించుటకై । యేరింతవారు జగమున । లేరని నామదికి దోచె, లెస్సగ వినుడీ ॥ ఆజ్ఞ కు మీరలేదుకనుగొనుడీ ॥ యేరీతి వినమంటే నారీతి వినియెద । మీరావ తివ్వండి తోరమౌ యీ బోధ ॥ లెస్సగా వినుడీ । ఆజ్ఞకు, మీర లేదు కనుగొనుడీ ॥**

**పద విభాగము** : "యేరింత వారు జగ మునలేరని" - యేరీ ఇంత వారు, జగమునలేరని.

**టీక** : లెస్సగ = బాగుగ, తోరమౌ యీ బోధ - గొప్పదైన బోధ.

**భావము** : స్వామీ! మీరు నన్ను పదిమంది జూచి మెచ్చుకొనే లాగున చేయగలిగినంతవారనియు, మీ అంతటివారు ఈ జగత్తులో లేరనియు, నా మనస్సులో గట్టిగాతోచి, మీ పాద సేవా భాగ్యము సిద్ధించుటకై మీ సాన్నిధ్యమునకు వచ్చితిని. ఈ గొప్పదైన బోధ, క్రమపద్ధతిగా వినుటలో నన్ను ఏ విధముగా వినమందురో, ఏ విధముగా ఆచరించమందురో మీ ఆజ్ఞకు బద్ధుడనై అట్లు ఉండి వినగలను. (అని శిష్యుడు గురు ప్రభువుతో చెప్పెను)

**విశేష భావము** : గురుపాద సేవా భాగ్యము దొరకుట చాలా దుర్లభము. "దుర్లభం త్రిషులోకేషు । "దైవానుగ్రహేతుకం । మనుష్యత్వం, ముముక్షత్వం । మహాపురుష సంశ్రయః ॥" అన్నారు. కనుక మహాపురుష సంశ్రయమనగా సద్గురు ఆశ్రయము దొరుకుట అన్నిటికన్నా దుర్లభము. అందుకే యత్పాద రేణుర్నైనిత్యం । కోపి సంసార

వారిధౌ । సేతు బంధాయతే నాథః । దేశికం త ముపాస్మహే ॥ అని గురుగీతలో చెప్పబడినది. సంసార (జన్మ) సముద్రమును దాటుటకు ఏ గురువు యొక్క పాద రేణువే వారధి అగుచున్నదో, అట్టి సద్గురువును సేవింపవలెను. కనుక జన్మబంధము నుండి తప్పించుకొనుటకు ప్రయత్నము చేయు శిష్యునికి గురుపాదసేవా భాగ్యమునకు మించినది మరేదియు లేదు. అందుచేతనే ఈ పద్యములో "మీపాద సేవ సిద్ధించుటకై" అన్నారు.

2) **"ఆజ్ఞకు మీరలేదు కనుగొనుడీ"** : గుర్వాజ్ఞను మీరరాదు "గురో రాజ్ఞాం ప్రకుర్వీత్" అనియు "గురో రాజ్ఞాంచకారయేత్" అనియు శాస్త్ర వచనములు. గురువు ఆజ్ఞ ప్రకారము మంచిచెడులు ఆలోచించకనే శిష్యుడు నడుచుకొనవలెను.

3) **"యేరింతవారు జగమున లేరని"** : ఇంతటి వారు జగత్తులో మరెవరూ లేరు. గురువుకన్నా అధికమైన వ్యక్తి గాని, దైవము గాని, తత్త్వము గాని లేదు. "నగురోరధిక తత్త్వం" అన్నారు. అట్టి నిశ్చయ బుద్ధికలవానికే బ్రహ్మతత్త్వము తెలియబడును. ఇతరముచే తెలియబడదు.

---

**28వ పద్యము : మొద్దులైనను దొల్తురు । బద్ధుల బద్ధత్వమడని పాల్జేతురు, మీ వద్దకు వచ్చినగని, పరి। శుద్ధపు బోధోక్తమైన సూక్తులు గుప్పి ॥ అందుకు తగినయుక్తులు జెప్పి ॥ పెద్దలచేమీ ప్రసిద్ధిని విని వస్తి । దిద్దుడీ నే వట్టి బుద్ధిహీనుడ నన్ను ॥ సూక్తులు గుప్పి । అందుకు తగిన యుక్తులు జెప్పి ॥**

**దండాన్వయము** : మీ వద్దకి వచ్చిన (వారిని) గని, పరిశుద్ధపు బోధోక్తమైన సూక్తులు గుప్పి, అందుకు తగిన యుక్తులు జెప్పి । మొద్దులనైనను దొల్తురు, బద్ధుల బద్ధత్వమడవి పాల్జేతురు । నేవట్టి బుద్ధిహీనుడ । సూక్తులు గుప్పి । అందుకు తగిన యుక్తులు జెప్పి, నన్ను దిద్దుడీ ॥

**టీక** : పరిశుద్ధపు బోధోక్తమైన = మలిన రహితమైన బోధలో చెప్పబడిన సూక్తులు = మంచి మాటలు, యుక్తులు = ఉపాయములు, ఉదాహరణలు, బద్ధులు = కట్టబడినవారు (జనన మరణములతో ఉన్నవారు, బద్ధత్వము = కట్టడితనము (బంధము) అడవి పాల్జేతురు = లేకుండ చేయుదురు, ప్రసిద్ధి = కీర్తి, దిద్దుడీ =

చక్కజేయుడీ, గుప్పి = చల్లి, ఉంచి, ప్రయోగించి.

**భావము :** ఓ గురుదేవా ! మీ వద్దకు వచ్చి శరణు చేసిన శిష్యులను గని, పరిశుద్ధమైన బోధ యొక్క సూక్తులు చెప్పుచు (అది అర్ధమగుటకొరకు) అందుకు తగిన ఉదాహరణలు చెప్పుచు, మీ వద్దకు వచ్చినవారు అల్పులైనను వారికి మందత్వము లేకుండగజేసి జ్ఞానవంతులుగ చేయగలరు. అట్టి మీ కీర్తి ప్రతిష్ఠలు పెద్దలచే విని మీ వద్దకు వచ్చితిని. నేను బుద్ధి హీనుడను. కనుక నాకు బోధ జేసి సరిదిద్దవలసినదిగా ప్రార్థన.

**విశేష భావము :** "మొద్దులైనను దొల్తురు" - పనస మొద్దును చిన్న చిన్న ఉలి దెబ్బలచే మొద్దు యొక్క మధ్య భాగమంతయు దొలచి, దాని రెండు వైపుల చర్మముతో చక్కగా మూసి చక్కని శబ్దములు పలుకగల మృదంగముగా తయారు చేసిన విధముగా, అజ్ఞానములో నున్న శిష్యుని, గురుమూర్తి సూక్తులు యుక్తులతో బ్రహ్మతత్త్వమును తెలియజేసి చక్కని వేదాంత సూక్తులు చెప్పగలిగినంత బ్రహ్మజ్ఞానిగా తయారుచేయును. కనుక యీ పద్యములో "మొద్దులనైనను దొల్తురు" అని చెప్పబడెను.

**2) "మీ వద్దకు వచ్చిన గని" :** శిష్యుడు గురుమూర్తిని సమీపించి నమస్కార పూజావిధానములతో గురుమూర్తిని ప్రార్థించగా, గురుమూర్తి శిష్యుని పై కరుణగలిగి, చక్కని బ్రహ్మజ్ఞానిగా శిష్యుని తయారుచేయును. అందుచే శిష్యుడు గురువునే చక్కగా ఆశ్రయించవలయును.

**29వ పద్యం : సూటిగను బోధ నామది । నాటిన దిక చాలు చాలువని నీకైనీ । నోట నివు పల్కుదాకను । చాటువులను చెప్పుచుందు సరెనా, నా మాట ॥ రాగోరుచు మరినేనీ మాటా ॥ నూటికొక్కటి శేలుమాటాని తెలియుము । మాటిమాటికి వట్టి పాటాలేమిటి కింక ॥ సరేనా, నా మాట । రాగోరుచు మరినే నీ మాట ॥**

**టీక :** చాటువులు = సందర్భము ననుసరించి ఆశువుగా చెప్పు పద్యములు, సూటిగ = గురిగ (ధృఢముగ) శేలుమాట = శ్లేషాత్మక పదము (రెండు అర్థములు ఉన్నపదము).

**భావము :** శిష్యా! నేను చెప్పుచున్న ఈ పరిపూర్ణ బోధ "చక్కగా నా మనస్సునకు అతికినది. సందేహములన్నియు తీరినది ఇక చాలు స్వామీ!" అని నీకై నీవు అనే పర్యంతము, ఈ బోధ చాటు పద్యములలో చెప్పెదను, సరేనా! అంతేకాదు, ఈ బోధ అంతయు, తిరిగి నీవు చెప్పేలాగున చెప్పెదను, అనేక మాటలతో పనిలేదు, నూరు మాటలకు ఒక్కమాట సరిపోవులాగున ఈ బోధ చెప్పెదను (నూరు మాటలలో ఒక్కొక్క చోట శ్లేషభావముగా ఉంటుంది, అది చూచుకొనుము అని ఒక భావము).

(ఈ పద్యములో "సరేనా నా మాటా! రాగోరుచు మరి నీ నోటా) అని భావము.

**విశేష భావము :** బోధనీకైనీ నోట చాలును చాలును అని అనేదాకను, సందేహములు తీరినవి అనే దాకను, తిరిగి ఆ బోధ అంతయు శిష్యుని నోటి నుండి తిరిగి చెప్పగలిగేనంత వరకు బోధ చెప్పెదను అని భావము "నూటికొక్కటి శేలు మాటాని తెలియుము" - అనేక శాస్త్రములలో అనేక విధములుగా చెప్పిన నూరు మాటలకు ఒక్క మాట జవాబు అయ్యే లాగున సిద్ధాంతపు మాటలను జెప్పి బోధ ధృడ పరచెదను అని భావము.

(3 మంత్రములకు ఇంచుమించు 300 పద్యములు చెప్పబడినవి, అంటే 1 మంత్రమునకు 100 పద్యములు అనగా నూటికి 1 పద్యము అని ఇంచుమించుభావము).



**30వ పద్యము : తానే వనకను నిండిన। దానికి పేరేమి? బయలు, తా, నేనచున్। నేననియెద నేనెవ్వరు। లేనెరుకవు వుంటి, వుంటే లేనే లేవనుమీ॥ అంటివి, అంటే లేనే లేవు సుమీ॥ లేనే లేవని నేను లేకపోయిన వెనుక। తానుండుగద, వుంటే దాన్నే ట్లెరిగెద వీవు॥ లేనే లేవనుమీ। అంటివి అంటే లేనే లేవుసుమీ॥**

**భావము :** ఈ పద్యము శిష్యుని ప్రశ్న, దానికి గురుమూర్తి జవాబుగా విభజించి అర్థము చెప్పుకోవలెను.

| శిష్యుని ప్రశ్న | గురుని జవాబు |
|---|---|
| 1) తా, నే, ననకను నిండిన దానికి పేరేమి ? | - బయలు |
| 2) తా, నే, ననుచున్ నేనయెద నేనెవరినీ (స్వామీ!) | - లేనెరుకవు, వుంటి |
| 3) వుంటే ? (స్వామి) | - లేనే, లేననుమీ ! |
| 4) అంటిని (అలాగే అన్నాను స్వామీ) | - అంటే లేనే లేవుసుమీ! |
| 5) లేనే లేనని నేను లేకపోయిన వెనుక తాను (పరిపూర్ణము) ఉండుగద? | - ఉంటే, దాన్నెట్లెరిగేదవు? అనగా ఎరుగుటకు నీవులేవుగదా? |

కనుక లేనే లేననుమీ ! అని భావము

**విశేష భావము** : తానని నేనని (నీవని) గుర్తించే లక్షణము, లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము. తానని (పరిపూర్ణమని) నేనని జగత్తని గుర్తించే లక్షణము కలది ఎరుక. యీ యెరుక (ఎరిగే లక్షణము) లేనిది పరిపూర్ణము. మాయ। పరిపూర్ణములో లేనిదే తనకు తానే తోచినది ఈ మాయ లేనిదే అయినను, దీ నందు పరిపూర్ణము ప్రతిబింబముగా ఉండుటచే ఈ మాయ ఉన్న లక్షణము కలిగి సత్తా కలిగినది అయి, సమస్త జగత్‌ను సృష్టించుచున్నది. మాయ, అందలి ప్రతిబింబము కలిసి ఎరుక అని చెప్పబడుచున్నది. మాయ అనగా లేనిది, ప్రతిబింబమునకు స్వతః సిద్ధమైన ఉనికి లేదు, కనుక మాయ - ప్రతిబింబరూపమైన ఎరుక లేనిది అన్నారు. అందుకే ఈ పద్యములో "లేనెరుకవు వుంటి" అన్నారు. అనగా నెరుకవు (అయి) యున్నావు అని భావము.

---

**31వ పద్యము : మీ రాజ్ఞయిచ్చి యుంటిరి ! నేరుపుతో బయలు నెరుక నెరిగించి పయిన్ ! పేరణతు యెరుకనని, యి । ట్లా రీతినె యెరుక పరచు, మయ్యా మ్రొక్కేను॥ అనుమానము జెయ్యాకియ్యేడను ॥ సారెకు మీ పాద జలజ యుగ్మము నాహృ । త్సారసమున నిల్పి సల్పుచు పూజనో ॥ యయ్యా మ్రొక్కేను । అనుమానము జెయ్యాకియ్యేడను ॥**

**దండాన్వయము** : నేరుపుతో బయలును, ఎరుకను ఎరిగించి, పయిన్ ఎరుకను పేరణుతునని, మీ రాజ్ఞయిచ్చి యుంటిరి. యిట్లా రీతిని యెరుక పరచుమయ్యా! మ్రొక్కేను ! ఇయ్యేడను అనుమానము జెయ్యకు ! సారెకు మీ పాద జలజ యుగ్మము, నా హృత్సారసమున నిల్పి, పూజను సల్పుచు ఓ అయ్యా మ్రొక్కేను॥

**టీక :** పేరణతు = లేకుండ జేతును, జలజ యుగ్మము = పాదపద్మముల జంట, హృత్సారసమున = హృదయ పద్మమునందు

**భావము :** అర్యాస్వామీ! తమరు మొట్టమొదటగా పరిపూర్ణమును, ఆ తరువాత లేనెరుకను విశదపరచి, ఆ తరువాత ఎరుకను లేకుండా జేసెదనని శెలవిచ్చియున్నారు. నాకు ఆ విధముగానే తెలుపకోరుచున్నాను. పదే పదే మీ పాద పద్మములను నా హృదయ పద్మము నందుంచుకొని పూజించి మ్రొక్కుకొనుచున్నాను స్వామీ ! యీ బోధ చేయుటలో నాకు అనుమానము జేయవద్దు స్వామీ ! కనుక ఆ విధముగానే తెలియపర్చండి స్వామీ ! అని శిష్యుడు ప్రార్థించెను.

**విశేష భావము :** నేననే యెరుక లేకపోవుట కేవలము గురుకరుణచే మాత్రమే జరుగును. అందుచే యీ పద్యమలో "సారెకు మీ పాద పద్మయుగము నా హృదయ పద్మమున నిల్పుకొని ఎల్లప్పుడు పూజించుకొందును" అని చెప్పబడినది. అందుకే "ధ్యానమూలం గురోర్మూర్తిః పూజా మూలం గురోఃపదం ! మంత్రమూలం గురోర్వాక్యం ! ముక్తిమూలం గురోః కృపా" ॥ అని గురు గీతా శాస్త్ర వచనము. ఇందులో ధ్యానము - గురుమూర్తిని ధ్యానించుట అనగా గురు విగ్రహము అని కాదు. హృదయమందలి అఖండ గురు చైతన్య స్వరూపమును, ధ్యానించవలెను. అట్లే ముక్తిమూలం, గురోఃకృప" అన్నారు. అనగా మానుష గురుమూర్తి కరుణచే గుహ్యాతి గుహ్యమైన బోధ స్వరూపము సంశయరహితముగా, పరోక్షముగా తెలియబడును. అంతఃకరణశుద్ధుడైన వాని హృదయ పద్మమందలి ప్రతిబింబిత చైతన్య స్వరూపమును (గురుమూర్తి) ధ్యానించుట వలన, ఆ చైతన్య దర్శనము కలుగుటయే గురుకృప. అట్టి దర్శనముచే మాత్రమే ఆ విద్య పూర్తిగా భస్మమై (జ్ఞానాగ్ని భస్మసాత్కురతే కర్మ) ఆ విద్య, అందలి ప్రతిబింబము రెండు ఒక్కసారిగా లేక పోవును. అనగా ఎరుక పూర్తిగా రహితము. ఉన్నది సర్వత్రా ఒక్క పరిపూర్ణము మాత్రమే ఉన్నది. అది ఉన్నను, ఉన్నదని గుర్తించే ఎరుకలేకపోవుటచే పరిపూర్ణము ఉన్నది అని గాని ఎరుక లేదని గాని చెప్పలేరు. ఇదే జన్మరహిత స్థితి.

ఇతి శ్రీమద్భాగవత కృష్ణదేశికేంద్ర విరచిత
ద్వైతా ౨ ద్వైత రహిత పరమ తత్త్వే
గురుశిష్యా అన్యోన్య దర్శనం నామ
ద్వితీయోధ్యాయమునకు భావ విశేషభావము
సమాప్తము
॥ జై గురు ॥

# ద్వితీయోధ్యాయమునకు - సంక్షిప్త భావము

ఈ పరిపూర్ణ బోధ తెలిసికొనుటకు సాధన చతుష్టయ సంపత్తి పరుడైన సాధకుడు మాత్రమే అధికారి అనియు, అట్టి సాధకుడైన వ్యక్తి (అశరీర) సద్గురుమూర్తి పాద పద్మములకు తనను జన్మ రహితునిగా చేయమని ప్రార్థించగా, గురుమూర్తి దయకలవాడై శిష్యునికి త్రివిధ దీక్షలనొసంగి, సాధనలతో ఇక పనిలేదనియు, ఇకపై సాధనలు చేయవద్దనియు, అవివిడచి ఈ బోధను చక్కగా శ్రవణ, మనన, నిధిద్యాసలచేత గ్రహించవలెననియు, బ్రహ్మము సాధనలకు దొరికే సాధ్య వస్తువు కాదనియు, అధాతో బ్రహ్మజిజ్ఞాసః (కర్తవ్యం) అను మొదటి బ్రహ్మ సూత్ర ప్రమాణముగా, బ్రహ్మను విచారించి తెలుసుకొనవలయును అనియు, కనుక అట్టి అచల పరిపూర్ణ పరబ్రహ్మమును తెలియపరచి, తరువాత లేని యెరుకను విశదీకరించి, చివరకు ఆ తెలుసుకునే ఎరుకను లేకుండగా చేయగలనని శిష్యునికి అభయపూర్వక మృదువాక్యభాషణ గురుమూర్తి చేసెను. అందుకు శిష్యుడు సంతోషాంతరంగుడై గురుమూర్తి పాద పద్మధూళిని తన రెండు చేతుల గ్రహించి తన శిరస్సునధరించి, ఆర్యా! నేను వట్టి బుద్ధిహీనుడను, నన్ను తరింప జేయగల సమర్థత మీ వద్ద కలదని పెద్దలచే విని మిమ్ములను ఆశ్రయించుచున్నాను. కనుక ఆ పరిపూర్ణ బ్రహ్మము అనగానేదో! లేని ఎరుక యొక్క ఉత్పత్తి స్థితిలయములను చెప్పి! లేనేరుక లేకుండగ దాన్ని రహిత పరుచుకొనేదెట్లో ఈ విషయములన్నియు సంశయ రహితముగా తెలియపర్చండి అని గురుమూర్తితో అనెను. అందుకు గురుమూర్తి సంతోషముతో ఆలాగే విశదపరచెదను. బోధనామనస్సుకు సూటిగా నాటినది, ఇక చాలు అని నీ నోటి నుండి నీకై నీవు అనే పర్యంతం బోధను చాటుకందార్థ పద్య రూపముగా చెప్పెదను, సరేనా! బోధను సూక్తులతోను (అనగా శృతి ప్రమాణ వాక్యములతో) అందుకు తగిన యుక్తులతో చెప్పెదనని శిష్యునికి అభయమిచ్చెను. అందుకు శిష్యుడు ధన్యుడనయితినని సంతోషించి! పదే పదే మీ పాదపద్మయుగ్మమును తన హృదయపద్మము నందుంచుకొని పూజించుకొనుచు, గురుమూర్తి చెప్పిన విధముగా నడనుడులతో ఉందునని గురుమూర్తికి చెప్పుకొనెను.

# 3. అచల లక్షణము (13)

**అవతారిక :** "మొదలచలము నెరిగించెద" అన్న గురుమూర్తి అన్న విధముగానే శిష్యునికి బోధచేయుటలో మొట్టమొదటగా "అచల లక్షణము" అనే అధ్యాయముతో బోధ ప్రారంభించబడినది.

**32వ పద్యం : పుట్టుట, గిట్టుట లేకమ। పుట్టే గిట్టేటి యెరుక పోడి మెరుగకన్ । చట్టు వలె కదలకుండును । బట్టబయల్ యిట్టిదెరిగి, భావింపదగును ॥ యెరుక లేక సేవింపదగునూ ॥ వట్టి యాశల చేత పట్టుబడకను, యీ గుట్టు దేశికునోట గట్టిగ దెలుసుక ॥ భావింపదగును ॥ యెరుక లేక సేవింపదగును॥.**

**టీక :** గిట్టుట మృతిచెందుట, పోడిమి - విధము, చట్టు = నీట మునిగియున్న బండరాయి, సేవింపదగును = పూజించదగును, గుట్టు = మర్మము, రహ్యము, దేశికునోట = గురుముఖముగా, తెలుసుక = తెలుసుకొని, బట్టబయలు = దాగుడులేక ప్రత్యక్షముగానే సర్వత్ర ఉన్న బ్రహ్మము అని భావము.

**భావము :** పరిపూర్ణ పరబ్రహ్మము, జనన మరణములు లేనిదై।, జనన మరణములతో కూడిన యెరుక యొక్క జాడ ఎంత మాత్రము తెలియనిదై చట్రాయి వలె కదలిక లేనిదై సర్వత్రా ఉన్నదని తెలుసుకొని భావించవలెను మరియు యెరుక లేక సేవింపదగును. యెరుక లేక సేవించుట అనే రహస్యమును వట్టిమాటల చేత (శాస్త్ర మర్యాదలచే తెలియబడదు, సద్గురుమూర్తి ముఖస్థముగా మాత్రమే తెలుసుకొనవలెను. ఆ విధముగానే బ్రహ్మమును భావింపదగును.

**విశేష భావము :** జనన మరణములు లేనిది, ఎట్టి వికారము చెందనిది, ద్వంద్వ రహితమై (ఏకమేవా ౨ ద్వితీయం బ్రహ్మ) తన గురించిగాని, ఇతరము గురించి గాని ఎరిగే లక్షణములేనిది (ఎరుక లేనిది) పరిపూర్ణ పరబ్రహ్మము. దీనికి వ్యతిరిక్తమయినది ఎరుక. "జన్మాద్యస్యయతః" అని చెప్పబడిన బ్రహ్మసూత్రము రెండవసూత్రము యొక్క లక్ష్యార్థముయినది. దీనికి అతీతమైనది పరిపూర్ణము "ఆత్మాతీతం కేవలాత్మ".

పరిపూర్ణ పరబ్రహ్మము, ఎరుక - జగత్తుల జాడ ఎంతమాత్రము యెరుగనిది "శృ" యత్ర నాన్యత్పశ్యతి యత్ర నాన్యత్ శృణోతి, యత్ర నాన్య ద్విజానీతి, సభూమ"

"న వాగ్గచ్ఛతి, నశ్రోత్రు గచ్ఛతి, నచక్షుర్గచ్ఛతి" మున్నగు శృతి ప్రమాణములతో చెప్పబడినది. ఇట్టి పరిపూర్ణమును శాస్త్రజ్ఞానము చేత గుర్తింపబడేది కాదు, గురు కరుణచే, గురుముఖముగా మాత్రమే గుర్తించవలెను. కనుక పరిపూర్ణ పరబ్రహ్మము సాధ్య వస్తువు కాదు, సిద్ధవస్తువే.

**2) యెరుక లేక :** పరిపూర్ణ బ్రహ్మము ఉపాస్యవస్తువు కాదు. కనుక పూజింపబడేది కాదు. కనుక భావింపదగును. ఎరుక పూజింపబడే వస్తువు కనుక ఎరుకను సేవింపదగును. ఎరుక జ్ఞాన అజ్ఞానమిశ్రమము. అజ్ఞాన సంబంధమయిన ఎరుకను పూర్తిగా విడచి జ్ఞాన స్వరూపమయిన ఎరుకను అనగా పరిపూర్ణము యొక్క ప్రతిబింబమే కనుక, ధ్యానించేది ఎరుకే అయినా లక్ష్యభావముగా పరిపూర్ణ బ్రహ్మమే అని ధ్యానించుటయే, నిధి ధ్యాస. ఇదే "ఎరుక లేక సేవించుట" అగును. ఇట్టి నిధి ధ్యాస వలన మాత్రమే లేని యెరుక లేకపోవును.

**3) చట్టువలె కదలకుండును :** నీట మునిగయున్న చట్టుబండ కదలిక లేనిదై కనబడకఉండును. నీరు సూర్యరశ్మిచే ఆవిరి అయి పోగా చట్టుబండ కనబడును. అట్లే మాయచే కప్పబడియున్న పరిపూర్ణ పరబ్రహ్మము స్వరత్రా నిండి, కదలుటకు వెల్తిలేనిదై ఉన్నది. కాని ఎరుక యొక్క మాయచే కప్పబడి యుండుటచే దృగ్గోచరము కాదు, ఆ  గురు కరుణచే ఎరుక రహితమై। కేవలము ఒక్క పరిపూర్ణ బ్రహ్మమే ఉండును. కాని గుర్తించే ఎరుక లేదు. ఈ మార్గమును శాస్త్ర జ్ఞానముచే మాత్రము కాకుండగ గురుముఖతా, గురు కరుణ చేత మాత్రమే బ్రహ్మమును భావించుట, ఎరుక లేక సేవించుట తెలియబడును.

---

**33వ పద్యము : యెరుకైన రీతిమందుమ । యెరుగ వశక్యంబటంచు యెన్నివ యెరుకన్ । యెరుగుదుననినను యెరుకకె । యెరుగుట దుర్లభము, సుమ్మి, యీ వుత్తబైలూ ॥ యెరుగనే యెరుగ దెరుకనీ బైలూ॥ పెరుగదు, విరుగదు, వొరుగదు, తరుగదూ । అరుగదు, కరుగదు, ఎరుగదు మొరుగదు ॥ యీ ఉత్తబయలు । యెరుగనె యెరుగదెరుక నీ బైలు ॥**

**దండాన్వయం :** **1)** యీ వృత్తబైలు ఎరుకైన రీతిమందును. **2)** యెరుగనశక్యంబటంచు యెన్నిన। **3)** యెరుకన్ యెరుగుదనినను యెరుకకే యెరుగుట దుర్లభము సుమ్మీ । **4)** యీ బైలు యెరుకను।, యెరుగనె యెరుగదు ॥

**భావము :** 1) యీ పరిపూర్ణ బ్రహ్మము తెలియబడినట్లుగా ఉండును. 2) యీ పరిపూర్ణమును యెరుగుట అసాధ్యము అనుచు తలచినచో । 3) యెరుకన్ (తన స్వరూపమును) యెరుగుట కష్టసాధ్యము. అనగా శుద్ధ సత్యజ్ఞానమైన (స్వస్వరూపమును యెరిగిన) యెరుకకె కష్టపడినచో సాధ్యము. అనగా అసాధ్యము కాదు. దుర్లభము = కష్టసాధ్యము.

**టీక :** యెరుకైన రీతి=తెలిసిన విధముగా, పెరుగదు, వృద్ధి పొందదు, విరుగదు, నశించదు, ఒరుగదు = నిద్రించదు, తరగదు = క్షీణించదు, అరుగదు = పలుచనవదు, తిరుగదు = మరొకచోటికి వెళ్లదు, మొరుగదు = మాట్లాడదు, కరుగదు = నీటి యందు కరుగదు, బైలు = బయలు.

**భావము :** శిష్యా ! పరిపూర్ణ పరబ్రహ్మము, తెలియబడినట్లుగా యుండును. కాని తెలియబడినది అంటే అది యెరుకయే। యెరుక పరిపూర్ణమును యెరుగదు. మరియు పరిపూర్ణము పెరుగట, నశించుట, నిద్రించుట, క్షీణించుట, అరుగుట, పలుకుట భిన్నత్వమొందుట (ముక్కలగుట) తిరుగుట మొదలగు యే వికారములు లేనిదని తెలియుము.

**విశేష భావము :** నాలో ఉండి సమస్తమును తెలుసుకొనుచున్నదే - జ్ఞానము, జ్ఞాత, అదే యెరుక, యెరుకచే తెలియబడు సమస్తము యెరుకయే. కనుక యెరుకచే పరిపూర్ణము తెలియబడదు. యెందు చేతననగా పరిపూర్ణములో యెరుక లేదు. గురుమూర్తి బోధ జేసి తెలియపర్చిననూ పరిపూర్ణము యెరుగబడదు. తెలియపర్చిన సమస్తము, యెరుకయే అట్టి లక్షణములు లేనిదై అంతటా ఉన్నది యేదో అది అని అన్వయ వ్యతిరేక్షి భావములచే ఎరుక చేతనే పరిపూర్ణమును ఉన్నదని గుర్తించవలెను. కనుక పరిపూర్ణము తెలియబడునట్లుగా ఉన్ననూ తెలియబడేది కాదు. కాని "తెలుసుకోదగినది" అని యెరుగుము.

---

**34వ పద్యము : పలుకున బలుకక రాకను । తలపోయిద మనిన, మదికి దగులక యెపుడున్ । ములుగుచ్ఛ సందిలేకను । కలిగున్నది బట్టబయలు గదరామా యన్నా ॥ యిదిగో చూడు కదులాదోయన్నా ॥ పలుకున్నా పలుకక తలపన్నా దెరుగక । చలి యెండ వానల వలయక నిలచుండు ॥ గదరా మాయన్నా। యిదిగో చూడు కదులాదోయన్నా।**

**టీక** : తలపోయుట = భావించుట, మదికి = బుద్ధికి సంది = సందు యొక్క రూపాంతరము, కలిగున్నది = శాశ్వతముగానున్నది నలయక = బాధపడక, నిలచుండు = ఒక్కరీతిగయుండును.

**భావము** : శిష్యా! పరిపూర్ణము యే విధమైన శబ్దము లేనిదై ఇట్టిదని ఊహించుటకు బుద్ధికి కూడ శక్యము కానిదై ములుగుచ్చుటకు కూడా వెల్తిలేనిదై సర్వత్రా శాశ్వతమై నిండియున్నది. అంతటా నిండియున్న పరిపూర్ణము యిదిగో నీ యెదుటనే (ప్రత్యక్షముగా) యున్నది. కదిలించిననూ కదులుటలేదు. (నా చెయ్యి కదులుచున్నది కాని పరిపూర్ణము కదులుటలేదు) దాని యందు శబ్దము ఎంత మాత్రము లేదు. (నిశ్శబ్ద రూపముగానైన లేదు) కనుక శబ్దముచే (జ్ఞానముచే) తెలియబడదు. సంకల్పమునకు అందక, చలి యెండ వానలు మొదలగు ప్రకృతి లక్షణములకు వికారము చెందక, సర్వకాలము ఒక్క రీతిగా నున్నదే పరిపూర్ణము. యిదిగో చూడుము ప్రత్యక్షముగానే ఉన్నది)

**విశేష భావము** : "యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ "మరియు "అప్రాణా మనాశ్శుభ్రః" అన్నట్లుగా మాటలకు, మనస్సుకు, అందనిది పరిపూర్ణ పరబ్రహ్మము. శబ్దము ఎంతమాత్రము లేనిది అనగా జ్ఞానము (ఎరుక) లేనిది. కనుక శబ్దము అనగా జ్ఞానము, వేదము "ఓం" అనియు అర్థము. కనుక వేదాంతాతీతము పరిపూర్ణ బ్రహ్మము.

"నైనం ఛిందంతి శస్త్రాణి, నైనందహతి పావకః అను గీతా వచన రీతిగా ఎట్టి ప్రకృతి బేధములచే ఎట్టి వికారములు పొందనిదే పరిపూర్ణము.

---

**35వ పద్యము : సామర్థ్యమేమి జూపదు । కామక్రోధాధికముల గలయదనిశమే । బాములెరుంగదు యితరులు । యేమనినను మారు పల్కదీ బట్ట బైలు ॥ దీనికె మ్రొక్కేరితర జేజేలు ॥ నామ రూప క్రియనటవలన్నియు మీరి । యే మని యవరాక యేకమై యున్నది ॥ యీ బట్ట బైలూ । దీనికె మ్రొక్కేరితర జేజేలు ॥**

**టీక** : సామర్థ్యము = సత్తా కలయదు = కూడియఉండదు, బాములు = కష్టములు, మారుపల్కదు = ప్రతిస్పందించదు, జేజేలు = దేవతలు, నటన = లేనిదే ఉన్నట్లు వ్యవహరించుట, యేకమైయున్నది = ఒక్కటిగానే యున్నది (అద్వయమైయున్నది)

**భావము :** పరిపూర్ణ పరబ్రహ్మము నందు శక్తి సామర్థ్యములు లేవు. కామక్రోధాది వర్గము లేదు. కష్టసుఖములనే ద్వంద్వములు లేనిది. యితరులు దీనిని పూజించిననూ నిరసించినను గుర్తించనిది. సమస్త దేవతలు దీనికే మ్రొక్కిరి. నామరూప కర్మ క్రియా రహితమై। యిట్టిదనే లక్షణము లేనిదై, ఒక్కటిగా మాత్రమే (అద్వయమై) శాశ్వతమై యున్నది.

**విశేష భావము :** "సామర్థమేమి జూపదు" - ఎరుక యందు సత్తాయున్నది। జగత్తును; సృష్టించుట, పోషించుట అను సత్తా కలది యెరుక అదే రసము అమృతము. అట్టి సత్తా ఎంత మాత్రము లేనిది పరిపూర్ణము. కనుక ఇది దేనిని సృష్టించదు. ఇది ఎవ్వరిచేతను సృష్టింపబడదు. స్వతస్సిద్ధము, సనాతనమైనది.

"ఓం" కు అతీతమైనది కనుక త్రిగుణములు లేనిది. కనుక కామక్రోధాధి గుణరహితమైనది కనుకనే యితరులు దీనిని పూజించినను, నిరసించినను ప్రతిస్పందించదు.

నామ రూప క్రియా రహితమైనది, కనుక కష్ట సుఖములు మొదలగు ప్రకృతి వికార ద్వంద్వములు లేనిది " ఏకమై యున్నది" అనగా ఒక్కటిగానే యున్నది. యెరుక యందు రస - బలములు అనే భిన్న లక్షణ ద్వంద్వ పదార్థములు కలదు. అట్టి ద్వంద్వములు లేకుండగా ఒక్కటి మాత్రమైయున్నది. కనుక ఏకం, అధ్వయం అని చెప్పబడును.



**36వ పద్యము : దానము ధర్మము సగుణ । ధ్యానము, ప్రతిమార్చనంబు తజ్జపతీర్థ। స్నానము, లివి ముక్తిదమని । మానవులొనరించబయలు మాటాడదేమి ॥ యెరుకే లేదు, మాటాడేదేమి ॥ ఔను కాదనక నీవనక నేననకొక్క । మేనైన లాగాకమితి మీరి యున్నది॥ మాటాడదేమి । యెరుకే లేదు మాటాడేదేమి ॥**

**టీక :** దానము = ప్రత్యేకమైన కోర్కెతో ఇచ్చుట. (ఈవి) ధర్మము = నిష్కామ్యముగా ఇచ్చుట, సత్ప్రవర్తన, వేదోక్తవిధి న్యాయము.

**భావము :** దానము, సత్ప్రవర్తనము, సగుణ ధ్యానము, విగ్రహారాధన, దైవమును, మంత్ర జపముచే ఉపాసించుట, నియమ వ్రతములో తప్పస్సు చేయుట, పుణ్య

నదులలో స్నానమాచరించుట అను ఈ సప్త విధమోక్షమార్గములు ఆచరించినను, పరిపూర్ణ పరబ్రహ్మములో ఎరుక (ఎరిగే లక్షణము కలది) లేదు కనుక, దానికి యేమియు తెలియదు. ఔను, కాదనక, నీవు నేను అనే ద్వంద్వములు లేనిదై యీ అనేక ఉపాధులతోయే ఒక్క ఉపాధియు (అనగా అవిద్యోపాధి గాని మాయోపాధిగాని) తాను కాక, ఈ ఉపాధులకన్నిటికి మితిమీరి ఉన్నదే పరిపూర్ణము.

**విశేష భావము** : దానము = ప్రత్యే కోర్కెతో, ప్రత్యేక వస్తువును ప్రత్యేక స్థానము నందు పాత్రత యెరిగిఇచ్చుట. ధర్మము = అట్టి లక్షణములు ఏమియు లేకుండగ పాత్రతతో నిమిత్తము లేకుండ ఇచ్చుట మరియు సత్ప్రవర్తనము కలిగియుండుట. దానము దేశ కాల వస్తు నిమిత్తములు కలదై శాస్త్రోక్తనిర్ణయములతో కామ్యార్థిపై ఇచ్చుట. ధర్మము అనగా ఆ లక్షణములతో నిమిత్తములేకుండా, అడిగిన వానికి అడిగిన వస్తువును నిష్కామ్యముగా ఇచ్చుట.

"సప్తైతే మోక్షదాయికా" శాస్త్ర వచనము 1) దానము, 2) ధర్మము, 3) సగుణ ధ్యానము అనగా సాత్విక గుణము కలిగి న్యాయబద్ధమైన జీవితము గడుపుట, 4) ప్రతిమార్చనము = విగ్రహారాధనము, 5) జపము - ఏదో ఒక దైవమును మంత్ర జపముచే ఉపాసించుట, 6) తపము - నియమ వ్రతముతో తపస్సు చేయుట, 7) తీర్థస్నానము = పుణ్య నదులలో, కాల విశేషముననుసరించి స్నానము చేయుట. ఈ ఏడు మోక్ష ప్రదములని శాస్త్ర విహితము. ఇట్టి సప్త విధి మోక్షమార్గములకు అతీతమైనది పరిపూర్ణ పరబ్రహ్మము. కనుక జన్మరహితమైన మోక్షము కానేరదు.



**37వ పద్యము : ఇంతితని యవరానిది । వింతలు శాయనిది, యెన్ని విధముల గనివన్ । చింత లెరుంగనిదీ బయ । లెంతని వినిపింతు, నే నీ కేమీ ర పృథుకా ॥ తెల్పుట వినుట మిక పెద్దకథకా ॥ సంతత మొక రీతి సకల దేశముల యం। దంతాట నిండున్న దదిగో పరిపూర్ణ ॥ మేమిర పృథకా । తెల్పుట వినట మిక పెద్ద కథకా ॥**

**టీక** : చింతలు, సంకల్పములు, విచారము, సంతతము = ఎల్లకాలము, పృథుకా = అటుగ్గింజా.

**భావము :** శిష్యా ! పరిపూర్ణ పరబ్రహ్మము యింత అంత అని చెప్పుటకు వీలు లేదు. ఏ విధమైన వింతలు చేయనిది. ఏ విధమైన సంకల్పములు లేనిది. ఇట్టి పరిపూర్ణమును గురించి ఏ విధముగా వినిపించగలను (ఏ విధముగా చెప్పగలను) అలాగున చెప్పుట - వినుట ఒక పెద్ద కథే కదా। సర్వకాల సర్వావస్థల యందు సర్వ దేశముల యందు, వెల్తి లేకుండగా, నిండి యున్నది పరిపూర్ణము. ఓ పృథకా = ఓ అటుగ్గింజా।

**విశేష భావము :** యెరుక "అణో రణీయాన్ మహతో మహీయాన్" అన్నారు. అణువులో అణు స్వరూపమైనది. సమస్త బ్రహ్మాండములు దానియందే మన్నది కనుక మహత్తు కన్నా మహత్తు అయినది ఎరుక. ఇట్టి అణువు, మహత్తు కానిది పరిపూర్ణము. ఎందుచేతననగా ఉపాధి రహితమైనది కనుక. కనుకనే పరిపూర్ణము "సూక్ష్మాత్మ్యూక్షతరం నాస్తి, మహతో మహిత వర్జితం" అన్నారు. రెండవది ఉన్నప్పుడే ఇది చిన్నది. ఇది గొప్పది అనే భేదము ఉండును. పరిపూర్ణము ఇతరమేమియును లేనిది. ఉత్తది అందుకే శృతియును "అనణ్వ, అ స్థూల, మహ్రస్వ, మదీర్ఘ, మజమవ్యయం"। "అరూప్య గుణ వర్ణాభ్యాం। తద్బ్రహ్మే త్యవధారయేత్॥ అని శృతి వచనము.

"తెల్పుట వినుట ఒక పెద్ద కథకా" - కథ, కల్ల, కట్టు కథ, కల ఇవన్నియు ఒక్కటే. లేనిది అని అర్థము. గుణ విశేషములు ఏమియు లేని దానిని గురించి వర్ణించుట, చెప్పుట పెద్ద కథ, కల్పనయే అని అర్థము.

**పృథుకా :** అటుగ్గింజా ! పిల్లవాడా! అని అర్థము. అటుగ్గింజ అనగా - ధాన్యము గింజ బీజము కలిగి మొలకెత్తే లక్షణము కలది అట్టి ధాన్యమును వేయించి, మూడురోకళ్ళచే దంచి పొట్టులేపిన గింజ, అటుగ్గింజ అది తినుటకు రుచిగా కూడా ఉండును. మొలకెత్తే లక్షణము పూర్తిగా నశించినది. ఇక్కడ శిష్యుడు వేదాంత జ్ఞానముచే వేయించబడి, మూడు మంత్రములనే రోకళ్ళచే దంచబడి, గురుసేవ, బోధ ధృడీకరణములనే పొట్టు ఎగురకొట్టబడి (శరీరములే పొట్టు) న వాడు కనుక బీజరహితుడు, జన్మరహితుడు, అంతేకాక అటుగ్గింజవలె రుచికరమైనవాడు అనగా కీర్తివంతుడై పదిమందికి ఆదర్శప్రాయుడు, మంచివాడని పించుకొనును. కనుక శిష్యుని కృష్ణ ప్రభువు పృథుకా (అటుగ్గింజా) అని ప్రేమతో సంబోధించెను.

**38వ పద్యము : ఆకాశాధికభూతా। నీకా, త్మక మగుచు, యెరుక యీ జగమయ్యేన్ । రాకడ పోకడ దీనికి । ప్రాకటముగ దేవిలోనో, బట్టబయలదిరా ॥ కాదని యంటే వట్టి పల్కదిరా ॥ లోకత్రయము తవ లోపల దిరుగగ । జోక తోడుత దాని జోలెరుగనిది యేదో ॥ బట్ట బయలదిరా । కాదని యంటే వట్టి పల్కదిరా ॥**

**టీక :** ఆకాశాధిక భూతానీక = ఆకాశాది పంచభూత సమూహామునకు, ఆత్మకమగుచు = జనని యగుచు (ఆధారమగుచు) ప్రాకటముగా = ప్రసిద్ధముగా, లోకత్రయము = జీవలోకము (భూలోకము) పితృలోకము, (భువర్లోకము), దేవలోకము (సువర్లోకము( అను మూడు లోకములు, జోలి విధము.

**తాత్పర్యము :** శిష్యా! ఆకాశ - వాయు-రగ్ని-జల-పృథ్వులను పంచభూతములకు జనకమైన యెరుకయే, పంచభూతాత్మిక జగత్తు అయినది. ఈ ఆత్మ (ఎరుక) జగత్తులు రెండును రాకడ - పోకడలు దేని యందు జరుగుచున్నదో, అదే పరిపూర్ణ పరబ్రహ్మము. అలా కాదు అంటే అది వట్టిమాటయే అగును. జీవ, పితృ, దేవలోకములను ముల్లోకములతో కూడిన యీ బ్రహ్మాండ రాకపోకలు, పరిపూర్ణమందే యున్నప్పటికి, దాని జోలి ఎంత మాత్రము యెరుగనిది యీ పరిపూర్ణమని తెలిసుకొనుము. ఈ వాక్యము కాదని యంటే అది వట్టిమాటయే అగును. అనగా సంపూర్ణ విచారణ కానేరదు.

**విశేష భావము :** శృ "ఆత్మాన ఆకాశ స్సంభూతః" అనియు "ఆత్మయందునన్ నీక మాకశముదయించె" అని భద్రాద్రి రామ శతకములోను చెప్పబడినది. అనగా ఆకాశాది పంచభూతములు, ఆత్మయందున అనగా తన యందే (ఎరుకయందే) జనించి, ఆకాశం మొదలైన పంచభూత జగత్తు ఏర్పడినది. ఎరుకయే, ఆత్మ। ఏరుకయే పరిణామ జగత్తు అయినది. కనుక ఆత్మ, జగత్తులు రెండునూ ఎరుకయే. యీ ఎరుక జగత్తులతో కూడిన సమస్త బ్రహ్మాండములు । పరిపూర్ణ పరబ్రహ్మములోపలనే రాకపోకలు కల్గియున్నవి. అయినను ఎరుక జగత్తుల సంగతి పరిపూర్ణమునకు ఎంతమాత్రము తెలియదు. పరిపూర్ణములో ఎరుక లేదు (ఎరిగే లక్షణము లేదు) కనుక తనయందే తిరిగుచున్న ఎరుక జగత్తుల సంగతి యెంత మాత్రము యెరుగనిది పరిపూర్ణము.

జోక యనగా = సామ్యము, బాగుగ, జత, జోలి, ఉత్సాహము మొత్తము, స్వరూపము అని అర్థములు కలవు. ఈ పద్యములో "లోకత్రయము తన లోపల దిరుగగ జోక తోడుత దాని జోలెరుగనిది" అన్న జోక పదమునకు పై అర్థములన్నియు వాడుకొనవచ్చును.



**39వ పద్యము : తండోపతండములుగా । దండి ఝషాదికములన్ని, తన లోపల, ను। ద్దండత నుండిన పోయిన । నుండు సముద్రం। బెరుగకుండు నెప్పటికీ ॥ పరిపూర్ణ మిట్లుండు నెప్పటికీ ॥ యెండమావుల రీతి నుండేటి బ్రహ్మాండ । ముండిన పోయిన రెండూ గుర్తెరుగని ॥ దుండూ నెప్పటికీ । పరిపూర్ణమిట్లుండు నెప్పటికీ ॥**

**దండాన్వయం :** తండోపతండోపములుగా, దండి ఝషాదికములన్నీ, తన లోపల నుండిన, పోయినా ఎరుగకుండు (డే) సముద్రంబు ఎప్పటికీ నుండు । ఎండమావుల రీతి నుండేటి బ్రహ్మాండము ఉండినా, పోయినా, రెండూ గుర్తెరుగని పరిపూర్ణము ఎప్పటికి యిట్లు (యిట్లే) యుండు.

**టీక :** ఉద్దండత = గట్టిగ, ఎక్కువగా, తండోపతండములుగ = గుంపులు గుంపులుగా, దండి =గొప్పవైన, ఝషాధికములు = చేపల మొదలగు జలచరములు.

**భావము :** శిష్యా! గుంపులు గుంపులుగా అనేకమైన పెద్ద పెద్ద చేపలు మొదలగు జలచరములు సముద్రములో పుట్టుచు, తిరుగుచు, చచ్చుచున్ననూ, వీని యొక్క ఉనికి సముద్రమునకు ఎంతమాత్రము తెలియకుండగ జలచరములు చనిపోయినప్పటికి సముద్రపు ఎప్పటివలెనే శాశ్వతముగా నుండును. అట్లే యెండమావుల రీతిగ, లేనిదే ఉన్నట్లు తోచుచున్న యీ బ్రహ్మాండము, పరిపూర్ణములోనే తోచబడి, లేకపోయినప్పటికీ, యీ బ్రహ్మాండము యొక్క సంగతి యెంత మాత్రము పరిపూర్ణమునకు తెలియదు. పరిపూర్ణము మాత్రము యెట్టి మార్పులు చెందకుండగ శాశ్వతముగ నుండును.

**విశేష భావము :** సముద్రము వంటిది పరిపూర్ణము. జలచరములవంటివి బ్రహ్మాండపిండాండములు. జలచరములు ఉన్నను, నశించినను సముద్రమునకు ఏమియు తెలియదు. శాశ్వతముగా సముద్రము ఉండును. అట్లే బ్రహ్మాండములు

తనలోపలనే పుట్టి, లేకపోయినప్పటికి వాటి యొక్క సంగతి ఎంతమాత్రము తెలియక పరిపూర్ణము శాశ్వతముగా నుండును అని భావము.

**40వ పద్యము : యెరుకతో వచ్చిన విశ్వము । యెరుకతో జనుగాని నిల్వదీ బయలైతే । యెరుకతో రాదెరుకతా పో। దెరుక తనం దేమి లేదు । యిది నిశ్చయమురా। వుండుటే యీ యెరుకే తానౌర ॥ యెరుక యెరిగిన వస్తు వెరుకని తెలియుము । యెరుక యెరుగదు బయలు నిట్టి దట్టిది యన ॥ నిది నిశ్చయమురా । వుండుంటె యీ యెరుకే తానౌర ॥**

**పద విభాగము :** యెరుకతో వచ్చిన విశ్వము, యెరుకతో జనుగాని నిల్వదు । ఈ బయలైతే యెరుకతో రాదు. యెరుకతోపోదు । యెరుక తనందేమీ లేదు । ఇది నిశ్చయమురా (యీ చెప్పిన మాట నిజమురా) యీ బయలు శాశ్వతమైనదిరా ॥ ఉండుంటే = బయలందు ఎరుక ఉంటే తాను యెరుకే అగురా ।

**భావము :** యెరుక వలన యేర్పడిన జగత్తు, యెరుకతోనే లేకపోవును. కాని పరిపూర్ణము యెరుకతో రాలేదు. కనుక యెరుకతో పోదు. యీ యెరుక పరిపూర్ణములో యెంతమాత్రము లేదు. ఒకవేళ యెరుక పరిపూర్ణములో ఉన్నచో పరిపూర్ణము యెరుక అగును. (అనగా తెలియబడును) యెరుకచే తెలియబఃడిన సమస్తము యెరకయే. యెరుక కాని వస్తువు యెరుకచే గుర్తింపబడదు. యెరుక కానిది, యెరుక లేనిది ఒక్క పరిపూర్ణము మాత్రమే. కనుక యెరుకకు పరిపూర్ణము తెలియదు. పరిపూర్ణమునకు యెరుక తెలియదు. యిది నిశ్చయమైన మాట. పరిపూర్ణము నిశ్చయమైనది. అనగా శాశ్వతమైనది.

**41వ పద్యము : రవితమస మున్న దెరుగునె। ప్రవిమల దావా గ్ని చెదలు బట్టుటెరుగునా । దివమును రాత్త్రిరి, రాత్రిని । దివమెరుగునె, లేమి లక్ష్మీదేవి యెరుగునా ॥ అన్నమును భూదేవి యెరుగునా ॥ భవనాశ స్థితులు రాపాడేటి యెరుకను । భవనాశ స్థితి లేని బయలలెల్లెరు గదు, లక్ష్మీ । దేవి యెరుగునా । అన్నమును భూదేవి యెరుగునా ॥**

**టీక** : రవి = సూర్యుడు, తమసము = చీకటి, రాపాడేటి = రాపాడించుకొనుచు, కలిసియుండును, ప్రవిమల = మలిన రహితమైన, దావాగ్ని = అడవిలో కర్రల యందు పుట్టిన అగ్ని. దివమును = పగలును, రాత్తిరి = రాత్రి యొక్క రూపాంతరము, లేమి = దరిద్రము, భవ = పుట్టుక, నాశ = చావు, స్థితి = ఉండుట = వృద్ధి పొందుట, రాపాడేటి = కలసి ఉండేటి.

**భావము** : సూర్యునకు చీకటి యున్నట్లు తెలియదు. ప్రచండమైన అగ్నిగి చెదలు పట్టుట యెరుగదు. పగలు రాత్రిని, రాత్రి పగలును యెరుగదు. దరిద్రమును లక్ష్మీదేవి యెరుగదు. అన్నమును భూదేవి యెరుగదు. అట్లే సృష్టి స్థితి లయములతో కూడిన యెరుక, సృష్టి స్థితి లయములు లేని పరిపూర్ణమును యెరుగదు.

**విశేష భావము** : భూమి అన్నమును యెరుగదు. అనగా అన్నము - అన్నాదము - రెండును ఒక్కటే. అన్నాదము అనగా అన్నము - అన్నమును ఇచ్చునది ఓషదులు అని అర్థము. భూమి పైనే ఓషధులు పెరుగుచు, గిట్టుచున్నా, ఓషధులను భూమి యెరుగదు అని భావము.



**42వ పద్యము : యెరుకైన భూత పంచక । మెరుకకు చరణములు, కటియు, హృదయము, గళమున్ । శిరమును నయ్యేను క్రమమున । ధరణి మొదల్ జేసియిట్లు తనయా గుర్తెరుగు ॥ గగనము బయలంచన రాదీ మరుగూ ॥ యెరుగాకా కాశమె పరిపూర్ణమనుచు । కొందరు బల్కిరిది విని, గురి దప్పి యుండే వూ॥ తనయా గుర్తెరుగూ । గగనము బయలంచన రాదీ మరుగూ ॥**

**అవతారిక** : బయలు = ఆకాశము అని అర్థము కలదు. కాని ఆకాశము బయలు రెండును వేరైనవి. అని ఈ పద్యములో చెప్పుచున్నారు. బయలు ఆకాశమునకు వ్యతిరిక్తమైనది. ఈ పద్యములో పరిపూర్ణము అని భావము. అల్పబుద్ధులకు బయలాకసములు రెండును ఒక్కటే అని అందురనియు, కాని ఆకాశము పరిపూర్ణము ఒక్కటి కాదని గుర్తించవలసినదిగా ఈ పద్యములో నిరూపించుచున్నారు.

**భావము** : యెరుక వలననే యేర్పడిన పంచభూతములు, ఆ యెరుకకు అనగా ఈశ్వరాత్మకు పృథ్వి - పాదములుగను, జలము కటి ప్రదేశముగను, అగ్ని =

హృదయము గను, వాయువు కంఠ భాగముగను, ఆకాశము శిరస్సుగను యేర్పడినది. ఆకాశము ఈశ్వరాత్మకు (ఎరుకకు) ఒక అవయముగా ఏర్పడినది. కనుక ఆకాశము పరిపూర్ణమనరాదు. ఈ మరుగు (ఈ రహస్యము) యెరుగక కొందరు ఆకాశము పరిపూర్ణమనుచు చెప్పుచున్నారు. అది విని పొరపాటు పడెదవేమో? తనయా (శిష్యా) ఆకాశము పరపూర్ణము కాదని యెరుగుము. (ఈ పద్యములో గగనము బయలంచన రాదీమరుగు ఎరుగక" అన్న వాక్యమును" గగనము బయలంచనరాదు. ఈ మరుగు యెరుగక ఆకాశమె" అని సంధి విడదీసి చదువుకొనవలెను.

**విశేష భావము** : నీ - నా మధ్య ఉన్న కాళీ (ఆకాశము) అంతటా నిండియున్న ఆకాశము మూడు రకములు.

**1) భూతాకాశము** : ఇది పంచభూతములలో ఒకటైనది శబ్ధగుణము కలది. నలుపురంగు, చీకటి వెలుతురుతో నిండియున్నది అవకాశ రూపము.

**2) మహాకాశము** : భూతాకాశము బ్రహ్మము కాదని తెలిసి బుద్ధి బలముచే ఇది లేనిదని తీసివేసినచో, ఇక ఉన్నది మహాకాశము. ఇదియును అవకాశ రూపమే. ఇదియే పరమాత్మ, మూల ప్రకృతి అవ్యక్తము "నేనునే" బ్రహ్మము. ఇచ్చట ఓం అను శబ్దము, నిశ్శబ్ద రూపముగా ఉన్నది. చీకటి వెలుతురు గానిది రస - బల సమన్వితము, సత్తా ప్రధానమైనది ద్వంద్వ సహితమై యేక రూపముగానున్నది. దీనినే శివరామదీక్షితుల వారు యెరుక అని "మూలములేని గుర్తెరిగే శరీరము" అని వ్యవహరించి, ఇది కలవలె లేక తోచబడినది అని నిర్వచించిరి. ఇదియును లేనిదే అని తీసి వేసినచో, ఇక ఉన్నది పరాకాశము.

**3) పరాకాశము** : మహాకాశమునకు అతీతమై అంతటా అనంతమై అవకాశ రూపమై ఎరుక లేనిది ఈ పరాకాశము. ఇదియే పరిపూర్ణము. స్వతఃసిద్ధము. ద్వంద్వ రహితము. ఏకము. సత్తా (సృష్టి చేయు) లక్షణము లేనిది. ఇదియును అవకాశ రూపమే. యెదురుగనున్న అవకాశ రూప భూతాకాశమును చూపి, ఇదియే పరిపూర్ణమనుచు కొందరు చెప్పెదరు. భూతాకాశ, మహాకాశములకు అతీతముగా నున్నది పరిపూర్ణము అనే మరుగు ఎరుగక, అట్లు చెప్పుదురు. కనుక భూతాకాశ, మహాకాశములు కాని పరాకాశమైన పరిపూర్ణము బయలు అని గుర్తించమని పద్యభావము.

**అవతారిక :** పరిపూర్ణము కారణ - కార్యములు కానిది కారణ -కార్యములు రెండునూ ఎరుకే అని **43, 44**వ పద్యములో నిరూపించుచున్నారు.

**43వ పద్యము : విత్తే చెట్టై పుట్టును । విత్తే విత్తనము రీతి వెలయును ధరపై । విత్తుకు చెట్టుకు వేరే । విత్తనమొకటున్నదనిన, వినగూడదోయీ ॥ తనకు దాబట్టును వినవోయీ ॥ విత్తు చెట్టులరెంటి విధమీ భూమెరుగనట్లుత్త । బయలెరుగదు, సత్తు చిత్తుల రెంట్ని ॥ వినగూడ దోయీ । తనకు దా బుట్టును వినవోయీ ॥**

**టీక :** ధరపై = భూమిపై, సత్తు = ఎరుక, చిత్తు = జగత్తు.

**భావము :** శిష్యా! విత్తనమే చెట్టుగను, ఆ విత్తనమే చెట్టు నుండి తిరిగి విత్తనము రీతిగను, యేర్పడుచున్నది. అనగా విత్తనము వలన చెట్టు, చెట్టు వలన విత్తనము యేర్పడుచున్నది. యీ విత్తు చెట్టులకు వేరే మరొక మూలము ఉన్నది అను మాట వినగూడనిది (అనృతము). విత్తు-చెట్టులు రెండునూ అన్యోన్యమైన భావ సంబంధము. తమకు తామే మూలము. విత్తు చెట్టులు రెండును భూమి పైనే ఉన్ననూ, (పుట్టి పెరిగి నశించుచున్నను) భూమి వాటి సంగతియెరుగదు. భూమి కారణ కార్యములు కానిది. అట్లే ఉత్తబట్టబయలైన పరిపూర్ణము సత్తు (ఎరుక) చిత్తు - జగత్తుల రెంటిని ఎంతమాత్రము ఎరుగదు. కారణము కాదని తెలియుము.

**విశేష భావము :** విత్తనము - సూక్ష్మరూపము, చెట్టు - స్థూల రూపము. రెండును ఒక్కటే కాని రెండు కాదు అని సూక్ష్మ బుద్ధిచే ఎరుగవలెను. చెట్టు వంటిది - జగత్తు, విత్తనము వంటిది - అఖండ యెరుక (మూలప్రకృతి). సత్తు అనగా యెరుక, చిత్తు అనగా జగత్తు. యెరుకయే, యెరుక - జగత్తులుగా రూపొందుచున్నవి. యీ రెంటికి మూలము తమకు తామే. మరొక మూలము ఏమియు లేదు. చెట్టు విత్తనముల సంగతి భూమికి ఎంతమాత్రము తెలియదు. మూలము కాదు. అట్లే యెరుక - జగత్తులు (సత్తు - చిత్తు) రెంటికి పరిపూర్ణము ఎంతమాత్రము కారణము కాదు. వాటి సంగతి పరిపూర్ణమునకు ఎంత మాత్రము తెలియదు అని భావము.

---

**44వ పద్యము : చెట్టే మూలము విత్తుకు । చెట్టుకు మూలంబువిత్తు, క్షితిపై రెండున్ । పుట్టిన చచ్చిన రెంటిని । గట్టిగ తానెరుగకుండు గదరా యీనేలా ॥ నీవీ రీతి గనుగొన వేలా ॥ పుట్టుచు గిట్టుచు పొలుపొందు తను వెరుక । లిట్టి విచిత్రము లెన్నడెరుగదు బయలు ॥ గదరా యీనేలా । నీవీ రీతి గనుగొనవేలా ॥**

**టీక :** క్షితిపై = భూమిపై, ఘట్టిగ = ధృడముగ, నీవీ రీతి = నీవు ఈ విధముగ, గనుగొనవేలా? = విచారించవు ఎందుచేత? పొలుపొందు = ఒప్పునట్టి.

**పదవిభాగము :** "యీ నేల తానెరుగకుండు గదరా! నీవీ రీతి ఘట్టిగ గనుగొనవేలా"!

**భావము :** శిష్యా! చెట్టుకు మూలము విత్తు "విత్తుకు మూలము చెట్టు. ఒకటిదానికి మరొకటి కారణము. యీ విత్తు చెట్టులు రెండు ఒకదానికి మరొకటి మూలమై తమకు తామే యేర్పడుచున్నవి. యీ విత్తు చెట్టులు రెండును పుట్టిన చచ్చిననూ భూమికి యెంతమాత్రము తెలియదు కదా! అట్లే చావు పుట్టుకలతో ఒప్పుచున్న దేహి దేహముల యొక్క కార్యముల (విచిత్రములు) ఎన్నడూ ఎరుగనిది పరిపూర్ణము అని తెలియుము. అనగా తనువు ఎరుకల సంబంధము పరిపూర్ణమునకు ఎంత మాత్రము లేదని భావము.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతా ౨_ద్వైత రహిత పరమతత్వే
అచల లక్షణాన్నాను - తృతీయోధ్యాయమునకు
భావ - విశేషభావములు
సమాప్తము.

॥ జై గురు ॥

3వ అధ్యాయము

# సంక్షిప్త భావము

పరిపూర్ణ పరబ్రహ్మము చావు పుట్టుకలు లేనిది మరియు చావు పుట్టుకలు గల యెరుక యొక్క జాడ ఎంత మాత్రము తెలియనిది. సర్వత్ర నిండి బిడీకృతమై వెల్తి లేనిదయినందున అచలము. (చలించుటకు అవకాశము లేనిది) ఇట్టి పరిపూర్ణమును ఎరుక లేక సేవించవలెను. అనగా యెరుక యెన్నడు లేనిదే కనుక, లేనిదాని యందు భ్రాంతిని విడుచుటయే - పరిపూర్ణమును సేవించుట అనదగును. పరిపూర్ణ పరబ్రహ్మము ఉపాస్య వస్తువు కాదు. ఈ రహస్యమును అనగా ఎరుక లేక సేవించే విధానమును గురుముఖతా మాత్రమే తెలియవలెను. పరిపూర్ణమును ఎరుక గుర్తించలేదు. ఎరుకచే గుర్తింపబడిన సమస్తము ఎరుక యొక్క రూపమే. కనుక పరిపూర్ణమును ఎరుక ఎరుగదు. ఎరుకను పరిపూర్ణము ఎరుగదు. నామ రూప క్రియా రహితమై అవాఙ్మానస గోచరమై, సర్వవ్యాప్తమై, అచలమై ప్రత్యక్షముగా ప్రసిద్ధమైయున్నదే పరిపూర్ణము. కనుకనే బట్టబయలు అన్నారు. ఎట్టి ప్రకృతి వికారములు చెందనిది. సృష్టి స్థితి నాశములు జేయు సత్తా లేనిది, ద్వంద్వ రహితమైన ఏక వస్తువు. రెండవది దీని యందు లేదు కనుక ఏమని నిర్ణయించుటకు వీలు కానిది. దేశ, కాల, వస్తు, పరిచ్ఛిన్నము కానిది. ఎదుటనేయున్నది తెలియబడదు.

ఎరుక - జగములు ఒకదాని కొకటి మూలము. ఈ రెండింటికి మూలము మరేదియు లేదు. యీ యెరుక జగములకు పరిపూర్ణము మూలము కాదు. ఈ యెరుక జగములు పరిపూర్ణములోనే ఉన్ననూ వీటి సంగతి పరిపూర్ణమునకు తెలియదు. ఇవి పరిపూర్ణములో ఉన్నవి అనరాదు. ఎండమావుల రీతిగా ఉన్నవని చెప్పవలెను. చెట్టు విత్తనము ఒక దానికొకటి మూలమైయున్నది. ఈ రెంటికి మరొక మూలమేమియు లేదు. అట్లే సత్తు (ఎరుక) చిత్తు (జగత్తు)ల రెంటికి ఒకదానికొకటి మూలము. వీటికి పరిపూర్ణము ఎంత మాత్రము మూలము కాదు. కనుక పరిపూర్ణము స్వతః సిద్ధమైనది. ఉన్నది అనే ఒక లక్షణము మాత్రమే కలిగినది. భ్రాంతిరూపమైన యెరుక జగములు లేవని నిశ్చయమైతే ఉన్నది పరిపూర్ణము మాత్రమే. ఇది నిశ్చయమైన మాట.

## (4) యెరుక లక్షణమ్ (20)

**అవతారిక :** యెరుక అనగా ఏదో 45 నుండి 51వ పద్యము వరకు వివరించబడినది.

**45వ పద్యము : యెరుకే దేహేంద్రియములు । యెరుకే వర్ణాశ్రమములు, యెరుకే శృతులున్ । యెరుకే నీవును నేను । యెరుకే సతి సోదరాదులెరుగుము వత్సా । నే దీర్చెద యిదిగో నీ యిచ్చా॥ హరిహరబ్రహ్మాది సురనరగిరి సరి । త్తరుమృగముఖచరాచరములు యెరుకని ॥ యెరుగుము వత్సా । నే దీర్చెద యిదిగో ని యిచ్చా ॥**

**టీక :** హరి = విష్ణువు, హర = శంకరుడు, బ్రహ్మాది = బ్రహ్మమొదలైన, సుర = దేవతలు, నర = మనజాలు, గిరి = పర్వతములు, సరిత్ = నదులు, తరు = చెట్లు, మృగ = జంతువులు, ముఖ= పక్షులు, చర = కదిలేవి, అచర = కదలనివి (సమస్తము) వత్సా = కుమారా, యిచ్చా = కోరిక, వర్ణ = జాతులు, ఆశ్రమ = బ్రహ్మచర్యాది ఆశ్రమములు, శృతులు = వేదములు, నీవును = జగత్తుయు (అవిద్యయును); నేనును=ఆత్మయును (ప్రతిబింబ చైతన్యమును) సతి = భార్య

**భావము :** ఓ ప్రియమైన కుమారా ! యీ శరీరము, ఇంద్రియములు, వర్ణ ఆశ్రమ కుల గోత్ర నామరూపములన్నియు యెరుకే. సతిసోదర బంధువర్గము, యెరుకే పరబ్రహ్మము యెట్టిదో తెలిసికొన కోరికతో నున్నావు కదా ! ఇదిగో నీ కోర్కెతో తీర్చెదను వినుము. బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు మొదలైన సమస్త దేవతలు, మానవులు, పర్వతములు, నదులు, చెట్లు జంతువుల, పక్షులు ఇంకా ఇతరమైన కదిలేవి, కదలనివి సమస్తము యెరుకే అని తెలియుము.

**విశేష భావము :** "యత్ర అన్యత్ శృణోతి, అన్యత్ పశ్యతి, అన్యత్ విజానీతి తదల్పం" అనుశృతి రీత్యా ఎంతవరకు చూడగలవో, వినగలవో, యెంత వరకు తెలుసుకొనగలవో ఆ సమస్తము అల్పమైనది, అనగా నశించే ఎరుకయే. బ్రహ్మము కానేరదు. అని నిర్ణయము. "నీవును, నేనును" ఎరుకయే అనగా నేను అనగా అవిద్యా ప్రతిబింబమున్ను నీవు అనగా అవిద్య లేక అంతఃకరణ ఈ రెండును ఎరుకయే కాని ఇందులో ఏ ఒక్కటి బ్రహ్మము కాదని నిష్కర్షగా చెప్పడమైనది.

**46వ పద్యము : యెరుకే ౨ విద్యా విద్యలు । యెరుకే ప్రణవంబు నాద మెరుకే కళయున్ । యెరుకే బిందువు, చిత్స । త్తెరుకే ఆనందమివినీ, వెరుగు సద్బుద్దీ ॥ నీ వా మాట లెరుకే నిబద్దీ ॥ యెరుకే నిర్గుణా సగుణాలెరుకే, యెరుకకు । యెంత యెరుకో వేనిది యంత యెరుకాజేసితి, నీవి॥ బ్లెరుగు సద్బుద్దీ ॥ నీ వా మాట లెరుకే నిబద్దీ ॥**

**టీక :** విద్య = జ్ఞానము, అవిద్య = అజ్ఞానము, ప్రణవంబు = ఓంకారము, నాదము= దశవిధనాదములు, బిందువు = భ్రూమధ్యస్థానాంతర్గత చిత్కళ స్థానము, చిత్ = జ్ఞానము, ప్రకాశము, సత్ = ఉన్నది అని తెలియబడేది. సత్తాయిచ్చునది. నీ-నా మాటలు, ఆత్మ జగత్తుల యొక్క సమస్త వ్యాఖ్యాన భాష్యములు, నిబద్దీ = నిజమును (శాశ్వతమును) తెలిసినవాడా !

**భావము :** ఓం మంచి బుద్ధి కలవాడా ! సమస్తమైన విద్యలు, అవిద్య, ఓంకార ప్రణవనాదము కళ, బిందువు, సత్తు చిత్తులు ఆనందము ఇవన్నియు ఎరుకే అని తెలియుము. ఆత్మ-జగత్తుల సంబంధిత సమస్త భాష్యములు ఎరుకే. సగుణరూపము, నిర్గుణ రూపములు రెండును ఎరుకే, ఎరుకకు యెంత యెరుకో అనగా జ్ఞానముచే యెంత వరకు తెలిసికొనగలమో ఆ సమస్తము ఎరుకయే యని, నీకు తెలియజేయుచున్నాను. శాశ్వతమైన దానిని తెలుసుకొనువాడా ! (నిబద్దీ) యీ విషయములు తెలియుము.

**విశేష భావము :** విద్యయనగా జ్ఞానము, సమస్త శాస్త్రాదులు అని కూడా అర్థము. మరియు షడ్విధవిద్యలు : 1) ఆకర్షణ, 2) స్తంభన, 3) మారణ, 4) విద్వేషణ, 5)ఉచ్చాటన, 6) మోహన. ఇంకా చతుర్దశ (14) విద్యలు, వేదములు, వేదాంగములు, పురాణములు, షట్ శాస్త్రములు ఇత్యాది సమస్తము విద్యయే - (ఎరుకయే). ఇట్టి ఏ విద్య తెలియక పోవుట అవిద్య, అజ్ఞానము అనబడును. మరియు విద్య అనగా బ్రహ్మము అధిష్ఠాన చైతన్యము. అవిద్య అనగా మాయ. ఈ రెండునూ ఎరుకయే. మరియు ఒక్క వాక్యములో యెరుక అనగానేమో ఈ పద్యములో చెప్పిరి". యెరుకకు యెంత యెరుకో నేనది యంత యెరుక జేసితి" అనగా జ్ఞానముచే ఎంత వరకు తెలియబడునో, తెలిసికొనగలవో, అది అంతయు జ్ఞానము యొక్క ప్రతిరూపమే. అనగా తెలియబడే సమస్తము ఎరుకే అని అర్థము. యతో వాచో నివర్తంతే. అప్రాప్యమనసా సహ" నీ వాక్కు బుద్ధికి అందరానిది, భావగమ్యమము కానిది,

వచింపశక్యము కానిది పరిపూర్ణము, తెలిసికొనేది, తెలియబడేది రెండునూ ఎరుకయే. నిబద్ధీ! అనగా నిజమైన వాడు, నిజమైనది పరిపూర్ణము మాత్రమే, అట్టి పరిపూర్ణమును గ్రహించుటయే పరమలక్ష్యమైనవాడు కనుక శిష్యుని "నిబద్ధీ" అని సంబోధించిరి.

**47వ పద్యము : యెరుకే ఇహపర సౌఖ్యము । లెరుకే జ్ఞానంబు జ్ఞేయమెరుకే, మోక్షం । బెరుకే భక్తి విరక్తులు । యెరుకే సంకల్పమవి నీ వెరుగు సత్కీర్తీ ॥ యెక్కడి కౌర యెరుక సంపూర్తీ ॥ యెరుకే జీవుండీశుడెరుకే తదేకత । యెరుకే సర్వము వే గుర్తెరిగి చెప్పిన యీా, కీ॥ లెరుగు సత్కీర్తీ । యెక్కడి కౌర యెరుక సంపూర్తీ ॥**

**టీక :** జ్ఞానంబు = తెలిసికొనేది, జ్ఞేయంబు = తెలియబడునది, సత్కీర్తీ = మంచి కీర్తి కలవాడా! తదేకత = వారి ఐక్యత.

**భావము :** ఓ మంచి కీర్తికలవాడా! ఇహపరసౌఖ్యములు, జ్ఞాన జ్ఞేయము, మోక్షము, భక్తి వైరాగ్యము, సంకల్పము, ఇవన్నియు, యెరుకే అని తెలియుము. ఇలా చెప్పుచూ ఉంటే యెరుక ఎక్కడికి పూర్తవుతుందీ ? అంతయూ యెరుకే. పిండాండ చైతన్యమైన జీవుడు, బ్రహ్మాండ చైతన్యమైన ఈశ్వరుడు, ఈ రెండునూ ఎరుకయే మరియు జీవ - శివ ఐక్యతయూ యెరుకే. ఇదంతయు నేను గురుముఖతా తెలుసుకొని, నీకు చెప్పుచున్నాను. ఈ రహస్యమును బాగుగ తెలిసికొనుము.

**విశేష భావము :** ఇహ పరలోక సుఖములు అనుభవిస్తే నశించి పోయేవే, కనుక యెరుకయే "యదృశ్యం తన్నశ్యం" అన్నట్లుగా కనుపించునదంతయు నశించునదే. కనిపించుట అనగా కేవలము, నేత్రములుకనే కాక, పంచతన్మాత్రరూపముగా శబ్ద స్పర్శరూప రస గంధ రూపముగను, బుద్ధికి జ్ఞాన రూపముగను తెలియబడు సమస్తము కనుపించునది అని అర్థము. ఈ సమస్తము నశించునదే, ఎరుకయే. మోక్షము అనగా ఇచ్చి పుచ్చుకొనేది కాదు. మోక్షము నందాసక్తి ఎరుకయే.

"అవిద్యోపాధికో జీవః మాయోపాధిక ఈశ్వరః ! మాయా విద్య గుణాతీతం, ఇతి వేదాంతడిండిమః" ॥ కనుక జీవ - శివులు ఇద్దరును ఎరుకయే. ఈ జీవ శివులకు పరమైనదే పరిపూర్ణ పరబ్రహ్మము.

**48వ పద్యము : చింతల తోటవ వెరుకే । వింతల పుట్టిల్లవంగ వెలసివ దెరుకే । తంతుల పేటవ వెరుకే । పంతములకు చూడ మూల బలమన్నదెరుకే ॥ జగజ్జనవ స్థలమన్నదెరుకే ॥ భ్రాంతులకెల్లను, పట్టణ మనజెల్లి । కాంతాది రూపులు గన్పించుటకు మూల, ॥ బలమన్నదెరుకే । జగజ్జనవ స్థల మన్నదెరుకే ॥**

**టీక :** చింత = ఆలోచన, దుఃఖము, వింతలు = అన్యము, ఆశ్చర్యములు, అనంగ= అని చెప్పదగిన, తంతుల పేట = మెట్లపై నున్న స్థానము, పంతము = జగడము; మూలబలము = ఆధారమైన సత్తా, భ్రాంతులు = కోరికలు, మిధ్యా జ్ఞానము, పట్టణము = ప్రదాన నగరము.

**భావము :** సంకల్పములకు సమస్తదుఃఖములకు నివాస స్థానము ఎరుకయే. సమస్త వింతలు కల్పించుటకు మూలస్థానము ఎరుకయే. ఏడుమెట్లపై నున్న పేట (సహస్రారము) అనునదియు యెరుకే. సిద్ధాంతపూర్వ పక్షాదులతో వాదోపవాదములకు మూలబలమన్నదియు యెరుకే. సమస్తమైన మిధ్యా జ్ఞానము, కోరికలకు మూలమైనది యెరుకే. తనకన్న అన్య విశేష రూపకల్పిత కాంతాది రూపములు కల్పించుకొని, అనేక భ్రాంతులకు లోనగుచున్నది యెరుకే అని తెలియుము.

**విశేష భావము :** "తంతులపేట" తంతులు అనగా మెట్లు అని అర్థము. కనకు మెట్లపై నున్న పేట. అనగా ఆధారాధి షట్చ్రకములు మెట్లు. ఈ మెట్ల పై నున్న సహస్రారమునకు అర్థము. అనగా సహస్రార చైతన్యమైన నేను, ఆత్మకూడా ఎరుకే అని అర్థముగా ఈ పద ప్రయోగము చేసిరి.

---

**49వ పద్యము : అన్నియు తానై తన కవి । పన్నుగ వేరనుచు నోట బలుకుచు, మరితా । నన్నిటి వెరిగే యెరుకై । యున్నాని, యెరుకకెరుకే మోహింపుచుండూ ॥ తనలో తానే మోహింపుచుండూ ॥ యెన్నో విచిత్రాలీయెరుక శాతలు వింటే । వున్నాది లేదు లేకున్నాది కలదని ॥ వూహింపుచుండూ ॥ తనలో తానే మోహింపుచుండూ॥**

**టీక :** శాతలు = చేతల యొక్క రూపాంతరము = పనులు.

**భావము :** శిష్యా! ఈ సమస్త జగత్తు తననుంచే (యెరుకనుంచే) అయినది. అయినను తాను బ్రహ్మనని, జగత్తంతయు, తనకన్న భిన్నమైన మిధ్యా స్వరూపమని యంటూ,

తాను సమస్తమును తెలిసికొనే జ్ఞాన స్వరూపమై (బ్రహ్మమై) యున్నాని తనకు తానే ఊహించుకొనుచు, తాను శాశ్వతమనియు, సమస్త జగత్తు మిథ్యా స్వరూపమని, మోహము చెందుచుండును. ఈ విధముగా యెరుక యొక్క పనులు విచారిస్తే ఎంతో విచిత్రముగా నుండును. శాశ్వతముగా ఉన్న బ్రహ్మము (పరిపూర్ణమును) లేదనియు, లేని తనను (ఎరుకను) శాశ్వతమనియు తనకు తానే ఊహించుచుండును.

**విశేష భావము :** ఎరుక తనకు తానే ఊహించుకొని మోహించుకొనే మిథ్యా జ్ఞాన స్వరూపమైనందున, శాస్త్రాదుల వలన కాక, గురుముఖతా మాత్రమే బ్రహ్మమును (పరిపూర్ణమును) గుర్తించవలెనని పెద్దలు చెప్పుచున్నారు.



**50వ పద్యము : వినుమూర్ణనాభి తాబు । ట్టిన మీదట సృజన జేయు దినము హరించున్ । ఘనమగు పట శతకోట్లను । తన లోపలి దారమునను, తానట్టైచనునూ॥ అట్లనె యెరుక తాబుట్టి కనునూ ॥ పని బూని బ్రహ్మాండ భాండానంతములను క్షణములోపల ద్రుంచి కనకరాక వేవేగ ॥ తానట్టైచమనూ అట్లనె యెరుక తాబుట్టీ కనునూ॥**

**దండాన్వయము :** వినుము, ఊర్ణనాభి తాబుట్టిన మీదట, తనలోపలి దారమునను ఘనమగు పట శతకోట్లను సృజన చేయు(చు) దినము హరించున్, తానట్టే చనునూ । అట్లనే యెరుక తా బుట్టి, పనిబూని, బ్రహ్మాండ భాండానంతములాను కనునూ ॥ క్షణములోపల ద్రుంచి, కనరాక వేవేగ తానట్టై చనుమా ॥

**టీక :** ఊర్ణనాభి = సాలెపురుగు, పట్టుపురుగు.

**భావము :** శిష్యా! సాలె పురుగు (లేక పట్టుపురుగు) తాను పుట్టి, తనలోపలి జిగురు పదార్థముచే అనేకదారములుగా చేసి గూడు అల్లుకొని దినమంతయు గడిపి వేయును. చివరకు ఆ గూడులో తానే లేకపోవును. అట్లనే యెరుక తనకు తా యేర్పడి తన లోపలి మాయా సత్తా చేతనే అనేక విధములైన జగత్తును తాను తయారు చేసుకొని, చివరకు ఒక్క క్షణములో బ్రహ్మాండమునంతటిని (జగత్తునంతను) నశింపజేసి తాను లేకపోవును. అనగా సమస్తము తన నుండే ఏర్పరచుకొని, తిరిగి తన

యందేలయింపజేసుకొని చివరకు తానే లేకపోవును.

**విశేష భావము :** "సోకామయతా । బహుస్యాం ప్రజాయతే"। అను శృతి వచనానుసారముగా, యెరుక ఒంటిరిగా ఉండలేక, తాను అనేకముగా అవాలి అనుకోరికతో, నిమిత్త, ఉపాదాన కారణములు రెండును తానే అయి చిత్ర విచిత్ర జగత్తంతయు (పిండ బ్రహ్మాండములన్నియు) తయారు చేసుకొనుచున్నది. చివరకు ఈ సమస్త జగుత్త తన యందే లయమగుచున్నది. చివరకు తానే లేకపోవుచున్నది. "దినము హరించున్" అనగా ఈ విధముగా సృష్టి స్థితి లయ కార్యక్రమములతో తన జీవితమంతయు గడుపుకొనుచు, చివరకు లేకపోవుచున్నది అని భావము.

---

**51వ పద్యము : తలిదండ్రులు జీవేశులు । యిల వ్యోమము లేను మేను లెరుక మరుపులున్ । కల మేల్కొలు శుక్లాశ్రం । బులు, నీ రాన్నములు ప్రకృతి పురుషు । డాల్మగడూ ॥ గానై యెరుక కెరుకే కానబడూ ॥ తెలసీ బయలువ్నాది దెలసీ యీా తెలివినీ । తెలివి చేతనె బట్టి తీసివెయ్యుము ॥ ప్రకృతి పురుషు డాల్మగడూ । గానై యెరుక కెరుకే కానబడూ ॥**

**దండాన్వయము :** ప్రకృతి పురుషుడు, ఆలుమగలు గానై యెరుక యెరుకే కానబడు (అని) తెలసి, బయలున్నది (అని) తెలసీ, యీ తెలివిని తెలివిచేతనే పట్టి తీసివేయుము ॥ యీ బ్రాకెట్టులో "అని" పదములు అన్యాపదేశము. (అర్థ సమన్వయముకొరకు తెచ్చుకొనే పదము).

**టీక :** యిల = భూమి, వ్యోమము = ఆకాశము, ఏను = నేను, శుక్ల = వీర్యము, అశ్రంబు = శ్రోణితము.

**భావము :** తలి-దండ్రి, జీవ - ఈశులు, భూమి - ఆకాశము, నీరు - అన్నము, శుక్ల-శ్రోణితములు, ప్రకృతి - పురుషుడు, ఆలు-మగడు, నేను-మేను, యెరుక - మరుపు, కల - మేల్కొ, యీ విధముగా ఒక్క యెరుకే, ఒకదానికొకటి భిన్న రూపమైన ద్వంద్వరూప జగత్తుగా యెరుకకే తోచుచున్నది. కనుక ఏకరూపమైనది కాదు, ద్వంద్వరూపామైనది అని తెలసి, పరిపూర్ణము మాత్రమే శాశ్వతమైనది అని తెలుసుకొని, (గురుముఖతా గురుకరుణ చేత) ఆ విధముగా తెలుసుకొన్న జ్ఞానమును, (అవిద్యా

ప్రతిబింబ చైతన్యమును) జ్ఞానముచేతనే (శుద్ధ సత్వ గుణ జనిత జ్ఞానము చేతనే) లేదని తీసివేయుము. (ఈ రహ్యాము గురుముఖతా బాగుగా గుర్తించవలసియున్నది) ఇంతకన్న వ్రాతపూర్వకముగా విశదపరచలేను.

**విశేష భావము :** భ్రూమధ్య స్థానమున తన స్వరూపమును బహుప్రయత్నము చేసి చూచినచో అచ్చట తనకు కనిపించే చైతన్యము శుద్ధ సత్వముయొక్క ప్రకాశరూపము అని తెలిసికొనవలెను. దానికి మూలము హృదయస్థానమునందున్న అవిద్యోపాది యందున్న ప్రతిబింబిత చైతన్యము. ఈ చైతన్యమే సత్వగుణము ద్వారా భ్రూమధ్య స్థానమున కనిపించినది ఆ జ్ఞానమును తన మూలమైన హృదయస్థానము నందున్న చైతన్యమును చూచుటకు హృదయస్థానమునకు చేర్చగలిగినచో, (గురు కరుణచే) శుద్ధ సత్వ జ్ఞానము యొక్క దహనశక్తిచే (జ్ఞానాగ్నికనుక) అవిద్య అనే హృదయస్థానమునందున్న ఉపాధి నశించిపోవును. అవిద్య ఉపాధి నశించినచో అందలి ప్రతిబింబ చైతన్యము పోవును. అనగా అవిద్య, అవిద్యా ప్రతిబింబము రెండునూ ఒక్కసారే లేకపోవును. ఇదే "జ్ఞానాగ్ని దగ్ధ సర్వకర్మాణి", అనే శృత్యర్థము. ఈ విధముగా అవిద్య ప్రతిబింబ చైతన్యము ఇవి లేకపోవుటయే ఎరుకలేకపోవుట. ఇట్టి ఎరుక లేకపోయినచో ఉన్నది పరిపూర్ణము మాత్రమే కదా. ఈ విధముగా తప్ప ఎరుకలేకపోయే పద్ధతి మరేదియు లేదని నిర్ద్వంద్వముగా చెప్పడమైనది. ఈ విషయమును శృతి యుక్తి అనుభవములతో గురుముఖతా, గురు కరుణచే నెరుంగవలెను. ఇదే "తెలివిని తెలివిచేతనే బట్టి తీసివేయుము" అన్న వాక్యమునకు అర్థము.

---

**52వ పద్యము : ఒక దేహధారి తనువున । సకలావస్థలు జనించి, చనిన విధమువవ్ । అకలంకమైన బయలులో । ప్రకటంబై లేని యెరుక, బయలుండ జూచీ ॥ తన ముచ్చట పరికించి లేచీ ॥ ఒక కొంత సేపైన వుండేటందుకు లేక । సకలము తన వెంట జనుదేర జను, బట్ట ॥ బయలుండ జూచి । తన ముచ్చట పరికించి లేచీ ॥**

**దండాన్వయము :** అకలంకమైన బయలులో, లేని యెరుక ప్రకటంబై, తన ముచ్చట పరికించి, బయలుండ జూచి, ఒక కొంతసేపైనా వుండేటందుకు లేక, సకలము తన వెంట జనుదేర, లేచి జను ॥

**టీక :** అకళంకమైన = కళంక రహితమైన, జనుదేర = వచ్చినట్లుగా, తీసుకొని ముచ్చట= వృత్తాంతము, ప్రకటంబై = ప్రసిద్ధమై, పరికించి = పరిశీలించి, విచారించి।

**భావము :** ఒక దేహధారి యొక్క శరీరములో, బాల్యయవ్వనాది సకలావస్థలు ఏర్పడి, తుదకు ఏమియు లేకపోయిన (మరణించిన) విధముగా, కళంక రహితమైన పరిపూర్ణ పరబ్రహ్మములో లేనియెరుక ఒకటి తనకు తానుగా ఏర్పడి, పెంపొంది, గురుముఖతా పరిపూర్ణము ఉన్నదని గుర్తించుసరికి, తాను లేనని, మిధ్యాస్వరూపమని తెలుసుకొని, కొంత సేపు కూడా ఉండుటకు స్థానము లేక, తాను తనతో వచ్చిన సమస్త జగత్తుతో లేకుండా పోవును.



**53వ పద్యము : మేలుక సుషుప్తి లోపల । వేలీలం తనకు దాను యేతెంచునో, గు। ర్తాలీల బయలు లోపల । వాలాయము తన కు దానె వచ్చునో యున్నా ॥ వొచ్చిహెచ్చి వచ్చునో యన్నా ॥ యీలోపలనే బట్ట బయలున్నా దెరిగితే । యేలోకమున నిల్వజాల, దెరుగకుంటే ॥ వచ్చునో యన్నా । వొచ్చి హెచ్చి వచ్చునో యన్నా ॥**

**టీక :** సుషుప్తి = గాఢనిద్ర, ఏ లీలన్ = ఏ విధముగా, గుర్తు = ఎరుక, ఆ లీల = ఆ విధముగా, వాలాయముగ = అనివార్యముగ, నిరంతరముగ.

**భావము :** గాఢ నిద్రావస్థ నుండి మేలుక తనంత తానుగా ఏ విధముగా వచ్చునో, అట్లే పరిపూర్ణములో నిరంతరముగ ఎరుక తనకు తానే వచ్చును పోవుచున్నది. అట్టి ఎరుక పుట్టి, పెరిగి చచ్చుచున్నది. ఆ విధముగా చచ్చేలోపలనే బట్టబయలు మాత్రమే శాశ్వతమై యున్నదని ఎరుక తెలుసుకుంటే, ఏ లోకమునందు నిల్వకుండా పూర్తిగా లేకపోవును. ఆ విధముగా పరిపూర్ణ పరబ్రహ్మమును తెలుసుకొనకపోయినచో తిరిగి భూమిపై జన్మకు రాక తప్పదు. ఇట్లు నిరంతరముగా జరుగును.

**విశేష భావము :** యెరుక స్వత స్సిద్ధముగా పరిపూర్ణములో తనకు తానే తోచుచున్నది. పరిపూర్ణము వలన పుట్టలేదు. ఇట్టి యెరుక దేహధారియై పుట్టి పెరిగిచచ్చుచు, అనేక జన్మలు నిరంతరముగా పొందుచున్నది. ఇట్టి అనేక జన్మపరంపరను పొందే యెరుక, పరిపూర్ణము శాశ్వతమై ఉన్నదనియు, తాను మిధ్యాస్వరూపము, లేక ఉన్నట్లు తోచబడేది అని గురుముఖతా గుర్తించి, పరిపూర్ణము యొక్క ఉనికిని గ్రహించినచో

తాను ఎచ్చటను ఏ మాత్రము లేకుండా పోవును. అట్లు పరిపూర్ణమును గుర్తించకపోయినచో ఎన్ని జన్మలకైనను నిరంతరాయముగా పుట్టుచు, చచ్చుచు దుఃఖము అనుభవించుచునే యుండును. ఇంతకన్నా మరొక విధముగా జన్మరాహిత్యము కానేరదు. "నా అన్యః పంథా ద్వితీయకః"



**అవతారిక :** ఎరుకయే కర్త, కారణము, క్రియ అయినది. పరిపూర్ణమునకు కర్తృత్వ, కారణత్వ, క్రియాత్వము లెంతమాత్రము లేదని చెప్పుచున్నాను.

**54వ పద్యము : ఆటాడి యాడకుండును । ఆటాడిన మేను (ని) బొమ్మయాటాదకనే । యాటాడు నెరుకయని యెడి । యాటాడించేటివాడు, యతడేరా కర్తా ॥ అంతటికీ యీ య చలామకర్తా ॥ చేటు పాటులచే వొచ్చు ఫలము। మ్మాటికనుభవించి మరణ జననము లొంద ॥ వతడేరా కర్తా । అంతటికి యీ యచలా మకర్తా ॥**

**దండాన్వయము :** యెరుక యనియెడి మేను, ఆటాడి, ఆడకుండును । ఆటాడిన బొమ్మ, ఆడకనే యాటాడు । ఆటాడించేటి వాడు అతడేరా కర్తా ॥ అంతటిక యీ అచలము అకర్తా ॥

**టీక :** ఆటాడి = సమస్త పనులు చేయుట, ఆడకుండును = ఏనులు చేయకుండును, మేను = యెరిగే శరరము (ఎరుక), బొమ్మ ఆడకనే = స్థూలదేహమైన బొమ్మ కదలకుండగనే, కర్తా = సమస్తమునకు కర్త అయియున్నది; చేటు = పాపము, పాటు = పుణ్యము (కర్మలు)

**భావము :** ఓ శిష్యా! జాగ్రదవస్థలో ఇరువది నాలుగు ఇంద్రియముల చేత యీ యెరుక సమస్త వ్యవహారములు చేయుచున్నది. ఆ యెరుకయే సుషుప్తి అవస్థలో ఏ వ్యవహారములు చేయక నిశ్చలమైయున్నది. ఆ యెరుకయే స్వప్నావస్థలో స్థూల శరీరము కదలకనే సమస్త వ్యవహారములు చేయుచున్నది. ఇట్లు జాగ్రత్త, స్వప్న, సుషుప్తి అవస్థలను పొందుచున్నది ఎరుకయే కాని, పరిపూర్ణమునకు ఎంతమాత్రము సంబంధము లేదు. అట్లే గత జన్మలలో చేసిన పాప పుణ్య కర్మల ఫలితమును ఈ జన్మలో తప్పక అనుభవించి మరణము తిరిగి జన్మము పొందుచున్నది యెరుకయే గాని, పరిపూర్ణ పరబ్రహ్మము ఎంతమాత్రము కర్తకాదు.

**విశేష భావము :** హృదయస్థానము నందున్న జీవుడు అను అవిద్యా చైతన్యము జాగ్రదవస్థలో నేత్రస్థానమున విశ్వుడను పేరుతో ఉండి ఇరువది నాలుగు ఇంద్రియములలో కూడి స్థూల శరీరముతో సమస్త కర్మలు చేయుచున్నది. ఈ అవిద్యకే ఈ పద్యములో "మేను" అను పద ప్రయోగము జరిగినది. అనగా ఎరిగే శరీరము కనుక "మేను" అన్నారు. ఆ యెరుకయే కంఠస్థానమున తైజసుడు అను పేరు కలవాడై సూక్ష్మ శరీరాభిమానియై స్థూలశరీరమైన బొమ్మ కదలకుండగనే సంస్కారవాసనలచే మనో రూపముగా సమస్త కర్మలను చేయుచు స్వాప్నిక జగత్తును నిర్మించుకొనుచున్నాడు. ఆ యెరుకయే హృదయస్థానమునందుండి, ప్రాజ్ఞుడు అను పేరు కలవాడై, ఎట్టి వ్యవహారములు లేకుండగ సుషుప్త్యానందమును పొందుచున్నాడు. ఈ విధముగా ఎరుకయే జాగ్రత్త (సృష్టి) స్వప్న, (స్థితి) సుషుప్తి (లయము) లకు కారణమును, అందలి సమస్త కర్మలను చేయుటకు, అనుభవించుటకు కర్తయైయున్నది. కనుక ఎరుక కర్త కర్మక్రియా రూపము. పరిపూర్ణ పరబ్రహ్మము ఎంతమాత్రము కర్తకాదు. కారణమున్నుకాదు. కర్త, భోక్త ఎరుకయే. ఈ ఎరుకయే శిలా పాషాణాదుల యందు చైతన్యగర్భి (సుషుప్తి అవస్థవలె) తమైన ధాతు జీవులుగను, వృక్షలతాదుల యందు అంతఃచైతన్యము గలదియై మూల జీవులుగను (స్వప్నావస్థలవలె) క్రిమి, కీటక, పశు పక్షి మనుష్యుల యందు బహిశ్చైతన్యము గలదియై (జాగ్రదవస్థవలె చేతన జీవులుగను), ఇన్ని రకరకములుగ నామ, రూప, క్రియా బేధములతో, కర్మకర్తతానే అయి యున్నది యెరుకయే గాని పరిపూర్ణము ఎంతమాత్రము వికారము లేక, శాశ్వతమై యున్నది. కనుక సర్వ కర్మలకు కర్తయై ఎరుకయే చేయుచు, మరణ జననములు పొందుచున్నది. మరణము అనగా లేకపోవుట కాదు, జాగ్రత్త స్వప్నాదుల వలె యెరుకకు ఇది కూడ (మరణము) ఒక అవస్థగా గుర్తించవలెను. పరిపూర్ణమునకు ఎంతమాత్రము కర్తృత్వము లేదు "చేయించేవాడు ఆ పైన ఉన్నాడు, నేను కేవలము పాత్రధారిణి మాత్రమే" అనులోకోక్తిని ఖండించుటకే యీ పద్యము చెప్పబడినది. చేసేది, అనుభవించేది నీవే కాని బ్రహ్మమునకు ఎంత మాత్రము సంబంధము లేదు. పిండాడములో జీవాత్మ, బ్రహ్మాండములో పరమాత్మ (ఈశ్వరుడు) రెండును ఒక్కటే, యెరుకయే. ఈ రెంటిలో ఏదియు బ్రహ్మము కానేరదు.

**55వ పద్యము : దేహమును జూచు కన్నులు । దేహమునకు వేరు లేవి తీరున యెరుకే । కోహం, కస్త్వం, తవదా । సోహం, సోహం, బటంచు చూచు చుండుసుమీ॥ తనకు తానే తోచుచుండు సుమీ ॥ దేహి దేహములనె తెరగున ప్రసరించి । దేహము గానివి, దేహిగా తననుతా ॥ జూచుచుండు సుమీ ॥ తనకు దానె తోచుచుండు సుమీ॥**

**టీక :** కోహం = నేను ఎవరిని? కస్త్వం = నీవెవరవు?, తవ దాసోహం = నేను నీ దాసుడను, సోహం = అతడే నేను, ప్రసరించి - వ్యాపించి.

**భావము :** శిష్యా! నీ శరీరమును చూచే కండ్లు, నీ శరీరమునకు వేరుగాలేవు. కండ్లు కూడా నీ శరీరములో ఒక అవయవమే కదా! అట్లే యీ శరీర మందలి చైతన్యమైన యెరుక, నేనెవరిని? నీవెవరు? నేను నీ యొక్క దాసుడను, నేను నీవే, అని యిలాగున ద్వైత, అద్వైత భావములతో, బేధ భావములతో, తనకు తానే అనేక విధములుగ ఊహించుకొనుచు, తనలో తానే మోహించుకొనుచుండును. యెరుకయే దేహి, దేహములుగ రెండు విధములుగ నున్నదని భావము.

**విశేష భావము :** శరీరమును జూచు కన్నులు, శరీరమునకు వేరైనవి కావు. నేను (ఆత్మచైతన్యము) మేను = స్థూల, సూక్ష్మ కారణ శరీరములు. యీ నేను మేనులు రెండును భిన్న రూపముగనున్ననూ రెండును ఒక్కటే, "మేను" అనగా అవిద్య. "నేను" అనగా అందలి ప్రతిబింబిత చైతన్యము. యీ రెండును అత్యంత భిన్నములైనను గురు విచారణ దృష్టి చేత విచారించినచో నేను మేనులు రెండు ను ఒక్కటియే అనగా రెండును ఎరుక యొక్క రూపములే అని తెలియబడును. బ్రహ్మము వేరుగానే ఉన్నది. యీ విచారణ లేని వారు "నేనెవరిని?" సమస్తమునకు కర్త వేరుగా ఉన్నాడనియు, "నీవెవరు"? - ఆ పరమేశ్వరుని ముందు నీవెంతటి వాడవు? అనియు తవదాసోహం = నీవు సమస్త విశ్వమునకు ప్రభువు, నేను నీ దాసుడను అనియు, "సోహం" - అతడే నేను, అనగా జీలేశ్వరులకు బేధము లేదు. అందు ఉపాధి బేధము మాత్రమే కాని, చైతన్య భేదము లేదు. ఉపాధి లేనిదే కనుక "అతడే నేను" అనే అద్వైత భావము, తన దాసోహం, అనే ద్వైత భావముతోను పూర్ణజ్ఞానము లేక తర్కవితర్కములతో ఎరుకయే అనేక విధములుగా ఊహించుచు, మోహించుచున్నది, యీ సమస్తము యెరుకయే.

**56 అవతారిక :** "గురువు" అనే వ్యక్తికి ఉండవలసిన జ్ఞానము యెట్టిదో తెలియపర్చుచున్నారు.

**56వ పద్యము : పిండ బ్రహ్మాండంబులు । రెండును, యా రెంటిలోని రెండహములు, యీ ! ఖండములు నాల్గుకూడి, య । ఖండంబగు యెరుక రూపు, గనరా మా తండ్రీ॥ యిది దెల్పిన ఘనుడే తలిదండ్రీ ॥ ఖండాఖండములుగ గనుపించే యెరుకనే । దండీ దనెటి యుద్దండుల కలనైన ॥ గనరా మా తండ్రీ । యిది దెల్పిన ఘనుడే తలిదండ్రీ ॥**

**దండాన్వయం :** (అయినా) ఖండ అఖండములుగ గనుపించే యెరుకనె కల, దండీది అనేటి యుద్దండుల గనరా మా తండ్రీ ॥

**టీక :** అహములు = చైతన్యములు, నేనులు, దండిదనేటి = గొప్పది అని చెప్పేటి, యుద్దండులు = గొప్పవారు.

**భావము :** ఓ శిష్యా పిండాండము, బ్రహ్మాండము, పిండాడచైతన్యమైన అహము జీవుడు, బ్రహ్మాండ చైతన్య అహము ఈశ్వరుడు యీ నాలుగు ఖండములు గలిపి అఖండ స్వరూపమైన యెరుక అని తెలిసికొనుము. యీ అఖండ యెరుకను చక్కగా విచారించి తెలిసికొనవలయును యీ అఖండ యెరుక అనేది కల. యీ కల దండిది (గొప్పది) సామాన్యమైన కలగా భావించరాదు. (యీ కల నుండి మేల్కొనుట చాలా దుర్లభము) అని యీ యెరుకనె కల గురించి ఆసాంతము విచారించి చెప్పిన మహానుభావులే, నీకు తలి, తండ్రి, దైవముగా భావించి పూజించి తరించుము.

**విశేష భావము :** యీ జీవశరీరము పిండాండము. సప్తలోక పర్యంతమైన జగత్తు బ్రహ్మాండము, పిండాడమందలి చైతన్యము అవిద్యోపాధియైన జీవుడు, బ్రహ్మాండమందలి చైతన్యము మాయోపాధియైన ఈశ్వరుడు. యీ మొత్తం నాలుగు అఖండ ఎరుక యందే ఏర్పడినవి. కనుక యీ నాలుగు కూడినదే అఖండ యెరుక. మొట్టమొదటగా పరిపూర్ణ పరబ్రహ్మములో లేక తోచిన మిథ్యా స్వరూపము. కనుక యీ పద్యములో దీనిని "కల' అనే పదముతో చెప్పిరి. యీ కల నుండి మేల్కొనుట అనగా కలను విడుచుట, ఎరుకను రహిత పర్చుకొనుట చాలా దుర్లభము. గరుకృపచే మాత్రమే మేల్కొనగలరు. కనుక యీ కల దండిది గొప్పది. అని విచారించి తెలియపర్చి మేల్కొల్పగలిగిన మహానుభావులే గురువని వ్యవహరించవలెను. ఇట్టి గురుకృప కల్గుటకై

వారిని తలిదండ్రి దైవములుగా సేవించి తరించవలెను.

గురుగీతలో - "గూఢా విద్యాజగన్మాయా" అను శ్లోకభావము.

భగవద్గీత - "ఊర్ధ్వమూల మధశ్శాఖా" అనుశ్లోక భావములు సమన్వయము.



**57) అవతారిక :** పరిపూర్ణము మాత్రమే పరబ్రహ్మము శాశ్వతమైనది. ఇది తప్ప మిగిలిన సమస్తము యెరుకయే, లేనిదే మిథ్యా స్వరూపమే అని యీ పద్యములో నిరూపించుచున్నారు.

**57వ పద్యము : పరిపూర్ణమొకటి దక్క; నితరమైన ప్రపంచమెల్ల తగదెలియుము, నీ ! వెరుకేనని మదిలోపల । యెరుకే పరిపూర్ణమెరిగే, దెరుకానెరిగేదీ ॥ యింకొక్కటి, లేదీ రెంట్నెరిగేదీ ॥ యెరుకా పుట్టువు మూల మెరుగానీ దీ యెరుకే । యెరుకా తా బుట్టీనదెరుగ బోయితె, లేంద॥ చెరు కావెరిగేదీ । యింకొక్కటి లేదీరెంట్నెరిగేదీ ॥**

**దండాన్వయము :** నీవు మదిలోపల, పరిపూర్ణ మొకటి దక్క నితరమైన ఎల్ల ప్రపంచము ఎరుకేనని తగదెలియుము. యెరుకే పరిపూర్ణమును ఎరిగేది, యెరుకను యెరిగేదీ. యీ రెంట్నీయెరిగేది యింకొక్కటి లేదు. యెరుక పుట్టువు, మూలము యెరుగనిది యీ యెరుకే। యెరుక తాబుట్టినది. ఎరుగబోయితె లేదంచు ఎరిగేది యీ యెరుకే ॥

**టీక :** ఒకటి దక్క = ఒకటి తప్ప, తగదెలియుము = ధృఢముగా తెలిసికొనము, నిశ్చయముగ తెలిసికొనుము.

**భావము :** శిష్యా ! పరిపూర్ణము ఒక్కటి తప్ప, యితరమైన సమస్తము యెరుకే అని ధృఢముగా తెలిసికొనుము. పరిపూర్ణమును తెలుసుకొనేది, యెరుకను తెలిసికొనేది ఒక్క యెరుకే. యీ రెంటిని తెలుసుకొనే మరొక యెరుక ఏమియు లేదు. ఇట్టి యెరుక తనపుట్టుక, మూలమును యెరుగదు. (కాని గురుకృపచే) తనమూలమును యెరుగబోతే తాను లేనని మిథ్యా స్వరూపమని తెలసి లేకుండా పోయేది ఎరుక మాత్రమే. పరిపూర్ణము శాశ్వతము.

**విశేష భావము :** యెరుక అనగా తెలుసుకొనేది, తెలియబడేది, అనగా జ్ఞానము, జ్ఞేయయము రెండును యెరుకే. పరిపూర్ణమును ఎరిగేది అనగా పరిపూర్ణము శాశ్వతమైనది. తాను మిధ్యాస్వరూపమని యెరిగేది యెరుకయే. బ్రహ్మమునెరిగేది శుద్ధజ్ఞానము అని శాస్త్రవాక్యము. అదియును ఎరుకయే. ఇట్టి యెరుక తాను ఎచ్చట పుట్టెనో యెరుగదు. అట్లే తన మూలమేదియో యెరుగదు. అనగా తన మూలము తానే అనగా అవిద్య, మాయ. ఈ అవిద్యను ప్రతిబింబిత చైతన్యమైన ఎరుక, ఎరుగదు. ఈ ఎరుకతనకు మూలములేదని ఎరుగదు. ఆ విషయము గురుకృపచేత నెరిగినచో ఎరుక లేకుండాపోవును.



**58) అవతారిక :** ఎరుక స్థితిలోని వానికే కర్మలు ఉండును. అందుచే పునర్జన్మ ఉండును. పరిపూర్ణస్థితి వానికి కర్మలుండవు. కనుక అట్టి వానికి పునరావృత్తి లేదని చెప్పుచున్నారు.

**58వ పద్యము : పాపములు, పుణ్యములు భువి । బ్రాపించును యెరుకచాత భ్రమసిన వారిన్ । ప్రాపింప వెరుకవెడసిన । తాపసులను చిత్తమందు, తగదెలుసుకొనుమీ ॥ ఆగామీ బోధను లెస్స వినుమీ ॥ పాపాలలో శుద్ధ స్ఫటిక సన్నిభమైన । ఆపోజ్యోతిని ప్రత్యగాత్మనీ మదిలోన ॥ తగదెలుసుకొనుమీ । ఆగామీ బోధను లెస్స వినుమీ ॥**

**దండాన్వయము :** భువిన్ పాపములు పుణ్యములు ఎరుక చాత భ్రమసిన వారిన్ ప్రాపించును । ఎరుకనెడసిన ప్రాపింపవు । ఎరుకవెడసిన తాపసులను చిత్తమందు తగదెలుసుకొనుము । ఈ ఆగామీ బోధను లెస్సవినుమీ ॥

**టీక :** ప్రాపించుట = పొందుట, సంప్రాప్తమగుట; ఎడసిన = విడచిన, తాపసులు = తపోసంపన్నులు, మహానుభావులు, తగదెలుసుకొనుమీ = దృఢముగ తెలుసుకొనుమీ, ఈ ఆగామీ బోధను = ఈ పరిపూర్ణ బోధను, (ఆగామీ = ముందు) లెస్స=బాగుగ, పాపాలలో అనగా పాపలలో = కనుపాపలయందు; ప్రత్యగాత్మనీ = ప్రత్యగాత్మ అనీ.

**భావము :** యెరుక భ్రమయందున్న వారికి (ఎరుకస్థితిలోనే ఉండేవారికి మాత్రమే) మాత్రమే, పాపపుణ్యములు అనే కర్మలు పొందెదరు. ఎరుకను విడచిన పూర్ణ స్థితి పరులు అట్టి కర్మలను పొందజాలరు. అట్టి మహాత్ముల యొక్క స్థితిని నీవు బాగుగ మనసులో దెలిసికొనుము. (గుర్తించుము) అట్టి స్థితిని పొందుటకు గాను ఈ ముందు చెప్పబోవు (పరిపూర్ణ) బోధను బాగుగ గుర్తించుము. ఇట్టి బోధను తెలుసుకొనకుండగ కనుపాపలో కనుపించే (భ్రూమధ్యస్థానమున) ఆపోజ్యోతిని బ్రహ్మమని భ్రమించెదవేమో? అది నీ జీవచైతన్యము యొక్క ప్రతిబింబరూపమైన ప్రత్యగాత్మయే అని తెలియుము. అది కూడ ఎరుకయే. పరిపూర్ణము కాదని బాగుగ తెలిసికొనుము.

**విశేష భావము :** యెరుక చేత భ్రమసినవారు అనగా నేనే బ్రహ్మను, శరీరము అనాత్మ. శరీరమందలి చైతన్యము బ్రహ్మ అని భావించేవారు. అట్టి వారికి కర్మ నశించక పునరావృత్తికి లోనగుదురు. మనము చేసే సమస్త కర్మలు దేహము నశించినను,క ర్మలు నశించక పునర్జన్మకు కారణమగుచున్నది. ఎందుచేతననగా, చేసిన కర్మలు కారణ శరీరమైన అవిద్యయందే వాసనా (బీజ) రూప కర్మలుగా ఉండును. శరీరము నశించినను, అవిద్యను అనగా ఎరుకను నశింపజేసే పరిపూర్ణ బ్రహ్మమును గుర్తించనందున, అవిద్య నశించక అందున్న కర్మలననుభవించుటకై మరొక జన్మను సంపాదించుకొనుచున్నది. కనుక శరీరమందలి చైతన్యము ఏ స్థానమునందు నీవు చూచుచున్నను అది ఎరుక యొక్క ప్రతిబింబమే అగును. ఆ ప్రతిబింబమే బ్రహ్మమను భావము ఉన్నంత వరకు ఎరుక స్థితిలోనే ఉన్న వారగుదురు. కనుక పరిపూర్ణ బోధదెల్పే మహాత్ములను ఆశ్రయించి బోధను చక్కగా గ్రహించి ఎరుకను రహిత పర్చుకొనవలెను. ఎరుక రహితము కానిదే జన్మరహితము కానేరదు.



**అవతారిక :** ఎరుకకు ఎన్ని పేర్లు కలవో, ఏ ఏ పేరుకు ఎరుకే అని తెలిసికొనవలెనో 59, 60, 61 పద్యములలో చెప్పుచున్నారు.

**59వ పద్యము : యెరుకన్నను మరుపన్నను । యెరుకకు యెరుకన్న, దేహియన, మాయయనవ్ । గురుతవ, సాక్ష్యవ జ్ఞప్త్యవ । స్ఫురణయనవ్, ద్రష్టయనివ, చూడు మొక్కటిగా ॥ యిది లేకుంటే చూడమొక్కటిగా॥ మరిచలా చలముల మర్మమెరిగేటిదన్నా । యెరిగి తాలేవని యెగిరి పొయ్యేటిదన్నా ॥ చూడు మొక్కటిగా। యిది లేకుంటే చూడ మొక్కటిగా ॥**

**పద విభాగము :** "చూడుము ఒక్కటిగా । యిది లేకుంటే చూడము ఒక్కటిగా. అనగా ఇట్టి బోధ లేకుంటే ఒక్కటిగా చూడము.

**భావము :** ఓ శిష్యా! యెరుక, మరుపు, యెరుకకు యెరుక, దేహి, మాయ, గుర్తు, సాక్షి, జ్ఞప్తి, స్ఫురణ ద్రష్ట ఇవన్నియు ఒక్కటే అని తెలియును. అనగా ఎరుక పేర్లే అని తెలియుము. మరియు పరిపూర్ణమెరుకల మర్మమును తెలిసికొనేదనినను, అట్లు తెలిసికొని తానే లేకపోయేటి దన్నా ఎరుకే. ఇట్టి నామములు క్రియలు వేరుగా ఉన్నను, ఇవన్ని ఒక్క ఎరుకకే అని తెలియుము. ఇట్టి పరిపూర్ణ బోధ తెలియనివారు ఇవన్ని ఒక్కటే అని తెలియక, కొన్ని నామములకు బ్రహ్మమని భ్రాంతిచెందుదురు.

**విశేష భావము :** యెరుక అనగా తెలుసుకొనేది. మరుపు అనగా అజ్ఞానము. ఎరుగుట, ఎరుగకుండుట ఈ రెండును ఎరుక పనులే కదా ! మరియు జాగ్రత్త స్వప్నములయందు ఎరుక, సుషుప్తిలో ఎరుగక పోవుటచే మరుపు. ఈ రెండును ఒక్క ఎరుకే. భ్రూమధ్య స్థానమున తన స్వరూపమును ఎరుగుచున్నది. అదే సహస్రారమున ఏమియు ఎరుగుట లేదు. కనుక భ్రూమధ్య స్థానమున తన స్వరూపమును ఎరుగుచున్నది. అదే సహస్రారమున ఏమియు ఎరుగుట లేదు. కనుక భ్రూమధ్య స్థానమున ఎరుక, సహస్రారమున మరుపు అని చెప్పరాదు. అదియును ఎరుక యొక్క లక్షణమే. కనుక ఎరుకే కాని పరిపూర్ణము కాదని చెప్పుచున్నారు.

---

**60వ పద్యము : అనుమానము మదినుంచక । విన మింకను యెరుక పేర్లు వివరించెద, బుద్ధ్యవ చిత్తంబన మానస । మనిన, హంకారమని, నంతఃకరణనినవ్ ॥ సంకల్ప మంచనిన యిచ్ఛనినవ్ ॥ తనని తరులనే తానని గుర్తెరిగేటిదన్నా । తననే కాని తరూల తననూ దెలిసేటి దన్నా ॥ నంతఃకరణనినవ్ । సంకల్ప మంచనిన యిచ్ఛనినవ్॥**

**భావము :** శిష్యా ! యెరుక పేర్లు ఇంకనూ వివరించెదను అనుమానము లేకుండగ వినుము. బుద్ధి, చిత్తము, మనస్సు, అహంకారము, అంతఃకరణ, సంకల్పము, యిచ్ఛ, ఇవన్నియు యెరుక పేర్లే. మరియు తాను ఇతరము అంతా ఒక్కతానే అని తెలిసికొనేదన్నా, తాను ఇతరులు వేరని అనగా తాను చైతన్యము, ఇతరమంతా జడమని తెలిసికొనేది అన్నా ఎరుకయే అని తెలియుము.

**61వ పద్యము : వినుమితరులు యెరుకను సా॥ క్ష్యని పల్కిరి, నేను సాక్షి నహమని నీతో । వినజెప్పితి, వింతియె, వే । రన గూడదు, రెంటి వొక్కటని తెలుసుకోరా॥ మాటల భేదమని కనుక్కోరా ॥ అవరాని వినరాని కనరాని బయలందు । తనకై తానరుదెంచి, తనకై తాజనుమ, సా॥ క్ష్యని తెలుసుకోరా । మాటల భేదమని కనుక్కోరా॥**

**టీక :** అరుదెంచి = వచ్చి, జనుమ = లేకపోవును.

**భావము :** శిష్యా ! ఇతర బోధస్తులు యీ యెరుకను "సాక్షి" అని చెప్పిరి. నేను ఆ సాక్షినే అహమని (నేను) చెప్పితిని. అంతేకాని సాక్షి వేరు, నేను వేరు అనరాదు. రెండునూ ఒక్కటే. మాటల బేధముగా తెలుసుకొనుము. ఏ రకముగా చెప్పుటకు గాని, చూచుటకు గాని, వినుటకు శక్యము గాని పరిపూర్ణ పరబ్రహ్మమునందు, యీ యెరుక తనంత తానుగ యేర్పడి, తనంత తానుగానే లేకపోవును.

**ప్రమాణము :** "యత్రనాన్యత్పశ్యతి, యత్రనాన్యచ్ఛృణోతి; యత్ర నాన్యత్ విజానాతి సభూమ" అని శృతివచనము. యెక్కడ అన్యమును చూడలేమో, అన్యమును, వినలేమో, అన్యమును తెలిసికొనలేమో అదే భూమ (పరిపూర్ణము)

**విశేష భావము :** సాక్షి అనగా అవిద్య యందలి ప్రతిబింబిత చైతన్యము. ఈ చైతన్యము ఎట్టి కారణ కర్తృత్వ కర్మలులేకుండగా సాక్షీ మాత్రముగానే యున్నందున దీనిని "సాక్షి" అని చెప్పిరి. అవిద్యత్రిగుణాత్మకమై సమస్త కర్మలు చేయుచు, సమస్తమును ఎరిగే లక్షణము కలదై యున్నది. అజ్ఞాన దృష్టిలో ఈ అవిద్యను "నేను" అహం అనుకొందురు. జ్ఞాన దృష్టిలో అవిద్యా ప్రతిబింబిత చైతన్యమును "నేను" అహం అని గుర్తించెదరు. అందుకే భద్రాద్రి రామ శతకములో "బుద్ధికి సాక్షియై స్ఫురియింపుచున్నది. అహమనే పదమున కర్థమగును" అని చెప్పిరి. కాని అవిద్య, అందలి సాక్షి చైతన్యము రెండునూ ఒకదానికొకటి కారణము. కారణ కార్యములు అయియున్నవి. కనుక యీ రెండును వేరనరాదు, ఒక్కటే. ఎరుకయే అని యీ పద్యము యొక్క భావము.

---

**అవతారిక :** ఎరుక యొక్క స్వస్థానము హృదయము. అనాహత చక్రము దగ్గర ఉన్నది. ఈ విషయము నారాయణోపనిషత్తులో చెప్పబడినది. ఉపనిషత్తులో ఇదే పరమాత్మ అని చెప్పినట్లు ఉన్నది కాని బ్రహ్మము అయిన పరిపూర్ణము యొక్క ప్రతిబింబము. బింబము యొక్క పేరుతోనే ప్రతిబింబమును కూడా వ్యవహరించెదరు

కనుక శృతులలో బ్రహ్మమనే వ్యవహరించినట్లు తెలియనగును. కనుకనే అట్టి గజిబిజి లేకుండగ హృదయస్థానమందున ప్రతిబింబిత చైతన్యము ఎరుక. ఇది దాని యొక్క స్వస్థానమని యీ పద్యములో నిష్కర్షగా చెప్పిరి.

**62వ పద్యము : వన్నియలైదొక చోటను । పన్నుగ గలసినది హృదయ పద్మం బనుచున్ । యెన్నుదురు జనులు, యెరుకం । దున్నాదని శృతులు బల్కుచున్నావి సుమ్మీ ॥ తెలుసుటే మోక్షమన్నావి సుమ్మీ ॥ వన్నెలన్నియు మీరియున్న వస్తువు జూడ। యెవ్వ డెరుంగక, యెన్నో రీతుల బల్కు ॥ చున్నావి సుమ్మీ ॥ తెలసుటే మోక్షమన్నావి సుమ్మీ ॥**

**దండాన్వయము :** వన్నియు లైదొక చోటను, పన్నుగగలసినది హృదయ పద్మంబు, యెరుక అందున్నాదని శృతులు బల్కుచున్నవి సుమ్మీ అనుచున్ జనులు యెన్నుదురు.

**టీక :** వన్నియలు = రంగులు, పన్నుగ = క్రమముగ, చక్కగ, సుమ్మీ అనుచున్ జనులు యెన్నుదురు.

**భావము :** శిష్యా ! అయిదు రంగులతో కూడిన హృదయపద్మము నందు, యెరుక (పరమాత్మ) ఉన్నదని శృతులు చెప్పుచున్నట్లుగా శాస్త్రజ్ఞులు అనేక రకములుగా వాఖ్యానము చేయుచున్నారు. దానిని తెలుసుకొనుటయే (చూచుటయే) మోక్షమని చెప్పుచున్నారు. యీ రంగులన్నిటిని మీరి (ఏ రంగులేని) శాశ్వతమై ఉన్న పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క ఉనికి ఎంత మాత్రము తెలియక, యీ విధముగా అనేక రీతులు అనేక వాఖ్యానములు చెప్పుచున్నారు.

**విశేష భావము :** హృదయ పద్మము అనాహత చక్రము వద్ద పంచరంగులతో కూడియున్నది. ఇదియే హృత్పుండరీకము. చక్రరాజము ఇది అవిద్య, తత్ప్రతిబింబముతో యున్నది. ఇదియే యెరుక. యెరుక యొక్క స్వస్థానము. యీ ప్రతిబింబిత చైతన్యమే "ఓం" అనే బ్రహ్మమని శ్రీ నారాయణోపనిషత్తు విస్తృతముగా చెప్పినది. ఇదియే సద్గురుమూర్తి. ఇది ప్రతిబింబము కనుక ఎరుకయే కాని బ్రహ్మము కాదు. శాశ్వతమైన పరిపూర్ణ పరబ్రహ్మము నామ, రూప, నటనలు ఏమియు లేక వేరుగానే ఉన్నదనే విషయము యెరుగని శాస్త్రజ్ఞులు శృతి వాక్యములకు ఎన్నో రీతులుగా భిన్నత్వముతో వాఖ్యానించుచున్నారు.

**63 అవతారిక :** అభిదాన - అభిదేయములు (నామము - వస్తువు) యీ రెండును ఒక్కటే కాని రెండు కాదని యీ పద్య భావము.

**63వ పద్యము : చులకని యుక్తిగ నొక్కటి । తెలిపెదవిను, సందియంబు తీరును, దీనన్ । పలుకున గలిగిన యర్థము । పలుకును విడనాడి నిల్వబడు, చోటింకేదీ॥ రెండుగ ఒక్కపలుకే అయినాది॥ తెలియు మీలాగున తెలివి దేహములయ్యె । తెలివె, తనువును బాసి తెలివి స్థిరముగ నిల్వ ॥ బడుచోటింకేదీ । రెండుగ ఒక్క పలుకే అయినాదీ ॥**

**దండాన్వయము :** చులుకని యుక్తిగ నొక్కటి తెలిపెదవిను. దీనన్ సందియంబు తీరును; పలుకున గలిగిన యర్థము, పలుకును విడనాడి నిల్వబడు చోటింకేదీ। ఒక్క పలుకే రెండుగ అయినాది । యీ లాగున తెలియుము । తెలివె, తెలివి - దేహములయ్యె । తనువును బాసి తెలివి స్థిరముగ నిల్వ బడు చోటింకేది ? ॥

**టీక :** చులకని యుక్తిగ = తేలికైన ఉపాయముతో, పలుకు = మాట, అర్థము = వస్తువు; తెలివె = యెరుకయే, తెలివి = జ్ఞానము.

**భావము :** శిష్యా ! తేలికైన యుక్తితో తెలియపరచెదను. వినుము దీనిచే నీ సందేహము తీరగలదు. పలుకు (మాట) ఆ పలుకుకు సంబంధించిన వస్తువు ఈ రెండును ఒక్క పలుకే కదా! అనగా పలుకును విడచి వస్తువు, వస్తువును విడచి పలుకు ఉండదు కదా ! అట్లే ఎరుకయే దేహి, దేహము రెండుగా అయినది. శరీరమును విడచి (ఎరిగే శరీరము) జ్ఞానము (ప్రతిబింబము), జ్ఞానమును విడచి శరీరము ఉండలేవు. కనుక జ్ఞానము శరీరములు రెండు ఒక్క యెరుకయే (జ్ఞానమే) అని తెలియుము.

**విశేష భావము :** అభిదాన - అభిదేయములకు భేదము లేదని శ్రీ శంకరాచార్యుల వారు వాఖ్యానించిరి. అభిదానము అనగా వస్తువు, అభిదేయమనగా పేరు. పేరు - వస్తువు ఒక్కటే అన్నారు. సమస్త బ్రహ్మాండాధిష్ఠానమైన అఖండ ఎరుక "ఓం" కారము నుండే అకారాది క్షకార పర్యంతమైన అక్షర (శబ్ద) ప్రపంచమున్ను, పంచభూతాదిక సమస్త వస్తు ప్రపంచమున్ను ఏర్పడినవి. శబ్ద ప్రపంచమే నామములు పేర్లు. వస్తువు, పేరు ఒక్క స్థానము నుండే ఏర్పడినవి. కనుక అవి రెండును ఒక దానికి మరొకటి వేరు కాదు. అవిద్యను విడచి ప్రతిబింబిత చైతన్యము ఉండనేరదు. ప్రతిబింబిత

చైతన్యము లేనిదే అవిద్య అసలు ఉండనే ఉండదు. కనుక అవిద్య ఎరిగే శరీరము. ఇదే దేహము. ప్రతిబింబ చైతన్యమే - గుర్తు. జ్ఞానము. ఇదే దేహి. కనుక దేహి - దేహములు రెండును ఒక్కటే. ఈ రెండునూ మూలములేనివే. కనుక యెరుక దేహి - దేహములుగానైనది అన్నారు.

కనుకనే మహాకవి కాళిదాసు తమ రఘువంశ కావ్యములో మంగళాచరణ శ్లోకము "వాగర్థా వివసంప్రోక్తౌ! వాగర్థ ప్రతి పత్తయే। జగతః పితరౌవందే। పార్వతీ పరమేశ్వరౌ" అన్నారు. వాగర్థా వివ సంప్రోక్తౌ - వాక్కు - అర్థము, రెండును కలిసి యున్నట్లుగా దీనికే పలుకు - పలుకున గలిగిన అర్థము కృష్ణదేశికేంద్రుల వారు ఈ పద్యములో చెప్పిరి.

---

**అవతారిక** : ఒక్క యెరుకయే సమస్త జగత్తు అయినదని చెప్పుచున్నారు.

**64వ పద్యం : యెరుకైన భూతముల, నీ। వెరుగుము ఆకసము, గాడ్పు, యింగలము, నీ। ళ్ళిరవంద నేలయని, నే। నెరిగిన పద్ధతిని నీకు నెరిగించినాను ॥ ముజ్జగములయ్యేను వీట్లతోనూ॥ పరిపూర్ణమందు కన్పడుచు తమకు తామే। మరికాన రావిట్టి మార్గము కల వీటి ॥ నెరగించి నానూ। ముజ్జగుమలయ్యేను వీట్ల తోనూ॥**

**టీక** : ఆకసము = ఆకాశము, గాడ్పు = వాయువు, యింగలము = అగ్ని, నీళ్ళు = జలము, ఇరవంద - ఇరువు + అంద = స్థానము పొందే అనగా సమస్త జీవులకు ఉండుటకు స్థానమైన అని భావము, నేల = భూమి.

**భావము** : యెరుక నుండియే పంచభూతములైన ఆకాశము, వాయువు, అగ్ని, జలము, నమస్త జీవగణము ఉండే స్థానమైన భూమి అయినవి. యీ పంచభూతములతోనే ముల్లోకములు అయ్యేను (దేవ లోకము, పిత్రులోకము, జీవలోకము) ఈ విషయము నేను తెలిసికొనిన విధముగా నీకు తెలియపర్చినాను. ఇట్టి పంచభూతాత్మిక జగత్తు (బ్రహ్మాండము) ఎరుక యీ రెండును పరిపూర్ణములో ఉన్నట్లు తోచబడును విచారంచినచో వాటికి అవే లేక పోవుచున్నవి. ఇట్టి పద్ధతి గల ఎరుక జగత్తుల గురించి నీకు తెలియపర్చినాను.

**విశేష భావము :** "ఆత్మాన ఆకాశ స్సంభూతః । ఆకాశాద్వాయుః । వాయోరగ్నిః అగ్నేఆపః । ఆపః పృథ్వీ । పథ్వి ఓషధిభ్యః । ఓషధియోరన్నం । అన్నాత్రప్రజాయన్తే" శృతి వచనము. "ఆత్మానః అనగా తన యందే అని అర్థము అనగా ఎరుక యందే ఎరుక యొక్క మాయాశక్తిచే పంచభూతములుతో కూడిన జగత్తు ఏర్పడినది. కనుక ఎరుక వల్ల ఏర్పడిన జగత్తుయు యెరుకయే. రెండు ఒక్క యెరుకయే. యెరుకయే తాను చెడకుండగ తనే సమస్త జగద్రూపముగా అయినది. కనుకనే సమస్త జగత్తుకు ఎరుక నిమిత్త కారణము. ఉపాదాన కారణమున్ను అగుచున్నది. దీనికే శాస్త్రము, "బ్రహ్మ అభిన్ననిమిత్తోపాదాన కారణము" అన్నారు. ఇందలి బ్రహ్మ అధిష్ఠాన బ్రహ్మము అనగా అఖండ ఎరుక అని అర్థము.

ముజ్జగములు = 1) దేవలోకము - (సువర్లోకము, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములు 2) పృతలోకము : భువర్లోకము. 3) జీవలోకము = భూలోకము. వేదాంత విచారణలో మజ్జగములు ముల్లోకములు అంటే ఈ విధముగా చెప్పవలెను. అంతేకాని స్వర్గ మర్త్య పాతాళ లోకలములని చెప్పరాదు.

ఇది శ్రీ మద్భాగతవత కృష్ణ విరచిత
ద్వైతా ౨ ద్వైతరహిత పరమతత్త్వే
యెరుక లక్షణన్నాను.
చతుర్థోధ్యాయః

## చతుర్థోధ్యాయమునకు సంక్షిప్త భావము

యీ అధ్యాయములో యెరుక అనగా ఏదో వివరించిరి. దేహము, ఇంద్రియ, వర్ణ, ఆశ్రమ, కుల, గోత్ర నామ రూపాత్మిక సతి సోదరాది బంధువర్గము, ప్రజావర్గము, సమస్త విత్త వర్గము ఎరుకయే. మరియు హరిహరబ్రహ్మాది సమస్త దేవతలు, సమస్త చరాచర వస్తువులతో కూడిన సమస్త బ్రహ్మాండము యెరుకే అని నిష్కర్షగా చెప్పిరి. చతుష్షష్టి విద్యలు, ప్రణవరూపమైన ఓంకారబ్రహ్మము, నాద, బిందు, కళాది సమస్త త్రిపుటులు, ఆత్మ - అనాత్మలు అధిష్ఠాన చైతన్యము సమస్తము ఎరుకే. జగత్తు - జగదధిష్ఠానము ఎరుకే, జ్ఞానము, జ్ఞానముచే ఎంత వరకు తెలియబడునో, ఆ తెలియబడే సమస్తము ఎరుకయే. నేను - మేనులు, శుక్ల-శ్రోణితములు, సుఖదుఃఖములు, పిండ - బ్రహ్మాండములు జీవ-ఈశులు, ఆత్మ - ప్రత్యగాత్మలు, జీవ - శివఐక్యము సమస్త ద్వంద్వ స్వరూపము ఎరుకయే. ఒక్క వాక్యములో చెప్పవలెనంటే ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మము తప్ప ఇతరమైన సమస్తము ఎరుకయే అని తెలియుము.

ఇంకనూ నిర్గుణ స్వరూపములైన యెరుక అన్నా, మరుపు అన్నా యెరుకకు యెరుక అన్నా (శుద్ధ జ్ఞానము) గుర్తు, సాక్షి, జ్ఞప్తి, స్ఫురణ, ద్రష్ట, సంకల్పము, ఇచ్ఛ, అంతః కరణము, సమస్తమును ఎరిగేటి దనినా, పరిపూర్ణమును ఎరిగేటి దన్నా, ఎరిగి తాలేనని లేక పోయేటి దనినా యెరుకే అని చెప్పిరి.

ఇట్టి యెరుక పరిపూర్ణ పరబ్రహ్మములో (కలవలె) తనకు తానే పరిపూర్ణములో లేకనే వచ్చి అనేక విధములుగా తను చెడకుండగ తానే సృష్టి స్థితి, లయములనే సమస్త కార్యక్రమములు చేయుచున్నది. ఎరుకయే కారణము - కార్యము అయియున్నది. ఈ సృష్టి-స్థితి లయ కార్యక్రమములకు ఎరుకయే కారణము, కాని పరిపూర్ణము ఎంతమాత్రము కారణ - కార్యములు కానేరదు. పరిపూర్ణము కర్తృత్వ - భోక్తృత్వము కానిది.

ఒక్క యెరుకే ద్వంద్వ రూపముగా పేరు - వస్తువు రెండు విభిన్న రూపములుగా ఏర్పడుచున్నవి. ఇట్టి యెరుక ఉన్నట్లు తోచబడే మిధ్యా స్వరూపము. కనుక విచారిస్తే ఏమీ లేదు. ఉన్నది శాశ్వతమైన పరిపూర్ణ పరబ్రహ్మము. ఉన్నది అని తెలిసిన ఎరుకయే లేదు.

# అధ్యాయము-5

# యెరుకోత్పత్తి లక్షణమ్ - 18

**65 అవతారిక :** యెరుక యొక్క ఉత్పత్తి ఎచ్చట అనేది తెలియశక్యము కానిది అనియు, ఎందు చేతననగా దానికి మూలము లేదనియు, మిధ్యా రూపము అనియు ఈ అధ్యాయములో వివరించుచున్నారు.

**65వ పద్యము : యెరుకోత్పత్తిని దెలియగ । సరసిజ గర్భాదులైన చాల రవెడిచో । నరుడెంతవాడు। వాడది । యెరుగదు ననవట్టి మాట । లివి వింతగాక ॥ తప్పదు వాని కిక రాకపోక ॥ అరమర లేక సద్గురుమూర్తి చరణ పం। కరుహ ద్వయార్చన వెరుగని నరుమాట ॥ లివి వింతగాక । తప్పదు వానికిక రాకపోక ।**

**టీక :** సరసిజ గర్భాదులు = విష్ణుమూర్తి మొదలైనవారు, లివివితగాక = ఇవి వింత మాటలు కాక మరింకేమిటి? చరణ = పాద, పంకరుహ = పద్మముల, అరమర = భేధభావము, ద్వయ = జంట (రెండు) అర్చన = పూజ.

**భావము :** శిష్యా! యెరుక యొక్క ఉత్పత్తిని తెలియుటకు, ఆ విష్ణుమూర్తి మొదలగు దేవతలకే సాధ్యము కాదు. అట్టిచో నరుడెంతవాడు. నేను ఎరుగుదునని ఎవరైనా అన్నచో అవి అసత్యపు మాటలేయగనును. అట్లు యెరుక యొక్క పుట్టువు, పలానా చోట నుండి పుట్టినదని చెప్పినచో అట్టి వారికి జనన మరణములు తప్పవు. బేధములేనివాడై సద్గురుమూర్తి పాద పద్మద్వయమును నిత్యము పూజించే వానికి మాత్రమే ఎరుకకు మూలము లేదని తెలియుచున్నది. అలా సద్గురు పూజ యెరుగని వార్కి ఎరుక పుట్టువు యెంత మాత్రము తెలియదు.

**విశేష భావము :** యెరుక (మాయ) స్వయంభు "మూలము లేనిదే తనకు తానే పరిపూర్ణ పరబ్రహ్మములో లేక ఏర్పడినది. ఇట్టి యెరుక మూలము. ఫలానా స్థానము నుండి పుట్టినదిన చెప్పేవారి మాటలు అసత్యము. అట్టి వారికి జననమరణములు తప్పవు.

కాని అశరీర సద్గురు సంప్రదాయక గురుమూర్తి పాద పద్మములు నిత్యము పూజించుకొనుచు, అట్టి గురుమూర్తి కరుణకు పాత్రులగు వారికి, యెరుకకు మూలము

ఏదియు లేదనియు, తనకు తానే స్వయముగా కలవలె లేక తోచినదని తెలియుచున్నది. కనుక ఇది కలవంటిది. కనుక లేనిదని గుర్తించి, శాశ్వతమైనది పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే అనియు, దాని యందు యెరుక లేదనియు తెలిసికొనగల్గుచున్నారు. వీరు నిజమును గ్రహించినవారు.

"అరమరలేక సద్గురు పంకరుహ ద్వయార్చన" - అనగా బేధములేకుండుగ గురు పాద పద్మములను పూజించుట అనగా ఈశ్వరునకు గురువునకు బేధములేదనియు, గురుడు నరుడు కాడనియు ఆ ఈశ్వరుడే, తన యొక్క పుణ్య సంస్కారముచే, తనకు గురుమూర్తిగా అవతిరంచినాడనియు, అని ఈశ్వరుడే తన గురువు అని, బేధ భావము ఎంత మాత్రము లేకుండా వారి పాద పద్మ ద్వయము నిత్యము పూజించిన వారికి మాత్రమే, యెరుక పరిపూర్ణములు యొక్క వస్తునిశ్చయ జ్ఞానము కలుగునని భావము.

---

**66వ పద్యము : లేవెరుక బయలు లోపల। తానెట్లు జనించెనవిన తగవిను, వంధ్యా। సూనుని గతి వియదబ్జ, వి। ధానంబున, యక్ష రాజధాని విధమునన్। రజ్జువు సర్పమైనా విధానమువన్॥ స్థాణు పురుషుని చందాన, మృగ జల। శశి విషాణము స్వప్నానందముగ రాజ॥ ధానీ విధమువన్। రజ్జువు సర్పమైన విధమువన్।**

**టీక** : తగవిను = చక్కగా వినుము, వంధ్యాసూనుని = గొడ్రాలి బిడ్డ, వియదబ్జ= ఆకాశపుష్పము, యక్షరాజధాని = కుబేర నగరము (అలకా పట్టణము), రజ్జువు =త్రాడు, సర్పము = పాము, స్థాణువు = మొద్దు, శశిశిషాణము =కుందేటి కొమ్ము.

**భావము** : శిష్యా ! పరిపూర్ణములో లేని యీ యెరుక యెట్లు ఏర్పడినది- గొడ్రాలి బిడ్డవలె, ఆకాశ పుష్పమువలె, కుబేరనగరము వలె, త్రాడు పాముగా తోచబడినట్లు, కర్ర మొద్దు దొంగ వాని వలె కనుపడినట్లుగ, ఎండమావులలోని నీరు వలె, కుందేటి కొమ్ము వలె, కలలో తోచిన ఆనందము వలె, ఈ విధముగ లేనివి ఉన్నట్లుగా భ్రమ రూపముగా, మిధ్యా రూపముగ, ఉన్నట్లు తోచబడుచున్నదే కాని నిజమునకు పరిపూర్ణములో యెరుక యేకాలమందున లేదు. యెరుకను విచారించినచో లేనే లేదని తెలియబడును.

**విశేష భావము :** "లేనెరుక బయలు లోపల, తానెట్లు జనించెనన" బయలు లోపల లేని ఎరుక, తానెట్లు జనించెను అన" అని దండాన్వయము చేసి కొనినచో అర్థవంతముగ ఉండును.

"అధ్యా రూప అపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే" అన్న శృతి వాక్యానుసారముగా యెరుక ఉన్నది అని చెప్పవలెను. అనగా అధ్యారోపము అనగా - ఉన్న వస్తువు ఒకటి అయితే, అది మరొక వస్తువుగా కనుపడుట. ఉదా॥ తాడందు పాము కనుపడుట, అపవాదము అనగా - అసలు ఆ వస్తువే లేదు. ఏమీ లేనిదే ఉన్నట్లు తోచబడుట, ఉదా ॥ కుందేలు కొమ్ము, గొడ్రాలు బిడ్డ మృగజలములు వలెనని తెలియవలెను. యీ విధముగా ఎరుకను గురు, శాస్త్ర ముఖములుగా ఆ సాంతము విచారించినచో ఉన్నది ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మమే, ఎరుక అసలు లేనేలేదు. అధ్యారోప అపవాద రూపముగా ఉన్నదని భావన అని తెలియబడును. ఈ భావమునే యీ క్రింది పద్యములో కూడా చెప్పుచున్నారు.

---

**67వ పద్యము : లేనెరుకను ఎరుకవి యన । లేనెరుకెట్లాయననవని, లెస్సగ వినుమా । లేని మృగ జలము, వంధ్యా ! సూనులు గలిగుండి, వెదకి చూడాలేనట్లు ॥ యీ లేనెరుక యాడ లేదిట్లూ ॥ స్థాణు పురుషుడు, శశి విషాణము, గగన ప్ర । సూనము, నరుని స్వప్నానందము వెదకి ॥ చూడ, లేనట్లూ। యీ లే నెరుక యాడ లేదిట్లూ ॥**

**టీక :** ఎరుకనియన = విచారించవలెను అని నచో, గలిగుండి = ఉన్నట్లు తెలియబడి, వెదకి చూడ = విచారించి తెలిసికొనగా యాడలేనట్లూ = ఎచ్చటను లేని విధముగా।

**భావము :** శిష్యా యీ లేనెరుకను చక్కగా విచారించవలెను, అనినచో, అది లేనెరుక ఏ విధముగా అగును అనినచో, శిష్యా యీ లేనెరుక యే సమస్తమును యెరిగే యెరుక అనినచో అది లేనిది ఎట్లు అగును అనినచో, యెండమావులను చూచి నీరు ఉన్నది అని అన్నంత మాత్రమున, అచ్చట నీరు లేదని విచారించిన వారికి తెలిసినది. అట్లే గొడ్రాలికి బిడ్డ లేదు అని విచారించిన వారికి యీ విధముగా వాటిని విచారించినచో అవి లేట్లుగానే, యీ లేని యెరుకను గురుముఖతా విచారించినచో ఉన్నట్లు తోచబడుచున్ననూ లేనిదే అని గ్రహించవలెను.

---

**68వ పద్యము : యెరుకోద్భవ యెట్లన్నమ । సరళంబగు వారి కేళ సలిలము భంగిన్ । యెరుకెట్లు పోవునన్నమ । కరిమ్రింగిన వెలగపండు । కరణిగనెరుగూ ॥ తిరిగిరాని కరణింకో టెరుగూ ॥ పరిపూర్ణమున్నాది, యెరుక తానెరిగితే । ఎరుకే మ్రగ్గుమ భస్మాసురుడు మ్రగ్గిన నాటి । కరణి నెరుగూ । తిరిగి రాని కరణింకో టెరుగూ॥**

**టీక :** యెరుకోద్భవము = ఎరుక పుట్టుక, సరళంబగు = ద్రవ పదార్థము, సలిలము = నీరు, నారికేళ = కొబ్బరికాయలోని, కరిమ్రింగిన = ఏనుగు మింగిన, కరణిగ = విధముగ, మ్రగ్గను = లేకపోవును, నాటి కరణి = ఆనాటి విధముగ.

**భావము :** శిష్యా! యెరుక యే విధముగా పుట్టినది అనగా కొబ్బరికాయలోనికి ద్రవరూపమగు నీరు ఏ విధముగా వచ్చినదో (అనగా ఎవరికీ తెలియకుండగనే వచ్చినట్లు) అలాగున యెవరికి తెలియకుండగ తనకు తానే యేర్పడినది. యెరుక యేలా పోవును అనగా - ఏనుగు మ్రింగిన వెలగ పండులోని గుంజు పదార్థము। బయటకు వచ్చిన వెలగ పండులో (భిన్నము కాకపోయననూ) ఆగుంజు పదార్థము లేదు. అది ఏలాహరించబడినదో తెలియుట లేదు. అట్లే యెరుక కూడా లేకపోవును. మూలము లేకుండగ జరుగుచున్నదని భావము. ఇలా లేనట్లు కనబడే యెరుక తిరిగి రాని విధము ఎట్లు అనగా, ఆ యెరుక పరిపూర్ణము ఉన్నదని, తాను యెరిగినచో, భస్మాసురుడు ఆనాడు తనకు తానే నశించిన విధముగా యీ యెరుక తనకు తానే లేకుండ పోవును. ఇంక తిరిగిరాదు, (యీ మరుగు గరుముఖతా చక్కగా గుర్తించవలెను)

---

**69వ పద్యము : సంతోషాసంతోషము । లంతలో గనవచ్చి పిదప నరుగు వేచటికో। వింతయున్నది చూచితె । యింతియె సుమి యెరుక పుట్టు । విక దెల్సుకోరా ॥ సంశయమే ల, యిది నమ్ముకోరా ॥ యెంతని దెలుపుదు యీ దేవ మార్గమం । దంతాటా బహువన్నెలగు పడియగుపడ ॥ విక దెలుసుకోరా । సంశయమేల యి ది నమ్ముకోరా ॥**

**టీక :** దేవమార్గము = (బ్రహ్మాదులచే మహేశ్వరుని యొద్ద నుండి గ్రహించి తెలిపిన పద్ధతి అనగా పరిపూర్ణ బోధ పద్ధతి యందు, పుట్టుక లేని మార్గము.

**భావము :** శిష్యా! ఒక మంచి మాట వినగానే మనకు సంతోషము కలుగును. అంతలోనే చెడు వార్త వినగానే దుఃఖము వెంటనే వచ్చుచున్నది. యీ సంతోష దుఃఖములు అంతలో వచ్చి అంతలోనే లేకపోవుచున్నవి కదా! అట్లే యెరుక యొక్క సంగతి కూడా విచారించుసరికి అంతలోనే లేకపోవుచున్నది. ఈ ఉత్పత్తి నాశములు రెండునూ విచారించినచో బహు విచిత్రముగా ఉన్నది. ఈ పరిపూర్ణ బోధ దేవమార్గము. మృత్యువు లేని మార్గము (తిరిగిరాని). యీ బోధయందు సంశయము లేకుండ నమ్ముము. అంతలో కనుపడి అంతలోనే లేకపోయే యెరుక యందు యెంత మాత్రము భ్రమపడవద్దు.

**70వ పద్యము : రాకడ పోకడ లేకను । యేక స్థితి నుండి నట్టి యీ బయలందున్। రాకడ పోకడ కల్గి, యు । నేకముగ దోచు, లేని యెరుక సుశీలా ॥** ప్రతిమలో లేని **పెరుమాళ్ల లీలా ॥ లేక తోచిన యెరుక లేనే లేదనుచు, నీ । కీకీలు గురునిచే యెరుకైతే, జా। లుళ్లక్కెరుక, సుశీలా ॥** ప్రతిమలో **లేని పెరుమాళ్ళ లీలా ॥**

**టీక :** రాకడ పోకడలు = జనన మరణములు, యేక స్థితి = యెట్టి మార్పులేకుండగ ఒకేవిధముగ, సుశీలా = మంచి ప్రవర్తన గలవాడా ! ప్రతిమలో = విగ్రహమునందు, లేని పెరుమాళ్లు = లేని దేవుని, లీలా = విధము, ఉళ్లక్కి = లేదు. ఈకీలు = ఈ రహస్యము.

**భావము :** మంచి శీలము గల శిష్యా! ఉత్పత్తి నాశము లేకుండగ, సర్వకాలము, ఒకే రీతిగ నుండే పరిపూర్ణ పరబ్రహ్మము నందు, ఉత్పత్తి నాశముతో కూడిన యెరుక అనేక విధములుగా ఉన్నట్లు తోచుచున్నది. అది ఎట్లనగా దేవతా ప్రతిమములమందు చైతన్యము లేకున్ననూ, ఉన్నట్లు భావించి, చూచుచున్న విధముగా అని తెలియుము. అట్లు తోచిన లేని యెరుక ఎంత మాత్రము ఉన్నది కాదని, లేనే లేదని యీ రసహ్యము, సద్గురుమూర్తి కరుణచే నీకు తెలియబడిన వెంటనే యీ లేనెరుక లేకుండా పోవును. (తిరిగి పుట్టదు).

**విశేష భావము :** మార్పు ఉన్న వస్తువు నశించి తీరును. అట్లు ఏ విధముగాను మార్పు లేకుండ, సర్వ కాలములందు ఒకే రీతిక (ఏక స్థితి) ఉండునది నశించదు,

శాశ్వతమైనది. అట్టిది ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే, నశించనిదానికి పుట్టుకయు ఉండదు. స్వతసిద్ధమై ఉన్నది అనవలెను. ఈ పరిపూర్ణము తప్ప ఇతరమంతయు నశించునదే. లేనిది అని తెలియవలెను.

విగ్రహములు తయారు కాబడినవే, అందు నిజమునకు చైతన్యము ఏమియు లేదు. లేని చైతన్యము కల్పింపబడి అనేకమైన ఉత్సవములు జరిపించుచున్నాము. అట్లే లేని యెరుక ఉన్నట్లు తోచబడుచు, అనేకముగ పరిణమించినట్లు, చిత్రవిచిత్ర కార్యక్రములు చేయుచున్నట్లు తోచబడి తుదకు ఏమియు లేకపోవుచున్నది.



**71వ పద్యము : వనిగల్లుదకములోపల । తనకైతా వచ్చి, తనకు తానేగు విధం । బున, పరిపూర్ణము లోపల । తనకై తావచ్చి యెరుక, తనకైతా జనునా ॥ అచలంబున్న దని తానెరిగిననూ ॥ తన లేమి నిజమని తనకే తోచును, తోచి । తన కలిమి మృషగా భావన జేసి నిలువాక । తనకై తా జనుమా ॥ అచలంబున్నదని తా నెరిగిననూ ॥**

**టీక :** వనిగల్లు = నీటిబుడగ, ఉదకము = నీరు, లేమి = లేక పోయినదను, కలిమి = భాగ్యము, కలిగియుండుట.

**భావము :** శిష్యా! వానాకాలములో నీటి యందు బుడగలు ఆ నీటిలో తమకు తామే వచ్చి, కొంతసేపు ఉండి, తనకు తానే లేకపోవును అట్లే యీ తానెరుక, పరిపూర్ణములో తనంతట తానే తోచబడి తనకు తానే లేకపోవును. అనగా యెఋక యొక్క యీ రాకపోకలు తనకు తానుగా యేర్పడినవే కాని పరిపూర్ణము వలన కాదని తెలియవలెను. ఇట్టి యెరుక, పరిపూర్ణ బ్రహ్మము స్వతశ్శిద్ధమై సనాతనమై శాశ్వతమై యున్నదను నిజము గురుకణరుణచే గుర్తించినచో, తాను లేనని తెలసి, తనకు తానే లేకపోవును.

**విశేష భావము :** "తన కలిమి మృషగా భావన జేసి" అనగా పరిపూర్ణ పరబ్రహ్మము ఉన్నదను విషయము తెలియకపూర్వము, తానే జగదధిష్ఠానము కనుక తాను నిత్యము, బ్రహ్మము, తననుంచైన సమస్త జగత్తు నశించిపోయేది అనియు తాను శాశ్వత మని భావించుటయే ఎరుక యొక్క కలిమి. కలిమి అనగా భాగ్యము అని అర్థము ఉన్నది. కాని ఇక్కడ కలిమి అనగా తాను ఉన్నాను, శాశ్వతము అనే భావనయే కలిమి, అట్టి ఉన్నాననే భావము, పోయి మృషగా భావించి అని అర్థము. ఎరుక

గురుముకతా పరిపూర్ణము శాశ్వతమైనది ఉన్నదని తెలుసుకొని తాను మిథ్యా స్వరూపమనే సత్యమును గ్రహించుసరికి, తాను లేనని మృషయని తెలుసుకొని తాను తనంతట తానే లేకపోవును అని భావము.

**72వ పద్యము : పరిపూర్ణములో దోచుచు । యెరుకేచను, తనకు దానే యేర్పడు వినుమీ । తొరటలు తొమ్మిది గలదై । తరి తీపులు నొందుచుండు, తను వనదగుచు॥ అచలంబున్నదని తాలేననుచు॥ మరుగిట్లెరుకకు దెలియ, యెరుకే నిల్వదు। గాని పరిపూర్ణ ముండు దాన్నెరిగేదెట్లిక, గుర్తు ॥ తనువనదగుచు । అచలంబున్నదని తాలేనమచూ॥**

**దండాన్వయము :** పరిపూర్ణములో యెరుకే తనకు దానే తొమ్మిది తొరటలు గలదై తనువనదగుచు, యేర్పడదోచుచు, తరితీపులు నొందుచుండి (తనకుదానే) చను। వినుమీ ॥ అచలంబు ఉన్నదని, తాలేననుచు (యీ) మరుగు ఇట్లు ఎరుకకు దెలియ యెరుకే, నిల్వదు, పరిపూర్ణము ఉండు । కాని ఇక దాన్నెట్లెరిగేది?

**టీక :** తొరటలు = రంధ్రములు, యేర్పడదోచుచు = ఉన్నట్లు తోచుచు, తరితీపులు= నానా బాధలు, బొందుచుండి = పొందుచు, చను = లేకపోవును, మరగు = రహస్యము, గుర్తు = ఎరుక.

**భావము :** శిష్యా! వినుము, యెరుక పరిపూర్ణములో తనకు దానే యేర్పడి, నవ రంధ్రములతో కూడిన శరీర ధారియై నానా యాతనలు పడి, తనకు తాను గానే పోయి తిరిగి వచ్చుచుండును. అట్టి యెరుక, పరిపూర్ణము శాశ్వతమైయున్నదని, తాను లేనని యీ రహస్యము తనకు తెలియగానే తానే లేకపోవును. కాని పరిపూర్ణము మాత్రము శాశ్వతముగా ఉండును. అయినను యెరిగే యెరుక లేకపోయిన వెనుక, పరిపూర్ణమున్నదని గుర్తించుటకు యెవరు ఉన్నారు? గుర్తించేది యెరుకే కనుక, యెరుక లేకపోయిన తరువాత, పరిపూర్ణము ఉన్నదని చెప్పలేరు, అని భావము.

**నవరంధ్రములు :** కండ్లు - 2, చెవులు -2, ముక్కు -1, నోరు 1, లింగము 1, పాయువు 1, బ్రహ్మరంధ్రము 1 (శిరస్సు మీది మాడపట్టు) అని కొందరు, నాభి అని కొందరి అభిప్రాయము.

**73వ పద్యము : తొలుకారు మెఱపుకైవడి । పొలుపుగ నీళ్లందు దోచు బుగ్గల రీతిన్ । అల సూర్యకిరణమందున । గల నీళ్లంబలెనె యెరుక, గనుపించునయా ॥ అంతలో యెచటా గనిపించదయా ॥ కల కాలమొక రీతి గలిగుండ దీ యెరుక । తిలకింప బవలు రాత్తిరి దిరుగు విధమున ॥ గనుపించునయా। అంతలో యెచటా గనుపించదయా ॥**

**టీక :** తొలుకారు = తొలకరి వానా కాలమున, కైవడి = విధముగ, పొలుపుగ=ఒప్పునట్లుగ, అల = ఆ, తిలకింప = విచారించగా.

**భావము :** శిష్యా! తొలకిరి వర్షా కాలములో వచ్చే మెఱుపుల వలెను, నీటి యందు యేర్పడే బుడగల వలెను, సూర్య కిరణమందలి నీళ్లవలెను (తేమ), యీ యెరుక అంతలో కనిపించి, అంతలోనే లేకుండా పోవును. కలకాలము ఒక్క రీతిగా నుండదు. ఆలోచించగా, పగలు తరువాత రాత్రి, రాత్రి తరువాత పగలు తిరుగుచుండిన విధముగా, యీ లేనెరుక ఉన్నట్లు తోచుట (జనించుట) తిరిగి లేకపోవుట జరుగుచున్నది. కనుక మాయా స్వరూపమే కాని యదార్థమైనది కాదు అని భావము.

**విశేష భావము :** జగత్తు అనేక మార్పులు చెందుచుండును. ఒకే రీతిగా ఒక్క క్షణమైనను ఉండదు. కనుకనే "సర్వం" క్షణికం, క్షణికం" అన్నారు. పరిపూర్ణ బ్రహ్మము శాశ్వతమైనది ఎప్పుడును ఎట్టి మార్పులు లేక ఒకే రీతిగా ఉండును, కనుకనే "వికార రహితమేవ ఈశ్వరః" అన్నారు. ఈశ్వర శబ్దమునకు ఇచ్చట బ్రహ్మము అని అర్థము చెప్పవలెను.

యెరుక యందు వికారము (మార్పు, చలనము) కనుపించకపోయినను, వికారము చెందే జగత్తుకు ఎరుక అధిష్ఠానమై కారణమై యున్నది. నిజమునకు జగత్తు జడము. అందు జరిగే మార్పు, చలనము ఎరుక యొక్క (సత్తా చేతనే జరుగుచున్నది. కనుక ఎరుక కారణము, జగత్తు - కార్యము. కారణ-కార్యములు రెండునూ ఒక్కటే కనుక ఎరుక వికార స్వరూపమని భావము.

**74వ పద్యము : కట్టెందు నిప్పులేకనె । కట్టియనొక సమయమందు గనుపడి, బహులగా మిట్టిపడి, తుదకు గనపడ । దట్టి దెసమి యెరుక పుట్టు, వమల విచారా**

**॥ తనకు దానె యరుదెంచెనౌరా ॥ పుట్టుగిట్టులనే నట్టేట నిలచుండి । బట్టబయలు పొడగట్టిన గనుపడ ॥ దమల విచారా । తనకు దానె యరుదెంచె నౌరా ! ॥**

**టీక :** కట్టెందు = కర్రయందు (కట్టె రూపాంతరముకట్టియ) మిట్టిపడి = తృళ్లిపడి (అనగా బహుగా కనుపడి) ఔరా = ఆశ్చర్యవాచకము (ఔరా? ఎంత ఆశ్చర్యము అని భావము)

**భావము :** శిష్యా! కర్రయందు నిప్పుకనబడదు. కాని ఒకప్పుడు అనగా వేసవి కాలములో కర్ర-కర్ర రాపాడబడుట వలన, అందు సూక్ష్మ రూపముగా నున్న అగ్ని బయటపడి, దావాగ్నిగా పెద్దరూపమై ఆకట్టెలనన్నింటిని కాల్చివేసి, తుదకు అగ్ని ఎచ్చటను కనపడదు. యీ యెరుక పుట్టుకకు కూడ అట్టి విధముగానే లేకయేర్పడి, బహుగా విస్తరించి, తుదకేమియు లేకుండా పోవును, తనంత తానుగా యేర్పడిన ఈ యెరుక జనన - మరణములను, నడి సముద్రములో ఉండి, పరిపూర్ణము యొక్కజాడ కనిపెట్టిన వెంటనే ఏమియు లేకుండా పోవున. ఓ మలిన రహితమైన విచారణ గల శిష్యా! తనంత తానుగా యేర్పడిన యీ లేనియెరుక ఎంత ఆశ్చర్యముగా నున్నదో చూడుము. అని భావము.

**విశేష భావము :** కట్టెలో సూక్ష్మరూపముగా నున్న అగ్ని, కట్టె కట్టె రాపిడి వలన బయటడి స్థూలమై, కట్టెలనన్నిటిని కాల్చివేసి తుదకు అగ్ని కూడా లేకపోయినట్లుగా, ఎరుక తనకు దానే వచ్చి అనేకముగా తోచి, తుదకు శ్రీ గురు ముఖతా తన సంగతి విచారించినచో తాను జగత్తుతో సహా సమస్తము ఏ మాత్రము లేకుండగ పోవును. ఈపద్యములో శిష్యుని అమల విచారా! అని సంభోధించిరి. అనగా మలిన రహితమైన విచారణ కలవాడా అని అర్థము, ఆత్మ - జగత్తు, బ్రహ్మ - పరిపూర్ణముల యందు విశేషమైన గురుబుద్ధితో మలినములు లేకుండగ విచారిస్తే ఉన్నది ఉన్నట్లు, లేనిది లేనట్లు తెలిసికొనినవాడు కనుక శిష్యుని "అమల విచారా! అన్నారు ఇట్టి వారు మాత్రమే అధిష్టానము మాయా స్వరూపము, లేనిది అని తెలిసికొనగలరు.

---

**75వ పద్యము: తన మూలము తలిదండ్రులు । తన వలెనె వారు వారి తలిదండ్రులకున్। తన వలెనెగాని యవ్యము । గన జనన స్థానమొకటి, గల దన తరమా ॥ బ్రహ్మాదుల కది తెలియ తరమా ॥ వినుమీ బ్రహ్మాండ జననము నీ - నాయం । దున, నైనదిది గాదని వేరే యింకోటి ॥ గలదన తరమా । బ్రహ్మాదుల కది తెలియదరమా ॥**

**టీక :** అన్యము = ఇతరమైనది. అనగా తలిదండ్రులు కాక మరొకటి జనన, స్థానము = పుట్టినచోటు.

**భావము :** శిష్యా! తనకు మూలము తన తలిదండ్రులు. అట్లే అతని దండ్రులకు మూలము వారి వారి తలిదండ్రులు. ఇంతకన్న వేరుగ అనగా తలిదండ్రులు కాకుండా ఇతరముగా వారి పుట్టుక స్థానము ఉన్నదని చెప్పగలరా? బ్రహ్మాదులైనను చెప్పలేరు. అట్లే యీ బ్రహ్మాండము నీ (అవిద్య), నా (చైతన్యము) మధ్యన అయినది. ఇంతకన్న వేరే సృష్టికి కారణమైన స్థానము మరేదియు లేదు.

**విశేష భావము :** తనకు గాని మరెవరికైన గాని మూలము శ్రోణిత శుక్ర సమ్మేళనము. ఈ రెండు తలి-తండ్రి సంబంధము. ఈ రెండును జీవాత్మ అయిన ఎరుక సత్తాచే శరీరములో తయారగుచున్నవి. అంటే ఎరుకకు మూలము ఎరుకయే గాని, అన్యమైనది ఏదియును లేదు.

ఈ బ్రహ్మాండము నీ - నా యందున నైనది" అనగా బ్రహ్మాండములు అఖండ యెరుకలోని రస-బలముల వల్ల యేర్పడుచున్నవి. రసము అమృతము, ఇదియే ప్రతిబింబ చైతన్యము. బలము మాయా సంబంధము, ఇవి అనేకత్వముతో కూడినది. ఒకానొక బల ప్రధానమైన రసమును మాయ పరివేష్ఠించగా ఏర్పడినదే బ్రహ్మాండము. బలము మాయా సంబంధము కనుక "నీ" అనే వర్ణమును సంకేతముగాను, రసము -బ్రహ్మ సంబంధమైనది కనుక "నేను" అనియు, ఆ నేను అనే పదమునే "నా" అనే వర్ణ సంకేతము చేతను ఈ పద్యములో చెప్పిరి. అనగా నీ-నా మధ్యన అనగా మాయ-ప్రతిబింబచైతన్యముల వలన బ్రహ్మాండము ఏర్పడినది. రెండును ఎరుక రూపమే. ఎరుకకు ఎరుకయే మూలము అని చెప్పిరి.

---

**76వ పద్యము:** **కనరాని దాన్ని శూన్యం । బని యనదగు గాని బయలు ననదగదు సుమీ ॥ కనవచ్చుచున్నదిందులో కనుగొనుటకు యెరుక లేదు, కనుగొనరాదా ॥ యెరుకనె శూన్యమని యనరాదా ॥ కనవచ్చెనా? లేదా? కనుగొంటి లేదని । యనరాదా భయమేమి, యను మానించకు మిదుగొ ॥ కనుగొనరాదా । యెరుకనే శూన్యమని యనరాదా ।**

**టీక :** కనరాని దాన్ని = విచారించినచో ఉండని దానిని.

**భావము :** శిష్యా! విచారిస్తే, కనుపించని దానిని శూన్యమన వచ్చును, కాని పరిపూర్ణ పరబ్రహ్మమును మాత్రము శూన్యమన రాదు. ఎందుచేతననగా విచారించినచో, పరిపూర్ణము శాశ్వతముగా ఉన్నది అని తెలియుచున్నది. అయితే విచారిస్తే పరిపూర్ణములో యెరుక యెంత మాత్రము లేదని తెలియుచున్నది. కనుక యెరుకనే శూన్యము అని అనవలెను. కనుక శిష్యా నే చెప్పిన విధముగా విచారించినచో పరిపూర్ణము శాశ్వతముగా ఉన్నదని తెలియబడినదా? (అని గురుమూర్తి శిష్యుని ప్రశ్నించగా, శిష్యుడు) అవును స్వామీ, కనుగొంటిని, ఉన్నదని నిర్ణయముగా తెలియబడినది. అంత గురుమూర్తి, యింక భయమెందుకు? అనుమానించకు ॥ ఎరుకలేదని, నిశ్చయముగ చెప్పుము. ఇదిగో పరిపూర్ణము విచారించి చూడుము సర్వత్ర ఉన్నది ఇదియే యెరుకయే లేదు. అని గురుమూర్తి చెప్పెను.

**విశేష భావము :** "కనుట" అన్న పదమునకు విచారించుట అని అర్థము చెప్పవలెను. చర్మ చక్షువులకు జగత్తును, జ్ఞాన చక్షువులకు జగదదిష్ఠానము ఉన్నట్లు తెలియపడుచున్నది. కాని విశేషమైన గురుబుద్ధి చేత "గురుబుద్ధిర్విశేషతః" విచారించినచో పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే శాశ్వతముగా ఉన్నదనియు, ములుగ్రుచ్చసందు లేక సర్వవ్యాప్తమై యున్నదనియు, కనుక ఎరుక భ్రమ రూపమే గాని ఎంత మాత్రము లేదనియు ధృడముగా తెలియవలెను.

ఈ భావము మరింతగా ధృడపరచుటకై 77, 78వ పద్యములలో నిరూపించుచున్నారు.



**77వ పద్యము : యెరుక బయలందు లేమివి । యెరుకను శూన్యంబటంచు మెరిగించబడెన్ । యెరుగు మిదె యాకసం, బి । ట్లెరిగితే యెరుకాకసములు, యేకామౌ గదరా ॥ ఆకసము బయలేక మెట్లౌరా ॥ పరిపూర్ణ మిదిగో కప్పడు, శూన్యమనరాదు । యెరిగుండు మెదిరిస్తే యిక వా చెయి జూచేవూ ॥ యేకమౌ గదరా । ఆకసము బయలేక మెట్లౌరా ॥**

**టీక** : లేమిని = లేకపోవుటచే, నాచై జాచేవు = నా చెయ్యి జాచెదవు; (అనగా కొట్టెదను అని భావము) ఎదిరిస్తే = ఎదిరించి మాట్లాడినచో, వ్యతిరేకించినచో, యేకామౌ = ఒకటే అగును.

**భావము** : శిష్యా! యెరుక పరిపూర్ణములో లేదు. కనుక యెరుకయే శూన్యమని తెలియపర్చుచున్నాను. యీ సమస్తము, ఆకాశ అంశము చేతనే తయారైనది. నీలో తెలుసుకొనే జ్ఞాత, తెలివి ఆకాశ అంశమే. కనుక నీలోని తెలివి (జ్ఞానమఉ) నీ చే తెలియబడే సమస్త విశ్వము ఆకాశ స్వరూపమే. అనగా ఎరుకయే, కనుకనే ఎరుక - (జ్ఞానము) ఆకాసము । (జగత్తు) రెండును ఏకమగుచున్నవి. పరిపూర్ణము ఎరుక కాదు, ఆకాసమున్ను కాదు, కనుక ఎరుక (జ్ఞానము) పరిపూర్ణము ఏకము కావు. అనగా పరిపూర్ణము ఎరుగబడుట లేదు. నీలోని ఎరుక పరిపూర్ణములో శూన్యమైపోవుచున్నది. ఈ నా మాటకు ఎదిరించినచో నా చెయ్యి చూస్తావు. (అనగా కొట్టెదను సుమా!) యెరుక పరిపూర్ణమును చూడజాలదు.

**విశేష భావము** : గురుమూర్తి శిష్యునికి పరిపూర్ణము యొక్క పరోక్ష జ్ఞానమును కలిగించుటకై 76, 77, 78 పద్యములు చెప్పబడినవి. ఆకాశ సాత్వికాంశ అర్ధభాగము జ్ఞాత (తెలివి) అయినది. మిగిలిన అంశలు మిగిలిన భూతాంశములతో కూడి సమస్త జగత్తు తయారగుచున్నది. జ్ఞాతచే సమస్తమును తెలిసికొనుచున్నాము. కనుకనే రెండును ఒక్కటే అని నిర్ణయము. మనము ఎంత దూరము జాచిననూ ఏదో జగత్తు (వస్తువు)ను చూడగలము. అనగా మన తెలివి ఎంత దూరమైనను జగత్తుతో ఏకమగును. జగత్తు కాని, ఎదుటనే ఉన్న పరిపూర్ణము। మన జ్ఞానము ఏకము కాకున్నది. అనగా పరిపూర్ణములో ఎరుక లేదని అనుభవ నిర్ణయము. అంతటా ఉన్నది పరిపూర్ణము. పరిపూర్ణములో యెరుక లేదు అంటే, ఎరుక ఎచ్చటను లేదు, కనుకనే యెరుకనే శూన్యమని నిర్ణయము.

ఇట్టి విచారణను ఎదిరించి (విరోధిస్తే) మాట్లాడితే దెబ్బవేయవలసి వస్తుంది (నా చెయ్యి చూచెదవు) అని అనుభవమునకు అందులాగున ఎరుక శూన్యతను, పరిపూర్ణము యొక్క శాశ్వతత్వమును గురుమూర్తి ఈ పద్యములో నిర్ణయించెను.



**78వ పద్యము : కనుపడెడు బయలు లోపల । కనుగొన లేదయ్యె యెరుక, గావున శూన్యం । బనవలసె, దీన విశ్వ, మాయనో యప్పా ॥ యింతకు వేరే మాయయే దప్పా ॥ కనుక నె యీ విశ్వమును లేనిదని, లెస్స । విన జెప్ప నా యెను, కనబోకండని, పోనీ ॥ మాయనో యప్పా । యింతకు వేరె మాయా యేదప్పా ॥**

**టీక :** కనుపడెడు = విచారిస్తే ఉన్నట్లు తెలియబడే, కనగొన = విచారించినచో, శూన్యము = లేనిది; ఆకసము = ఆకాశము, విశ్వము = జగదధిష్ఠానమైన అఖండ యెరుక (విశ్వకారణము) లెస్స = దృఢముగ, కనబోకండని = ఉన్నదని భావించవద్దని.

**భావము :** శిష్యా! విచారిస్తే ఉన్నదని తెలియబడే పరిపూర్ణములో, విచారించగా ఎరుక ఎంత మాత్రము లేదని తెలియబడినది. కావున యెరుకను "శూన్యము" అనవలెను. ఇట్టి లేని యెరుక చేత యీ విశ్వమంతము (జగత్తు) అయినది. లేని దానిచే ఉన్నట్లు భ్రమింపజేసే జగత్తు అయినది అంటే ఇంతకన్నా వేరే మాయ మరేదైనా ఉన్నదా? అంటే ఎరుక - జగత్తులు రెండును మాయయే. కనుక (ఎరుక మాయ కనుక) యీ విశ్వకారణమైన అఖండయెరుక ఉన్నదని ఎంత మాత్రము భ్రమించవద్దని దృఢముగా నీకు చెప్పవలసి వచ్చినది. అనగా కారణరూపమైన విశ్వము (ఎరుక), కార్య రూపమైన విశ్వసము (జగత్తును) యీ రెండును లేనివే. పరిపూర్ణము ఒక్కటి మాత్రమే ఉన్నది.



**79వ పద్యము : అహమనదు గదా యచలము । అహమున్నదో లేదో, చూడదది నిజమె కదా । అహమును బుట్టించదు కదా । అహముదయించేటి వరకె, యది యున్నది కదా ॥ అహమె విశ్వమై నిల్చింది కదా ॥ అహమె యీ ముచ్చట్లన్నింట్నె రుగును గద । అహమె తాలేనని, యరిగితె పరగద॥ అదియున్నది కదా । అహమె విశ్వమై నిల్చింది కదా ॥**

**టీక :** అహము = అంతఃకరణ, అవిద్య, నేననే యెరుక, అహముదయించేటి వరకె = అహము ఉదయించుటకు ముందే అది (పరిపూర్ణము) ఉన్నది కదా । నిల్చింది గదా = ఏర్పడినది గదా, ముచ్చట్లు = వాక్యములు, విచారణలు, శాస్త్రములు; (సమస్త వాచ్య పరిభాషలు) యరిగీతె = లేకపోయినచో, నిజము = శాశ్వతము.

**భావము :** శిష్యా! పరిపూర్ణము "నేను" అని అనదు గదా ! మరియు నేననే అహము (యెరుక) ఉన్నదో లేదో పరిపూర్ణమునకు తెలియదు కదా ! అది నిజమెకదా ! (అది శాశ్వతమైనదే కదా) నేనని యెరుకయే విశ్వరూపమై (జగద్రూపమై) ఏర్పడినది. యీ యెరుకయే సమస్త శాస్త్ర భాష్య విచారణలు చేయుచున్నది. సమస్తమునకు కారణ, కార్యరూపము అయిన యీలే నెరుక, పరిపూర్ణమున్నదని, తాను లేనని తెలిసి (గురుకృపచే) ఎరుక లేకపోయినచో, అక్కడితో అన్నియు సరిపోవును. ఇక శాశ్వతముగ ఉన్నది పరిపూర్ణమె.

---

**80వ పద్యము : ఆవరణము నాకసము । నిరావరణ మచల మమచు యనిరి మహాత్ముల్ । యావరణము మితి గలిగిన । దావరణము లేంది యమితమని తెలుసుకోరా ॥ యీ రెంట్ని వేరని కనుక్కోరా ॥ ఆవరణమునవే నిరావరణముమ జూచి, । ఆవరణ మెడలిన వావలి మాట లేదని తెలుసుకోరా ॥ యీ రెంట్ని వేరని కనుక్కోరా ॥**

**టీక :** ఆవరణము = చుట్టుకొనియున్నది, మితి = కొద్ది మేర, ఎడలీన = విడచినచో, ఆవలి మాట = అవతలి మాట, అనగా ఆవల ఉన్నదాన్ని గురించి చెప్పుటకు ఏ మాటయు.

**భావము :** శిష్యా! ఆకాశము ఆవరణము కలిగినది. పరిపూర్ణము ఆవరణ రహితమైనది అని మహాత్ములు చెప్పుచున్నారు. కనుక పెద్దల విచారణను అనుసరించి విచారించినచో ఆకాశము ఆవరణ కలిగినదగుటచే మిత స్వరూపము. పరిపూర్ణము ఆవరణ రహితమైనది కనుక అమిత మైనది. అందుచే ఆకసము - పరిపూర్ణము యీ రెండు వేరని తెలిసికొనవలెను. ఆవరణ సహితమైన ఆకాశము నందే పరిపూర్ణమున్నదని విచారించి చూచి, ఆవరణ స్వరూపమైన ఆకాశము లేనిదని తెలిసి విడచినచో, ఇక మిగిలిన ఆవరణ రహితమైన పరిపూర్ణమును గురించి చెప్పుటకు మాటలేదని తెలిసికొనుము. "మాటలేదని" అనగా ఎరుక లేదని అర్థము.

**విశేష భావము :** "ఆవరణ రహిత మచలం । కర్తృకార్య వివర్జితం" అన్నారు మహాఋషులు. కనుక ఆవరణ రహితమై అనంతమై అచలమై సర్వత్ర నిండియున్నది పరిపూర్ణము. ఆవరణము కలిగినది ఎరుక, అనగా సత్తాయే ఆవరణము. ఆకాశము అనగా ఇక్కడ మహాకాశమైన అఖండ ఎరుక అని చెప్పవలెను. అందు పిండ బ్రహ్మాండములను సృజించి, పోషించి లయించే సత్తా కలదు. ఈ సత్తాయే ఆవరణ. మరొక విధముగా ఆవరణ అంటే మాయ అని అర్థము. మాయ మిత స్వరూపము. అమితమును మితము చేయునది మాయ అని ఒక నిర్వచము అందుచే" ఆవరణము ఆకాశము" అంటే మాయతో కూడినది మహాకాశమైన అఖండ ఎరుక అని అర్థము.

పరిపూర్ణములో శబ్దము లేదు. ఓం అని శబ్దించేది ఎరుక. అందుచేత ఈ పద్యములో "ఆవరణ మెడలిన - ఎరుకనులేనిదని తీసివేసిచనచో "ఆవలి మాట లేందని తెలుసుకోరా" - ఎరుకకు ఆవలిగా ఉన్న దాని యందు శబ్దము లేని పరిపూర్ణము అని తెలుసుకొనవలెను. (ఆవరణ మెడలిన ఆవలిది మాట లేందని తెలుసుకోరా.



**81వ పద్యము : ఆకాశము శూన్యంబని । లోకులు మొరబెట్టి, దానిలో పవనాదుల్। ప్రకాకటముగ బుట్టినవని । చీకాకుగ చెప్పినారు. ఛీ వినరాదు ॥ వంధ్యా సంతి క్షితిలోన లేదు ॥కాకుంటే విను చోద్యమౌ, కుందేటి కొమ్ము । లీ కాలమున మేమే గంటి మను మాట ॥ ఛీవిన రాదు ॥ వంధ్యాసంతి క్షితిలోన లేదు ॥**

**టీక :** పవనాదుల్ = వాయువు మొదలైనవి, ప్రాకటము = ప్రసిద్ధముగ, చీకాకుగ = సందర్భము లేని విధముగ, వంధ్యాసంతి = గొడ్రాలి బిడ్డ, క్షితి = భూమి, కాకుంటే = కాకపోతే, చోద్యమౌ = ఆశ్చర్యమగును, కంటిమనుమాట = చూచితిమి అన్నమాట.

**భావము :** ఆకాశము శూన్యమని మహర్షి వాక్యము. అట్టి శూన్యమైన ఆకాశము నుండి వాయువు మొదలైన భూత చతుష్టయము పుట్టినదని చెప్పిరి. ఈ విధముగా శూన్యములో వాయువు మొదలగునవి పుట్టెననుట చీకాకు మాటలే కదా ! అట్టి అసందర్భపు మాటలు వినరాదు. గొడ్రాలి బిడ్డ ఎచ్చటైనను ఉండునా ! కుందేలుకు

కొమ్ము ఈ కాలమున మేము చూచినాము అనే మాట ఆశ్చర్యము కాకపోతే ఏమిటి? ఇట్టి మాటలు వినరాదు.

**విశేష భావము :** "ఆకాశం, గగనం, శూన్యం" అని అను శ్లోకము. ఆకాశమునకు శూన్యమనే పేరు కలదు. ఏమియు లేనిది శూన్యము. అట్టి శూన్యము నుండి మిగిలిన భూత చతుష్టయము, బ్రహ్మాండ జగత్తు పిండాండము కలిగినది అంటే ఈ సమస్తము మాయయే కాని నిజమైనది కాదు. ఉన్నదని చెప్పుటకు వీలు లేనిదని ఈ పద్య భావము.



**82వ పద్యము : లేవెరుకను బయలందున । లేవే లేదనక యితరులేల పలికిరో । లేనిది కలదని, పిదపను । లేవే లేదనుచు॥ సిగ్గులేక యీ లీలా ॥ ఛీ వినకీ చీకాకు నీ కేలా ॥ మేనందశుద్ధము తానల్దుకొని । పూని కడిగిన రీతి వౌను సిగ్గొక యింత॥ లేకాయీ లీలా । ఛీ వినకీ చీకాకు నీకేలా ॥**

**టీక :** ఇతరులు = ఇతర బోధస్థులు, పిదపను = తరువాత, సిగ్గొకలేక = కొంచెము సిగ్గు కూడా లేకుండగ, యీ లీల = యీ విధముగ, మేనందు = శరీరము నందు, అశుద్ధము = మలినము, పురీషము, అల్దుకొని = అంటించుకొని, పూని = ప్రయత్నించి కడిగిన రీతి = కడుగుకొనిన విధముగా.

**భావము :** శిష్యా! పరిపరిపూర్ణములో లేని ఎరుకను యితర సిద్ధాంతులు, లేవే లేదని చెప్పక, యీ యెరుకను దాని వల్ల లేక తోచిన జగత్తును మొదట ఉన్నవని, అవన్నియు ఏర్పడిన విధానమును సాంఖ్యాది శాస్త్రములలో వివరించి, చివరకు యీ సమస్తము లేనిదే, మిధ్యయే అని చెప్పిరి. ఇట్లు లేనిది కలదని, చివరకు లేవే లేదని చెప్పుట రెండు విధములుగా మాట్లాడుటయే కదా ! వారన్నమాట వారే నిరసించుట సిగ్గులేకనే కదా ! అవి ద్వంద్వపు మాటలు, అవి వినరాదు. శరీరమందు అశుద్ధము పూసుకొని ఆ తరువాత ప్రయత్నించి కడుగుకొనుట వెర్రి పని కాదా! అట్లే లేనిది ఉన్నదని నిరూపించి ఆ తరువాత లేదని నిరసన చేయుట కూడా సిగ్గు లేని మాటలు ఛీవినరాదు.

**విశేష భావము :** "అధ్యారోప అపవాదాఖ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే." అన్నారు. జగత్తు రజ్జు సర్పము వలెను, కుందేలు కొమ్ము వలెను అధ్యారోప అపవాదములగ

యీలేని జగత్తు ఏ విధముగ ఉన్నట్లు కనుపించుచున్నదో సాంఖ్య సిద్ధాంతులు చెప్పిచున్నారు. అయితే చివరకు మహాఋషులు శృతి వాక్యమైన "బ్రహ్మ సత్యం - జగన్మిథ్య" అని సిద్ధాంతీకరించిరి. అనగా సత్యమైనదే బ్రహ్మము. శాశ్వతమైనది ఏదియో అదియే బ్రహ్మము. అది సర్వకాలము స్వతస్సిద్ధమై ఉన్నదనియు, "జగత్ మిధ్య" అనగా జగత్ లేనిదే ఉన్నట్లు తోచబడినది అన్నారు మిధ్య అనగా ఉన్నది అని కాని, లేదని కాని నిరూపించరానిది అని తార్కికులు అన్నారు. జగత్ అనగా కనిపించే పాంచభౌతిక జగత్తు కాదు. ఇది కార్యరూప జగత్తు తప్పక నశించేదే అని అజ్ఞానులుకు సయితము తెలిసినదే. ఈ వాక్యము మహాఋషి చెప్పనక్కరలేదు. ఈ కార్యరూప జగత్తునకు కారణమైన అఖండ యెరుక - ఇది జగత్తు అనే పదమునకు అర్థము. కార్య కారణములు రెండును ఒక్కటే కనుక, ఈ శృతి వాక్యములో కారణ రూపమైన జగత్తు అంటే అఖండ ఎరుక అని చెప్పవలెను. ఈ ఎరుక మిధ్యా స్వరూపము. లేనిదే ఉన్నట్లు తెలియబడే మాయా స్వరూపము. ఇది లేదని చెప్పరాదు, ఉన్నదని అసలే చెప్పరాదు. ఈ రహస్యమును బాగుగ విచారించి తెలుసుకొనవలెను.



**83వ పద్యము : అన్నపు సూక్ష్మాంశము మన । సెన్నగ నీరంబు ప్రాణ మెరుగుము. యీ రెండెన్నడు కలియవొనాడే । సున్న సుమీ యెరుక మాట, సుగుణ సంపన్నా ॥ కల సుటే యెరుక సుమీ, యింతకన్నా ॥ వున్నా దెరుకకు మూలమన్నాది వినలేదు । యెన్నాడు యీ భ్రాంతి విన్నంట విన్వకు । సుగుణ సంపన్నా । కలసుటె యెరుక సుమీ । యింతకన్నా ॥**

**దండాన్వయం :** "యీ రెండెన్నడు కలియవో నాడే యెరుక మాట సున్న సుమీ ॥ యింతకన్నా యెరుకకు మూలము ఉన్నాది (అని) వినలేదు.

**టీక :** ఎన్నగ = లెక్కించగా, గణన చేయుగా, నీరంబు = నీటి యొక్క, సున్నసుమీ = లేదు సుమా ॥

**భావము :** సద్గుణ సంపత్తి కల ఓ శిష్యా ! అన్నము యొక్క సూక్ష్మ భాగము మనసున్ను, జలము యొక్క సూక్ష్మ భాగము ప్రాణమును, యీ రెండు కలిసినచో యెరుక యేర్పడుచున్నది. యీ రెండు ఎప్పుడు విడిపోవునో అప్పుడే యెరుక మాటలేకుండా పోవును. అనగా మనః ప్రాణముల కలియకయే ఎరుక, ఎరుకకు

యింతకన్న వేరే మూలము మరొకటి యున్నదని వినలేదు. మరేదో మూలము కలదనే భ్రాంతి నీ మనసు నందు రానీయకు. మూలము లేని యీ భ్రాంతిని (ఎరుకను) నీ మనసందు నిలబెట్టకుము.

**విశేష భావము :** మనము తినే అన్నము శరీరమందు వైశ్వానరాగ్నిచే జీర్ణమై మూడు భాగములుగా విడిపోవును. 1) స్థూల భాగము పురీషమై (మృతము) బయటకు నెట్టి వేయబడుచున్నది. 2) సూక్ష్మ భాగము మేధోస్థి మజ్జాది సప్తధాతు రూపమును పొందుచున్నది. 3) సూక్ష్మాతి సూక్ష్మ భాగము అమృతము. ఇది చంద్రుని వలన వచ్చినది. ఈ అమృతము మనస్సును చేరి మనస్సును పోషించుచున్నది. ఇట్లే మనము త్రాగిన జల పదార్థములు జీర్ణమై స్థూల, సూక్ష్మ, సూక్ష్మాతి సూక్ష్మములుగ విడిపోవుచున్నది. స్థూల భాగము మాత్రము బయటకు పోవుచున్నది. సూక్ష్మ భాగము రక్తమగుచున్నది. సూక్ష్మాతి సూక్ష్మభాగము ప్రాణమును పోషించుచున్నది. యీ విషయములు ఛాందగ్యోపనిషత్తులో వివరించబడినది. అన్నపు సూక్ష్మాంశము - మనస్సు శృతి ॥ అన్నమశితం త్రేధా విధీయతే । తస్యయః స్థవిష్ఠో ధాతు స్తత్పురీషం భవతి । యోమధ్యమ సఃస్తన్మాసః । యోణిష్ఠ స్తన్మనః ॥

ఇట్లు అన్నము యొక్క సూక్ష్మాతి సూక్ష్మభాగము. మనస్సున్ను జలము యొక్క సూక్ష్మాతి సూక్ష్మభాగము ప్రాణమున్ను, యీరెండు అనగా మనః ప్రాణములు యీ రెండు కలసి ఉన్నప్పుడు యెరుకమాట అయిన "నేను" అని పల్కుచున్నాము. మనః ప్రాణములు విడిపోయనప్పుడు "నేను" అని అనలేము. జాగ్రత్త స్వప్న అవస్థలయందు మనః ప్రాణములు కలియుచున్నవి. కనుక నేను అనే మాట ఉన్నది. సుషుప్తిలో విడిపోవుటచే నేను అనలేము. ఇంకనూ - జల సూక్ష్మాంశము - ప్రాణము శృతి॥ ఆపః పీత్వాస్త్రేధా విధాయంతే । తాసాంయ స్థ విష్ఠో ధాతు స్తన్మూత్రః భవతి । యోమధ్యమస్తల్లోహితః । యోణిష్ఠస్సప్రాణః ॥

మనః ప్రాణముల కలయిక అనగా మనస్సు - జ్ఞానమయము, ప్రాణము అనగా కర్మమయము. కనుక మనః ప్రాణములు అనగా జ్ఞాన - కర్మలు అని భావము. జ్ఞానము - ఎరుగుట, కర్మము - చేయుట. ఎరుగుట జ్ఞానంబు దానను చేయు పని కర్మము. అని కందార్థము కలదు. ఎరుగుట, చేయుట ఈ రెంటి సంయోగమే ఎరుక అనగా జగత్తు. మరియు

మనలో జ్ఞానము అనగా అవిద్య అయిన అంతఃకరణమందలి ప్రతిబింబిత చైతన్యము. ఇది జ్ఞానము దీని యందు ఏ రకమైన కర్మము లేదు. సత్తామాత్రమైనది అవిద్యయే అన్ని విధములైన కర్మలను చేయుచున్నది. అవిద్య నిజమునకు జడము అయినను దాని యందలి ప్రతిబింబిత చైతన్యము యొక్క సత్తా చేత ఉన్నదై సమస్త కర్మలను చేయుచున్నది. ప్రతిబింబము - జ్ఞానము. మాయ లేక అవిద్యకర్మము. జ్ఞానకర్మలు రెండును విడిపోయి ఉండనేరవు. ఈ రెంటి సంయోగమే ఎరుక. కనుక ఎరుకకు మూలము జ్ఞాన - కర్మలు ఈ రెండుతప్ప ఎరుకకు మూలమేమియు లేదు. మరియు అఖండ ఎరుక యందు కూడా ప్రతిబింబ చైతన్యము (జ్ఞానము) మాయ - కర్మము. ఈ రెంటి సంయోగము చేతనే ఎరుక అనబడుచు సమస్త జగత్తుకు ఆధారము మూలము అయినది. కాని ఈ ఎరుకకు మూలము మరేదియులేదని తెలియవలెను.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతా ౨ ద్వైత పరమ తత్త్వే
యెరుకోత్పత్తి లక్షణం నామ
పంచమోధ్యాయమునకు
భావ - విశేష భావములు
సమాప్తము

॥ జై గురు ॥

## పంచమోధ్యాయ సంక్షిప్త భావము

ఈ అధ్యాయములో శ్రీకృష్ణ దేశికేంద్రుల వారు యెరుకోత్పత్తిని గురించి వివరించినారు. యెరుక ఎందుకు ఏ విధముగా ఉత్పత్తి అయినది అనే విషయము బ్రహ్మాదులకైనను తెలియదు అనియు, కాని సద్గురుమూర్తిని పరబ్రహ్మముగా భావించి పాద సేవ చేసిన మహాత్మునికి యెరుక యొక్క నిజస్వరూపము పూర్తిగా తెలియబడునని సెలవిచ్చిరి.

యెరుక భ్రాంతి రూపము వంధ్యాసూనిని వలె, స్థాణు పురుషుని వలె, రజ్జు సర్పము వలె, శశి విషాణము వలె, ఎండమావుల వలె భ్రాంతి రూపముగా యేర్పడినది. లేనిదే ఉన్నట్లు తోచబడుచున్నది. తొలకరి మబ్బులలోని మెరుపువలె అంతలో కనుపడి అంతలోనే లేకపోయే లక్షణము కలది. ఎలా వచ్చునో తెలియదు. నారికేళములోని నీరు వలె ఏనుగు తిన్న వెలగ పండులోని గుంజు వలె. ఏలాలేకపోవునో తెలియదు. ఎరుక శాశ్వతమైన పరిపూర్ణ పరబ్రహ్మములో లేనిదే తనకు తానే ఏర్పడి కొంత సేపు ఉండి, తుదకు తనకు తానే లేకపోవుచున్నది. ఏలా ఏర్పడి యేలా లేకపోవునో ఉదాహరణలు చెప్పియున్నారు.

**1) సంతోషము - ధుఃఖములు అంతలో వచ్చి అంతలో లేకపోవును.**
**2) ప్రతిమలో లేని పెరుమాళ్ళ వలె, ఎరుక మిథ్యా రూపము.**
**3) నీటిలో ఏర్పడివ బుగ్గల వలె**
**4) తొలకరి మబ్బు మెరుపుల వలె.**
**5) కట్టెలలోని అగ్ని వలె.**

ఈ విధముగా ఎరుక స్థితి ఉన్నదని నిరూపించిరి. పరిపూర్ణములో లేని మాయ తనంత తానుగానే యేర్పడినది. ఈ మాయ అద్దము వలె ప్రతిబింబించుకొనే లక్షణము కలది. అందుచే మాయ ఏర్పడిన వెంటనే అందు పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క ప్రతిబింబిము (చైతన్యము) పడి మాయ ఉన్నది అయినది. దీనినే ఎరుక అన్నారు. మాయ లేనిదే. ప్రతిబింబము లేనిదే. ఒకదానికొకటి మూలము ఆధారము కారణము అయి యున్నది. ఈ రెండు కలసి ఎరుకయై జగదధిష్ఠానమైనది. విచారిస్తే ఎరుక ఉన్నదనరాదు, లేనిది. శాశ్వతమైనది పరిపూర్ణము మాత్రమే. పరిపూర్ణము అనాది సిద్ధమై మార్పులేనిదై ఉన్నది. యెరుక యెంత మాత్రము ఉన్నది కాదు, అజ్ఞానమునకు మాత్రమే ఉన్నట్లు తోచును. గరుముఖతా విచారిస్తే ఎరుక ఎచ్చటను లేదు. ఇట్టి లేని యెరుక, పరిపూర్ణ పరబ్రహ్మమును గురుముఖతా విచారించినచో, తాను లేనని తెలుసుకొని యెచ్చటను లేకుండా పోవును. అనగా పరిపూర్ణమును చూచిన, ఎరుక పూర్తిగా లేకపోవును.

## అధ్యాయము-6

# యెరుకను విడిపించుట (22)

**అవతారిక :** యెరుక మిధ్యా స్వరూపము. కనుక గురుముఖతా శాస్త్ర విజ్ఞానముతో యెరుక లేనిది అనియు, అజ్ఞానులు మాత్రమే యున్నదని భావించెదరనియు, యెరుక క్రియలు జ్ఞానులు, అజ్ఞానులు కూడా చేయుచున్నను, భావము మాత్రము వేరుగా ఉండుననియు దృష్టాంత పూర్వకముగా నిరూపించుచున్నారు.

**84వ పద్యము : పిల్లలు తాట్యాకులతో । పిల్లల గావించి, పెండ్లి పేరంటంబుల్ కొల్లలుగ జేయ, వారల । తల్లులు గని సత్యమనుచు, తలచే రామదినీ ॥ నిను నీవిట్లు దలచరా మదినీ ॥ కల్లాసంసారము గని మానవులు సంత । శిల్లాగ, గురు మంత్ర సిద్దులు నిజమని ॥ తలచేరా మదినీ ॥ నిను నీ విట్లు తలచరా మదినీ ॥**

**టీక :** కల్లా సంసారము = అబద్దపు జగత్కార్యములు; సంతశిల్లగ = సంతోషించగా, గురుమంత్ర సిద్దులు = గురుమంత్ర ఆరూఢులైనవారు.

**భావము :** శిష్యా! చిన్నపిల్లలు తాటాకులతో బొమ్మలు చేసి వాటికి పెండ్లి చేసి పేరంటములు పెట్టుకొనుచు సంతోషముతో ఆడుకొనుచుందురు. ఆ పిల్లలతో వారి తల్లిదండ్రులు కూడా వారిని ఆడించుటకై ఆ పేరంట కార్యక్రమములో పాల్గొన్ననూ, వారి తలిదండ్రులు ఆ పెండ్లి పేరంటములు నిజమని తలచరు కదా! (పిల్లలు అజ్ఞానముచే నిజమని తలంచి సంతోషించుచుందురు) అట్లే నీవు నీచే చేయబడు సమస్త జగత్కార్యములు లేనివేయని గ్రహింపుము. అజ్ఞానులు అయిన సామాన్య మానవులు ఆ జగత్కార్యములు నిజమైనవేయని భ్రాంతి పొందెదరు. అట్టి సమస్త జగత్కార్యములు గురు మంత్ర ఆరూఢ భావము పొందిన వారు మాత్రము నిజమని యెన్నడు తలచరు. ఇదంతయు పిల్లలు ఆడుకొనే బొమ్మల పెండ్లి వంటిదేయని భావించదెరు.

**విశేష భావము :** పిల్లలు బొమ్మల పెండ్లి చేసుకొనుచు, ఆడుకొనుచున్నప్పుడు వారి తల్లులు కూడా వారిని ఆడించుటకై ఆ బొమ్మల పెండ్లి కార్యక్రమములో పాల్గొను చుందురు. కాని ఆ పెండ్లి పేరంటములు నిజమని భావించే ఆ పిల్లలు చేయుచున్నారు.

ఒకే పని తల్లులు పిల్లలు చేయుచున్నప్పటికి, పిల్లల భావము ఆ పనులు నిజమని, తల్లులు అదంతా అబద్ధమే అని ఆట మాత్రమే యని భావించుదరు. అట్లే సమస్త జగత్కార్యక్రమములు సామాన్య జనులు నిజమని భావించుచుందురు. కాని అవే జగత్కార్యక్రమములు గురుమంత్ర ఆరూఢ భావము పొందిన జ్ఞానులు కూడా చేయుచున్నప్పటికి ఆ కార్యక్రమములు ఎంత మాత్రము నిజము కాదనియు, తానే లేకపోయినప్పుడు తాను చేసే కార్యక్రములు కూడా లేనివే అనే భావించెదరు. కనుక జ్ఞానులు లేక ఆచరించినట్లుగానే నీవు కూడా లోక వ్యవహారములు లోకులకు భిన్నత్వము కనపడకుండా నీవును ఆచరించుచు, భావములో భ్రాంతి చెందవద్దని శిష్యునికి గురుమూర్తి ఈ పద్యములో సూచించుచున్నారు.

**అవతారిక :** దేహి - దేహములు రెండునూ ఒక్కటే అని నిరూపించుచున్నారు.

**85వ పద్యము : మే నెరుకల రెండింటిలో । దానిని యిది దీని నదియు, తగ సృజియించున్ । మే నెరుక లివియు, మూలము । లేనిదె సృజనయ్యెననుచు, లేనే లేవంటి ॥ అంటే తప్పు లేనే లేదంటి ॥ మే నెరుక లిప్పుడు దేవందున్నవో చూచి । లేని మేనెరుకలు లేనివనుచు నమ్ము ॥ లేవే లేవంటి । అంటే తప్పు లేనే లేదంటి॥**

**టీక :** మేను = దేహము (ఉపాధి) ఎరుక = దేహి (జ్ఞానము) సృజియించున్ = ఉనికిని గలిగించును.

**భావము :** శిష్యా ! మేను వలన ఎరుక, ఎరుక వలన మేను ఒక దాని వలన మరొకటి ఉనికిని గలిగించుటచే ఉన్నవని భావించబడుచున్నవి. ఈ మేను ఎరుకల రెంటికి మూలము ఏదియు లేదు. ఒకదానికి మరొకటి మూలము. వేరుగా మూలము ఏమియు లేదు కనుక ఇవి లేనివని చెప్పుచున్నారు. ఈ మేను ఎరుకలు లేనివి అని చెప్పినప్పుడే తప్పు లేని సిద్ధాంత వాక్యము. ఉన్నవని చెప్పుట తప్పే అగును. యీ మేనెరుకలు దేనందున్నవో చూచి, లేని మేనెరుకలు లేనివని నిస్సంశయముగా నమ్ముము.

**విశేష భావము :** మేను - ఎరుక, అనగా శరీరము, అందలి చైతన్యము అని చెప్పుట తప్పు. ఎందుచేతననగా ఎరుక వలన శరీరము సృజనగావింపబడుచున్నది. కాని శరీరము వలన ఎరుక సృజింపబడదు. కనుక ఆ భావము తప్పు. కనుక మేను అవిద్య లేక మాయ అని చెప్పవలెను. ఎరుక అనగా అవిద్య యందు ప్రతిబింబించిన

ప్రతిబింబ చైతన్యము, అవిద్య (మాయ) జడము । స్వత సిద్ధముగ జడము ఉండదు. మరొక సత్తా వలన మాత్రమే జడము ఉన్నది అగును. అవిద్య (మాయ) అద్దము వలె ప్రతిబింబించుకొనే లక్షణము కలది. అందుచే అవిద్య పరిపూర్ణములో తనకు దానే తోచబడిన తక్షణమే, దర్పణము వంటిది కనుక, తనకు ఎదురుగా (అంతటా) ఉన్న పరిపూర్ణ పరబ్రహ్మమును ప్రతిఫలింపజేసుకొనెను. అందుచే పరిపూర్ణము అవిద్య యందు (మాయ యందు) ప్రతిబింబిత చైతన్యముగా ఏర్పడినది. ఇదియే ఎరుక అనే పదమునకు అర్థము. ప్రతిబింబము సత్తా కలిగినది. అందుచే జడమైన అవిద్య ఉన్నది అయినది. అవిద్య దర్పణము వంటిది కనుక ప్రతిబింరూపమై ఎరుక ఉన్నదని అనిపించుకొనుచున్నది. అనగా అవిద్య వలన ఎరుక, ఎరుక వలన అవిద్య ఉనికి గలిగిన వగుచున్నవి. ప్రతిబింబమైన ఎరుకకు అవిద్య ఉపాధి అయినందున మేను అని చెప్పబడినది. ఈ అవిద్య ఉండుటకు కారణము ప్రతిబింబమైన ఎరుక. ఈ ఎరుక ఉండుటకు అవిద్య కారణము. కనుక ఈ రెంటికి ఒకదానికి మరొకటి మూలము, కారణము అగుచున్నవి. ఈ రెంటికి మరొక మూలము ఏమియు లేదు. కనుక లేనివి అని చెప్పబడుచున్నది. అవిద్య స్వతః జడము లేనిది. అందున్న ప్రతిబింబము కూడా ఉన్నట్లు తోచబడేదే కాని విచారిస్తే ప్రతిబింబము ఉన్నదని ఎవ్వరును అంగీకరించరు. కనుక ప్రతిబింబము అయిన ఎరుక కూడా లేనిదే. కనుక అవిద్య అయిన మేను ప్రతిబింబమైన ఎరుక రెండును లేనివే. ఇందులో ఏ ఒక్కటైన ఉన్నది అని అంటే అది తప్పుడు విచారణ కాగలదు. అవిద్య - ఎరుక ఒకదాని విడచి ఒకటి ఎన్నడూ ఉండదు. కనుక మేను ఎరుకలు రెండునూ లేనివే అని విచారించినచో అది సిద్ధాంత (శాస్త్ర) విచారణ కాగలదు. మేనుకు ఎరుక కారణము, ఎరుకకు మేను కారణము. ఈ రెండును కారణకార్యములు. ఈ రెంటికి పరిపూర్ణము ఎంతమాత్రము కారణము కాని ఆధారము గాని కానేరదు.

**అవతారిక :** సమాధి స్థితిలో ఎరుక నిర్గుణ స్వరూపమై యున్నది. కాని అది బ్రహ్మస్థితి అని గ్రహించరాదని ఈ పద్యములో నిర్ణయించుచున్నారు.

**86వ పద్యము : యెరుక పని చేయదవకుము । యెరగుట మరచుటలు రెండు ఎవ్వరి పనులో । యెరిగింపుము నాస్మోలను । వెరువను తప్పితివె దెబ్బ, వేశాను చూడూ ॥ అట్లవకుండ జేశాను వేడూ ॥ వెరపించుటే దెబ్బ వేశాన నా తండ్రీ । యెరిగించి పై మర్మమె రురుకమనే దీపి ॥ వేశాను చూడూ । అట్లవకుండ జేశాను వేడూ॥**

**దండాన్వయము :** "యెరిగించిపై మర్మము" పై మర్మమెరిగించి యెరుకను దీసి వేశాను చూడూ ॥

**టీక :** వెరవను = మార్గమును, వెరపించుటె = భయపెట్టుటయే, దెబ్బవేశాన = కొట్టితినా? !

**భావము :** శిష్యా! ఎరుక పనిచేయదు, అది నిష్క్రియ అని అనకుము. యెరుగుట, మరచుట అను యీ రెండు యెవరి పనులో (యెవరు చేయుచున్నారో) నాకు చెప్పుము. నేను చెప్పిన విధముగా కాక మరొక విధముగా విచారించితివా దెబ్బ వేసెదను. జాగ్రత్త అట్టి తప్పుడు విచారణ రాకుండ చేసెదను. (అంతశిష్యుడు కొట్టెదరేమో యని భయపడి మాటలాడకుందుటను జూచి గురుమూర్తి అనునయించుచు) భయపెట్టితినే కాని నిజముగా కొట్టితినా ? నా తండ్రీ ! పై మర్మమును యెరిగించి యెరుకను లేకుండగ జేసదెను, చూడుము. (అని గురుమూర్తి శిష్యునితో చెప్పెను)

**విశేష భావము :** సహస్రారమున సమాధి స్థితిలో ఉన్నప్పుడు యెరుక ఏ విధమైన సంకల్పాది క్రియలు లేవు కనుక అది బ్రహ్మమే అని ఒక వాదము కలదు. ఆ స్థానము ఎరుకకు స్వస్థానమనియు, అచ్చట ఎరుక తన్ను తాను గాని ఇతరమును గాని గుర్తించే లక్షణము లేదు. కనుక యీ యెరుకయే బ్రహ్మమని కొందరు చెప్పుచున్నారు. గురుమూర్తి యీ విచారణను ఖండించుచున్నారు. భ్రూమధ్య స్థానమందున్నప్పుడు యెరుక యెరిగే లక్షణముతోను, సహస్రారమున మరుపు లక్షణములతోను, అట్లే జాగ్రత్త స్వప్న అవస్థలలో యెరిగే లక్షణము కలిగిన యెరుకయే సుషుప్తి అవస్థలో మరుపు బొందుచున్నది. యీ యెరుగుట, మరచుటలు అను భిన్న క్రియలు రెండును ఎరుక యొక్క పనులే. మరచుట అనగా ఏమియు యెరుగను అనుట. యెరుగననుట కూడా యెరుక యే కదా! కనుక యెరుకకు యెరుగుట మరచుట అను రెండు క్రియలు కలది. కనుక ఎరుక పరిపూర్ణము బ్రహ్మము కానేరదు.

మరియు, శాస్త్రీయమైన విచారణగా - ఎరుక అనగా అవిద్య - ప్రతిబింబిత చైతన్యము కలసినది కదా ! ఇందులో ప్రతిబింబిత చైతన్యము యొక్క సత్తా చేత అవిద్యయే జాగ్రత్త స్వప్న అవస్థలో యెరుగుటయు, సుషుప్తిలో యేమియు ఎరుగకుడుటయు (మరపు) నొందుచున్నది. ప్రతిబింబిత చైతన్యము మాత్రము

సాక్షిమాత్రమై ఏ రకమైన క్రియ, ఎరుగుట అనే పనులు లేక, ఉన్నది. అందుచే అవిద్య ప్రకృతి అనియు, ప్రతిబింబము బ్రహ్మము అనే విచారణ అభ్యాసములో శాస్త్రములో చెప్పబడినది. ఆ విచారణ యీ పద్యములో ఖండింపబడినది. అవిద్య ప్రకృతి కేవలము జడము. ప్రతిబింబ చైతన్యము యొక్క సత్తా చేయుచున్నది. అవిద్య ప్రతిబింబములు రెండునూ ఒకదానిని విడచి మరొకటి విడిగా కానరావు. అవిద్యతో కలిసియే ప్రతిబింబము ఉండును. కనుక అవిద్య యొక్క యెరుక మరుపులకు మూలకారణము ప్రతిబింబమే కనుక యీ ప్రతిబింబము కూడా ఎరుకయే. బ్రహ్మము కానేరదు. అందుకే భగవద్గీతలో "నాకు పరాప్రకృతి, అపరా ప్రకృతి అను రెండు ప్రకృతులు కలవు" అని భగవాన్ చెప్పియున్నాడు. అపరా ప్రకృతి - అవిద్య, పరాప్రకృతి - ప్రతిబింబిత చైతన్యము. రెండునులేక ఉన్నట్లు తోచబడునవే. కనుక ఇందులో ఏదియును బ్రహ్మము కాదని యీ పద్య భావము.

**87వ పద్యము: లేని కల కలిగినపుడు । దానికి దశ దిశల యందు తగ మొదట కొనవ్ । తావంటకున్న మేల్కొను । లేని కలే చూచె వేని లేకపోవుగదా ॥ కలలో మేల్కొ లేకపోదు గదా ॥ లేవెరుక బయలు లీలాగువ వీకెపుడు । గాన వచ్చితె బోధ గావలెననవపుడు ॥ లేకపోవుగదా । కలతో మేల్కొలేకపోవు గదా ॥**

**టీక :** లేని కల = లేని యెరుక, తానంటకున్న మేల్కొ = ఎరుక లేని పరిపూర్ణము.

**భావము :** శిష్యా ! లేని యెరుక వికారములు నీకు తోచినపుడు (సంతోషకము, దుఃఖము మొదలగునవి) ఆ యెరుకకు అనగా నీకు దశదిశల యందును, తాను రాక ముందు, తానుపోయిన తరువాతను అనగా సర్వత్రా, సర్వకాలములయందును, శాశ్వతమై యున్న యెరుకలేని పరిపూర్ణము యొక్క ఉనికిని తెలసి విచారించుచున్నచో, యెరుకయే కలయే లేకపోవును. ఎరుకయే లేకపోవును గాని మేల్కొ అయిన పరిపూర్ణము శాశ్వతముగానే ఉండును. యీ విధముగా లేని కల అయిన ఎరుక ఏ కాలము నందు లేనిదనియు, మేల్కొ వంటి పరిపూర్ణము సర్వకాల సర్వావస్థల యందున శాశ్వతమై, మార్పు లేనిదై ఉన్నదని తెలసి ధృడపడిన తరువాత, బోధ విచారణ కావలెను అని అనవని భావము. అనగా ధృడపడిన మీదట బోధతో నిమిత్తము లేదు.

**88వ పద్యము: ఒంటుకు దాపల బింద్వాం । ట్లంటించిన కొలది లెక్కయధికంబగు, వా । వొంటుకు వలపల బింద్వాక । టంటించిన లెక్క వుల్లక్క్యా గదనోయీ ॥ ఒంటుండి లేందా గదనోయీ ॥ తంటా దీరుమ చూడు, దానివలెనే యెరుక । కంటే బయలును, తాను గలిగుండి తవకుల్లక్క్యా ॥ గదనోయీ । ఒంటుండి లేందా గదనోయీ॥**

**దండాన్వయము :** దాని వలెనె యెరుక బయలును కంటె, తాను గలిగుండి, అని చదువుకోవలెను. ప్రాసనియమము కొరకై "కంటె బయలును" అని పద్యములో చెప్పిరి.

**టీక :** ఒంటు = ఒకటి అనే అంకె. దాపల = ఎడమ భాగము, వలపల = కుడిభాగము, బిందువు=సున్న, ఒంటంటించిన కొలది = ఒక్కొక్కటి పెట్టుచున్న కొలది, ఉల్లక్క్యా=లేకపోవును.

**భావము :** శిష్యా! ఒకటికి ఎడమ భాగమున సున్నా ఒక్కొక్కటి పెట్టుచున్నకొలది ఒకటి యొక్క లెక్క అధికమగును. ఆ ఒకటికి కుడిభాగమున ఒక్క సున్న పెట్టినచో, ఒకటి ఉన్నప్పటికి, ఒకటి అని గాని, పది అని గాని, వంద అని గాని లెక్క చెప్పుటకు వీలు లేదు. ఒకటి ఉన్నప్పటికీ ఒకటి అనుటకు లేదు. అట్లే యెరుక (తన ఎడమ భాగముగా) అనేకముగా తోచబడును. ఆ యెరుక తనకు పరముగా (కుడిభాగముగా) ఉన్న పరిపూర్ణ బ్రహ్మము ఉన్నదని చూచినచో, తాను ఉన్నప్పటికి లేనిదే అగుచున్నది. అనగా తాను లేనని, పరిపూర్ణమే ఉన్నదని తెలసి, లేక ఉన్నదగును. అట్టి దానితో ఏ తంటాలు లేకపోవును. (అనగా జనన మరణములు లేకపోవును) అని గురుమూర్తి ఈ పద్యములో వివరించెను.

**విశేష భావము :** ఒంటుకు దాపల అనగా ఒకటికి ఎడమ భాగము ఒకటికి ఎడమ దాపల, కుడి భాగము వలపల అని ఈ పద్యములో చెప్పబడినది. ఉదా॥ ఒకటి అనేది ఒక మనిషిగా ఈ కాగితము పై గుర్తించినచో కుడి - తల - ఎడమ కనుక 1 ఎడమ భాగము 0 పెట్టినచో 10 అయి లెక్క అధికమగును. అట్టి 10కి వలపల (కుడి ప్రక్కన) 010 పెట్టినచో లెక్క ఉల్లక్కి అయినది పది అనుటకు వీలుపడదు. మరియు ఒకటి అని కూడా అనలేము. ఒకటి ఉండి లేనిదైనదని భావము. అట్లే ఎరుక ఎడమ భాగము అంటే నాకు ఎడమ భాగము భార్య పిల్లలు ఇట్లు అధికమగుచున్నది. కాని ఎరుకకు కుడిభాగము అంటే తనకన్నా ముందు నుండి

ఉన్నటువంటి పరము అయిన పరిపూర్ణమును చూచినచో ఎరుక ఉన్నప్పటికి లేనిదే అగును.

కుడి వైపు ఆనంద, విజ్ఞాన, మన, ప్రాణ, వాక్కులు అనే అయిదు కళలు మనః అని చెప్పే ఎరుక యొక్క కళలు. యీ మనస్సు అనే ఎరుక తనకు ఎడమవైపున ఉన్న ప్రాణ వాక్కులతో కలిసినప్పుడు జగత్తు అగుచున్నది. అట్లు గాక మనస్సు అనే ఎరుక తనకు కుడి వైపున ఉన్న విజ్ఞాన ఆనందములనే కళలతో కలసినప్పుడు బ్రహ్మవిచారణ చేసి తాను ఉండి లేకపోవును అని కూడా విచారించవచ్చును.

**అవతారిక :** యెరుక ఒక్కటి ఉంటేనే జగత్తు తోచబడును. ఆ ఎరుక లేకపోయినచో జగత్తు లేదని కాని పరిపూర్ణమే ఉన్నదని విచారించుటకు ఎవరును ఉండరని నిర్ణయము.

**89వ పద్యము : యెరుకొక్కటుండెనేనియు । యెరుకే యీ విశ్వరూపమేర్పడ దాల్చువ్ । యెరుకొక్కటి లేకుండిన । యెరుకైన ప్రపంచమున్న, దెవరెరిగేరికమా॥ లేదననైన యెవరుండేరికమా ॥ పరిపూర్ణమైనట్టి బయలుండగనిపెట్టి । గురుని వాక్యముబట్టి, గురుతూ బోగొట్టితే ॥ యెవరెరిగేరికమా । లేదననైన యెవరుండేరికమా॥**

**భావము :** శిష్యా! యెరుక ఒక్కటి ఉన్నచో, ఆ యెరుకే (తానుచెడకుండా) యీ చరాచర విశ్వరూపముగా యేర్పడుచున్నది. అట్టి యెరుక ఒక్కటీ లేకపోయినచో, యీ ప్రపంచమున్నదని గాని, యీ ప్రపంచము లేదని గాని చెప్పేవారెవరుందురు? అనగా గుర్తించే యెరుక లేకపోయినచో ఉన్నదని గాని, లేదని గాని చెప్పే యెరుక లేక, యేమియు యుండదని భావము. కనుక సర్వే సర్వత్రా అంతటా నిండియున్న పరబ్రహ్మము ఉన్నదని గురుముఖతా గుర్తించి, గురువాక్యమైన షోడశీమంత్ర విచారణచే అన్నిటినీ యెరిగే గుర్తు (యెరుక) ను లేకుండా చేసికొనినచో, పరిపూర్ణమున్నదని గాని, జగత్స్వరూపమైన యెరుక లేదని గాని చెప్పేవారులేరు అని భావము.

**విశేష భావము :** యెరుక ఉంటే సమస్త జగత్తు తోచబడుచున్నది. కనుక సమస్త ప్రపంచము నేనే. "మయి సర్వం ప్రతిష్ఠితం" అట్టి "నేను" అయిన ఎరుక గురువాక్యముచే లేకుండా పోయనచో నేను లేను అని గాని, పరిపూర్ణము ఉన్నదని గాని చెప్పేవారు లేరు. అనగా పరిపూర్ణము లేదని భావము కాదు. పరిపూర్ణము శాశ్వతముగా ఉండును. ఉన్నదని చెప్పే ఎరుక లేదని భావము.

**అవతారిక :** యెరుక త్రిపుటి స్వరూపము అని చెప్పుచున్నారు.

**90వ పద్యము : తెలుపు మృదుత్వము మధురము । గల వస్తువు చక్కెరమచు గమగొన్నట్లు । తెలివి శరీర జగములు గల వస్తువు బిందువమచు, గమగొనరాదా ! నే దెల్పితే విని నమ్మరాదా ॥ తెలివిచే బయలుండ దెలసి యీ తెలివిని । తెలివి చేతనే పట్టి తీసి వెయ్యరా పోనీ ॥ కనుగొనరాదా । నే దెల్పితే విని నమ్మరాదా ॥**

**టీక :** ఆ తెలివి = ఆ ఎరుక, శరీరము = ఎరిగే శరీరము (ఉపాధి, అవిద్య) జగము=జగత్తు, బిందువు = అఖండ ఎరుక (అవ్యక్తము) తెలివి చేతనే = ఎరుక చేతనే, యీ తెలివిని = పరిపూర్ణమున్నదని తెలుసుకొన్న ఎరుకను.

**భావము :** శిష్యా! తెలుపు, మృదుత్వము, మధురము అను ఈ మూడు లక్షణములు కలిగియున్న పదార్థము చక్కెర రేణువు అని తెలుసుకొన్నట్లుగానే, గుర్తు, ఎరిగే శరీరము జగత్తు అను ఈ మూడు కలసియున్నదే బిందు స్వరూపమయిన అఖండ యెరుక అని తెలుసుకొనుము. ఈ విధముగా నేను విచారించి చెప్పుచున్నాను నమ్ముము. సంశయించవద్దు. నీలోని సమస్తమును గుర్తించే ఎరుక చేతనే, సాక్షిరూపమైన చైతన్యమయిన ఎరుకను గుర్తించి లేకుండ చేయుము. అలా చేసినచో ఎరుక, జగత్తులు పూర్తిగా లేకపోవును. ఈ విషయము చక్కగా విచారించి తెలిసి నమ్మి, ఎరుక లేకుండా చేసికొనుము.

**విశేష భావము :** జ్ఞాత + జ్ఞేయము + జ్ఞానము, ద్రష్ట + దృశ్య + దర్శన, సత్+ చిత్ + ఆనందము, యిట్టి త్రిపుటి స్వరూపము ఎరుక మరియు త్రిగుణాత్మకము, తత్రిశక్త్యాత్మకమైనది. ఇట్టి ఎరుక పరిపూర్ణ పరబ్రహ్మములో లేక తోచినది. కనుకనే "బ్రహ్మణో రవ్యక్తః" బ్రహ్మము నందు అవ్యక్తము తోచినది అని అర్థము. బ్రహ్మము నందు అనగా పరిపూర్ణ పరబ్రహ్మము నందు అవ్యక్త స్వరూపమయిన ఎరుక తోచినది. ఇది బిందు స్వరూపము. ఈ బిందు స్వరూపమయిన ఎరుక యందు సమస్త బ్రహ్మాండములు బీజ రూపముగా నిండియున్నవి. కనుకనే బిందు మధ్యే జగత్సర్వం అని శృతి వచనము. ఇదే శ్రీ చక్రములో మధ్య నున్న బిందువు ఇదే రాజరాజేశ్వరిగా అర్చించబడుచున్న శ్రీమాత. ఇదే ఎరుక. ఈ పద్యములో "బిందువు అనుచు కనుగొనరాదా" అన్న బిందు స్వరూపము. ఇందులో తెలివి అనగా జ్ఞానము (ప్రతిబింబిత చైతన్యము) శరీరము=అవిద్య ఉపాధి, జగము = త్రిగుణములు. ఈ గుణములే జగత్తును సృష్టి చేయుచున్నవి. తమోగుణాంశము వలన

పంచభూతములు, రజో గుణాంశము వలన సమస్త జీవ సృష్టి, సాత్త్విక గుణాంశము వలన సమస్త దేవతాసృష్టి అనే జగత్తు ఏర్పడుచున్నది. కనుక జ్ఞానము, ఉపాధి అయిన అవిద్య (మాయ) గుణములనే జగత్తు మూడును కలిసి ఏకరూపముగానున్నది యెరుక అని ఈ పద్యములో నిర్వచించిరి.

"తెలివి చేతనే తెలివిన పట్టి తీసివెయ్యరా పోనీ" - మనలోని ఎరుకను (స్వస్వరూపమును) అనుభవ పూర్వకముగా చూడాలి. అంటే గురు ధ్యానము నిర్మల చిత్తముతో ధ్యానము చేసినచో ఎరుక స్థానము హృదయమందున్న అవిద్య యొక్క సత్త్వగుణము ద్వారా భ్రూమధ్య స్థానము వద్ద ఎరుక యొక్క ప్రకాశమును చూడడమగును. ఆ ప్రకాశరూపము (జ్ఞానము) హృదయపద్మ మధ్యస్థమైన అవిద్యోపాధియగు ప్రతిబింబ చైతన్యమని గురూపదేశము చేత గుర్తించి, ఆ ప్రకాశమునందే దృష్టి నిలిపి, సహస్రారమునకు పోనీయకుండుగ, దాని మూలమును చూడ తలంపుతో హృదయ స్థానమునకు, ఆ జ్ఞాన ప్రకాశమును దించుకొనుచు "తన మూలము తానెరుగ దలచిన తానే లేకుండు" శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు చెప్పినట్లుగా, మనము ప్రయత్నించి అవిద్యోపాధి యందున నేను యొక్క అఖండ ప్రకాశమును చూచుటకు ప్రయత్నించినచో జ్ఞానము యొక్క ప్రకాశముచే అవిద్య సమూలముగా నశించిపోవును. ఇదియే "జ్ఞానాగ్ని దగ్ధఃసర్వకర్మాణి" అన్న శృత్యర్థము ఈ భావమునే శ్రీ కృష్ణదేశికేంద్రులు ఈ పద్యము ఎరుక చేతనే ఎరుకను పట్టి తీసివేసినచో, ఎరుక పోవును - "తెలివి చేతనే తెలివిని పట్టి తీసివెయ్యరా! పోనీ" అన్న వాక్యమునకు విచారణ. ఈ విషయము వస్తు నిశ్చయ జ్ఞానము, అది తెలుసుకొని ఆచరించగల ప్రయత్నము అనేక జన్మల పుణ్య సంస్కారము వలన గాని లభింపదు.



**అవతారిక :** పై పద్య భావమునే (ఎరుక లేకుండా చేయుటను) దృష్టాంత సహితముగా ఈ పద్యములో నిర్వచించుచున్నారు.

**91వ పద్యము : లేనెరుక బయలు లోపల । తానై తన కేరుపడిన, తనమూలమునే। తానెరుగ దలచినప్పుడు । తానే లేకుండు, దృష్టాంతము వినుమిచటా ॥ కల దోచదె తనకై తానెచటా ॥ తానై తోచిన కల, తన మేల్కొగన బోతె । తానే తనకు లేదు తగియున్నదీ, దృ । ష్టాంతము వినుమిచటా । కలదోచదె తనకైతానెచటా ॥**

**టీక :** ఏరుపడిన = ఏర్పడిన, తోచబడిన, దృష్టాంతము = లోకములో అనుభవమునకు తెలియబడే ఉపాయము.

**దండాన్వయము :** బయలు లోపల, తానై తనకేరుపడిన లేనెరుక, తన మూలమునే తానెరుగ దలచినప్పుడు....

2) ఎచటా (ఎచ్చటనైనా, ఎవరికైనా) కల తనకై తానె దోచదె ॥

**భావము :** శిష్యా! పరిపూర్ణము లోపల, యీలేనెరుక తనకు తానుగానే ఏర్పడినది. అట్లు యేర్పడిన యెరుక తనకు మూలము ఏది? అని చక్కగా విచారించి, తన మూలమున (హృదయస్థానమును) చూచుటకు గురుకృపచే చూడబోయినప్పుడు తానే (ఎరుక) లేకపోవును. ఇందుకు ఒక దృష్టాంతము చెప్పెదను వినుము. ఎచ్చటైన (ఎవరికైనా) కల తనకు తానే తోచును. అట్టి కల తనకు ముందునుండే ఉన్న మేల్కను గనబోయినచో తానే లేకపోవుచున్నది. యీ దృష్టాంతము సరిపోవుచున్నది కదా! అనగా మూలము లేకుండగా తనకు తానే పరిపూర్ణ పరబ్రహ్మములో ఏర్పడిన ఎరుక (కల) తన మూలమును విచారించినచో తనకు మూలమేమియు లేదని, కలవలె ఏర్పడినది, మిథ్యా స్వరూపము అని తెలసి, శాశ్వతము మొదటి నుండి ఉన్నట్టిది పరిపూర్ణ పరబ్రహ్మమని తెలుసుకొని, అట్టి పరిపూర్ణ పరబ్రహ్మమును (మేల్క) ఎరుక (కల) చూడబోయినచో తానే (ఎరుకయే) లేకపోవును అని భావము. (ఈ భావము వెనుక చెప్పిన 90వ పద్య విశేషభావముతో విచారించి అనుభవపూర్వకముగా ఎరుకనులేకుండా చేసుకొను విధానమై యున్నది.

---

**అవతారిక :** ఈ పద్యములో యెరుక స్వలక్షణములు నాల్గింటిని విశదపరచుచున్నారు.

**92వ పద్యము : చచ్చుట, పుట్టుట, మేలుక । వచ్చుట, గాఢా సుషుప్తి వచ్చుట, లీనా । ల్గచ్చము సహజమెరుకకు । పొచ్చము యీ యెరుక నిల్వ బోదు మాయప్పా॥ అచలము కిట్లు లేదు గదప్పా ॥ మచ్చికతో రెంటి మర్మము, నీకిప్పు । డెచ్చాగదెల్పితి, నెరుగు మెరుక నిల్వ ॥ బోదు మాయప్పా । యచలము కిట్లు లేదు గదప్పా ॥**

**టీక :** పొచ్చము = మోసము, మచ్చిక = ఇష్టము, ఆసక్తి.

**భావము :** శిష్యా! చచ్చుట, పుట్టుట, గాఢా సుషుప్తి పొందుట, మేల్కపొందుట అను యీ నాలుగు యెరుకకు సహజ లక్షణములు. కనుక నా తండ్రీ! యీ మోసము యెరుక ఒక్కరీతిగా నెన్నడూ ఉండదు. ఇట్టి లక్షణములు ఏమియు లేనిది ఒక్క

పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే. విచారించి చూడుము. నీ మీద ప్రేమచే యీ యెరుక పరిపూర్ణ పరబ్రహ్మముల యొక్క మర్మము (రహస్యము) నీకు చెప్పితిని. బాగుగ తెలిసికొనుము.

---

**93వ పద్యము : యెరుకను కలలో పురుషుని । కెరుకే యీ విశ్వమగుచు, యేర్పడు కలగా। యెరుక బయలు గని తాలేం । దెరిగిన వెరుకకది మేల్క, యిది నమ్మ లెస్సా। యెరుకతో పొందు వదలదే పిస్సా । యెరుకనె కల నీకెప్పుడు దోచితె । యెరుక లేందను మేల్క వెరుగు మప్పుడు చాలు ॥ యిది నమ్మ లెస్సా। యెరుకతో పొందు వదలదె పిస్సా ॥**

**దండాన్వయము :** యెరుకను కలలో, పురుషుని యెరుకే యీ విశ్వమగుచు కలగా యేర్పడు, యెరుక బయలు గని తాలేందెరిగిన, యెరుకకు అది మేల్క యిది లెస్సనమ్మ. యెరుకతో పొందు పిస్సా ! వదలదే ?

**టీక :** లెస్స = బాగుగ, ధృడముగా, పిస్సా = అవివేకము.

**భావము :** ఎరుక అను కలలో, పురుషుని యెరుకే కల వలె జగద్రూపముగా యేర్పడుచున్నది. అనగా జగత్తు నీనుండియేర్పడుచున్నది. అట్టి యెరుక పరిపూర్ణమున్నదనియు, అది శాశ్వతమైనదనియు, తానే లేననియు తెలసికొనినచో, యెరుక అనే కలకు అదియే మేల్క. యీ విషయము చక్కగా నమ్ముము. ఇంకను ఎరుకతో పొందు నీకు వదలకపోతే అది నీ అవివేకమే. యెరుక అనే భ్రమ నీకు యెప్పుడు కలిగితే అప్పుడు యీ యెరుక లేదనియు, ఎరుక లేని పరిపూర్ణము ఉన్నదని గుర్తించినచో చాలు. ఆ యెరుక లేకుండా పోవును. యిది బాగుగ నమ్ముము.

**విశేష భావము :** యెరుక అను కలలో - యెరుక అనే లేని దాని యందు, అనగా అవిద్య యందలి, పురుషుని కెరుకే ప్రతిబింబిత చైతన్యము (పురుషుని) అనే యెరుక ప్రకాశము, లేని యెరుక అయిన అవిద్య యొక్క త్రిగుముల నుండి ప్రకాశించుటచే (అజ్ఞానమే) జగద్రూపమై యేర్పడినది. యెరుకయే కలవంటిది కనుక దీని నుండి యేర్పడినది కూడా (జగత్తు కూడా) కలయే, లేనిదే అగును. అట్టి అవిద్య అయిన ఎరుక లేకపోతే, అందలి ప్రతిబింబిత చైతన్యము కూడా లేకపోవును. ఇదియే ఎరుక లేకుండాపోవుట అనదగును.

---

**అవతారిక :** పరిపూర్ణము, యెరుక జగత్తులను ప్రత్యక్ష యుక్తితో చెప్పుచున్నారు. యెరుక జగత్తులకు పరిపూర్ణము కారణము కాదని నిరూపించుచున్నారు.

**94వ పద్యము : చిత్తరువు, రంగు గోడల । వెత్తెరగున దెలిసినావో నీవిప్పుడు, నీ । చిత్తమున జగము వెరుకను । వుత్తబయల్ నట్ల దెలియు, మూహాతోడుతమా॥ తెలపి విడువు మూహాజగములను ॥ అత్తెరగున జెప్తె ఆవలి మాటను । యిత్తెరగని తెలియవెవరుండే । రటు మీద । మాహాతోడుతమా । తెలపి విడువు మూహా జగములను॥**

**దండాన్వయము :** చిత్తరువు, రంగు గోడలను ఎత్తెరగున నీవు దెలసినావో, ఇప్పుడు నీ చిత్తమున ఊహతోడుతను జగము నెరుకను వుత్త బయలును అట్లు దెలియుము. తెలసి ఊహా జగములను విడువుము.

**టీక :** చిత్తరువు = బొమ్మ, ఎత్తెరగున = ఏ విధముగా, నీచిత్తమున = నీ మనస్సునందు, ఊహాతోడుతను = జ్ఞానముతో విచారించి, జగము = సమస్త జగము, ఎరుకను = జగదధిష్ఠానమైన అఖండ యెరుకను, అత్తెరగున = ఆ విధముగా, ఆవలిమాటను = యెరుకకు ఆవలగా నున్న పరిపూర్ణ పరబ్రహ్మమును, యి తెరుగు అని = యీ విధముగా ఉన్నదని.

**భావము :** శిష్యా! బొమ్మ, రంగు, గోడ అనేవి యే లాగున ఉన్నవో జ్ఞానముచే చక్కగా విచారించుము. రంగుచే గోడమీద చిత్ర విచిత్ర బొమ్మలు ఏర్పడుచున్నవి. అట్లే జగత్తును, ఎరుకను, పరిపూర్ణ పరబ్రహ్మమును జ్ఞాన విచారణచే తెలిసికొనుము. అనగా నిర్మలమైన పరిపూర్ణ పరబ్రహ్మమునందు (లేని) యెరుకచే చిత్ర విచిత్ర జగత్తు ఏర్పడుచున్నది. రంగువలనే బొమ్మలు ఏర్పడినవి. గోడ వలన బొమ్మలు ఏర్పడలేదు. ఆ విధముగా పరిపూర్ణ పరబ్రహ్మములో లేని యెరుక చేత జగత్తు కలుగుచున్నది. యెరుక చేతనే జగత్తులు యేర్పడుచున్నది. యీ యెరుక జగములు లేనివని విచారించి తెలుసుకొని, యెరుక జగములను విడిచిపెట్టుము. పరిపూర్ణము అవికారము, కారణ కార్యములు కానిది, శాశ్వతము. ఎరుకను విడచిన తరువాత, పరిపూర్ణము శాశ్వతమైనది ఉన్నది అని ఎట్లు చెప్పగలవు? అని భావము.

**విశేష భావము :** ఈ పద్యము చాలా భావగర్భితము. పరిపూర్ణము యొక్క అవికారత్వము, శాశ్వతత్వమును, యెరుక యొక్క వికారత్వము అశాశ్వతను యుక్తి అనుభవములతో చెప్పిరి. ఇందుకు శృతి ప్రమాణమున్ను కలదు. శ్రీ విద్యారణ్యస్వామి వ్రాసిన వేదాంత పంచాదశి గ్రంధములో 59వ శ్లోకము

"సత్త్వమాశ్రితా శ్శక్తి; కల్పయే త్పతివిక్రియాః।
వర్ణాభిత్తి గతాభిత్తౌ, చిత్రం నానా విధీయతే ॥

1) పరిపూర్ణము = శాశ్వతమైనది వికార రహితము. నిష్క్రియ ఎరుక, జగత్తులకు ముందు, ఉన్నప్పుడు / తరువాత అనగా 3 కాలములయందు ఒక్కతీరుగా ఉన్నది. యెరుకకు కాని జగత్తుకు గాని కారణము కానిది.

2) ఎరుక - పరిపూర్ణములో లేనిదే తనకు తానుగా ఏర్పడినది. ఇదే అనేక రూప జగత్తును నిర్మించుచున్నది. జగత్కారణము. ఇది మూడు కాలముల యందు లేనిది. మిధ్యా స్వరూపము. అభాసము ఏకదేశ్యము

3) జగత్తు - పరిపూర్ణములో లేదు. లేని ఎరుక వలన ఒక కాలము నందు సృష్టింపబడినది. అశాశ్వతము, వికార రూపము.

1) గోడ = నిర్మలమైనది శాశ్వతమైనది, వికార రహితము. బొమ్మ, రంగులు ముందు ఉన్నది. రంగు బొమ్మలకు గోడ కారణము కాదు, కార్యము కాదు.

2) రంగు = గోడ యందు ఈ రంగులేదు, తనకు తావచ్చినది. రంగుచేతనే బొమ్మలు వచ్చినది. రంగే బొమ్మగా అయినది. రంగుబొమ్మలు ఒక కాలమునందు మాత్రమే ఉన్నది.

3) బొమ్మ = గోడమీద లేనిదే రంగు వలన సృష్టింపబడినది. అశాశ్వితము వికార రూపము.

ఈ విధముగా విచారించినచో రంగు బొమ్మలు లేనివనియు గోడ నిర్మలమై శాశ్వతమైనది అని తెలిసినట్లుగానే, పరిపూర్ణములో లేనిదే యెరుక ఏర్పడి, యీ యెరుకయే జగత్తును నిర్మించుచున్నది. యెరుక జగత్తులు రెండును అశాశ్వితములు, లేనివి. పరిపూర్ణము నిర్మలమైనది, శాశ్వతమైనది. కనుక యెరుక జగములు లేనివని లేకపోయినచో పరిపూర్ణమును గురించి చెప్పేవారు లేరు.

**అవతారిక :** యెరుక తానే బ్రహ్మమని సర్వాధిష్ఠానమని తలంచును. తాను లేనని తెలిసికొని లేకపోయేది కూడా యెరుకయే. రెండు భిన్న లక్షణములు కలది అని చెప్పుచున్నారు.

**95వ పద్యము : పరిపూర్ణములో లేనిదె । యెరుకొక్కటి దోచి, తనను యెరిగివ మృషగా। యెరుకే విడచునదెట్లన । కరములు తమ పనులు తామె గడుపునట్లుగనూ॥**

యిది గాకుంటే కలదింకోటి వినా ॥ మరికానిదామాట, మంచిదీమాటని । పరిపరి విధముల పలుకె పలుకుల పని ॥ గడుపునట్లుగను ॥ యిదిగాకుంటె కలదింకోటి వినా॥

**దండాన్వయము :** ఎరుకొక్కటి దోచి, తనను మృషగా యెరిగిన యెరుకే విడుచును అదెట్లన....

**భావము :** శిష్యా! పరిపూర్ణములో లేనిదే యెరుక ఒకటిదోచి, తానే బ్రహ్మనని, సర్వాధిష్ఠానమై శాశ్వతమైన ఆత్మనని భావించి, గురుముఖముగా పరిపూర్ణమున్నదని తెలిసి అందులో తాను మిధ్యయని తెలిసికొనినచో, తనకు తానే (లేనని) లేకపోవుచున్నది. (పరిపూర్ణమున్నదను సత్యమును ఎరుగనప్పుడు, తాను శాశత్వము బ్రహ్మమును అని భావించినది. పరిపూర్ణము ఉన్నదని తెలసినపుడు, తాను మృషనని ఎరిగి తానే లేకపోవుచున్నది. యీ రెండు భిన్నమైన పనులు, ఒక్క యెరుక చేతలే. పరిపూర్ణమునకు ఏమియు సంబంధము లేదు. అది ఎట్లనగా చేతులు ఇచ్చుట (దానము చేయుట) అను పనిని చేయుచున్నవి. ఆ చేతులే పుచ్చుకొనుట (ప్రతి గ్రహణము) అను భిన్నమైన పనిని కూడా చేయుయున్నవి. అట్లే నోరు (వాక్కు) ఈ మాట మంచి మాట అని చెప్పును. ఆ నోరే మరొకప్పుడు అది చెడు మాట అని భిన్నముగా రెండు రకములైన మాటలను ఒక్క నోటితోనే మాట్లాడినట్లుగా యెరుక ఉన్నానని చెప్పి, నిజమును గ్రహించిన వెనుక తాను లేనని లేకపోవుచున్నదని భావము. యీ రెండు పనులు ఒక్క యెరుకే చేయును.

---

**అవతారిక :** ఎరుక పరిపూర్ణమును ఎంత మాత్రము చూడలేదు గ్రహించలేదని యుక్తితో నిరూపించుచున్నారు.

**96వ పద్యము : తలయెత్తి చూడజాలునె । అచీకటి యెదుట నిల్చి అజ్జాప్పుకళన్ । కలవచ్చి మేల్కయందువ । గల చేష్ఠల మ్రోల నిల్చి కనుగొనగలదా ॥ అట్లనె యెరుక కనుగొనగలదా ॥ యిలలో సద్గురు బోధ నెరుగని నరుని చే ॥ ష్టలు గంటి మళ్లక్కి సద్గురు బోధౌట ॥ కనుగొనగలదా । అట్లనె యెరుకకనుగొనగలదా ॥**

**దండాన్వయము :** 1) చీకటి అల అజ్జాప్పుయెదుట నిల్చి, కళన్ తల యెత్తి చూడజాలునె? 2) కల వచ్చి మేల్క మ్రోల నిల్చి అందున గల (కలయందున) చేష్ఠలు కనుగొనగలదా? 3) అట్లనె యెరుక (పరిపూర్ణమును) కనుగొనగలదా? 4)

యిలలో సద్గురు బోధనెరుగని నరుని చేష్టలు సద్గురు బౌధౌట గంటె నుల్లక్కి ॥ కనుగొనగలదా?

**టీక :** అజ్జాప్పు కళన్ = సూర్యుని ప్రకాశమును, చేష్టలు = క్రియలు, పనులు, సద్గురుబోధన్ = పరిపూర్ణ పరబ్రహ్మమును, ఎరుగని నరుని చేష్టలు = ఎరుగక (తెలియక) చేసిన సమస్త కర్మములు, సద్గురు బోధ ఔట = పరిపూర్ణ బోధ పొందిన పిదప, కంటెన్ = విచారిస్తే, ఉల్లక్కి = లేకపోవును రహితమగును.

**భావము :** చీకటి, ఆ సూర్యుని యందు నిలచి, ఆ ప్రకాశమును తలయెత్తి చూడగలదా? (చూడలేదు) స్వప్నము మేల్కొ యెదుట నిలిచి, స్వప్నములో తోచిన క్రియలను చూడగలదా? (చూడలేదు) ఆ విధముగానే యెరుక పరిపూర్ణమును మాడగలదా? (చూడలేదు) పరిపూర్ణ బోధ తెలియనప్పుడు చేసిన మానవుని సమస్త కర్మలు, పరిపూర్ణ బోధ గురుముఖముగా తెలిసికొని విచారించినచో సమస్త కర్మలు ఉల్లక్కి (లేకుండా పోవును)

**విశేష భావము :** యెరుకకు, తాను చేసిన కర్మల వలననే పునారావృత్తి కలుగుచున్నది. అట్టి యెరుక గురుముఖతా పరిపూర్ణ బ్రహ్మమును చక్కగా విచారించి తెలిసికొనినచో, ఎరుక యొక్క కర్మ స్వరూపమైన అవిద్య పూర్తిగా నశించును. అవిద్య నశించుటచే అందున్న సమస్త ఆగామీ కర్మలు నశించిపోవును. కనుక పునరావృత్తికి కారణమైన కర్మ నశించుటచే, ఆ యెరుక పూర్తిగా లేకపోవుచున్నది. అదే పునరావృత్తి రహితము.

---

**అవతారిక :** కల, మేల్కొలు రెండును ఒకదానిని ఒకటి యెరుగవు అనే యుక్తితో ఎరుక పరిపూర్ణములు అట్లే ఒకదానిని మరొకటి ఎరుగవు అని చెప్పుచున్నారు.

**97వ పద్యము : అంటదు కల మేల్కొమ మే। ల్కంటదు కల వెన్నటికిని, కదు నిశ్చయమీ । రెంటి క్రియ గుర్తుబయలుల । రెంటిని రెండంటకుండు, రెంరెంటిలోనూ॥ కల యెరుకాలీ రెండూ మిథ్యేనూ ॥ దంటగ మేల్కొ బయలుంటావెప్పటికెరిగి । గెంటు మాపై రెంట రెంటి కల యెరుకల ॥ రెంరెంటిలోనూ। కల యెరుకలీ రెండూ మిథ్యేనూ ॥**

**టీక :** దంటగ = జంటగ

**దండాన్వయం :** ఆ పై రెంట (ఆ పైన ఉన్న రెండు అయిన) కల, యెరుకల రెంటిని గెంటుము.

**భావము :** శిష్యా! కల =- మేల్కను, మేల్క -కలను ఎన్నటికి ఒకదానిని మరొకటి అంటదు (చూడలేదు) ఇది నిశ్చయమే కదా! ఆ రెంటి వలెనే ఎరుక - బయలులు రెండూ ఒకదానిని మరొకటి చూడలేవు (అంటదు) కల, యెరుకలు రెండూ మిధ్య, అనగా లేనివి, మేల్క - బయలులు రెండూ శాశ్వతమైనవి, అని తెలిసి, లేని కల-యెరుకలును గెంటుము (లేకుండా చేసుకొనుము అని భావము)

---

**అవతారిక :** ఇంతవరకు కలతో యెరుకను, బయలును మేల్కతోను పోల్చి నిరూపించిన గురు ప్రభువు ఈ పద్యములో బయలును గాఢ సుషుప్తితో పోల్చి అనుభవపూర్వకముగా చెప్పుచున్నారు.

**98వ పద్యము : యెరుగదు సుషుప్తి జాగ్రద । ని, రవంద సుషిప్తి, రెంటి నెరుగును మేల్క । ట్ల రయగ, బయలెరుకల, రెం। ట్నెరుగదు బయలెరుక రెంటి । నెరుగుచునుండూ ॥ గురుముఖమున నెరిగి యీ రెండూ ॥ తిరముగ నెరుకను దీసివేసితే జాలు । పరులు నేనని యేటి పలుకే లేకుండు ॥ నిట్లెరుగుచు నుండూ॥ గురుముఖమున నెరిగి యీ రెండూ ॥**

**పదవిభాగము :** ఇరవంద సుషుప్తి - సుషుప్తి, జాగ్రదను యెరుగదు । రెంటిని మేల్కయెరుగును । అట్లరయగ బయలు, బయలు యెరుకల రెంట్ని యెరుగదు । ఎరుక రెంట్ని ఎరుగుచుండు ।

**టీక :** ఇరవంద = గాఢమైన, తిరముగ = శాశ్వతముగ

**భావము :** శిష్యా! గాఢ సుషుప్తి సుషుప్తి జాగ్రత, రెంటిని ఎరుగదు. మేల్క (జాగ్రద), మేల్కను - సుషుప్తిని రెంటిని ఎరుగును. అట్లే బయలు (పరిపూర్ణము) బయలును, ఎరుకను రెంటిని ఎరుగదు. ఎరుక, బయలును - ఎరుకను రెంటిని ఎరుగును. గురుముఖముగా యీ యెరుక - బయలులను చక్కగా తెలిసికొని యెరుక లేనిదని శాశ్వతముగా తీసివేసినచో చాలును. ఇతరులు, నేను అనే మాటలు ఏమీ లేకుండాపోవును. ఈ విధమును గురుముఖత తెలిసికొనవలెను.

**విశేష భావము :** ఈ పద్యములో ఒక విశేషమున్నది. గత 96 మరియు 97వ పద్యములలో ఎరుకకు పరిపూర్ణము సంగతి కాని పరిపూర్ణమునకు ఎరుక సంగతి కాని యెంత మాత్రము తెలియదు అని దృష్టాంత పూర్వకముగా నిర్ణయించినారు. కాని యీ 98వ పద్యంలో "గురుముఖమున యీ రెంట్ని (బయలు, ఎరుకలు)

ఎరిగి, తిరముగ ఎరుక దీసివేసితే చాలు అనియు, జాగ్రద, సుషుప్తిని జాగ్రతను యెరుగుచున్నట్లుగ, ఎరుక, బయలును ఎరుకను రెంట్ని ఎరుగుచున్నది అని వివరించిరి.

అయితే బయలుకు ఎరిగే లక్షణము లేనిది కనుక అది ఎరుకను ఎంతమాత్రము ఎరుగదు అనేది సిద్ధాంత వాక్యము. అయితే ఎరుక ఎరిగే లక్షణము కలదైనను, ఎరుకనే ఎరుగగలదు. కాని నిజమైన పరిపూర్ణమును ఎంతమాత్రము తెలిసికొనుటకు వీలు లేదు, కాని గురుముఖతా బయలు ఇట్టిది అని అన్వయ, వ్యతిరేక లక్షణములచే తెలిసికొనినచో బయలు పరోక్ష జ్ఞానముగా తెలియబడును. ఆ తరువాత అపరోక్షముగా తెలియబడవలెను. అందుకు మనలోని ప్రతిబింబిత చైతన్యమును గురుకరుణచే చూడగల్గినప్పుడు అప్పుడు బయలు అపరోక్షమై ఎరుక లేకపోవును. ఈ విషయము గురు కరుణచే చక్కగా గుర్తించవలెను. ఇదే ఎరుక బయలును ఎరుగుట. పూర్తిగా బయలును ఎరుక ఎరుగకపోయిననూ, గవయ మృగమును, ఆవును చూచి గుర్తించినట్లుగా తెలియవలెను.



**99వ పద్యము : సంకల్పము లేనిదె, ని। స్సంకల్పములోన దోచు, చను దోచుచనున్। సంకల్పము తప్పువ, ని। స్సంకల్పము నెరిగేనేని, చనుతాలేవనుచూ ॥ విస్సంకల్పమును నిల్చేదనుచూ ॥ సంకల్పించుట కింక సంకల్పమేది, ని। స్సంకల్ప మిందిట్లు సంకల్పమెరిగితే ॥ చనుతాలేవనుచూ । విస్సంకల్పమును నిల్చెదనుచూ ॥**

**దండాన్వయము :** సంకల్పము లేనిదె, నిస్సంకల్పములోన దోచుచను దోచుచనున్। సంకల్పము తప్పున, నిస్సంకల్ప మందు ఇట్లు సంకల్పము ఎరిగితే, నిస్సంకల్పమును నిల్చేదనుచు, తాలేననుచు, సంకల్పించుట కింక సంకల్పమేది?

**టీక :** సంకల్పము = ఎరుక, నిస్సంకల్పము = పరిపూర్ణము, చను = లేకపోవును, తప్పున = చటుక్కున, నిల్చేదనుచు = శాశ్వతమైనదని తెలుసుకొని, సంకల్పించుటకు = ఎరుగుటకు ।

**భావము :** శిష్యా! యెరుక పరిపూర్ణములో లేనిదే తోచి గతించి తిరిగి జనించుట గతించుట జరుగుచుండును. అట్టి యెరుక చటుక్కున పరిపూర్ణము ఉన్నదని గుర్తించినచో, అందులో తాను లేనని తెలిసి లేకపోవుచున్నది. ఆ విధముగా ఎరుక లేకపోయిన తరువాత, పరిపూర్ణమున్నదని గాని, తానులేనని గాని ఎరుగుటకు

యెరుక ఉన్నదా? అనగా ఎరుకలేకపోయిన పిదప, పరిపూర్ణము ఉన్నదని చెప్పేది ఎవరులేరు అని భావము.

**విశేష భావము** : ఈ పద్యములో "సంకల్పము" అనగా యెరుక అనియు "నిస్సంకల్పమనగా" పరిపూర్ణమనియు అర్ధము చెప్పవలెను. యెరుక పేర్లు వివరించుచు 60వ కందార్థములో "సంకల్పమనినా యిచ్చనినా" అని చెప్పినారు.

---

**అవతారిక** : యెరుక యెన్ని జన్మలకైననూ తనకు తానుగా విడిపోదనియు, ఒక్క గురుకరుణచే మాత్రమే పూర్తిగా లేకపోవుననియు ఈ పద్యములో చెప్పుచున్నారు.

**100వ పద్యము : యెరుక తనకు దా విడిపో । దె, రుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్ । గురుడొకడు తప్ప, గురునకు । పరిచర్య యొనర్చి, పద్ధాతి వినినన్ ॥ తిరిగి రాని పద్ధాతి గనినన్। పరిపూర్ణ మెరుక యేర్పరుచ, నెరుక లేక । హరిని స్వప్నము గన్నకరి మ్రగ్గినట్లొ, యీ ॥ పద్ధతి వినినన్ । తిరిగిరాని పద్ధతి గనినన్ ॥**

**దండాన్వయము** : యెరుక తనకు దా విడిపోదు । ధాత్రిన్ గురుడొకడు తప్ప యెవ్వరూ యెరుకను విడిపించలేరు । గురునకు పరిచర్యమొనర్చి (బోధ) పద్ధతి వినినన్, గనినన్। పరిపూర్ణము ఎరుక ఏర్పరుచ । హరిని స్వప్నమున గన్న కరిమ్రగ్గి నట్లొ, యీ యెరుక లేక తిరిగి రాని పద్ధతి ఔను ।

**టీక** : హరి = సింహము, కరి = ఏనుగు, పరిచర్య = సేవ, పూజ.

**భావము** : శిష్యా! యెరుక తనంత తానుగా ఎన్నడూ విడిపోదు. యీ భూమిపై గురుమూర్తి ఒక్కడు తప్ప మరెవ్వరును, యెరుకను విడిపించలేరు. కనుక గురుమూర్తికి సపర్యలు చక్కగా చేయుచు బోధను పద్ధతిగ తెలుసుకొనుచు, ఆ పరిపూర్ణమును కనినచో । పరిపూర్ణము తెలియబడి (గుర్తించబడి) సింహమును ఏనుగు కలలో కాంచిన వెంటనే ఏనుగు చనిపోయినట్లుగా, యీ యెరుక లేకపోవును. అదే యెరుక తిరిగిరాని పద్ధతి ఔను.

**విశేష భావము** : "శాస్త్ర జ్ఞోపి, స్వతంత్రేణ, బ్రహ్మజ్ఞానాన్వేషణం నకుర్యాత్" ఆర్ష వాక్యము. శాస్త్రజ్ఞుడు అయినను బ్రహ్మతత్త్వ జ్ఞానమును స్వతంత్రముగా అభ్యసించినచో బ్రహ్మతత్త్వము తెలియబడదు. సద్గురుముఖముగా మాత్రమే అభ్యసించవలెను. గురు కరుణచే మాత్రమే యెరుక లేకుండా పోవును. మరొక

విధము ఏదియు లేదు. "కరుణాఖడ్గపాతేన। ఛిత్వా పాశాష్టకం శిశోః" అనియు "ముక్తి మూలం గురోఃకృపా" అనియు గురుగీత బోధించుచున్నది. కనుక మానుష గురుమూర్తికి చక్కగా పరిచర్యమొనర్చి బోధ పద్ధతి వినవలెను. అంతర్ముఖ గురునకు ప్రతిబింబ చైతన్యమును। యెరుక లేక సేవించుచు, పరిపూర్ణమును భావించుచు కనినచో, ఆ చూచిన యెరుక సమూలముగా నశించిపోవును. ఏనుగు వద్దకు సింహము రాకపోయినను, ఏనుగు సింహమును కలలో చూచినంత మాత్రముననే ఏనుగు చనిపోయిన విధముగా, ఎరుక పరిపూర్ణమును చూడలేక పోయినను, ప్రతిబింబ చైతన్యమును పరిపూర్ణముగా భావించి చూచినంత మాత్రముననే ఎరుక పూర్తిగా లేకపోవును. అందుకు (అంతఃర్ముఖ) గురుకృప కావలెనని యీ పద్యములో యెరుక లేకపోయే విధానమును అతి రహ్యాముగా నిరూపించినారు.

**అవతారిక** : పై పద్యములో చెప్పిన పరిపూర్ణము అపరోక్షముగా తెలియబడుటకు, గురుకృప కావలెనని యీ పద్యములో చెప్పుచున్నారు.

**101వ పద్యము : అపరోక్షమౌనె మనుజుల। కు, పరోక్షంబైన బయలు గురుకృపలేకన్। అపరోక్షమౌను మనుజుల। కు, పరోక్షంబైన బయలు గురుకృపకలుగా॥ కీలిదె లేని యెరుక తా తొలగా ॥ విపరీతమౌ బుద్ధి విడచి నీ వెప్పుడు। యుపచారములు జేయుచుండుము గురునికి ॥ గురుకృపకలుగా। కీలిదె లేని యెరుక తా తొలగా ॥**

**టీక** : కీలిదె = రహస్యము యిదె.

**దండాన్వయము** : మనుజులకు పరోక్షంబైన బయలు గురుకృపలేకన్ అపరోక్షమౌనె? మనుజులకు పరోక్షంబైన బయలు గురుకృపకలుగా అపరోక్షమౌను। లేని యెరు తా తొలగా కీలిదె। (కనుక) విపరీతబుద్ధి విడచి గురుకృప కలుగా గురునికి ఎప్పుడు ఉపచారములు చేయుచుండుము.

**భావము** : శిష్యా! సాధకులైన శిష్యులకు పరోక్ష జ్ఞానముగా తెలియబడిన పరిపూర్ణ బ్రహ్మము (వాచాజ్ఞానము) గురుకృప లేకున్నచో అపరోక్షముగా తెలియబడదు. గురుకృప కలిగిన సాధకులకు పరిపూర్ణ పరబ్రహ్మము అపరోక్షముగా తెలియబడును. అట్లు అపరోక్షముగా తెలియబడిన వెంటనే లేని యెరుక పూర్తిగా లేకపోవును. లేని యెరుక లేకపోవుటకు ఇదియే రసహ్యాము. అనగా గురుకృప కలిగుటకు సాధకుడు

ప్రయత్నించవలెను. అందుకై విపరీత బుద్ధిని విడచి గురుకృప కలుగుటకై గురుమూర్తికి ఉపచారములు ఎప్పుడును చేయుచుండుమని యీ పద్య భావము.

**విశేష భావము :** పరోక్షంబైన బయలు = పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి సంశయ రహితముగా గురుముఖతా తెలిసికొనుట, ఇది వాచాజ్ఞానము. పరిపూర్ణము ఎరుకల గురించి సంపూర్ణముగా బోధ రూపముగా గురుముఖత తెలిసికొనుట అందుకు బోధ నిస్సంశయముగా తెలియపర్చుటకై (మానుష) గురుమూర్తికి సపర్యలు చేయవలెను. ఇందుకు విపరీత బుద్ధి విడువవలెను. అనగా గురుడు ఈశ్వరుడు కాడు గదా! కేవల మానుష్య మాత్రునకు పూజలేమిటి? అనే విపరీత బుద్ధిని విడచి, గురునకు ఈశ్వరునకు అబేధ బుద్ధితో సపర్యలు చేయవలెను. అప్పుడు మాత్రమే గురుకృపకలుగును. గురుకృప అనగా గురువు గారి దయ అని అర్ధము కాదు, పరిపూర్ణ పరబ్రహ్మమును ప్రత్యక్షముగా చూడగలిగిన జ్ఞాన దృష్టి అని తెలుసుకోవలెను.

"అపరోక్షమౌను" అనగా ఆ పరిపూర్ణమే నేను అనే అనుభవ పూర్వకమైన జ్ఞానము. అనగా ఎరుకయే పరిపూర్ణము అని అర్ధము కాదు. ఈ రహస్యము గురుముఖతా తెలియవలెను.



**అవతారిక :** జీవ, శివ, పరిపూర్ణముల యొక్క బేధమును నిరూపించుచున్నారు.

**102వ పద్యము : నేనెవ్వడనను జీవుడు । నేనే నేనను శివుడు, యీ రెండనకన్। తానుండు నచలము వీట్ని । నేనెరి గరిగినను, పైది నేనెట్లనినీ । నేననకున్న తానెట్లనినీ। నేనన్న దాంట్లో నేనీనా ప్రసంగము । తానన్న దాంట్లోనె తలపోయ వలెనిట్లు ॥ నే నెట్లని నీ । నేనకున్న తానెట్లనినీ ॥**

**భావము :** శిష్యా! జీవుడు - నేనెవ్వడను? అంతా ఆ పరమేశ్వరుని దయ, నా వల్ల ఏమీ కాదు, అని భావించును. ఈశ్వరుడు (బ్రహ్మాండాధిష్ఠాత) నేనే సమస్తమును అయి యున్నాను. నాకు పైన ఏమీ లేదు. ఈ సమస్తమునకు కర్తను, భోక్తను నేనే అని భావించును. కాని పరిపూర్ణ పరబ్రహ్మము నేనెంతవాడను అని కాని, సమస్తము నేనే అని కాని అనకుండా శాశ్వతమై యుండును. ఈ విధముగా జీవ, ఈశ్వర పరిపూర్ణములను తెలిసి జీవ - శివ రూపమైన "నేను" అను ఎరుకను విడిచినచో ఆ

బ్రహ్మమును నేనే అని ఎట్లనగలవు? నీవే (ఎరుకయే) అన లేకపోయినచో, నేను లేని ఆ పరిపూర్ణ బ్రహ్మము ఏమాత్రైన అనగలదా? ఎందుచేతననగా "నేను" అనే ఎరుక యందే ఈ జీవ - శివ ప్రసంగములు జరుగును. ఈ సమస్త జీవ - శివ బ్రహ్మాండ జగత్తులన్నియు, తానైన పరిపూర్ణ పరబ్రహ్మమునందే లేక కలవలె ఏర్పడుచున్నట్లుగా భావించవలెను.

**విశేష భావము :** జీవుడు అనగా అజ్ఞాని. ఈశ్వరుడు-జ్ఞాని, నేనెంతవాడను, ఈశ్వరాజ్ఞవలన నేను వ్యవహరించుచున్నాను అని అజ్ఞాని పరాధీనుడై యుండును. కాని ఈశ్వరుడు సమస్త సృష్టికర్త, భోక్త అయియున్నాడు. సమస్త సృష్టికి తానే అభిన్ననిమిత్తో పాదాన కారణమై యున్నాడు. కాని పరిపూర్ణ పరబ్రహ్మము సృష్టికి కారణము, కర్త, కార్యము ఏమీ కానిది. ఏమియు లేనిది. ఉత్తది నేను అను ఎరుక లేనిది. ఎరుక యందు జీవ-శివ అనే సమస్త జగత్తు వ్యవహారమంతయు కలవలె లేక జరుగుచున్నది. నేను అనగల్గినది ఎరుక మాత్రమే. నేనే శివుడను అని గాని, జీవుడను అని గాని బ్రహ్మమును అని గాని అనగల్గినది. పరిపూర్ణము ఉన్నదని తెలిసి నేననే ఎరుక లేకపోయినచో ఇక ఆపైన నేనే బ్రహ్మను అనే వారెవరు? పరిపూర్ణములో నేను లేదు కనుక పరిపూర్ణము ఎంతమాత్రము ఏమియు భావించలేదు.



**అవతారిక :** ఎరుక యొక్క స్వస్థానమును తెలియపరచి ఆ యెరుక లేకుండ చేసే విధానమునకు, ఈ పద్యములో వివరించుచున్నారు.

**103వ పద్యము :** తొర్రలు తొమ్మిది గల, మే । న్మరికి యొకరెంటిలోన మర్రలు నాల్గుం । డెర్రది తెల్లది నల్లది । కర్రిది దానగ్ర మందు, గలదొక్కతూటూ ॥ అది యెరుకనె పులుగుండే చోటు॥ కుర్రా గురుబోధనె గ్రుద్దలిచే బూని। మర్రి.పులుగుల రెంట్ని మలచి కొట్టర, పోనీ ॥ కలదొక్క తూటూ । అది యెరుకనే పులుగుండే చూటూ॥

**టీక :** మలచి = దొలచి, పులుగు = ఎరిగేది, అగ్రమందు = చివర భాగమందు.

**భావము :** శిష్యా! తొమ్మిది రంధ్రములతో శరీరమనే మర్రిచెట్టుకు అందలి రెండు రంధ్రములు - ఎరుపు, తెలుపు, నీలి, బూడిద రంగు అను నాలుగు రంగులతో కూడి యుండి, దానగ్రభాగము (కొన మధ్యగా) అతి సూక్ష్మ రంధ్రము ద్వారా ఒక తూటు కలదు. అనగా గొట్టము వంటి మార్గము కలదు. అది హృదయ స్థానమునకు

వెళ్లను. అందులోనే ఎరుక అనే ఎరిగేది ఉండే చోటు. (హృత్పుండరీక మధ్యస్థం). శిష్యా! గురుబోధనే గ్రుద్దలి చేత, మర్రి అనే శరీరమును, అందున్న పులుగు అయిన ఎరుకను రెంటిని దొలచి కొట్టుము.

**విశేష భావము :** తొర్రలు తొమ్మిది గల మేన్మర్రి. 9 రంధ్రములు - 2 చెవులు, 2 కండ్లు, 1 నోరు, 1 ముక్కు, 1 మూత్రస్థానము, 1 గుదము । బ్రహ్మరంధ్రము (ఇది నాభి అని కొన్ని చోట్ల, సహస్రారము అని కొన్ని చోట్ల చెప్పబడినది.) శరీరము మర్రిచెట్టుతో పోల్చబడినది. మర్రి ఊడలు దింపుకొనుచు, తన అస్థిత్వమును శాశ్వతపర్చుకొనుచుండును. అట్లే శరీరము నాది, నేను అని అభిమానము పెంచుకుంటూ, జన్మజన్మలకైనను (ఏదో ఒక శరీముతో) నశించక నిలబడుచున్నది.

"మర్రి పులుగుల రెంట్ని మలచికొట్టర" మర్రి అనగా శరీరము. అనగా ఉపాధి అయిన సూక్ష్మ శరీరమున్ను, పులుగు అనగా ఎరిగేది అనగా ఎరిగే శరీరము అయిన అవిద్యను రెంటిని, మలచి కొట్టర = కొద్దికొద్దిగా దొలచి ప్రయత్నము చేయుచు, అనగా గురుబోధ తెలుసుకొన్నాక వెంటనే యెరుక పోదు. గురు కృప వలన పోవాలి. గురుకృపకై ధ్యానము చేయుచున్నచో, ఆ గురుకృప కలిగిన వెంటనే అరనిమిషములో ఎరుక పూర్తిగా లేకపోవును. ఈ విషయము గురుముఖముగా తెలియవలెను. విశదీకరించి వ్రాసేది కాదు.

---

**104వ పద్యము :** తనువుతొ వచ్చిన యెరుకే । తనువును తనువనుచు, తనను తానని యెరుగున్ । తనువును బాసిన మీదట । తన నా దేహమును రెంట్ని తానెరుగ దపుడూ ॥ అది గనుక తా లేనే లేదెపుడు ॥ అనుమాన రహితమింద చలమున్నది కంటే । తన మాట తలపోయ తనకె సిగ్గయి తనను ॥ తానెరుగ దపుడూ । అది గనుక తాలేనే లేదెపుడు ॥

**దండాన్వయము :** ఇందచలమున్నది కంటె, తన మాట తలపోయ తనకె సిగ్గయి, అనుమాన రహితమగును. (అగును అన్యాపదేశము)

**టీక :** అనుమానము = ఎరుక.

**భావము :** శరీరముతో వచ్చిన యెరుకయే, శరీరమును మిధ్యయనుచు, తాను శాశ్వతమైన బ్రహ్మమనియు తలపోయును. ఆ యెరుక శరీరమును విడచినచో,

తనను గాని తన శరీరమును గాని ఎరిగే లక్షణము లేదు. అనగా శరీరమును (ఉపాధిని) ఆధారముగా జేసికొని ఉన్నదనియు, కనుక శరీరము వంటిదే ఎరుక అనియు, శరీరము వలనే ఎరుక కూడా మిధ్యా స్వరూపమనియు చెప్పవలెను. ఇట్టి యెరుక ఇక్కడే శాశ్వత బ్రహ్మమైన పరిపూర్ణమున్నదని విచారించి చూచినచో యెరుక తన మాట తలపోయ సిగ్గయి తాను లేకుండా పోవును.

(అనుమాన రహితము అనగా ఎరుక రహితము అని అర్థము)

**విశేష భావము :** శరీరమును ఆధారముగా జేసికొని ఎరుక సమస్త కర్మలు చేయుచున్నది కనుక శరీరము వంటిదే ఎరుక కూడా, మిధ్యా స్వరూపమే అని చెప్పవలెను.

"ఇందచలమున్నది కంటే" - ఈ శరీరమునందే హృదయస్థానమున అవిద్య యందు పరిపూర్ణము యొక్క ప్రతిబింబము ఉన్నదని, యెరిగే యెరుక అయిన అవిద్య ప్రతిబింబ చైతన్యమును గురుకృపచే చూచినచో, అవిద్య అనే ఎరిగే ఎరుక లేకుండా పోవును. అవిద్య పోయినచో అందలి ప్రతిబింబము కూడా పోవును. ఇదే అనుమాన రహితము.

---

**అవతారిక :** యెరుక - జగత్తులు రెండును అశాశ్వతమైనది, లేనివి. పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే శాశ్వతమైనదని యుక్తిచే నిరూపించుచున్నారు.

**105 పద్యము :** ఉప్పెనచే జెడు తరువౌ । కప్పుడు విత్తనము పుచ్చు, నా రెంటికి యీ । తిప్పలు తప్పవు, ధరయే । తిప్పలు తానెరుగ దిట్లు తెలుసు గదోయీ ॥ తను వెరుక బయలుల నట్లెరుగోయీ ॥ గొప్పైన గురుబోధ చొప్పున నెరిగి, పై । తిప్పలు గలవాట్ని తప్ప దీసితె చాలు ॥ తెలుసుగదోయీ । తను వెరుక బయలులనట్లెరుగోయీ॥

**భావము :** తుఫానుచే చెట్టు నశించిపోవును. ఒకప్పుడు విత్తనము పుచ్చి నశించును. విత్తనము చెట్టు ఈ రెంటికి సృష్టి - స్థితి నాశములు అనే తిప్పలు తప్పవు. కాని భూమికి అట్టి తిప్పలు ఏమీ లేకుండగ శాశ్వతమైనది. అట్లే శరీరము - ఎరుక యీ రెంటికి సృష్టి - స్థితి - నాశములు తప్పవనియు, పరిపూర్ణమునకు అట్టి తిప్పలు ఏమియు లేవని తెలుసుకొని, గొప్పదైన పరిపూర్ణ బోధచే సృష్టి - స్థితి - నాశములు గల యెరుకను లేకుండగ చేసినచో చాలును అని తెలియవలెను.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత

ద్వైతాద్వైత రహిత పరమ తత్త్వే

యెరుక మోక్షణన్నామ , షష్టమోధ్యాయమునకు భావ, విశేష భావములు

సమాప్తము

## అధ్యాయము-7

# మతాల లక్షణము (29)

**అవతారిక :** సాంఖ్య, తారక, అమనస్క, వైశేషిక, ద్వైత, అద్వైత విశిష్టాద్వైత, శైవ, వైష్ణవ, శాక్తేయ, గణాపత్య, సౌర, కాపాలికాది సమస్త మతముల వారు, తమకు అనుకూలముగా శృతులకు, అర్థములను చెప్పుకొనుచు ఎరుకనే బ్రహ్మముగా చెప్పుకొనుచున్నారు. అవన్నియు ఎరుక మతములే ఈ పరిపూర్ణ బోధకు సరిరావని ఈ అధ్యాయములో వివరించుచున్నారు.

**106వ పద్యము : మతముల వారలు తమస । మ్మతమైనటువంటి శాస్త్ర మర్యాదలచే। మిత మేరపరచుకొని బహు । గతులను కలహితురట్టి గతి నీకేమిటీకి ॥ చెపలత జెందే స్థితి నీకేమిటికి ॥ ప్రతి లేనియీ బట్టబయలుండ జూచి సం । తతము లేనెరుక లేదని నమ్ముమిక వారి ॥ గతినీకేమిటికి । చెపలత జెందే స్థితి నీకేమిటికి ॥**

**భావము :** వివిధ మతముల వారు వారి సిద్ధాంతములను పోషించుకొనుటలో అందుకు సమ్మతమైన శాస్త్రాగమాదులను వారి భావములకు సరిపడులాగున, అర్థము, భాష్యములు చెప్పుకొనుచు, మితములోనే ఉంటూ, అనేక వాద ప్రతివాదములతో తగువులాడు కొనుచుందురు. శిష్యా ! ఆ విధానములు మనకు వద్దు, ఎరుక లేని యీ పరిపూర్ణ పరబ్రహ్మమును శాశ్వతమైనది, అమితమైనది అని తెలుసుకొని అది మాత్రమే ఉన్నదని తెలసి చూచి, యీ లేనెరుక ఏ కాలమందున లేదని గట్టిగా నమ్ముము. ఆ మత సిద్ధాంతములతోను, చంచల వాద ప్రతివాదములతోను నీకు పనిలేదు. అది సరైన మార్గము కాదు.

**విశేష భావము :** 1) మరణమే మోక్షమని చార్వాకులు, 2) సతతత ఊర్ధ్వ గమనమే మోక్షమని క్షపణికులు, 3) విశుద్ధ విజ్ఞాన సంతానోదయమే మోక్షమని విజ్ఞానవాదులు, 4) సర్వ శూన్యత్వమే మోక్షమని మాధ్యమికులు (బౌద్ధశాఖ) 5) బుద్ధ్యాది నవగుణాత్యంతికానుత్పత్తియే మోక్షమని తార్కికులు, 6) ప్రకృతి పురుష వివేకమే మోక్షమని సాంఖ్యమతానుయాములు, 7) క్షేత్రజ్ఞునకు పరమపురుష సా యజ్యము మోక్షమని యోగులు, 8) ఆత్మ స్వరూప స్థానము మోక్షమని పాశుపతులు, 9) వాసుదేవాది చతుర్వ్యూహాత్ముడగు శ్రీహరి యొక్క సాయుజ్యమే మోక్షమని

సాత్వతులు (వైష్ణవులు) ఇట్లు అనేక విధములైన మత బేధములు కలవు. వీరందరూ శాస్త్రము, శృతులకు తమ బుద్ధి పరిమితములో భాష్యములు చెప్పి సిద్ధాంత భిన్నత్వముతో వాదులాడుకొనుచుందరు.

ఇందుకు ప్రమాణము శ్లో॥ "విధింకేచి ద్ధరింకేచిత్। శివం కేచిద్ధకేచన। శక్తిందైనమితి జ్ఞాత్వా వివిదన్తి వృధానరా": ॥ (గరుగీత) ఈ శివరామదీక్షిత అశరీర సంప్రదాయములో "నేను" లేని పరిపూర్ణ బ్రహ్మమును గురుముఖతా శాశ్వతమైనదని విచారించి గుర్తించి, నేనైన ఎరుక లేకుండా చేసికొనుటయే పరమ లక్ష్యము. యీ విచారణ గురుముఖతా శాస్త్రయుక్తి అనుభవములచే చక్కగా తెలిసికొనవలెను. లేనిచో పొరపాటు పడి శూన్యవాదులై, బౌద్ధమతము యొక్క మాధ్యమిక శాఖ వలె భ్రష్టులై ఇహపరముల రెంటికి చెడుదురనుట నిస్సందేహము. ఈ ప్రమాదమే ఇప్పుడు చాలా చోట్ల కనపడుచున్నది.

---

**అవతారిక :** ద్వైత, అద్వైత విశిష్టాద్వైత సిద్ధాంత బేధములను చెప్పుచు, అన్నిటికి పైది పరిపూర్ణ బోధయని నిరూపించుచున్నారు.

**107వ పద్యము : ద్వైతా ద్వైత విశిష్టులు। సైతురు విని సైప రెపుడు సైసక పిదపన్ । సైతురు, క్రమమున వేరన। నాతత మతి జీవ శివుల వవి వినబోకూ॥ నే బోధించినది విడబోకూ॥ పూతమౌ బయలును పొడజూచి గురునిచే । ద్వైతా ద్వైత విశిష్టాద్వైతములను మాను ॥ వవి వినబోకూ॥ నే బోధించినది విడబోకూ॥**

**దండాన్వయము :** (ఇది క్రమాలంకరాము) 1) ఆ తతమతిన్ జీవ శివులు వేరన విని ద్వైత (ద్వైతులు) సైతురు. 2) అతతిమతిన్ జీవ శివులు వేరన విని అద్వైత (అద్వైతులు) ఎప్పుడు సైసరు. 3) ఆతత మతిన్ జీవ శివులు వేరన విని విశిష్టులు సైసక పిదపన్ సైతురు. (క్రమమున అన్న పదము క్రమాలంకారము అని సూచించుట) అవి వినబోకు.

**టీక :** అతతమతిన్ = ఆకతాయి బుద్ధి చేత, (అవివేకము చేత) సైతురు = అంగీకరించెదరు; పొడజూచి = ఛాయనుజూచి.

**భావము :** శిష్యా! జీవుడు - శివుడు (ఈశ్వరుడు) వేరని చెప్పగా విని ఆకతాయి బుద్ధిచే ద్వైతులు అంగీకరించెదరు. ఆ సిద్ధాంతమును అద్వైత సిద్ధాంతులు ఎప్పుడూ

అంగీకరించరు. విశిష్టాద్వైతులు మొదట అంగీకరించరు కాని తరువాత అంగీకరింతురు. ఇట్టి బేధములతో కూడిన మతవాదములను నీవు వినకుము. నే బోధించిన యీ పరిపూర్ణ బోధను విడిచిపెట్టకుము. గొప్పదైన నిర్మలమైన పరిపూర్ణము యొక్క పాదను గురుముఖతా జాచి, పై చెప్పిన మతవాదుల జోలి వెళ్లవద్దు. వాటిని పూర్తిగా విడచి పెట్టుము.

**విశేష భావము :** జీవుడు అవిద్యాయుతుడు, ఈశ్వరుడు (విష్ణువు) మాయావృతుడు, మాయను తన వంశ మందుంచుకొనని వాడు, జీవుడు అవిద్య వశమయినవాడు. కనుక జీవ శివులు ఇద్దరు వేరు. ఒకరిలో ఒకరు కలవరు. ఇది ద్వైత సిద్ధాంతము. జీవుడు అవిద్యా ప్రతిబింమము. ఈశ్వరుడు మాయా ప్రతిబింబము. ఉపాధులను (అవిద్య, మాయలు) విడచినచో జీవ ఈశ్వర్లు ఇద్దరూ ఒక్కటే, ఉపాధి లక్షణచే జీవునకు కించిజ్ఞత్వము, మాయోపాధిచే, ఈశ్వరునకు సర్వజ్ఞత్వములు ఏర్పడినవి. అవి ఉపాధి దోషమే కాని, శివజీవులది కాదు. కనుక రెండును ఒక్కటే "అవిద్యోపాది కోజీవః మాయోపాదిక ఈశ్వరః। మాయా విద్య గుణాతీతం। ఇది వేదాన్త డిండిమః " అని అద్వైతులు, మొట్టమొదట ఉన్నది ఈశ్వరుడు ఒక్కడే (మహావిష్ణువు) అందుండి జీవులుత్పన్నమయినవి. ఉత్పన్నమయిన జీవులు సారూప్య, సామీప్య సాలోక్యసాయుజ్య పదవులను పొంది ఈశ్వరుని సమీపము నందు జన్మలేకుండగ ఉండగలవే తప్ప ఈశ్వరుని యందు తిరిగి కలవవు. పాలలో ఉన్న, వెన్న చిలికిన తరువాత బయటపడును. తిరిగి ఆ వెన్న పాలలో కలవదు. ఆ విధముగా అని విశిష్టా అద్వైతులు వాదించుకొందురు.

ద్వైత, విశిష్టా ద్వైతములు రెండును భక్తి ప్రదానములు. మహా విష్ణువు ఒక్కడే జ్ఞాన స్వరూపుడు అందురు. అద్వైతములో భుక్తి హేతువు దైవభక్తి. గురువు లభించుటకు పరమేశ్వర భక్తికావలయును. గురువు లభించిన తరువాత ముక్తికై (జన్మరహితమునకు) జ్ఞానము చేతనే తప్ప మరిదేని వలన ముక్తి లభింపదు. "నాన్యః పంథావిద్యతే యనాయ" అద్వైతము ఈ పద్యములో జీవ శివుల విషయమై నిర్ణయమును చెప్పిరే కాని, చివర విషయమైన పరబ్రహ్మ తత్త్వమైన విషయము గురించి అద్వైతులు నిర్ణయమును చెప్పలేదు. ఈ పద్యమును చూచి మన వారు, అద్వైత సిద్ధాన్తము గురించి తప్పుగా వాఖ్యానించుచున్నారు. "ద్వైతా అద్వైత రహితపరమ తత్త్వే" అన్న

వాక్యమునకు జీవ శివ రహితమైన పరమతత్త్వము అని అర్థము. పరబ్రహ్మములో ఉపాధి దోషము లేదు. కనుక జీవ శివ బేధములుండదు. పరబ్రహ్మము అద్వైత సిద్ధాన్త ప్రతిపాదితమైనదీ, శివరామ దీక్షిత ప్రతిపాదితమైన పరిపూర్ణము ఒక్కటే అందుకు ప్రమాణము శ్రీ కృష్ణ దేశికులు "ఎన్నో గ్రంధ జలధులను తిన్నగా మధియిస్తే తేలిన సారంబు ఉన్నది పరిపూర్ణమని" అని వ్రాసిన కందార్థమును గుర్తించవలెను.



**108వ పద్యము : కొందరు దశ విధనాదము । లందున, నభ పంచకంబు నందున, చక్రా । లందున, లక్ష్య ధ్యానం । బందున, హంసందు బుద్ధి నాటింతు రోయీ ॥ యోగములందు నటియింతు రోయీ ॥ అంది సిద్ధుల చేత నానందింతురు, కొంద । రందరి మనసీ బోధందె నీవుండుము ॥ నాటింతురోయీ । యోగములందు నటి యింతు రోయీ ॥**

**భావము :** శిష్యా! కొందరు దశ విధనాదములందు (యోగములచే) ఆనందము పొందుదురు. మరికొందరు ఆకాశ పంచకము నందు, మనస్సు పెట్టెదరు. కొందరు షట్చక్రములందు, హంసను నడిపించి ధ్యానాది ముద్రలచే తారక దర్శనముచేసెదరు. హఠయోగాది యోగములు చేసి సిద్ధులు పొంది ఆనందింతురు. నీవు మాత్రము ఆ మార్గములందు పోక యీ బోధ యందే స్థిరముగా నుండుము. ఆ పై వన్నియు మాయ మార్గములే (మాయా బ్రహ్మమును తెలియజేయునవే).

**విశేష భావము :** దశవిధనాదములు : 1) జలధి ఘోష, 2) భేరి, 3) చిణీ, 4) మృదంగ, 5) ఘంటా, 6) కాహళ, 7) కింకిణీ, 8) వేణు, 9) భ్రమర, 10) ప్రణవ నాదములు.

**నభ ప్రంచకము :** 1) భూతాకాశము, 2) తత్వాకాశము, 3) నిరవయాకాశము, 4)దహరాకాశము, 5) మహాకాశము. ఈ ఆకాశ పంచకములంధు విహరించుట అనునది తాంత్రికోపాసన. చతుషష్ఠి తంత్రములలోనిది కౌళ మార్గము. నిషిద్ధము. నభ పంచకము అనగా జ్ఞాత, మనస్సు, బుద్ధి, చిత్త, అహంకారములందు జ్ఞాతను లయమొనర్చుట అని ఒక అర్థము.

అష్టసిద్ధులు : అణిమ, మహిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశత్వ వశిత్వములు ఇవన్నియు యోగ సాధనల ద్వారా పొందగలరు. బహు ప్రయాసకములు.

**109వ పద్యము : కొందరు ముద్రలుగనవలె । నందురు, మరికొందరధికమందురు ద్రష్టన్ । కొందరు భజనే లెస్సని । యందురు, యివి యన్ని యెరుకె, నని తెలుసుకొనుమీ ॥ నీ కివి యాల పని లేదు. వినుమీ ॥ ముందుగ పరిపూర్ణ మున్నది గని, గుర్తు । నెందుండకుండ దాన్నె గురుగొట్టితె జాలు ॥ నని తెలుసుకొనుమీ । నీకివి యాల పనిలేదు వినుమీ ॥**

భావము : శిష్యా! కొందరు ముద్రలు పట్టి, యోగము చేయవలెనని అందురు. మరికొందరు ద్రష్టస్థానమయిన సహస్రారమున లయమ వవలెనందురు. నామ సంకీర్తనమే గొప్పదని కొందరందురు. "కలౌస్మరణాన్ ముక్తిః అని అనేక రూపములుగా భావించుచుందురు. ఇవన్నియు మాయా బ్రహ్మమును తెలియజేసే యెరుక మార్గములే. సత్యము కావు. కావున నీకు వాటితో పనిలేదు. ఏ సృష్టి లేనప్పటి నుండి మొట్టమొదటగా పరిపూర్ణ బ్రహ్మము మాత్రమే ఉన్నదని నే చెప్పిన విధముగా విచారించి చూచి, ఆ గుర్తించిన జ్ఞానమును లేకుండగ జేసికొనుము చాలును. ఇదియే జన్మరహిత మోక్షము.

**110వ పద్యము: దేవున్ని విన్ను యెరుగవు । నీవిప్పటి, కెట్టివారో నే దెల్పెద, నీ। కే వెఱ్ఱిబోధలెందుకు । కావున దేవుణ్ణి యిదిగో కనుగొన వోయీ ॥ నామ రూప కర్మలే వోయీ ॥ నీవా దేవునిలోన విను లెస్స వెదకి, న । న్నావలి ముచ్చట నడుగో యీ దెల్పెద ॥ కనుగొన వోయీ । నామ రూప కర్మలేవోయీ ॥**

భావము : శిష్యా! దేముడనగా ఎవరో, నీవు ఎవరో, నీకు ఇంత వరకు తెలియదు. వారు ఎట్టివారో నేను నీకు తెలియపర్చెదను. నీకు మరియే యితర బోధలు అక్కరలేదు. అవన్నియు వెఱ్ఱి బోధలే. కావున యిదిగో దేవుని చూడుము. యీ దేవునికి నామ రూప పక్రియ లేవియు లేవు. శాశ్వతమైనది, ఇట్టి దేవుని యందు నీవు ఎక్కడ ఎన్నావో బాగా విచారించి చూడుము. ఆ తరువాత నన్నడిగినచో ఆ పై ముచ్చట చెప్పెదను.

**విశేష భావము :** దేవుడు అనగా నామ రూప క్రియా రహితుడని శాస్త్ర నిర్దేశ్యము. అట్టి నామ రూప ప్రక్రియలు ఎంత మాత్రము లేనిది ఒక్క పరిపూర్ణ పర్తబహ్మము మాత్రమే. ఇది సర్వత్ర నిండి, శాశ్వతమై బుద్ధికి సైతము గోచరము కాకయున్నది. ఇట్టి దాని యందు "నేను" అను ఎరుక ఎంత మాత్రము లేదు. కనుక " ఆ దేవుని లోపల నిను లెస్స వెదకి నన్నావలి ముచ్చట అడుగోయి తెల్పెద" అనగా పరిపూర్ణ పరబ్రహ్మములో "నేను" అను ఎరుక ఎంతమాత్రము లేదని చక్కగా, ధృడముగా, విచారించి తెలుసుకొనినచో, నీవు లేనని నీకు తెలియబడును. నీవు లేవని తెలిసిన తరువాత ఆవలి ముచ్చట చెప్పుటకు ఎవరు ఉన్నారు? నీవే లేవు. పరిపూర్ణము ఎప్పటికీ శాశ్వతమే అడిగే వారేరీ? ఇక అతని ముచ్చట ఏమి ఉండును. అని భావము.



**111వ పద్యము : మానవుడు చేయబూనిన । దానిని, లో తెరిగి చేయదగునని, మదిలో । నేనెరిగి నీకు చెప్పితి । పూనుము, రుచి బుట్టదేని పోనీ నీ మనసూ ॥ రుచి బుట్టితె పూనూ నీ మనసూ ॥ నేనేమీ యన బోతే, నీకేమి దోచునో । లేని నిష్ఠూరము లేకుండుటె లెస్స ॥ పోనీ నీ మనసూ । రుచిబుట్టితె పూనూ నీ మనసూ ॥**

**టీక :** నిష్ఠురము = కఠినమగు, పరుషమగు (మాట)

**భావము :** శిష్యా! మానవుడు తాను చేయ తలపెట్టిన పనిని బాగుగా ఆలోచించి, మంచి చెడులను గుర్తెరిగి చేయవలెనని, కనుక నే చెప్పెడు యీ బోధ జన్మరహితమునకై ఉపయోగించునా ? లేదా? అని బాగుగ గ్రహించుము. ఒక వేళ నీ మనసుకు సరిపడనిచో విడిచి పెట్టుము. నీ మనసుకు నచ్చిన దానినే గ్రహించుము. నేనేమి చెప్పిన, నీకే విధముగా తోచునో? లేని నిష్ఠురములు లేకుండుటే లెస్స. నీ యిష్టము చొప్పుననే చేయుము.

**విశేష భావము :** జ్ఞానము, సంస్కార జన్యము. ప్రయత్నిస్తే తెలియబడేది కాదు. గత జన్మ సంస్కారము సరిపడునంత లేకపోయినచో యీ పరిపూర్ణ బోధ మనసుకి అతకక ఇందులో స్థిరపడలేదు. క్రింది బోధలకే మ్రగ్గును. (ఇష్టపడును) "అనేక జన్మాని జ్ఞానం లభ్యతే । జ్ఞాన మనంతాని పూర్ణ బోధతః" అన్నారు. అందుచే

సంస్కారము లేక పోయినచో యీ బోధ మనసుకు ఇష్టమవదు. కనుక ఇష్టపడినవారు మాత్రమే యీ బోధకు అర్హులు అని యీ పద్య భావము.

**112వ పద్యము : పంచాశదక్షరముల, ప్ర । పంచము తానుద్భవించె, ప్రణ వాక్షర మం । దంచు, శృతులెన్నె, దాన్నెరు కంచని నీ వెరిగి యరుగు మచలము దీనన్ ॥ నిల్పకు మెరుక నచలము లోనన్ ॥ చంచల మతి చేత చతురాక్షవెక్కువం । చెంచెద మెందుకు, యిది నమ్మ, కెరుగు మీ । యచలము దీనన్ । నిల్పకు మెరుక నచలము లోనన్ ॥**

**టీక :** పంచాశత్ + అక్షరములు = ఏబది అక్షరములు.

**దండాన్వయము :** దాన్నెరుకంచని నీ వెరిగి, దీనన్ అచలము (ఎరిగి) అరుగుము. (ఎరిగి అన్యాపదేశము) అచలములోనన్ ఎరుకన్ నిల్పకుము. చంచలమతి చేత చతురాక్షరి ఎక్కువంచు, ఎంచెదవెందుకు? యిది, నమ్మకుము । దీనన్ అచలము ఎరుగుము.

**భావము :** శిష్యా! ఏబది అక్షరములు, ప్రపంచము, తాను (నేను), ప్రణవాక్షరమునందే పుట్టినవని శృతులు చెప్పుచున్నవి. అట్టి "ఓం" నే ఎరుక అని తెలియుము. ఆ తెలివి చేతనే పరిపూర్ణ పరబ్రహ్మమును గురుముఖతా విచారించి తెలుసుకొనుము. ఆ యెరుక పరిపూర్ణ పరబ్రహ్మములో లేదని లేకుండా పొమ్ము. అట్లుగాక చపల చిత్తుడవై చతురాక్షరి అయిన ఓం, అధికమైనదని (బ్రహ్మమని) తలచెదవెందుకు? దానిని నమ్మకుము, అచలమును యెరుక చేతనే యెరిగి, పరిపూర్ణములో యెరుక లేదని విడిచిపెట్టుము.

**విశేష భావము :** చతురాక్షరి అనగా నాలుగు అక్షరములు కలది. అనగా అ, ఉ,మ (అర్ధమాతృక) అని నాల్గు అక్షరములు వీటి కలయికే "ఓం" ఇదియే అఖండ యెరుక. దీని నుండియే "అ"కారము మొదలు "క్ష" కార పర్యంతము గల ఏబది సంస్కృతాక్షరములు, ఓంకారమయిన అఖండ యెరుక నుండియే ఏబది అక్షరముతో కూడిన సమస్త వాఙ్మయమున్ను; మహదాది పృధ్వి పర్యంతమయిన సమస్త ప్రపంచమున్ను, నేననే అవిద్య, ప్రతిబింబ చైతన్యమయిన జీవుడున్ను, అయిన దని

శృతులు చెప్పుచున్నవి. శృ॥ “ఓం తద్బ్రహ్మ, ఓం తద్వాయుః ఓంతదాత్మ, ఓంతత్సత్యం, ఓం తత్సర్వం, ఓం తత్పురోన్నమః” అని నారాయణోపనిషత్తు మొదలగు శృతులు చెప్పుచున్నవి. కనుక సమస్తమునకు మూలమయిన “ఓం” అను ప్రణవమే ఎరుక. ఇది మిధ్యా స్వరూపమే కాని శాశ్వతమైన బ్రహ్మము కాదు. కారణ కార్యములు రెండును ఒక్కటే అని సిద్ధాన్తము. అందుకే గురుగీతలో కూడా “జ్ఞానం జ్ఞేయంసమఃకుర్వాత్, నాన్యః పంథా ద్వితీయకః” జ్ఞేయమైన సమస్త ప్రపంచము లేనిదే అని ప్రత్యక్షముగా తెలియుచున్నది. పై శృతి ప్రకారము జ్ఞేయయము వంటిదే జ్ఞానము కూడా అని చెప్పబడినది. కనుక ప్రపంచమునకు కారణమయిన (జ్ఞానమయిన) “ఓం” కూడా లేనిదే అని తెలియవలెను. ఈ లేని ఎరుక చేతనే సమస్తమును తెలిసికొనగలము. కనుక ఈ లేని ఎరుక అయిన జ్ఞానము చేతనే అఖండ ఎరుక మిధ్యా స్వరూపమయినదని తెలసి, ఆ జ్ఞానము చేతనే పరిపూర్ణమును గురుముఖతా గుర్తించి దాని యందు ఎరుక లేదు కనుక ఎరుక లేనిదని విడచిపెటుట్టయే పరిపూర్ణ బోధ. కనుక “ఓం” అఖండ ఎరుక బ్రహ్మము కాదని తెలియవలయునని ఈ పద్య నిర్ణయము.

---

**అవతారిక :** యెరుక జగములు రెండును, చేతన - అచేతనములయినవనియు, పరిపూర్ణము, చేతన - అచేతనములు కానిది అని నిర్ణయించుచున్నారు. చేతన - అచేతనములు అనగా కదిలేవి కదలనివి అని అర్ధము కన్నా, జ్ఞానము - అజ్ఞానములని అర్థము చేప్పవలయును.

**113వ పద్యము : యెరుక డమ జడ మీ జగ । మ, రయగ పరిపూర్ణ మేమి యనరానిది, యా । యెరుక జగము లస్థిరములు । పరిపూర్ణము శాశ్వత పుది పాటించి కనరా ॥ కావా రెండీ పాటివి వినరా ॥ గురు ముఖమువ వీట్నేవరుడు గుర్తెరుగువో । తిరిగి పుట్టడు వాడీ ధరపైమును పటివలె ॥ పాటించి కనరా॥ కావా రెండీ పాటీవి వినరా ॥**

**దండాన్వయము :** యెరుక జడము, అజడము। జడము అజడము ఈ జగము । అరయుగ పరిపూర్ణము ఏమి అనరానిది। ఎరుక జగములు అస్థిరములు । పరిపూర్ణము శాశ్వతపుది (అని) పాటించి కనరా వినరా - ఈ రెండు ఈపాటివి కావా ।

గురుముఖమున వీట్నేనరుడు గుర్తెరుగునో । వాడు ఈ ధరపై మునుపటి వలె తిరిగిపుట్టడు.

**టీక :** జడము = కదలనిది; అచేతనము (అజ్ఞాన రూపము) అరయగ = విచారించగ, పాటించి - విచారించి, కనరా = చూడుము.

**భావము :** శిష్యా ! యెరుక జగత్తులు రెండు జడము గాను అజడము గాను కూడా ఉన్నవి. విచారించగ పరిపూర్ణము జడము కాదు, చేతనము కాదు, కనుక ఎరుక జగత్తులు రెండును అశాశ్వతమైనవి. పరిపూర్ణము శాశ్వతమైనదని చక్కగా విచారించి చూడుము.

ఈ ఎరుక జగములు, పరిపూర్ణముల గూర్చి పూర్తిగా గురుముఖముగా ఏ భక్తుడు చక్కగా విచారించి చూచునో వాడు ఈ భూమిపై మునుపటి వలె తిరిగి జన్మను పొందడు.

**విశేష భావము :** యెరుక స్వతసిద్ధముగా కదలదు, కనుక జడము, కాని సమస్తమును కదలించే చైతన్య రూపము కనుక అజడము, జగత్తు స్వతః కదలదు కనుక జడము. జగత్తు నందున్న ఎరుక సత్తా చేత జగత్తు చైతన్యవంతమైనదిగా కనుపించుచున్నది. కనుక చేతన రూపము, పరిపూర్ణ పరబ్రహ్మము కదలదు. మరొకదానిని కదలించదు, కనుక జడమనరాదు. ఎంధుచేతననగా జడము "ఉండుట" అనే ధర్మము లేనిది పరిపూర్ణము శాశ్వతముగా ఉన్నది. కనుక జడము అనరాదు. కాని పరిపూర్ణము వలన ఏదియు చలించుట లేదు. తాను చలించుట లేదు కనుక చేతనము అనరాదు. కనుక పరిపూర్ణము జడము అజడము కానిది. ఏమి అనరానిది.

అవిద్య + ప్రతిబింబ చైతన్యములు యీ రెండు కలిసి ఎరుక, అవిద్య జడము. ప్రతిబింబము, చేతనము. అవిద్య అజ్ఞానము, ప్రతిబింబము జ్ఞానము. కనుక ఎరుక - జడము - అజడము గను, జ్ఞానము-అజ్ఞానముగాను ఉన్నదని చెప్పవలెను. దీని వలన ఏర్పడినది జగత్తు. కనుక జగత్తు కూడా జడము, అజడము అని చెప్పవలెను. ఇట్టి జడమజడములు కానిది పరిపూర్ణము, అని నిర్ణయము. ఈ విధముగా విచారించి ద్వంద్వ రూపమైన ఎరుకలేనిదనియు, ఏక స్థితి కలిగిన పరిపూర్ణము మాత్రమే శాశ్వతమైనదని విచారించి చూచిన నరునకు పునరావృత్తి లేదని నిర్ణయము.

**114వ పద్యము : కొందరు భూతములైదిట । యందున చిత్తంబు మంతురధికము లనుచున్ । కొందరు యేమియు లేదని । యుందురు గుర్తెరుగు మిన్నియపశబ్దము లేరా ॥ యివి నిలువాని వని తెలియవలెరా । యెందరెన్నన్నా నీ కెందుకు, బయలును । ముందుగ గని, గుర్తు నెందుండ నివ కవ్వి ॥ యప శబ్దములేరా । యివి నిలువ వని తెలియవలెరా ॥**

**భావము :** శిష్యా! కొందరు ఆకాశాది భూతములే గొప్పవని దైవముగా భావింతురు మరికొందరు ఈ సమస్తము యేమిలేదని శూన్యవాదులై యుందురు. ఇవన్నియు అపశబ్దములే. ఇవన్నియు విచారించినచో లేనివే అగును. శాశ్వతమైనవి కావు. ఎందరెన్ని సిద్ధాంతములు చెప్పినా నీ కెందుకు? సమస్తమునకు ముందుగా (మొదటగా) పరిపూర్ణ పరబ్రహ్మమే స్వతస్సిద్ధమై వెల్తి లేక వ్యాప్తమై యున్నదని చక్కగా విచారించి చూచి, ఆ తెలిసిన ఎరుక పరిపూర్ణములో లేదని, కనుక ఎరుక అయిన జ్ఞానము ఎచ్చటను నిలపెట్టక అనగా అది బ్రహ్మము అని గాని, అదే నేను అని గాని, నిలబెట్టక ఎరుకను ఎచ్చట లేకుండా చేసికొనుము.



**115వ పద్యము : కొందరు కర్మమునే బా । గందురు మరిచి కొందరు రెక్కువందురు తనువున్ । కొందరు ప్రాణము లధికము । లందురు. నీకిట్టి వట్టి, యాశలేమిటికి । వారితో పొందు జేశావేమిటికి ॥ యెందరి మాటల నెన్నిన యీ బోధ క్రిందివె కాని పై కెక్కేగావిట్టి ॥ యాశ లేమిటికి । వారితో పొందు జేశావేమిటికి ॥**

**టీక :** పొందు = స్నేహము, కలయిక

**భావము :** శిష్యా! కొందరు కర్మము గొప్పది అనియు, మరికొందరు శరీరమే గొప్పది అనియు, ప్రాణములు గొప్పవని మరికొందరు ఈ విధముగా అనేకులు అనేక రకములుగా చెప్పుచుందురు. అట్టి వట్టియాశలు (అబద్దపు కోర్కెలు) నీకు వద్దు. యెందరు ఎన్ని సిద్ధాంతములు చెప్పినా యీ పరిపూర్ణ బోధ కింది వేకాని, యీ బోధ సిద్ధాంతమును అధిగమించేవి కావని తెలుసుకొనుము. అట్టి ఇతర సిద్ధాన్తవాదులతో కలిసి చర్చించకుము । అవన్ని తప్పుడు సిద్ధాంతములే.

**విశేష భావము :** "కర్మమున బుట్టు జంతువు । కర్మమున వృద్ధి పొందు కర్మమున చెడున్ । కర్మమె నరులకు దైవము । కర్మమె సుఖ దుఃఖములకు కారణమదిపో!"

అని కర్మము దైవము అని భారతములో చెప్పిన పద్యము. ఆ సందర్భములో అలా చెప్పవలసి వచ్చినది. ధర్మరాజుతో అడవులపాలై రాజ్యభ్రష్టులయినప్పుడు కర్మ వలన అలా జరుగుతుంది. "ప్రాలబ్ధమవ శ్యమనుభుజ్యతాం" అని చెప్పిన విషయము. అలాగే ప్రాణములు, శరీరము ఇవన్నియు గొప్పవని ఆయా సందర్భాలలో చెప్పిన వాక్యములే. అవి సిద్ధాన్తములు కావు. అట్టి వాక్యములు నిజమని తలచవద్దని యీ పద్య భావము. అన్ని సిద్ధాంతముల కన్నా గొప్పదైనది యీ పరిపూర్ణ బోధ సిద్ధాంతము మాత్రమే అని యీ పద్య భావము.



**116వ పద్యము : తనువెరుకలు రెండొక్కటి । యని యనరాదనుచు కొందరందురు భువిలో । తను వెరుకలలో నొక్కటి । గనరాకుంటేను రెండు గనరావో యన్నా ॥ రెండొక్కటి వినరా మా యన్నా ॥ అనుమానమికయాల అందరి మాటల । వినబోక నే బోధించిన రీతినెప్పుడు ॥ గనరా మాయన్నా । రెండొక్కటి వినరా మాయన్నా ॥**

**భావము :** శిష్యా! కొందరు దేహి - దేహములు రెండు ఒక్కటి అని అనరాదని అందురు. అది నిజము కాదు. ఎందుచేతననగా దేహి దేహములలో ఏ ఒక్కటి పోయినా రెండవది కూడా ఉండదని విచారించి తెలుసుకొనుము. కనుక దేహి - దేహములు రెండును ఒక్కటే అని అనవలెను. అందరి మాటలు (బోధలు) వినక, నే బోధించిన విధానముగా నీవు విచారించినచో దేహి దేహములు రెండు ఒక్కటే అనియు, ఇందులో అనుమానము లేదని తెలియగలదు.

**విశేష భావము :** దేహి నశించక ఉన్నది కనుక దేహి బ్రహ్మము. దేహి అనగా దేహమందున్న చైతన్యము. అదే ఎరుక తనువు అనగా శరీరము. అయినచో స్థూల శరీరము అని చెప్పరాదు. ఎరిగే శరీరము అయిన అవిద్య అని అర్థము చెప్పవలెను. అవిద్య మాయ వల్ల ఏర్పడిన, "లేని శరీరము" అనియు అందున్న ప్రతిబింబిత చైతన్యము శాశ్వతమైనది.నిర్గుణమైనది బ్రహ్మము అని వాదము కలదు. ఆ మాటను ఖండించుటకే ఈ పద్యము చెప్పబడినది. అవిద్య వలన ప్రతిబింబము, ప్రతిబింబము వలన లేని అవిద్యకు ఉనికి గల్గుచున్నది. ఒకదానికొకటి అన్యోన్యాశ్రయము. అవిద్య అయిన ఎరిగే శరీరము లేకపోయినచో ప్రతిబింబిత చైనత్యమైన ఎరుక ఉండదు.

అట్లే అవిద్య యందు ప్రతిబింబిత చైతన్యము లేకపోయినచో అవిద్య అసలు ఉండనే ఉండదు. కనుక భిన్న లక్షణములు కలిగినవైనప్పటికి అవిద్య అను తనువు, ప్రతిబింబిత చైతన్యమయిన ఎరుక ఈ రెండును ఒక్కటే. ఇందులో ఏదియును బ్రహ్మము కానేరదు. రెండును లేక తోచబడినవే. లేనివే అని విచారించి తెలియవలెను.

---

**117వ పద్యము : కన్నుల ప్రక్కల వ్రేల్లిడి । తిన్నగ భ్రూమధ్య మందు దృష్టి నిలిపి, యం। దున్నది వెన్నెల, బయ । లన్నా కనుమందు రెరుకె, అది నిలువదోయీ। తనువుతో బొయ్యేదని తెలియుమోయీ ॥ యెన్ని తనువులు వచ్చి, యరిగీనా ఝుణకాక । వున్నాబయలిది జూచి, వుళ్లక్కెరుకను మాను ॥ మది నిలువ దోయీ । తనువుతో బొయ్యేదని తెలియుమోయీ ॥**

**టీక :** లోబయలు - లోపల ఉన్న బ్రహ్మము, ఝుణకాక = మార్పు జెందక। వున్న బయలు = శాశ్వతమైన పరిపూర్ణము (పరబ్రహ్మము)

**భావము :** శిష్యా! కొందరు (తారక యోగులు) కన్నుల ప్రక్కన వ్రేళ్ళు పెట్టి, కన్నులు మూసి, లోదృష్టి చే భ్రూమధ్య స్థానము నందు దృష్టిని నిలబెట్టి చూచినచో, అందు వెన్నెల వంటి కాంతి కానపడును. అదే లోబయలు (లోపల ఉన్న బ్రహ్మము) అందురు. దానినే చూడమని చెప్పెదరు, కాని అది శాశ్వతమైనది కాదు. శరీముతో పోయేదే కదా! అందుచే దానిని నమ్మకుము. ఎన్ని ఉపాధులు వచ్చినా, ఎన్ని పోయినా, ఎట్టి మార్పులు లేకుండగ శాశ్వతముగా ఉన్న పరబ్రహ్మము యీ పరిపూర్ణము. దీనిని చూచి ఎరుక లేకుండా చేసికొనుము.

---

**118వ పద్యము : జనులాత్మాను భవంబై । నను, ముక్త్యని పల్కి, రిట్లు నమ్మకు మెరుకే । కనరాదెచ్చట గురుకృప । ననుభవ మెవ్వరికి? పైన ఆ మాట నిజమో ॥ అనుభవ ముళ్లక్కే మాట నిజమో ॥ వినజెప్పు మీ రెండు వివరించి పై మాట । వినివే ముందరి బోధ వినిపింతువే। వేగ ॥ ఆ మాట నిజమో । అనుభవ ముళ్లక్కే మాట నిజమో ॥**

**దండాన్వయము :** జనులాత్మానుభవంబైన ముక్తి అని పల్కిరి ।ఇట్లు నమ్మకు । యెరుకే । గురుకృపన్ యెచ్చట కనరాదు। పైన అనుభవమెవ్వరికి ? ఆ మాట నిజమో । అనుభవ ముళ్లక్కేమాట నిజమో। ఈ రెండు వివరించి వినజెప్పుము । పై మాటవిని, ముందరి బోధ వేవేగ నే వినిపితు ॥

**భావము :** శిష్యా! ఆత్మ సాక్షాత్కారమైనచో మోక్షమని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. అదియును ఎరుకే, నమ్మకుము. అది గురుకృపచే ఎచ్చటను కనరాదు. ఆత్మ సాక్షాత్కారము ఎవరికి కలిగినది? (నీవు వేరు, ఆత్మ వేరా? ) లేక ఆత్మ కనుపించుట అబద్ధమా? యీ రెండు మాటలను చక్కగా విచారించి ఏ మాట నిజమో నాకు చెప్పుము. నీవు చెప్పే మాట విని, ముందరి బోధను నే జెప్పెదను.

**విశేష భావము :** సమాధి స్థితిలో ఏమియు కనబడదు. సుషుప్తివలెనే ఉండును. సమాధి స్థితిలో సర్వము జ్ఞానమందు లయమయినది. అట్టిచో చూచే వారెవరు? భ్రూమధ్య స్థానము నందు చూచిన ప్రకాశము, హృదయ స్థానమందున్న ఆత్మ యొక్క ప్రతిబింబ చైతన్యము. అది ఆత్మకాదు కదా? మరియు ఆత్మను చూచుటకు మరొక ద్రష్ట ఏమైనా ఉన్నదా? రెండవది ఏదియు చూడలేదు కదా? అట్టిచో చూచుట అబద్ధమే కదా! అందుచేతనే ఈ పద్యములో అనుభవము ఉళ్లక్కి ఈ మాట నిజమో! అనుభవమెవ్వరికి ఆ మాట నిజమో? అని చెప్పిరి. అనుభవముళ్ళక్కి ఈ మాటే నిజము.

**ప్రమాణం :** "రూపం దృశ్యలో చనం। దృక్త దృశ్యం దృక్తు మానసం। దృశ్యా దీవృత్త యస్సాక్షీ। దృగేవనతు దృశ్యతే॥ రూపము చూడబడునది, కన్ను చూచునది, కన్ను చూడబడునది, మనస్సు చూచేది, మనస్సు చూడబడునది, సాక్షియగు ఆత్మ చూచునది, ఆత్మ సర్వదా చూచునదే కాని, అది ఎన్నటికి చూడబడేది కాదు. (దృక్ దృశ్యములు కానిది)

---

**119వ పద్యము : తనకు తాగనిని మోక్షం। బని పల్కిరి గాని, జనులు అది నమ్మకుమీ। తనను తా బట్ట బైటను। గన బోయితె తనకు దావే, కానరాదోయీ॥ విశ్వము తనకు కానరాదోయీ ॥ తన మంచైనది కనుక తాను విశ్వము రెండు। కనుపించుటుల్లక్కి, గావున తనకుదా ॥ కానరాదోయీ। విశ్వము తనకు కానరాదోయీ॥**

**దండాన్వయము :** తనకు తాగనిన మోక్షంబని జనులు బల్కిరి, గాని అది నమ్మకుమీ॥

**భావము :** శిష్యా! తన్ను తా జూచుటయే మోక్షమని శాస్త్రజ్ఞులు పల్కిరి. కాని అది నమ్మకుము. ఎందుచేతననగా పరిపూర్ణ పరబ్రహ్మములో తాను ఎక్కడ? ఎలా ఉన్నది? అని చూడ బోయినచో అది ఎక్కడ కానరాదు. పరిపూర్ణమును చూడబోతే

తానే లేకుండును. ఈ జగత్తంతయు తన నుంచే అయినది కనుక తానే లేకపోయినప్పుడు ఈ జగత్తు కూడా లేకపోవుచున్నది. పరిపూర్ణ పరబ్రహ్మములో తాను జగత్తు రెండూనూ లేవు. కనుక తన్ను తాను చూచుట ఉళ్లక్కి అని తెలియుము.

---

**అవతారిక :** అహము (నేను) మాయ వలన ఏర్పడినదియు కనుక అహము మాయ ఒక్కటేయని చెప్పుచున్నారు.

**120వ పద్యము : మాయ గదా లేని యహం । బాయ గదా, తనకు దావె యచలము యేర్పా । టాయె గదా; మాయవ లేందాయె గదా, మాయ చిత్ర మాయ గదోయీ ॥ సంశయ మంత పాయగదోయి ॥ మాయ సమూలము మాయ జూస్తుండగ । మాయ మై పాయుమ, మాయ కె యిది చిత్ర ॥ మాయ గదోయీ । సంశయమంత పాయ గదోయీ ॥**

**భావము :** శిష్యా! మాయయే యీ లేని అహం అయ్యేను కదా ! పరిపూర్ణము తనకు తానే స్వతస్సిద్ధమై ఉన్నదా కదా ! (అనగా ఒకదాని వలన యేర్పడలేదు అని భావము) మాయ అనగా లేనిదే కదా! మాయ ఎంత విచిత్రమైనది. లేని మాయ చేతనే యీ లేని నేను ఏర్పడుచున్నది కదా ! కనుక మాయ లేనిదే, అహము లేనిదే. నీ సంశయమంతయు పోయినది కదా! ఆ పరిపూర్ణమె ఉన్నది, అని యీ లేని అహము చూచినచో, వెంటనే యీ అహము సమూలముగ మాయచూస్తుంగనే, అనగా మాయ పరిపూర్ణమును చూస్తూనే (చూచుచు ఉండగనే) లేకపోవుచున్నది. ఇది ఎంత విచిత్రము.

**విశేష భావము :** "మాయ" అనగా యామా, స, మాయ అని నిర్వచనము "మా" అనగా లేనిది. ఏదైతే లేనిదో అదే మాయ, అని మాయకు నిర్వచనము, లేనిది అనగా భవిష్యత్ కాలమందును లేదు, భూత కాలము నందును లేదు. వర్తమానమంధు ఉన్నట్లు తోచినది. ఎవరికి ఉన్నట్లు తోచినది? తనకే, తాను ఉన్నట్లుగా తోచుచున్నది. కాని "అదావంతేచయ న్నాస్తి! వర్తమానే పి త్తతథా" అన్న శాస్త్ర వాక్యానుసారముగా, మొదటను (భూత కాలమునందును) అంతేచ - చివరను (భవిష్యత్కాలమందును) ఏది లేనిదో, అది వర్తమాన కాలమందునను లేనిదే అని నిర్ణయము. ఉన్నది అంటే మూడు కాలములందున మార్పు లేకుండా ఉన్నది అని అర్థము. లేనిది అంటే మూడు

కాలములందును లేనిదే. కేవలము వర్తమానమందు ఉన్నట్లు తోచబడును. నిజానికి అప్పుడు కూడ లేనిదే. అందుకే దీనిని "మాయ" అన్నారు. ఈ మాయ చిత్రమాయెగదోయి" దీనికే శ్రీ శంకరాచార్యులవారు వివేక చూడామణి గ్రంథములో "సన్నాప్య సన్యాప్యుభయాత్మికానో, భిన్యాప్న భిన్నాప్యుభయాత్మికానో, సాంగాప్యనంగా ప్యు భయాత్మికానో, మహాద్భుతా నిర్వచనీయ రూపా," అన్నారు.

కాని పరిపూర్ణ పరబ్రహ్మము సర్వకాల సర్వదేశముల యందు ఎట్టి మార్పు లేకుండగ శాశ్వతముగా తనకు తానై యున్నది. ఇట్టి పరిపూర్ణమును మాయ చూడబోతేనే (చూస్తూ ఉండగానే) సమూలముగా లేకపోవును. సమూలము అనగా చూచేది, అవిద్యామాయ. దీనికి మూలము అందలి ప్రతిబింబిత చైతన్యము. అవిద్య లేకపోతే అందలి ప్రతిబింబ చైతన్యము కూడా లేకపోవును. ఇదే ఎరుక సమూలముగా లేకపోవుట అని అర్థము.



**121వ పద్యము : లేని యహము యున్నబయలును, లేని ప్రపంచమును, తనను లెస్సగ తనలో, తాను విమర్శించిన యా, లేనివి లేకుండు నవల లేదు యే మాట॥ యిట్లవ నైన లేదు యే మాట ॥ లేని యహ మీబైట లేనే లేదిది జూచి, లేనిది కలదని లేని మాటాడేవు॥ లేదు యే మాట, యిట్లవనైన లేదు యే మాట ॥**

**భావము :** శిష్యా! లేని అహమును (ఎరుకను) లేని ప్రపంచమును తనను, ఉన్న పరిపూర్ణ పరబ్రహ్మమును, తాను తనలో చక్కగా విమర్శించినచో, పైన చెప్పిన లేనివి లేకపోవుచున్నది. లేనివి లేకపోయినవని చెప్పుటకు తాను కూడా లేకపోయెను. కనుక యీ లేని నేను, పరిపూర్ణములో లేదని చక్కగా గురుముఖతా విమర్శించి యీ లేని నేను ఉన్నదని అసత్య వచనము చెప్పెదవా? లేని మాట చెప్పకుము. అనగా ఉన్నదని గాని, లేదని గాని చెప్పలేవు అని భావము.

**విశేష భావము :** శాశ్వతమైన పరిపూర్ణమును నేననే జ్ఞానముచే గుర్తింపబడదు. అనగా జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత కానిది పరిపూర్ణము. పరిపూర్ణము సర్వత్రా ఉన్నది. అందులో ఎరిగే ఎరుక లేదు. కనుక ఇతరముచే పరిపూర్ణము ఎరుగబడదు. ఇదే పరిపూర్ణములో ఎరుక లేదు, అను వాక్యమునకు అర్థము. ఎరుక వలనే సమస్త జీవ

జగత్తులు ఏర్పడుచున్నవి. ఎరుక లేకపోయినచో జీవ - జగత్తులు లేకపోవును. అప్పుడు పరిపూర్ణమె ఉన్నదని చెప్పుటకు తాను ఎరుక లేదు కదా ! పోనీ తాను లేనని అయినా చెప్పగలడా ! కనుక "లేదు యే మాట" కాని పరిపూర్ణము శాశ్వతమై ఉన్నది. ఉన్నదని చెప్పే యేరుకే లేదు అని భావము.



**అవతారిక :** పరిపూర్ణ బోధ ఒక్కటే పరిశుద్ధమైన బోధ అని నిరూపించుచున్నారు. ఇదే శివరమాదీక్షిత సిద్దాన్త బోధ.

**122వ పద్యము : పరిపూర్ణ మెరుక లెట్టివా । గురుముఖమున రెంట్ని లెప్ప గురుతెరి గెరుకన్ । పరిపుచ్చుకున్న మృషయని । పరిశుద్ధపు బోధ యిది పాటించి కనరా ॥ శివరాముల పద్ధతి యిదెరా ॥ నరులు కొందరు బల్కిరెరుకను మ్రింగి యీ। పరిపూర్ణమయ్యే మంచెరుగక చెడుటకై ॥ పాటించి కనరా । శివరాముల పద్ధతి యిదేరా ॥**

**దండాన్వయము :** పరిపూర్ణమెరుక లెట్టివో, గురుముఖమున రెంట్ని లెప్స గురుతెరిగి, యెరుకన్ మృషయని సరిపుచ్చుకొన్న, యిది పరిశుద్ధపు బోధ । పాటించి కనరా । శివరాముల పద్ధతి యిదేరా ॥ నరులు కొందరు యెరుగక యెరుకను మ్రింగి పరిపూర్ణమయ్యేము అంచు పల్కిరి చెడుటకై ॥

**భావము :** పరిపూర్ణమనగా ఏధో, యెరుకనగా ఏదో (ఎటువంటివో) యీ రెంటిని సద్గురు ముఖముగా చక్కగా తెలుసుకొని, యెరుక లేనిదని ధృడపరచుటయే పరిశుద్ధమైన బోధ అని తెలిసికొనుము. ఇదే శ్రీ శివరామదీక్షితుల వారు ప్రచారము చేసిన పరిపూర్ణ బోధ. ఇది యెరుగక అజ్ఞానులు కొందరు ఎరుకను మ్రింగి, పరిపూర్ణమయ్యేదము అని అందరు. ఇది చెడిపోవుటకే అని తెలియుము.

**విశేష భావము :** పరిపూర్ణ బ్రహ్మమనగా ఏదో, యెరుక అనగా ఏదో, సద్గురు ముఖముగా అనగా శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడైన సద్గురు ముఖముగా, బాగుగా విచారించి తెలిసికొనవలెను. మరొక విధముగా యీ రెంటి నిజ స్వరూపము తెలియబడదు. అప్పుడు మాత్రమే పరిపూర్ణ పరబ్రహ్మమే శాశ్వతమై యున్నదనియు, ఎరుక ఎంత మాత్రము ఉన్నది కాదు అనియు, లేనే లేదనియు తెలియబడదు. ఇదే శివరామదీక్షితుల వారు చెప్పిన పరిపూర్ణ బోధ. ఈ మార్గము ఎరుగక భ్రూమధ్య

స్థానమందున్న యెరుకను, సహస్రారమందు లయ పర్చుటయే (ఎరుకను మ్రింగి అన్న పదమునకు అర్థము) పరిపూర్ణమైతిమి అని భ్రమించుచున్నారు. ఇది పునర్జన్మకు వచ్చు మార్గమే. ఇది ఒక అర్థము.

కొన్ని చోట్ల గురుశిష్యులు బోధలు పూజలు నడిపించుకొనుచు, గురుదంపతులు గదిలోనికి పోయి రమించి ఆ వీర్యమును యోని యందు పడకుండుగ బైటకు తీసి పట్టి (ఆ వీర్యమే యెరుక అని) దానిని కల్లులో కలిపి అందరు త్రాగెదరు. ఇది ఒక మూఢాచారము. చెడిపోయే మార్గము. ఎరుకను మ్రింగివేశాము కనుక పరిపూర్ణమయితిమి అని చెప్పుకొని ఆనందింతురు. ఈ మార్గము ఇప్పుడు నశించిపోయనది అని చెప్పవచ్చును. కొంత కాలము క్రితము రాజోలు ప్రాంతములో ఉన్నదని పెద్దలు చెప్పగా విన్నాను. ఇది భ్రష్ఠ మార్గము.

---

**123వ పద్యము : బిందువు తనువున బుట్టును । బిందువు తమ వింద్రియముల బృందం బసువుల్ అందముగ గలుగు, నివిదే । నందున బుట్టినవొ తెలియనజునికి తరమా ॥ మూలము లేనివని తెలుసుకొనుమా ॥ అందుకే బయలున్నా దరసి మూలము లేని । బింద్వాది కంబుల పేరు దల్పకు, తెలియ। నజునికి తరమా । మూలము లేనివని తెలుసుకొనుమా ॥**

**భావము :** శిష్యా! బిందువు (శుక్లము) శరీరము నందే పుట్టును (ఈ బిందువు వలన శరీరము కలుగుచున్నది) ఇది అన్యాపదేశము) ఈ బిందువు, శరీరము, ఇంద్రియ సమూహము, ప్రాణము ఇవి దేనందు పుట్టినవో బ్రహ్మకైనను తెలియ శక్యము కాదు. అనగా ఎవరికి తెలియదు అని భావము. ఇవన్నియు మూలములేని వని తెలియవలెను. అందుకే శాశ్వతమైన పరిపూర్ణ పరబ్రహ్మము ఉన్నదని గుర్తించి లేక ఏర్పడిన బిందువు మొదలైన సమస్తమును బ్రహ్మము కాదని విడచి పెట్టుము.

---

**అవతారిక :** నామ, రూప, కర్మ రహితమైన శాశ్వతమైన దైవము, పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే అని చెప్పుచున్నారు.

**124వ పద్యము : జనులనిరి దేవుడెవరికి । కనరాడని, నామ రూప కర్మ జననముల్ । గన నతనికి లేవని, యా । జన వాక్యము బయలుకెప్పుడు సహజము వినరా ॥ అనుమానము చాలించి కనరా ॥ కని, నామ రూపాదికములున్న యెరుకను । వినబోక కనబోక విడచి పెట్టర పోనీ ॥ సహజము వినరా । అనుమానము చాలించి కనరా ॥**

**టీక :** జనులు = శాస్త్రజ్ఞులు, జనవాక్యము = శాస్త్ర వాక్యము.

**భావము :** శిష్యా! దేవుడు ఎవరికి కనపడడనియు, అతనికి నామ రూప, కర్మ, జనన మరణములు లేవని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇది శాస్త్ర సమ్మత వాక్యము. ఈ శాస్త్ర వాక్యము పరిపూర్ణ పరబ్రహ్మమునకే సహజము అయియున్నది. మరియే విధమైన సందేహములు లేకుండగ ఈ విషయమును చక్కగా విచారించి తెలిసికొనుము. అట్లు విచారించినచో పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే నామ రూపాదికము లేనిదని తెలసి, నామ రూపాదికములున్న ఎరుకను విడచిపెట్టుము, అనుమానించకుము.



**అవతారిక :** ఎరుక ఏక దేశ్యమే కాని సర్వత్ర ఉన్నది కాదని ఈ పద్యములో చెప్పుచున్నారు. నిజానికి లేనే లేదు అని నిర్ధారణ.

**125వ పద్యము : అంతట గలదీ యెరుకని । యెంతో వాదింపుచుందురెరుగని వారల్ । అంతట ఇంతట గనుపడునంతటి దే కాని, యెరుక అంతట గలదా ॥ అది నిజమైతే అగుపడవలదా । అంతట గలదొక్క అచలమె కానెరుక । అంతట గలదని యన రాదు వినరాదు॥ అంతట గలదా । అది నిజమైతే అగుపడవలదా ॥**

**భావము :** శిష్యా! యెరుక సర్వ వ్యాప్తమైనది కాదు. యెరుక అంతట ఇంతట (బ్రహ్మాండమంతట, పిండాండమంతట) ఉన్నట్లు కనుపడుచున్నదే కాని నిజానికి లేనిదే. ఎచ్చటనూ లేదు. ఉన్నదైతే విచారణకు ఉన్నట్లు కనుపించేది కదా! విచారిస్తే ఎరుక లేకపోవుచున్నది. అజ్ఞానదృష్టికి మాత్రమే ఉన్నట్లు కనిపించును. గురుముఖతా విచారిస్తే అసలు లేనే లేదు. విచారించినచో అంతటా నిండి శాశ్వతమై యున్నది. ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే అని తెలియవలెను.

**విశేష భావము :** యెరుక ఉన్నట్లు కనిపించేది మాత్రము. అలాగైననూ సర్వ వ్యాపకము కానేరదు. "పాదోస్య విశ్వాభూతాని। త్రిపాదస్యా' మృతందివి' అనియు సర్వత్రా నిండినది ఒక్క పరిపూర్ణము మాత్రమే. "అంతర్బహిశ్చ సర్వత్రా అచలో యం సనాతనః" అనియు అంతర్బహిశ్చ తద్బాహ్యం అన్యంనాస్తీతి నిశ్చయః" అని శృతి వచనములు. మరియు "సదేవ సౌమ్యేద మగ్ర మాసీత్, తం నిత్యముక్త మవి క్రియం। సత్యజ్ఞానానందం, పరిపూర్ణం, సనాతనం, ఏక మేవా ద్వితీయం బ్రహ్మ ॥ అని పైంగలోపనిషత్ వాక్యము.

పదవిభాగము - సత్ = శాశ్వతమైనది. ఏవ=మాత్రమే, సౌమ్యః - గుణ రహితమైనది (శాంతమైనది) ఇదంఅగ్రం = వీటన్నిటికి ముందుగనే, ఆసీత్=ఉన్నది. తం = అది, నిత్య = శాశ్వతము, ముక్త = బంధ రహితము, అవిక్రయం = ఏవిధమైన మార్పు లేనిది, సత్య = సత్య అసత్యములు కాని సత్యము శాశ్వతము.

జ్ఞాన=జ్ఞాన అజ్ఞానములు కాని కేవల జ్ఞానము, ఆనంద = ఆనంద దుఃఖములు కాని కేవల ఆనందము, అనుభవమునకు అందని ఆనందము, పరిపూర్ణం = సర్వత్ర వెల్తి లేక నిండియున్నది; సనాతనం = ఆది లేనిది పూర్వమే ఉన్నది; ఏకం ఏవా-ఒక్కటి మాత్రమే (రెండవది లేనిది) అద్వితీయం = రెండు కానిది ఒక అర్థము. (బ్రహ్మము అని ఒక అర్థము). బ్రహ్మ = బ్రహ్మమను వ్యవహారిక నామము కలది.



**అవతారిక :** పరిపూర్ణ పరబ్రహ్మమును గుర్తించలేని అల్పజ్ఞులు, ఈ భూతాకాశమె పరిపూర్ణమని చెప్పెదరు. అట్టి వారి మాటలను ఖండించుచున్నారు.

**126వ పద్యము : బయలాకస మని కొందరు। భయ పెట్టెదరందు వలన, భయపడకు సుమీ। బయలందు శబ్దమున్నమ। బయలాకసమని వమ్మబడని నీ చేత ॥ శబ్దము లేదీ భ్రమయెందు చేత ॥ బయలాకసము కాదు పరిపూర్ణమని నమ్మి నయముగ యెరుకను నమ్మక విడిచిపో॥ బడనీ నీ చేత శబ్దము లేదీ భ్రమ యెందుచేత ॥**

**భావము :** బయలనగా (పరిపూర్ణ బ్రహ్మము) ఈ ఆకాశమే యని కొందరు చెప్పెదరు. అందువలన బ్రహ్మము అనగా శూన్యవాదమేమో యని

భయపడవలసివచ్చును. కాదు బయలనగా పరిపూర్ణ పరబ్రహ్మమే కాని ఈ భూతాకాశము ఎన్నటికి కాదు. బయలులో శబ్దము ఎంత మాత్రము లేదు. ఆకాశములో శబ్దము ఉన్నది. కనుక ఆకాశము బయలు ఒకటి కాదు అని ధృడముగా నమ్ముము. బయలనగా పరిపూర్ణమని ధృడముగా నమ్మి, ఆకాశ సహితమైన ఎరుకను ఎంతమాత్రము ఉన్నదనక విడిచిపెట్టుము.

**విశేషార్థము :** "ఆకాశస్య గుణశ్శబ్దః। నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే॥ అని శృతి. ఆకాశమునకు శబ్ద గుణము కలదు. ఓం అని శబ్దించే లక్షణము. పరిపూర్ణములో శబ్దము ఎంతమాత్రము లేదు. కనుక బయలు (పరిపూర్ణము) ఎరుక అయిన ఆకాశము ఒకటి కాదని వస్తు నిశ్చయ జ్ఞానముగా గుర్తించవలెను. పరిపూర్ణ పరబ్రహ్మమును చెప్పి చూపించలేని అల్పజ్ఞులు, ఎదురుగా ఉన్న ఆకాశమె పరిపూర్ణమని చెప్పి చూపించెదరు. "ఆకాశం, గననం శూన్యం" అని అమర శ్లోకము. ఆకాశమనగా శూన్యము అని అర్థము కలదు. కనుక పరిపూర్ణమే ఆకాశము అని చూపించినపుడు అయితే ఈ పరిపూర్ణ బోధ ఆస్తికవాదము కాదేమో, శూన్య వాదమేమో యని భయపడవలసివచ్చును. అందుచేత ఈ పద్యములో "ఆకసము బయలని భయపెట్టెదరు". అందువలన భయపడకు, అని వ్రాసినారు. పరిపూర్ణము శూన్యము కాదు. సర్వత్ర అస్తి. అది మాత్రమే ఉన్నది. ఇతరమేమియు లేదని చెప్పేదే పరిపూర్ణ బోద.



**అవతారిక :** శమ, దమ, మఖాదుల వలన బ్రహ్మము సాధ్యము కాదు, బ్రహ్మము సాధ్య వస్తువు కాదు. సాధన రహితమైనది, సిద్ధ వస్తువు.

**127వ పద్యము : కల మేల్కు, ఎరుక బయలుల । కల సామ్యము జేసి చూడుమీ భ్రమతొలగున్ । ఫలమేమి పెక్కు చదువుల । వలనను జప యాగ యోగ వ్రతముల వలనన్ ॥ శమ దమ మఖ శతముల వలనన్ ॥ తల క్రిందులుగా బడ్డ, తమవునే గానన్న । కల మేల్కగని తా నెక్కడ నిల్వవట్లౌనె ॥ వ్రతముల వలనన్ । శమ దయ మఖ శతముల వలనన్ ॥**

**టీక :** సామ్యము = సమానము, పెక్కు = అనేక, శమ = అంతరేంద్రియ నిగ్రహము, దమ = బాహ్యేంద్రియ నిగ్రహము, మఖశతముల వలన = నూరు యజ్ఞములు చేసిననూ ॥

**భావము :** శిష్యా! కల - మేల్కొల రెంటిని, (వరుసగా) ఎరుక బయలులకు సమానము చేసి విచారించుము, నీ భ్రాంతి తొలగును. పెక్కు శాస్త్రములు చదువుట వలన గానీ జపములు, యాగములు, యోగములు, వ్రతములు, నూరు యజ్ఞములు చేసిననూ జన్మరహితము కానేరదు. ఇహ - పరలోక సౌఖ్యములు పొందుటకే ఉపయోగించును. కల మేల్కొను చూడబోయితే లేకపోయినట్లుగా, ఎరుక పరిపూర్ణమును చూడబోవు సరికే పూర్తిగా ఎరుక లేకపోవును. ఇదే జన్మరహితమార్గము. పైన చెప్పిన శమదామాదుల వల్ల సాధ్యము కాదు.

**విశేష భావము :** కల వంటిది ఎరుక అనియు, మేల్కొవంటిది పరిపూర్ణమనియు విచారిస్తే, కల మేల్కొను చూడబోతే లేకపోయినట్లు, ఎరుక పరిపూర్ణమును చూడబోతే లేకపోవును. అయితే మిగతా జపయాగ యోగ సమస్త వివిధ కర్మల వలన ప్రయోజనము లేదని ఈ పద్య భావము. అలాగునని ఏ విధమైన పూజలు, జపములు, కర్మలు చేయరాదని ఈ సంప్రదాయకులలో చాలమంది భావము. అది తప్పుడు అభిప్రాయము. శ్రీ కృష్ణదేశి కేంద్రులవారు పరిపూర్ణ బోధ స్థితి యందు ఎరుక లేదని నిర్ణమునకై చెప్పిన బోధ. అనగా పరిపూర్ణ బోధ జీవత్వములో ఉన్నావారికి కాదు, ఈశ్వర స్థితిని పొందిన వారికి మాత్రమే. అనగా అభ్యాసాతీతులై ఆరూఢములో ఉన్న జ్ఞానవంతులకు చెప్పిన బోధ. సర్వము సద్గురుమూర్తియే యని, సమస్తము సద్గుర్వర్పణమస్తు అని కర్మాచరణ చేయుచు ఉంటేనే అట్టి స్థితి బోధా ఆరూఢత్వ అర్హత కలుగును. అలా కాక పుణ్య పాపములు లేవని ఎరుక లేదు గదాయని పూజ కర్మలు మాని చరించుచూ ఉంటే అధోగతి తప్పదు. కనుక పెద్దల వాక్యములను చక్కగా గ్రహించవలెను. అట్టి స్థానమునకు చేరాలంటే పూజ, జప, యోగ మొదలగు సమస్త కర్మలు నిష్కామ్యముగా సర్వము సద్గురుమూర్తియే అనియు, సమస్తము సద్గురు పాదారవిందార్పణ మనెడి బుద్ధి చేత చేస్తూ ఉంటేనే అట్టి స్థితి కుదిరి బోధా రూఢత్వ అర్హత పొందలగరు. అలా కాకుండగ అజ్ఞాన స్థితిలోనే కర్మలను వదిలివేసి ఏమీ లేదని, పుణ్య పాపములు లేవనుచు, ఎరుక బుద్ధిలోనే ఏమీ లేదని, పుణ్య పాపములు లేవనుచు, ఎరుక బుద్ధిలోనే మసులుచున్న వారికి అధోగతి తప్పదు. కనుక పెద్దల ఆర్షవాక్యములను చక్కగా గ్రహింపవలెనని ప్రార్థన.

బ్రహ్మము కర్మలచే సాధ్యము కానిది శ్రీ శంకరాచార్యుల వారు వివేక చూడామణిలో "చిత్తస్య శుద్ధయేత్కర్మనతు వస్తూప లబ్దయే" వస్తు సిద్ధిర్విచారేణ।

నకించిత్కర్మ కోటిభిః । అని వ్యాఖ్యానించియున్నారు. చిత్తశుద్ధి కొరకై కర్మలను ఆచరించవలెను. చిత్తశుద్ధి లేనిదే, బ్రహ్మతత్త్వము తెలియబడదు. బ్రహ్మతత్త్వము విచారణ చేతనే తెలియబడగలదు కాని కోటి కర్మలు చేసినను బ్రహ్మతత్త్వము తెలియబడదు. అందుచేతనే "న కర్మణా, న ప్రజయా, నధనేన, త్యాగేనైకే నృమతత్వమానసుః । త్యాగము చేత మాత్రమే బ్రహ్మతత్త్వ సిద్ధి కలుగును కర్మల వలన గాని, పుత్రులు వలన గాని ధనము వలన గాని సిద్ధింపదు అని నిష్కర్ష.



**128వ పద్యము : నీ కలలో నిను నన్నను । లోకులు లోకముల జూచి లోపలి భ్రమచే । నా కరుణ బడసి మేలుక । చేకొని, కల కల్ల జేసి చేరెద వెటకో ॥ సర్వము నీతో చేరెను యెటకో ॥ ప్రాకటముగ బట్టబయలెరుక లీరీతి ॥ నీకు దెలిసిన మీద నిలువాక వేవేగ ॥ చేరెద వెటకో । సర్వము నీతో చేరెను యెటకో ॥**

**భావము :** శిష్యా! నీ శరీరమందున్న ఎరుక భ్రాంతి చేతనే నీ ఎరుక యందే నిను, నన్ను, లోకములను, లోకులను జూచుచున్న నీవు, నా కరుణ పొంది (గురుకరుణ పొందినచో) కలనుండి మేల్కొని, ఆకలను అబద్ధమని లేనిదని తలచి ఎరుకను విడచి ఎచ్చటికో చేరుకుందువు. అనగా లేకుండా పోవుదువు. నీవు లేకపోయినచో నీతోనే ఏర్పడిన సర్వము (సమస్త జగము) లేకుండా పోవును. ప్రత్యక్షముగా ప్రసిద్ధమైన పరిపూర్ణమె యున్నదని ఎరుక లేదని దృఢముగా తెలిసిన వెంటనే లేకపోవుదువు.

**విశేష భావము :** నీ లోపలి భ్రమచే = నీ లోపల ఉన్న ఎరుకతోనే ! ఎరుక కలవంటిది కనుక నీవు చూచుచున్నది, గుర్తించుచున్న సమస్తము నీకలలో అనగా ఎరుకలోనే అని భావము. ఆ ఎరుకలోనే, లేని అవిద్యాభ్రమ యొక్క కల్పన చేత నీవు ఉన్నావని సమస్తము ఉన్నదని భ్రమించుచున్నావు. అట్టి ఎరుకలో వ్యవహరించుచున్న నీవు నా కరుణ బడిసినచో అనగా గురు మేల్క పొందినచో, కల కల్ల జేసి ఎరుకను లేకుండా జేసి కొని నీవులేకుండా పోదువు. నీతోనే నీ ఎరుకలోనే, నీ ఎరుక భ్రమ వల్లనే ఏర్పడిన, నిను, నన్ను, లోకులు, లోకములు ఈ సమస్తము నీవు లేకపోయినచో, ఆ సమస్తము కూడా లేకపోవును అని భావము. భావము కొంచెము గంభీరముగా జాగ్రత్తగా విచారించవలసియున్నది.



**అవతారిక :** అనేక గురు సంప్రదాయాకులు, ఈ బోధ క్రమమును గుర్తించలేక, తాము తెలుసుకున్నది పరిపూర్ణ బోధయే యని భావించుకొనుదురు, అని ఈ పద్యములో చెప్పుచున్నారు.

**129వ పద్యము : హరి కర నర ముఖ విదళిత । కరి మస్తక గళిత మైన ఘన మౌక్తికముల్ । దొరికిన నెరుకలు గురిజలె । ధరియింతురు రెంటి విలువ తమ రెరుగకనెకా ॥ అట్లనె బోధ క్రమమెరుగనెకా ॥ పరిపూర్ణ బోదను యెరిగింపుచుండిన । యెరుకకె కొందరు మరిగేరీ మర్మము ॥ తమరెరుగకనెకా । అట్లనె బోధ క్రమమెరుగకనెకా ॥**

**టీక :** హరి= సింహము, కర = చేతి, నఖ = గోళ్ళ యొక్క, ముఖ = ముందటి భాగముచే, విదళిత = చీల్చబడిన, కరిమస్తక = ఏనుగు కుంభ స్థలమందుండి గళితమైన = పారవేయబడిన, ఘనమౌక్తికముల్ = గొప్పవైన ముత్యములు, దొరకినన్ = దొరకినచో, ఎరుకలు = కోయ జాతులవారు, గురిజలె ధరియింతురు = గురివింద గింజలతో సరిచేసి ధరించెదరు.

**భావము :** శిష్యా! సింహము యొక్క వాడిగోళ్ళచే చీల్చబడిన ఏనుగు కుంభస్థలము నుండి జారిపడిన గొప్ప మంచి ముత్యములు దొరకినచో, కోయ జాతుల వారు గురువింద గింజలతో కూర్చి మాలలు తయారు చేసుకొని మెడలో ధరించెదరు. వార్కి గొప్పవైన మంచి ముత్యముల విలువ ఏమిటో, గురువింద గింజల విలువ ఏమిటో తెలియకనె కదా అట్లు వారు ధరించెదరు ? అట్లే పరిపూర్ణ బోధ యొక్క విధానము, గొప్పతనము తెలియక కొందరు సామాన్యులు, పరిపూర్ణ పరబ్రహ్మతత్త్వమును గూర్చి విని, అందు నిర్ణయించిన బ్రహ్మతత్త్వము యొక్క వస్తు నిర్ణయమును యెరుగక, మా యాశబళిత బ్రహ్మమునకే నిర్ణయించుకొందురు ఆ రెంటికి ఉన్న భేదమును గుర్తించలేకపోవుట చేతనే కదా !

---

**అవతారిక :** ఉపాధి, ఉపాధియందలి చైతన్యము కానిది పరిపూర్ణమని నిర్దేశించుచున్నారు.

**130వ పద్యము : తనువో, బహిరింద్రియములో । మనసో, ప్రాణములో విషయ మమతో నేనం । చని నీవవనిది యని । యనుమా వించెద వదేల, అది త్రోవగాదు॥ నీ వెన్నడు యిది వినలేదూ ॥ వినుమీ పరిపూర్ణము గని, లేని యా మీది । తను వాదికమును లేందని గురునిచే దెలియు ॥ మది త్రోవ గాదు ॥ నీ వెన్నడు యిది వినలేదు ॥**

**టీక :** విషయమమతో = జగద్విషయములను తెలుసుకొని అభిమానించేది.

**భావము :** శిష్యా! శరీరమో, బాహ్యేంద్రియములో లేక అంతరేంద్రియములైన మనస్సో ప్రాణమో, లేక సమస్త విషయములను అభిమానించే అహంకారమో వీటిలో యేదో ఒకటి నేనని (అనగా ఆత్మ, బ్రహ్మమని) నీవనినిది, అనగా పరిపూర్ణ బ్రహ్మమని అనుమానించెద వెందుకు? అది సరియైన మార్గము కాదు. నేను చెప్పుచున్న యీ పరిపూర్ణ బోధ నీవు యిదివరలో యెన్నడూ వినలేదు. కనుక నే చెప్పే బోధను సరిగా గుర్తించుము. ఆ పరిపూర్ణమును సరిగా గుర్తించి, యీ లేని శరీరాదులనన్నిటిని లేనివని చక్కగా తెలిసి విడిచిపెట్టుము.



**అవతారిక :** ఏ యెరుకను విడువవలెనో నిర్ణయించుచున్నారు.

**131వ పద్యము : నిను నను ప్రపంచమును జగ । మని, యెరిగే యెరుక చేత నచలము గనుగొని । నిను నను జగమును జగ । మని యెరిగే యెరుక మాను మమల వివేకా ॥ చాలును నీవీక్రమమెరిగినాన్నా ॥ నిను నన్ను పైరెంటిని విశ్వమనక । బయలనకుండెదున్నాదంచను గుర్తు లేకుండు ॥ మమల వివేకా ॥ చాలును నీవీ క్రమమెరిగినాన్నా ॥**

**దండాన్వయం :** నిను నను ప్రపంచమును, జగమని యెరిగే యెరుక చేత నచలము గనుగొని। నిను నను జగమును జగమని యెరిగే యెరుక మాను, చాలును, అమల వివేకా । నీవీ క్రమమును ఎరిగిన అన్నా, నిను నన్ను పై రెండిటిని విశ్వమనక, బయలనక, ఉండేదున్నాదంచను గుర్తు లేకుండుము ॥

**టీక :** నిను = జీవుడు, నను = ఈశ్వరుడు, ప్రపంచము = జగత్తు, జగమని = జనించి గతించేదే అని, యెరిగే యెరుక చేత = తెలుసుకొనే తెలివిచేతనే ॥

**భావము :** ఓ మలిన రహితమైన విచారణ కలవాడా! (శిష్యా) జీవుడు, ఈశ్వరుడు, సమస్త ప్రపంచము (ఈ మూడును) జనించి గతించేవే అని యే తెలివి చేత తెలుసుకొన్నావో, ఆ తెలివి చేతనే (ఆ యెరుక చేతనే) ఈ మూటికి పరముగా పరిపూర్ణ పరబ్రహ్మము శాశ్వతమై ఉన్నదని తెలుసుకొని, అట్లు తెలుసుకొన్న తెలివిని

(ఎరుకను) విడిచిపెట్టుము. చాలును, ఈ పద్ధతి (విధానము) తెలిసిన తరువాత, జీవుని గాని ఈశ్వరుని గాని, అఖండ ఎరుకే (విశ్వము) అనక, పరిపూర్ణ బ్రహ్మమే అనక, ఉన్నదేదో శాశ్వతమై ఉండనే ఉంటుంది అనే మాటను కూడా అనకుము.

**విశేష భావము :** పరిపూర్ణము ఉన్నదని గురుముఖతా ఏ జ్ఞానము చేత తెలిసికొన్నామో, ఆ జ్ఞానమునే విడువవలయును. అనగా అన్నిటికి ఎరిగే ఎరుక అవిద్యా ఎరుకయే. అందలి ప్రతిబింబ చైతన్యము ఏమియు యెరుగుటలేదు. కేవల సాక్షి మాత్రమే. కనుక అవిద్య యెరుకయే, యెరిగే యెరుక, దాన్ని విడచినచో, ఉపాధి రహితమగును కనుక అందలి ప్రతిబింబము కూడా లేకపోవును ఇదే ఎరుక రహిత పద్ధతి చక్కగా విచారించి తెలుసుకొనవలయును.

**ప్రమాణం :** "జ్ఞాన మజ్ఞానినం దృష్ట్వా । ద్వయో స్త్యజతి నిశ్చయం । ద్వయోస్త్యజతి యజ్ఞానం । తజ్ఞానంచ పరిత్యజేత్ ॥

---

**132వ పద్యము : ప్రొద్దున నిద్దుర మేల్కొని । వొద్దిక యేతెంచి గరుని వక్త్ర జనితమౌ। సుద్దులు మ్రొక్కి వినుము। యే ప్రొద్దిది బహుముద్దు సుమ్మీ పుట్టినందులకు ॥ గురుచరణము పట్టినందులకు ॥ నిద్దమౌ భక్తిచే నీ విట్లు జేసితె । దిద్దితీరిచి బోధ తెరవు జూపుమ నీవు ॥ పుట్టినందులకు । గురుచరణము పట్టి నందులకు ॥**

**టీక :** వొద్దిక యేతెంచి = అనుకూలముగా వచ్చి, సుద్దులు = పరిశుద్ధమైన మాటలు, ముద్దు సుమ్మి = ఆదరించదగినది సుమా, నిద్దమౌ భక్తిచే = శుశ్రూషచే యేర్పడిన శుద్ధమతి (పరిశుద్ధమైన భక్తిచేత, బోధ = జ్ఞానము, బ్రహ్మము, తెరవు = మార్గము.

**భావము :** శిష్యా! ప్రతి రోజు ప్రాతః కాలముననే లేచి, గురు సాన్నిధ్యమునకు అనుకూలముగా వచ్చి; సాష్టాంగ ప్రణామము చేసి, వారి నోటి నుండి వెలువడే పరిశుద్ధమైన సూక్తులను యెల్లప్పుడు వినుము. నీవు (బహు పుణ్యవంశమున) మానవుడవై పుట్టినందులకు, అందునా గురుపాదము ఆశ్రయించినందుకు, యీ విధముగా యెల్లప్పుడు చేయుచుండినచో, పరిపూర్ణ బోధ స్థితిని చెందుటకు నిన్ను

చక్కజేసి, మార్గమును జూపును. కనుక ఇది నీవు ఆదరించ దిగినది సుమా. అనగా నీవిట్లు చేయుచుండవలెను సుమా అని భావము.

---

**అవతారిక :** పరిపూర్ణ పరబ్రహ్మమును గురు కరుణచే మాత్రమే తెలియనగును. పరిపూర్ణమును గమనిస్తూనే ఎరుక యెంత మాత్రము లేకుండా సమూలముగ పోవును. మరొక మార్గము ఏదియు లేదు అని వక్కాణించుచున్నారు.

**133వ పద్యము : గురుడు పరిపూర్ణముమ జూ। పెరుకను లేందనుచు దెల్పి, యిక దల్పకమం। చెరిగించక విడిపోవునె। యెరుక, నరుల్ సాధనములు యెన్ని జేసినమా ॥ లక్ష్య ముద్ర లెన్ని జూచినమా ॥ హరి హర బ్రహ్మ మరాసుర ముఖ్యులైన। ధరణీ సురా ద్యష్టా దశ జాత్యుద్భవు లాను ॥ యెన్ని జేసినమా । లక్ష్య ముద్రలెన్ని జూచినమా॥**

**దండాన్వయము :** నరుల్ సాధనములు యెన్ని జేసిననూ, లక్ష్య ముద్రలెన్ని జూచిననూ, హరి, హర, బ్రహ్మ అమర, అసుర ముఖులైన, ధరణీసుర ఆది అష్టాదశ జాతి ఉద్భవులను యెన్ని జేసిననూ, గురుడు పరిపూర్ణమును జూపి, యెరుకను లేందనుచు.

**అష్టాదశ జాతులు :** 18 జాతులు, 1) బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, 5) వ్యవహారిక, 6) గోరక్షక, 7) శిల్పక, 8) పంచాణ (రాళ్లు కొట్టువారు) 9) కుంభకార (కుమ్మరి), 10) తంతువాయి (వాద్యకారులు) 11) క్షురక, 12) రజక, 13) వస్త్రచ్ఛేదక, 14) చర్మకార 15) తిలఘాత, 16) లుబ్ధక = బోయవాడు, 17) కసాయి, 18) మాతంగ జాతులు.

**భావము :** బ్రహ్మ, విష్ణు, ఈశ్వర మొదలగు దేవతా శ్రేష్ఠులకు గాని, రాక్షస శ్రేష్ఠులకు గాని, బ్రాహ్మణాధి పదునెనిమిది జాతులవారికి గాని, ఎన్ని యోగసాధనలు చేసిననూ, లక్ష్య ముద్రలు యెన్ని జూసినను, యెరుక విడిపోదు. గురుమూర్తి (కరుణచే) పరిపూర్ణమును జూపించి, యెరుక లేనిదని దృఢపరచి, ఇక ఈ ఎరుకను తలవకుము, విడిచిపెట్టుము అని గురుమూర్తి యెరిగించినపుడు మాత్రమే ఈ ఎరుక లేకపోవును. అనగా గురు కరుణచే మాత్రమే ఎరుక లేకపోవును. మరొక మార్గము ఏదియు లేదని నిష్కర్ష.

---

**134వ పద్యము : బల ధన విద్యా ధైర్యం । బులు, చక్కదనంబు, సత్వ బుద్ధ్యా ద్యుతులన్ । కలలో యివి లేని మనుష్యుల జగమును తనను తాను జూచి మానవుడూ॥ మేల్కనేని చూడా లేడొకడూ ॥ కలమేల్క ఎరుక బయలుల కిట్ల జత గూర్చి । కల యెరుకలను దేశికులచే వీడితె జాలు ॥ జూచి మానవుడు । మేల్కనేని చూడలే డొకడూ॥**

**టీక :** జగమును = సమూహము, యుతులన్ = కల్గినవారు.

**దండాన్వయము :** బల, ధన, విద్యా, ధైర్యంబులు, చక్కదనంబు, సత్వ బుద్ధి ఆదియుతులన్ యివి లేని మనుష్యుల జగమును, కలలో తనను తాను జూచి, మానవుడు మేల్కనేని ఒకడూ చూడ లేడు. కల - యెరుక, మేల్క - బయలులకు ఇట్ల జత గూర్చి, కల యెరుకలను దేశికులచే వీడితె జాలు.

**భావము :** శిష్యా! బలము, ధనము, విద్య (పాండిత్యము) ధైర్యము అందము, సత్వ ధార్మిక బుద్ధి । మొదలగునవి అని లేని మనుజులకు ఉన్నట్లుగా కలలో తనకు తానే జూచిన మానవుడు, మేల్కొనగానే, ఆ మనుష్యులకు ఆ గుణములు ఏమియు కానరావు. అనగా కలలో తోచిన సమస్తము లేనిదే (మిధ్యయే).

ఈ విధముగానే యెరుక, యెరుక వలన యేర్పడిన సమస్త జగత్తు కల వంటిదనియు, లేనిదే ఉన్నట్లు కనిపించే మిధ్యా స్వరూపము మాత్రమే అనియు, పరిపూర్ణ బ్రహ్మము మాత్రమే శాశ్వతమైనదనియు (మేల్కవంటిది) గురుముఖతా గురు కరుణచే గుర్తించి యెరుక అనే కలను విడిచినచో చాలును.

ఇతి శ్రీ మద్భాగతవత కృష్ణ విరచిత ద్వైతా ౨ ద్వైత రహిత పరమతత్త్వే
సకల మత లక్షణన్నామ సప్తమో ధ్యాయమునకు
భావ విశేష భావము సమాప్తము

# మతాల లక్షణమునకు సంక్షిప్త భావము

ఈ లక్షణములో, సాంఖ్య, తారక, అమనుస్క, వైశేషిక ద్వైత, అద్వైత విశిష్టాద్వైత, శైవ, వైష్ణవ, శాక్తేయ, గాణాపత్య, సౌర, కాపాలికాది మతముల వారు (సిద్ధాంతములవారు) శృతుల యొక్క అర్థమును తమకు (తమసిద్ధాంతమునకు) అనుకూలముగా వాఖ్యానించుచు, మాయ శబళిత బ్రహ్మమునే పరబ్రహ్మముగా చెప్పుకొనుచున్నారనియు, అవన్నియు ఎరుక సిద్ధాన్తములే అనియు, పునరావృత్తి మార్గములే అనియు, అవన్నియు ఈ పరిపూర్ణ బోధకు సరిరావనియు, ఈ లక్షణములో శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు నిరూపించిరి. అట్టి చపల సిద్ధాంత వేత్తలకు ఈ బోధ చెప్ప వద్దనియు, సాటిలేని, ప్రతి లేని పరిపూర్ణమె శాశ్వతమైన బ్రహ్మమని చెప్పిరి.

ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతులు జీవుడు, ఈశ్వరుడు ఒక్కరేనా కాదా అని వాదోప వాదములు చేసుకొనుచున్నారనియు, జీవ, ఈశ్వరులు రెండును ప్రతిబింబిత చైనత్యములే కాని శాశ్వత ఉనికి కల్గినవి కావు కనుక లేనివే అనియు, కనుకనే ఈ సిద్ధాంతము ద్వైత అద్వైత రహితమైనది అనగా జీవ, శివ సంబంధము లేనిది అనియు పేర్కొనిరి.

ఈ సిద్ధాంతము ప్రణవ అతీతమైనది. ప్రణవము అనగా "ఓం" కారము. ఓంకారము నుండే 50 అక్షరములు కలిగినవి. ఓంకారము నుండే మహదాది పృథ్వి పర్యంతము, సమస్త నామ, రూప, క్రియాత్మక వస్తు ప్రపంచము కలిగినది. కనుక కారణ కార్యములతో కూడినది ఓంకారము. ఇదే బ్రహ్మాండాధిష్ఠాత సమస్త బ్రహ్మాండములకు ఆధారము. అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడైన అఖండ గురు స్వరూపము. ఇదే మూల ప్రకృతి కనుక దీనికి అతీతమైనది ఓం అనే ఎరుకే లేనిదే పరిపూర్ణము. పిండాండమందలి అహమే పంచకోశములకు సృష్టించుకొనుచు, బాహ్యజగత్తును కూడా సృష్టించుకొనుచు, జగత్తు అనాత్మయని, తాను ఆత్మ స్వరూపమనియు, బ్రహ్మమనియు భ్రమించుచున్నది ఈ అహమే. ఇట్టి అహమే ఎరిగే ఎరుక. ఇది తనను చక్కగా తెలుసుకొని తనకు పరముగానున్నది. శాశ్వతమైనది పరిపూర్ణమన్నదని గురు కరుణచే తెలసి, గురు కరుణచే ఆ పరిపూర్ణమును

**విశేష భావము :** ఎరుకనగా - నీవని (జీవుడని), నేనని (ఈశ్వరుడు), జగమని (సమస్త వైకారిక జగత్తు) అని తెలుసుకొనుము. యెరుక త్రిగుణాత్మికము. త్రిగుణాత్మికమైన యెరుక పరిపూర్ణ బ్రహ్మమును ప్రతిఫలింపజేసికొనుటచే, సత్వగుణ ప్రతిబింబము ఈశ్వరుడుగను, రజో గుణ ప్రతిబింబము జీవుడుగను, తమోగుణ ప్రతిబింబము జగత్తుగను ఏర్పడినది. ఈ మూడును ఎరుకయే. ప్రతిబింబములే. కనుక లేనివి అని తెలుసుకొని "పిదప దీన్ని బాయుమనిశమున్" దీన్ని అనగా ఎరుక అని చెప్పరాదు. జగత్తును విడచిపెట్టుము అని అర్థము. పరిపూర్ణ బోధ శిష్యనికి చక్కగ గుర్తింపజేయుటకై చంచలత్వము, నిరోధింపజేయునుద్దేశ్యముతో, జగత్ భ్రాంతి చేతనే చంచలత్వము యేర్పడుచున్నది కనుక, జగత్తును (దీన్ని) విడచిపెట్టుము అని గురుమూర్తి శిష్యునికి ఆజ్ఞాపించినారు. అనగా జగత్తు మీదకు దృష్టిని పోనీయవద్దు అని చెప్పిరి. అట్లు జగత్తును విడచినవానికి జగత్ పరిపాలన చేయు దేవలతో పని యేమి? కనుక "శ్రీ వనితేశ, రాజీవ సంభవ, భవ, దేవేంద్రాలను కూడా విడిచి పెట్టుము అన్నారు. ఈ విధముగ జగత్తు, జగత్పరిపాలకులైన దేవతలను విడచినచో, ఇక నీవు (జీవుడు) నేను (ఈశ్వరుడైన గురుమూర్తి) ఇద్దరు మాత్రమే ఉన్నారు. అప్పుడు గురువు చెప్పే పరిపూర్ణ బోధ చంచలత్వము లేకుండగ. శిష్యుడు చక్కగా గ్రహించుటకు వీలు కలుగును. కనుక శాశ్వతము, బుద్ధిచే గ్రహించవీలుకాని పరిపూర్ణ బోధ, గురు బుద్ధివిశేషత్వముచే చంచలత్వము లేకుండగా గ్రహించవలెనని ఈ పద్య విశేష భావము.



**అవతారిక :** పరిపూర్ణము, సాధారణ జ్ఞానమునకు తెలియరానిదనియు, తన్మాత్రలకు అతీతమైనదని చెప్పుచున్నారు.

**136వ పద్యము : లేదనకు మున్నదదిగో । నే దెలసితి ననకు దీన్ని నీ వెరిగేవా । కాదది, నీచే దెలియను ।ఏదిరతన్మాత్ర సమితి యీా బట్ట బైట ॥ దీనికి సాటి దేదీ మెచ్చోట ॥ వాదేల లేనెరుకతో దీన్ని గనిపెట్టి । పోదొట్టు మెరుక, నింకేదీ బట్టదు చాలు ॥ యీా బట్ట బైట ॥ దీనికి సాటి దేదీ యెచ్చోట ॥**

**భావము :** శిష్యా! పరిపూర్ణము లేదనకుము. ఉన్నదే అది. అయితే యీా చెప్పిన విధానముచే "పరిపూర్ణము నాకు తెలిసినది" అనకుము. ఎందుచేతననగా

# అధ్యాయము-8

# పరిపూర్ణ బోధ (26)

**అవతారిక :** అచల లక్షణములో పరిపూర్ణ బ్రహ్మము అనగా ఎట్టిదో లక్షణ రహితమైన పరిపూర్ణ పరబ్రహ్మము అన్వయ వ్యతిరేక లక్షణములచే అభ్యాస పద్ధతిలో శిష్యునకు ధృడపరచియున్నారు. ఇప్పుడు ఈ అధ్యాయము పరిపూర్ణ బోధలో, పరిపూర్ణ పరబ్రహ్మమును గుర్తించుటకు శిష్యునకు ఉండవలసిన నిధానము చెప్పుచూ, శాశ్వతము ఎరుక రహితమైన పరిపూర్ణము ఇట్టిదని నిర్ణయింపరానిది అనియు, ఎరుక రహితమైనచో ఉన్నది పరిపూర్ణమే అని చెప్పుచున్నారు.

**135వ పద్యము : యీ వృత్త బట్టబయలును । నీ విప్పుడు వుండజూచి నిజముగ యెరుకన్ । నీవని నేనని జగమని । భావింపుము పిదప దీన్ని బాయు మనిశమున్ ॥ నిజముగ దీన్ని బాయక నిశమున్ ॥ శ్రీ వని తేశ రాజీవ సంభవభవ । దేవేంద్రాదుల నింక సేవించు తలపేల ॥ బాయు మనిశయమున్ । నిజముగ దీన్ని బాయకనిశమున్॥**

**దండాన్వయము :** యీ వృత్త బట్టబయలును, నీ విప్పుడు నిజముగ వుండజూచి। యెరుకన్, నీవని, నేనని, జగమని భావింపుము ।

**టీక :** నిజముగ = శాశ్వతముగ, ఉండ జూచి = ఉన్నదని విచారంచి చూచి, అనిశమున్ = ఎల్లకాలములందు, ఎల్లప్పుడు.

**భావము :** శిష్యా! యీ పరిపూర్ణ పరబ్రహ్మమే శాశ్వతముగా ఉన్నదని, నీ విప్పుడు ధృడముగా తెలిసికొనుము. ఇక ఎరుక అనగా నీవు (జీవుడు), నేను (ఈశ్వరుడు) జగత్తు అనగా సమస్త బ్రహ్మాండము అని తెలియుము. ఈ మూడు ఎరుకయే అని గ్రహించి విడచిపెట్టుము. అలా ఎరుకను నిజముగా విడువక, విష్ణువు, బ్రహ్మ, ఈశ్వరుడు, దేవేంద్రాదులైన సమస్త దేవతలను సేవించు (పూజించు) తలపు నీకెందుకు? అవన్నియు ఎరుకతో కూడిన ఉపాధి స్వరూపములేయని తెలసి వాటి యందు భ్రమను విడచిపెట్టుము.

**విశేష భావము :** ఎరుకనగా - నీవని (జీవుడని), నేనని (ఈశ్వరుడు), జగమని (సమస్త వైకారిక జగత్తు) అని తెలుసుకొనుము. యెరుక త్రిగుణాత్మికము. త్రిగుణాత్మికమైన యెరుక పరిపూర్ణ బ్రహ్మమును ప్రతిఫలింపజేసికొనుటచే, సత్వగుణ ప్రతిబింబము ఈశ్వరుడుగను, రజో గుణ ప్రతిబింబము జీవుడుగను, తమోగుణ ప్రతిబింబము జగత్తుగను ఏర్పడినది. ఈ మూడును ఎరుకయే. ప్రతిబింబములే. కనుక లేనివి అని తెలుసుకొని "పిదప దీన్ని బాయుమనిశమున్" దీన్ని అనగా ఎరుక అని చెప్పరాదు. జగత్తును విడచిపెట్టుము అని అర్థము. పరిపూర్ణ బోధ శిష్యనికి చక్కగ గుర్తింపజేయుటకై చంచలత్వము, నిరోధింపజేయునుద్దేశ్యముతో, జగత్ భ్రాంతి చేతనే చంచలత్వము యేర్పడుచున్నది కనుక, జగత్తును (దీన్ని) విడచిపెట్టుము అని గురుమూర్తి శిష్యునికి ఆజ్ఞాపించినారు. అనగా జగత్తు మీదకు దృష్టిని పోనీయవద్దు అని చెప్పిరి. అట్లు జగత్తును విడచినవానికి జగత్ పరిపాలన చేయు దేవలతో పని యేమి? కనుక "శ్రీ వనితేశ, రాజీవ సంభవ, భవ, దేవేంద్రాలను కూడా విడిచి పెట్టుము అన్నారు. ఈ విధముగ జగత్తు, జగత్పరిపాలకులైన దేవతలను విడచినచో, ఇక నీవు (జీవుడు) నేను (ఈశ్వరుడైన గురుమూర్తి) ఇద్దరు మాత్రమే ఉన్నారు. అప్పుడు గురువు చెప్పే పరిపూర్ణ బోధ చంచలత్వము లేకుండగ. శిష్యుడు చక్కగా గ్రహించుటకు వీలు కలుగును. కనుక శాశ్వతము, బుద్ధిచే గ్రహించవీలుకాని పరిపూర్ణ బోధ, గురు బుద్ధివిశేషత్వముచే చంచలత్వము లేకుండగా గ్రహించవలెనని ఈ పద్య విశేష భావము.



**అవతారిక :** పరిపూర్ణము, సాధారణ జ్ఞానమునకు తెలియరానిదనియు, తన్మాత్రలకు అతీతమైనదని చెప్పుచున్నారు.

**136వ పద్యము : లేదనకు మున్నదదిగో । నే దెలసితి ననకు దీన్ని నీ వెరిగేవా । కాదది, నీచే దెలియను ।ఏదిరతన్మాత్ర సమితి యీా బట్ట బైట ॥ దీనికి సాటి దేదీ యెచ్చోట ॥ వాదేల లేనెరుకతో దీన్ని గనిపెట్టి । పోదొట్టు మెరుక, నింకేదీ బట్టదు చాలు ॥ యీా బట్ట బైట ॥ దీనికి సాటి దేదీ యెచ్చోట ॥**

**భావము :** శిష్యా! పరిపూర్ణము లేదనకుము. ఉన్నదే అది. అయితే యీా చెప్పిన విధానముచే "పరిపూర్ణము నాకు తెలిసినది" అనకుము. ఎందుచేతననగా

పరిపూర్ణములో తన్మాత్ర సమూహము (ఎరుక) కించిత్తు కూడా లేదు. కనుక నీ బుద్ధికి తెలియబడేది కాదు. కనుక తెలిసినది అని అన్నచో అది ఎరుకయే అగును. పరిపూర్ణము అవదు. ఈ పరిపూర్ణమునకు సాటి మరేదియు లేదు. ఇక అనవసరవాదములు వద్దు. ఈ లేనెరుక చేతనే పరిపూర్ణమును ఉన్నదని చూచి, లేనెరుక లేదని విడచిపెట్టుము. ఇక నీకు ఏ విధమైన బాధలు ఉండవు.

**విశేష భావము :** తెలిసికొనుట అనునది శబ్ద, స్పర్శ, రూప, రస గంధములచే మాత్రమే తెలియనగును. ఈ పంచతన్మాత్రల చేత, పంచతన్మాత్రలు గల దానిని మాత్రమే తెలుసుకొనగలము. పరిపూర్ణములోపల పంచతన్మాత్ర సమూహము కించిత్తు కూడా లేదు. పంచతన్మాత్రలు ఎరుకకే. ఎరుకను విడచి (జ్ఞానమును) తన్మాత్రలు గాని, తన్మాత్రలను విడిచి ఎరుక గాని ఉండదు. కనుక ఎరుగుట అను క్రియ ఎరుకకే వర్తించును గాని, పరిపూర్ణము ఎరుగబడేది ఎంత మాత్రము కాదు. కనుక గురు కరుణచే పరిపూర్ణము ఉన్నదని గుర్తించి, ఆ గుర్తించిన ఎరుకను విడిచిపెట్టవలెనని ఈ పద్యభావము.



**137వ పద్యము : కనవచ్చి యిట్టిదట్టిది । యని యన రాకుండు బయలు నదె కనుగనుమీ । కనరాకపోతే శూన్యం । బను, మిట్టిది యట్టిదనుచు పలుక వచ్చినమా ॥ యెరుక దాంట్లో పలికి జొచ్చినమా ॥ వినుమా బయలును నీవేమనినానొప్పె, దగనా। ప్పను నీ మాటను నే జెప్పిన రీతి గనవొస్తే ॥ పలుక వచ్చినమా । యెరుక దాంట్లో పలికి జొచ్చినమా ॥**

**దండాన్వయము :** కనవొచ్చి, యిట్టి ది అట్టిది అని అనరాకుండు బయలు అదె కనుగొనుమీ ॥ కనరాకపోతే శూన్యంబనుము । ఇట్టిది అట్టిది అని పలుక వచ్చిననూ, ఆ బయలును నీవు ఏమనినా ఒప్పెద । గాని వినుము ఆ బయలును నే చెప్పినరీతి గనవస్తే నీ మాటను ఒప్పను ॥

**భావము :** శిష్యా ! వినుము, విచారించి చూచినచో పరిపూర్ణము ఉన్నదని తెలియబడును. కాని యిట్టిది అట్టిది అని అనరాదు. అట్టి పరిపూర్ణము అదిగో అంతటా ఉన్నది అదే. చక్కగా విచారించి తెలిసికొనుము. ఈ విధముగా

విచారించనచో ఉన్నదని తెలియకపోతే శూన్యమనవచ్చును. లేదా ఇట్టిది అట్టిది అని తెలియబడిననూ, ఎరుకచే గుర్తింపబడిననూ, నీవేమనినూ (అనగా అది ఎరుకే అన్నా) లేదా శూన్యమని యన్నా అంగీకరించెదను. కాని నేను చెప్పిన విధముగా విచారించినచో నీవు అలా (పై విధముగా) అనినచో ఒప్పను. అంగీకరించను. పరిపూర్ణము ఎరుకే అని గాని, శూన్యమని గాని అన్నచో అంగకరించను. అనగా పరిపూర్ణము ఇట్టిది అట్టిది అని గుర్తింపరానిది. ఉన్నదని విచారించినచో తెలియును. ఎట్టి విశేషములు లేనిది అని భావము.

**అవతారిక** : పరిపూర్ణము శాశ్వతమైనది. సర్వకాలములయందు ఉన్నది. ఎరుక ఏకాలమందున లేనిదే శూన్యము, అని చెప్పుచున్నారు.

**138వ పద్యము: కనవొచ్చు బయలు లేదని । యన వొచ్చునె, యిట్టిద దట్టిన వొచ్చునె, ఛీ । యనరాదు యెరుకకెన్నడు । కనుకనె యీ బయలెల్లకాలముంచుందీ॥ దీనందెరుకే కాలము లేందీ ॥ వినుమీ లేనెరుకను వివరించ శూన్యమౌ । అనుమాన మే మెరుకగను, విశ్వమట్టిదే ॥ కాలముంచుందీ । దీనందెరుకే కాలము లేందీ ॥**

**దండాన్వయము** : కనవొచ్చు బయలు, లేదనియన వొచ్చునె? ఛీ, యనరాదు. యెరుకకె యెన్నడు (అనవచ్చును). కనుకనె యీ బయలు ఎల్లకాలము ఉంచుంది. దీనందు ఏ కాలము లేంది యీ యెరుకే (అని) వినుము. యీ లేనెరుకను వివరించ శూన్యమౌ. అనుమానమేమీ ! యెరుకగను - విశ్వము అట్టిదే ఏకాల ముంచుందీ?॥

యీ పద్యములో "యెరుక కెన్నడూ" తరువాత "అనవచ్చును" అనుపదము అన్యాపదేశముగ వాక్యసమన్వయార్థము తెచ్చి పెట్టుకొనవలెను.

**భావము** : శిష్యా ! వినుము విచారించినచో ఉన్నదని నిర్ణయింపనగు పరిపూర్ణమును లేదని అనవచ్చునా? లేక ఇట్టిది అట్టిది అని చెప్పవచ్చునా? ఛీ అట్లు చెప్పరాదు. అట్టి వివరములు నిర్ణయములు యెరుకకె అనవచ్చును. ఇట్టి నిర్ణయములు లేని పరిపూర్ణ పరబ్రహ్మము నందు ఎరుక యే కాలమునందును (భూత, భవిష్యత్ వర్తమాన కాలములందు) లేదు. అని ధృడముగా వినుము. ఉన్నట్లు కనిపించే యీ యెరుక విచారించినచో శూన్యమై పోవును. యీ జగత్తు వంటిదే విశ్వము కూడా.

అనగా జగదధిష్ఠానమైన అఖండ ఎరుక కూడా లేనిదే. పరిపూర్ణము ఒక్కటే శాశ్వతమైనది. ఇందులో అనుమానము ఎంత మాత్రము వద్దు.

**విశేష భావము :** సమస్తమును తెలుసుకొనే యెరుక పరిపూర్ణమున్నదని చూచుసరికి లేకపోవుచున్నది. కనుక ఎరుకను శూన్యమనవలయును. పరిపూర్ణము శాశ్వతమైనది. దేశ కాల వస్తు పరిచ్ఛేదము కానిది. ఎరుకచే ఎరిగిన సమస్తము ఎరుకయే. యెరుకచే జనించిన సమస్తము యెరుకయే. పరిపూర్ణము ఎరుకచే యేర్పడలేదు. యెరుకచే తెలుసుకొనజాలము. కనుక పరిపూర్ణము శాశ్వతము. యెరుక ఏ కాలమునందు లేనిదే, మిధ్యా స్వరూపము.



**139వ పద్యము : పరిపూర్ణమనిన యెట్టిదో। యెరిగెదవని యెరుక బైట కేగిన యెరకే । యెరుకకు శూన్యంబయ్యేను ।. యెరుకను జన్మించినట్టి యీ విశ్వమంతా॥ యెరుక వలెనె యేమి లేదంతా ॥ యెరుకవుండంగానే యెరుక విశ్వాములు, లే । వెరుకకె యిది జూడ యెంతో వింతై తోచె ॥ యీ విశ్వమంతా । యెరుక వలెనె యేమిలేదంతా॥**

**దండాన్వయము :** పరిపూర్ణమనిన యెట్టిదో యెరుకే యెరిగెదనని బైటకేగిన యెరుకకు, యెరుక, యెరుకను జన్మించినట్టి యీ విశ్వమంతా శూన్యంబయ్యేను । యెరుక వలెనే అంతా ఏమీ లేదు. యెరుక వుండంగానే యెరుక విశ్వములు లేవు. ఇది జూడ యెరుకకె ఎంతో వింతై తోచెను.

**భావము :** పరిపూర్ణ పరబ్రహ్మమనగా ఎట్టిదో తెలుసుకొనవలెనని సమస్తమును గుర్తించే ఎరుక, ఆ పరిపూర్ణమును చూచు సరికి తాను, తననుంచేర్పడిన సమస్త జగత్తు ఏమీ లేకుండా పోయినది. యెరుక ఉండంగానే (అనగా తాను తెలుసుకొంటూనే) తాను, జగత్తు లేకపోవుచున్నట్లు గ్రహించిన యెరుకకే, ఇలా తాను జగత్తు లేకపోవుట తనకే ఆశ్చర్యము కలిగించినది.

**విశేష భావము :** పరిపూర్ణమనగా యెట్టిదో విచారించుచున్న యెరుక, పరిపూర్ణమె శాశ్వతమైనదని గుర్తించి, తాను తననుంచైన జగత్తు లేదని ధృడముగా తెలుసుకొనగలిగినది. తాను ఉండి, తాను లేనని తెలియబడుట తనకే ఆశ్చర్యము కలిగించును కదా! ఇచ్చట పరిపూర్ణమును ఎరుక చూచి లేకపోవుట కాదు. విచారణచే

ధృడముగా గుర్తించినప్పుడు ఎరుక లేదని యెరుక తెలియబడును. ఈ విషయము అనుభవము చేతనే గుర్తించనగను. వట్టిమాటలచే కాదు. స్వప్నములో శత్రువులచే తను నరుకబడినట్లు కల గని, భయముచే ఉలిక్కిపడి మేల్కొనుసరికి ఏమియు లేదు. తాను కలలో తెగిపడిన తలను చూచుట, చనిపోయినట్లు కలగనుట ఇది చూచి మేల్కలో ఆశ్చర్యము కదా ! ఈ విధముగా "యెరుక ఉండగానే యెరుక, విశ్వములు లేవని యెరుకకే తెలియబడినది" ఇది చాలా ఆశ్చర్యము.



**అవతారిక** : పరిపూర్ణమును గురుమూర్తి చూపించవలెనే కాని స్వయముగా ఎవరును చూడలేరు. గురుమూర్తి పరిపూర్ణమును చూపించిన వెంటనే ఎరుక లేకపోవును అని చెప్పుచున్నారు.

**140వ పద్యము : గురుమూర్తి జూపకున్నను । పరిపూర్ణం బెట్లు తనకు ప్రత్యక్షమగున్। గురుమూర్తి జూపెనేనియు । పరిపూర్ణము తనకు లెస్స ప్రత్యక్షమౌరా ॥ చూస్తునె యెరుక పారిపోవునురా ॥ యెరుకాబోయిన వెనుక యెవరా ప్రత్యక్షాన్ని । యెరిగిట్టి దట్టి దంచెరిగే, వారటు మీద ॥ ప్రత్యక్షమౌరా । చూస్తునె యెరుక పారిపోవునురా ॥**

**టీక :** ప్రత్యక్షాన్ని = పరిపూర్ణమును

**భావము** : పరిపూర్ణ పరబ్రహ్మమును గురుమూర్తి వివరించి, చెప్పి చూపింపకపోయినచో పరిపూర్ణము యెవ్వరికి కనబడదు. తెలయబడదు. గురుమూర్తి కరుణించి చూపించినచో పరిపూర్ణము తెలియబడి ఎరుక లేకపోవును. (సూర్యోదయము కాకుండగనే సూర్యోదయము అవుతుండగనే చీకటి లేకపోయినట్లుగా) పరిపూర్ణమును చూస్తూనే యెరుక లేకుండా పోవును. యీ విధముగా పరిపూర్ణమును చూచి యెరుక లేకపోయిన తరువాత, ఆ పరిపూర్ణమును ఇట్టిదని వివరించే వారెవరు ? (ఎరుకే వివరించాలి. అట్టి యెరుక లేకపోయిన తరువాత వివరించె వారులేరు. అనగా పరిపూర్ణము ఇట్టిదని చెప్పలేరు) అని భావము.

పరిపూర్ణ పరబ్రహ్మము శాస్త్రజ్ఞానముచే తెలియబడదు. అనుభవము, యుక్తి శాస్త్రజ్ఞానము కల గురుమూర్తి కరుణచే మాత్రమే తెలియనగును.



**అవతారిక :** పరిపూర్ణమునామ రూప రహితమైనదైననూ, శిష్య అవగాహన నిమిత్తమై పరిపూర్ణమునకున్న వ్యవహారిక నామముల గురించి చెప్పుచున్నారు.

**141వ పద్యము : పరమ పదమనిన బయలన । గురు గుహ్యామనంత మనిన, గోప్యంబనిన్ । పరిపూర్ణ మచల మనినను । తిరమనగా బట్టబయలు, తెలియు మాయప్పా ॥ యీ తెలిసిన తెలివి మానప్పా ॥ యెరుక యెరుగని దన్నా । యెరుక మీరినదన్నా । యెరుక మరుపులు లేని పరవస్తువన బయలె ॥ తెలియు మాయప్పా యీ యెలసిన తెలివి మానప్పా ॥**

**టీక :** పరవస్తువు = పరబ్రహ్మము, (వసితి ఇతి వస్తుః - ఉన్నది అనేది (బ్రహ్మము) అను శాస్త్రార్థము.

**భావము :** పరమపదము, బయలు, గురుగుహ్యాము, అనంతము గోప్యము, పరిపూర్ణము, అచలము, తిరము (శాశ్వతము) ఈ పేర్లన్నియు బట్టబయలని చెప్పబడే పరిపూర్ణమునకే అని తెలియుము. ఇంకనూ, ఎరుకను ఎరుగనిది అన్నా, ఎరుకకు అతీతమైనది అన్నా; ఎరుక మరుపులు కాని పరబ్రహ్మమనినా, బయలని చెప్పబడే పరిపూర్ణమ అని తెలియుము. ఇలా తెలుసుకొన్న తెలివిని విడిచిపెట్టుము.



**142వ పద్యము : బట్టబయలనుచు దీనికి । మొట్టమొదల్ పేరు లేదు, ముదమున యెరుకే । పుట్టి పేర్బెట్టి దీనిని । పట్టుకల వాడు లేక పారిపోవునురా ॥ కనరాదిందు దూరనేరదురా ॥ పుట్టిచచ్చుచు మళ్లీ పుట్టి గిట్టుచుబుట్టి । నిట్టి తిప్పలనొందు నెరుకె బయలును జూస్తె ॥ పారిపోవునురా ॥ కనరాదిందు దూరనేరదురా ॥**

(ఈ పద్యములో 4వ పాదము "పట్టుకలవ్వాడ లేక" అని ఉంది "వా" కి ద్విత్వము చందస్సుతో గాని అర్థము గాని పనిలేదు. కనుక నేను "పట్టు కల వాడులేక" అని వ్రాసితిని. అర్థమునకు గాని, ఛందస్సు గాని తప్పుకాదు.)

**భావము :** శిష్యా! పరిపూర్ణ బ్రహ్మమునకు బట్టబయలని గాని మరియే పేరైన గాని లేదు. యెరుక పుట్టిన పిదప, ఎరుకే పరిపూర్ణ పరబ్రహ్మము అని, బట్టబయలని మొదలగు నామములు పెట్టినది. ఇవన్నియు వ్యవహారికనామములే. అలా పేరు

పెట్టిన యెరుక ఈ పరిపూర్ణమును పట్టుకోలేక (చూడలేక), దీనిన చూడబోయే సరికి తానే లేకుండా పోవుచున్నది. కాని పరిపూర్ణములో దూరలేదు. అనగా ఐక్యము కానేరదు. పుట్టి, చచ్చి మరల మరల పుట్టుచు చచ్చుచుండే ఎరుక, పరిపూర్ణ బ్రహ్మమును చూడబోయినచో ఎచ్చటను లేకుండాపోవును.

**విశేష భావము :** ఎరుక పుట్టిన తరువాత పరిపూర్ణమునకు ఎరుకే శిష్య అవగాహన నిమిత్తము వస్తు నిర్ణయమునకు పేర్లు పెట్టినది. అనగా పరిపూర్ణమునకు ఏ రకమైన నామములు లేవు. ఇట్టి ఎరుక శరీము నశించినను తాను నశించక అనేక జన్మలును పొందుచున్నది. పరిపూర్ణమునకు పుట్టుట చచ్చుట అనే క్రియ ఎంత మాత్రము లేక స్వతశ్శిద్ధమై, సనాతనమై, శాశ్వతమై యున్నది. ఇట్టి పుట్టిచచ్చే యెరుక గురుకృపచే పరిపూర్ణమును చూడబోవుసరికి ఎంత మాత్రము లేకుండా పోవును. అంటే పరిపూర్ణ బ్రహ్మములో ఐక్యము అయినది అని తలచరాదు. పరిపూర్ణములో ఎరుక లేదు కనుక ఎరుక పరిపూర్ణమును చూచు సరికే ఏమీ లేకుండా పోవును. మటు మాయమైపోయినది అని అర్థము.

---

**అవతారిక :** పరిపూర్ణము ఎరిగే శరీరములో లేక నిండియున్నది అని చెప్పుచూ దీనికి శివరామదీక్షితీయ గ్రంథ ప్రమాణము చెప్పుచున్నరు. (శాస్త్ర ప్రమాణము)

**143వ పద్యము : వినుము నేనను యెరిగే । తను వందున లేక బయలు తానిండివదో। కనుగొనుమది కనుగొని యీ । తనువును విడనాడు మింక తడవేలనోయీ ॥ యీ పనికింక గడువేల నోయీ ॥ అనుమాన ముంటెనీ । వరయుము శివరాము ॥లను దీక్షితులు జేసె వచల గ్రంథమునంతా ॥ తడవేలనోయీ । యీ పనికింక గడువేల నోయీ ॥**

**టీక :** తడవు = ఆలస్యము, గడువు = కాల నిర్ణయము.

**భావము :** శిష్యా! వినుము. నేనను ఎరిగే శరీరము అనగా అవిద్య యందు - బయలు లేక తాను నిండియున్నది. లేక నిండియున్న ఆ పరిపూర్ణమును దానికి ఉపాదిగా నున్న అవిద్య (ఎరిగే శరీరము)ను చక్కగా విచారించి తెలుసుకొని, ఎరిగే శరీరమైన అవిద్యను విడిచిపెట్టుము. (లేకుండగ జేయుము)

ఈ పనికి ఆలస్యము గాని గడువు కాని వద్దు. వెంటనే ప్రయత్నించుము. ఈ చెప్పిన వాక్యము నందు నీకు అనుమానమున్నచో శ్రీ శివరామదీక్షితుల వారు వ్రాసిన "దీక్షితీయమను" అచల గ్రంథములో చూడుము. అందులో చూచి నిర్ణయించుకొనుము.

**విశేష భావము :** "నేననుచు ఎరిగే తనువందున లేక బయలు తానిండినదౌ" అనే వాక్యమునకు వస్తు నిర్ణయ జ్ఞానము లేక, అనేక మంది అనేక విధములుగా చెప్పుచున్నారు. కనుకనే "అనుమానముంటే అరయుము అచల గ్రంథమునంతా" అన్నారు. దీక్షితయములో "సాందీపని వాక్యములు" అన్న ప్రకరణములో ఉన్నది. "ఎరిగే శరీరమందు బయలు లేక నిండియున్నది" అని ఉన్నది.



**144వ పద్యము : దేహాకారము కానిది। యహంభావంబు లేనిదఖిల జములు దా। సోహం, సోహం బనినను। మోహము జెందనిది బైలు మొదలెరుగ వలెరా॥ యెరిగిన యెరుక తుద కరుగ వలెరా॥ కోహం కస్త్వంబని కూతాలు గూసేటి। దేహి దేహములాను తెలియనిదీ బైలు మొదలెరుగవలెరా। యెరిగిన యెరుక తుదకరుగ వలెరా॥**

**భావము :** శిష్యా! పరిపూర్ణము దేహాకారము కానిది. అహం (నేనను) భావము లేనిది. అతడే నేను, నేనే అతడు అనినను, అతనికి దాసుడను నేను అని అన్నను, ఎంత మాత్రము మోహము చెందనిది. ఇట్టి పరిపూర్ణ పరబ్రహ్మమును మొట్టమొదటగా తెలిసికొనుము. ఇట్లు తెలిసికొన్న ఎరుక లేకుండా పోవలెను. "కోహం" నేను ఎవరిని, "కస్త్వం" - నీ వెవరు, అని ప్రశ్నించి సిద్ధాంతీకరించే యీ దేహి దేహములను ఎంతమాత్రము తెలియని పరిపూర్ణ పరబ్రహ్మమును చక్కగా తెలుసుకొని, ఆ తెలిసిన యెరుక లేనిదని విడచిపెట్టుము.

**విశేష భావము :** కోహం - కః అహం - నేను ఎవరు? కస్త్వం-కఃత్వం - నీవు ఎవరు? ఇందుకు సమాధానములు - సః అహం సోహం - అతడే నేను అని గాని, దాసోహం - అహందాసః నేను నీ దాసుడను, అని సమాధానములు అనగా అద్వైత సంప్రదాయముగా "సోహం" అతడే నేను అనగా ఈశ్వరుడనే నేను అనియు జీవ-శివులకు అభేదమనియు నిర్ణయము. ద్వైత విశిష్టాద్వైత సిద్ధాంత రీత్యా "తవ

దాసోహం" నేను నీ యొక్క దాసుడను. నేను నీ యొక్క పరిచర్యచే తరించి నీ సాన్నిధ్యమునకు చేరేవాడను. నీవు ప్రభువివి. నేను దాసుడను అని నిర్ణయము. ఇట్టి వియుష నిర్ణయములు. ఎరుకలోని నిర్ణయములే. పరిపూర్ణ పరబ్రహ్మమును గుర్తించిన నిర్ణయములు కానేరవు. జీవ - శివులు రెండును ఉపాధి సహిత ప్రతిబింబిత చైతన్యములు. ఇట్టి ఉపాధి ఎంతమాత్రము లేనిది పరిపూర్ణము. కనుకనే ఈ పద్యములో "దేహాకారము కానిది, అహంభావము లేనిది" అన్నారు. పరిపూర్ణమే శాశ్వతమైనది, స్వతస్సిద్ధమై వ్యాప్తమై, అద్వయమని ఎఱుక చేతనే గురుముఖతా గుర్తించి, ఆలా తెలిసిన తెలివినే (ఎరుకనే) లేకుండా చేసుకొనవలెను. ఆ ఎరుక పరిపూర్ణమును చూడబోతే తానే లేకపోవును. ఈ విధానముచే ఎరుక రహితమగును.



**అవతారిక :** ఈ శరీరమనే వృక్షమునకు అహమె విత్తనము. పరిపూర్ణమునకు ఏమియు సంబంధము లేదని చెప్పుచు ఎరుక అనగా ఏదో స్పష్టముగా చెప్పుచున్నారు.

**145వ పద్యము : యే వస్తువ చేతమ తా। నా విర్భవమొందు దేహమను తరువరయన్ । ఆ వస్తువె దానికి విత్తైవెలయును, దాన్నె సాక్షి ద్రష్టాని కను మీ ॥ యెరుక యిదె స్పష్టాము వినుమీ ॥ భావించి చూడు మీ బట్ట బయలమ భూమి। యావిత్తు చెట్టున్న దరయా దావిత్తునే ॥ ద్రష్టాని కనుమీ । యెరుక యిదే స్పష్టాము వినుమీ॥**

**టీక :** అరయన్ = విచారించగా, అరయదు = ఎరుగదు, వస్తువు = బ్రహ్మము. (ఇది లేని బ్రహ్మ అనగా ఎరుక)

**భావము :** శిష్యా! యే వస్తువు చేత (బ్రహ్మము) యిదేహమనే వృక్షము ఆవిర్భవించు చున్నదో, ఆ వస్తువే యిదేహమనే వృక్షమునకు విత్తనమై యున్నదని చక్కగా విచారించి తెలుసుకొనుము. ఆ వస్తువే సాక్షిద్రష్ట అనే పేర్లతో హృదయపద్మ మధ్యస్థమై (అవిద్యా ప్రతిబింబిత చైతన్యమై) యున్నది. అదే ఎరుక అని స్పష్టముగా గ్రహించుము. కనుక ఉదా ॥ విత్తనము వలన వృక్షము, వృక్షము వలన విత్తనము ఒకదానికొకటి కారణ కార్యరూపమైయున్నది. ఆ రెంటి సంగతి భూమికి ఎంతమాత్రము తెలియదు. కార్యకారణములు కాదు. అట్లే ఎరుక వలన అనగా అవిద్య యందలి ప్రతిబింబిత

కనుక ప్రతిబింబిత చైతన్యము విత్తనము వంటిది అని గుర్తించవలెను. భూమి వంటిది పరిపూర్ణ పరబ్రహ్మము. అవిద్య, దేహము ఎరుకలను ఎంతమాత్రము ఎరుగనిది పరిపూర్ణ పరబ్రహ్మమని తెలియవలెను. పరిపూర్ణము కారణ, కార్యములు కానిది.

**విశేష భావము :** యీ పద్యమును చక్కగా శాస్త్ర దృష్టితో విచారించవలెను. యీ దేహము (జగత్తు) అనే వృక్షమునకు మూలమేది? (విత్తనము ఏది?) అని విచారించినచో, ఏ వస్తువు నుండి ఉత్పత్తి జరుగుచున్నదో అదే యీ బ్రహ్మాండమనే అశ్వత్థ వృక్షమునకు మూలము, విత్తనము అని చెప్పవలెను. అదే మూల ప్రకృతి, అవ్యక్తము, మాయా శబళిత బిందుస్వరూపము. అఖండ గురు స్వరూపము. దీనినే సర్వసాక్షి, సర్వద్రష్ట అని కూడా చెప్పవచ్చును. ఇదే ఎరుక అని నిర్ణయము. అద్దము వలె ప్రతిబింబింప చేసుకొనే లక్షణము గల మాయ యందు పరిపూర్ణ పరబ్రహ్మము ప్రతిబింబించగా, దాని సత్తా చేత లేని మాయ ఉన్నదై, మాయ, నుండి సమస్త బ్రహ్మాండము ఆవిర్భవించుచున్నది. కనుక మాయా అశ్వత్థ వృక్షము, దానికి విత్తు (మూలము) అందలి ప్రతిబింబము, ఈ ప్రతిబింబము మాయ రెండు కారణ కార్యములు. మాయయే సమస్త సృష్టి స్థితి లయములు జరిపించుచున్ననూ అందలి ప్రతిబింబము కేవలము సాక్షి మాత్రమే అయియున్నది. కర్తృత్వ భోక్తృత్వములు లేని కారణముగా సాక్షి అన్నారు. ద్రష్ట అన్నారు. కనుక యీ బ్రహ్మాండ జగత్తు ఎరుకలకు పరిపూర్ణము ఎంత మాత్రము కారణముకాదు. విత్తు చెట్టు భూమి వలె గుర్తించవలెను.



**అవతారిక :** పరిపూర్ణ పరబ్రహ్మము సర్వత్ర నిండి యున్నదనియు, ఎరుక జగములు లేనివని చెప్పుచున్నారు.

**146వ పగ ము : యే పరిపూర్ణము మేనికి । లోపల వెలినిండి యుండు లోపము లేకన్ । ఆ పరిపూర్ణమె జగతికి । లోపల వెలినుండు, దానిలోనే వున్నవిరా । పై రెండివ్వి లేని వెన్నకురా । యీ పరిపూర్ణ బోధచె, పై ప్రపంచ శరీర । రూపము లెడ బాపు మీ పట్లనె, దాని ॥ లోనే వున్నవిరా । పై రెండెవ్వి లేని వెన్నకురా ॥**

**భావము :** శిష్యా! యే పరిపూర్ణము శరీరమునకు లోపల వెలుపల లోపము లేకుండగ (వెల్తి లేకుండగ) నిండియున్నదో ఆ పరిపూర్ణమె బ్రహ్మాండ జగత్తుకు లోపల వెలుపల కూడా నిండియున్నది. అనగా పరిపూర్ణము లేని చోటు కించిత్తు కూడా లేదని

భావము. అయితే పైన చెప్పిన బ్రహ్మాండ శరీర, జగత్తులు, ఎరుకతో సహా, పరిపూర్ణములోనే యున్ననూ, అవి లేక యున్నవని తెలియుము. ఎరుక జగములు లేనివి అనియు, పరిపూర్ణము ఒక్కటి మాత్రమే శాశ్వతమై యున్నదని తెలసి, శరీర-జగత్తు ఎరుకలను పూర్తిగా విడిచిపెట్టుము.



**అవతారిక :** యెరుక - మరుపులు రెండునూ ఎరుక రూపములే అని చెప్పుచున్నారు.

**147వ పద్యము : యెరుకనగా యెరిగేటిది । మరుపనగా యెరుక తనను మరచుట మీ, రెంట్నెరుగనిదె బయ లివినీ । వెరిగెరుకను మరవు నిప్పుడెరుక చెవి డరా॥ వీడితె పై మాటెరిగే దెవ్వడురా ॥ యెరుకె పరిపూర్ణ మంచెదిరించి వది రెవ్వా॥ పరిపూర్ణమైతె చూపర బయలందున, దాన్ని॥ యెరుక చెవిడరా॥ వీడితె పై మాటె రిగే దెవ్వడురా॥**

**భావము :** శిష్యా! యెరుక తన స్వరూపమును ఎరుగునది. మరుపు అనగా తన స్వరూపమును మరచి బద్ధుడనని భావించునది. యీ యెరుక మరుపులు రెండును, యెరుక యొక్క లక్షణములే. ఇట్టి యెరుక మరుపులు లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము అని తెలిసికొని, యెరుక మరుపులతో కూడిన యెరుకను యెరుకచేతనే విడచిపెట్టుము ఆలా విడచినచో ఆ పైది అయిన పరిపూర్ణమును యెరిగేది ఏమున్నది? కాని నీవు యెరుకే పరిపూర్ణమని (బ్రహ్మమని) సర్వత్రా వ్యాప్తమై యున్నదని, నే చెప్పిన మాటను ఎదిరించి మాట్లాడుచున్నావు. అయితే నీవు చెప్పినట్లు యెరుక ఉన్నదే అయినచో పరిపూర్ణ పరబ్రహ్మమయిన బయలులో దానిని చూపించుము. పరిపూర్ణములో యెరుక లేదు గదా ! కనుక పరిపూర్ణమైన బయలే సర్వత్ర ఉన్న బ్రహ్మము. యెరుక ఎక్కడనూ లేదు. ఇది చక్కగా విచారించి తెలుసుకొనుము.

**విశేష భావము :** యెరుకనగా యెరిగేది అనగా తనస్వరూపమును భ్రూమధ్య స్థానమునందు చూడగలిగినది. ఇదే సత్త్వగుణ ప్రతిబింబ చైతన్యము. ఇది యెరుక. మరుపనగా తనను మరిచేది. అనగా తన స్వప్రకాశ సాక్షి రూపమును ఎరుగక, అవిద్యయే తాను అని భావించి కర్మ బద్ధుడను, నేను ఈశ్వరుని ఆజ్ఞ ప్రకారము నడుచుకొనవలసిన వాడను అని భావించుట. ఇది రజస్తమ గుణ ప్రకాశ చైతన్యము. ఇది మరుపు, ఎరుక సత్వ గుణ ప్రధానమైనప్పుడు జ్ఞానరూపముగను, రజస్తమస్సులతో కూడినప్పుడు అజ్ఞానముగాను, ఎరుక వ్యవహారము. మరియు జ్ఞానస్వరూపము

ఈశ్వరుడు, అజ్ఞాన స్వరూపుడు జీవుడు. ఇట్లు జ్ఞాన అజ్ఞాన భేదములచే రెండు విభిన్న లక్షణములు కలిగినదైనను, జ్ఞాన అజ్ఞానములు రెండును ఎరుక యొక్క రూపములే. సత్వ ప్రధానుడు ఈశ్వరుడు. రజో ప్రధానుడు జీవుడు యీ రెండునూ లేనివే. యీ రెండును ప్రతిబింబిత చైతన్యములే. కనుక ఆభాసములే ఉన్నవి కానేరవు. కనుకనే ఎరుక పరిపూర్ణమును చూడబోవు సరికి ఎరుకలేకపోవుచున్నది. కనుక ఎరుక ఎంతమాత్రము బ్రహ్మము కాదు అని నిర్ణయము.

**అవతారిక :** మొట్టమొదటి నుండి ఉన్నది పరిపూర్ణమనియు, ఆతరువాత లేక తోచినది ఎరుక అనియు, ఇట్టి ఎరుకకు పరిపూర్ణము మూలము కాదనియు చెప్పుచున్నారు.

**148వ పద్యము : లేదన్నను కనుపడుగద । నే దెలసితివనిన, బైట నే నిల్వగదా । వే దీని వెనుక గద, నా । కేదో మూలంబు, యిదిగా దిక లే దెచ్చోటా ॥ కనుకనే వుళ్ళుక్కినే నన్మాటా ॥ యేదీ లేదిది తప్ప, నే దెలియనిది యని । తా దెలుసుకొని యెరుకె తనను వీడితె జాలు । యిక లే దెచ్చోటా । కనుకనె వుల్లక్కినే నన్మాటా ॥**

**దండాన్వయము :** నే తెలియనిది యిది తప్ప యేదీ లేదు అని తాదెలుసుకొని యెరుకే తనను వీడితె చాలు, యిక ఎచ్చోటా లేదు ॥

**టీక :** నే నన్మాటా = నేను అనే ఎరుక.

**భావము :** శిష్యా! పరిపూర్ణమనేది ఏదియు లేదు అని అనెదవా - విచారించినచో ఉన్నట్లు తెలియబడుచున్నది కదా ! అయితే పరిపూర్ణము ఉన్నట్లు తెలిసినది అని అనెదవా - నీవు తెలుసుకన్నది పరిపూర్ణము కాదు. ఎందుచేతననగా ఎరుక పరిపూర్ణమును ఎరుగలేదు. ఎరుగబోతే తానే లేకపోవును కదా. కనుక పరిపూర్ణమును తెలుసుకొన్నాను అని ఎరుక చెప్పలేదు. మొదటి నుండి ఉన్నది పరిపూర్ణము మాత్రమే. ఆ తరువాత నేను అనే ఎరుక లేకతోచినది. ఇట్టి నేను అనే యెరుకకు పరిపూర్ణము మూలము కాదు. మరి ఇంకేదైనా ఉన్నదా అని విచారించినచో, మరింకేదియు లేదు యీ సత్యమును యెరుక గురు ముఖతా తెలుసుకొని, తాను లేనని గుర్తించి తనను తానే లేకపోయినచో యీ నేననే ఎరుక ఎక్కడా లేకపోవును.

**విశేష భావము :** పరిపూర్ణము సనాతనము. ఆదిలేనిది. సర్వత్ర స్వతఃసిద్ధమైయున్నది. యెరుక పరిపూర్ణములో తరువాత లేకతోచినది. కనుక యెరుకకు పరిపూర్ణము మూలము కాదు. ఎందుచేతననగా పరిపూర్ణములో యెరుక లేదు కనుక. ఎరుక పరిపూర్ణములో ఉన్నచో పరిపూర్ణము ఎరుకచే గుర్తింపబడును. కాని పరిపూర్ణము ఎరుకచే గుర్తింపబడేది కాదు. కనుక ఎరుక పరిపూర్ణములో లేదని నిర్ణయము కనుకనే ఎరుకకు పరిపూర్ణము మూలము కాదు. మరి ఇంకేదైనా మూలమా? అని ప్రశ్నించినచో పరిపూర్ణము తప్ప మరొకటి ఏమి ఉన్నది. కనుక ఎరుకకు మూలము ఏమియు లేదు. అమూలము (మూలములేనిది) మూలములేనిది అంటేనే కలవంటిది అని దృష్టాంతము.

పరిపూర్ణము సర్వత్రా నిండియున్నది. పరిపూర్ణములో యెరుక లేదు అన్నప్పుడు ఎరుక మరొకచోట అంటే పరిపూర్ణము లేనిచోట ఉన్నదా? పరిపూర్ణము లేనిచోటు లేదు కనుక ఎరుక ఎచ్చటనూ ఏకాలమందునా లేదు అని నిర్ణయము.

యీ విధముగా ఎరుక పరిపూర్ణములను విచారించి తెలుసుకొని లేని యెరుకను విడచినచో నేను అనే ఎరుకే లేకుండును.



**149వ పద్యము : సత్యమగు బట్టబయలు, న । సత్యంబగు యెరుక నెరిగి సద్గురు కృపచే । సత్యము గాదని యెరుకను । సత్యముగా నమ్మి ఉంటే చాలు చాలన్నా॥ వానితోటి సాటెవ్వరన్నా ॥ నిత్యా నిత్యములనె నిర్ణయమెరుగక ॥ నిత్యుడై యుండేటి నిజబోధ గలిగితె ॥ చాలు చాలన్నా । వానితోటి సాటెవ్వరన్నా ॥**

**దండాన్వయము :** సత్యమగు బట్టబయలును, అసత్యంబగు యెరుకను సద్గురు కృపచే నెరిగి, యెరుకను సత్యము కాదని సత్యముగా నమ్మి వుంటే చాలు చాలన్నా॥

**టీక :** సత్యము అగు - సత్యమగు = శాశ్వతము అయినది, అసత్యము అగు = అసత్యంబగు = శాశ్వతము కానిది అయిన, సత్యము కాదని ఎరుకను = ఎరుక అబద్ధమైనది (అనగా లేనిది అని) సత్యముగా నమ్మి = ధృడముగా నమ్మి, నిర్ణయము = ఏర్పాటు, సాటి = ఈడు (పోలిక), నిజబోధ = పరిపూర్ణబోధ, నిత్యుడై యుండేటి = జనన మరణములనే మార్పులు లేకుండా.

**భావము :** శిష్యా! శాశ్వతమైనది పరిపూర్ణమని, శాశ్వతము కానిది యెరుక అని యీ రెంటి విషయములు ధృడముగా గురు కరుణచే తెలుసుకొని యెరుక లేనిదని ధృడముగా నమ్మి ఉంటే చాలును. అట్టివానికి సాటి ఎవ్వరు ఉండరు. మరియు నిత్యము అయినది పరిపూర్ణమని, అనిత్యమైనది ఎరుక అనే నిర్ణయములు లేకుండా, జనన మరణములు అనే మార్పులు లేకుండా జేసే పరిపూర్ణ బోధ తెలిసినచో చాలును. అట్టి వానితో సాటెవ్వరూ ఉండరు.

**విశేష భావము :** యెరుక పరిపూర్ణముల నిజస్థితిని సద్గురు కృపచే ఎరిగి, ఎరుకలేదని ధృడముగా నమ్మి ఉంటే చాలును. ఇది లేని స్థితికి జేరుటకు మొదటి మెట్టు. ఇంతమాత్రము సరిపోదు. నిత్యమైనది పరిపూర్ణమని, అనిత్యమైనది ఎరుక అని ఇట్టి నిర్ణయములేకుండా, లేని స్థితి కలిగియుండవలెను, అనగా లేనిది ఎరుకని ధృడముగా ఎరిగిన వెనుక ఆ లేని ఎరుకను లేకుండా జేసికొనినప్పుడు మాత్రమే ఏ నిర్ణయములు లేకుండను, ఎరుక ఉన్నంత వరకు నిర్ణయములు జరుగుచునే యుండును. కనుక ఏ నిర్ణయము లేకుండా ఉండవలెనంటే, నిర్ణయము నెరిగే ఎరుక లేకుండా చేసుకొనవలెను. అదే నిత్యుడై యుండే స్థితి. అనగా జనన మరణములనే మార్పులు లేకుండా ఉండే స్థితి అని భావము.



**అవతారిక :** ఎరుక అయిన కల నుండి మేల్కొనుట యెట్లో వివరించుచున్నారు ఈ పద్యములో....

**150వ పద్యము : పరిపూర్ణములో దోచిన । యెరుకే కల, లేని యెరుక నెరిగి మృషని, యీ । మరుగెరుక కెరుక, దెల్పిన । యెరుగుట మే మేల్కసుమ్మి, యిది యేమరకు మీ ॥సద్గురు వాజ్ఞకెదిరి మీరకు మీ ॥ యెరుక యీ రీతి యెగిరి పోయిన వెనుక । పరిపూర్ణమొకటుండు, పలుక రాదెట్లందు ॥ విది యేమరకు మీ । సద్గురు వాజ్ఞకెదిరి మీరకు మీ ॥**

**దండాన్వయము :** పరిపూర్ణములో దోచిన యెరుకే లేని యెరుక, కల, మృష అని ఎరిగి, యీ మరుగు యెరుకకు సద్గురువు దెల్పిన యెరుక యెరుగుటమే మేల్క సుమ్మి, యిది యేమరకుము । యీ ఆజ్ఞకు ఎదిరి మీరకు మీ । యెరుక యీ రీతి।

ఎగిరపోయిన వెనుక, పరిపూర్ణమొకటి ఉండు (అని) పలుకురాదు, ఎట్లందు? యిది యామరకు మీ ॥

**టీక :** మృష = లేనిది, మరుగు = రహ్యాము, యే మరకు మీ = ప్రమాద పడకుసుమీ ఆజ్ఞ = ఇట్లు చేయుమని ధృడమైన ఉత్తరువు.

**భావము :** శిష్యా! పరిపూర్ణములో లేక తోచిన యెరుకయే లేని ఎరుక, కలవంటిది లేనిది, అని యీ రహస్యము సద్గురుమూర్తి యెరుక అయిన నీకు (అవిద్యకు) తెలియపర్చినపుడు ఆ విధముగా నీవు తెలుసుకొని (నేను) లేనని లేకపోవడమే నేనైన కలకు మేల్కొ. ఈ విషయములో ఏమరుపాటు పనికిరాదు.

నాయీ గురువాజ్ఞను మీరకు సుమా! యీ విధముగా యెరుక లేక పోయిన తరువాత పరిపూర్ణము ఒక్కటి మాత్రమే ఉండును. అలా పరిపూర్ణము మాత్రము ఉండుననుటకు వీలు లేదు. నేను లేకపోయిన వెనుక ఎట్లందును. ఈ విషయములో ఏమరుపాటు పనికిరాదు.

**విశేష భావము :** పరిపూర్ణములో లేనిదే తోచిన యెరుక కలవలె లేనిదె అసత్యము కల, మేల్కొ వచ్చు సరికి లేకపోయినట్లుగా పరిపూర్ణము సత్యమైనది. అందుతోచిన యెరుక లేనే లేదు, దానిని విడిచిపెట్టుము అని సద్గురుమూర్తి తెలియపర్చిన వెంటనే, శిష్యుడు ఆ విషయమై చక్కగా గ్రహించి యెరుకను విడుచుటయే శిష్యునికి మేల్కొ అగును. అనగా ఎరుక, ఎరుకచే ఏర్పడిన సమస్తము లేకపోవును. అట్టి స్థితి ఏర్పడిన తరువాత శాశ్వతమైన పరిపూర్ణము ఉన్నది, ఎరుక లేదు అనుటకు ఎరుక ఎక్కడ ఉన్నది? ఎరుక ఉన్నప్పుడే నిర్ణయములు, యెరుకపోయిన వెనుక ఏ నిర్ణయములు చేయలేరు. ఇందులో ఏమరుపాటు పొంది, నిర్ణయములు చేస్తూ నాకు ఎరుక పోయినది అని భ్రమించరాదు.



**అవతారిక :** పరిపూర్ణములో లేనిదే తోచిన యెరుకకు పరిపూర్ణమున్నదని ఎరుగదు. అలా పరిపూర్ణమున్నదని యెరుగబోవుసరికి ఎరుకే లేకపోవును అని చెప్పుచున్నారు.

**151వ పద్యము : తిప్పలగు రాకపోకల । నెప్పుడు తానెరుగ నట్టి యీ బయలందున్ । తప్పక తనకై తానే । తప్పున గనవచ్చి యెరుక తాగానరాదు ॥ బయలున్నాది తన కెరుక లేదు ॥ యెప్పుడు బయలున్నా దెరిగి తాలేనట్టి । చొప్పు సద్గురు బోధ చొప్పున దెలసీతె ॥ తాగానరాదు । బయలున్నది తన కెరుక లేదూ॥**

**దండాన్వయము :** తిప్పలగు రాకపోకలను తాను ఎప్పుడూ యెరుగునట్టి యీ బయలందున్, యెరుక తనకై తానే తప్పున గనవచ్చి, తప్పక తాగానరాదు । బయలున్నది (అని) తన కెరుక లేదు । సద్గురు బోధ చొప్పున యెప్పుడు బయలున్నాదెరిగి, తాలేనట్టి చొప్పు దెలసీతె, తాగానరాదు ॥

**టీక :** రాకపోకలు = జనన మరణములు, తిప్పలగు = బాధలగు, తప్పున = చటుక్కున, చొప్పు = విధము.

**భావము :** శిష్యా! జనన మరణములనే త్రిప్పలు యెంతమాత్రము లేని పరిపూర్ణ పరబ్రహ్మమునందు, యెరుక తనకు తానే చటుకున్న వచ్చి, తప్పక తిరిగి లేకుండాపోవును. ఇట్టి యెరుకకు పరిపూర్ణ బ్రహ్మము ఉన్నదని తెలియదు. ఇట్టి యెరుక పరిపూర్ణము శాశ్వతమై ఉన్నదని, తాను లేనని సద్గురు బోధచే యెప్పుడు తెలుసుకొనునో, తాను లేకపోయే విధమును గురుముఖతా తెలుసుకొనిన వెంటనే యెరుక లేకపోవును.



**అవతారిక :** రెంటి మిశ్రమమే మాయ (ఎరుక) అని ఈ 152, 155వ పద్యములోను చెప్పుచున్నారు.

**152వ పద్యము : అన్నము శుక్లంబగు, రస । ము న్నతిగా రక్తమగును, నొకచో రెండున్ । పన్నుగ గలసిన మేనని । యెన్నబడున్ యెరుక గల్గి, యిదె మాయ సుమ్మీ॥ మూలము లేనిదిదె నీవు నమ్మీ ॥ యున్నావు, పరిపూర్ణమున్నది గని, లేని॥ దెన్నడు లేదని యెరిగితె, చాలు ॥ గుర్తదె, మాయ సుమ్మీ । మూలము లేనిదిదె నీవు నమ్మీ ॥**

**దండాన్వయము :** అన్నము శుక్లంబగు, రసము రక్తమగును, నొకచో రెండున్ గలసి, పన్నుగ యెరుక గల్గి ఉన్నతిగా మేనని యెన్నబడున్। మూలము లేనిది యిదె

మాయసుమ్మీ । యిదె నీవు నమ్మీయున్నావు । ఉన్నది పరిపూర్ణము (అని) గని, లేనిది అదె గుర్తు, మాయ ఎన్నడూ లేదని యెరిగితె చాలు సుమ్మీ ॥

**టీక :** శుక్లము = వీర్యము, రసము = జలము, ఉన్నతిగ = పొడవుగా, పన్నుగ=స్థిరపడి.

**భావము :** శిష్యా! భుజించిన అన్నము వలన శుక్లము తయారగును. జలము వలన రక్తము అగును. ఇందుండి శ్రోణితము తయారగును. ఈ రెండు ఒకచోట (గర్భమందు) కలసి స్థిరపడి, అందు ఎరుక (జీవాత్మ చేరికచే) పొడవైన శరీరమని పిలువబడును. (దీర్ఘ శరీరి) యిది మాయయే కదా. యిట్టి యెరుకకు మూలము ఏమియు లేదు. దీనినే గుర్తు, మాయ అని చెప్పబడుచున్నది. దీనినే నీవు నమ్మియున్నావు. కాని శిష్యా! పరిపూర్ణ పరబ్రహ్మమే శాశ్వతముగా ఉన్నదని, మాయ అయిన యీ యెరుక ఏ కాలమునందు లేదని తెలిసి, యెరుకను విడచిపెట్టుము.



**అవతారిక :** తత్త్వసమూహముచే యెరుక యేర్పడును. తత్త్వములు విడిపోతే యెరుక లేదు, అని 153, 154 పద్యములు చెప్పుచున్నారు.

**153వ పద్యము : కనక మన భూషణంబులు । యినుమ మన శస్త్రాదికంబులిత్తడియనన్। కనుగొన పాత్రలు గనపడు । తను వన నవయవములన్ని తగదొంతియనన్ ॥ కుండలు, భూత తతి జగత్తని నా ॥ వినుమిట్ల యెరుకన్న వివరించ తత్త్వాలు । మన సందు గట్టిగ మరువాకు మీ మాట ॥ తగ దొంతి యనిన । కుండలు, భూత తతి జగత్తని నా॥**

**టీక :** కనకము = బంగారము, శస్త్రాదికము = ఆయుధము వగైరా, దొంతి = దొంతర (నిలువు వరుస) భూత తతి = పంచభూత సమూహము.

**భావము :** శిష్యా! విచారించగా, బంగారమనగా ఆభరణములు. యినుమనగా ఆయుధములు వగైరా. ఇత్తడి యనగా వివిధ పాత్రలు, శరీరమనగా అవయవ సమూహము. దొంతియనగా కుండలు అనియు జగత్తు అనగా పంచభూత సమూహము కనుపడును. అట్లే యెరుకనగా, ఇరుపది అయిదు తత్త్వములు కలయికే అని తెలియుము. ఈ మాట, మనసు నందు మరువకుము.



**154వ పద్యము : పొరలరటి దుంప యనినను । తరువులు వనమనిన, రవలు ధారుణియనన్ । గిరియన రాళ్ళు బట్టలు । ధరముల్లెయనిన, తత్త్వ తతి యెరుకంచనినా॥ లేనిదె యెరుక స్థితి లెస్స కనినా ॥ యెరుక జేసిన విశ్వమెరుక వంటిదె, బయలు । నెరుక గుర్తెరిగి తావేగితే సరి ॥ తత్త్వతతి యెరుకంచనినా । యెరుక స్థితి లెస్స కనినా ॥**

**టీక :** రవలు = మట్టిరేణువులు, ముల్లె = మూట, లెస్సకనినా = బాగుగా విచారించినచో

**భావము :** శిష్యా! అరటి దుంప (చెట్టు) అనిన, అరటి పొరల సమూహమే. వనమనగా చెట్ల సమూహమే. భూమి అనగా మట్టి రేణువుల సమూహమే. కొండయనిన - రాళ్ల సమూహమే. ముల్లె (మూట) బట్టలు (మూట), యెరుకనగా తత్త్వసమూహము. అట్లనే చక్కగా యెరుకను విచారించగా, దానికి ఉనికి లేనేలేదు. యెరుకచే యేర్పడిన జగత్తు కూడా యెరుకవలె లేనిదే అని తెలియుము. పరిపూర్ణ పరబ్రహ్మమును ఎరుక గురుముఖతా తెలుసుకొని తాను లేనని లేకపోయినచో సరి ("నస పునరావర్తతే")

**విశేష భావము :** "యెరుక జేసిన విశ్వము యెరుక వంటిదే" అనగా యెరుక వలన యేర్పడిన జగత్తు, యెరుక వలె లేనిదే అని అర్థము. "యెరుక జేసిన విశ్వము" అనగా తెలియబడిన జగదధిష్ఠానమైన అఖండ గురు స్వరూపము (మూల ప్రకృతి) కూడా, యెరుక వలెనే లేనిది, అనగా పరిపూర్ణ పరబ్రహ్మములో లేనిదే కదా అని ఒక అర్థము.

---

**అవతారిక :** మాయ అనేక మార్పులు గలది. పరిపూర్ణము నిర్వికారము అని 155, 156 పద్యములలో చెప్పుచున్నారు.

**155వ పద్యము : పెను మాయను జూడుము యిదె । జనుకుని జఠరంబు వలన జననీ గర్భం । బున జొచ్చి, మారు రూపున । జనియించును నవయవములు, జనితమై భువినీ ॥ విను కనుమూర్కొను వచ్చును చనీ ॥ దిన దివమభివృద్ధ్యా దీనిచె బయలును । గని, మాయల మల్లికథ మాయించుము, పో నీ ॥ జనితా మైభువినీ । వినుకను తిను మూర్కొను చనీ ॥**

**భావము :** శిష్యా! పెద్ద మాయను చెప్పుచున్నాను వినుము. తండ్రి తినిన ఆహారము వలన తయారైన వీర్యధాతువు, తల్లి గర్భమందు చేరి వాటి రూపము పూర్తిగా మారి పిండరూపముగా దేహాకారమునొంది) బయటికి వచ్చుచున్నది. అట్టి పిండము దిన దినము అభివృద్ధి చెంది, సమస్తమును వినుట, చూచుట, వాసన చూచుట, తినుట చేయుచు రాకపోకలు (జనన మరణములు) కలిగి యుండును. ఇంత కన్నా వేరే మాయ యేమైనా ఉన్నదా? ఇట్టి దేహము చేత (దేహితో కూడిన దేహము అని భావము) పరిపూర్ణ పరబ్రహ్మమును జూచి, ఆ మాయలాడి అయిన యెరుక యొక్క కథ నశింపజేయుము, అనగా యెరుక లేకుండా జేసికొనుము, అని భావము.

**విశేష భావము :** ఈ పద్యములో స్థిరమైన రూపములేకుండగ అనేక విధములుగా మార్పు చెందునది "మాయ" అని చెప్పిరి. అట్టి మార్పు ఎంత మాత్రము లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే. ఆ పరిపూర్ణమున ఎరుక చూచినచో, ఎరుక పూర్తిగా లేకపోవును. ఈ పద్యము శ్రీ విద్యారణ్యస్వామి రచించిన "వేదాంత పంచదశి" అను గ్రంథములోని చిత్ర దీప ప్రకరణములో 147వ శ్లోకమునకు సరియైన తర్జుమాగా గ్రహించవలెను.

శ్లో॥ ఏ తస్మాత్కిమి లేన్ద్రజాల మపరం యద్గర్భవాసస్థితం ।
రేత శ్చేతతి హస్తమస్తక పద ప్రోద్భూత నానాంకురమ్ ।
పర్యాయేణ శిశుత్వ యౌవ్వన జరావేషై రనే కైర్వృతం ।
పశ్యత్తతి, శృణోతి, జిఘ్రతి తథా గచ్ఛ త్యధా గచ్ఛతి ॥

శ్లోక భావము : గర్భవాసంలో ఉంచబడిన వీర్యము, చేతనత్వమును పొంది, చేతులు, తల కాళ్ళు, వ్రేళ్లుగా తయారవడం, అట్లాగే కండ్లు, చెవులు వగైరా పుట్టడం, అదే క్రమంగా పెరుగుచు బాల్య యవ్వన వార్ధక్యాది దశలను పొందటం, చూడటం, తినడం, వినడం, వాసన చూడటం అట్లాగే రావడం, పోవడం తిరిగి మళ్లీ మళ్లీ రావడం, ఇదంతా ఆశ్చర్యం కదూ! దీనికి మించిన యింద్రజాలము (మాయ) ఇంకేముంటుంది ?

దీనిని బట్టి శ్రీ కృష్ణ దేశికేంద్రులు సనాతన గ్రంథములు అధ్యయనం చేసి అర్థం చేసుకొని కందార్థములు వ్రాసినట్లు, సనాతన గ్రంథస్థ విషయ మర్మమును అవగాహన చేసికొని ఆమోదించినట్లుగానే అర్థమగుచున్నది. కావున శాస్త్రజ్ఞానలోపముచే మూర్ఖముగా విమర్శించుట సరికాదని గ్రహించనగును.

**156వ పద్యము :** **పెట్టెయ లోపలి గారడి । చెట్టుపయిన్ గానవచ్చి చెట్టున చూడన్ । గట్టు పయి దోచునిది కని । కట్టుసుమి దీని వలెనె కనుపించు నెరుకా ॥ అంతలో యెచట గనుపించదెరుకా ॥ దిట్టమౌ బోధచే పట్టి, యెరుకను । తిరిగి పుట్టకుండగ దాని పుట్టి ముంచుము, లెందే ॥ కనుపించు నెరుక । అంతలో యెచట కనుపించదెరుకా॥**

**టీక :** చేపట్టి = గ్రహించి, పుట్టి = ఉన్న స్థలము (ఆశ్రయము)

**భావము :** శిష్యా! గారడి వాడు ఒక పెట్టెలో కుర్రవానిని ఉంచి, చెట్టు పై కనిపింపజేయును; అంతలోనే ఆ కుర్రవాడు చెరువు గట్టు నుండి వచ్చుచున్నట్లు కనుపించును. ఇదంతయు కనికట్టు సుమీ । అనగా లేనిదే ఉన్నట్లు కనిపించే ఇంద్రజాల విద్య. యెరుక కూడా ఇట్టిదే. ఒకచో కనిపించి మరొకచోట లేకుండాపోవును. కనుక యెరుక ఇంద్రజాల విద్య వంటిది. అందుచే శిష్యా ధృడమైన పరిపూర్ణ బోధ గ్రహించి యెరుక ఉన్న స్థలమును (పుట్టి) నశంపజేయుము.

పుట్టియనగా వెదురు పేడులతో తయారైనది. నీటిలో మునగకుండా ప్రయాణించేందుకు ఉపకరించే పెద్ద బుట్టవంటి సాధనమునకు పుట్టి అని పేరు. ఎరుక అహం (అవిద్య) నందు ప్రతిఫలించిన ప్రతిబింబము కనుక ఎరుకకు ఆశ్రయమైనది అవిద్య. ఈ అవిద్య నశించినచో ప్రతిబింబమునకు తావులేదు. కనుక "పుట్టి ముంచుము" అనగా అవిద్యను నశింపజేయుము. ఇదే ఎరుకను లేకుండగ జేసే పద్ధతి.

---

**అవతారిక :** పరిపూర్ణములో లేనిదే ఏర్పడిన కలవంటి యెరుకయే మేను - జగములుగా పరిణమించినదని చెప్పిన శాస్త్రజ్ఞుల మాటలు అంగీకారయోగ్యములే అనియు, శాస్త్రములో ఉన్న గజిబిజి చేత అసలైన బ్రహ్మతత్త్వమును సాధకులు గుర్తించలేకపోవుచున్నారనియు, అందుచే శాశ్వత బ్రహ్మమును గజిబిజిలేకుండగా ఈ కందార్థముల గ్రంథము వ్రాయడమైనదని శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు ఈ పద్యములో సెలవిచ్చియున్నారు.

**157వ పద్యము : నేననని బ్రహ్మలోపల । లేనిదె సంభవము నొంది లీల తనకుదా మేను జగములై వెలసెను । నేనది మృగ జలమురీతి నిజము కాదనుచూ ॥ లోకుల నేటి గజిబిజి వినుచూ ॥ మానసమున వారి మాట కామోదించి । దానికీ బోధ తగు నంచు వినజేస్తి ॥ నిజము గాదనుచు । లోకులనేటి గజిబిజి వినూచూ ॥**

**దండాన్వయము :** నేనని బ్రహ్మలోపల లేనిదె లీల తనకు తా సంభవము నొంది, మృగజలము రీతి మేను జగములై వెలశెను నిజము కాదు అనుచు । లోకులు అనేటి గజిబిజి వినుచు నేను అది మానసమున వారి మాటకు ఆమోదించి దానికి ఈ బోధకు తగునంచు వినజేస్తి ॥

**టీక :** లీల = క్రియ (అనగా కర్మ కారణమయిన ఎరుక అని భావము) మృగజలము= ఎండమావులు, లోకులనేటి = శాస్త్రజ్ఞులు చెప్పేటి.

**భావము :** శిష్యా! "నేను" అనని బ్రహ్మయందు - అనగా పరిపూర్ణ బ్రహ్మయందు లేనిదె ఎరుక ఏర్పడి, తనకు తానె పిండ బ్రహ్మాండములై వెలసెను. అది మృగజలమురీతిగా నిజము కాదని, చెప్పేటి శాస్త్రజ్ఞుల గజిబిజి మాటలు విని, నేను వారు చెప్పిన ఆ విషయమును మనస్సులో ఆమోదంచి అనగా నేనని బ్రహ్మలోపల లేని యెరుక యేర్పడుటను అదే సృష్టి కారణమని చెప్పిన మాటను ఆమోదించి దానికి ఈ బోధ సరిపోతుంది అని గజిబిజి లేకుండా ఈ గ్రంథ రూపముగా నీకు తెలియజేయుచున్నాను, అని భావము.

**విశేష భావము :** నేననని బ్రహ్మ అనగా పరిపూర్ణము, ఈ పద ప్రయోగమును బట్టి నేనని బ్రహ్మయొకటి, నేననని బ్రహ్మమొకటి అని తెలియబడుచున్నది. నేననే బ్రహ్మ - యెరుక, పరిపూర్ణ బ్రహ్మము యొక్క ప్రతిబింబమే ఎరుక. బింబము యొక్క పేరే ప్రతిబింబమునకు కూడా వ్యవహరింతురు. బింబము బ్రహ్మము కనుక ప్రతిబింబమునకు కూడా బ్రహ్మమని పేరు. బింబము పరిపూర్ణము ఉపాధి రహితమైనది. కనుక "నేను" అనని బ్రహ్మము. ప్రతిబింబము అవిద్యోపాధి కలిగినది. కనక ఇది నేను అనే బ్రహ్మము. కనుక ఇది కారణ కార్యత్వములతో కూడినది.

పరిపూర్ణము సనాతనమనియు, అందులో లేని మాయ ఒకటి తనకు తానే ఏర్పడి (మూలప్రకృతి) సమస్త జగత్తును సృష్టించుచున్నట్లుగా అన్ని ఉపనిషత్తులు

ఘోషించుచున్నవి. కాని పరిపూర్ణమును మాయను కూడా బ్రహ్మ, ఆత్మ అనే శబ్దములతో వ్యవహరించుటచే, ఏది శాశ్వతమైన బ్రహ్మమో, ఏది మాయా శబళిత బ్రహ్మమో వస్తు నిర్ణయము దొరుకుట లేదు. అట్టి గజిబిజి లేకుండుటకై శ్రీ శివరామదీక్షితులవారు శాశ్వత బ్రహ్మమునకు పరిపూర్ణమనియు, మాయా బ్రహ్మకు ఎరుక అని విడదీసి వేరు నామములతో వ్యవహరించుటచే, యీ పరంపరలో బ్రహ్మము యొక్క వస్తు నిర్ణయయము జరిగినది. అందుచేతనే యీ పద్యములో "మానసమున వారి మాటకామోదించి, దానికి యీ బోధ సరి" అని చెప్పిరి. కనుక శాస్త్రములో చెప్పిన బ్రహ్మము (నిర్వికార బ్రహ్మము) ఇందులో చెప్పిన పరిపూర్ణము ఒక్కటే. అని సాధకులు గ్రహించెదరు గాక. ఇందుకు పైంగలోపనిషత్తు ప్రమాణము. యాజ్ఞ వల్క్యమహర్షి తన శిష్యుడైన పైంగలునకు చెప్పినది "సదేవ సౌమ్యే ఇద మగ్రమాసీత్" కాని శాస్త్రమును విశేష జ్ఞానబుద్ధి చేతనే విమర్శించవలెను.

**158వ పద్యము: కలవెడ బాసిన మనజులు । కలలోపలి పనులు చేయకలవారనినా। కలవారు గారు వారల । వలె, యెరుకను గురువి చేత వదలెరుకలోనా ॥ గల పనిచేయ వలెదెరుకలోనా ॥ కలవారంచని నోట పలుకుట మరయక । పలికినా వారికి తొలగదు పాపము ॥ కలవారనినా । గల పనిచేయ వలదెరుకలోనా ॥**

**టీక** : కలనెడబాసిన = ఎరుకను విడచిన, కలలో పని పనులు చేయ = ఎరుకలో పనులే చేయుచున్ననూ; కలవారనినా = ఎరుకలో వారే అనినా, కలలో వారు కారు = ఎరుకలో వారు కారు, అరయక = విచారణ లేకపోవుట.

**భావము** : శిష్యా ! ఎరుకను విడచిన వారు, ఎరుకలో పనులే చేయుచున్ననూ, వారు ఎరుకలో వారు కారు, గురుమూర్తి కరుణచే ఎరుకను వదలిన వారు, ఎరుకలో పనులు చేయతగదు అని చెప్పేవారు విచారణ లేక ఆ విధముగా అంటుంటారు. అట్టి వార్కి పాపము తొలగదు. అనగా కర్మ రహితులు కాలేరు.

**విశేష భావము** : కలలో పనులకు మేల్కలో పనులకు చాలా వ్యత్యాసము ఉండును. కలలో ఒక భవనము కట్టినట్లు కనబడును. మేల్కలో ఒక భవనము కట్టినచో - మేల్కలో భవనము శాశ్వతము. కలలో భవనము అశాశ్వతము. కలలో పనులు, మేల్కలలో పనులు ఒకే రకమైనను, రెంటికి చాలా వ్యత్యాసముకలదు. అట్లే గురు

కరుణచే ఎరుకను (కల) వదలి, ఎరుకలో పనులే అనగా ఆహార విహారాదులు చేయుచున్ననూ, వారు లేకచేయుచున్న కారణంగా వారు కలలో వారు కారు. అనగా చేసిన కర్మలు అంటవు కర్మరహితులు. ఎరుకలో ఉన్న వారి పనులే, ఎరుకను విడచిన వారు చేయుచున్నను వీరికి ఎరుక పనులు (కర్మలు) అంటవు. కనుక ఎరుకలో వారు, ఎరుకను విడచిన వారు ఒకే రకమైన పనులు చేయుచున్నను, చాల బేధము ఉన్నది అని ఈ పద్య భావము.

**అవతారిక :** యెరుక జ్ఞాన + కర్మల రెంటి సమన్వయ స్వరూపమనియు, రెండు విడదీయ రాని భిన్న పదార్థముల కలయిక అని చెప్పుచున్నారు.

**159వ పద్యము : గుడమే మధురము మధురమె । గుడమా గుడ మధురములలో గొనకొని తొలుతన్ । బొడమిన దేదన సరిగా । బొడమిందొక టేగ రెండు పోయినట్టె కదరా । తమ వెరుక లిట్టెనట్టె గదరా ॥ పొడజూచి బయలు నిప్పుడె మేనెరుకల జోలి। విడరా లేనివె రెండు పెడచొపెట్టక విను ॥ పోయినట్టె కదరా । తమ వెరుక లిట్టెనట్టె కదరా ॥**

**టీక :** గుడము = బెల్లము, గొనకొని = ప్రయత్నించి, తొలుతన్ = మొట్టమొదటగా, బొడమినదేది = పుట్టినది ఏది? పెడచొపెట్టక = విపరీతముగ వినిపించుకొనక, బొడమినది + ఒకటి + ఏగ =బొడమిందొకటేగ = పుట్టినది ఒకటి పోయినచో, జోలి=సంబంధము.

**భావము :** శిష్యా! బెల్లమే తీప, తీపయే బెల్లము. ఈ బెల్లము తీప అను రెండు పదార్థములలో, మొట్టమొదటగా పుట్టినదేది అని విచారించగా, ఆరెంటిలో ఏ ఒక్కటి పోయిననూ రెండూ పోయినట్లె కదా ! రెండు విడదీసి చూపగలిగినదికాదు. ఇదే విధముగా శరీరము - ఎరుక యీ రెంటి విధము కూడనగును. శరీరమనగా స్థూల శరీరము కాదు. అవిద్య అనే కారణ శరీరము. ఎరుక అనగా అవిద్యయందలి ప్రతిబింబ చైతన్యము. ప్రతిబింబిత చైతన్యము ఆధేయము అవిద్య ఆధారము. యీ రెంటి సమన్వయము ఎరుక. యీ రెంటిలో ఏ ఒక్కటి పోయిననూ రెండూ పోవును. యీ శరీర జ్ఞానముల చేతనే పరిపూర్ణ పరబ్రహ్మమును జూచి, మేనెరుకల సమన్వయమైన ఎరుక జోలి విడచిపెట్టుము. నే చెప్పిన విషయమును విపరీతముగా

వినక సరిగా అర్థము చేసికొనుము. మేనెరుకలు రెండూ లేనివే అని తెలియుము.

**విశేష భావము :** ఎరుక రెంటి సమన్వయము. అవిద్య లేక మాయ, అందలి ప్రతిబింబ చైతన్యము. అవిద్య సమస్త క్రియా స్వరూపము. ప్రతిబింబము - సత్తామాత్రమైనది. కర్తృత్వ క్రియాత్వము లేనిది. యీ రెండు భిన్న ధర్మములులు కలది. కాని యీ రెంటిలో దేనిని విడదీయలేము. ప్రతిబింబము - సత్తా మాత్రమే, జ్ఞాన స్వరూపము. అవిద్య - కర్మ స్వరూపము, సమస్తమైన కర్మలు జేయునది, ఇట్టి కర్మ స్వరూపమైన అవిద్య యున్ను, జ్ఞాన స్వరూపమైన ప్రతిబింబమున్ను యీ రెంటి కలయికే ఎరుక - ఇదే మాయాశబళిత బ్రహ్మము. పరిపూర్ణములో మాయ, కాని జ్ఞానము కాని ఏమియు లేదు. కేవల బ్రహ్మము పరిపూర్ణము. ఇట్టి పరిపూర్ణమును గురుముఖతా ఎరిగి ఎరుకను కర్మ స్వరూపము అయిన అవిద్యను నశింపజేసికొనినచో, ఉపాధి లేని కారణముగా అందలి ప్రతిబింబము కూడా లేకపోవును. అనగా రెంటిలో ఏ ఒక్కటి పోయిననూ రెండు పోవును. ఇదే ఎరుక రహిత పద్ధతి. ఇట్టి ఎరుకను రహితపర్చుటకు గరుకరుణచే మాత్రమే సాధ్యమగును. కనుక ఈ పద్యములో "పెడచెవిపెట్టక వినుము" అని హెచ్చరించిరి.

---

**160వ పద్యము : ఇది వున్నది యిది వున్నది! యిది వున్నది యనుచు బయలు నెరిగి, యెరుకచే । యిది లేనిది, యిది లేనిది । యిది లేనిది యనుచు నెరుక నెరిగితే సరిరా॥ ఆపై నుండే దెట్లందువినరా ॥ వుదయాస్తమానములుడుగాక యిదినీ, నె। మ్మదిలోన నమ్మ నా మాట నిశ్చయమిట్లు॥ యెరిగితే సరిరా । ఆపై నుండే దెట్లందు వినరా॥**

**టీక :** ఉడుగాక = విడచిపెట్టక

**భావము :** ఇది వున్నది అనగా పరిపూర్ణ పరబ్రహ్మమె ఉన్నది అని ముమ్మారు చెప్పుచున్నారు. అట్లే ఇది లేనిది, అనగా ఎరుక లేనిది అని ముమ్మారు చెప్పుచున్నారు. అనగా ముమ్మాటికి పరిపూర్ణ పరబ్రహ్మమే శాశ్వతమై సనాతనమై ఉన్నది అనియు, ముమ్మాటికి ఎరుక లేదనియు। లేనిది ఆభాస రూపమనియు అర్థము. ఎరుక లేకపోయిన తరువాత, ఆ పై యుండే పరిపూర్ణమును ఉన్నదని ఏలా అనగలము. ఎరుక ఉంటేనే నిర్ణయము. ఎరుక లేకపోయినచో ఏమీ నిర్ణయము లేదు. నేను

చెప్పిన యీ మాట నిశ్చయము నమ్ముము. కనుక సర్వకాలముల యందు పరిపూర్ణ పరబ్రహ్మమే ఉన్నదనియు ఎరుక లేదని నిశ్చయమై ఉండుము అని భావము.

**విశేష భావము :** ఈ పద్య భావమే శృతి "బ్రహ్మ సత్యం - జగన్మిధ్య" సత్యమైనది బ్రహ్మము మాత్రమే. పరిపూర్ణ పరబ్రహ్మము తప్ప మరేదియు సత్యమైనది లేదు. అట్లే జగత్ మిధ్యా అనగా జగత్తు అంటే సమస్త జగత్తుకు ఆధార స్వరూపమయిన ఏ అఖండ ఎరుక ఉన్నదో, అదే జగత్తు. అంటే కారణ కార్యములు రెండును ఒక్కటే. దీనిని మన సంప్రదాయకులు విపరీతముగా గ్రహించుచున్నారు. మరియు మిధ్య అనగా ఉన్నది అని కాని, లేదు అని కాని చెప్ప వీలు కానిది. ఆభాసము మాత్రమే. లేనిదే ఉన్నట్లు తోచబడేది కనుక మిధ్యా స్వరూపము అని అన్నారు. మిధ్య అనగా ఒక దానిపై ఆధారపడి ఉన్నట్లుగా తెలియబడేది "అవిద్య" అనే అద్దము వలన అందలి ప్రతిబింమము ఉన్నట్లు తోచుచున్నది. ప్రతిబింబము చైతన్యము కనుక, ఈ సత్తా మీద ఆధారపడి లేని అవిద్య ఉన్నదగుచున్నది. కనుక అవిద్య ప్రతిబింబము చేతను, ప్రతిబింబము అవిద్య చేతను ఉనికి గల్గుచున్నది. కనుక అవిద్య, ప్రతిబింబము రెండునూ మిధ్యా స్వరూపములే. లేనివే అని తెలియనగును.

ఇది శ్రీమద్భాగవత కృష్ణ విరచిత, ద్వైతా ఽద్వైత రహిత
పరమతత్త్వే, పరిపూర్ణ బోధనామ అష్టమోధ్యాయః
భావ విశేషభావములు సమాప్తము.

## పరిపూర్ణ బోధ - సంక్షిప్త భావము

ఈ అధ్యాయములో శ్రీ కృష్ణ దేశికేంద్రులవారు పరిపూర్ణ బ్రహ్మము మాత్రమే శాశ్వతమైనదనియు, తక్కిన సమస్తము ఎరుక అశాశ్వతమైనదినయు, లేనిదనియు, లేకనే ఉన్నట్లు తోచబడే మిధ్యా స్వరూపమునియు నిశ్చయముగా బోధించిరి. ఎరుక అనగా జీవుడు పిండాండము. ఈశ్వరుడు - బ్రహ్మాండము, ఈ రెంటికి అధిష్ఠాత ఈ మూడు ఎరుకయే. జగత్తు జనించి గతించే స్వభావము కలది. క్షణికమైనది అని ధృడముగా తెలుసుకొని, కనుపడే సమస్త జగత్తు లేనిది కనుక దాని యందు భ్రమను విడచిపెట్టమన్నారు. అంటే జగత్తు వలన మనకు శాశ్వత సౌఖ్యము లేదు. దుఃఖమయ సుఖము కనక జగత్తును విడచిపెట్టమన్నారు. ఇక ఈ జగత్తు ఉన్నది అనిపించుకొనుటకు కారణమైన జగత్ పరిపాలకులైన బ్రహ్మ, విష్ణు ఇంద్రాది సమస్త దేవతల యందు కూడా భ్రాంతిని విడచి పెట్టమన్నారు. అనగా ఇవి శాశ్వతమైన సుఖమును ఆనందమును కలిగించునవి కావు అని విడచిపెట్టుటయే "పిదప వీటి బాయుమనిశమున్" అన్న వాక్యానికి అర్థము. ఈ రెండు భ్రాంతులు వదలినచో ఇక మిగిలిన వారు, నీవు నేను ఇద్దరు మాత్రమే అనగా శిష్యుడు - గురువు ఇద్దరూ ఉన్నారు. శిష్యుడు జగత్తు, దేవతల భ్రాంతిని విడచి పెట్టుటచే మనశ్చాంచల్యము లేకుండా శ్రీ గురుమూర్తి చెప్పే అతి రహస్యమైన పరిపూర్ణ బోధను చక్కగా గ్రహించనగును.

పరిపూర్ణము సర్వత్ర నిండి ప్రత్యక్షముగానే ఉన్నది, అయినను దృక్సిద్ధము కాదు. అలాగని లేదని యనరాదు. కనిపించే సమస్తము నశించిపోయేదే. పరిపూర్ణము మాత్రము శాశ్వతమై ప్రత్యక్షము గానే ఉన్నది. పరిపూర్ణములో ఎరుక లేదు. కనుక పరిపూర్ణమును ఎరుక కనుగొనలేదు. పరిపూర్ణము సర్వత్రా ఉన్నది. అయితే పరిపూర్ణములో ఎరుక లేదు కనుక, లేనిది ఎరుక అని అనవలసియున్నది. ఎరుక పరిపూర్ణమును చూడబోతే ఎరుకే లేకుండా పోవును. చీకటి సూర్యుని చూడబోయే సరికి చీకటే లేకుండగా పోవుచున్నది. కనుక చీకటి సూర్యుని కనుగొనలేట్లు ఎరుక పరిపూర్ణమును కనుగొనలేదు. సమస్తమును తెలుసుకొనునది ఎరుకయే. ఎరుకచే తెలియబడిన సమస్తము ఎరుక స్వరూపమే. పరిపూర్ణములో యెరుక లేదు కనుకనే, ఎరుక పరిపూర్ణమును కనుగొనలేదు. గురు కరుణచే ఎరుక పరిపూర్ణమును

ఉండజూచుసరికి ఎరుక పూర్తిగా లేకుండా పోవును. ఎరుక లేకపోయిన వెనుక పరిపూర్ణము ఉన్నదిన నిర్ణయించుటకు ఎరుకలేదు కదా! ఏ నిర్ణయము చేసినా ఎరుక ఉన్నట్లే.

ఇట్టి యెరుకకు మూలము యెరుకయే. మరేదియు లేదు. పరిపూర్ణము ఎరుకకు మూలము కాదు. సమస్త జగత్తు అనే వృక్షమునకు అఖండ ఎరుక విత్తు వంటిది. ఎరుకచే తయారయిన సమస్తము ఎరుకవంటిదే. ఎరుక మూలము లేకుండా, ఉన్నట్లు తోచబడే ఆభాస రూపమే. ఎరుకకు మూలము ఎరుకయే. అవిద్య లేక అంతఃకరణ లేకమాయ అనే ఎరుక పరిపూర్ణములో లేనిదె తోచబడినది. ఇది అద్దము వలె ప్రతిబింబింపజేసుకొనే లక్షణము కలది కనుక దీనికి దశ దిశల యందున నిండి ఉన్న పరిపూర్ణమును ప్రతిఫలంపజేసుకొన్నది. అదే ప్రతిబింబ చైతన్యము. ఈ రెండును కలిసి ఎరుక అనగా అవిద్య వలన ప్రతిబింబము. ప్రతిబింబము యొక్క సత్తా చేత అవిద్య ఉన్నది అనిపించుకొనుచున్నది. అవిద్యకు మూలము ప్రతిబింబము, ప్రతిబింబమునకు మూలము అవిద్య. ఇదే ఎరుకకు మూలము ఎరుకే అన్న వాక్యమునకు అర్థము. ఈ అవిద్య ప్రతిబింబములలో రెంటిలో ఏ ఒక్కటి లేకపోయినా రెండూ లేకపోవును. కనుక ప్రతిబింబమునకు ఉపాధి అయిన అవిద్యను గురు కరుణచే లేకుండా చేసికొనినచో ప్రతిబింబము లేకుండా పోయి మొత్తము ఎరుకే లేకపోవును. ఈ విషయమును గురుముఖతా చక్కగా తెలిసికొని ఎరుక రహితమునకు చక్కని ప్రయత్నము చేయవలసి యున్నది. ఎరుక లేకపోయిన తరువాత పరిపూర్ణము ఉండును. కాని పరిపూర్ణమున్నదనుటకు ఎరుక లేదు కదా! కనుక ఏ నిర్ణయములు లేవు. కనుకనే ఎరుక లేకపోయినచో చాలును అన్నారు. అంటే అదే "నసపునరావర్తతే" అని భావము. ఈ అధ్యాయ సారాంశము.

# గురుమంత్ర ప్రతాపము - (27)

**అవతారిక :** గురుమంత్రమనగా షోడశాక్షరీ మంత్రం. ఈ మంత్రమును సర్వదా జపించుచుండిన షోడశి అయిన ఎరుక పూర్తిగా నశించునని చెప్పబడుచున్నది.

**161వ పద్యము : యెరుగననేటిది యెరుకే । యెరుగుదునని తనను పరుల నెరిగే దెరుకే । యెరుగ నెరుంగుదు నను దా । నెన్నరుగుచు నుండేటి దెరుకే, నిరుపమ బుద్ధీ ॥ నీ వెరుగిది నిగమ ప్రసిద్ధీ ॥ గురుమంత్ర మనియేటి గ్రుద్దాలి తోటి యీ । యెరుక కూకుడు వేరు నెరిగి త్రవ్వితె చాలు ॥ నిరుపము బుద్ధీ । నీ వెరుగిది నిగమ ప్రసిద్ధీ ॥**

**టీక :** నిరుపమ బుద్ధీ = సాటి లేని బుద్ధి కలవాడా! నిగమ ప్రసిద్ధీ = వేదముల యందు ప్రసిద్ధి పొందిన వాడా ! (ఆత్మ స్వరూపా)

**పద విభాగము :** యెరుగను అనేటిది ఎరుకే! యెరుగుదును అని తనను పరులను ఎరిగేది ఎరుకే । యెరుగను, యెరుగుదును అనుదాన్ని ఎరుగచునుండేటిది యెరుకే । నిరుపమబుద్ధీ । నీ వెరుగు ఇది నిగమ ప్రసిద్ధీ ।

**భావము :** ఓ సాటి లేని బుద్ధిమంతుడా । వేదములలో ప్రసిద్ధి పొందిన వాడా! నాకేమియు తెలియదు అనేది యెరుకయే; తన యొక్క స్వరూపము, ఇతరమును ఎరుగుదును అని యెరిగేది యెరుకయే. ఈ విధముగా ఎరుగును, ఎరుగుదునను ఈ రెంటిని యెరిగేది యెరుకయే అని తెలుసుకొనుము.

షోడశి మంత్రము అనే గ్రుద్దలితో, యీ యెరుక యొక్క తల్లి వేరు (కూకుడువేరు ఎక్కడ ఉందో విచారించి తెలసి ఆ తల్లి వేరును త్రవ్వి వేయుము) చాలును.

**విశేష భావము :** యెరుకకు రెండు లక్షణములు స్వభావ సిద్ధములు. 1) యెరుగుట, 2) మరచుట. జాగ్రదవస్థయందు, స్వప్నావస్థ యందు తనను ఇతరమును ఎరుగుచున్నది, తురీయ మందు భ్రూమధ్యమున తన స్వరూపమును ఎరుగుచున్నది. (ఇది జ్ఞాన రూపము) జాగ్రత, స్వప్నములలో ఎరుగుట అజ్ఞాన స్వరూపము. సుషుప్తిలో తనను ఇతరమును కూడా ఎరుగుట లేదు. ఇది అజ్ఞాన అవస్థలో మరచుట.

సహస్రారమున సమాధి స్థితి యందు ఏమియు యెరిగే లక్షణములేదు. ఇది జ్ఞాన రూపములో మరుపు అనబడును. ఈ ఎరుగుట మరచుట అను నీ రెండు పనులు ఎరుకయే. మొత్తము మీద ఎరుగుట, మరచుట అను యీ రెండు పనులూ అంతఃకరణ అయిన అవిద్య అనబడే ఎరుక యొక్క పనులు. ఈ అవిద్య స్వతఃజడము. దీని యందున్న సాక్షి చైతన్యము యొక్క సత్తా చేతనే అవిద్యకు ఎరుగుట మరచుట అనుక్రియలు వచ్చినవి. ఇందుకు మూల కారణము సాక్షి చైతన్యము. ఈ చైతన్యమునకు ఎరిగే లక్షణములేకున్ననూ, అంతఃకరణ యొక్క సత్వ రజస్తమోగుణముల ద్వారా దీని చైతన్యము ప్రసరించి ఎరుగుట మరచుటకు కారణమగుచున్నది. కనుక సాక్షి చైతన్యమునకు యెరిగే లక్షణము లేదని బ్రహ్మమనరాదు. ఇది కూడా ఎరుకే. ఇదే నేను, ఈశ్వరుడు జ్ఞాన స్వరూపము. కనుక ఇది ఎరుకే. బ్రహ్మము కాదని ఈ పద్య భావము.

**నిగమ ప్రసిద్ధీ :** వేదములలో ప్రసిద్ధమయిన వాడా ! పరిపూర్ణ బ్రహ్మమునకు సాటి మరొకటి లేదు. అట్టి బోధను గ్రహించినవాడు "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అనే సూక్తి ప్రకారముగా బ్రహ్మ తత్వమును గుర్తించిన బుద్ధి కలవాడు కనుక "నిరుపమ బుద్ధి" అని చెప్పిరి.

---

**అవతారిక :** సమస్తమును తెలుసుకొనేది ఎరుకే. పరిపూర్ణ పరబ్రహ్మమునకు ఎరిగే లక్షణము ఎంత మాత్రము లేదని ఈ క్రింది రెండు పద్యములో చెప్పుచున్నాను.

**162వ పద్యము : యెరుకే చదువులజేసును । యెరుకే విను చదువు, నెరుక నెరుకే తిరమం చెరిగించును, శంకించును । యెరుకే కానకేమి లేక యేగునో యన్నా ॥ బయలే చదువు యెరుగాదోయన్నా ॥ ఎరుకే ఎన్నటికైన పరిపూర్ణమున్నాదం । చెరిగీ తాలేనని ఎరిగితే నిలువాక ॥ యేగునోయన్నా । బయలే చదువు యెరుగదో యన్నా॥**

**టీక :** చదువులు = సమస్త శాస్త్రములు, వేదములు అని భావము. తిరము = శాశ్వతము.

**భావము :** శిష్యా! సమస్త శాస్త్ర ఆగమ నిగమాదులను, రచించేది, చదివేది, వినేది తెలుసుకొనేది ఎరుకే. యెరుకను శాశ్వతమని పరబ్రహ్మమని భావించేది ఎరుకే. జగత్తు కారణము అయిన తనను, బ్రహ్మము కానేమో ? అని శంకించేది ఎరుకే.

తాను మిధ్యా స్వరూపము అని తెలసి బ్రహ్మమును గుర్తించి చివరకు లేకండాపోయేది ఎరుకయే. పరిపూర్ణ పరబ్రహ్మము యేరకమైన శాస్త్రములను రచించుట లేదు. కనుక ఎన్నటికైనా (బహు జన్మ పుణ్యవశమున) యెరుక పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే శాశ్వతమైయున్నదని గురుముఖతా గురుకరుణచే గుర్తించినచో తాను ఎంతమాత్రము లేకుండా పోవును.

**విశేష భావము :** "బయలే చదువు యెరుగదు" పరిపూర్ణము శబ్ద రహితము. అందులో ఓం అను శబ్దము లేదు. అనగా నేను అనే ఎరుకలేనిది. వేదములు బ్రహ్మముఖము నుండి యేర్పడినవి. అందుకే వేదములు ఆ పౌరుషేయములు అన్నారు. అయితే శృతికర్త అయిన బ్రహ్మము అఖండ యెరుక, అఖండ గురు స్వరూపము, జగదధిష్ఠాన బ్రహ్మము అని చెప్పబడే యెరుక నుండే సమస్త వేదములు (చదువులు) వచ్చినవి. పరిపూర్ణ బ్రహ్మము నుండి యేర్పడలేదని భావము.

---

**163వ పద్యము : చూపులలో గల వస్తువు । చూపుల గను వస్తువులును, చూపులు గూడన్ । తేపకు యెరుకని తెలియుము । చూపులు లేనట్టి బయలు చూచే దింకేమీ॥ ఎరుకే లేదు తోచేదింకేమీ ॥ దీపాము వలె కనుపాపలో గల వస్తువె। పరమాత్మని జూపితె ఎరుకాయె ॥ చూచేదింకేమీ! ఎరుకే లేదు తోచేదింకేమీ ॥**

**టీక :** తేపకు = మాటికి (అనగా తెలుసుకుంటే మూడు కూడ అని భావము)

**భావము :** శిష్యా! చూపులలో (కంటిలో) ఉన్నది, చూడబడిన వస్తువు. చూపులు అనగా చూచుటయు అనగా, ద్రష్ట, దర్శన, దృశ్యములు ఈ మూడును కూడా విచారిస్తే ఒక్క ఎరుకయే అని తెలియబడును. చూచేది ఎరుక, చూడబడేది ఎరుక, చూపు యెరుక ఇదే త్రిపుటి అని తెలియుము. కాని పరిపూర్ణములో త్రిపుటి యెంత మాత్రము లేదు. త్రిపుటి రహితమైనది. అందుకే ఎరుక లేనిది పరిపూర్ణము అని చెప్పబడుచున్నది. కనుపాపలో దీప శిఖవలె కనిపించేది పరమాత్మ అని చెప్పుదురు. కాని కాదు, అది ఎరుకయే, ఆపోజ్యోతి (అమృత జ్యోతి) అని తెలియుము. పరిపూర్ణ పరబ్రహ్మము దృశ్యము, జ్ఞేయము కానిది అని తెలియుము.

---

**అవతారిక :** సూర్యుని పొడవచ్చుచున్నంతలోనే చీకటి పోవుచున్నట్లుగా పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క జాడ (పొడ) గనినంతనే యెరుక నశించుపోవును అని చెప్పుచున్నారు.

**164వ పద్యము : శతపత్రాప్తుని పొడగని । అతిరయమున తిమిర మణగి యగుపడ, దెట్ల । ట్లతులిత గురు కృప గలిగిన । మతి మంతుల జూచి యెరుక మరి నిల్వబోదు॥ సంశయమునీ మది నిల్వరాదు ॥ శృతులందు స్మృతులందు యితి హాసముల యందు ॥ సతతము శ్రమపడి వెతకీన యీ యెరుక ॥ మరి నిల్వబోదు । సంశయము నీ మది నిల్వ రాదు ॥**

**టీక :** శతప్రతాప్తుని = పద్మములకు స్నేహితుని (సూర్యుని), పొడగని = జాడచూచి, అతి రయమున = వెంటనే, వేగముగా, తిమిరము = చీకటి, అణగి = లేకపోయి, అతులిత= సరిపోల్చుటకు వీలు కాని, శృతులు = వేదములు, స్మృతులు = ధర్మశాస్త్రములు (ఆచరింపదగినవి) యితిహాసములు = పురాణములు.

**భావము :** శిష్యా ! సూర్యుని యొక్క జాడ రాగానే వెను వెంటనే చీకటి ఏ విధముగా లేకుండా పోవునో, అట్లే సరిపోల్చరాని గురుకరుణ కలిగిన బుద్ధి మంతుని వద్ద యెరుక ఎంతమాత్రము ఉండదు. ఈ విషయములో నీ మనస్సు నందు సందేహము యెంత మాత్రము వద్దు. వేదములు శాస్త్రములు పురాణములలో కష్టపడి యెరుక శాశ్వతమైనది కదా అని వెతకినప్పటికి (పరిశోధించనప్పటికి) యీ యెరుక నిల్చేది కాదు. కనుక యెరుక శాశ్వతమేమోయనే సందేహము నీ మనస్సు నందు ఉంచకుము.

**విశేష భావము :** గురు కరుణ రెండు విధములు. 1) మానుష గురుకరుణ. ఇది మనకు బోధ చేసిన గురుమూర్తి యొక్క కరుణ. ఈ గురు కరుణచే శిష్యుడు పరిపూర్ణము ఎరుకల రెంటి మర్మము చక్కగా తెలసి వస్తు నిశ్చయ జ్ఞానము కల్గి బోధ యొక్క పరోక్షజ్ఞానము కల్గియుండును.

2) దివ్య గురుకరుణ. ఇదే సర్వజీవుల యందు అఖండ స్వరూపమైన గురుమూర్తి, (ప్రతిబింబ చైతన్యము). ఈ గురుమూర్తిని చక్కగా ధ్యానము చేయుట వలన (ధ్యాన మూలం గురోర్మూర్తిః) గురుమూర్తికి కృప కల్గి, చక్కగా బాహ్యాభ్యంతర ప్రకాశుడై ప్రత్యక్షమై, శిష్యుని యొక్క, హృదయ గ్రంధి అని చెప్పబడే అవిద్య ఆవరణము దగ్ధము చేయును. ఇదే "జ్ఞానాగ్ని దగ్ధ సర్వకర్మాణి" అన్న శృతి విధానము.

అవిద్య పోయినచో దానితో ఏర్పడిన ప్రపంచము (లేని) ప్రతిబింబ చైతన్యము సమస్తము అవిద్యతోనే పోవును. ఇదే ఎరుక రహిత స్థితి. ఇదే పునరావృత్తి రహిత విధానము. ఇదే "ముక్తిమూలం గురోఃకృప" ఈ విషయమును చక్కగా విచారించి గుర్తించవలెను. ఎరుక రహితమునకు రెండో విధానము మరేదియు లేదు. ఇదే "హృదయ గ్రంధి విడుటకై"అనే కందార్థ భావన.

**165వ పద్యము : ఎరుకే కోశము లైదెరు। గెరుకే భూతములనెరుగు నెరుగుమ సర్వం । బెరుకే యెరుక నెరుంగును । యెరుకను గుర్తెరుగ వేరే యెరుక వున్నదా ॥ వున్నదంటె నరకమె కాదా ॥ నిరతము గురుసేవ పరతంత్రులగుచు, త । త్కరుణకు పాత్రులై యెరుక మాలిన వారి । కెరుక వున్నదా? । వున్నదంటె నరకమె కాదా ॥**

**టీక :** తంత్రులు = సాధకులు (పరతంత్రులు = పరసాధకులు)

**భావము :** శిష్యా! యెరుకే పంచ కోశములను, పంచభూతములను సమస్తమును యెరుగుచున్నది. ఈ యెరిగే యెరుకయే అంతఃకరణ చైతన్యమైన నిర్గుణ ఎరుకను కూడా గుర్తించును. ఈ నిర్గుణ ఎరుకను గుర్తించే మరొక ఎరుక ఎచ్చటను లేదు. ఈ నిర్గుణ ఎరుకను గుర్తంచే మరొక ఎరుక (శుద్ధ ఎరుక) ఉన్నదనే వార్కి నరకము తప్పదు. (అంటే జన్మకు రావలసినదే అని భావము). ఎల్లప్పుడు గురుసేవ చేయుచు పరసాధకులు అయి, గురు కరుణకు పాత్రులయిన వారికి ఎరుక ఉండునా? ఉండును అనే వారికి పునర్జన్మ తప్పదు.

**విశేష భావము :** "గురు కరుణకు పాత్రులైన వారికి ఎరుక ఉండదు" అనుట భావము 164వ పద్యములో చెప్పిన విశేష భావమే గురు కరుణ అని భావించవలెను. పంచభూతములను, కోశములను ఎరుగుచున్నది అంటే కల్పించుకొని, తన సత్తా చేతనే వాటిని చైతన్యముచేయుచున్నది అని గ్రహించవలెను. అంతఃకరణమయిన అవిద్యయే సమస్తమును ఎరిగేది తన్ను తాను ఎరిగేది కూడా, పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క పొడగనిలేక పోయేది కూడా ఈ అంతఃకరణమనబడే అవిద్యయే. ఎరిగేది మరొకటి ఏదియు లేదు. అందుకే ఇది ఎరిగే శరీరము అన్నారు.

**166వ పద్యము : గురు మంత్రముచే నిలువని । యెరుకను పరిపూర్ణమనుచు నెరిగి నిరతమున్ । యెరుకై యుండిన వారల । తెరువిక నీ కేల వట్టిదీ జోలి మానూ ॥ యెరుక లేని యీ జోలి పూనూ ॥ గురునిచే పరిపూర్ణ మరసి, యీ తెలసిన । యెరుక వెన్నటికి నీ వెరుగకు, వట్టి ॥ దీ జోలి మానూ ॥ యెరుక లేని యీ జోలి బూనూ ॥**

**టీక :** నిరతము = ఎల్లప్పుడు, తెరువు = మార్గము, పద్ధతి, జోలి = పద్ధతి, అరసి=విచారించి, చూచి.

**భావము :** శిష్యా! షోడశీ మంత్ర విచారణచే "లేదు" అని తెలియబడే యెరుకనే కొందరు పరిపూర్ణ పరబ్రహ్మముగా భావించుచుందురు. అది యెరుకే కాని బ్రహ్మము కాదు. అట్టి వారి మార్గము నీ కెందుకు. ఆ పద్ధతి నీకు వద్దు. యెరుక రహిత పర్చుకునే యీ పద్ధతిని గ్రహించుము. గురుముఖతా పరిపూర్ణమును విచారించి, చూచి, ఆ తెలుసుకొన్న యెరుక వట్టిదని, మాయయేయని, లేనిదని దానిని విడచి పెట్టుము. ఆ యెరుకను రహిత పరిచే యీ బోధ పద్ధతిని పూనుము.

**విశేష భావము :** అంతకరణ అనే అవిద్యయే ఎరిగే శరీరము (ఉపాధి). అందలి సత్తా మాత్రమైన సాక్షి చైతన్యము (ప్రతిబింబము) గుర్తు. ఈ రెండు విడివడి ఎన్నడూ ఉండవు. కనుకనే షోడశాక్షరి మంత్రము ఈ రెంటిని కలిపి "ఈ గుర్తెరిగే శరీము ఏమీ లేదు" ఈ రెండును మూలము లేనిదే ఉన్నట్లు తోచుచున్నది కనుక" మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీ లేదు" అనే షోడశాక్షరి మంత్రము చెప్పియున్నారు "గుర్తు" అని చెప్పబడేదే సాక్షి చైతన్యము. ఇది పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క ప్రతిబింబము కనుక చాలా మంది శాస్త్రజ్ఞులు ఇదే బ్రహ్మము అని చెప్పినారు. ఈ మార్గము వద్దు అని ఈ పద్య భావము. ప్రతిబింమమునకు ఉనికి ఎన్నడూ లేదు. లేని దానిని బ్రహ్మము అనరాదు. శాశ్వతమై ఉన్నది ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే. కనుక ఈ బోధ మార్గమును విడచి పెట్టవద్దు, అని పద్య భావము.



**167వ పద్యము : లేని కల దోచినప్పుడు । లేని విచిత్రంబులన్ని లేకనె దోచున్ । లేని కల మేలుకొన్నను । లేని విచిత్రములు తాను లేకపోవును గదా ॥ అనుమానము లేదిందు వినరా ॥ లేవెరుక యీ రీతిగనె బయలును జూప్తె । తాను తన తన**

**విచిత్రములు పూనెందు నిలచుండ । లేక, పోవు గదా ॥ అనుమానము లేదిందు వినరా॥**

**భావము :** శిష్యా! లేని స్వప్నము తోచినప్పుడు, ఆ స్వప్నములో అనేకమైన విచిత్ర జగత్తు లేకనే తోచుచున్నది. ఆ లేని కల నుండి మేల్కొనగానే, ఆ లేని విచిత్ర జగత్తు, లేని స్వప్నము రెండునూ లేకపోవుచున్నది. ఇందు సంశయము లేదు గదా (ఇది అందరికీ అనుభవ ప్రసిద్ధమే గదా !)

ఆ విధముగానే, యీ లేని యెరుక వలననే లేని జగత్తంతయు తోచబడుచున్నది. యీ లేని యెరుక శాశ్వతమైన (మేల్కవంటి) పరిపూర్ణమును గురు కరుణచే చూచినచో, ఆ లేని యెరుకయు, దానివలన లేక ఏర్పడిన సమస్త జగత్తు రెండునూ లేకపోవును. ఇందులో సంశయమెంత మాత్రము వద్దు.

---

**అవతారిక :** తనను కాని ఇతరమును కాని గుర్తించలేని స్థితి పరిపూర్ణ స్థితి. ఇట్టి వాడు తిరిగి పుట్టడు. కాని ఇట్టి గుర్తించలేని స్థితి లౌకిక స్థితిలో కూడకలదు. వారు తిరిగి పుట్టుదురనియు, గురు మేల్క పొందుటచే గుర్తు రహితమైన వారు మాత్రమే పునర్జన్మమునకు రారని చెప్పుచున్నారు.

**168వ పద్యము : మరణ సుషుప్తులు జెందిన । పురుషుడు, మేల్కనిన వాడు భువి తదితరుడౌ । పురుషుడు కలగను వాడని । యెరిగుండుము మొదటి యత డెరుగాడీ రెంట్నీ ॥ రెండో పురుషుడెరుగు, నీ రెంట్నీ॥ యిరువురొక్కటే సుమ్మీ తిరిగి పుడుదురు, వీరె । గురు నీచే మేల్కొంటె తిరిగి పుట్టనె పుట్ట ॥ డెరుగాడీ రెంట్నీ ॥ రెండో పురుషు డెరుగనీ రెంట్నీ ॥**

**టీక :** మరణ అవస్థ, సుషుప్తి = గాఢ నిద్రావస్థ, మేల్కనినవాడు = జాగ్రదవస్థలోనున్నవాడు, కలగనువాడు = స్వప్నావస్థలో నున్నవాడు, యెరిగుండుము = తెలుసుకొనుము.

**దండాన్వయము :** 1) మరణ సుషుప్తులు జెందిన పురుషుడు భువి తదితరుడౌ పురుషుడు మేల్కనినవాడు కలగనువాడని యెరిగుండుము। మొదటియతడు యీ రెంట్నీ యెరుగడు । రెండో పురుషుడు ఈ రెంట్నీ యెరుగును । యెరుగకుండితే

నేమి యిరువురొక్కటె తిరిగి పుట్టుదురు। వీరె గురునిచే మేల్కొంటే తిరిగి పుట్టనే పుట్టడు ॥

**భావము :** శిష్యా! మరణించినవాడు, గాఢ నిద్రావస్థలో నున్నవాడు, తన సంగతి గాని ఇతరము సంగతి కాని ఎరుగడు. 2) దీనికి ఇతరమైనవాడు అనగా జాగ్రదవస్థలో నున్నవాడు, స్వప్నావస్థలో నున్నవాడు తన సంగతిని ఇతరము సంగతిని, రెంటిని అనగా ఈ అవస్థలో నున్నవారు తమ సంగతినే కాక, మరణ సుషుప్తులలో వారిని కూడా గుర్తించగలరు. మొదటి అతడు ఎరుగని వాడు, రెండవవాడు రెంటిని ఎరిగినవాడు, అయినను ఇద్దరు కూడా తిరిగి జన్మకు వచ్చేవారే, వీరే గురు మేల్కపొందినచో తిరిగి పుట్టరు. గురు మేల్కపొందిన వారు తప్ప మిగతా వారు అందరూ పునర్జన్మ పొందవలసినదే యని భావము.

**విశేష భావము :** మరణము, సుషుప్తి, మూర్ఛ, సమాధి, కోమాస్థితులలో ఉన్నవారు తమను గాని ఇతరమును గాని ఎరుగరు అట్లని ఎరుక రహితులు కాజాలరు. గురు మేల్క అనగా గురుకృపచే పరిపూర్ణము ఉన్నదని చూచుటచే ఎరుక రహితమైన వారు మాత్రమే తిరిగి పుట్టనివారు అని చెప్పవలెను.



**169వ పద్యము : యెరుకే యెరుకకు కొడుకులు। యెరుకే తలిదండ్రి యెరుక కెరుకే యితరుల్। యెరుకే యెరుకకు మూలము। యెరుకకు మూలంబు, బయలంచె మెట్లందువోయీ ॥ యెరుకే, యెరుక కేమీ లేదోయీ ॥ యెరుక లేని వుత్త పరిపూర్ణమును జూచి। యెరుక తాలేవని యెగిరిపోయితే పైమా ॥ టెట్లందువోయీ। యెరుకే, యెరుకేమీ లేదోయీ ॥**

**దండాన్వయము :** యెరుకకు మూలంబు బలయలంచని యెట్లందు నోయీ। (మూలము) యెరుకే। యెరుకకు (మూలము) ఏమీ లేదోయీ। లేని యెరుక వుత్త పరిపూర్ణమును జూచి ॥

**భావము :** శిష్యా! యెరుకకు కొడుకులు, తలి, తండ్రి, యితరులు అంతా ఎరుకే కాని మరియొకటి ఏమీ లేదు అంతా యెరుకే. కనుక యెరుకకు మూలము యెరుకే. పరిపూర్ణము మూలము అనరాదు. యెరుకకు యెరుకే మూలము. లేని యెరుక వుత్తబయలును (ఎరుకలేని బయలును) జూచి తాలేనని తెలసి లేకపోయినచో ఆ

పై మాట అయిన పరిపూర్ణము ఉన్నదని ఎట్లు అనగలరు? (అనుటకు ఎరుకలేదు) కనుక యెరుకకు యెరుకే మూలము.

**విశేష భావము :** యెరుకే యెరకకు కొడుకులు, అవిద్య అనే ఎరుకకు పుట్టినవి జ్ఞానము (వృత్తి జ్ఞానము) అజ్ఞానము. ప్రజ్ఞానము ఇవి పుట్టినవి కనుక యెరుక యొక్క కొడుకులు. ఇవి కూడా ఎరుకయే కదా. అవిద్య అనే యెరుక వలన ప్రతిబింబ చైతన్యమయిన ఎరుక ఏర్పడినది. కనుక ప్రతిబింబ చైతన్య మెరుకకు అవిద్య అనే యెరుక తల్లి. అవిద్య అనే యెరుక వల్లనే సమస్త జగత్తును సృష్టించుట పోషించుట జరుగుచున్నది. అందుకు కారణము సత్తా మాత్రమైన ప్రతిబింబ చైనత్యము. ప్రతిబింబ చైతన్యము ఎరుకే కనుక (సత్తా మాత్రము తండ్రి కనుక) అవిద్య అనే ఎరుకకు అని గాని, జగత్తు అనే ఎరుకకు కాని, ప్రతిబింబచైతన్యమైన ఎరుక తండ్రి (పురుషుడు). అ విద్య అనే ఎరుక వలన ఏర్పడిన సమస్త జగత్తు. చైతన్యము అనే ఎరుకకు ఇతరమైన ఎరుక. కనుక అవిద్య అనే ఎరుకకు మూలము చైతన్యమనే ఎరుక. చైతన్యమనే ఎరుకకు మూలము అవిద్య అనే ఎరుక. (ఇదే తను వెరుకలు రెండింటిలో అనే కందార్థ భావము) ఈ రెండు కలిపి యెరుక. ఇట్టి యెరుకకు పరిపూర్ణము మూలము కాదని తెలియబడుచున్నది. మరియు ఎరుకకు మూలము మరేదియు లేదు. కనుక యెరుక మూలము లేనిది అని నిర్ణయము.

---

**170వ పద్యము : గురుతను కలలో నారీ । నరు లూరకెవచ్చి, పొంది నయముగ సుతులన్ । వరకన్నియలను గాంచియు । గురు వరుచే మేలుకొంటే గుర్తుండదన్నా॥ ఆ పై మాట నెరిగేదేదన్నా ॥ యెరుకొక్కటుంటేనే యేర్పాటు లుండును । మెరుకొక్కటేగితె ఏర్పాటు జేసేటి ॥ గుర్తుండదన్నా । ఆపై మాట నెరిగేదేదన్నా ॥**

**టీక :** యేర్పాటు = నిర్ణయము, నియమము, నయముగ = నీతిగ

**భావము :** శిష్యా! యెరుక అనే కలలో (ఎరుకే) స్త్రీ పురుషులుగ తమంత తామే వచ్చి నీతిగ క్రీడించి, కుమారులను కుమార్తెలను పొంది ఆ పైన గురుమూర్తి కరుణచే మేలుకొన్నచో, ఆ యెరుక లేకుండా పోవును. ఆ తరువాత భార్య భర్త సుతులు అనే పై సంగతులను ఎరిగేదెవరు? యెరుక ఒక్కటీ ఉంటేనే యీ నిర్ణయములు ఉండును.

**విశేష భావము :** "గురుతను కలలో నారీ - నరులూకెవచ్చి....." అఖండ యెరుక

పరిపూర్ణ పరబ్రహ్మములో లేనిదె తనంతట తానుగా కలవలె యేర్పడి, అందులో "నారీనరు లూరకెవచ్చి".... అనేక బలములకు అనేక మాయావృత్తమై అనేక బ్రహ్మాండ పిండాడములగుటయే। ప్రకృతి పురుషులు నారీ నరులు - పిండాండము - అందు చైతన్యములు యేర్పడినవి చెప్పుట. అందులోని ఒక గుర్తు పిండాండమందలి అవిద్య - చైతన్యములనే ఎరుక గురు మేల్కొ పొందినచో, గుర్తు అనే చైతన్యము లేకపోవును. అవిద్య కూడా లేకపోవును. ఇదే "గుర్తు ఎరుక లేకపోయినచో పిండాండములు, బ్రహ్మాండములనేవి, అందున్న ప్రతిబింబ చైతన్యములు ఇవేమీ గుర్తించే ఎరుక లేదు కదా! కనుక "ఆ పై మాటల నెరిగేదే దన్నా"...

**171వ పద్యము : నిను నను నివు కల గాంతువు। నిను నను కలలోన గాంతు నేనొక వేళన్। నిను నను నీవు నేనను నివు। కనుగొనగా గలమె మేలు కనినా మీదటనూ॥ గురుబోధట్ల వినినా మీదటనూ॥ మునుపు గలిగిన యెరుక మొదటికే నిలువాదు। నిను నన్ను నేనన్ను నినునీవు వెరుగుట యెట్లు॥ కనినా మీదటనూ। గురు బోధట్ల వినినా మీదటనూ॥**

**భావము :** శిష్యా! నిన్ను నన్ను నీవు నీ కలలో చూడగలవు. నేను ఒకప్పుడు నిన్ను నన్ను నా కలలో చూడగలను. గురుబోధ అట్ల వినినా మీదట అనగా గురు బోధచే, కల నుండి మేలుకొనే విధానము ఎట్లో ఆ విధముగా పరిపూర్ణ బోధ విని గురు మేల్కొపొందినచో, నీకు గాని నాకు గాని పూర్వము ఉన్న ఎరుక లేకుండా పోవును. ఎరుక పోయిన పిదప నీవు నిన్ను, నేను, నన్ను నిన్ను చూడలేము. ఎరుకలేకపోయినచో నిన్ను నీవని, నేను నేనని నీవని, ఎరుగుట ఉండదు.

**విశేష భావము :** నీ సంగతి జగత్తు యొక్క సంగతి, జగదధిష్ఠాన ఈశ్వరుని సంగతి ఇన్ని విచారణలు యెరుకలోనే జరుగుచున్నవి. యెరుకలోనే గురువు, శిష్యుడు బోధ విచారణలు జరుగుచున్నవి. అట్టి యెరుకను రహిత పర్చే విధముగా, పరిపూర్ణ బోధను వినిన తరువాత యెరుక లేకపోవును. ఆవిధముగా యెరుక రహితమైన పిదప, నేనని, నీవని, జగమని, ఈశ్వరుడని, పరిపూర్ణమనే ఎట్టి నిర్ణయములు ఉండవు. ఈ పద్యము "కల గాంతువు" అనగా కలన్ కాంతువు అనగా ఎరుకలోనే చూచెదవు అని భావము.

**172వ పద్యము : నిను నీవు నన్ను నేనును । నను నీవు నే నిన్ను యెరిగినదె కల, యిది తా । తన నెరుగని దానిని గని । తనకలిమి మృషనుచు దెలచి తానేగనేనీ ॥ అది మేల్కనవి దాన్నెవ్వడెరిగినీ ॥ నను నీవు-నేనిన్ను బోధ వినిపించు విను మాని । యనుట కిద్దరికిప్పుడు మునుపున్న యెరుకేదీ । తానేగెవనీ । అది మేల్కవని దాన్నెవ్వడెరిగినీ ॥**

**దండాన్వయము :** నిను - నీవు, నన్ను-నేనును, నను-నీవు, నే-నిన్ను యెరిగినదె కల (అవిద్య అనే యెరుక) । యిదితా, తనను యెరుగని దానిని గని, తల కలిమి (ఉనికి) మృషనుచు దెలసి తానేగనేని । అది మేల్క । అవలి దాన్నెవ్వడెరిగేనీ । నను నీవు బోధ విను పించమని, నే నిన్ను బోధ వినుమిని అనుటకు ఇద్దరికి ఇప్పుడు మునుపున్న యెరుకేది? తానేగనేని అది మేల్క ॥

**టీక :** కలిమి = కలుగుట, ఉండుట, సంపద

**భావము :** శిష్యా! నీవు నిన్నును, నన్ను నేనును, నన్ను నీవు, నిన్ను నేనును తెలుసుకొనుచున్నది ఏదో అదే కల. అనగా అవిద్య అనే ఎరుకయే సమస్తము తెలుసుకొనుచున్నది. ఈ కల అనే ఎరుకను ఎరుగనిది పరిపూర్ణము. ఈ పరిపూర్ణమును అవిద్య అనే ఎరుక తెలుసుకొనినచో, అదే ఆ ఎరుకనే కలకు మేల్క. (అనగా కల లేకపోవుట, అనగా అవిద్య అనే ఎరుక లేకపోవుట) కనుక అట్టి పరిపూర్ణమును ఎరుక తెలుసుకొని, అందులో ఎరుక లేదు కనుక, ఎరుక ఉన్నదని అనుకొనుట వట్టిది అని తెలుసుకొని, పరిపూర్ణమును చూచి తాను లేకపోవడమే ఎరుకనే కలకు మేల్క. ఆ విధముగా ఎరుక మేల్కొనిన పిదప (ఎరుక లేకపోయిన పిదప) ఆవల పరిపూర్ణము ఉన్నదని గుర్తించే వారు ఎవరు? (ఎవరునూ లేరు) అప్పుడు నీవు నన్ను బోధ చేయమని గాని, నేను నిన్ను బోధ వినుమని గాని అనుటకు మనకిద్దరికి పూర్వము ఉన్న ఎరుకేది? ఎరుక లేదని భావము. (దీనిని బట్టి బోధ చేయుచున్నప్పుడు గురుమూర్తియు, బోధ వినుచున్నంత సేపు శిష్యుడున్ను ఎరుకలోనే ఉందురు అని భావము.)

**అవతారిక :** ఎరుక పరిపూర్ణమును చూడబోవుసరికి ఎరుక పూర్తిగా లేకపోవునని సదృష్టాంతముగా నిర్ణయించుచున్నారు.

**173వ పద్యము : తిమిరారి యందు లేనిదె। తిమిరము తను దానె వచ్చి, తేజోనిధియౌ। తిమిరారి యునికి గనుగొని । తిమిరము తానిలువనట్లు తెలుసుకోరాదా ॥ బయలెరుకాల తెలసియా మీద ॥ భ్రమ రూపమైనట్టి బ్రహ్మాండ మెరుకల । భ్రమ దీసివేసితె భ్రాంతి పుట్టదు మళ్లీ ॥ తెలుసుకోరాదా । బయలెరుకల తెలసి యా మీద॥**

**టీక :** తిమిరారి = చీకటి నశింపజేసేవాడు (సూర్యుడు), తేజోనిధి = ప్రకాశనిధి అయిన, భ్రమ రూపమైనట్టి = లేనిదే ఉన్నట్లు కనిపించే, జనన మరణ రూపమైన, భ్రాంతి మళ్లీ పుట్టదు = ఎరుక తిరిగి పుట్టదు, భ్రమ దీసివేసితె = ఉన్నట్టు కనిపించే లేని దానిని (అవిద్యను)

**భావము :** శిష్యా! సూర్యుని యందు చీకటి లేదు. అట్టి లేని చీకటి తనకు తానే వచ్చి, తేజో నిధియైన సూర్యుని ఉనికి చూడబోవు సరికి చీకటి తనకు తానే లేకపోవును. ఈ విధముగానే పరిపూర్ణములో లేని యెరుక తనకు తానే వచ్చినది. ఆ యెరుక పరిపూర్ణమును చూడబోవు సరికి ఎరుకయే లేకపోవును. లేనిదే ఉన్నట్లు తోచబడే బ్రహ్మాండము ఎరుకల యందు అవిద్య అనే ఎరుకను తీసివేసినచో లేకుండా చేసికొనినచో, ఎరుక తిరిగి పుట్టదు.

**174వ పద్యము : లేదు లేదనుచు యెందరు । వాదించినను లేకపోదు పరిపూర్ణము, దా । పోదు పోదనుచు నిల్పిన । పోదని యనుకోకు యెరుక పోనె పోచుందీ ॥ గట్టిగ లేచి పోనె పోచుంది ॥ వాద భేదము లేని వారిచె యెరుకాది । పాదు పెకలించేటి పద్ధతి నెరిగితే ॥ పోనె పోచుందీ । గట్టిగ లేచి పోనె పోచుందీ ॥**

**టీక :** ఆదిపాదు= మొదట ప్రారంభమైన చోటు, పెకలించేటి = పూర్తిగా తీసివేయునట్టి, పోచుందీ = పోతుంది అనే పదమునకు సనాతన గ్రామ్యపదము.

**భావము :** శిష్యా! పరిపూర్ణ పరబ్రహ్మమును, తెలియకపోవుటచే ఎందురు లేదని వాదించినను లేకపోదు అది శాశ్వతముగా ఉన్నది. అట్లే ఈ దృశ్య మానమైన

యెరుకను ఉన్నది అని ఎందరు (తెలియక) వాదించిననూ యెరుక శాశ్వతమైనది కాదు. ఇది అసలు నిజానికి లేనే లేదు. ఉన్నట్లు కనిపించుచున్నను, చివరకు ఇది లేకపోయేదే. అయితే ఈ యెరుక యొక్క మూలమును (అది ఉన్నచోటును) గురు కరుణచే చూచి పూర్తిగా తొలగించే పద్ధతి తెలసిన వారిచే యీ యెరుక పూర్తిగా లేకుండా చేసికొనవచ్చును. అట్టి వారు తిరిగి పుట్టరు.

**విశేష భావము :** "వాద భేదములేని వారిచే ఎరుక ఆదిపాదు పెకలించేటి పద్ధతి నెరిగిన" - తర్క వితర్కములచే ఎరుకను అహంకారమును పెంచుకొనే వారు కాకుండగ, గురు కరుణచే పరిపూర్ణ బోధను చక్కగా గుర్తించి ఎరుక ఉన్నచోటు అవిద్యను గురు కరుణచే పూర్తిగా లేకుండా చేసికొనువారికి, ఈ ఎరుక లేకపోవును అని భావము. మరియు చతుర్విధ అభావములచే ఎరుక నిరసన, పరిపూర్ణ నిరూపణ చేయవలెను.

చతుర్విధ అభావములు, లేదని నిర్ణయించుట శాస్త్రములో 4 విధములుగా చెప్పబడినది. 1) ప్రాక్భావము, 2) ప్రతిధ్వంసాభావము, 3) అన్యోన్యాభావము, 4) అత్యంతాభావము.

**1) ప్రాక్భావము :** కుండ తయారైన తరువాత ఉన్నది. కాని తయారుకాక ముందు కుండ అనే వస్తువు లేదు. ఈ విధముగా ఎరుక ప్రస్తుతము ఉండుగాక. కాని మొదటి నుంచి ఉన్నది పరిపూర్ణ పరబ్రహ్మము, సనాతనము. అందులో ఎరుక తోచినది. కనుక ప్రాక్భావముచే ఎరుక మొదట్లో లేదు. పరిపూర్ణము సనాతనమై ఉన్నది.

**2) ప్రతిధ్వంసాభావము :** కుండ ఇప్పుడు ఉండుగాక. బ్రద్దలై నశించిన తరువాత కుండ అనే వస్తువు లేదు. అట్లే ఎరుక ప్రతి క్షణము మారుచున్నది. ఇది దీని స్వలక్షణము. కనుక ఒకప్పుడు నశించునదే అని నిశ్చయము. కనుక ఎరుక ప్రతిధ్వంసాభావముచే లేదు అని నిర్ణయము. పరిపూర్ణ పరబ్రహ్మము మార్పులేనిది. కనుక శాశ్వతము, ప్రతిధ్వంసా భావము వర్తించనిది.

**3) అన్యోన్యా భావము :** రెండు పదార్థములు కలియుటచే ఉన్నట్లు కనిపించినా ఆ రెండు పదార్థములు విడిపోతే నశించిపోవును. ఒక చేతిలో శబ్దము లేదు. మరొక చేతిలోను శబ్దము లేదు. రెండు చేతులు కలిసినచో శబ్దము కలిగినది. అంటే

శబ్దము రెండు కలియుటచే మాత్రమే ఉండును. రెండు విడిపోతే నశించును. ఎరుక అవిద్య + ప్రతిబింబ చైతన్యములు కలిసి ఎరుక అయినది. రెంటి కలయిక. రెండు విడిపోతే రెండునూ లేవు. అనగా ఎరుక లేదు. పరిపూర్ణము రెంటి సమన్వయము కాదు. ఒక్కటి మాత్రమే, స్వతసిద్ధమైనది, కనుక శాశ్వతము.



**4) అత్యంతా భావము :** అనగా ఏ కాలమందును లేదు. కుందేలు కొమ్ము, గగన కుసుమము, ఎండమావుల వలె, మాట మాత్రమే తప్ప అవి ఏ కాలమందున లేవు. అట్లాగే ఎరుక ముందు లేదు, వెనుక లేదు. ఇప్పుడు వర్తమానమందున లేదు. బ్రహ్మ జ్ఞానలేమిచే, ఎరుక ఉన్నట్లు అజ్ఞానవృత్తికి మాత్రమే ఉన్నట్లు కనిపించుచున్నది. బ్రహ్మము నందు ఎరుక ఎంత మాత్రమును లేదు. పరిపూర్ణ బ్రహ్మము మాత్రమే ఉన్నది.

కనుక "ఎందరు లేదన్నను - పరిపూర్ణము ఉన్నది. ఎందరు కలదని వాదించినను ఎరుక లేదని నిర్ణయము".



**అవతారిక :** మేను - యెరుక రెండు విభిన్న లక్షణములు కలది అయిననూ రెండును ఒకదానిని విడచి రెండవది ఉండదు. కనుక రెండునూ ఒక్కటే అని నిర్ణయించుచున్నారు.

**175వ పద్యము : మేనెరుకల రెంట్లో నొక । దానిని యడబాసి చేయతరమా పనులన్। మేనికి యెరుకకు, గావున । మేనన యెరుకెరుక యనిన మేనాని యెరుగూ ॥ యీ రెంట్ని నివునేనని యెరుగూ ॥ యెరిగీ వీట్లతో బయలునెరిగీ, మేనెరుకల । తిరిగి చూడకు, చూస్తే గురుని పాదము లాన ॥ మేనాని యెరుగూ॥ యీ రెంట్ని నివు నేవనీయెరుగూ॥**

**భావము :** శిష్యా! శరీరము, అందలి చైతన్యమయిన యెరుక యీ రెంటిలో ఏ ఒక దానిని విడచిననూ, ఏ పనులు చేయ వీలుకాదు. కనుక మేను - యెరుక రెండు ఒకదానికి మరొకటి భిన్నముగా ఉన్ననూ రెండు ఒక్కటే అని తెలియుము. యీ మేనెరుకల రెంటి చేతను పరిపూర్ణమును ఎరిగి, లేని మేనెరుకల విడిచిపెట్టుము. యీ విధమైన నా మాట తప్పి, మేనెరుకలపై బుద్ధి నుంచినచో "గురుపాద సాక్షి"

అని ఒట్టు పెట్టుచున్నాను. (అనగా మేనెరుకలపై బుద్ధిని విడచి, తిరిగి వెనుకటి విధానము అనుసరించవద్దని, గురుపాద సాక్షిగా చెప్పిన పిదప యెరుక బుద్ధిని అనుసరించినచో మహా పాపము సంభవించును. గుర్వాజ్ఞనుల్లంఘున అగునని భావము.

**విశేష భావము :** "మేనెరుకలు" అనగా మేననగా "అవిద్యోపాధి" - యెరుక అనగా అందలి ప్రతిబింబ చైతన్యము, యీ అవిద్య, అందలి ప్రతిబింబ చైతన్యము రెండు విభిన్న గుణములు కలవి అయ్యును, అవి ఒక దానిని విడచి ఒకటి వేరుగా ఎన్నడూ ఉండవు. ఒకటి పోతె రెండునూ పోవును. కనుక రెండును కలిపి ఒక్క యెరుకయే. "ఈ రెండు నీవు - నేనని యెరుగు" అవిద్య శిష్యుడు (అజ్ఞాన రూపము) అనియు, అందలి ప్రతిబింబ చైతన్యము గురుమూర్తి (కేవల జ్ఞాన మూర్తి) అని తెలియుము. ఈ రెండు కలిసియుంటేనే ఎరిగే లక్షణము ఉండును. కనుకనే "వీట్లతో బయలు నెరిగి, మే నెరుకల తిరిగి చూడకు" అన్నారు. అనగా ఎరిగే లక్షణము కలిగిన ఎరుకచే బయలు ఉన్నదనియు, అందులో ఎరుక ఎంతమాత్రము లేదనియు, ఎరుక మృషయని యెరిగి గురు కరుణచే లేకుండా పోవలెనని భావము.



**అవతారిక :** 168వ పద్యమునకు చెప్పిన అవతారికయే. యీ పద్యమునకు కూడా అన్వయము.

**176వ పద్యము : మరుపు సుషుప్తి మూర్ఛయు । మరణంబు సమాధి యనుచు, మానవులెరుకన్ । దొరిగిన నొరుని శరీము । నెరిగెదరా నరుడు మేను నెరుగాడోయన్నా॥ తననైన తానెరుగాడోయన్నా ॥ యెరుగ కుండితె యేమి తిరిగి పుట్టుచు। నుండు తిరిగి ష...షు వాడె గురుబోధ గలిగితె ॥ యెరుగాడో యన్నా । తననైన తానెరుగాడోయన్నా॥**

**టీక :** మరుపు = కోమా స్థితి; ఎరుకందు ఒరిగిన = ఎరుకలోనే వ్రాలిన (ఉన్నా)

**పదవిభాగము :** మరుపు, సుషుప్తియు, మూర్ఛయు, మరణంబు సమాధియు అనుచు మానవులు ఎరుకందు ఒరిగినన్ ఆనరుడు ఒరుని శరీరమును, ఎరిగెదరా? (తన) మేనును ఎరుగడోయన్నా। తననైన తా నెరుగడోయన్నా। యెరుగకుండితె యేమి,

తిరిగి పుట్టచునుండు । వాడే గురుబోధ గలిగితే తిరిగి పుట్టడు ॥

**భావము :** శిష్యా! మరుపు (కోమాస్థితి) గాఢనిద్ర, మూర్ఛ మరణము, సమాధి యీ అవస్థలు పొందిన (ఎరుకందు) మానవులు, తన శరీరమును గాని, యితరుల శరీరములను గాని, తన స్వరూపమును గాని ఎరుగుట లేదు. ఎరుగక పోయిననూ వీరందరు తిరిగి పుట్టుకకు వచ్చే వారే. వీరె గురుబోధ పొంది (గురుకరుణచే మేల్కొనినచో) తిరిగి పుట్టరు.

**విశేష భావము :** పరిపూర్ణ స్థితిని పొందినవారు తన స్థితి గాని ఇతరమును గుర్తించలేరు. ఇట్టి ఎరుగని స్థితి ఎరుకలో ఉన్నవారికి కూడా కొన్ని స్థితులలో కలుగును. అంటే, కోమాస్థితి, గాఢ నిద్ర, మూర్ఛ, మరణము, సమాధి ఈ అవస్థలు ఎరుక ఉండగానే కలిగే అవస్థలు. ఇందులో తనను గాని ఇతరమును గాని ఎరిగే లక్షణము లేదు. అయినను ఎరుక ఉన్నవారే. ఎరుక యొక్క ప్రకాశము శరీరము పై పడక పోవుటచే ఎరుగుట లేదు. కనుక ఎరుక ఉండియు ఎరుగుట లేదు. అందుచే వీరు పునరావృత్తి పొందేవారే. వీరే గురుమేల్క పొంది, ఎరుకను రహిత పర్చుకొనినచో తిరిగి పుట్టరు అని భావము.



**అవతారిక :** ఈ గురుబోధ ఎవరికి పడితే వారికి చెప్పవద్దనియు, అర్హులైన వారికి మాత్రమే తెలియజేయుమనియు, శ్రీ కృష్ణ దేశికేంద్రులవారి (గురు) ఆజ్ఞగా గుర్తించమని తెలియజేయుచున్నారు.

**177వ పద్యము : పరిపూర్ణ మెరుక లివియని ।యెరుగని బయలందు, లేని యెరుక తనకుదా । నరుదెంచిట, గురు శిష్యుల । తెరగువ మాట్లాడి, రెంటిని తెలసి తా జనునూ॥ ఆ పై మాట పలికే దేదికనూ ॥ అరమరలేక నే నెరిగించి నట్టియీ । గురుబోధ పాత్రుల నెరుగక తెలిపేవూ ॥ తెలిసితా జనునూ ॥ ఆ పై మాట పలికేదేదికనూ ॥**

**టీక :** అరమరలేక = మర్మము లేకుండగ, బేధము లేకుండగ, పాత్రుల నెరగక = అర్హులను ఎరుగక.

**భావము :** శిష్యా! పరిపూర్ణమనగా ఏదో, యెరుకనగా యేదో ఎంతమాత్రము తెలియని, పరిపూర్ణ పరబ్రహ్మములో, లేని యెరుక తనకు తానే యేర్పడి, ఇప్పుడు

ఇక్కడ (ఆ యెరుక) గురుశిష్యుల రూపముగా వచ్చి, పరిపూర్ణము, ఎరుకల గురించి చక్కగా విమర్శించి తెలుసుకొని, ఆ తరువాత ఎరుక లేకుండా పోవును. ఆ తరువాత తెలియపర్చువారు కాని, తెలుసుకొనే వారు కాని ఏరి? (పలికేది లేదు) కాని శిష్యా! ఇంతటి గొప్ప బోధను, బోధ తెలుసుకొనే అర్హత ఉన్నదో లేదో (తెలుసుకోవాలనుకొనే వారిని) పరీక్షించకుండగా మర్మమెంత మాత్రము లేకుండగా చెప్పెదవేమో? అలా అనర్హులకు తెలియజేసినచో బోధ యొక్క మర్మధర్మములు గుర్తించలేక విడచి వెళ్లిపోవుదురు. ఆ తరువాత ఏమి చేయగలవు? వానిని ఏమంటే ఏముంది? జాగ్రత్త సుమా? (అని మెలకువ చెప్పుచున్నారు.)

**విశేష భావము :** ఎరుక పరిపూర్ణములో లేనిదే కలవలె లేక ఏర్పడినది. ఇది రెండు రూపములు జ్ఞాన, అజ్ఞాన రూపములు. యీ రెండును కలసి ఒక్క ఎరుకయే. జ్ఞానము గురువు, అజ్ఞానము శిష్యుడు. వీరు బోధ విచారణ చేయుటచే అజ్ఞానమును శిష్యుడు వదలి జ్ఞాన రూపమునకు వచ్చును. ఆ తరువాత పరిపూర్ణమనే మేల్క (గురుమేల్క) పొందినచో పూర్తిగా ఎరుక లేకుండా పోవును. అట్టి వారు మాత్రమే పునర్జన్మకురారు. ఇంతటి గొప్ప బోధను సంస్కారము ఉన్నదో లేదో తెలిసికొనకుండగా ప్రతీ ఒక్కరికీ చెప్పకూడదని గురువాజ్ఞ.

---

**178వ పద్యము : మరపు సుషుప్తి మరణముల్ । పరిపూర్ణంబునకు సాటి పరచి, యెరుకకున్ । మరి యాది మేల్క పుట్టువు । నిరుదెరరుగుల నెరిగి, యెరుక నెగర జిమ్మోయీ ॥ ఆపై నుండే దెరిగే దెట్లో యీ ॥ గురుమంత్ర మిదె సుమ్మీ, మరువాక మే ప్రొద్దు । స్మరణ జేసితె వేని తిరిగి పుట్టవు, నీ వి ॥ ట్లెగుర జిమ్మోయీ । ఆ పై నుండే దెరిగే దెట్లోయీ ॥**

**దండాన్వయము :** మరుపు, సుషుప్తి, మరణముల్, పరిపూర్ణంబునకు । మరియు యాది మేల్క పుట్టువు యెరుకకున్ సాటి పరచి ఇరు దెరుగుల నెరిగి, యెరుకన్ యెగురజిమ్మోయీ ॥

**టీక :** మరపు = కోమాస్థితి, సుషుప్తి = గాఢ నిద్రస్థితి, మరణము = చనిపోయిన స్థితి, మరి = ఇంక, యాది= గుర్తు (జ్ఞాపక స్థితి మేల్క = జాగ్రత స్థితి, పుట్టువు = జన్మించినవాని స్థితి, ఇరుదెరుగుల = రెంటి వైపుల, రెంటి విధమును.

**భావము :** శిష్యా! మరపు సుషుప్తి మరణ స్థితులను పరిపూర్ణ స్థితికిని, అట్లే జ్ఞప్తి జాగ్రత, జన్మస్థితులను ఎరుక స్థితికి సాటి పుర్చుకొని, ఆ విధముగా రెంటిని అనగా పరిపూర్ణము, ఎరుకల రెంటిని తెలసికొని ఎరుక లేనిది కనుక లేకుండా చేసికొనుము. అట్లు యెరుక లేకపోయిన వెనుక పరిపూర్ణము ఉన్నదని ఎట్లు గుర్తించగలవు? గురుమంత్రమిదె, మరువకుము. యీ విధముగా ఎల్లవేళలా గురుమంత్రమును స్మరించుకొనుచుండినచో తిరిగి పుట్టవు.



**అవతారిక :** ధర్మము కలవాడు, విడచిన వస్తువును తిరిగి గ్రహించడనే ఉదాహరణచే, గురు ధర్మముచే ఎరుకను విడిచినవాడు, తిరిగి ఎరుక స్థితికి రాడని నిర్వచించుచున్నారు.

**179వ పద్యము.: క్షితిలోన నరుడు పక్వా । న్నతతిని తిని, కక్కి మరల నాకునె, యతి సం। సృతి విడచి తిరిగి పూనునె । వితరణ శాలిచ్చినట్టి విత్తా మడిగీనె ॥ సత్యవాది సత్యముడిగీనె ॥ ప్రతి లేని గురుబోధ స్థితి జెంది, యెరుకానీ । గతి సంగ్రహించడు, కృతకృత్యుడిచ్చీన ॥ విత్తమడీగినె । సత్యవాది సత్యముడిగీనె ॥**

**టీక :** సంసృతి = సంసారము, వితరణ శాలి = దాన గుణ నేర్పరియైనవాడు, పక్వాన్నతతి = రుచిగల బోజన పదర్థాములు, కక్కి = వాంతి జేసికొని, విత్తము = ద్రవ్యము, కృతకృత్యుడు = చేయవలసిన పని చేసినవాడు.

**దండాన్వయం :** (అట్లనె) ప్రతి లేని గురుబోధ స్థితి జెంది కృతకృత్యుడు ఈగతి యెరుకను సంగ్రహించడు.

**భావము :** శిష్యా! ఈ ప్రపంచము నందు ఏ నరుడైన రుచి గల ఆహార పదార్థములను తిని వాంతి జేసికొనినచో, తిరిగి ఆ వమన పదార్థమును నాకునా? సాంసారమును విడచిన చక్కని సన్యాసి తిరిగి సంసారమును గ్రహించునా? త్యాగశీలుడైన వాడు ద్రవ్యమును ఇచ్చి తిరిగి తీసుకొనునా? సత్యనియమము కలవాడు, సత్యమును విడచునా? అట్టి విధముగానే చేయదలచిన పని, కష్టపడి సాధించిన శిష్యుడు, సాటిలేని పరిపూర్ణ బోద స్థితిని చెంది, తిరిగి ఎన్నడును ఎరుక స్థితిని పొందడు. అనగా ఎరుకను విడచినవాడు తిరిగి ఎరుక స్థితికి రాడు.

**విశేష భావము :** "ప్రతి లేని గురుబోధ స్థితి జెంది" సాటి లేని గురుబోధ స్థితిని పొంది అని ఒక అర్థము. ప్రతిబింబ స్వరూపమైన ఎరుకను రహిత పర్చుకొనినవాడు పరిపూర్ణము వలె, ఎరిగే లక్షణము ఎంత మాత్రము లేని స్థితిని పొందినవాడు తిరిగి ఎట్టి పరిస్థితిలోను ఎరుక స్థితికి రాడు. వాడు పుట్టడు, అని భావము.

---

**అవతారిక :** జ్ఞాన, అజ్ఞానములు రెండును ఒక్కయెరుకే. జన్మకు తీసుకొని వచ్చునవే. పరిపూర్ణము జ్ఞాన-అజ్ఞానములకు అతీతము. అని చెప్పుచున్నారు.

**180వ పద్యము : మరుపన తొలి మేనులు మూడు । యెరుకన నాలవ శరీర, మీ రెండొకటే । పరిపూర్ణ మవలిదీ, వలి । యెరుకను గురువాక్కు చేత యెగుర జిమ్మినను ॥ పోవును లేని దెరిగే దేగినను ॥ యెరిగేదే లేకుంటే యేమో ఆవలిజాడ । నెరిగే వాడెవరింక, యింతే చా లెరుకను ॥ యెగు రజిమ్మినను। పోవును లేనిదెరిగే దేగినను ॥**

**దండాన్వయము :** మరుపన తొలిమేనులు మూడు.... యీవలి యెరుకను గురువాక్కు చేత యెగుర జిమ్మినను, లేనిది పోవును । యెరిగే దేగినను యేమో ఆవలి జాడ । యెరిగేదె లేకుంటె యెరిగే వాడెవరింక, యింతె చాలును ॥

**భావము :** శిష్యా! మరుపనగా మొదటి మూడు శరీరములు అయిన స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు మూడు అజ్ఞాన శరీరములు. ఎరుకనగా నాల్గవ శరీరము - మహాకారణ శరీరము (జ్ఞాన శరీరము) అయినను ఈ రెండూ ఒక్కటే, ఇట్టి జ్ఞాన, అజ్ఞాన, ఉపాధులు కానిది పరిపూర్ణము. మొదట అజ్ఞాన జ్ఞానములు కలిగిన యెరుకను లేనిది అని గురు వాక్యముచే లేకుండా చేసికొనుటకు ప్రయత్నించినచో, యెరిగేదయిన యెరుక లేకుండా పోవును. అట్లు యెరిగే యెరుకలేకపోయినచో ఆవలిది అయిన పరిపూర్ణము యొక్క జాడను తెలుసుకొనే వారెవరు? అలా యెరుక లేకపోయినచో చాలును (కృతకృత్యుడవే).

**విశేష భావము :** మరుపు అనగా అజ్ఞానము, అవిద్య అనే ఉపాధి అయిన ఎరుక. ఇది త్రిగుణాత్మకము. రజ, స్సత్వ, తమో గుణములు కలది. ఈ మూడును పిండాండ

అవస్థలకు కారణము. కనుక స్థూల సూక్ష్మ కారణ శరీరములను సృష్టించేది అవిద్య అనే ఎరుక. ఇందలి ప్రతిబింబ చైతన్యము జ్ఞానము. అవిద్య ఉపాధికి వ్యతిరిక్తమయినది. ఇదే "నేను" అని చెప్పబడే ఎరుక. అజ్ఞానము అయిన అవిద్యయు, జ్ఞానము అయిన ప్రతిబింబ చైతన్యము ఈ రెండునూ ఎరుకయే. ఇట్టి జ్ఞాన, అజ్ఞానములు కానిది అనగా ఉపాధి, ప్రతిబింబములు కానిది పరిపూర్ణ పరబ్రహ్మము అని యీ పద్య భావము. మరియు "యీవలి యెరుకను గురు వాక్కు చేత యెగురజిమ్మినను లేనిది పోవును" మొదటిది అయిన అవిద్య అనే ఎరుకయే సమస్తమును ఎరిగేది. ఈ ఎరిగే (అవిద్య) అనే ఎరుకను గురు మంత్రముచే లేకుండా చేసికొనుము. ఎరిగేది పోయినచో అదే ఎరుకలేని స్థితి, పరిపూర్ణ స్థితి.

**181వ పద్యము : నానావిధావయములు । నానా విధ నామ రూప నటనలు మాయల్। నానా విధాల వూహలు । నేనను యెరుకందె యున్ని నిబిడమై యుండూ॥ బయలును గన తా నిలువ లేకుండూ ॥ నేను, మేనీ రెండు నేనే, నే లేకుంటి। మేను లేదిది లేక నేనిల్చే దిట్లిన్ని ॥ నిబిడమై యుండూ॥ బయలును గన తా నిలువ లేకుండూ ॥**

**టీక :** వూహలు = సంకల్పములు, నిబిడమై యుండు = కలిగియుండు, కూడియుండు.

**భావము :** శిష్యా! నానా విధ అవయములు (ఇంద్రియములు) పేర్లు, రూపములు, క్రియలు, మార్పులు, సంకల్పములు ఈ సమస్తమూ "నేను" అనే అవిద్యా యెరుక యందే కూడియుండును. నేను శరీరము యీ రెండూ నేనే. నేను లేకపోతే మేను ఉండదు. మేను లేకుండా నేను నిల్వదు. యీ రెండు కలసియే ఉండును.

**విశేష భావము :** నామ, రూప, క్రియలు, సంకల్పములు, జన్మ పరంపర సంస్కారములు అన్నియు నేను, నేను అని పల్కే అవిద్య యందే ఉండును. నేను అని పలికేది, సమస్తమును తెలుసుకొనేది యీ అవిద్య అనే ఎరుకయే. ఇందలి ప్రతిబింబ చైతన్యము సత్తా మాత్రము. కేవల సాక్షి మాత్రము "నేను" అని చెప్పబడేది ఇదే అయిననూ ఇది నేను అని పల్కదు "నేను అను ఎరుకందె యున్ని నిబిడమై యుండు" - అంటే ఇవన్నియు అవిద్య యందే ఉండును. ఇదే మేను అని కూడా చెప్పబడును. అప్పుడు ప్రతిబింబ చైతన్యము "నేను" అనబడును. యీ నేను మేనులు రెండును ఒకటి

విడచి మరొకటి యెన్నడు ఉండనేరవు. మేను అని చెప్పబడే నేనవి పలికే అవిద్యను లేకుండా చేసుకోవాలి. అట్టి మేను పోతే అందలి ప్రతిబింబు కూడా లేకపోవును.



**అవతారిక** : దీని వెనుక చెప్పిన భావమునే తిరిగి యీ పద్యములో కూడా నిర్వచించుచున్నారు.

**182వ పద్యము : జగము వలవ సంకల్పము । జగమా సంకల్పమువను జనియించుమ, వే । రగు పడదు జన్మ మందిర । మగుపడదెడబాసి నిల్వవా రెండెన్నటికీ ॥ బయలును గని నీవీ రెంట్నెన్నటికీ ॥ యిక దల్చబోకుము యివి బుట్టటుల్లక్కీ । మృగజల మగుపడ్డ మిథ్యం చెరిగిన మాడ్కి ॥ రెండెన్నటికీ । బయలునుగని నీవీ రెంట్నెన్నటికీ॥**

**టీక** : మృగజలము = ఎండమావులులోని నీరు, మిధ్య = అసత్యము, భ్రాంతి.

**దండాన్వయము** : జగము వలనను సంకల్పము । సంకల్పము వలనను ఆ జగము జనియించును । వేరు, జన్మ మందిరము అగుపడదు । ఆ రెండు ఎన్నటికి ఎడబాసి నిల్వవు । నీవు యీ బయలు గని, ఈ రెంట్ని మృగజలము అగుపడ్డ మిథ్యంచని ఎరిగిన మాడ్కి, యిక దల్చబోకుము. యెన్నటికీ యివి బుట్టుల్లక్కీ ॥

**భావము** : శిష్యా! జగత్తు వలన సంకల్పము, సంకల్పము చేతనే జగత్తు తోచుచున్నది. యీ రెంటికి వేరు (మూలము) పుట్టక స్థానము ఏదియును లేదు. జగత్తు అనగా అవిద్యయు, సంకల్పము అనగా ఎరుకయు, యీ రెండు విడిపోయి ఎన్నడూ ఉండవు. కనుక నీవు శాశ్వతమైన పరిపూర్ణమును చూచి, ఎండమావులయందలి నీటిని మిధ్య యంచని విడచినట్లుగా ఈ అవిద్య, అందలి ప్రతిబింబిత చైతన్యమైన ఎరుకల రెంటిని విడచి పెట్టుము. వీటిలో దేనిని బ్రహ్మము అని తలంచకుము. అట్లు విడిచిపెట్టినచో, యివి తిరిగి పుట్టుట అనేది ఉండదు.

**విశేష భావము** : జగము అనగా సమస్త దృశ్య రూప జగత్తును కల్పించుకొనేది. అదే అవిద్య అనే ఎరుక. సంకల్పము అనగా అవిద్య యందలి ప్రతిబింబమయిన ఎరుక. (సంకల్పము అనగా ఎరుక పేరు) యీ అవిద్య, ప్రతిబింమములు రెండును విడచి ఒకటియు ఉండదు. అవిద్య అనే ఎరుక జడ రూపము, లేనిది. ప్రతిబింబ చైతన్యము

సత్తామాత్రమైనది. యీ సత్తా చేత అవిద్య అనే ఎరుక జడము అయినను, ఉన్నదై సమస్త కార్యములు చేయుచున్నది. అందుచే ఎరుక వలన అవిద్య జనించును అని పద్యములోని భావము. మరియు అవిద్య అద్దము వలె ప్రతిబింబింపజేసుకొనే లక్షణము కలది కనుక అవిద్య, పరిపూర్ణ బ్రహ్మమును తనలో ప్రతిఫలింపజేసుకొనుటచే ప్రతిబింబము అయిన ఎరుక జగము వలన జనించును అన్నారు. యీ రెంటికి ఒకదానికొకటి కారణము, మూలము. ఈ రెంటికి వేరు అనగా మూలము గాని ఇది ఎక్కడ పుట్టినది అనే జన్మ మందిరము (పుట్టుక స్థానము) కాని లేవు. కనుక యీ రెండునూ మూలము లేనివే. మిధ్యా రూపములు. కనుక గురు కరుణచే అవిద్యను లేకుండా జేసికొనినచో అందలి ప్రతిబింబము కూడా అవిద్యతోనే లేకపోవును. ఇట్లు అవిద్య లేకపోయినచో తిరిగి అవిద్య పుట్టదు. అందుచే ప్రతిబింబము రాదు. ఇదే ఎరుక లేని పద్ధతి. లేకుండా చేసుకొనే విధము గురుముఖముగా ఎరుగవలెను.



**అవతారిక :** ఎరుక జగత్తులు ఒకదానికొకటి కారణము. ఎరుక వలన జగత్తు ఏర్పడుచున్నది. పరిపూర్ణము సర్వత్ర ఉన్నది అని యీ పద్య భావము.

**183వ పద్యము : పరిపూర్ణమనెటి పల్కే । యెరుకను బల్పాక్షరములకెచ్చట గనినన్। తిరమైయున్నది కనుగొని । యెరుకను బల్పాక్షరముల నిక గట్టి పెట్టూ ॥ యెవరికి తెలియదిది మూల గుట్టూ ॥ గురుమూర్తి కరుణచే యెరిగి తెల్పితి నేనీ । పరిపూర్ణ బోధను, పరుల జెప్పిన బోధ ॥ నిక గట్టి పెట్టూ । యెవరికి తెలియదిది మూల గుట్టూ॥**

**టీక :** పల్కే = పలక, బల్ప = బలపము, అక్షరములు వ్రాయబడిన అక్షరములు, తిరమై = శాశ్వతమై, కనుగొని = విచారించి తెలుసుకొని.

**పద విభాగము, దండాన్వయము :** పరిపూర్ణము అనేటి పలకే, యెరుక అను బలప, అక్షరములకు ఎచట గనినన్ తిరమైయున్నది. కనుగొని, యెరుక అను బల్ప, అక్షరములనిక కట్టిపెట్టు. ఇది మూల గుట్టు, యెవరికి తెలియదు. గురుమూర్తి కరుణచే నేను యీ పరిపూర్ణ బోధను యెరిగి, తెలిపితి. పరులు చెప్పిన బోధను యిక కట్టిపెట్టు.

**భావము :** శిష్యా! పరిపూర్ణము అనేది పలకగా భావించుకొనుము. యెరుక అనగా బలపము అనుకో. అక్షరములు - జగత్తు అనుకో. పలక పై బలపముతో అక్షరములు వ్రాయబడినవి. అట్లే పరిపూర్ణములో యెరుక లేనిదే ఏర్పడి జగత్తును నిర్మించుచున్నది. అయితే పలక పై ఉన్న అక్షరములకు ఎచ్చట చూచినను (లోపల, వెలుపల, అక్షరము ఉన్నచోట) సర్వత్ర లోపము లేకుండా పలక ఉన్నది. బలపము వల్ల అక్షరములు ఏర్పడినది. పలక వల్ల అక్షరములు ఏర్పడలేదు. అట్లే పరిపూర్ణములోనే యెరుక, జగత్తులు ఏర్పడుచున్నవి. జగత్తుకు ఎచ్చట చూచిననూ పరిపూర్ణము సర్వత్ర శాశ్వతమై యున్నదియు, బలపము వలన అక్షరములు ఏర్పడినట్లుగా, ఎరుక వలన జగత్తు ఏర్పడుచున్నదనియు, బలపము అక్షరములు వస్తూపోతూ ఉండినట్లుగా, ఎరుక జగత్తులు లేనివి, వస్తూపోతూ ఉండేవి. పరిపూర్ణము ఏ వికారము చెందక శాశ్వతమై యున్నదని, ఈ రహస్యము ఎవరికి తెలియదు. నేను గురుమూర్తి కరుణచే యీ పరిపూర్ణ బోధను ఎరిగి నీకు చెప్పుచున్నాను. కనుక ఇతరులు చెప్పిన బోధను కట్టిపెట్టి, ఈ పరిపూర్ణ బోధచే ఎరుక జగత్తులు అశాశ్వతమైనవని విచారించి తెలుసుకొని, ఎరుక - జగత్తులను కట్టిపెట్టుము.

1) పలక - సర్వాధారము, దీనిపైనే అక్షర జగత్తులు ఏర్పడుచున్నవి. | పరిపూర్ణము - శాశ్వతమైనది, వికారము చెందనిది. తన యందు ఏమి జరిగినను గుర్తించనది.

2) బలపము : అక్షరములకు కారణ స్వరూపము. పలక వలన రాలేదు. తనకు తానుగా వచ్చినది. | యెరుక : జగత్కారణము. తనకు తానుగా యేర్పడినది. సమస్త జగత్తును నిర్మించేది. (లేనిది)

3) అక్షరములు - బలపము వలన ఏర్పడినది. పలకలోనే ఉన్నవి. పలకను దాటి లేవు. | జగత్తు (కార్యము) : యెరుక వలన ఏర్పడినది. వికార స్వరూపము. వస్తూ పోతూ ఉండేవి.

ఈ విధముగా 1) పలక - పరిపూర్ణములు, 2) బలపము - ఎరుక, 3) అక్షరములు - జగత్తు

శాస్త్రజ్ఞులు చాలా మంది వస్తు నిశ్చయ జ్ఞానము లేక సమస్త జగత్తుకు కారణమైన అఖండ యెరుకనే బ్రహ్మమని నిశ్చయించుచున్నారు.

కారణ కార్యములు రెండును ఒక్కటే. కనుక కారణమైన అఖండ ఎరుక కార్యమైనది జగత్తు. ఈ రెండును విత్తు వృక్షముల వలే రెండును లేనివే. పరిపూర్ణ బ్రహ్మమే శాశ్వతమైనది. ఎరుక బ్రహ్మము కాదు. అను విషయము చాలా మందికి తెలియదు. కనుక ఇది మూలగుట్టు. పరిపూర్ణ బోధచే మాత్రమే ఎరుక అశాశ్వతమైనది. ఎరుక లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము. ఇది శాశ్వతమైన బ్రహ్మము అని గురు కరుణచే విచారించి తెలుసుకొని, ఎరుక జగత్తులు రెంటిని విడువవలెను.



**184వ పద్యము : చూపించ జూపరానిది। చూపించితి, దాన్ని వుండజూచివవు గదా। చూపించ జూచెనిది, దీ న్నే ప్రొద్దిక దలచబోకు మిదె గురుబోధా ॥ విన్నంటదు ఇతరమే బాధా ॥ నా పాప, నాకూన, నా చిన్న, నాయన్న । నా పెన్నిధానమ, నా రత్నములకొండా ॥ యిదెగురు బోధా । విన్నంటదు వితరమే బాధా ॥**

**భావము :** శిష్యా! వస్తు రూపముగా జూపించుటకు వీలు కాని పరిపూర్ణమును, నీకు చూపించితి. ఆ విధముగా చూపించిన పరిపూర్ణము ఉన్నదని నిశ్చయముగా నీవు చూచితివి గదా! అనగా నీలోని జ్ఞానముచే (యెరుకచే) తెలుసుకున్నావు. ఆ తెలుసుకున్న జ్ఞానమైన యెరుకను ఏ కాలమునందున ఉన్నదని తలపెట్టకుము. ఇదే అఖండమైన గొప్పదైన బోధ. (పరిపూర్ణ బోధ). యీ విధముగా నీవు ఎరుకను విడచి ఉన్నచో జనన మరణ రూపమైన ఎరుక బాధలు నిన్నంటవు. నా బిడ్డా! నాకుర్రా, నా చిన్న, నాముద్దుల కొడుకా, నా పెన్నిధానమా, నా రత్నాల కొండా! (శిష్యుని పై ఉన్న ప్రేమతో చెప్పిన సంబోధనలు) యీ ఎరుకను విడచి ఉండుము, యీ పరిపూర్ణ బోధను విడువకుము.

**విశేష భావము :** పరిపూర్ణము శబ్ద, స్పర్శ, రూప, రస గంధములకు గాని బుద్ధికి గాని అందనిది. అందుచేతనే ఎరుక లేనిది, అట్టి దానిని చూపించుటకు, చెప్పుటకు శక్యము గాదు. చూపించ జూపరానిది అంటే పరిపూర్ణ పరబ్రహ్మమును అని అర్థము. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహా" అన్నారు. కనుక చూపించచూపరానిది

అనే మాటలు పరిపూర్ణము అనే పదమునకు విశేషణ వాచకములుగా అర్థము చెప్పవలెను. అట్టి పరిపూర్ణమును "గవయమృగ" న్యాయముగా చూపించిరి. చూచినట్లు తెలుసుకొన్న ఏ జ్ఞానము (యెరుక) ఉన్నదో, ఆ ఎరుకను విడచినచో ఉన్నది అంతా పరిపూర్ణమే అని తెలుసుకొని ఎరుకను విడచిపెట్టమని భావము. గవయ మృగమును చూచినట్లుగా పరిపూర్ణమును చూడవలెను. ఇది గురుముఖము.

అట్టి పరిపూర్ణమును గురించి, ధృఢముగా గుర్తిచిన శిష్యుని జూచి గురుమూర్తి సంతోషమును పొంది నా రత్నముల కొండా, నా పెన్నిధానమా ఇత్యాది సంబోధనలతో, శిష్యుని మీద ఉన్న అత్యంత ప్రేమను ఈ పద్యములో చెప్పిరి. ఇదే అవ్యాజ కరుణ.



**అవతారిక :** పరిపూర్ణము ఎరుకల యందు ఉన్న ముఖ్యమైన భేద లక్షణములను గుర్తింపజేయుచున్నారు.

**185వ పద్యము : నామము రూపము నటన । స్తోమము బయలందు లేదు చూడుము నీవా । నామము రూపము నటన । స్తోమము యెరుకందు గలదు చూడు మీ నిజమూ॥ బయలెరుకాల జూచి చూడకము ॥ వేమారునే నెంత వినచెప్పినా గాని॥ యీ మార్గమె తప్ప యిక లేదు రెండోది ॥ చూడు మీ నిజమూ । బయలెరుకల చూచి చూడకుము.**

**టీక :** స్తోమము = సమూహము, వేమారు = అనేక పర్యాయములు.

**భావము :** శిష్యా! నామ, రూప, క్రియా సమూహము పరిపూర్ణ పరబ్రహ్మము నందు లేదు, గుర్తించుము. ఆ నామ రూప నటన సమూహము యెరుకలో గలదు తెలుసుకొనుము. నీవు ఈ విచారణచే యీ నిజమును అనగా పరిపూర్ణమెట్టిదో, ఎరుక ఎట్టిదో చక్కగా తెలిసికొని ఎరుకను విడచిపెట్టుము. నేను నీకు అనేకమార్లు ఎంత బోధించిననూ, యీ విధానమె తప్ప, పునరావృత్తి రహితమునకు రెండో మార్గము మరేదియు లేదు.

**విశేష భావము : 1)** బయలెరుకల జూచి చూడకము, అనగా పరిపూర్ణము యొక్క శాశ్వతమును, యెరుక యొక్క మిధ్యాస్వరూపత్వమును చక్కగా గుర్తించి, ఆ

గుర్తించిన జ్ఞానమే యెరుక అని, యెరుకను విడచినచో, పిదప పరిపూర్ణమున్నదని గాని, యెరుక లేదని గాని చెప్పలేని స్థితి యే - బయలెరుకల జూచి చూడకుము.

2) బయలు శాశ్వతమైనదని, ఎరుక లేనిదని తెలుసుకొని, బయలును చూచి, ఎరుకను చూడకుము. అని భావము. అనగా ఎరుకను విడచి పెట్టుము, అని భావము. నేనెంత జెప్పిన పరిపూర్ణము ఉన్నదనియు, ఎరుక లేదనియు, ఎరుకను విడచిపెట్టుటయే జన్మ రహితమునకు మార్గము అనియు, ఇది తప్ప జన్మ రహితమునకు రెండవ మార్గమేదియు లేదనియు నిష్కర్షగా చెప్పుచున్నారు.

**అవతారిక :** పరిపూర్ణము ద్రాష్టాంతముగా చెప్పుచున్నారు.

**186వ పద్యము : గురుడు గురుబోధ శిష్యుని । కెరిగించెటి వేళ్ల శిష్యుడెరిగెటి వేళ్లన్। యిరువురు వైశ్వానర, క । ర్పురముల వలె వెలిగి యవల పొడ జూప రోయీ ॥ అట్లనె నీ విక్కడ తెలియుమోయి ॥ పరిపూర్ణ మెరుకల నెరిగి యా మీదట । యెరుకను విడచుటే గురు బోధంచెరుగుము ॥ పొడ జూపరోయీ । అట్లనె నీ విక్కడ తెలియుమోయీ ॥**

**టీక :** పొడజూపరు = జాడకూడ కనపడరు, వైశ్వానర = అగ్ని, కర్పూరము = హారతి కర్పూరము, అవల = ఆ తరువాత.

**భావము :** శిష్యా! గురుమూర్తి శిష్యునికి పరిపూర్ణ బోధ తెలియపర్చేటప్పుడు, శిష్యుడు తెలుసుకొనేటప్పుడు, ఆ గురు శిష్యులు ఇద్దరూ, అగ్ని శిఖ, హారతి కర్పూరముల వలె సంయోగముగా వెలిగి (విచారణ జేసి) ఆ తరువాత కనపడరు. ఆ విధముగా నీవు ఇక్కడ తెలుసుకొనుము. పరిపూర్ణము యెరుకలను చక్కగా విచారించి తెలుసుకొని, యెరుకను విడచుటయే గొప్పదైన పరిపూర్ణ బోధ అని తెలుసుకొనుము.

**187వ పద్యము : సతికౌగిట తత్పతి। త్పతి కౌగిట సతియు జేరి పవళించి కలన్ । మృతి జెంది మేలుకొని, సు । స్థితులై యొకరొకరి కట్టి చేష్టా దెల్పుదురా ॥ సిగ్గెడలి, యా చేష్టా నిల్పుదురా ॥ ప్రతిలేని గురుబోధ స్థితి జెంద్యట్లనె, సం। తతి తిరిగి లేనెరుక గతి యుట్టిదని దాని ॥ చేష్టా దెల్పుదురా । సిగ్గెడలి యా చేష్టా నిల్పుదురా॥**

**టీక :** కౌంగిట = కౌగిట అను పదమునకు ప్రాంతీయ వాడుక భాష. సంతతి = విరవి, అనగా విస్మృతి, గతి = విధానము.

**భావము :** శిష్యా! కలలో భార్య భర్తలిద్దరూ పరుండి కౌగిలించుకొని రతించి పిదప గాఢ నిద్ర స్థితిలోనికి పోయి ఉదయమున మేల్కొనిన తరువాత ఆ భార్యభర్తలు ఒకరితో నొకరు రాత్రి జరుపుకొన్న రతి క్రీడా ముచ్చటలు గురించి చెప్పుకుందురా? సిగ్గు విడచి ఆ క్రీడ ఈ విధముగా చేసుకొన్నాము అని తిరిగి చేసుకొనగలరా? అదే విధముగా సాటిలేని పరిపూర్ణ బోధ స్థితిని పొందినవాడు, ఎన్నడైనను ఎరుక గతి, దానిచేష్ఠల, తిరిగి పొందగలడా ? పొందలేడు. అనగా పరిపూర్ణ స్థితిని పొందినవాడు ఎన్నడూ ఎరుక స్థితికి రాడు. అనగా పునర్జన్మకు రాడు, అని భావము.

**విశేష భావము :** కలయందు అనగా ఎరుకలో అనగా జాగ్రదవస్థలో ఇద్దరు కౌగిలించుకొని పరుండి, రతించి, మృతి జెంది అనగా ఇది మన్మథావస్థ.

మరణము అని అర్థము కాదు, రత్యానంతరం ఏమీ తెలియని స్థితిలో నిద్రించుట అని అర్థము. మన్మధావస్థలు 10. 1) చక్షుఃప్రీతి, 2) మనస్సంగమము, 3) సంకల్పము (క్రీడించాలనే కోరిక), 4) జాగరము (నిద్ర పట్టకుండుట) 5) కార్శ్యము (కృశించుట) 6) విషయ విద్వేషము (ఏ పని చేయాలని లేకుండుట) 7) లజ్జాత్యాగము (సిగ్గు విడుచట) 8) ఉన్మాదము(పిచ్చి), 9) మూర్ఛ, 10) మరణము. రత్యానంతర స్థితి. ఇందులో చెప్పబడిన 9 అవస్థలు అయిననూ ప్రేమ ఫలించకపోయినచో చనిపోవుటకు సిద్ధపడుట, మరణము లేక ప్రేమ ఫలించి రతిక్రీడ జరిపిన తరువాత యేమీ తెలియని స్థితిలో ఎవరికి వారు వేరుపడి గాఢ నిద్ర పొందుట మరణము.

శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు ఈ కందార్థ భావమును ధృడపరచుటలో దృష్టాంతముగా కొక్కోక గ్రంథము నుండి ఈ దృష్టాంతము చెప్పినారు. మన్మధావస్తలు 10 కొక్కోక గ్రంథములో చెప్పబడినవి. యేమీ ఎరుగని స్థితి మూర్ఛ. గాఢ నిద్ర పొందుట మరణము.

ఇది శ్రీ మద్భాగవత కృష్ణ దేశికేంద్ర విరచిత
ద్వైతాద్వైత రహిత పరమతత్వే
గురుమంత్ర ప్రతాపన్నామ
నవమోధ్యాయమునకు భావ విశేష భావములు సమాప్తము.

# నవమోధ్యాయమునకు సంక్షిప్త భావము

సమస్తమును ఎరిగేది ఎరుక. అనగా తనను ఇతరమును కూడా యెరిగేది యెరుక. ఇంతే కాదు, ఎరుగను అను అజ్ఞాన దశ కూడా యెరుకయే. అనగా జాగ్రత్త, స్వప్న, సుషుప్తి, తురీయ, తురీయాతీత, దశలలో నుండేది యెరుకే. ఈ అవస్థలకు మూలకారణమైన సాక్షి చైతన్యము (అవిద్యా ప్రతిబింబ చైతన్యము) యెరుకే కాని బ్రహ్మము కాదు. ఈ సాక్షి చైతన్యమే "లేని యెరుక". సమస్త వాఙ్మయమును రచించేది తెలుసుకొనేది యెరుకయే. సమస్త పిండ బ్రహ్మాండములను సృష్టించేది యెరుక. అందలి చైతన్యము యెరుక. ఈ విషయములు పరిపూర్ణము ఎంత మాత్రము ఎరుగదు. ఎందు చేతననగా పరిపూర్ణములో ఎరిగే ఎరుక ఎంత మాత్రము లేదు. కనుకనే సూర్యుని చూడబోతే చీకటి పూర్తిగా నశించిపోయినట్లు పరిపూర్ణము యొక్క జాడ గనినంతనే, యెరుక పూర్తిగా నశించిపోవును.

సహస్రారమందలి నిర్గుణ చైతన్యమును కొందరు బ్రహ్మము అన్నారు. అవిద్య, మాయ, ఎరుకయే కాని, బ్రహ్మము కాదు. అవన్నియు ఎరుకే, ఉపాధిగతము, మరియు కేవల ప్రతిబింమమునకు ఉనికి లేదు కనకు అదియును ఎరుకయే కాని బ్రహ్మము కాదు. మరణము, మరుపు, జాగ్రత్త, సుషుప్తి, స్వప్న, మూర్ఛ, సమాధి ఈ అవస్థలన్నియు ఎరుకయే. ఎరుకకే ఎరుగుట మరచుట అను రెండు భిన్న లక్షణములు కలది. పరిపూర్ణమునకు ఏ అవస్థలు, ఏ లక్షణములు లేవు.

ఇట్టి యెరుక యొక్క మూలము, పుట్టుక స్థానమును చక్కగా గురుముఖతా విచారించి తెలుసుకొని, గురు వాక్యముచే ఆ మూలమును ఛేదించినచో యీ యెరుక పూర్తిగా లేకుండా పోవును. మళ్లీ తిరిగి పుట్టదు, శాస్త్రజాలము చేత గాని, మరియే యితర యోగ సాధనల చేత గాని యెరుక నశించదు. గురు కరుణచే యెరుక యొక్క ఆదిపాదుపెకలించే పద్ధతి తెలపిన వారికి ఈ యెరుక నిల్వదు.

ఈ యెరుక సంగతి ఎంతమాత్రము ఎరుగనిది పరిపూర్ణము. తన విషయము కూడా తనకు తెలియదు. ఎందుచేతననగా పరిపూర్ణములో ఎరుక లేదు కనుక. పరిపూర్ణము ఎరుకకు మూలము కాదు. ఎరుకతనంత తానుగా కలవలె లేక తనకు తానుగా తోచినది. దీనికి మూలము ఏదియు లేదు. ఇట్టి ఎరుకను విడచిన వారే పరిపూర్ణ స్థితి కలవారు. అనగా జన్మరహితులు. కేవలము గురుకరుణచే మాత్రమే ఎరుకను లేకుండా జేసికొనవలెను. మరియే యితర మార్గముల వలన ఎరుక నశించదు. అట్టి ఎరుకను లేకుండా జేసికొనుటయే జన్మరహితము. అట్టి వారు తిరిగి జన్మించరు.

॥ జై గురు ॥

## అధ్యాయము - 10

# 10. బోధ ధృడీకరణము (5)

**అవతారిక :** రాకపోకలు లేనిది పరిపూర్ణము. యెరుకయేకాలమందున లేనిదే, అని ధృడమయ్యే పర్యంతము, ఉన్నది పరిపూర్ణము లేనిది యెరుక అనే మంత్రమును జపించమని ఈ అధ్యాయములో 5 పద్యములలో ధృడీకరించుచున్నారు.

**188వ పద్యము : రానిది పోనిది బయలని । లేనిది యీ యెరుకయనుచు లెస్సగ ధృడమౌ । దానుక, నీవీ మంత్రము, మానక జపియించుచుండుమా, నీతిశాలీ ॥ లేనిది లేదు మరువాకీ జోలీ ॥ లేనిది లేదని పూని నిశ్చయమైతే । తానొక్కటుండును గాని యెట్లన, విను ॥ మా, నీతి శాలి । లేనిది లేదు మరువకీ జోలీ ॥**

**టీక :** జోలి = విధానము, వృత్తాంతము, పూని = ప్రయత్నించి.

**భావము :** జనన మరణములు లేనిది పరిపూర్ణము అనియు, యీ యెరుక లేనిది అనియు, బాగగ నీ మనస్సునకు ధృడమయ్యే పర్యంతము ఈ మంత్రమును మానక జపించుచుండుసుమా. ఓ నీతిశాలి అయిన శిష్యా! లేనెరుక లేనేలేదు. ఈ విధానమును మరువకు. లేనిది అయిన యెరుక యెంత మాత్రము లేదని నీ ప్రయత్నముచే నిశ్చయమైనచో పరిపూర్ణమొకటి ఉండును, కాని అది ఉన్నది అని ఎట్లనగలవు ?

**విశేష భావము :** ఈ పద్యములో "రానిది పోనిది బయలని" లేనిది యీ యెరుక అని అదే మంత్రముగా భావించి, మనస్సునకు ధృడమయ్యే పర్యంతము జపించమన్నారు. మరొక విధానము 1) లేనిదే ఉన్నట్లుగా తోచబడేది ఎరుక. 2) మొట్టమొదటి నుండి అనగా ఏకాలమందున లేనిది యెరుక. 3) పరిపూర్ణ బ్రహ్మమే ఉన్నది అందులో ఎంతమాత్రము లేనిది యెరుక అని ధృడమయ్యేంత వరకు జపించమన్నారు. ఈ ధృడము వలన ఎరుక లేనిది అని నిశ్చయమగును. కాని ఎరుక లేకుండా పోదు. అందుచే చివరన "లేనిది లేదని పూని నిశ్చయమైతే" అన్నారు. లేనిది అనగా ఎరుక అని అర్థము, ఎరుక లేదని ప్రయత్నముచే నిశ్చయమైతే అని భావము. అనగా ఎరుక లేకుండుటకు ప్రయత్నము చేసి ఎరుకను లేకుండా చేసుకొన్నట్లయితేనే ఎరుక లేపోవును అని భావము. ఆ ప్రయత్నమే "గురు కరుణ"ను

గురు ధాన్యముచే పొందుట. ఆ గురుకరుణచే మాత్రమే లేని ఎరుక అనగా "అవిద్య" నశించిపోవును. అవిద్య నశించిపోయినచో అందలి ప్రతిబింబము కూడా లేకపోవును గదా! ఇదే ఎరుక రహిత విధానము. ఇది గురుముఖము.

**189వ పద్యము : ఉన్నది పరిపూర్ణము, లేం । దెన్నటికీ యెరుక యనుచు నిధి ధృడమౌ, దా । కెన్నుము, నే బోధించిన । తిన్నని యీ బోధ శిష్యతిలకా మరువకు మీ। సుజనుల మ్రోలపలుక వెరువకు మీ ॥ విన్ను కుమతులు వచ్చి నీలోతడిగితె వారి । కెన్ని విధముల నీ వెరిగింపకిది శిష్య । తిలకా మరువకుమీ । సుజనుల మ్రోలపలుక వెరువకుమీ ॥**

**టీక :** తిన్నని = యుక్తమైన, కుమతులు = దుష్టులు, మ్రోల = ఎదుట, వెరువకు = భయపడకు, నీలోతు అడిగితే = నీ ధృడమైన భావము అడిగినచో.

**భావము :** ఓ శిష్య శ్రేష్ఠుడా ! పరిపూర్ణ పరబ్రహ్మమె సర్వకాలములయందు సర్వత్ర శాశ్వతమై యున్నదనియు, లేని యెరుక, యెన్నడూ లేదనియు, నీకు ధృడమయే వరకు, నే బోధించిన ఈ యుక్తమైన (సరి అయిన) బోధ మరువకుండా మననము చేయుచుండుము. యీ బోధను సుజనుల యెదుట చెప్పుటకు భయపడకుము, కాని దుష్టులు వచ్చి (ఇతర సంప్రదాయకులు) యీ బోధ యొక్క మర్మధర్మములు ఎన్ని విధములుగా అడిగిననూ వారికి చెప్పకుసుమా! యీ మాట మరువకు.

**190వ పద్యము : పరిపూర్ణము నెరుకను, నే । నెరిగించితి, నీవు, రెంటి నెరిగితివి కదా! ఎరుకను గురు దక్షిణగా । మరివేగిరమివ్వు వట్టి మాట లేమిటికి ॥ యెరుకతో యింకకూటా మేమిటికి ॥ పరులు నేవనియేటి భావ మభావమై । నిరతాము నొక రీతి నిలచుండు మిక వట్టి ॥ మాటాలేమిటికి । యెరుకతో యింకకూటా మేమిటికీ॥**

**టీక :** కూటము = కూడిక, అభావము = లేకపోవుట.

**భావము :** శిష్యా! పరిపూర్ణ పరబ్రహ్మమును, యెరుకను నేను నీకు తెలియపర్చితిని, నీవు రెంటిని చక్కగా తెలసికొన్నావు గదా! అయితే యెరుకను గురుదక్షిణగా వెంటనే ఇమ్ము. వట్టి మాటలు వద్దు. ఆతరువాత యెరుకతో కూడికవద్దు. అనగా ఇతరమని

నేనని (జగత్తు - ఆత్మ అని) అనే భావము లేకుండగ ఎల్లప్పుడు ఒక్క రీతిగానే (చలన, సంకల్పము లేకుండగ) ఉండుము. యెరుకతో పొందు విడచి పెట్టుము.

**విశేష భావము :** విద్య పూర్తి అయిన పిదప గురువు శిష్యుని గురు దక్షిణ అడుగుట, గురువు అడిగిన దక్షిణ శిష్యుడు భక్తివినయములతో ఇచ్చుట శిష్టాచారము. అందుచే ఈ పద్యములో గురుమూర్తి తాను చెప్పదలచిన విద్య పూర్తిగా చెప్పి శిష్యుని మనస్సుకు అతికినందువలన, గురు దక్షిణగా, "ఎరుక"ను ఇయ్యుమని కోరెను. అనగా "నేను" అనే దాన్ని విడచి పెట్టమనెను. శిష్యుడు గురుమూర్తి వద్దకు శరణుజొచ్చినపుడు (26వ పద్యం) "మొదలచలము నెరిగించెద, విదితముగా లేని యెరుక వివరింతు పయిన్। తుదకెరుకను విడిపించెద" అని అన్న మాట ప్రకారముగా ఎరుకనే గురుదక్షిణగా అడిగి తీసుకొనుచున్నాడు. ఎరుకను గురు దక్షిణగా ఇచ్చితిని అనే వట్టి మాటలు పలుకవద్దు. ఎరుకను ఇచ్చినావు కనుక ఆ ఎరుకతో కూడకుము., అని ఆజ్ఞాపించినారు. అట్టి వాని స్థితి ఎట్లుండునో తెలియపరుస్తూ, ఇతరమని నేననే ఏ నిర్ణయములు లేకుండగా (స్వప్నములో సంచరించినట్లుగా) ఏ భావములు లేకుండగా లేక ఉండుము అని ఆదేశించిరి.



**అవతారిక :** ఎరుకను గురుదక్షిణగా ఇచ్చిన శిష్యుని పద్ధతిని తెలియపర్చుచున్నారు. (191, 192 పద్యములు)

**191వ పద్యము : పరిపూర్ణ మెరుక లివియని । గురువరు డెరిగించి యెరుక కూటమి మాన్పన్ । గురువుకు, గురు వెవరనుటకు మరి శిష్యుని కింకనోట మాట వెళ్లినా ॥ పోయిన యెరుక మళ్లీ మళ్లీనా ॥ గురు శిష్యులవియేటి గురుతెన్న డెరుకగ, నిరతము యొకరీతి నిలచున్న బయలందు ॥ మాట వెళ్లినా । పోయిన యెరుక మళ్లీ మళ్లీనా॥**

**టీక :** మాట వెళ్లీనా = మాట బయటకు వచ్చునా, మళ్లీ, మళ్లీనా = తిరిగి వచ్చునా? నిరతము = ఎల్లప్పుడు.

**పద విభాగము :** "యెరుక కూటమి మాన్పన్ గురువుకు! గురువెవరనుటకు శిష్యునికి ఇక మాట వెళ్లీనా" ।

**భావము :** గురుమూర్తి పరిపూర్ణము, యెరుక ఇది యని వస్తు నిశ్చయముగా తెలయపర్చి, శిష్యుని ఎరుకతో సహవాసము విడిపించగా, గురువునకు గాని, శిష్యునికి గాని, ఏ విధమైన మాట అయినా వచ్చునా? రాదు. ఎందుచేతననగా పోయిన యెరుక తిరిగిరాదు కదా, జ్ఞానము -అజ్ఞానము అనే ద్వంద్వ రూపముగానున్న ఎరుకను ఎప్పుడు భావించకు, ఒకే రీతిగా ఉన్న పరిపూర్ణ పరబ్రహ్మము యందు పోయిన యెరుక తిరిగిరాదు. కనుక అట్టి విధముగా ద్వంద్వ ఏకములు కాక అభావుడై లేకయుండుము.

**విశేష భావము :** యెరుకను విడచిన శిష్యునికి గురువు శిష్యుడు అని భావము రాదు. అనగా ఇది జ్ఞానము, ఇది అజ్ఞానము అనే ద్వంద్వము లేనివాడై ఉండును. అట్టి వానికి గురువు ఎవరు? అనే ప్రశ్న సందేహ, అనుమాన, సంభ్రమ, ఆశ్చర్య జనకములైన సంకల్పములు కలుగవు. గరుకరుణచే ఎరుక పోయినచో, లేనిది లేకపోయినది అని భావము. ఇక తిరిగి ఎట్లువచ్చును? ఎరుక భ్రమరూపము. భ్రమ తొలగినచో తిరిగి భ్రమరాదు కదా! ఇది "ఎండమావుల నీరు" అని తెలిసిన తరువాత, తిరిగి ఎండమావుల నీటి భ్రమ కలుగదు కాద! కనుక పోయిన ఎరుక తిరిగి పుట్టదు. ఇది నిశ్చయము.



**192వ పద్యము: స్థిరమగు పరిపూర్ణము, వ । స్థిరమగు యీ యెరుక, నెరుక దెలియు జగములన్ । యెరిగిన దెరుకే కద, స । ద్గురు కృపచే యెరుక పోతే గురు శిష్యులేరీ॥ నో రెత్తాక మరి విన రోరీ ॥ గురుని పాదములాన గురుతు లేనటువంటి । పరిపూర్ణ మొకటుండు పలుకరాదట్లుంటె ॥ గురు శిష్యులేరీ । నో రెత్తాక మరివిన రోరీ ॥**

**పద విభాగము :** స్థిరమగు పరిపూర్ణమును, అస్థిరమగు యీ యెరుకను, యెరుక తెలియు జగములన్ । యెరిగినది యెరుకే కదా ॥ సద్గురు కృపచే యెరుకపోతే గురు శిష్యులేరీ । ఓరీ నోరెత్తక మరి వినర । గురుని పాదములాన గురుతులేనటువంటి పరిపూర్ణమొకటుండు ॥ అట్లుంటె పలుకరాదు.

**భావము :** శిష్యా! శాశ్వతమైన పరిపూర్ణమును, అశాశ్వతమైన (లేనటువంటి) ఎరుకను, యీ యెరుకవల్ల ఏర్పడిన జగత్తును తెలుసుకొనేది యెరుకే కదా! సద్గురు కృపచే

అట్టి యెరుకపోతే ఇక గురు శిష్యులు జ్ఞాన - అజ్ఞానములు, పరిపూర్ణము యెరుక అనే ఏ విషయము లేక ఉండుము. తిరిగి మాట్లాడకుండ వినము. గురుపాద సాక్షిగా చెప్పుచున్నాను. ఎరుక పోయిననూ పరిపూర్ణము మాత్రము అట్లనే ఉండును. అది తప్ప సమస్తము లేకపోవును. కాని ఎరుక లేని స్థితిలో ఉన్నచో పరిపూర్ణముండును అని ఎట్లు చెప్పగలవు? ఉన్నదనే ఎరుక ఉండునా? ఉండదు అని భావము.

**విశేష భావము** : ఎరుకపోతే, ఎరుక వలన ఏర్పడిన సమస్త జగత్తు లేకపోవును. ఆలాగు ఏమీ లేదు అని శూన్యవాదము కాదు. యెరుకతో వచ్చిన సమస్తము పోయినది కాని ఎరుకకు ముందునుంచే అనాది స్వతస్సిద్ధముగా ఉన్న పరిపూర్ణ పరబ్రహ్మము ఏ విధమైన మార్పు లేకుండగ ఉండును, అని గురుపాద సాక్షిగా అది ఉండు, కాని అది ఉన్నదని ఎరుకలేని స్థితిమంతుడు ఎట్లు చెప్పగలడు? ఎరుక, పరిపూర్ణము వలన రాలేదు. పరిపూర్ణము ఎరుక వలన రాలేదు. కనుక ఎరుక పోయిననూ పరిపూర్ణము శాశ్వతము, ఎరుక ఏ కాలమునందును లేనిదే అని భావము.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతాద్వైత
రహిత పరమతత్త్వే
బోధ ధృడీకరణ న్నామ
దశమోధ్యాయమునకు భావ విశేష భావములు సమాప్తము

# 10వ అధ్యాయమునకు సంక్షిప్త భావము

ఈ అధ్యాయములో పరిపూర్ణ పరబ్రహ్మము రాకడ పోకడ లేనిది, (జనన మరణములు) శాశ్వతమైనదనియు, సనాతనమైనదనియు, యెరుక, యెరుక వలన ఏర్పడిన జగత్తులు ఎంతమాత్రము లేనివనియు, యెరుక లేనిదే మిథ్యా స్వరూపమనియు, ఈ ఎరుక వలనే ఈ సమస్త జగత్తు ఏర్పడుచున్నదనియు, సద్గురుమూర్తి కరుణచే యెరుకపోతే యెరుక, యెరుక వలన ఏర్పడిన జగత్తు రెండు కూడా పూర్తిగా లేకుండా పోవును అనియు, ఒకసారి ఆ విధంగా లేకపోయిన ఎరుక తిరిగి పుట్టదనియు, కాని యెరుక పోయినను పరిపూర్ణము మాత్రము శాశ్వతమై ఏ రకమైన మార్పులు లేక అట్లనే ఉండుననియు, కాని ఎరుక పోయిన వెనుక పరిపూర్ణము ఉన్నదని కాని, ఎరుకలేదని కాని చెప్పుటకు (ఎరుక లేదు కనుక) సాధ్యము కాదనియు చెప్పినారు.

ఎరుక పరిపూర్ణము వలన రాలేదు, పరిపూర్ణము ఎరుకకు ముందునుంచే స్వతస్సిద్ధమై సనాతనమై యున్నది. కనుకనే ఎరుక పోతే పరిపూర్ణము అలానే ఉండును. పరిపూర్ణము ఉన్నదని ఎరిగేది ఎరుకయే. గురు కరుణచే పరిపూర్ణమును చూసి లేకపోయేది ఎరుకయే. పరిపూర్ణము వచ్చేది కాదు, పోయేది కాదు, జ్ఞానము - జ్ఞేయము కూడా కానిది. అది ఉన్నదని గురు కరుణచే సూచనగా తెలియబడేది మాత్రమే. యెరుక లేనిదే ఉన్నట్లు తోచబడేది, ఎరుక ఎరుకకే ఉన్నట్లు తోచబడును. ఉన్నట్లు తోచబడుటకు కారణము అవిద్య, లేక అంతఃకరణ అనేది. గురుకరుణచే అవిద్య లేకుండా పోయినచో, ఎరుక పూర్తిగా లేకపోవును. ఎరుక పూర్తిగా పోయినను పరిపూర్ణము శాశ్వతముగా ఉండును. ఎరుక లేదనిన తరువాత, పరిపూర్ణము ఉన్నదని గుర్తించుటకు ఎరుక లేకపోవుచున్నది. అంతేకాని పరిపూర్ణము లేదు అని అనరాదు, గురుపాద సాక్షిగా పరిపూర్ణము సర్వకాల, సర్వావస్థల యందు, ములు గుచ్చ సందులేక, వికార రహితమై, శాశ్వతమై ఎరుక లేనిదయిన పరిపూర్ణము ఉన్నది. ఇదే నిజ గురుబోధ (దృఢీకరణము)

॥ జై గురు ॥

## 11వ అధ్యాయము

# బోధ స్థితి పురుష లక్షణము (6)

**అవతారిక :** పరిపూర్ణ స్థితి పొందిన (ఎరుక విడచిన) పురుషుడు ఏ విధముగా ఉండునో, ఈ అధ్యాయములో వివరించుచున్నారు.

**193వ పద్యము : గురుడచల చలములను తన । కెరిగించిన శిష్యుడెరిగియెరుకై యుండన్ । యెరుకను నిల్పకు మనివను । యెరుకను విడనాడి శిష్యుడెట్లుండు నంటే ॥ అట్లనె, నేనింకెట్లుండునంటే । పురుషుడు లేనట్టి పొలతి సౌందర్యము । మరి మరి కలిగుండి, మరి లేనట్లని యంటి । యెట్లుండునంటే । అట్లనే, నేనింకెట్లుండునంటే॥**

**టీక :** అట్లనె = ఆ విధముగానే (మునుపటి వలెనే) పొలతి = స్త్రీ.

**భావము :** గురుమూర్తి పరిపూర్ణమును, ఎరుకను, శిష్యునికి తెలియపర్చిన తరువాత, శిష్యుడు (రెంటిని యెరిగిన) యెరుకై ఉండగా, గురుమూర్తి శిష్యుని ఎరుకను విడచిపెట్టుము అని చెప్పెను. ఆ విధముగా ఎరుకను విడిచిన శిష్యుడు ఎట్లుండుననగా మునుపటి విధముగానే ఉండును. ఇంక "నేను" ఎట్లుండుననగా, భర్త లేని స్త్రీ యొక్క సౌందర్యము ఉండి కూడా లేకపోయిన విధముగా ఉండును.

**విశేష భావము :** ఎరుకను విడచిన శిష్యుడు పూర్వము వలెనే అనగా దృశ్యరూపములో ఏ విధమైన మార్పు కనపడదు. ఏ రకమైన వేషము, మార్పు కనుపించదు. కాని "నేను" అనే ఎరుకలోనే మార్పువచ్చును. పురుషుడు లేని స్త్రీకి, పురుషుడు (భర్త) ఉన్నప్పుడు ఏ సౌందర్యము కలదో అది పురుషుడు పోయినప్పటికి, సౌందర్యము ఉన్నది కాని, ఆ సౌందర్యము ఉండి లేకపోయినది. (సౌందర్యారాధన లేదు) తన సౌందర్యము పై ఆమెకు కోరికయు లేదు.

2) భర్త ఉన్న స్త్రీకి గౌరవ మర్యాదలు, సకల కర్మలు భర్త ప్రక్కన ఉండి చేయుటకు అర్హత ఉన్నది. ఆ భర్త పోయిన పిదప, ఆమెకు ఏ రకమైన అర్హతలు, తన పిల్లల పెండ్లికి ఆశీర్వదించే అర్హత కూడా లేకపోయినది. అదే తాను ఉండి కూడలేనట్లే కదా. ఇదే లేక ఉన్నట్లుగా ఎరుకను విడచిన శిష్యుడు, ఎరుక లేనిదే ఉన్నట్లుగా కనిపించును. తాను ఉండి వ్యవహరించుచున్నను, "గుర్తు రహితుడై" ఉన్నాను అనే అస్తిత్వము లేనివాడై యెరుక రహితుడై యుండును.

**194వ పద్యము : యెరుకను విడనాడిన, యా । పురుషునికి స్థితి ఎట్టిదనిన, పొందుగ వినుమీ । సరిపడు సరిపడదనకను। సరిగా వర్తింపుచుండు, సమరస బుద్ధిన్ ॥ కార్యములందు సహజ ప్రవృద్ధిన్ ॥ పరిపరి విధముల పరువులు బెట్టడు । మరి వైరాగ్యముచేత మానుకొనుండడూ ॥ సమరస బుద్ధిన్ । కార్యములందు సహజ ప్రవృద్ధిన్ ॥**

**టీక :** సమరస - బేధములేని, ప్రవృద్ధిన్ = కొనసాగుట, ప్రవృత్తిన్ = నడక, వృత్తాంతము.

**దండాన్వయము :** సమరస బుద్ధిన్, సహజ ప్రవృత్తిన్ కార్యములందు సరిపడు సరిపడదనకను, సరిగా వర్తింపుచుండు.

**భావము :** ఎరుకను విడచిన వాని యొక్క స్థితి ఎట్లుండుననగా, చక్కగా వినుము. సమస్త కర్మల యందు సహజమైన నడకతో భేద భావము లేనివాడై ఇది విహితము. ఇది అవిహితము అనే నిర్ణయములు లేకుండగ ప్రవర్తించును. అట్లని అవిహిత దుష్కార్యములు చేయడు. సహజ లక్షణముచే విహితములనే చేయును. ఈ పనుల్నియు నేనే చక్కబెట్టుకోవాలి అనే బుద్ధి కలిగియుండడు. అట్లని వైరాగ్యముచే మానుకొని ఏ పని చేయక ఊరుకొనియుండడు.

**విశేష భావము :** ఈ పద్యములో ఎరుకను విడచిన పురుషుని ఆచరణను గూర్చి చెప్పిరి. సహజ ప్రవృత్తిన్ సరిపడు సరిపడదనుకునుసరిగా వర్తింపుచుండు. స్వభావ సిద్ధమైన ప్రవృత్తిచే అవును కాదని, ఇది మంచి ఇది చెడు అనే నిర్ణయములు లేకుండగా సరిగా వర్తించును. "సరిగా వర్తింపుచుండు" అనే వాక్యము చాలా ముఖ్యము. అనగా సరిగానే వర్తించును. అనగా మంచిగానే నడచును. ఏ నిర్ణయము లేనివాడైనను, మొదటి నుండి గురు శుశ్రూషచే అలవడిన స్వభావసిద్ధమైన సత్ప్రవర్తన లక్షణముచే సరిగానే నడుచుకొనును, అని భావము. ఈ పద్యములోని ఆచరణ విధానమును చక్కగా అర్థముచేసికొన వలసి యున్నది "సహజ ప్రవృద్ధిన్" అనేమాటకు బదులు సహజ ప్రవృత్తిన్ అన్న పదము ఉచితము. కృష్ణ ప్రభువులు బహుశ అలాగునే "సహజ ప్రవృత్తిన్" అనే పదము ఉపయోగించి ఉండవచ్చును.

**అవతారిక :** ఎరుకను విడచిన పురుషుని స్థితి ఎట్టిదో, 193 పద్యములో ఒక విధము, 194వ పద్యములో ఒక విధము చెప్పిరి. 195వ పద్యములో జగత్తు జగత్కార్యములకు తాను కర్తనని భావము ఉండదని అందుకు గల కారణమును వివరించుచున్నారు.

**195వ పద్యము : అనహం కారుం డనిమిషుడు । గనుకనె విశ్వంబనేటి కలగాన, డహం। బనువాడు సనిమిషుడు, గా । వున విశ్వం బనేటి స్వప్నోద్యోగాము బూనీ ॥ చేయుచు యా వుద్యోగ ము మానీ ॥ యను నీ స్వప్నోద్యోగమునకు నే కారణ । మని తా నని మిషుడెన్నడునుకో డీ మాటను ॥ ద్యోగాము బూనీ । చేయుచు యా వుద్యోగము మానీ ॥**

**టీక :** అనిమిషుడు = రెప్పపాటులేని వాడు, దేవతలు (అనగా మృత్యువు లేనివాడు) సనిమిషుడు = కాలము గల వాడు, అనగా మృత్యువు గలవాడు, ఉద్యోగము= యత్నము, కార్యము, పూని = ప్రయత్నించి.

**పద విభాగము :** అనహంకారుడు అనిమిషుడు, గనుకనె విశ్వంబనేటి కల గానడు। అహంబనువాడు సనిమిషుడు । గావున విశ్వంబనేటి స్వప్నోద్యోగమున్ పూని, అనిమిషుడు ఆ వుద్యోగము చేయుచు, మా-నీ, అను నీ స్వప్నోద్యోగమునకు నే కారణమని, తాను ఈమాటను అనిమిషుడు ఎన్నడు అనుకోడు.

**భావము :** శిష్యా! అహంకారమును (ఎరుకను) విడచినవాడు దేవతయే (అనగా చావులేని వాడు), కనుకనే జగత్తు అనే కల గాంచడు, అహం. సహితుడు (ఎరుకలోనివాడు) చావు కలిగినవాడు (అనగా పునరావృత్తి కలవాడు) కనుకనే వీడు జగత్తనే కల గాంచును, చావు కలిగినవాడు (అనగా పునరావృత్తి కలవాడు). కనుకనే వీడు జగత్తనే కలగాంచును. అహంసహితుడు జగత్తు అనే కలలోపలి పనులను ప్రయత్నించి చేయును.

అనిమిషుడు (ఎరుకను విడచిన వాడు) మా - నీ అను స్వప్న కార్యములు చేయుచున్నాను, ఆ స్వప్నమునకు తాను కారణమని ఎన్నడూ అనుకోడు భావించడు.

**విశేష భావము :** అనహంకారుడు అనగా ఎరుకను విడచినవాడు. ఇతడు జగత్తు అనే కలను గ్రహించడు. ఎందుచేతననగా అనిమిషుడుగనుక అని ఈ పద్యములో చెప్పిరి. అనహంకారుడు = అహంలేని వాడు, అహమే (అవిద్య లేక అంతఃకరణయే)

పంచకోశయుత పిండాండ జగత్తును, పంచభూతయుత, బ్రహ్మాండ జగత్తును, తన నుంచే కల్పించుకొని తానే అనుభవించుచున్నది. అహంరహితునకు అహంలేదు కనుక జగత్తును కల్పించుకొనుట లేదు. జగత్తును కల్పించుట అనగా కలవలె కల్పించుట అని అర్థము. కనుకనే విశ్వంబనేటి కలగానడు. అహంలేని వానికి పునరావృత్తి లేదు. పునరావృత్తి కలవాడే మరణమనే కాలము గలవాడు. అనిమిషుడు పునరావృత్తి కాలము (మరణము) లేనివాడు. కనుక అనిమిషుడు అన్నారు. అహంకారుడు కాలములోనున్నవారు. జనన మరణములు కలవారు, అహమే జగత్తును కల్పించుకొన్నది. కనుక అహంకారులు విశ్వమనేటి కల జగత్కార్యములు చేయుచున్నారు.

అనహంకారుడు మా - నీ అను స్వప్నోద్యోగమునకు చేయుచు తాను కారణమని ఎన్నడూ అనుకోడు "మా" అనగా ఆత్మ, "నీ" అనగా జగత్తు, ఆత్మ-జగత్తులు, నేను - నీవు అనే జగత్కార్యములకు తాను జగత్తులో (లేక) ఉంటూ, జగత్కార్యములు తాను లేక చేయుచూ, జగత్తుకు కాని కార్యములకు కాని తాను కారణ స్వరూపుడనే భావము ఎన్నడూ అనుకోడు. ఎందుచేతననగా అనహంకారుడు కారణ కార్యములు కానివాడు, మా - నీ అనే ద్వంద్వ రహితుడు అని భావము.

---

**అవతారిక :** అహంరహితుని యొక్క మరొక లక్షణమును చెప్పుచున్నారు.

***196వ పద్యము :*** **కలమేలు కొన్న పురుషుడు ! కలలోపలి బాములెరుక గలిగుండ గనే । తిలకింపలేవు గురుకృప । దెలిహొందిన వానికింక తిప్పలున్నవే ॥ తెల్పర కొద్ది గొప్పలున్నావే ॥ తలిదండ్రి దొరదాత కులదైవ మాప్తులు । కల, దేశికులని నమ్మితే యింక ॥ తిప్పలున్నావే । తెల్పర కొద్ది గొప్పలున్నావే ॥**

(ఈ పద్యములో "తిలకింపలేవు గురుకృప" అన్న వాక్యమునకు బదులు "తిలకింపలేడు గురుకృప" అని ఉండుట సరి అని నా భావము).

**టీక :** కలలోపలి బాములు = ఎరుకలోని కష్టములు అనగా జన్మలు, బాము అనగా జన్మ అని అర్థము ఉదా॥ "యేబాము లెరుగక, యేపారు మేటికి బసుల కాపరి యింట బాము కలిగే = జన్మలు లేని దైవమునకు పశువుల కాపరియింట్లో

**భావము :** కల మేలుకొన్న పురుషుడు అనగా ఎరుకను విడిచిన వ్యక్తి, ఎరుకలోని కష్టములు (జన్మ పరంపరను) తాను బ్రతికి ఉండగానే వాటిని చూడలేడు. ఎందుచేతననగా (గురుకృపన్ తెలిపొందినవానికి) గురుకృపచేత మేలుకొన్న వానికి అనగా గురుకృపచే ఎరుకను విడచిన వానికి తిప్పలుండవు. అట్టి వానికి కొద్ది గొప్పలు ఉండవు. అట్టి వానికి తలి, తండ్రి, దొర, దాత, కులదైవము, స్నేహితులు వీరందరూ కలలోని వారే. ఆ బంధువులందరు గురుమూర్తియేయని నమ్మిన వానికి తిప్పలు, కొద్ది గొప్పలు ఉండవు. (లేవు అని భావము)

**విశేష భావము :** ఎరుకను విడచిన వ్యక్తి తాను బ్రతికి ఉండగానే (ఎరుక గలిగుండగానే) ఎరుకలో కష్టములు తెలియవు. ఎందుచేతననగా అతడు గురుకృపచే ఎరుకనుండి మేల్కొనిన వాడు, ఎరుకలేని వాడు. అతనికి శరీర జగత్తులు లేవు. అట్టి వానికితానని, యితరమని గుర్తించే లక్షణము లేదు. అట్టి వానికి అల్పజ్ఞత్వ (కొద్ది) సర్వజ్ఞత్వములు, జీవ ఈశ్వర బేధములు లేవు. సమస్త బందువులు కలవంటి వారని, ఆ సమస్త బందువులు గురుమూర్తే అని నిమ్మనచో, గురు కప్పచే ఎరుక రహితస్థితి కలిగి సమస్తమైన జన్మ-దుఃఖములు లేకపోవును.



**అవతారిక :** ఎరుకను విడచిన వాని స్థితి ఈ రీతిగా ఉండునని ప్రత్యక్షములో తెలియపర్చుచున్నారు.

**197వ పద్యము : ఈ రీతి స్థితి గలిగిన। నేరుపు శాలితర జనుల నిందాస్తుతులన్। తారేగి చేయడెన్నడు। వారలు మరిచేసిరేని వలదని యవడు ॥ చెవియొగ్గి కావలెనని యనడూ ॥ వారు మీ వారు, మా వారు, వీరను కొంచు। సారెకు వీథిలో పోరాడే వారిని ॥ వలదాని యనడూ। చెవి యొగ్గి కావలెనని యనడూ ॥**

**టీక :** నేరుపుశాలి = నేర్పరియైన వాడు, తారేగి = తా + ఏగి = తనకు తానుగా వెళ్లి, సారెకు = మాటి మాటికి.

**భావము :** ఇట్టి పూర్ణ స్థితిని కలిగిన నేర్పరి తనకు తానుగా ఇతరులను నిందించుటగాని, స్తుతించుట గాని, ఎన్నడూ చేయడు. మరియు ఇతరులు తనను నిందించినను లేక స్తుతించినను వద్దు అని అనడు (ఎందుచేతననగా తన పనులను గాని ఇతరులు చేయు పనులు గాని గుర్తించలేడు కనుక) ఇతరులు ఏమనుకుంటున్నారో చెవి పెట్టి వినడు. వారంతా మీ వారు, వీరంతా మావారు అని అనుకొనుచు మాటి మాటికి పోరాడుకొనేవారిని వద్దు అని కాని తెలుసుకోవాలని కాని అనుకొనడు.



**198వ పద్యము : ధ్వని మొదలగు తన్మాత్రలు । గనుగొనగా లేశమైన గాన్పించని చో । టును, బట్ట బయలు గా గని । ధ్వని ముఖ తన్మాత్రలున్న దాన్నె యెరుకగను ॥ గని యీ రెంట్లో దేన్నీ యెరుగకను ॥ ఉనికి గలిగిన యట్టి ఘనుని సన్నుతి జేయ । జనులకు శక్యమంచనరాదు వినరాదు ॥ దాన్నె యెరుకగను । గని యీ రెంట్లో దేన్నీ యెరుగకనూ ॥**

**టీక :** ఉనికి = స్థితి, లేశము= కొంచెము.

**భావము :** శబ్ద, స్పర్శ రూప రస గంధములనే పంచనాత్మత్రలు లేశమైనను లేనిదాన్ని పరిపూర్ణ పరబ్రహ్మముగను, శబ్దాది పంచతన్మాత్రలు కలిగియున్న దానిని యెరుకగను, విచారంచి తెలుసుకొని యీ రెంటిలో (పరిపూర్ణము - యెరుక) దేన్నీ యెరుగని స్థితి గలిగిన మహాత్ముని స్తుతించుటకు జనులెవ్వరికి సాధ్యము కాదు. సాధ్యమే అని అనరాదు, వినరాదు.

**విశేష భావము :** యెరుక యొక్క లక్షణము యెరుగుట. యెరుగుట పంచతన్మాత్ర రూపముగానే తెలిసికొనవలయును. ఏ వస్తువునైనా యెరుగవలెనంటే శబ్ద, స్పర్శ రూప రసగంధములతో నెరుగవలయును. అనగా ఎరుక ఉన్న చోటును, ఎరుకయే గుర్తించనగును. పరిపూర్ణములో ఎరుక లేదని, మిగిలిన సమస్తము ఎరుకయేయని గురుమూర్తిచే విచారించి తెలుసుకొని, గురుకరుణచే యెరుకను విడచిన మహాత్ముడు పరిపూర్ణము ఉన్నదని కాని, యెరుక లేదని కాని అనలేడు. గుర్తించే లక్షణమున్న ఎరుకను విడచిన వాడు కనుక. పరిపూర్ణము ఉన్నదని కాని, ఎరుక లేదని గాని చెప్పలేని స్థితియే "యీ రెంట్లో దేన్నీ యెరుగక" అనే వాక్యమునకు అర్థము. అట్టి

వానిని స్తుతించుట ఎవ్వరికి సాధ్యము కాదు. అంటే స్తుతించినను, నిందించినను ఎరుక లేని వానికి చలనము ఉండదు అని అర్థము.

ఈ పద్యము చాలా పుస్తకములలో "ధ్వని ముఖ తన్మాత్రలున్న దాన్నే యెరుగకను, కని యీ రెంట్లో దేన్నీ యెరుగకనూ" అని అచ్చుపడినవి అట్లే చెప్పుచున్నారు. ఇది తప్పు. నేను శ్రీ లక్ష్మణ ప్రభు మందిరములో భద్రపర్చియున్న శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు వ్రాసిన కందార్థ గ్రంథము చేతి వ్రాత ప్రతిని స్వయముగా చూచితిని. అందులో మొదటిది "యెరుకగను, యీ రెంట్లో దేన్నీ యెరుగకను" అని మాత్రమే ఉన్నది. ఇదే అర్థ సమన్వయమగును.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతాద్వైత రహిత పరమతత్త్వే
బోధ స్తితి పురుష లక్షణన్నామ
ఏకాదశోధ్యాయమునకు భావ విశేష భావములు సమాప్తము.

# బోధ స్థితి పురుష లక్షణమునకు సంక్షిప్త భావము

ఈ అధ్యాయములో ఎరుకను విడచిన పరిపూర్ణ స్థితిమంతుడైన మహాత్ముని లక్షణము సవివరముగా చెప్పినారు. ఎరుకను విడచిన మహాత్ముడు వేష భాషలలో మార్పు ఏమియు ఉండదు. అనగా సన్యసించుట, కాషాయములు కట్టుట, గడ్డము వగైరాలతో ఉండుట వగైరా వైవిధ్యములు ఏమియు ఉండక, మునుపటి విధానముగానే ఉండును. కాని భావములో మాత్రమే మార్పు ఉండును. పురుషుడు లేని సౌందర్యము ఉన్నను, సౌందర్యారాధన లేనట్లుగా జగద్వ్యాపారములో ఉన్నప్పటికి వాటి యందు మనసుండదు. ఇది మంచి, ఇది చెడు అనే ద్వంద్వములు లేనివాడై గురు శుశ్రూషచే అలవడిన మంచి కర్మలు చేయుట సహజ లక్షణముచే చేయుచుండును. గుర్తించి యిలాగున చేయవలెనని భావించడు. ఎరుకను విడచిన వానికి శరీరమున్ననూ కాల నియమముతో కూడిన మరణము లేదు. అనగా పునర్జన్మ లేదు కనుక మరణించినను మరణించలేనట్లే. (మరణిస్తే తిరిగి జన్మించాలి కనుక) ఈ సమస్త జగత్కార్యములకు తాను కారణమని భావించడు. తనే లేడు కనుక, ఎరిగేది అనుభవించేది ఎరుకయే గనుక, యెరుకను విడచినవాడు జన్మ పరంపరను రద్దు పరచుకొన్నవాడై సమస్త శారీరక బాధలు, షడూర్మ్ములును కూడా అనుభవించడు. అట్టి స్థితియే పరిపూర్ణ స్థితి. బోధస్థితి. ఇది కుదురుటకే తల్లి, తండ్రి, దార, దాత, కులదైవము, ఆప్తులు, సమస్తము కూడా గురుమూర్తియే యని భావించి, గురు సేవచే గురుకరుణ పొందుట ద్వారా మాత్రమే ఇట్టి స్థితిని పొందనగును. అట్టి వానికి కొద్ది గొప్పలు, అనగా కించిజ్ఞత్వ సర్వజ్ఞత్వములు ఉండవు. ఇవన్నియు ఎరుకకే. ఎరుక రహితునకు ఏ స్థితి ఉండదు. ఇట్టి వారు ఇతరులను నిందించుట, స్తుతించుట గాని, ఇతరులు తనను నిందించిన, స్తుతించిన గుర్తించుట గాని ఉండదు. జగత్తులో వీరు మావారు, వారు మీ వారు అనే భేద భావము కాని, అంతా మన వారే అనే భావము గాని ఇతరుల గొడవలలో జోక్యము చేసుకొని న్యాయము ఇది, అని చెప్పుట కాని అసలు వారికి గొడవ ఎందుకు వచ్చిందో వినాలని కాని ఏమీ అనుకోడు. ఏవిధమైన సంకల్పము ఉండదు అని భావము.

॥ జై గురు ॥

## అధ్యాయము - 12

# బోధ పఠన లక్షణము (14)

**199వ పద్యము : నా మాట లెస్స వినుమా ! సామన్యంబనుచు జూడజనదీ బోధన్। ప్రేమాతిశయమునం గని । వేమారిది గురుని నోట వినవలె సుమ్మీ ॥ నిత్యము జదువుకొనవలె నమ్మీ । నామ రూపక్రియ నటనలు గలిగిన । దేమి వస్తువో దాన్ని యెటు నిల్వ నివ్వదు ॥ వినవలె సుమ్మీ । నిత్యము జదువుకొనవలె నమ్మీ ॥**

**టీక :** లెస్స = బాగుగ, ప్రేమ = స్నేహము, హర్షము, సంతోషము, అతిశయము=ఆధిక్యము, వేమారు = పలుమార్లు (వేయి-మారు)

**భావము :** శిష్యా! నామాట బాగుగా వినుము. ఈ పరిపూర్ణ బోధ సామాన్యమైనదిగా తలంచవద్దు. అధికమైన సంతోషముతో (మిక్కిలి శ్రద్ధతో) ఈ బోధను అనేక మార్లు గురుముఖముగా వినుచు, బోధ యందు గురువునందు శ్రద్ధ కలిగి నిత్యము నమ్మికతో చదువుకొనుచుండవలెను. అట్లు బోధను పఠించుచుండినచో నామ రూపక్రియ నటనలు గలిగిన వస్తువు ఏదో (ఎరుక), దానిని ఎంతమాత్రము ఎచ్చటను లేకుండా చేయును. కనుక నమ్మికతో నిత్యము చదువుకొనుచు గురుముఖతా వినుచుండవలెను.

**విశేష భావము :** పరిపూర్ణ బోధ సామాన్యమైనది కాదు. శ్రద్ధతో నమ్మికతో అనేకమార్లు గురుముఖతా వినుచు, నిత్యము చదువుకొనుచుండవలెను. "వేమారు ఇది గురుని నోట వినవలె సుమ్మీ" అన్నారు. బ్రహ్మ జ్ఞానము, గురుముఖతా మాత్రమే వినవలెను" శాస్త్రజ్ఞోపి బ్రహ్మజ్ఞానాన్వేషణం స్వతంత్రేణ నకుర్యాత్" శాస్త్రజ్ఞుడు అయినప్పటికి వేదాంత శాస్త్రమును స్వతంత్రముగా అభ్యసించరాదు. గురుముఖతా విని చదువుకోవలెను. అప్పుడు మాత్రమే మాయా బ్రహ్మమునకు శాశ్వత బ్రహ్మమునకు తేడా తెలియబడును. కనుకనే శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు అయిన గురువును సేవించి అతనికి దయపుట్టులాగున సపర్యచేసి, వారి కరుణచే బోధవినుట, ఎరుకను విడచుట చేయవలెను. బోధ యందు నమ్మికతో అన్నారు. బ్రహ్మము అవాఙ్మానస గోచరము. గుర్తించుట కష్టము. కనుక సామాన్యమైనది కాదు. గురువుయందు

శాస్త్రము నందు నమ్మిక భక్తి శ్రద్ధలు కలిగి వేదాంత శాస్త్రమును పఠించవలెనని, శాస్త్ర విహితమై యున్నది.



**అవతారిక :** బోధ చెప్పుట పూర్తి అయినందున శిష్యుని గురుమూర్తి అశీర్వదిస్తూ ఇక నీవు ఇంటికి వెళ్లవచ్చునని అనుగ్రహించుచున్నారు.

**200వ పద్యము :నే మొదట నిన్నుగనుగొని । యేముక్కలు నీదు చెవిలో యిమిడిస్తినో, నీ। వా ముక్కలు మూడింటిని । యేమాత్రము మరువకుండ యీ బోధనిస్తి ॥ అంతకెయింతగా బోధ జేస్తి ॥ ప్రేమతో జదువు, మీదే మారకెప్పుడు। కామితార్థము నిచ్చు పోమీయింటికి, దీవిం ॥ చీ బోధ నిస్తి । అంతకె యింతగ బోధ జేస్తి ॥**

**పద విభాగము :** ప్రేమతో జదువుము, ఇది ఏ మారకు ఎప్పుడు, దీవించీ, బోధనిస్తి, కామితార్థము నిచ్చు, పో మీ యింటికి.

**టీక :** ఏమారకుము = మరుకవకుము, కామితార్థము = నీవు కోరిన కోర్కె, దీవించి = ఆశీర్వదించి.

**భావము :** శిష్యా! నేను నిన్న మొట్టమొదటగా చూచినప్పుడు ఏ మూడు మంత్రములను నీ చెవిలో చెప్పియున్నానో, ఆ మూడు మంత్రములను ఏ మాత్రము మరువవద్దు. ఆ మూడు మంత్రములకే యింత బోధ చెప్పితిని. కనుక ఈ బోధను మరువక ఎల్లప్పుడు శ్రద్ధథో జదువుము. అట్లు చేయుచుండినచో నీ కోర్కె ఫలించును అని ఆశీర్వదించుచు ఈ బోధనిచ్చితిని. ఇక నీవు యింటికి వెళ్లవచ్చును.

**విశేష భావము :** "ఏ ముక్కలు నీదు చెవిలో ఇమిడిస్తినో" మూడు మంత్రములను "ముక్కలు" అన్నారు. మన్త్రములు ఓం తో ప్రారంభించబడి, నమః అని గాని, స్వాహా అని గాని అంతమగుచుండును. కాని ఇందులోని మూడు మంత్రములకు మంత్ర నియమము ఓంకార ప్రారంభము, నమః అంతము లేదు. అందుచే "ముక్కలు" అని చెప్పియుండవచ్చును. అయినను ఇవి ఎంతమాత్రము మరువకుండగ ధృడమగులాగున జపించవలెను. కనుక మంత్రములు. (మననా త్రాయతి ఇతి మంత్రః - మననముచే రక్షించునది మంత్రము) ఇవి మంత్రములే అని 222, 223,

224 పద్యములలో చెప్పిరి. ఎంత బోద చెప్పిననూ మూడు మంత్రముల లోపలనే ఉండును. మూడు మంత్రములతో సంబంధము లేకుండా యీ బోధ ఎంతమాత్రము ఉండదు. కనుకనే "అంతకే యింతగా బోధజేస్తి" అన్నారు.

శిష్యుడు గురుమూర్తి వద్ద బోధ పూర్తి అయినది. ఇక నీవు ఇంటికి వెళ్లవచ్చును అని అనుగ్రహము పొందిన తరువాతనే వెళ్లవలెను. ఆ సమయములో గురుమూర్తి ఆశీర్వాదపూర్వకముగా పంపించును. కోరిన కోర్కె (పరపూర్ణ స్థితిని పొందుట) లభించును. అని ఆశీర్వదించి, నీ యింటికి పోవచ్చునని శెలవిచ్చిరి. గుర్వాశీర్వాదము పొందక పోయినచో బోధ తనకు ఎంత మాత్రము ఫలితము నివ్వదు. ఉదా॥ పరశురాముని వద్ద కర్ణుడు మంత్ర విద్యను పూర్తిగా గ్రహించినప్పటికి గుర్వాశీర్వాదములేనందున ఫలితము పొందలేకపోయెను. కనుక గురుమూర్తి ప్రేమ పూర్వకముగా శిష్యుని ఆశీర్వదించెనని యీ పద్యములో చెప్పినారు.

---

**201వ పద్యము : అన్నము దిన్నమ ఆకలి । తిన్నగ నీరంబు ద్రావ తృష్ణయు, రోగం। బెన్నగ నౌషద సేవమ । జన్న క్రియన్ యెరుక నిల్వ జాలదోయన్నా ॥ యీ బోధ నీ చౌలతో విన్నా ॥ కన్నులతో జూచి, కడముట్టజదివివ । విన్నెన్నటికి యెదుట నిలచుండి కనుగొవ ॥ జాలదోయన్నా । యీ బోధ, నీ చౌలతో విన్నా ॥**

**దండాన్వయము :** అన్నము దినన్న ఆకలి, తిన్నగ నీరంబు ద్రావ తృష్ణయు, యెన్నగ నౌషద సేవను రోగంబు, జన్నక్రియన్, యీ బోధ నీ చౌలతో విన్నా, కన్నులతో జూచి, కడముట్ట జదివి నా । యెరుక నిన్నెన్నటికి యెదుట నిలచుండి కనుగొన జాలదు నిల్వ జాలదు ఓయన్నా ॥

**టీక :** తిన్నగ = సమముగా, ఎన్నగ = గణనచేయగా సరియగు అని అర్థము. జన్నక్రియన్ = పోయిన విధముగా, తృష్ణ = దాహము.

**భావము :** శిష్యా! అన్నము తినిన ఆకలి. సమమముగా నీరు ద్రాగిన దాహము, సరియగు ఔషదసేవచే రోగము పోయిన విధముగా, యీ బోధ నీ చెవులతో శ్రద్ధగా గురుముఖతా వినిననూ, యీ గ్రంథమును కన్నులతో జూచి (సరిగా అర్థము చేసుకుంటూ) చివర వరకు చదివిననూ, యెరుక నీ ఎదుట నిలచి ఉండలేదు. లేకుండా పోవును.

**విశేష భావము :** బోధను శ్రద్ధగా విని, ఆ పరిపూర్ణమును గురుమూర్తి సూచించిన విధముగా అపరోక్షముగా చూచి (కన్నులతో చూచి) ఎరుక లేకుండా చేసుకొనినచో (కడముట్టజదివిన) ఎరుక ఎంతమాత్రము ఉండదు. తిరిగి ఎరుక భ్రాంతిని పొందడు అని భావము.



**అవతారిక :** అవకాశము కలిగినప్పుడు, చే జార్జుకోరాదనియు, చాలా మంది బోధ చివరకాలములో తెలుసుకోవచ్చులే, ఇప్పుడే అంత తొందర ఎందుకు అని సదవకాశము (గురువు లభించినప్పుడు)ను వృధా చేసుకొందురు. అట్లు చేయవలదు అని హెచ్చించుచున్నారు. ఈ పద్యము శిష్యుని ఉద్దేశించి చెప్పినట్లు ఉన్నా, శిష్యునికి అని మనము గ్రహించరాదు. మనలనే ఉద్దేశించి చెప్పినట్లుగా గుర్తించవలెను.

**202వ పద్యము : జనన మరణ ప్రవాహము । నణచును, యీ బోధ పట్టుడని సాధువు లి । చ్చిన, నొల్లకుండి, వారలు । జనిన పుడా బోధ మీద జనియించి ప్రేమా ॥ వెదకెద రట్టి జన చేష్ఠలేమా ॥ యని, తోచి నీకునే వినజెప్పవలసె । నీవును యీ బోధను వల్ల ననకు, దొరకదు మళ్లీ ॥ జనియించి ప్రేమా । వెదకెద రట్టి జన చేష్ఠా లేమా॥**

**దండాన్వయము :** జనన మరణ ప్రవాహము నణచును యీ బోధ పట్టుడని సాధువులిచ్చినన్ ఒల్లకుండి, వారలు జనినప్పుడు ఆ బోధ మీద ప్రేమ జనియించి వెదకెదరు, అట్టి జన చేష్టలు ఏమా ? అని తోచి నీకు నే వినజెప్పవలసె । నీవును యీ బోధ వల్లననకుము । మళ్లీదొరకదు ।

**టీక :** ప్రవాహము = పరంపర, అణచును = లేకుండా జేయును, పట్టుడు అని = గ్రహింపుము అని.

**భావము :** జనన మరణ ప్రవాహము నణచును యీ బోధ, గ్రహించుమని గురువులు (పెద్దలు) ఈబోధ చెప్పుకోమని అడిగినప్పుడు, ఏవో సాకులు చెప్పుకొని ఇప్పుడు వద్దని) అంగీకరించక, ఆ గురువులు వెళ్లిపోయిన తరువాత, కొంత కాలము గడచిన తరువాత, ఆ బోధ పై ఇష్టత కలిగి, గ్రహించవలెనను కోర్కెతో బోధ చెప్పె గురువుల కొరకు దేశమంతా వెదకెదరు. ఇది సామాన్య జనుల యొక్క పద్ధతి. చేష్ఠలు - ఏమి

చెప్పను. ఈ విధముగా నాకు తోచి నీకు ఈ విషయమును చెప్పుచున్నాను. కావున నీవును యీ బోధ వద్దనకుము. నీకు కావాలనుకున్నప్పుడు దొరకదు సుమీ ॥

---

**అవతారిక :** జ్ఞాన, అజ్ఞానములు రెండును తన్మాత్ర సహితమైనవే, కనుక యెరుకయే అని చెప్పుచున్నారు.

**203వ పద్యము : మరుపుకు తన్మాత్రలు గల । వెరుకకు తన్మాత్రలున్నవీ రెండొకటే। పరిపూర్ణమునకు లేవవి । పరిపూర్ణము యెరుక గాదు మరుపు గాదోయీ ॥ వెదకిన దీని సరిది లేదోయీ ॥ పరిపూర్ణ మెరుకల పరిశోధించీ గ్రంథము । రచించి నీకిస్తి మరువాక చదువెరుక ॥ మరుపు గాదోయీ । వెదికిన దీని సరిది లేదోయీ ।**

**భావము :** శిష్యా! అజ్ఞానమునకు శబ్దాది తన్మాత్రలు గలవు. జ్ఞానమునకు శబ్దాది తన్మాత్రలు గలవు. కనుక ఈ జ్ఞాన అజ్ఞానములు రెండును ఒక్కటే (ఎరుకయే) జ్ఞాన అజ్ఞానములు రెండూ లేనిది ఒక్క పరిపూర్ణము మాత్రమే. దీనికి సాటి మరేదియు లేదు. నేను గురుముఖతా పరిపూర్ణమును ఎరుకను చక్కగా విచారించి తెలుసుకొని ఈ గ్రంధము వ్రాసి నీకు యిచ్చుచున్నాను. దీనిని మరచిపోకుండా చదువుకొనుము. (అనగా కంఠస్థమయేలా చదువుకొనుము) ఇంతకు సాటియైనది అధికమైనది కాని ఏమియు లేదు "సమానాధిక వర్జితం".

**విశేష భావము :** మరుపు అంటే అవిద్య. జ్ఞానము - విద్య అనగా అవిద్య - జీవుడు, జ్ఞానము, ఈశ్వరుడు ఈ రెండును ఉపాధి సహిత చిన్మాత్ర రూపములే. కనుక ఎరుకయే, శాశ్వతమైనవి కావు. జీవేశ్వరుల కతీతమైనది. ఒక్క పరిపూర్ణము మాత్రమే ఉపాధి రహితము. జ్ఞాన అజ్ఞానములు కానిది, శాశ్వతమైనది. దీనికి సాటి అయినది కాని అధికమైనది కాని మరేదియు లేదు.

---

**204వ పద్యము : అందముగా సద్గ్రంథము । చందము వినిపింతుదాన్ని చదివిన వినివన్ । ముందుగ బయలెరుకై, యే । సందున లే వెరుక లేక జనవలె సుమీ్మ ॥ అదె యిది, విని చదువు మీ నమ్మీ ॥ యెందుకు నీ కింక యితర శాస్త్రముల జో। లందు గుర్తుండి పోదది గాన, యీ యెరుక ॥ జనవలె సుమీ్మ । అదె యిది, విని చదువుమీ నమ్మీ ॥**

**పదవిభాగము :** అందముగా సద్గ్రంధము చందము వినిపింతు । దాన్ని చదివిన వినినన్, ముందుగ బయలు ఎరుకై (ఆ తరువాత) యెరుక ఏ సందున లేక జనవలె సుమ్మీ ॥ అదె యిది । విని నమ్మిచదువుమీ । నీకింక యితర శాస్త్రముల జోలి యెందుకు? అందు గుర్తుండి । అది పోదు గాన.

**టీక :** చందము = విధానము, బయలు ఎరుకై = బయలు తెలియబడి (ఆ తరువాత అన్యాపదేశము) జోలి = సంబంధము, గుర్తు = ఎరుక.

**భావము :** శిష్యా! చక్కగా మంచి గ్రంథము యొక్క విధానము (లక్షణము) చెప్పెదను వినుము. ఏ గ్రంథము చదివిన, విన్నా మొట్టమొదట పరిపూర్ణము తెలియబడి, ఆ తరువాత ఎరుక ఎక్కడను లేకుండా పోవలెను. అదే మంచి గ్రథ,ము. అట్టిది యీ గ్రంథమే. నీవు నమ్మి గురుముఖతా విని నిత్యము మననము చేయుచుండుము. ఇక ఇతరమైన వ్యాకరణాది శాస్త్రముల సంబంధము నీకు ఎందుకు? ఆ శాస్త్రములన్నిటియందు ఎరుక ఉండును, నశించదు. కనుక ఆ శాస్త్రముల జోలి వద్దు. దీనినే నమ్మి మననము చేసికొనుచుండుము.



**అవతారిక :** అనుభవించనిదే వస్తువు యొక్క లక్షణము పూర్తిగా తెలియదు. బ్రహ్మజ్ఞానము అనుభవైక వేద్యము - అట్టివానికే జన్మరహితము అని యీ పద్యములో రూఢిపరచుచున్నారు.

**205వ పద్యము : చక్కెర మెుక్కక లోకులు । చక్కెర మాధుర్య మెరుగ జాలరటువలెన్ । మక్కువతో విని చదువక । చక్కగ గ్రంథార్థ మెరుగ జాలేర జనులు ॥ కావున నీవు చాలించి పనులు ॥ చొక్కమీ గ్రంథము చూడుమీ కొనవెళ్ల ॥ యిక్కడితో జన్మమెత్తవు సరి, తెలియ । జాలేర జనులూ ॥ కావున నీవు చాలించి పనులూ ॥**

**దండాన్వయము :** లోకులు చక్కెర మెక్కక, చక్కెర మాధుర్యము ఎరుగ జాలరు । అటువలెన్, జనులు మక్కువతో విని చదువక గ్రంధార్థము ఎరుగ జాలేర ? కావున నీవు పనులు చాలించి చొక్కము ఈ గ్రంథము కొనవెళ్ల చూడుమీ । జన్మమెత్తవు । యిక్కడితో సరి తెలియజాలేరా ?

**టీక :** చొక్కము = దోషము లేని, పరిశుద్ధమైన, కొనవెళ్ల = చివర వరకు, మెక్కక=తినక.

**భావము :** శిష్యా! చక్కెర తినకుండగ జనులు చక్కెర యొక్క మాధుర్యగుణమును ఎట్లు తెలసికొనలేరో, అట్లనే జనులు శ్రద్ధతో (ఈ గ్రంధ భావమును గురుముఖతా) విని చదువనిదే యీ గ్రంధ భావమును తెలియజాలరు. కావున నీవు సమస్త కర్మలు చాలించి, దోష రహితమైన (ఎరుక రహితమైన) పరిశుద్ధమైన ఈ గ్రంథమును, శ్రవణ మనన నిధిద్యాసపూర్వకముగా చివర వరకు చదివి తెలిసికొని ఆరూడుడువు కమ్ము. అంతటితో ఇక జన్మకు రావు, యిక్కడితో (ఈ జన్మతో) సరి.

**విశేష భావము :** ఈ పద్యములో "ఈ గ్రంథము కొనవెళ్ల చదువుము ఇక్కడితో జన్మమెత్తవు" అన్నారు. అనగా గ్రంథమును గురుముఖతా శ్రవణ మనన నిధిద్యాసపూర్వకముగా చివర వరకు చదువుము, అని కవి హృదయము. అప్పుడు మాత్రమే ఆరూఢుడవై జన్మరహితమగును. అంతేకాని పద్యములు కంఠస్థము చేసినంత మాత్రము సరిపోదని తెలియవలెను.



**అవతారిక :** గ్రంథము ఎట్టి వారికి ఉపయోగించునో ఈ పద్యములో చెప్పుచున్నారు.

**206వ పద్యము : గుఢార్థమెరిగి సతతా । రూఢుండైనతడు గ్రంథరుచిగొనడు, భువిన్ । గాఢ తర జ్ఞానంబున । మూఢుండై యున్నవాడు మొదటికే వినడూ ॥ సుజనుల పాద ముద మెప్పుగనడూ ॥ వాడు వీడనరాని వాడే గ్రంథము వినే । వాడు, నిశ్చయమిట్టి వార్తలెరుగని వాడు ॥ మొదటికే వినడూ । సుజనుల పాద ముదమెప్పగనడూ॥**

**టీక :** ఆరూఢుడు = బాగుగ నిశ్చయమైనవాడు, గాఢతరజ్ఞానంబున = గొప్పదైన (మిక్కిలి) అజ్ఞానము చేత, మూఢుడు = మూర్ఖుడు.

**భావము :** శిష్యా! ఈ గ్రంథములోని గూడార్థమును ఎరిగి బాగుగ ధృడ నిశ్చయ జ్ఞానము కలవానికి ఈ గ్రంథముతో పనిలేదు. మిక్కిలి అజ్ఞానముచే మూర్ఖుడైన వాడు ఈ గ్రంథమును మొట్టమొదటే తెలిసికొనడు. వానికి ఈ గ్రంథముతో

పనిలేదు. పై రెండు స్థితులు కాని వారు మాత్రమే ఈ గ్రంథమును తెలిసికొనుటకు ప్రయత్నించెదరు. అజ్ఞానులకు మూర్ఖులకు మంచివారి సాంగత్యమే అవసరము లేదు. అట్టి వానికి ఈ గ్రంథముతో పనిలేదు.

**విశేష భావము :** "గూడార్థమెరిగి" - రహస్యమైన భావమును, రహస్యమైన వస్తువును ఎరిగి అని భావము. రహస్యమైన వస్తువు = బ్రహ్మము అనగా పరిపూర్ణము "అతి రహస్యం బట్టబయలు" అన్నారు కదా. కనుక గూఢార్థమెరిగి అంటే రహస్యమైన పరిపూర్ణ బ్రహ్మము నెరిగి, ఆరూఢత్వము నొందిన వానికి (ఎరుకను విడచినవానికి) ఈ గ్రంథముతో పనిలేదు. అట్టి వాడు తెలుసుకొనేది, తెలియబడేది తెలివిలేనివాడు. కనుక గ్రంథ రుచిగొనడు, మూఢులైన అజ్ఞానులు ఆధ్యాత్మిక శాస్త్రము దరికేరారు. మంచి వారి సాంగత్యమే అక్కరలేదు. కనుక ఇట్టి వారికి ఈ కందార్థ గ్రంథముతో పనిలేదు. కనుక ఆరూఢుడు, మూఢుడు కాని మధ్యస్థులు మాత్రమే అనగా పుణ్య సంస్కారము కలిగి గురువును ఆశ్రయించి జన్మరహితము చేసికోవాలి అనే కోర్కె గల వారికి మాత్రమే ఈ గ్రంథము ఉపయోగపడును. వాడే ఈ గ్రంథమును తెలుసుకొని బ్రహ్మమును గుర్తించగలిగేవాడు అని భావము.



**అవతారిక :** అరూఢ స్థితిమంతులైన చక్కని సద్గురువుద్వారా మాత్రమే ఈ బోధ గ్రహించనగును. కాని ఇతరుల వలన సాధ్యము కాదనియు, గురువును ఆశ్రయించకుండగ యితర విధములుగా కూడా సాధ్యము కాదనియు చెప్పుచున్నారు.

**207వ పద్యము : తాబేటి తలపుచేతను । తాబేల్పిల్లక్షుధార్తి తలగుట తెలియన్ । తాబేటి గర్భమందున । తాబేలై పుట్టకున్న తరమా యితరులకూ ॥ సద్గురు బోధట్లరయా నితరులకు ॥ యేబాధలెరుగని యీ బోధ గల వారి । చే బోధ, బడయాక, చేకొన దలచితే ॥ తరమా యితరులకూ । సద్గురు బోధట్ల రయా నితరులకూ ॥**

**టీక :** క్షుదార్తి = ఆకలి బాధ, తలగుట = పోవుట, అరయన్ = తెలిసికొనుటకు.

**దండాన్వయము :** అట్లు అరయన్ సద్గురుబోధ, యే బాధలెరుగని యీ బోధ గల వారిచే బోధన్ పడయక, (ఇతర విధముగా, అన్యాపదేశము) చేకొనదలచితే, యితరులకు తరమా ?

**భావము :** తాబేలు తన పిల్లల ఆకలి బాధను తన తలంపు మాత్రము చేతనే తీర్చు చున్న సంగతి ఇతరులకు తెలియదు. అది తెలియవలెనంటే తాబేలు గర్భమందు పుట్టిన వారికి మాత్రమే తెలియును. ఇతరులకు సాధ్యము కాదు. అట్లే యీ పరిపూర్ణ బోధ తెలియవలెనంటే పరిపూర్ణ బోధను గురుముఖతా నెరిగి, బాధలకు మూలమైన యెరుకను విడచిన సద్గురుమూర్తి ద్వారా మాత్రమే తెలియవలెను. ఇతరుల వలన గాని, ఇతర విధముగా గాని తెలియబడదు, అని భావము.

**విశేష భావము :** తాబేలు, పిల్లలను పొదలో విడచి మేతకై పిల్లల నుండి దూరముగా పోయినప్పుడు, ఆ తల్లి తాబేలు, తన పిల్లలకు ఆకలి వేయుచున్నదేమో అని తలంచినంత మాత్రమున పిల్లల ఆకలి బాధ తీరుచున్నది. ఈ విషయము తాబేలు గర్భమున పుట్టిన వానికే తెలియును. కాని ఇతరులకు తెలియ శక్యము కాదు. ఇది శాస్త్ర వాక్యము. అట్లే యీ బోధ గురుముఖతా నెరిగి ఎరుకను విడచిన సద్గురుమూర్తి ద్వారా యీ బోధ తెలియబడునే కాని యితరుల వలన యీ బోధ మర్మధర్మములు తెలియబడవు.

అయితే ఇక్కడ ఒక విషయము, తాబేలు గర్భమందు పుట్టిన వారికే తాబేలు పిల్లల ఆకలి బాధ తీరుట ఎట్లో తెలిసినట్లుగా అన్నారు. అనగా ఈ విషయం మనకు తెలియజేసినవారు తాబేలు గర్భమందు పుట్టినవారేనా? తాబేలు పిల్ల అయి పుట్టి తిరిగి నరజన్మకు వచ్చిన తరువాత ఈ విషయము చెప్పగలరా ?

ఇందుకు సమాధానము : ఈ విషయమును చెప్పినవారు, మహాఋషులు శాస్త్రమునందు చెప్పియున్నారు. వారు సమాన్యులు కారు, సిద్ధ పురుషులు. వారు అణుస్వరూపుము, మహత్స్వరూపములు పొందగలరు. సమస్త జీవ వ్యాపకులు, కనుక అట్టి మహాపురుషులు తాబేలు పిల్లల ఆకలి బాధ ఎట్లు తీరునో తెలుసుకొని మనకు తెలియజేసిరి. ఇది శాస్త్రదృశ్యము, నమ్మి తీరవలెను. "తస్మాత్శాస్త్రం ప్రమాణంతే".

"యే బాధలెరుగని యీ బోధ గల వారిచే" యే బాధలెరుగని యీ బోధ అనగా పరిపూర్ణ బోధ గల వారిచే అని ఒక అర్థము. యీ బోధ గల వారైనను యే బాధలెరుగని వారై యుండాలి అని ఒక అర్థము. పరిపూర్ణ బోధను చక్కగా చెప్పగలిగిన

వారైనను ఎరుక భ్రాంతి రహితులు అని అర్థము. పరిపూర్ణ బోధను చక్కగా చెప్పగలిగినవారైనను ఎరుక భ్రాంతిలో లేని వారి వద్ద యీ బోధ తెలిసికున్న వారికి మాత్రమే యీ పరిపూర్ణ బోధ యొక్క మర్మధర్మములు తెలియబడగలదు అని అర్థము.

---

**అవతారిక :** కేవలము పరిపూర్ణమె ఉన్నది. ఎరుక లేదని, ధృడముగా చెప్పగలిగినంత మాత్రము చేత ఎరుక రహితము కాదనియు, ఎరుకను రహిత పర్చే విధానము తెలసికొని అలాచేయగలిగినప్పుడు మాత్రము ఎరుక రహితమగునని సదృష్టాంతముగా వివరించుచున్నారు.

**208వ పద్యము : ఈ తాపేక్షను మనుజులు। నూతి దరింజేరి నిల్చి నోట గొలిగినన్। యీ తేల వచ్చువారికి । చేతులతో నీళ్ల మీద జేరి యీదకనూ ॥ మును నేర్చిన వారీదించకవానూ ॥ యీ తీరుగనె దేశికేంద్రుడు దెల్పక । చాతుర్యమున బోధ సాధించనయ్యాన ॥ జేరి యీ దకనూ ॥ మును నేర్చిన వారీ దించకనూ ॥**

**టీక :** చాతుర్యమున = బుద్ధి కుశలత చేత.

**భావము :** శిష్యా! ఈత నేర్చుకొనవలెనను కోర్కె గలవాడు జలాశయము దరిజేరి "ఈత రావాలి" అని నోటితో పలుమార్లు పలికినచో వానికి ఈత వచ్చునా? రాదు ఈత వచ్చిన వారి సహాయముతో జలాశయమునందు దిగి ఈదినప్పుడే ఈత వచ్చును. అట్లే యీ బోధ గురుముఖముగా తెలసికొనకుండగ, తన బుద్ధి కుశలతచే నేర్చుకొనదలచినచో యీ బోధ యొక్క మర్మము ఎంతమాత్రము తెలియదు. కనుక చక్కని సద్గురుమూర్తిని ఆశ్రయించి సేవించి తెలిసికొనవలెను.

**విశేష భావము :** "యత్తుస్వతః అప్రాప్తః తత్‌శాస్త్రేణ బోధి తవ్యం" తనకు తానుగా ప్రయత్నించి గ్రహించ లేనిదానిని శాస్త్రము ద్వారా గ్రహించవలెననియు "శాస్త్రజ్ఞోపి స్వతంత్రేణ బ్రహ్మ జ్ఞానాన్వేషణం నకుర్యాత్" శాస్త్రజ్ఞుడు అయినను బ్రహ్మజ్ఞానమును స్వతంత్రముగా అభ్యసింపరాదు. గురుముఖతా మాత్రమే అభ్యసించవలెను అని శాస్త్రవచనము.

ఈ తరానివాడు ఈత నేర్చుకోవాలనుకొన్నప్పుడు గతంలో ఈత నేర్చినవారి సహాయము చే నీళ్లలో దిగి ఈత స్వయముగా నేర్చుకోవాలి. అంతే కాని ఈత రావాలి అని పలుమార్లు నోటితో అన్నప్పటికి ఈతరాదు. అట్లే ఎరుక లేదు అని ఎన్ని లక్షల జపముచేసిననూ ఎరుక నశించదు. ఎరుకను రహిత పర్చుకొనే విధానము ఎరుక రహితమైన గురుమూర్తి ద్వారా తెలుసుకొని అభ్యసించినపుడే ఎరుక రహిత మగును. మరొక విధానముగా ఎరుకపోదు అని భావము.



**అవతారిక :** శిష్యుడు గురుమూర్తి యొక్క త్రివిధ ఉచ్ఛిష్ఠ ప్రసాదములను గ్రహించి, వారి కరుణకు పాత్రుడైన వానికి మాత్రమే బోధ స్థితి అని చెప్పుచున్నారు.

**209వ పద్యము : ప్రవిమల చిత్తుడు శిష్యుడు । సవినయమున దేశికునకు శరణాగతుడై । త్రివిధ ప్రసాదముల గొని । భవనాశస్థితులు లేని పద్ధతి వినివన్ । తిరిగి రాని పద్ధతి గనివన్ ॥ భువిలో వాని సాటి బోల్పవెవ్వరు లేరు । అవిరళ భక్తి నీ వా పద్ధతి నుండే వీ ॥ పద్ధతి వినివన్ । తిరిగి రాని పద్ధతి వినివన్ ॥**

**టీక :** ప్రవిమల చిత్తుడు = అత్యంత నిర్మలమైన మనస్సు కలవాడు, భవనాశ స్థితులు లేని = పుట్టుక చావు వృద్ధులు లేని.

**భావము :** అత్యంత నిర్మలమైన మనస్సు గల శిష్యుడు, వినయ విధేయలతో గురుమూర్తికి శరణాగతుడై, మూడు విధములైన ఉచ్ఛిష్ఠ ప్రసాదములను గైకొని, పుట్టుక చావు, వృద్ధులు లేని విధానమును తెలుసుకొని తిరిగి జన్మకు రాని స్థితిని పొందిన వానికి సాటి ఈ భూమి మీద ఎవ్వరును లేరు. అట్టి పద్ధతిని నీవు గ్రహించుటకై అత్యంత భక్తి చే నీవు గురుమూర్తికి సేవ చేసి ఆ స్థితిని పొందుము.

**విశేష భావము :** 1) ప్రవిమిల చిత్తుడు = నిర్మలమైన మనస్సుగలవాడు, విమల చిత్తుడు. ఇచ్చట "ప్ర" అను ఉపసర్గ ప్రయోగముచే అత్యంత నిర్మలుడు అని భావము. మలినములు మనస్సునకు రజస్తమో గుణములచే కలుగును. సత్త్వగుణ సంబంధ జ్ఞాన వికారము కూడా లేనివాడు. శుద్ధ సత్త్వ జ్ఞానముచే ప్రకాశించేవాడు, ప్రవిమల చిత్తుడు. అనగా త్రిగుణ రహితుడని అర్థము. 2) త్రివిధ ప్రసాదములు - 1) అన్న ప్రసాదము, 2) తీర్థ ప్రసాదము, 3) మంత్ర ప్రసాదము. 1) అన్న

ప్రసాదము = ఉచ్ఛిష్ఠ అన్న ప్రసాదము వలన స్థూల శరీరశుద్ధియు, 2) ఉచ్ఛిష్ఠ పాద తీర్థముచే సూక్ష్మ శరీర శుద్ధియు, 3) ఉచ్ఛిష్ఠ మంత్ర ప్రసాదముచే కారణ శరీర శుద్ధియు కలుగును. త్రివిధ శరీర శుద్ధులుకై శిష్యుడు గురుమూర్తి యొక్క త్రివిధ ఉచ్ఛిష్ఠ ప్రసాదములను అత్యంత భక్తితో సేవించవలెను. ఉచ్ఛిష్ఠ అన్న ప్రసాదమనగా గురుమూర్తి తినిని తరువాత మిగిలిన అన్నమును ప్రసాదముగా కనులకద్దుకొని భుజించుట. అట్టి శిష్యుడు ప్రవిమలచిత్తుడై అనగా శుద్ధ సత్త్వ జ్ఞానముచే చావు పుట్టుకలు లేని పరిపూర్ణ బోధను గురుమూర్తికి శరణాగతుడై చక్కగా సేవించి, గ్రహించనగను. వారి కరుణకు పాత్రుడై తిరిగి జన్మకు రాని పద్ధతిని (ఆ విధానమును) చక్కగా తెలుసుకొని ఆచరించవలయును. అట్టి వానికి సాటి ఎవ్వరునూ ఉండరు.



**అవతారిక :** గురుమూర్తి వద్ద ఉపదేశము కానిదే, బోధను బుద్ధి కుశలతతో నేర్చుకొనినచో విపరీత భావముచే చెడిపోవును, సోదాహరణముగా చెప్పుచున్నారు.

**210వ పద్యము : ఉపనయనము గానిదె, తా । నుపనయనము మీది చదువు నూహను గొనినన్ । విపరీతమగును దానను । చపలుడు, బ్రాహ్మణుడు గాడు, చర్చించి చూడా ॥ శూద్రుడు వాన్ని యర్చించరేడా ॥ ఉపమాచే బోధట్లా ఊహించి నిక్కేటి । కపటాచిత్తుడు, సాధుగుణముతో సమమౌనె ॥ చర్చించి చూడా । శూద్రుడు వాన్ని యర్చించరేడా ॥**

**టీక :** ఉపనయనము = గాయత్రీ మంత్రోపదేశ క్రమము; ఉపనయనము మీది చదువు, ఉపనయనము అయిన తరువాత చెప్పుకొనే విద్య = వేదము, ఊహనుగొనినన్ = బుద్ధి కుశలతతో నేర్చిననూ, విపరీతమగును = వ్యత్యాసమగును (తేడాగా నుండును) చపలుడు = తారుమారు అయినవాడు, చర్చించిచూడ = చక్కగా ఆలోచించి చూడగా, అర్చించరు + ఏడా = అర్చించరేడా = ఎక్కడనూ పూజించరు. ఉపమాచే = ఉపాయము చేత, నిక్కేటి = గర్వించేటి.

**పదవిభాగము :** ఉపనయనము గానిదే, తాను ఉపనయనము మీది చదువును, ఊహను గొనినన్, దానను విపరీతమగును, చర్చించి చూడ (అతడు) బ్రాహ్మణుడు

కాడు. చపలుడు, శూద్రుడు వాన్ని ఏడా అర్చించరు. అట్లా ఉపమాచే బోధన్ ఊహించి నిక్కేటి కపట చిత్తుడు, సాధుగణముతో సమమౌనే? చర్చించి చూడ ॥

**భావము :** శిష్యా ! ఉపనయన వ్రతము కానిదే, ఉపనయనము చేసిన తరువాత చెప్పేవేదవిద్యను, తన బుద్ధి కుశలతచే గ్రంథము నాధారముగా జేసికొని పఠించి నేర్చికొనిననూ, అతనిని బ్రాహ్మణునిగా ఎచ్చటను పూజింపబడడు. జన్మఃతః బ్రాహ్మణుడు అయినప్పటికిన్ని ఆలోచించి చూడగ అతడు చపలుడు, శూద్రునితో సమానుడే. ఆ విధముగానే ఎవరైనను గురూపదేశము పొందకనే శ్రశూషచేయకుండా, పుస్తకము చదివి బుద్ధి కుశలతో విద్య నేర్చి, సభలలో ఉపన్యాసములు, విని యీ బోధను కొంతవరకు గ్రహించి తాను బోధస్తుడనని గర్వించేవాడు. మోసగాడు, అట్టివాడు, గురుశ్రశూషచే బోధ నేర్చిన సాధు సజ్జనునితో ఎట్లు సమానమగును? కనుక అట్టి వానిని గురువుగా, బోధస్థునిగా ఆరాధించరాదు.

**విశేష భావము :** బ్రాహ్మణ కులములో వేద విద్యను అభ్యసించుటకు ముందుగా, గురువు ఆ విద్యార్థికి ఉపనయనము అనే సంస్కారము చేసి, ఆ తరువాత వేద విద్యను చెప్పును. అట్లు వేదమును చెప్పుకొనినవాడే బ్రాహ్మణుడు, ద్విజుడు, విప్రుడు అని అనిపించుకొని పూజార్హుడగును. అట్లు కానిదే ఉపనయమ సంస్కారము లేనిదే బుద్ధి కుశలతచే పుస్తక రీతిగా వేదమును అభ్యసించినచో అట్టి వానిని బ్రాహ్మణుని వలె పూజించరు. కనుక గురువు ఉపదేశము లేకుండగా పుస్తక ఆధారముగా మరి యే ఇతర ఉపాయములచే బోధను గ్రహించిననూ, ఇందలి మర్మ ధర్మములు తెలియక బోధస్థుడు గానేరడు చపలుడు, కపట చిత్తుడు. కనుక ఇట్టివారు శ్రశూషచే బోధ తెలసిన సజ్జనునితో సమానుడు కాడు అని భావము.



**అవతారిక :** మంత్రము + తంత్రము, జ్ఞానము + కర్మము, దైవము + మనుష్యయత్నము, ఇట్లు రెండు కలసినచో ప్రయత్న సాధ్యమగును. ఏ ఒక్కదాని వల్లను పనులు పూర్తి కావు అని చెప్పుచున్నారు.

**211వ పద్యము : మంత్రముచే సంతెట్లగు । తంత్రము లేకున్న కాదు, తంత్రము చేతన్ । మంత్రము లేకను వడుగిల । మంత్రంము, తంత్రంబు రెండు మరిగూడుకొనీ**

**॥ కార్యములన్ని జరిగించు పూనీ ॥ మంత్ర తంత్రములలో మర్మము గురుడెరుగు । మంత్ర తంత్రములలో మరుగెరుగు గురునీచే ॥ మరి గూడుకొనీ కార్యములన్ని జరిగించు పూనీ ॥**

**టీక :** సంతు =సంతానము, ఉపనయనము. ఈ పద్యములో ఉపనయము అని అర్థము (మరాఠీ భాష అని విన్నాను) మర్మము = రహ్యాము.

**దండాన్వయము (పదవిభాగము) :** తంత్రము లేకున్న మంత్రముచే సంతు ఎట్లగు? (కాదు) ఇల వడుగు మంత్రము లేకను తంత్రము చేతను? (కాదు) । మంత్రము మరి తంత్రంబు రెండు గూడుకొని, పూని కార్యములన్నీ జరిగించు । మంత్ర తంత్రములలో మర్మము గురుడెరుగు । మంత్రతంత్రములలో మర్మము గురునిచే ఎరుగు ॥

**భావము :** శిష్యా! కేవలము (గాయత్రీ) మంత్రోపదేశము, ఏవిధమైన తంత్రము లేకున్నచో సంతు (ఉపనయనము) కానేరదు. అలాగే తంత్రము చేతనే మంత్రము లేకున్నను ఉపనయనము (వడుగు) కానేరదు. ఉపనయనము గాయత్రీ మంత్రోపదేశము, మరియు దానికి జరుపవలసిన తంత్రము అగ్ని హోత్ర క్రియ, యజ్ఞోపవీత సంస్కారము ఈ రెండు (మంత్రము + తంత్రము) కలిస్తేనే ఉపనయనము, కొన్ని తంత్రములు (గురుపూజ, తను మన ధనములు ధారపోయుట మొదలగు) జరిగినప్పుడే శిష్యుడు అని అనిపించుకొనును. కేవలము గురుపూజ చేసిననూ, లేక కేవలము మంత్రములు వినినప్పటికి అట్టివాడు శిష్యుడు కానేరడు. మంత్రము, తంత్రము రెండు జరిపించుకొని శిష్యుడు కావలెను. ఆ మంత్రము, తంత్రములలోని రహస్యము గురుమూర్తి ఎరుగును. శిష్యుడు గురుమూర్తి ద్వారా మంత్రము తంత్రములలోని రహస్య భావమునంతయును చక్కగా తెలిసికొనవలెను.

**విశేష భావము :** శిష్యునికి ఉపదేశము జరుగునప్పుడు శిష్యుడు ముందుగా గురుమూర్తికి పాదపూజ చేసి, తను మన ధనములు ధారపోసిన పిమ్మట గురుమూర్తి మంత్రోపదేశము జేయును. ఈ మంత్రము యొక్క అర్థము మాత్రమే గురుమూర్తి శిష్యునికి తెలియజేయుట ఈ మధ్య కాలములో ఆచారమై పోయినది. తంత్రములైన గురుపూజ గురించి, తను మన, ధనములు ధారపోయుట గురించి ఏ మాత్రము తెలియజేయుట లేదు. అట్లు కాకుండగ గురుపూజా కాలమునందే మంత్ర

రహస్యములు తంత్ర రహస్యములు కూడా శిష్యునికి తెలియజేయవలయునని శ్రీ కృష్ణ దేశికేంద్రులు ఈ పద్యము ద్వారా మనకు తెలియజేయుచున్నారు.

ఇట్టి తంత్రములు లేకుండగ మంత్రోపదేశము చేత గాని, మంత్రోపదేశము లేకుండగ తంత్రములు మాత్రమే చేయుటచే గాని శిష్యుడు కాలేడనియు, రెండునూ సక్రమముగా సంప్రదాయ సిద్ధముగా జరుపవలెనని నిష్కర్షగా ఈ పద్యములో చెప్పబడినది.

ఈ పద్యములో ప్రయోగించిన "సంతు" అనే పదమునకు సంతానము అని అర్థము ఉన్నను, ఆ అర్ధము ఈ పద్యములో ఎంత మాత్రమును సమన్వయము కాదు. సంతు అనగా ఉపనయనము అని అర్థము, చెప్పవలసినదిగా, మూడవ పాదము "మంత్రము లేకను వడుగిల" అనుపదము వాడినారు. (వడుగు + ఇల) కనుక సంతు అను పదమునకు ఉపనయనము, వడుగు అని మాత్రమే అర్థము చెప్పవలసినదిగా శ్రీ కృష్ణ దేశికేంద్రులు ఆదేశించుచున్నారు. సంతు అనే పదము వడుగు అనే తెనుగు పదమునకు మరాఠీ పదము అని విన్నాను.

---

**212వ పద్యము : సంకల్పాదిక గుణముల । సంకుల మీ యెరుక యందు సమకూడుండున్ । సంకల్పాదిక గుణముల । సంకుల మచలమున జూడ జూడలేదన్నా॥ యీ రెంటికి యీడూ గాదన్నా ॥ కొంకక యీ రెంట్ని గూర్చి గ్రంథము జేస్తి । సంకోచింపక జదువు, శంకపుట్టదు, శంక ॥ జూడ లేదన్నా । యీ రెంటికి యీడు గాదన్నా ॥**

**టీక :** సంకల్పాదిక గుణములు = సంకల్పము నిశ్చయము మొదలగు గుణములు, సంకులము = పూర్వోత్తర విరుద్ధమైనవి, ఒక దానితోనొకటి కలసినది, వ్యాపించినది. యీడు = సరిగాదు, కొంకక = భయపడక, అనుమానించక, శంక = ఎరుక.

**భావము :** శిష్యా! సంకల్పము మొదలగు గుణములు , విరుద్ధ గుణములు కల రెంటి కలయిక యెరుక యందు నిత్యము కలసియుండును. ఇట్టి రెంటి కలయిక పరిపూర్ణము నందు వెదకి జూచినను ఎంతమాత్రము లేదు. కనుక ఎరుక పరిపూర్ణము ఈ రెంటికి ఎంతమాత్రము పోలిక లేదు. భయపడక (సంశయించక) ఎరుక

పరిపూర్ణములను గురించి యీ గ్రంథము రచించితిని. నీవును సంకోచము లేకుండగ గురుముఖముగా బాగుగా చదవి ధృడపరచుకొన్నచో యిక తిరిగి యెరుక పుట్టదు. ఇందులో అనుమానము లేదు.

**విశేష భావము** : సంకులము అనగా రెండు విరుద్ధ గుణముల వస్తు కలయిక. (పూర్వోత్తర విరుద్ధ గుణములు కలది అని నిఘంటు అర్థము) అనగా ఎరుక అని చెప్పవలెను. ఇందు 1) అంతఃకరణము, 2) అందలి ప్రతిబింబ చైతన్యము.

1) అంతః కరణము = ఇదియే అవిద్య. జన్మకు మూలకారణము. త్రిగుణాత్మకము. స్వతః లేనిది కర్మ స్వరూపము 2) ఇందలి ప్రతిబింబ చైతన్యము - ప్రతిబింబము కనుక స్వతః లేనిదే. కేవల జ్ఞాన స్వరూపము, నిష్క్రియ సాక్షీ మాత్రము. అంతః కరణము ప్రతిబింబము రెండును విరుద్ధ గుణములు కలది. ఈ రెంటి కలయిక వలన ఎరుక అయినది. ప్రతిబింబము వలన అంతఃకరణము, అంతఃకరణము వలన ప్రతిబింబము ఉనికి గలిగినవై "లేని ఎరుక" అనబడుచున్నది. ఇది "సంకులము" అనే పదమునకు అర్థము. ఈ రెండు విడదీయరానిది. విడివడి యెన్నడు ఉండవు అని చెప్పుటకే "సంకల్పాదిక గుణముల సంకులము యీ యెరుక యందు సమకూడున్" అన్నారు.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతా ఽ ద్వైత రహిత పరమతత్త్వే
బోధ పఠన లక్షణన్నామ
ద్వాదశోధ్యాయమునకు భావ విశేష భావములు సమాప్తము.

# 12వ అధ్యాయమునకు - సంక్షిప్త భావము

ఈ అధ్యాయములో పరిపూర్ణ బోధ సామాన్యమైనది కాదు. బోధ యందు మిక్కిలి అనురాగము కల్గి, అనేక మార్లు గురుముఖముగా చక్కగా వినుచూ, నిత్యము మననము చేసి కొనుచుండ వలెను. అట్లు చేసినచో నామ రూప క్రియ నటనలు కలిగి, సమస్తమునకు మూల కారణమైన ఎరుకను ఎంతమాత్రము నిల్వ ఉండక లేకపోవును. ఎంత బోధ చెపిన్పను శిష్యునికి మొట్టమదటగా చెప్పిన ద్వాదశి, షోడశి, పంచదశి మంత్రముల వివరణే అగును. అనగా సమస్త బోధ ఆ మూడు మంత్రములలోనే ఉన్నది. కనుక మంత్రములను చక్కగా మరపులేకుండా ధృడమయ్యేలాగున జపించవలెను. యీ బోధ చక్కగా ధృడపర్చుకొని పరిపూర్ణమును జూచినచో ఎరుక పూర్తిగా నశించును.

ఇట్టి గురుబోధను చక్కగా చెప్పగల శ్రోత్రియుడు బ్రహ్మజ్ఞాన సంపన్నుడు అయిన గురువు దొరకినచో, అవకాశము చేజార్చుకొనక ఆ గురువును చక్కగా ఆశ్రయించి బోధను పొందవలెను. ఇట్టి బోధ ఎప్పుడు పడితే అప్పుడు, ఎవరి దగ్గరయినా పొంద గలిగేది కాదు.

ఈ గ్రంథము చాలా గొప్పది. ఒకటి లేనిదే ఉన్నట్లు కనిపించే మిథ్యా స్వరూపము యెరుక. రెండవది శాశ్వతమైన పరిపూర్ణ పరబ్రహ్మము. ఈ రెంటి విషయమే సమస్త గ్రంథసారము. మొదటిది లేనిది ఉన్నట్లు భ్రమింపజేసేది. రెండవది గుహ్యాతి గుహ్యాతమమైన శాశ్వత బ్రహ్మము. రెంటిని చక్కగా గురుముఖతా విచారించి తెలుసుకొని ఆ తెలిసిన జ్ఞానమైన యెరుకను గురుకరుణచే రహిత పర్చుకొనినచో అట్టి వానికి పునరావృత్తి లేకుండాపోవును. అట్టి గొప్ప ఫలితమునిచ్చే సద్గ్రంధమే; యీ శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థములు" అనే గ్రంథము. సమస్త శాస్త్రములకు అతీతమైనది.

ఇది తెలుసుకొనే శిష్యుడు చక్కని జ్ఞాన సంస్కారయుతుడై, గురు శుశ్రూషచే గురుకరుణకు పాత్రుడై, శ్రవణ మనన నిధి ధ్యాసయుక్తముగా బోధను ఆరూఢ పర్చుకొని, ఎరుకను రహితమయే విధానము కూడా చక్కగా గురుకరుణచే అభ్యసించిన వానికి మాత్రమే బోధ స్థితి కుదురును. ఇది సద్గురుముఖముగా మాత్రమే

అభ్యసించవలెను. గురువు లేకుండగా ఇతర విధానములచే ఉపదేశము లేకుండగా కేవల ఉపాయములచే బోధ గుర్తించినా ఫలితము శూన్యము. జన్మ రహితము కానేరదు. ఈ విషయము **209, 210, 211** పద్యములలో నిరూపించియున్నారు.

ఎరుక ఎట్టిదో 212వ పద్యములో చక్కగా వివరించియున్నారు. ఎరుక రెంటి విరుద్ధ గుణములుక ల వస్తు కలయిక. అంతఃకరణము ప్రతిబింబ చైతన్యము. ఈ రెండు ఒకటి కర్మ స్వరూపము, రెండవది జ్ఞాన స్వరూపము, సాక్షి మాత్రము. రెండునూ లేనివే, ఒక దాని వలన రెండవది ఉనికిని పొందినదై రెండును కలిసి "లేని ఎరుక" అయినది. ఇట్టి యెరుక ఎంతమాత్రము లేనిది పరిపూర్ణము. సమస్త శాస్త్రములలో ఎరుక శాశ్వతమైనది అని చెప్పినారు. అందుకు విరుద్ధముగా ఈ గ్రంథములో ఎరుక ఎంతమాత్రము లేనిదనియు, పరిపూర్ణ పరబ్రహ్మమే శాశ్వతమైనదని శృతియుక్తముగా నిరూపించినారు.

శృతులలోను వేదాంత శాస్త్రములోను పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి చెప్పబడినది. ఎరుక లేనిదని చెప్పక జగదధిష్ఠానమైన ఆత్మయనియు, పరిపూర్ణ బ్రహ్మమును ఆత్మ అనియు చెప్పుటచే, ఎరుక బ్రహ్మలు కేటాయింపుగా చెప్పబడక గజిబిజిగా చెప్పబడినది. ఒకసారి బ్రహ్మము సమస్త జగదాధారమనియు, మరొకసారి బ్రహ్మము నిర్వికార, నిర్గుణ కేవల పరమాత్మయనియు చెప్పుటచే ఆ రెండు, ఒకటి లేని బ్రహ్మ, రెండవది శాశ్వత బ్రహ్మమని తెలియక శాస్త్ర జ్ఞానముచే కేవల బ్రహ్మము నిరూపితము కల్గుటలేదు. విడిగా కేటాయించి నిర్ణయించుటచే ఇది సర్వులకు సువేద్యముగా ఉన్నది. అయినను శాస్త్రజ్ఞులకు విరుద్ధముగా తోచవచ్చును. అయినను భయపడక శాస్త్రజ్ఞులకు విరుద్ధము అయినను అందరు తత్త్వజ్ఞులు కావలెనను ఆశయము చేత యీ గ్రంథము ఎరుక పరిపూర్ణముల గురించి విపులముగా చర్చించి యెరుక లేనిది అని నిరూపించినారు. అందుకే "కొంకక యీ గ్రంథము జేస్తి" సంకోచించక చదువుము, శంక మళ్ళీ పుట్టదు" అని 212వ పద్యములో "భయపడక" కొంకక అన్న పదము ప్రయోగించినారు. యీ గ్రంథమునకు సాటి మరేదియు ఉండదనుట నిర్వివాదము.

॥ జై గురు ॥

## అధ్యాయము - 13

# భద్రాద్యంకితము (8)

**అవతారిక :** ఈ గ్రంధమును శ్రీకృష్ణదేశికేంద్రులు తనకు ఇష్ట దైవము, కుల దైవము అయిన శ్రీ భద్రాచల శ్రీ రామచంద్రునికి అంకితమిచ్చిరి. అయితే భద్రాచలము, శ్రీ రామచంద్రుడు, ఈ రెండు ఏవిటో, వేటికి సంకేత పదములుగా గుర్తించవలెనో ఈ పద్యములో వివరించిరి.

**213వ పద్యము : అలభద్రాచల మనివబ । యలుగా గుర్తెరుగ వలయు, యెరుకను విష్ణుం । దులదోచి గురుని కృపచే । నిలువక విష్ణ్వగిరి పోతె, నిశ్చయమదిరా ॥ కృష్ణదాసు నిశ్చయ మదిరా ॥ యిల మీద యెవరైన యీ కందార్థముల లోపలి । గూఢార్థము దెలియ భ్రమను జెందరువారు ॥ నిశ్చయ మదిరా ॥ కృష్ణదాసు నిశ్చయమదిరా॥**

**భావము :** భద్రాచలము అనగా ఆ పరిపూర్ణమేనని తెలసి అందు ఎరుక అనే విష్ణువు ఉన్నట్లు తోచి, గురుకరుణచే విష్ణువు నిలువక ఎగిరిపోతే (లేకపోతే) ఇక ఉన్నది యేదో అదే నిశ్చయమైనది (శాశ్వతమైనది) (రచయిత) కృష్ణ దాసు యొక్క మనో నిశ్చయమదే. ఎవరైనను ఈ కందార్థములలో ఉన్న రహస్య భావము (పరిపూర్ణ బ్రహ్మము)ను తెలిసికొన్నచో వారు భ్రమను (ఎరుక స్థితిని) చెందరు. వారు పరిపూర్ణ స్థితిని పొందుట నిశ్చయము.

**విశేష భావము :** భద్రమైన అచలము = భద్రాచలము (భద్ర + అచలము) అచలములు 2. ఒకటి చలన గర్భిత అచలము. అఖండ ఎరుక - జగదధిష్ఠానము. రెండవది - తాను గాని, ఇతరమును గాని చలింపజేయు సత్తా ఎంత మాత్రము లేనిది. ఇదే పరిపూర్ణము. మొదటి అచలము లేనిది. రెండవ అచలము స్వతస్సిద్ధమై శాశ్వతమైనది. కనుక ఇదే భద్ర, అచలము భద్రాచలము అని యీ పద్యములో చెప్పబడినది.

పరిపూర్ణములో లేక తోచిన యెరుకే విష్ణువు, మూల ప్రకృతి అనేక సహస్రనామములతో పేర్కొనబడినది. నామ రూప క్రియా సహితము. అందుకే "ఎరుకను విష్ణువు" అన్నారు. ఇట్టి యెరుక గురు కరుణచే లేకపోతే, ఇక ఉన్నది శాశ్వతమైనది పరిపూర్ణము మాత్రమే. ఇది తప్ప మరేదియు లేదని కృష్ణదేశికేంద్రుల నిశ్చయము.

**214వ పద్యము : భాగవతులు నారాయణ । యోగికి జానకి యనేటి యువిదా మణికిన్ । బాగుగ పుత్రుడనై, భూ ! భాగమునన్ కృష్ణ ననుచు । ప్రభవించినానూ॥ యనంతికి ప్రభువు నైనాను ॥ నా గురువు కృపచేత నయమైన యీ బోధ। నేగంటి, కన్నంత నీకు దెల్పుటకిట్లు ॥ ప్రభవించినాను । అనంతకి ప్రభువునైనాను ॥**

**టీక :** యువిదామణికిన్ = శ్రేష్ఠమైన స్త్రీకి (తల్లికి) ప్రభవించినాను = పుట్టినాను. ప్రభువు = అధిపుడు, భర్త; నయమైన = మృదువైన, నీతైన.

**భావము :** శ్రీ భాగవతుల నారాయణయోగి - జానకి అనే దంపతులకు కృష్ణభట్టు అను పేరుతో జన్మించినాను. అనంతలక్ష్మికి భర్తనయినాను. నా సద్గురుమూర్తి (పరశురామ సీతారామస్వామి) కృపచే గొప్పదైన యీ పరిపూర్ణ బోధ విని తెలుసుకున్నాను. అదంతయు నీకు (శిష్యా!) తెలియపర్చుటకు యీ విధముగా గురువునై ప్రభవించినాను.

**విశేష భావము :** "అనంతికి ప్రభువైనాను" ప్రభువు అనగా తెలివికి మొదటి చోటు అని అర్థము కలదు. అనంతికి అనగా లేని మాయ అంతట ఉన్నట్లుగా కనిపించేది కనుకనే విష్ణువు అనే పదము కూడా ఉన్నది. అట్టి అనంతికి (మాయ, అవిద్య) ప్రభువును అనగా అందలి అఖండ జ్ఞానశక్తి స్వరూపమైన ప్రతిబింబ చైతన్యము. గురు స్వరూపము. అఖండ గురుస్వరూపుడై, గురుకరుణచే పరిపూర్ణ బ్రహ్మమును తెలసి లేకుండాపోయిన ప్రభువు అని విశేష భావము.

---

**215వ పద్యము : దేశాటనంబు జేసితి । వ్రాసితి గ్రంథములు కొన్ని, వరగురు శిష్యుల్ । జేసేటి చర్చవింటిని । రోసితి మోక్షాద్యపేక్ష; రూఢిగ వినుమీ ॥ నీ విట్టి యారూఢత గనుమీ ॥ దేశికు దయబుట్టజేసి శుశ్రూషోప । దేశముగొని యుపదేశమిచ్చితి మెచ్చి ॥ రూఢిగ వినుమీ । నీ విట్టి యారూఢత గనుమీ ॥**

**టీక :** వరుగురు శిష్యుల్ = శ్రేష్ఠమైన గురుశిష్యులు, చర్చ = విచారణ, ఆరూఢత - ధృడత్వము.

**దండాన్వయము :** దేశికు దయబుట్ట శుశ్రూషజేసి, ఉపదేశముగొని, మెచ్చి (నీకు)

ఉపదేశమిచ్చితి, రూఢిగ వినుమీ ॥

**భావము :** నేను (శ్రీకృష్ణదేశికులు) దేశములో చాలా చోట్ల తిరిగితిని. కొన్ని గ్రంథములు కూడా వ్రాసితిని. శ్రేష్ఠులైన గురుశిష్యులు జేసే వేదాంత విచారణ వింటిని. చివరకు మోక్షము మొదలైనవాటి యందు ఆపేక్ష విడచిపెట్టాను. సద్గురు మూర్తికి దయబుట్టులాగున శ్రుశూషలు చేసి, ఉపదేశము తీసుకొని బోధవిని, తిరిగి నేను కొందరికి మెచ్చి ఉపదేశము ఇచ్చినాను. శిష్యా! నీవు కూడా ఇట్టి ఆరూఢ స్థితిని పొందవలయును.

**విశేష భావము :** "దేశాటనంబు చేసితి, వరగురుశిష్యులు చేసేటి చర్చవింటిని" అన్నారు. అనగా అనేకచోట్ల అనేకమైన శాస్త్రపండితులు చెప్పుకునే బోధలు విని తాను తన గురుమూర్తి వద్ద తెలుసుకొన్న బోధకు మించినది లేదని, గట్టిగా తెలుసుకొన్న తరువాతనే, మనందరు గ్రహించుటకై ఈ బోధను ఈ గ్రంద రూపముగా మనకు తెలియపర్చినట్లు గ్రహించవలెను.

---

**216వ పద్యము : హటమున కుటిలాత్ముని, జం। పుట్టకై భటకోటి కాజ్ఞ భూపతియిడినన్ । భటు లటువలె జేసెటిలో । పట, కుటిలుడు పడిన పాట్లు, పాటించి కనునా ॥ అట్లనె గురుని నోట తా వినెనా । యిటువంటి బోధను, యెటువంటి నరుడైన । అటువెనక తన చేష్ఠ లెటువంటి వొ వాట్ని ॥ పాటించికనునా । అట్లనెగురుని నోట తావినెనా ॥**

**టీక :** హటమున = బలాత్కారమున, పట్టుకొని, కుటిలాత్ముని = తప్పుచేసిన వానిని.

**దండాన్వయము :** అట్లనె యిటువంటి బోధను యెటువంటి నరుడైన, గురుని నోట తా వినెనా, అటు వెనుక తన చేష్ఠలెటువంటివో, వాటిని పాటించి కనునా? (కనడు)

**భావము :** ఒక నేరము చేసిన దుష్టుని పట్టుకొని, ఉరితీయమని మహారాజు గారు భటులకు ఆజ్ఞయిచ్చాడు. ఆ నేరస్థుని పట్టుకొని భటులు వానిని ఉరితీసే లోపల,

ఆ దుష్టుడు తాను ఇదివరలో చేసిన నేరముల గురించి విచారించుకుంటూ ఉంటాడా? (అలా చేయడు, తాను ఇకెంత కాలము బ్రతికి ఉండునో, ఇక ఉరి తీయబడుటకు ఎంతకాలము ఉన్నది అనే ఆలోచనతోనే ఉంటాడు) అట్లే ఎటువంటి నరుడైనను సద్గురుమూర్తి ద్వారా ఉపదేశము పొంది, ముఖతః పరిపూర్ణ బోధను చక్కగా గ్రహించిన పిమ్మట ఆ నరుడు తన వెనుకటి చేష్టలు (కర్మల గురించి) వగైరా విచారించగలడా! అట్టి యెరుక చేష్టలు చేయడు అని భావము.

---

**217వ పద్యము : సకల జనుల సమ్మతిగా । నొక్కరైనను నడువలేరు నుర్వీస్థలిపై । మకరాంక జననీ జనకా । ద్యకళంకుల లోన నేనీ, నన నేమి గణనా ॥ బోధందితర జనులేమి గణనా ॥ వికల మానసుడవై వెతనొంద బోకు, నీ । నకుటిల భక్తుడవని దెల్పితీ బోధ ॥ ననేమి గణనా । బోధందితర జనులేమి గణనా ॥**

**టీక :** మకరాంక జననీ జనకులు = (మొసలి జండా గుర్తు గలవాడు) మన్మథుని తలిదండ్రులు = లక్ష్మీదేవి, విష్ణుమూర్తి, ఆది = మొదలైన, అకళంకులు = తప్పులేనివారు, వికలమానసుడు = మనస్సులో బాధపడినవాడు, వెత = బాధ, గణనా=లెక్కయా?

**దండాన్వయము :** మకరాంక జననీ, జనకాద్యకళంకులలోన నొక్కరైనను ఉర్వీస్థలిపై సకల జనుల సమ్మతిగా నడువలేరు. నే-నీవు, అనన్ ఏమీ గణనా ? ఇతర జనులు యీ బోధను అనన్, వికల మానసుడవై వెతనొందబోకు । నీవు అకుటిల భక్తుడవని (ఈ బోధ) తెల్పితి. ఏమి గణనా? ॥

**భావము :** శిష్యా! సకల జనుల సమ్మతిగా ఈ భూమి మీద ఒకరైనను నడువలేరు। మహాలక్ష్మి మహావిష్ణువు ఆదిగా గల కళంక రహితులైనను, సకల జనుల సమ్మతిగా కాలేకపోయిరి. ఇక నీవు, నేను ఒక లెక్కయా? ఈ బోధలోని ఇతర జనులు ఈ బోధను అనేక రకములుగా (విపరీత భావనలతో) చెప్పెదరు. వారి మాటలు విని మనసులో బాధపడకు నీవు కుటిలత్వము లేని నిజమైన భక్తుడవని ఈ బోధ నీకు జెప్పితిని. ఇతరుల తప్పుడు వ్యాఖ్యానములకు బాదపడకు వాటిని లెక్కించకుము.

---

**218వ పద్యము : బల ధన విద్యలు దుష్టుల । కిల గల్గిన నొరుల నొంతు రీర్ష్యము చేతన్ । బల ధన విద్యలు శిష్టుల । కిలగల్గిన నొరుల బ్రోతు రెంతో మోదమున ॥ నీ వీ రెంటి నెరిగి మోదమున ॥ కలలోనైన దుష్టుల చెంత జేరకు । మెలమి శిష్టుల చెంత కలనైన వదలకు ॥ యెంతో మోదమున । నీవీ రెంటినెరిగి మోదమున ॥**

**టీక :** నొంతురు = బాధింతురు, ఎలమి = సంతోషము.

**దండాన్వయము :** బలధన విద్యలు ఇలన్ దుష్టుల కల్గిన ఈర్ష్య చేతన్, ఒరుల నొంతురు । బలధన విద్యలు ఇలన్ శిష్టుల గలిగిన ఎంతో మోదమునన్ ఒరుల బ్రోతురు । మోదమునన్ నీవీ రెంటి నెరిగి కలలోనైన దుష్టుల చెంత జేరకు । ఎలమిన్ శిష్టుల చెంత కలనైనా వదలకుము.

**భావము :** శిష్యా! బలము ధనము విద్య ఈ మూడును దుష్టుల వద్ద ఉన్నచో ఈర్ష్యచే ఇతరులను ఎంతగానో బాధించెదరు. ఆ బలధన విద్యలు మంచివారికి కలిగినచో ఇతరులకు సంతోషముతో సహాయపడెదరు. వారి ఆపదలను కాచెదరు. ఈ రెంటి విషయము బాగుగ గుర్తించి, నీవు దుష్ట సహవాసము కలలో నైనా చేయకుము. సజ్జన సహవాసము కలనైనా విడువకముము. అనగా బల ధన విద్యలు దుష్టుని వద్ద ఉన్ననూ అతనిని ఆశ్రయింపకుము అని పద్య భావము.

---

**అవతారిక :** "సహవాసయా దోష గుణాను భవంతి" సహవాసము చేతనే మంచి చెడులు గలుగును కనుక విచారించి మంచివారి సహవాసము చేయుము అనగా పునరావృత్తి లేని వారి సహవాసము చేయుము అని చెప్పుచున్నారు.

**219వ పద్యము : అందమగు స్వాతి వర్షపు । బిందువు లెందెందు పడునో పృథ్విని తత్త । ద్బిందువు లుపాధి వశమున । జెందును తగు నామరూప, చేష్టాదికమును ॥ అట్లనె నీవు చెందేవిన్నియును ॥ మందితోజత గూడి మాట్లాడినంతలో । అందుకే సహవాస మరయుము తగుదాన్ని ॥ చేష్టాదికమును । అట్లనే నీవు చెందే విన్నియునూ॥**

**దండాన్వయము :** అట్లనే నీవు మందితో జతగూడిమాట్లాడినంతలో ఇవన్నియు చెందేవు । అందుకే తగుదాన్ని సహవాసము అరయుము.

**భావము :** శిష్యా! వానకాలములోని స్వాతి కార్తె యందు పడిన వర్షపు బిందువు ఎక్కడెక్కడ పడునో ఆయా ఉపాధివశముచే ఆ బిందువులకు ఉపాధి గత నామ రూప క్రియా విశేషములు కలుగుచున్నవి. ఆ విధముగానే నీవు ఎట్టి వారి సహవాసము చేసితివో ఆయా నామ రూప క్రియా విశేషములు గల నానా జన్మలు పొందుచున్నావు. కనుక ఎట్టి వారి సహవాసము చేయవలెనో చక్కగా విచారించి తెలుసుకొని అట్టి సహవాసము చేయుము.

**విశేష భావము :** స్వాతి వర్షపు బిందువు సముద్రములోని ముత్యపు చిప్ప పురుగు యందు పడినచో మంచి ముత్యముగా మారును. అదే బిందువు సముద్రములో పడినచో ఉప్పు నీరుగా మారును. ఎర్ర నేల యందు పడినచో ఎర్ర నీరుగాను, చేల యందు క్రిములుగా మారుచున్నది. బిందువు ఒక్క రకమే అయినా ఉపాధి బేధముచే నామరూప క్రియలు మారిపోవుచున్నవి. అట్లే వ్యక్తులు చేసిన సహవాసము వల్ల ఆయాకర్మలు చేస్తూ తిరిగి ఆయా జన్మలు ఎత్తుచున్నారు. కనుక సహవాసము ఎట్టివారితో చేయవలెనో చక్కగా ఆలోచించవలెను. ఉన్నవారి (ఎరుకవారి) సహవాసముచే పునరావృత్తియు, ఎరుక లేని వారి మహాత్ముల సహవాసముచే జన్మ రహిత స్థితిని పొందగలరని ఈ పద్య భావము.

**220వ పద్యము : జారులకు లోకులందరు । జారుల వలె తోచబడుట సహజ గుణంబౌ। చోరులకు సకల జనములు । చోరకులని మదికి దోచుచునికి, సహజమురా। అట్లనె దుష్టాత్మునికి సహజమురా ॥ సారము లేని సంసారాబ్ధి దాటించు । వారీని తమ వంటి వారీగ గనుటట్టీ ॥ సహజమురా । అట్లనె దుష్టాత్మునికి సహజమురా ॥**

**దండాన్వయము :** అట్లనె, సారములేని సంసారాబ్ధి దాటించు వారిని, తన వంటి వారిగ గనుట, దుష్టాత్మునికి సహజమురా ॥

**టీక :** జారులు = వ్యభిచారులు, చోరులు = దొంగలు, సంసారాబ్ధి = సంసార సముద్రము, ఉనికి = స్థితి.

**భావము :** శిష్యా! వ్యభిచారులకు జనులందరు వ్యభిచారులగను, దొంగలకు జనులందరు దొంగలుగాను, తోచుట అది వారి సహజ గుణము. అట్లనే దుష్టులకు,

శాశ్వతము కాని యీ జన్మ పరంపర అనే సముద్రమును దాటింపజేయు మహాపురుషులు, తమ వంటి వారిగనే తోచుట సహజమైన ఉనికి అని తెలుసుకొనుము.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతా ऽ_ద్వైత రహిత పరమతత్త్వే
భద్రాద్యంకిత న్నామ
త్రయోదశాధ్యాయమునకు
భావ విశేషభావములు సమాప్తము.

# 13వ అధ్యాయమునకు సంక్షిప్త భావము

ఈ అధ్యాయములో శ్రీ కృష్ణ దేశికేంద్రులు గ్రంథమును భద్రాద్రికి అంకితము అను పేరుతో వ్యవహరించిరి. భద్రాద్రి + అంకితము = భద్రాద్ర్యంకితము. భద్రాద్రి అనగా భద్రమైన అచలము = పరిపూర్ణ పరబ్రహ్మమని, అందు విష్ణువు అనే ఎరుక తోచి, గురుకృపచే విష్ణువు (ఎరుక) లేకుండా పోతే, ఉన్నది శాశ్వతమైన బ్రహ్మమని తన నిశ్చయ భావమని చెప్పిరి. అంతేకాని అంకితము చేయుచున్నట్లు చెప్పలేదు. అంటే ఈ గ్రంథము వ్రాసినది ఎరుక. వ్రాయించిన గురుమూర్తి (విష్ణువు) ఎరుక. అంకితము పొందిన కృతి భర్త ఎరుక. అంతా ఎరుకే. అట్టి ఎరుక గురుకృపచే నిలుచుటకు స్థానము, లేకుండా పోతే అంటే కృతి, కృతికర్త, కృతి భర్త ఈ మూడు లేనివే, లేకుండా పోతే, ఉన్నది శాశ్వతమైన పరిపూర్ణము మాత్రమే. పరిపూర్ణము కేవల నిర్వికారము, కృతి కాదు. కృతి కర్తకాదు, కృతి భర్త కాదు. పరిపూర్ణములో ఈ సమస్తము లేక తోచి, లేకుండా పోయినది అని నిశ్చయించిరి. ఇట్టి గ్రంథ భావము ఎవరైతే చదివి విని, ఇందలి గూఢార్థమైన బ్రహ్మజ్ఞానము పొందుదురో అట్టివారు ఎరుక రహితులై, పునరావృత్తిని పొందరు.

శ్రీకృష్ణ దేశికేంద్రులు తన జన్మవృత్తాంతమును తెలియపర్చుకొన్నారు. వీరి తండ్రి శ్రీ నారాయణ యోగి అనియు, తల్లి మాతృమూర్తి జానకి యనియు, తన పేరు కృష్ణభట్టు అనియు అనంతలక్ష్మికి భర్తననియు తెలియపర్చుకున్నారు. మరియు "అనంతికి ప్రభువైనాను" అని తెల్పుటలో "ద్వ్యర్థి" ఉపయోగించిరి.

1) అనంత లక్ష్మికి భర్తనని ఒక అర్థము, 2) అనంతమైన బ్రహ్మజ్ఞాన సంపదకు ప్రభువు అనగా అధిపుడనని చెప్పిరి. ఈ రెండు అర్థములుగా ఆ వాక్య ప్రయోగము చేసిరి. ఎన్నో ప్రాంతములు పర్యటించి, ఎంతో మంది శ్రేష్ఠమైన గురు - శిష్యులు చేసే చర్చలు, పాఠములు వింటూ ఎన్నో శ్రేష్ఠమైన గ్రంథములు చదివి, తన పరిపూర్ణ గురుమూర్తి అయిన శ్రీ పరశురామ సీతారామస్వామికి శుశ్రూషచే దయబుట్టులాగున సేవ చేసుకొని, వారి వల్ల ఈ పరిపూర్ణ బోధను గ్రహించి ఆరూఢులై అనేకమందికి ఉపదేశములు చేసి, సర్వులకు గజిబిజి లేకుండగ సమస్త గ్రంథరాజసారము తీసి ఈ గ్రంథము రచించినట్లు చెప్పినారు. ఈ పరిపూర్ణ సిద్ధాంతము అందరికి రుచించకపోవచ్చుననియు, ఈ గ్రంథ కర్తనయిన తాను గాని, యీ సిద్ధాంతమును తెలుసుకొన్న ఘనులు కూడా అందరి మన్ననలు పొందలేకపోవచ్చుననియు, సకల జనుల సమ్మతి మహాలక్ష్మి శ్రీమహావిష్ణువులకే కుదరలేకపోయినప్పుడు, మన మెంత వారమనియు, ఎవరో ఏదో కుసంస్కారముచే నిందించినచో వికల మానసులు కాకుండా ఈబోధను విడువ వలదనియు, ఇట్టి పరిపూర్ణ బోధచే మాత్రమే జన్మ రహిత స్థితి కుదరగలదని ఈ అధ్యాయములో రూఢి పరచిరి.

॥ జై గురు ॥

## అధ్యాయము - 14

# 14. గురుని లక్షణము - (11)

**అవతారిక :** గురువు అనగా ఎట్టి లక్షణములు కలిగియుండవలెనో 221, 222 పద్యములలో చెప్పుచున్నారు.

**221వ పద్యము : బయలెరుకలు శిష్యునకున్ । దయతో గురెడరుకజేసి తరువాతను, సం। దియమేమి లేక యెరుకన్ । నయమున విడిపించు గరుడు, నయశాలి గాడా ॥ నీ మది కిది నాటె నా లేదా ॥ భయ భక్తి గురుసార్వభౌముని సేవ, ని । శ్చయముగ జేసితె జయమందెదొ గురుడు ॥ నయశాలిగాడా । నీ మదికిది నాటెనా లేదా ॥**

**టీక :** నయమున = నీతిగ, చక్కగా, పూర్తిగా, నయశాలి = మేలైనవాడు, నిశ్చయముగ = నిర్ణయముగ.

**దండాన్వయము :** బయలెరుకలు శిష్యునకున్, సందియమేమిలేకన్ దయతో గురుడెరుకజేసి । తరువాతను, యెరుకన్ నయమున విడిపించు గరుడు నయశాలి గాడా ! ఇది నీ మదికి నాటెనా లేదా? ! గురు సార్వభౌముని సేవ భయభక్తిన్ నిశ్చయముగా జేసితె జయమందెదొ ॥

**భావము :** పరిపూర్ణము యెరుకల గురించి శిష్యునకు ఎంతమాత్రము సందేహము లేకుండగ, గురుమూర్తి దయతో చక్కగా తెలియపరచి, ఆ తరువాత యెరుకను చక్కగా విడిపించే గురుడు మేలైన గురుడు. అవునా? ఈ నా మాట నీ మనస్సుకు సరిపోయెనా? లేదా?! కనుక ఆ విధముగా గురుసార్వభౌముని సేవ, భయ భక్తితో నిర్ణయముగా చేసినచో ఆ శిష్యుడు తప్పక జయమందగలడు. (అనగా తప్పక జన్మరహితుడు కాగలడు) అట్లు ఎరుకను విడిపించుగరుడు మాత్రమే మేలైన గురుడు.

**విశేష భావము :** మేలైన గురుని లక్షణము ఈ పద్యములో వివరించియున్నారు. పరిపూర్ణము, ఎరుకల రెంటిని వస్తు నిశ్చయముగా రూఢి పర్చి ఎరుకను వదిలించేటి మహాత్ముడే గురువు. అట్టి గురువునకు భయ భక్తులతో శిష్యుడు సేవ చేసుకుంటే తప్పక జన్మరహిత స్థితిని పొందగలడు. సేవ అంటే కేవలము శరీరమునకు చేసే

సేవయే అని అర్థము కాదు. అనుష్ఠానము, జపము, ధ్యానము చేసికొనుచు బోధను శ్రవణమనన నిధిధ్యాసలతో గ్రహించి వస్తు నిశ్చయముగా ఆరూఢునిగా అయిన శిష్యుడు మాత్రమే విజయమందగలడు. అట్టి విధముగా శిష్యుని తీర్చిదిద్దగల మహాత్ముడే గురువు అనబడును.

---

**222వ పద్యము : పదిరెండక్షరములు గల । సదమల మంత్రార్థమెరిగి సద్గురు కృపచే । పదియారక్షరములు గల । యది యెట్టిదో తెలిసెనేని, యతడే సద్గురుడూ॥ యివి రెండెరు గనతడేటి గురుడూ ॥ మొదటిది పరిపూర్ణమును దెల్పు, నెరుకను ॥ తదనంతరపుది బోధను జేయు, నివిదెలిపి ॥ నతడే సద్గురుడు । యివి రెండెరుగ నతడేటి గురుడూ ॥**

**టీక :** సత్ + అమల = సదమల, శాశ్వతమైన, మలిన రహితమైన

**భావము :** శిష్యా! గురుకృపచే శాశ్వతము మలినరహితమైన పన్నెండు అక్షరముల (ద్వాదశాక్షరీ) మంత్ర భావమును చక్కగా తెలిసికొని, పదహారక్షరములు (షోడశాక్షరి) మంత్ర భావము కల ఎరుక ఎట్టిదో తెలిసినవాడు మాత్రమే సద్గురువు. ఈ రెండు (పరిపూర్ణము ఎరుక) ఎరుగని వాడు గురుడు కాదు. మొదటి మంత్రము పరిపూర్ణ పరబ్రహ్మమును, రెండవ మంత్రము షోడశాక్షరి ఎరుకను తెలియపర్చును. ఈ రెండు మంత్రములు, మంత్ర భావ, మంత్ర కీలక, మంత్ర రహస్యముల నెరిగి వస్తు నిశ్చయము కలవాడు, మాత్రమే సద్గురుడు. ఇవి యెరుగని వారు గురువులు కారు, ఇది నిశ్చయము.

---

**223వ పద్యము : ఆ మంత్రయుగము దెల్పెద । నేమముతో దలవు ముత్తదీబట్టబయల్ । యేమీ లేదని పల్కిన । ఆ మంత్రమె ద్వాదశాక్షరింకోటి వినుమీ ॥ యెప్పుడు నోట మరువా కనుమీ ॥ యీ మూలం లేని గుర్తెరిగే శరీరము । యేమీ లేదని యంటె యిదే షోడశాక్షరీ ॥ యింకోటి వినుమీ । యెప్పుడు నోట యివి మరువామకనుమీ ॥**

**టీక :** నేమము = నియమము, నిర్ణయము, యుగము = రెండు.

**భావము :** శిష్యా! (పై పద్యములో రెండు మంత్రములు అన్నాను గదా!) ఆ మంత్రములు రెండు ఏమిటో చెప్పుచున్నాను, వినుము. "ఈ ఉత్తబట్టబయలు ఏమీ లేదు" అనునదే ద్వాదశాక్షరీ మంత్రము. మూలం లేని యీ గుర్తెరిగే శరీరం ఏమీ లేదు. ఇది షోడశాక్షరీ మంత్రము. యీ రెండు మంత్రములను మర్చిపోకుండగ ఎప్పుడునూ స్మరించుచుండుము.

**విశేష భావము :** శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు ఈ సంప్రదాయక రెండు మంత్రములను యీ పద్యములో చెప్పినారు. మంత్రము గురు ముఖతా మాత్రమే తెలుసుకొనవలెను. పుస్తక రీతిగా తెలియపర్చరాదు. భవిష్యత్తులో మంత్రములు కూడా మారిపోవచ్చుననే అభిప్రాయముతోనే ఈ పద్యములో మంత్రములను వెల్లడి చేసినారు. ఇప్పుడు ఈ సంప్రదాయకులలో కొందరికి "యీ వుత్తబట్టబయలు కేమీ లేదు" అని ఉపదేశించిరి. ఇది సంప్రదాయ విరుద్ధము. ఇట్లు మంత్రములు మారిపోవుననియు, ద్వాదశాక్షరి, షోడశాక్షరి మంత్రము ఇతర దేవతా సంప్రదాయకులలో కూడా కలవు. కనుక ఆ మంత్రములే అనుకుంటారేమో అని ఈ సంప్రదాయక ద్వాదశాక్షరి, షోడశాక్షరీ మంత్రములను మంత్రార్థములను 224, 225 పద్యములలో చెప్పిరి. కనుక సంప్రదాయకులు మంత్రములను, మంత్రార్థములను చక్కగా తెలిసికొనవలయును.



**అవతారిక :** ద్వాదశాక్షరీ, షోడశాక్షరీ మంత్రార్థములను 224. 225 పద్యములలో వివరించుచున్నారు.

**224వ పద్యము : తొలు మంత్రపర్థమెక్కడ । గలదోయని వెదుక నేల, కలదంతటట, యా। వలి మంత్ర పర్థమెక్కడ । గలదో యని చూడనేల, కాదా చూచేదీ ॥ వినేది అనేది తినేదీ ॥ అల తొల్తదాన్ని అవలోకనము జేసి । కల కాల మెరుకలు గల దాన్ని విడు, వెరుక ॥ కాదా చూచేదీ । అనేది వినేదీ తినేదీ ॥**

**భావము :** శిష్యా! మొట్టమొదటి మంత్రమయిన ద్వాదశాక్షరీ లక్ష్యార్థ భావము ఎక్కడ ఉన్నదో అని వెదుకనవసరము లేదు. అది అంతట ఉన్నది. ములుగ్రుచ్చు సందు లేకుండగా నిండియున్నది యిదిగో, ఇక రెండవ మంత్రమయిన షోడశాక్షరీ మంత్ర లక్ష్యార్థము యెక్కడ గలదో యని వెదుకనవసరము లేదు. ఈ సమస్తమును

చూచేది, వినేది, అనేది, తినేది అనుభవించేది ఏదో అదే. అదే ఎరుక. నీలో ఉన్న గుర్తెరిగే శరీరమైన ఎరుక (అవిద్య) సమస్తమును తెలుసుకొనేది. కనుక నీవు మొట్టమొదట ద్వాదశాక్షరీ మంత్రార్థమయిన పరిపూర్ణ పరబ్రహ్మమును గురుముఖతా చక్కగా గుర్తెరిగి, ఆ తరువాత ఆ గుర్తెరిగిన జ్ఞానము అయిన ఎరుకను విడచి యుండుము చాలును.

**విశేష భావము :** "పరిపూర్ణమును అవలోకనము జేసి" అన్నారు. అవలోకనము అంటే చూచుట. కాని ఇక్కడ చక్కగా వస్తు నిశ్చయముగా తెలుసుకొని అని చెప్పవలెను. ఎందుచేతననగా పరిపూర్ణము చూడబడేది కాదు. మరియు పరిపూర్ణము శాశ్వతము సర్వత్రా నిండియున్నది. పరిపూర్ణములోనే ఎరుక లేక ఉన్నది పరిపూర్ణమును చూడబోతే ఎరుక నశించును. కనుక పరిపూర్ణము సర్వత్ర నిండిఉన్నది. ఎరిగే శరీరమైన ఎరుక యందు పరిపూర్ణము లేక నిండి యుండుటచే ఎరుక ఉన్నదై సమస్త క్రియలు చేయుచున్నది. దీని యొక్క సత్తా చేతనే లేని యెరుక ఉన్నదై సచ్చిదానంద స్వరూపమై సమస్త సృష్టి, స్థితి లయములును చేయుచున్నది. శుద్ధ సత్త్వ జ్ఞానయుక్తుడై, శృతి యుక్తి అనుభవములచే సద్గురు ముఖతా చక్కగా విచారించినప్పుడే ఇది తెలియును. కనుకనే ఇది "రహస్యాతి రహస్యము"నియు "గుహ్యాతి గుహ్యమైనది" అని చెప్పబడినది. ఈ రహస్యమును గ్రహించినప్పుడే యెరుక బంధము నుండి విముక్తులు కాగలరు. "నాన్యః పంథాద్వితీయకః"

---

**225వ పద్యము : ఇది తప్ప యేమి లేదని। మొదటిది మొరపెట్టుచుండు ముదమున వినుమా। ఇది యేమి లేదు పొమ్మని। వదలక రెండోది లెస్స, వదరుచుండునురా ॥ బయలెరుకాల నిది నిశ్చయమురా ॥ అది గాన నీ రెంటి నరసినీవిప్పుడు। విదితముగ రెంట్ని విడరా, మంత్రములిట్లు ॥ వదరు చుండునురా। బయలెరుకల నిది నిశ్చయమురా॥**

**టీక :** పొమ్మ = నిశ్చయము, నిర్ణమును తెల్పుమాట, అరసి = వెదకి, చూచి, విదితముగ = తెలియబడినవి.

**భావము :** శిష్యా! ఇది తప్ప, మరేదియు లేదు. (పరిపూర్ణ పరబ్రహ్మమే తప్ప, మరియింకేదియు లేదు) అని మొదటి మంత్రము నొక్కి వక్కాణించుచున్నది.

చక్కగా గ్రహింపుము. రెండవ మంత్రము ఇది యేమియు లేదు అని నిర్ణయముగా తెలియపర్చుచున్నది. ఇది అనగా యీ విధముగా యెరిగే యెరుక ఎంతమాత్రము ఉన్నది కాదు. సహజమైన ఉనికి గలది కాదు. అని నిర్ణయముగా చెప్పుచున్నది. మొదటి మంత్రము పరిపూర్ణ బ్రహ్మమే శాశ్వతమైనదనియు, రెండో మంత్రము యెరుక యేమీ లేదని నిర్ణయముగ చెప్పుచున్నవి. కనుక ఈ పరిపూర్ణము, యెరుకల రెంటిని విచారించి, గుర్తించి ఆ తెలియబడిన రెంటిని విడచిపెట్టుము.

**విశేష భావము :** మొదటి మంత్రము పరిపూర్ణ పరబ్రహ్మమే శాశ్వతమై ఉన్నదని చెప్పును. రెండువది ఎరుక, ఏమీ లేదని తెలియపర్చును. ఎరుక రెంటి సమ్మేళనము. అవిద్య + ప్రతిబింబము. అవిద్య లేనిది అందలి ప్రతిబింబ చైతన్యము లేనిదే. అవిద్యకు గాని ప్రతిబింబమునకు గాని సహజమైన ఉనికి గలిగినవి కావు. ప్రతిబింబ చైతన్య సత్తా వలన, లేని అవిద్య ఉన్నదగుచున్నది. అవిద్య అనే ఉపాధి వలన ప్రతిబింబమునకు ఉనికి గలుగుచున్నది. "రెంటిని విడరా" అంటే అవిద్య, అవిద్యా ప్రతిబింబ చైతన్యము ఈ రెంటిని విడువ తగినవే, అని భావము.

**అవతారిక :** శాశ్వతమైన పరిపూర్ణమును లేని యెరుకను విశదపర్చి, లేని యెరుకను విడిపించువాడే సద్గురుమూర్తి యిది తెలియని ఇతర సంప్రదాయ గురువులు, గురువు కానేరడు.

**226వ పద్యము : పరిపూర్ణ మిదిగో, యిదిగో ! యెరుకని చూపించి, లేని యెరుకను లేందం । చెరిగించిన గురుడె సరి । యెరుకను విర్పేటి గురుడు యెందుకో యున్నా ॥ తద్భోధ నీకెందుకోయన్నా ॥ శరణన్నవారి మస్తక మందు చెయి పెట్టి । తిరముగ యెరుకను తీసి వెయ్యనివాడు ॥ యెందుకో యన్నా । తద్భోధ నీకెందుకో యన్నా ॥**

**టీక :** సరి = యుక్తము, అంగీకారార్థము, మస్తకము = శిరోభాగము, తిరముగ = శాశ్వతముగ.

**భావము :** శిష్యా! ఇదిగో పరిపూర్ణము. ఇదిగో యెరుక అని నిర్ణయముగ చూపించి, లేని యెరుకను లేదని నిరూపించి, లేకుండా చేసేవాడే నిజమైన గురుమూర్తి. అట్లు కాకుండగ యెరుకనే (ప్రతిబింబచైతన్యమునే) బ్రహ్మమని శాశ్వతమైనది అని

తెలియపర్చే గురుడు ఎందకయ్యా? అతని బోధ ఎందుకు పనికివచ్చును. (పునర్జన్మకే పనికివచ్చును. జన్మరహిత స్థితి కుదరదు). ఏ శిష్యుడు గురుచరణములను ఆశ్రయించునో, అట్టి వారి తలపై హస్తమస్తక సంయోగముచే యీ యెరుక లేదని, యెరుకను రహిత పర్చలేని గురుమూర్తి వారి బోధలు యెందుకయ్యా! అవి పునరావృత్తికారకములే. జన్మరహిత మొనర్పజాలదు. అట్టి వారిని ఆశ్రయించవద్దు అని భావము.

**227వ పద్యము : పరిపూర్ణ బోధనెరిగిన । గురువరుచే బోధగొన్న, గొప్పఫలంబౌ । పరిపూర్ణ బోధనెరుగని । గురువరుచే బోధగొన్న గొప్ప ఫలమౌనా? ॥ అది యెట్లన్న కూడి రతిలోన॥ పురుషుని చే సంతుపొలతిబడయును, బడయ । తరమౌనె వారికి తన వంటి వారిచే ॥ గొప్ప ఫలమౌనా । అది యెట్లన్న కూడి రతిలోనా ॥**

**టీక** : రతి = మిథునక్రీడ, సంతు =సంతానము.

**భావము** : శిష్యా! పరిపూర్ణ బోధ చక్కగా తెలిసిన గురుమూర్తి వలన బోధ నెరిగిన శిష్యునకు గొప్పదైన ఫలితము (జన్మరహిత స్థితి) కలుగును. అట్లు కాకుండగ పరిపూర్ణ బోధ మర్మధర్మములు తెలియని గురువుల ద్వారా బోధ తెలుసుకున్న శిష్యునకు, అట్టి గొప్ప ఫలితము కలుగదు. అది యెట్లనగా స్త్రీలు పురుషునితో గూడి రతి క్రీడ నొందిన ఫలితముగా సంతానము కలుగును. అట్లుకాక స్త్రీలు తమవంటి స్త్రీలతో కూడిన గొప్ప ఫలితమైన సంతానము కలుగదు కదా !

**విశేష భావము :** శిష్యుడు ఎరుకలోని వాడు, కనుక పరిపూర్ణ బోధనెరిగిన గురుమూర్తి ద్వారానే ఎరుక రహిత స్థితిని పొందగలడు. అట్లుగాక ఎరుక బోధలోని గురువునే ఆశ్రయించినచో ఎరుక రహిత స్థితిని పొందలేడు. అట్లే పరిపూర్ణ బోధస్థులయిననూ పరిపూర్ణము యొక్క అపరోక్షానుభవము లేని గురువుల నాశ్రయించిన శిష్యులకు కూడా జన్మరహిత స్థితి కలుగదు. ఎందుచేతననగా శిష్యుని వంటి వారే ఆ గురువులు కూడా. అనగా ఎరుక. పరిపూర్ణము అని చెప్పుదురు కాని వాటి యొక్క మర్మధర్మములు ఎరుగని గురువులు కూడా శిష్యుని వంటివారే (ఎరుకలో వారే)

**228వ పద్యము : పరిపూర్ణ బోధ నెరుగని । గురుశిష్యులు బోధ కొరకు కోర పనిబడున్ । గురువర్యునొకని మరలను । హరువరమున బుట్టినట్టి, యాశిఖండికినీ ॥ భార్యైనట్టి యబల తండ్రికినీ ॥ వరుల నిద్దరిని దేవలె, నీయల్లుడు నేను । వరియింతుమన చెప్ప వనిత నంపినయట్లు ॥ యా శిఖండికినీ । భార్యైనట్టి యబల తండ్రికినీ ॥**

**టీక :** హరువరమున = ఈశ్వరుని వరము వలన, అబల = స్త్రీ, వనితను = స్త్రీని, వరులను = భర్తలను.

**దండాన్వయము :** పరిపూర్ణబోధనెరుగని గురుశిష్యులు, బోధకొరకు మరల గురు వర్యునొకని కోర పనిబడున్ । (ఎట్లనగా - అన్యాపదేశము) హరువరమున బట్టినట్టి యా శిఖండికినీ భార్య అయినట్టి అబల । వరుల నిద్దరిని తేవలె, నీ యల్లుడు, నేను వరియింతుమని తండ్రికినీ చెప్ప వనితను అంపినయట్లు ॥

**భావము :** శిష్యా! పరిపూర్ణ బోధ మర్మధర్మములు తెలియని గురుమూర్తిని ఆశ్రయించిన శిష్యుడు జన్మరహిత స్థితిని పొందలేడు. కనుక ఆ గురువు శిష్యుడు ఇద్దరు కూడా పరిపూర్ణ బోధ నెరిగిన మరొక గురువును ఆశ్రయించవలసి వచ్చును. ఎట్లనగా ఈశ్వరుని వరము వలన, పుట్టిన శిఖండి (జన్మతఃస్త్రీ) యనువాని భార్య, తన భర్త పురుషుడు కాదని తెలుసుకొని, తన తండ్రికి, తనకు, తన భర్తకు ఇద్దరు పెండ్లి కుమారులను తెస్తే, నేను నీ అల్లుడు శిఖండీ ఇద్దరము పెండ్లి చేసుకొనెదము, అని లేఖ వ్రాసి ఆమె పంపినట్లుగా, గురు శిష్యులు ఇద్దరు, పరిపూర్ణ బోధ నెరిగిన గురువును ఆశ్రయించవలసి వచ్చును.

---

**అవతారిక :** మంత్రద్వయమును దృష్టద్రాష్టాంతములతో వివరించి నిరూపించవలెనని చెప్పుచున్నారు.

**229వ పద్యము : దృష్టాంత మెరుక కేదని । యోష్ఠము కదిలించగానె, యొరులు కలమచున్ । ద్రాష్టాంతమడుగ బోధకు స్పష్టముగ కర్పూరము దీపము జూపవోయీ। యీ యుక్తి లోపము జేయకోయీ ॥ తుష్టినొందెదరిట్లు తోచి చెప్పితివేని । శ్రేష్ఠమౌ యీ బోధ చేకొన్నవారు ॥ దీపము జూపవోయీ । యీ యుక్తిలోపము జేయకోయీ॥**

**టీక :** దృష్టాంతము = ఉదాహరణ, యోష్ఠము = పెదవి, ద్రాష్టాంతము = ప్రత్యక్ష నిదర్శనము, తుష్టి = సంతృప్తి.

**దండాన్వయము :** యెరుకకు దృష్టాంతమేదని యెరులు యోష్ఠము కదలించగానే। కల అనుచున్। బోధకు ద్రాష్టాంతమడు శస్పష్టముగా కర్పూర దీపము జూపవోయీ। యీ యుక్తికి లోపము జేయకోయీ। యిట్లు తోచి చెప్పితివేని, శ్రేష్ఠమౌ యీ బోధ చేకొన్నవారు తుష్టినొందెదరు.

**భావము :** శిష్యా! ఇతరులు యెరుకకు దృష్టాంతము ఏదని పెదవి విప్పి అడుగగానే "కల" అని చెప్పుము. బోధకు (పరిపూర్ణమునకు) ప్రత్యక్ష ప్రమాణమును చెప్పమనినచో (ద్రాష్టాంతము) కర్పూర దీప శిఖను చూపించి సమాధాన పరచుము. ఈ విధముగా శ్రేష్ఠమైన యీ బోధను దృష్ట ద్రాష్టాంతములతో నిరూపించి చెప్పినచో యీ బోధ తెలుసుకునే వారు సంతుష్టి పొందెదరు. కనుక యీ యుక్తికి లోపము చేయకుము.

**విశేష భావము :** దృష్టాంతము యెరుకకు చెప్పుచున్నారు. అనగా యెరుక లేనిదే ఉన్నట్లు తోచుచున్నది అని నిరూపించుటకు ఉదాహరణగా కలలో తోచిన జగత్తు లేనిదే ఉన్నట్లు తోచబడుచున్నది. కదా యని చెప్పినచో సరిపడును. బోధకు అనగా జ్ఞానము, పరిపూర్ణ పరబ్రహ్మమునకు అని అర్థము. పరిపూర్ణ పరబ్రహ్మము ప్రమాణ ప్రమేయములు కానిది. అప్రమేయము, కనుక పరిపూర్ణమే ఉన్నది అనుటకు ఎరుక లేదని నిరూపించుటయే. అనగా పళ్లెములో కర్పూరము ఉంచి వెలిగించినచో కర్పూరము అగ్నిశిఖ వెలిగి ఆవల కర్పూరము శిఖరెండునూ లేకపోయి మొదటి నుండి ఉన్న పళ్లెము నిర్వికారముగా ఉన్నది. మొదటి నుంచి ఉన్నది పళ్లెము. పళ్లెము వలన కర్పూరము రాలేదు. పళ్లెములో కర్పూరము ఉన్నది. జ్ఞానాగ్ని శిఖ వలన కర్పూరము లేకపోయినది. కర్పూరమునకు ముందు, కర్పూరము ఉన్నప్పుడు కర్పూరము అగ్ని శిఖా ఉన్నప్పుడు, వెలిగి లేకపోయిన తరువాత, పళ్లెము నిర్వికారమైయున్నట్లు, ఎరుకకు ముందు, ఎరుకలేపోయిన తరువాత కూడా పరిపూర్ణము శాశ్వతమై నిర్వికారమై ఉన్నది. పరిపూర్ణములో ఎరుక లేనిదే వచ్చి, తనకు తానే లేకపోవుచున్నది. పరిపూర్ణము కర్మకార్యములు కానిదై ఉన్నదని నిరూపణ చేసినచో బోధ చక్కగా అవగాహన కలుగును.

**230వ పద్యము : యెరుక భ్రమ గల్గు శిష్యుని । పరితాపము మాన్పినట్టి పండితుడెవడో । గురుడతడె కాని, గురువులె । గురువుల మని పొట్ట కొరకు గొలిగే వారెల్లా ॥ వారికీ బోధ తెలియుట కల్లా ॥ పరిపూర్ణమును లేని యెరుక నేర్పడ దెల్పి । యెరుకను విడిపించ నెరుగాక గురువులై ॥ గొలిగేవారెల్లా । వారికీ బోధ తెలియుట కల్లా ॥**

**టీక :** పరితాపము = బాధ

**భావము :** శిష్యా యెరుక భ్రమ కలిగియున్న శిష్యుని బాధ మాన్పినట్టి పండితుడే గురువనబడును. అంతే కాని పొట్ట పోషించుకొనుటకు గురువులమని చెప్పుకుని తిరిగేవారు గురువులు కాలేరు. అట్టి వారికి యీ బోధ తెలియదు. పరిపూర్ణమును యెరుకను విశదముగా తెలియపర్చి, యెరుకను విడిపించనేరని గురువులు, గురువులు కానే కారు.

---

**అవతారిక :** గురుశుశ్రూష ఏ విధముగానో చెప్పుచున్నారు.

**231వ పద్యము : గురు శుశ్రూష నొవర్చుట । మెరిగించెద నెట్లనినము, యేర్పడ వినుమా । వరులిష్టదైవము లకున్ । పరిచర్య యొనర్చునట్లు, భక్తితోడుతనూ ॥ గురుమూర్తి కత్యుక్తి తోడుతనూ ॥ నిరతామర మరలేక నీవు సల్పితివేని । గురుబోధ మరుగు సద్గురు నీ చె దెలిసేవూ ॥ భక్తి తోడుతనూ । గురుమూర్తి కత్యుక్తి తోడుతనూ॥**

**దండాన్వయము :** నిరతాము అరమరలేక, గురుమూర్తికి భక్తి తోడతను అత్యుక్తి తోడను (పరిచర్య - అన్యాపదేశము) నీవు సల్పితేని, గురు బోధ మరుగు సద్గురునిచే దెలిసేవు ॥

**టీక :** పరిచర్య = ఉపచారము, యుక్తి = ఉపాయము, న్యాయము, అరమరలేక = బేధము లేకుండగ.

**భావము :** శిష్యా! గురు శుశ్రూష చేయుట ఎట్లో వివరించెదను, వినుము. జనులు తమ ఇష్టదైవమునకు ఏ విధముగా ఉపచారము చేయుదురో, అట్లే బేధ భావము లేకుండగ, భక్తితోను, న్యాయము గాను (షోడశోపచారముతో) పూజ చేయవలెను. ఎల్లప్పుడు నీవు గురుమూర్తికి యీ విధముగా సేవచేసినచో, గురుబోద యొక్క రహస్యము, బోధ స్థితి ఆ సద్గురు మూర్తి ద్వారా చక్కగా తెలిసికొనగలవు.

**విశేష భావము :** "నరులిష్టదైవములకున్ పరిచర్య యొనర్చునట్లు" అనగా ఇష్టదైవములకు నరులు 16 ఉపచారములచే (షోడశోపచార పూజాం సమర్పయామి) చేయుదరు. ఆ విధము గానే గురుమూర్తిని కూడ పూజించవలెను. "అరమరలేక" అనగా బేధ భావము లేకుండగా, అంటే పరమేశ్వరునకు గురువునకు బేధము లేకుండగా అనగా ఆ దైవమే ఈ గురుమూర్తి అని, గురుమూర్తి నరుడనే భావము లేకుండగా పూజించవలెను. "భక్తి తోడుత అత్యుక్తి తోడుత" అనగా భక్తితో పూజించుటయే కాక న్యాయముగా పూజించవలెను అన్నారు. అనగా గురువు వద్ద ఉంచిన వస్త్రములు వగైరా మనము వాడుకొనకుండగ, న్యాయముగా గురుమూర్తికి పూజలో సమర్పించిన సమస్తమును గురుమూర్తికే ఇయ్యవలెను అని భావము. మరియు దేవునికి షోడశోపచారములు ఎట్లు చేయుచున్నమో అట్లే గురుపాదములకు మాత్రమే షోడశోపచారపూజలు చేయవలెను. "అర్ఘ్యం" అన్నప్పుడు చేతిలో నీరు పోసి, ఆచమనం అన్నప్పుడు ఆచమనము చేయించి నైవద్యేం అన్నప్పుడు ప్రసాదమును నోటిలో పెట్టి ఇట్టి వెర్రిచేష్టలు చేయరాదు. "పూజా మూలం గురోఃపదం" కనుక సమస్త ఉపచారములు గురుపాదములకే చేయవలెను. అని ఈ పద్య నిర్ణయముగా గ్రహించవలెను.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ఽ ద్వైతరహిత పరమతత్త్వే
గురుమూర్తి లక్షణన్నామ చతుర్దశోధ్యాయమునకు
భావ విశేష భావములు సమాప్తము.

# 14వ అధ్యాయమునకు సంక్షిప్త భావము

ఈ అధ్యాయములో గురువులు అనేక రకములుగా ఉన్నప్పటికి ఏ గురువైతే పరిపూర్ణము - ఎరుకల గురించి ధృడముగా విశదపరచి, ఆ తరువాత ఎరుకను విడిపించే వారు మాత్రమే గురువుగా గుర్తించవలయును. అట్టి గురుమూర్తికి భయభక్తులతో సేవ చేసుకొనుచు బోధ విన్న శిష్యుడు తప్పక జన్మరహిత స్థితిని పొందగలడు అని చెప్పిరి. పరిపూర్ణ పరబ్రహ్మమును తెలియపర్చే పన్నెండు అక్షరములు గల "ఈ ఉత్తబట్టబయలు ఏమీ లేదు" అనే మంత్రమును ఎరుకను తెలియపరిచే 16 అక్షరములుగ "మూలం లేని యీ గుర్తెరిగే శరీరం ఏమీ లేదు" అనే షోడశాక్షరీ మంత్రము, ఈ రెండు మంత్రములు మంత్రార్థ కీలకములతో తెలియపర్చి, ఎరుక భ్రమ శిష్యునకు వదిలించే గురుడే గురుడు కాని గురువుల మని చెప్పుకుంటూ దేహపోషణ నిమిత్తమై తిరిగేవారు గురువులు కారు. సర్వత్రా నిండియున్నది. శాశ్వతమైనది, నిర్మలమైనది పరిపూర్ణము అదిగో అని చూపించి, నీలో ఉన్న చైతన్యమే షోడశాక్షరీ మంత్ర లక్ష్యార్థమయిన ఎరుక అని చూపించి, ఈ ఎరుక మిథ్యా స్వరూపము లేనిది అని నిర్ణయించి, ఎరుకను విడిపించగలవాడే గురుడు. యీ బోధ తెలియపర్చే గురువును ఆశ్రయించినచో గొప్ప ఫలితము (జన్మ రహిత స్థితి) కలుగుననియు, ఇతర విధములయిన బోధలు (నీవే ఆ బ్రహ్మము) అని బోధించే గురువులను ఆశ్రయించినచో జన్మ రహిత స్థితి కుదరదు అని, అట్టి వారిని ఆశ్రయించవద్దని చెప్పుచూ యెరుకకు "కల" దృష్టాంతమును, పరిపూర్ణమునకు "కర్పూర శిఖి" ద్రాష్టాంతములచే బోధించినచో శిష్యులకు యీ బోధ చక్కగా అవగాహన కాగలదని చెప్పినారు. మరియు గురుమూర్తికి పరమేశ్వరునికి భేదము లేకుండగ భక్తితో గురుపాదములకు షోడశోపచారముతో పూజించుకొనమనియు, అట్లు నిరతము గురుపూజ అనుష్ఠానములు చేసికొనినచో తప్పకుండా జయము పొందగలరని తెలియపర్చుచున్నారు.

॥ జై గురు ॥

# అధ్యాయము -15

# శిష్యుని లక్షణము (16)

**అవతారిక :** సచ్ఛిష్యుని లక్షణమును ఈ అధ్యాయములో 232, 233, 234 పద్యములలో వివరించుచున్నారు.

**232వ పద్యము : తను మన ధనములు గురునకు । వినయంబున ధారపోసి, వేడ్క గురునిచే । అనువైన బోధబడసిన । ఘన మతిమంతునకు సాటి, గలదా యీ భువినీ ॥ లోకులు మ్రొక్కవలదా చౌల వినీ ॥ తనని తరులనె తావనక, యే మాటను । వినక పరిపూర్ణత దనరు వానికి సాటి ॥ గలదా యీ భువినీ । లోకులు మ్రొక్క వలదా చౌల వినీ ॥**

**టీక :** వేడ్క = ప్రార్థించి, కోరి, యాచించి, అనువైన = తగినట్టి.

**భావము :** శిష్యా! తనువు, మనస్సు, ధనము ఈ మూటిని గురుమూర్తికి వినయముతో ధారపోసి, ఆ గురుమూర్తిని ప్రార్థించి తగిన బోధ పొందిన గొప్ప బుద్ధిమంతుడైన శిష్యునికి సాటి యీ భూమి పై ఎవరును ఉండరు. అట్టి వాడని విని తెలుసుకొన్న ప్రాజ్ఞులు (లోకులు) అతనికి మ్రొక్కవలసినదే. తానని ఇతరమని పలికే (తాను) నేను అనక, అట్టి మాటలు ఏమీ వినక, పరిపూర్ణ స్థితిని పొందిన వానికి సాటి యీ భూమిపై ఎవ్వరును లేరు, ఉండరు.

**విశేష భావము :** మంత్రోపదేశమునకు ముందుగా గురుమూర్తికి తన తనువు, మనస్సు, ధనము ధారపోయవలెను. ఇది శ్రీ యాజ్ఞవల్క్య మహర్షి నుండి సంప్రదాయముగా వచ్చుచున్నది. ఇది బ్రహ్మవైవర్త పురాణములో నున్నది.అట్లు ధారపోయుట ఎందుకు? శిష్యుడు తాను ఏ పనులు ఆచరించిననూ, తన శరీరము, తన మనస్సు (సంకల్పము) తన ధనము (దార పుత్రాది సమస్త ద్రవ్యము) తోనే చేయాలి. ఆ మూడు గురుమూర్తికి ధారపోయుటచే, ఆ మూటిచే చేసే సమస్తము గురుమూర్తిదే. తనదంటూ ఏమీ ఉండదు. కర్తృత్వము ఎంత మాత్రము. లేకుండా చేయుటకే ఇలా ధార పోయవలెను. కనీసం సంకల్పము కూడా గురుమూర్తి అనుజ్ఞ లేనిదే సంకల్పించరాదు. ఇక తనది అనేది ఏమి ఉన్నది? అందుచే అహంకారము

(కర్తృత్వం) నశించినది. ఆ మూటిని వినయముగా ధారపోయాలి. అలా చేయాలి అని నామమాత్రంగా చేయరాదు. వాటి అర్థం తెలుసుకొని ఆచరించాలి. "అనువైన బోధన్ వేడ్కన్ గురునిచే బడసిన" తనకు తగిన బోధ అనగా జన్మ సాఫల్యతను సిద్ధింపజేసే పరిపూర్ణ బోధను, గురుమూర్తిని ప్రార్థించి, యాచించి గురుకృపకు పాత్రుడై బోధను పొందవలెను అని అర్థము.

---

**233వ పద్యము : జలము నెడబాయ నొల్లని । జలచరముల తీవి బూని సచ్ఛిష్యుడు, హృజ్జలజంబను పీఠముపై । నిలిపి తరమును మాని గురువు, నే కొల్చు సుమ్మీ ॥ తదూక్తులనే తల్చు నమ్మీ ॥ కలకాలమీ రీతి గడుపుచు నే ప్రొద్దు । తలిదండ్రి దొర దాత దైవమనుచు గురువు ॥ నే కొల్చుసుమ్మీ । తదూక్తులనే తల్చు నమ్మీ ॥**

**దండాన్వయము :** సచ్ఛిష్యుడు హృజ్జలజంబను పీఠము పై గురువునే నిలిపి, ఇతరము మాని కొల్చు సుమ్మీ ॥ తదూక్తులనే నమ్మి తల్చు । కల కాలము ఈ రీతి గురువునే, తలి, తండ్రి, దొర, దాత, దైవమనుచు, ఏ ప్రొద్దు గడుపుచు, కొల్చు సుమ్మీ ॥

**టీక :** తీవి = వైభవము, విధము

**భావము :** శిష్యా! జలమును విడచి బయటకు వెళ్లాలనే సంకల్పము జలచరములకు ఎంతమాత్రము ఉండనట్లుగానే, సచ్ఛిష్యుడు తన హృదయ పద్మ పీఠము పై గురువును ప్రతిష్ఠించుకొని, యితరమును మాని, ఆ సద్గురు మూర్తినే పూజించుకొనుచు, వారు చెప్పిన బోధనే నమ్మికతో మననము చేసికొనుచుండును. ఎల్లకాలము ఈ విధముగా ఆచరించుకొనుచు, గురువును తల్లి, తండ్రి, దొర (ప్రభువు) దాత, దైవము అన్నియు గురు మూర్తియే యని నమ్మి పూజించుకొనుచుండును.

**విశేష భావము :** గురుమూర్తి తనకు తల్లి = ఉపాధి, ఆధారము, తండ్రి = జ్ఞానము, సత్తా, దొర = పాలించువాడు, దాత = జ్ఞాన ప్రదాత, దైవము = రక్షించి ముక్తిని ప్రసాదించేవాడు అన్నియు గురుమూర్తియే.

---

**234వ పద్యము : సతి, పొరుగూరికి పోయిన । పతి రాకడ కోరినట్లు, భావములోనన్। మతిమంతుడు సచ్ఛిష్యుడు । సతతము గురు రాక గోరు, సత్యము వినరా ॥ వాని తోటి సాటెవ్వరనరా ॥ హితుని రాకడమ స్నేహితుడు గోరినట్లు । అతి దరిద్రుడు ద్రవ్యతతి రాగోరినయట్లు ॥ సత్యము వినరా । వాని తోటి సాటెవ్వరనరా ॥**

**దండాన్వయము :** పొరుగూరికి పోయిన పతిరాకడ, భావములోనన్ సతిగోరినట్లు। హితుని రాకడను స్నేహితుడు, కోరినయట్లు, అతి దరిద్రుడు ద్రవ్య సమూహము (నిధి) రాగోరినయట్లు, మతిమంతుడు సచ్ఛిష్యుడు సతతము గురుని రాక భావములోనన్ కోరు, సత్యము వినరా ॥

**భావము :** పొరుగూరికి పోయిన భర్త యొక్క రాకను అతని భార్య కోరినట్లుగా, స్నేహితుడు తన స్నేహితుని రాకను కోరుచున్నట్లుగా, అతి దరిద్రుడు ధనరాశిని కోరునట్లుగా, సచ్ఛిష్యుడు తన గురుమూర్తి రాకను మనస్సులో కోరుచుండును. ఇది సత్యము. వినుము.



**అవతారిక :** గురుమూర్తి (ఆరూఢుడైన కారణముచే) బోధను మననము చేయకున్ననూ, శిష్యుడు బోధను మననము చేసికొనుట మానరాదని నిరూపించుచున్నారు.

**235వ పద్యము : అతి వల రతి చతురత లా । యతివలచే వారి తంద్రులరయ రనుచు, త । త్పతులరయురె రతి, నట్లనె । మతిమంతుడు గురుడు, బోధ మానీ నాగానీ ॥ తద్భోధ తా మానావుడు పూనీ ॥ అతి దరిద్రునిచె విద్యార్జించినతగాడు । చతురుడై విత్తమార్జనచేయు, పంతులు ॥ మానీన గానీ । తద్భోధ తామానడు పూనీ ॥**

**టీక :** అతివల = స్త్రీల యొక్క, రచిచతురతలు = రతి క్రీడానేర్పరితనము, చతురుడై = నేర్పరియై, విత్త మార్జన చేయు = ధనము సంపాదించును, పంతులు మానీనగాని = ఉపాధ్యాయుడు మానినప్పటికీ ॥

**దండాన్వయము :** అతివల రతి చతురతలు ఆ అతివలచే వారి తంద్రులరయరు అనుచు, తత్పతులు రతిని అరయురె? (అట్లనె) అతి దరిద్రునిచె పూని విద్య ఆర్జించిన, పంతులు మానీన గాని, అతగాడు చతురుడై విత్తమార్జన చేయు । అట్లనె గురుడు బోధను మానీనా గాని, మతిమంతుడు తద్బోద తామానడు ॥

**భావము :** స్త్రీల యొక్క రతి నేర్పరితనము ఆ స్త్రీలచే వారితండ్రులు తెలిసికొనలేకపోయినను, వారి భర్తలు ఆ స్త్రీల రతి నేర్పరితనమును తెలుసుకొనరా? అట్లే అతి దరిద్రుడైన ఉపాధ్యాయుని వద్ద నేర్పరితనముచే విద్య చక్కగా సంపాదించు కొనినవాడు, ఉపాధ్యాయుడు సంపాదించుట లేదు కదా అని భావించక, తాను విద్య వలన చక్కగా ధనము సంపాదించును కదా ! అట్లే గురుమూర్తి ఆరూఢత్వముచే బోధ మననము మానివేసిననూ, శిష్యుడు బుద్ధిమంతుడై బోధ పఠన, మననములు మానరాదు, అని భావము.

---

**అవతారిక :** విద్యను సంపాదించుకొనిన మీదట గురువును మరువరాదు. అని తెలియపర్చుచున్నారు.

**236వ పద్యము : పరిపూర్ణ బోధ దెల్పే । పరియంతము సేవజేసి బహునమ్మికగా। గురుమూర్తికి, తరువాతను, మరి కన్నుల గనని వాని మార్గము ఛీ ఛీ ॥ తలచ రాదా మాటఛీ ఛీ ॥ గురువాజ్ఞ యివనిదె గురునై శిష్యుని గూర్చి । గురుబోధ దెల్పేటి గురువంచకుని యొక్క ॥ మార్గము ఛీ ఛీ । తలచరాదా మాట ఛీ ఛీ ॥**

**దండాన్వయము :** పరిపూర్ణ బోధ దెల్పే పరియంతము గురుమూర్తికి బహునమ్మికగా సేవజేసి, తరువాతను మరికన్నుల.

**టీక :** శిష్యుని గూర్చి = శిష్యుల నేర్పరుచుకొని.

**భావము :** పరిపూర్ణ బోధ తెలియపరిచే వరకు గురుమూర్తికి అతి వినయ విధేయతలతో సేవజేసి, బోధ పూర్తయిన పిదప. శిష్యుడు గురువును తలచకుండగ, ఇంకెప్పుడు గురువును కలువకుండగ పోయే శిష్యుని యొక్క మార్గము ఛీ ఛీ. అట్టివాని మాటలు చేతలు తలచరాదు. మరియు గురువాజ్ఞ ఇవనిదే, తనకు తానే గురునై, శిష్యుల జేసుకొని బోధను చెప్పే గురువంచకుని యొక్క మార్గము ఛీ ఛీ । అట్టి వారిని తలచుట కూడా పాపమే ॥

**విశేష భావ ప్రమాణము :** గురుగీతలో 135, 136 శ్లోకములు.

135) దృశ్య విస్మృతి పర్యన్తం కుర్యాద్గురు పదార్చనం । తాదృశస్యైవ కైవల్యం నచ తద్వ్యతి రేకిణః ॥ ప్రపంచస్మృతి పోవువరకు గురు దేవుని చరణ సేవ

చేయుచుండవలెను. అట్టి వారికే కైవల్యము మరియు 136) అపి సంపూర్ణ తత్త్వజ్ఞో గురుత్యాగీ భవేద్యధా। భవత్యేవహి తస్యాన్తకాలే విక్షేపముత్కటమ్ ॥ సంపూర్ణ తత్త్వ జ్ఞానము కలిగియున్ననూ గురువును విడచిన వాడు మరణ కాలము నందు గొప్ప మోహము కల్గి దుర్గతిని పొందును.

---

**237వ పద్యము : తన శిష్యులు విని తన నతి । వినయంబున గొల్చు కొరకు, వినుతి యొనర్చున్ । తన గురువును, గురుడింటికి । జనుదెంచిన జూచి, శుశ్రూష నొనర్పకుండు ॥ లేమిని దెల్పి, చను మనుచుండూ ॥వినుము కుచ్ఛిత శిష్యాగ్రణి వీడు, వీడెట్లు । ఘనబోధోక్తస్థితి గమనా, గురునకు ॥ శుశ్రూష నొనర్పకుండు । లేమిని దెల్పిచను మను చుండూ ॥**

**టీక :** వినుతి యొనర్చు = కీర్తించును, లేమిని = దరిద్రమును, కుత్సిత = నికృష్టపు, ఘన బోధోక్తస్థితి = గొప్పబోధలో చెప్పబడిన స్థితి, పరిపూర్ణ స్థితి; గమనా = తెలిసికొనగలడో, గుర్తించగలడో.

**భావము :** శిష్యా! వినుము, కుచ్ఛితుడైన శిష్యుడు, తన శిష్యుడు తనను అతి వినయముగా సేవించే నిమిత్తమై। తన గురువును గొప్పగా సేవించినట్లు కీర్తించుచుండును. కాని గురుమూర్తి తన యింటికి వచ్చినచో ఏ విధమై శశ్రూష చేయక, తన దారిద్ర్య పరిస్థితి తెల్పుకొని "ఈ సారికి మరొకరివద్దకు వెళ్లిరండి" అని చెప్పును. ఇట్టి వాడు కుత్సిత శిష్యాగ్రణి. ఇట్టి శిష్యుడు పరిపూర్ణ బోధ స్థితిని ఎట్లు పొందగలదు? అనగా గురు శశ్రూషలు చేయలేనికుచ్ఛిత శిష్యులు గురు కరుణ పొందలేరు. వారు బోధ స్థితిని పొందలేరు అని భావము.

---

**238వ పద్యము : కుటిలాత్ముడైన శిష్యుడు । యిటువలె తా బల్కుచుండు, యింటికి వస్తే । యెటు బోవుచుండి వస్తిరో । యిటకిక దర్శనము మళ్లీ, యెప్పుడయ్యేనో ॥ యెవరికి దెలుసు యెప్పుడే మౌనో ॥ యెటుదోచ దేమైన యిత్తా మంచను కుంటే। తుటు కూవ ఒక రాగి దుడ్డైన లేదిప్పు ॥ డెపుడే మయ్యేనో । యెవరికి దెలుసు యెపుడే మౌనో ॥**

**టీక :** తుటుకున = పంచె యొక్క కక్ష్యలో, (డబ్బులు చిక్కన బెట్టుకొనుట పూర్వాచారము) వకరాగిదుడ్డైన = ఒకరాగి కాని గూడా (పూర్వపు చెలామణిలోని నాణెము, రూపాయిలో 64వ భాగము)

**పదవిభాగము :** కుటిలాత్ముడైన శిష్యుడు, యిటువలె తా బల్కుచుండు (గురుడు, అన్యాపదేశము) యింటికి వస్తే.

**భావము :** గురుమూర్తి తన యింటికి వస్తే, కుటిలాత్ముడైన శిష్యుడు ఈ విధముగా పల్కుచుండును "ఎటుపోవుచుండి ఇలా మా యింటికి వచ్చారో ! తిరిగి మళ్లీ మీ దర్శనము ఎప్పుడు కలుగునో, యెవరికి దెలుసు. ఎప్పుడు ఏమి జరుగునో ఎవరు చెప్పగలరు? ఏదైనా దక్షిణ యిద్దామనుకుంటే ఒక్క రాగి డబ్బు కూడా లేదు. ఏమియు తోచకున్నది" అని విచారముతో చెప్పుకొనును. ఇట్టి వాడు కుత్సిత శిష్యుడు అని భావము.

---

**239వ పద్యము : జపములు తపములు పలుపుమ । విపరీతస్మరణ జేయు, వేదాంతార్థం। బపరిమితంబుగ జెప్పుమ । కపటాత్ముడు శిష్యకోటి, గని మెచ్చుకొఱకు॥ మెచ్చి ద్రవ్యమును యిచ్చు కొఱకు ॥ అపకీర్తి చేతల కదిరినట్లగుపడి ఉపమచె బ్రతుకుచునుండు, లోకులు తనను ॥ గనిమెచ్చుకొఱకు । మెచ్చి ద్రవ్యమును యిచ్చుకొఱకు॥**

**టీక :** విపరీతముగ = వ్యత్యస్తముగ (తప్పు విధముగ) లేక అతి ఎక్కువగా, అపరిమితము = ఎక్కువుగ, అపకీర్తి చేతల = తప్పుడు పనులకు, అదిరినట్లు = భయపడినట్లు, ఉపమచే = ఉపాయములచే (యుక్తులచే)

**భావము :** కపటాత్ముడైన శిష్యుడు, తన శిష్యకోటి చూచి, తనను మెచ్చుకొఱకు, జపములు, తపములు చేయుచుండును "గురుదేవా" అని అనేకసార్లు స్మరించుచుండును (నామస్మరణ). వేదాంతార్థమును విపరీత వ్యాఖ్యానము చేయును. తన శిష్యులు చూచి తనను మెచ్చుకునే కొరకు, మెచ్చి ధనము బాగా యిస్తారనే కారణముచే యీ విధముగా చేయుచుండును. మరియు తప్పుడు పనులకు భయపడినట్లు అగుపడుచుండను. సమయానుకూలముగ ఉపాయములు యుక్తులు జెప్పి బ్రతుకుచుండును. ఇదంతయు లోకులు తనను జూచి మెచ్చి ద్రవ్యము బాగా ఇచ్చెదరని యీ విధముగా బ్రతుకుచుండును.

---

**240వ పద్యము : గురుమూర్తి కెదురహంకృతి । దొరకొన్నను, దొంగ త్రోవ ద్రొక్కిన, చెవులన్ । గురనింద వినిన, జేసిన । నరునకు పరిపూర్ణ బోధ, నలవియే తెలియ ॥ కూడదు వాన్ని తెలియక కలియ ॥ గురుడు దెల్పని, పుస్తక రీతిచే పూర్ణ । మరసితి వని యెంతో మురసిన యీ బోధ॥ నలవియె తెలియ । కూడదు వాన్ని తెలియక కలియ ॥**

**పదవిభాగము :** గురుమూర్తికి ఎదుర అహంకృతి దొరకొన్నను, దొంగత్రోవ ద్రొక్కిన, గురునింద చెవులన్ వినిని, జేసిన, (అట్టి) నరునకు పరిపూర్ణ బోధ తెలియనలివియే? వాన్ని తెలియక కలయ (రాదు). గురుడు దెల్పని పూర్ణము (బోధ), పుస్తక రీతియచే అరసితినని, యెంతో మురసిన, యీ బోధ తెలియనలవియే? । వానిని తెలియక కలియరాదు.

**టీక :** అహంకృతి = గర్వము, దొరకొన్నను = సంభవించిననూ, దొంగత్రోవ = చెడుమార్గము, అలవియే = శక్యమే ? ॥

**భావము :** శిష్యా! గురుమూర్తికి ఎదుట శిష్యుడు గర్వించి మాట్లాడిననూ, తప్పుడు మార్గమున నడచిననూ, గురునింద చెవులతో విన్ననూ గురునింద చేసినా, అట్టి వానికి యీ పరిపూర్ణ బోధ తెలియశక్యము కాదు. అట్టి దుష్టుని తెలియక కలియరాదు. గురుమూర్తి తనకు చెప్పని (లేక గురుమూర్తికి తెలియని) పరిపూర్ణ బోధ, తాను గ్రంథములు చదివి తెలుసుకున్నాను, అని చెప్పే దుష్టునకు యీ పరిపూర్ణ బోధ తెలియశక్యము కాదు. అట్టి వానిని తెలియక కలువకూడదు. (ప్రమాణము - గురుగీత 137, 138, 139, 140, 145 శ్లోకములు)



**అవతారిక :** "గురు శుశ్రూషయా విద్య" అన్నశృతిని చెప్పుచున్నారు.

**241వ పద్యము : వాలుగు శుశ్రూషణములు । లోలత గావించుకొనుచు లోకాతీతం। బాలోకించి గురునిచె । యీలోకపుజోలి విడువు, మింతె చాలన్నా॥ నీతో గూడ యిది మరువకన్నా ॥ కీలుదెలియని చదువు చాలా చదివెందుకు । చాలించి, నీవిట్టి కీలు దెలిపితి వేవి ॥ యింతె చాలన్నా । నీతో గూడ యిది మరువ కన్నా॥**

**టీక :** శుశ్రూణ = గురుమూర్తికి శిష్యుడు చేసే సేవ; లోలత = మిక్కిలి కోరికతో

**దండాన్వయము :** నాలుగు శుశ్రూషణములు (గురునకు) లోలత గావించుకొనుచు, యీ గురునిచె లోకాతీతంబు ఆలోకించి, యీ లోకపు జోలి విడువుము. నీతో కూడా యిది మరువకు అన్నా, కీలు దెలియని చదువు చాలా చదివేవు ఎందుకు? చాలించి, నీవు యిట్టి కీలు దెలసితి వేనియింతె చాలన్నా? ॥

**భావము :** శిష్యా! గురుమూర్తికి చతుర్విద శుశ్రూషలు సంతోషముతో చేసుకొనుచు, గురుకరుణచే లోకాతీతమైన పరిపూర్ణ పరబ్రహ్మమును అవలోకన జేసికొని, యీ లోకముల యొక్క జోలి విడువుము. నీతో సహా యీ లోకముల పొందు విడువుము. యిది మరువకుము. యిట్టి రహస్యము తెలియని శాస్త్ర విద్య యెంత నేర్చిన ఏమి ఫలము? నీవు యిట్టి రహస్యమైన తత్త్వమును (బ్రహ్మమును) తెలసి, నీతో సహా అంతఃకరణతో సహా లోకములపొందు విడచితివేని యింతే చాలును.

**విశేష భావము :** చతుర్విధ శ్రశూషలనగా - అంగ, స్థాన, భావ, ఆత్మ, శ్రశూషలు. అంగ శ్రశూష అనగా శరీమునకు చేసే సేవ. గురుమూర్తి యింటికి రాగానే, వారి పాదములు కడిగి, ఆ నీటిని తన శిరమున జల్లుకొని, పూజ నమస్కారములు చేసికొనుట మొదలగు గురుమూర్తి శరీరమునకు చేసే సేవ అంగశ్రశూష. స్థాన శుశ్రూష అనగా గురుమూర్తిని యున్నతాసనముపై కూర్చుండ చేసి, వారి శయ్యాదులను పవిత్రముగా చూచుకొనుట మొదలగునవి స్థాన శుశ్రూష. భావ శ్రశూషయనగా గురుమూర్తికి ఏ సమయమునకు ఏది కావలయునో గ్రహించుకొని, వారు అడుగకనే ఆయా సేవలందించుట భావ శుశ్రూష. వారి భావమునకు తగినట్లు ఆచరించుట. ఇక ఆత్మశ్రశూషయనగా - వారు తీరికగా ఉన్న సమయములో గురుమూర్తి యొక్క ఆత్మీయులు, ఇతర చోట్లలో ఉన్న శిష్యుల యొక్క యోగక్షేమములు, గురుమూర్తి క్షేమ సమాచారము తెలిసికొనుట. ఈ విధముగా చతుర్విధ శ్రశూషలతో గురుమూర్తికి దయబుట్టులాగున శిష్యుడు సేవ చేయుచు, బోధను అడిగి తెలుసుకొను చుండవలెను, ఇది బాహ్యార్థము. ఈ చతుర్విధ శ్రశూషలుకు అంతరార్థము కలదు.

**1) అంగశశ్రూష :** అంగమనగా - శరీరము, ఈ పిండాండ శరీము-జీవుడు, బ్రహ్మాండ శరీరము - ఈశ్వరుడు, ఇవన్నియు ఏలా ఏర్పడినవి. తెలియజేసే సాంఖ్య పాఠమును గురుమూర్తి ద్వారా తెలుసుకొని మననము చేసి, తిరిగి ఆసాంఖ్య పాఠమును గురుమూర్తికి అప్పగించినచో అది అంగ శుశ్రూష యనబడును.

**2) స్థాన శుశ్రూష :** పిండాండమందలి షట్చక్రములు, దళములు, బీజములు మొదలగునవి తెలియజేయు తారక విచారణ పాఠమును గురుమూర్తి ద్వారా గ్రహించి తిరిగి ఆ పాఠమును గురుమూర్తికి అప్పగించినో అది స్థాన శుశ్రూష అనబడును.

**3) భావ శుశ్రూష :** అనగా భావము - సంకల్పము యెచ్చట పుట్టుచున్నదో అదే మనస్సు, మనస్సు యొక్క చంచలత్వమును నిరోధింపజేయ అమనస్క పాఠమును గురుమూర్తి ద్వారా తెలుసుకొని, తిరిగి అమనస్క పాఠమును గురుమూర్తికి అప్పగించినచో అది భావ శుశ్రూష యనబడును.

**4) ఆత్మ శుశ్రూష :** పిండ, బ్రహ్మాండమందలి చైతన్యము అంతయు ఒక్కటే కాని వేరు కాదని తెలియజేయు మహా వాక్య విచారణ పాఠమును గురుమూర్తి వద్ద తెలుసుకొని, తిరిగి ఆ పాఠమును గురుమూర్తికి అప్పగించినచో అది ఆత్మ శుశ్రూషయనబడును.

ఈ విధముగా చతుర్విధ శుశ్రూషలు బాహ్యార్థము, అంతరార్థములతో నెరిగి గురుమూర్తిని సేవించుచు వారి కరుణకు పాత్రుడై శిష్యుడు మెలగవలయును. అప్పుడు మాత్రమే ఈ లోకములకు అతీతమైన పరిపూర్ణ పరబ్రహ్మమును గురు కరుణచే నెరిగి, యీ లోకములకు మూలమైన "నేను" అను ఎరుకను విడువగలడు. సాంఖ్య తారక అమనస్క మహావాక్య విచారణ, వరుసక్రమము కనుక అంగ, స్థాన, భావ, ఆత్మ శుశ్రూషలని వరుసగా చెప్పవలెను. ఆత్మాంగ స్థాన సద్భావ శుశ్రూషలను మాట, వరుస క్రమము కానేరదు.



**242వ పద్యము : దేశికుని చరణ తీర్థము । కాశీ గంగయని గురుని గమగొవ్వను, వి । శ్వేశుడని, యతడు తనకు ప । దేశంబొన రించినట్టిదే, తారకమనీ ॥ మన సందు తానీ తీరువ గనీ ॥ యేసీమ యందున్న కాశీ ప్రయాగ, రా । మేశుని పురమై ప్రకాశించు నా సీమ ॥ దే తారకమనీ । మనసందు తానీ తీరువగనీ ॥**

**దండాన్వయము :** గురుడు (అన్యాపదేశము) యే సీమ యందున్న నా సీమ కాశీ, ప్రయాగ, రామేశుని పురమై ప్రకాశించు ॥

**భావము :** శిష్యా! గురుపాద తీర్థమే కాశీ గంగ తీర్థమని గురుమూర్తిని విశ్వేశ్వరుడని, గురుమూర్తి తనకుపదేశించనదే తారక మంత్రమని, యీ విధముగ శిష్యుడు తన మనస్సు నందు, దృఢముగ నమ్మి భావించవలెను. గురుమూర్తి యున్న ప్రదేశమే, కాశీ, ప్రయాగ రామేశ్వరమని భావించవలెను.



**243వ పద్యము : గురుచరణ జలము, గోదా । వరి యని గురుమూర్తి రామభద్రుండని, త । త్పురమును భద్రాచలమని । గురుమంత్రమె తారకమని, గురి గల్గినట్టీ ॥ తిరిగిరాని మరుగెరిగినట్టీ ॥ నరుడున్నచోటె సుందర శేషగిరి, భద్ర । గిరి, రంగనాయక పురమన దగియుండు ॥ గురి గల్గినట్టీ । తిరిగి రాని మరుగెరిగి నట్టీ ॥**

**భావము :** శిష్యా! గురుపాద తీర్థమె గోదావరి పుణ్య తీర్థమని గురుమూర్తి రామభద్రుడనియు, ఆ గురుమూర్తి నివసించు పురమె భద్రాచలమనియు, వారుపదేశించిన మంత్రమె భవతారకమని నమ్మిక కల్గియున్న (శిష్యుడు) పునరావృత్తి రహితమైన పరిపూర్ణ బోధ మర్మధర్మములను చక్కగా ధృడపడిన ఆ మహాత్ముడున్న ప్రదేశమే, సుందరమైన శేషగిరి, భద్రగిరి, రంగనాయకపురము (శ్రీరంగం) అని భావించవలెను.



**244వ పద్యము : గురుడు నరుడనుచు దలిచిన । గురు మంత్రము మరచియున్న, గురుపుత్రుల, నా । దరణయొనర్చక యుండిన । గురువును విడనాడి రెండో గురుని జేరిననూ ॥ సద్గురు బోధ నెఱిగి దూఱిననూ । యెరుక మహత్యము నెరిగీన యిటువంటి । నరునకు తప్పదు నరకము నిజ మింకో ॥ గురుని జేరిననూ । సద్గురు బోధ నెఱిగి దూఱిననూ ॥**

**టీక :** దూఱినను = నిందించిననూ

**భావము :** శిష్యా! గురుమూర్తిని మనుష్య మాత్రునిగ తలచిననూ, గురుమంత్రమును మరచిపోయిననూ, తోటి గురుపుత్రులను ఆదరించకపోయిననూ, గురువును విడచి రెండో గురువును ఆశ్రయించిననూ, గురుబోధ తెలుసుకొని పిదప బోధను నిందించిననూ, అట్టివానికి యెరుక మహాత్యము నెరిగిననూ, నరకము తప్పదు.

**విశేష భావము :** యీ పద్యములో "గురువుని విడచి రెండో గురువును జేరినను నరకము తప్పదు" అని ఉన్నది. ఇక్కడ ఒక సందేహము గురు గీతలో "మధులుబ్ధో యధాభృంగః। పుష్పాత్ పుష్పాంతరం వ్రజేత్। జ్ఞానలుబ్ధ స్తథా శిష్యే। గురోర్గుర్వన్తరం వ్రజేత్ ॥ అని ఉన్నది. ఈ రెండును విరుద్ధ భావములు, వీటిని సమన్వయించుకోవలెను, పరబ్రహ్మము తత్వము నెరుగని అనేకమంది వాచక, సూచక, కారణ వగైరా గురువులు కలరు (గురుగీతలో తెల్పబడినది) అట్టి వారిచే శిష్యుడు ముక్తి పొందలేడు. కనుక అట్టి గురువును ఆశ్రయించిన శిష్యుడు, జ్ఞానలుబ్ధ గురువును విడచి, మరొక పరిపూర్ణ గురువును ఆశ్రయించవలసినదే. కాని గురువు పరిపూర్ణ బోధ గురువే అయినచో అట్టి గురువును విడువరాదు. ఆ శిష్యుని సందేహములు ఆ గురువు తీర్చలేకపోయిననూ, ఆ గురువు కాలధర్మము పొందిననూ కూడా రెండో గురువును ఆశ్రయించరాదు. ఈ బోధ నెరిగిన ఏ గురువులైనను అతనికి బోధ చేయనగును. అంతేకాని తన పాదము పట్టవలెనని చెప్పరాదు. ఇది "గురుని విడచి రెండో గురుని జేరుట నరకము" అను వాక్యమునకు భావము.



**245వ పద్యము : జ్ఞాన వైరాగ్య భక్త్య స । మాన, నదీస్నాన దేవ మంత్ర పఠన। తధ్యాన మఖ తంత్రములు, పర। మాని, నిరతి గోరునట్టి మనుజ సంఘముకూ ॥ బోధను దెల్పుమనిన వారలకు ॥ తాను బోధించుట తగదు, బోధించితె । తాను నేనను భ్రాంతి తలగేదేలా గట్టి ॥ మనుజ సంఘముకు, బోధను దెల్పుమనిన వారలకూ॥**

**టీక :** జ్ఞాన = తత్త్వజ్ఞానము, వైరాగ్య = ఇహ ముత్రార్థ ఫలభోగ వైరాగ్యము, భక్తి = గురుభక్తి (కి), అసమాన = సమానము కాని పరమాని = పరము అని = ముక్తినిచ్చునని, నిరతి గోరునట్టి= మిక్కిలి ఆసక్తితో గరుకొనేటి, మఖ=యజ్ఞములు.

**పద విభాగము :** జ్ఞాన, వైరాగ్య, భక్తి, అసమాన నదీ స్నాన, దేవ మంత్ర, పఠన, తధ్యాన, మఖ తంత్రములు పరమని, నిరతి గోరునట్టి మనుజ సంఘముకు, బోధను దెల్పుమనిన । వారలకు తాను బోధించుట తగదు । బోధించితె, తాను నేను అను భ్రాంతి తలగేదేలాగు?

**భావము :** శిష్యా! జ్ఞానము, వైరాగ్యము, గురుభక్తికి సమానము కాని పుణ్య నదీ స్నానము, దేవతారాధాన, మంత్ర పఠనము, యజ్ఞాది కర్మ తంత్రములే ముక్తినిచ్చునని భావించి, వాటి యందు మిక్కిలి ఆసక్తితో నుండే మనుజులకు, వారు ఈ బోదను కోరిననూ, అట్టి వారికి బోధించుట తగదు. ఎందు చేతననగా యీ బోధ వారు తెలుసుకొన్ననూ, జీవ - ఈశ్వర ద్వంద్వ బుద్ధి వారికి పోదు, కనుక అట్టి వారికి బోధించరాదు.



**246వ పద్యము : ఇంగితము నెరిగి సద్గురు । పుంగవుచే నరుడు భుక్తి ముక్తి క్రియలన్ । సంగా సంగము లెడలిన । శృంగారమె వాని చేష్ఠ చూచె వారలకూ ॥ వాడున్నట్లుతో చె వారలకు ॥ మంగళ మాత్ర మెభ్భంగి శృంగారమొ । శృంగార వతికి యశృంగార వతికట్లు ॥ చూచే వారలకు । వాడునట్లు తోచె వారలకు ॥**

**టీక :** ఇంగితము = అభిప్రాయము, సద్గురు పుంగవచే = శ్రేష్ఠమైన గురువు వద్ద, సంగము = చేరిక, సంసర్గము, అసంగము = విడిపోయనది, ఎడలిన = విడచిన, శృంగారము = అలంకారము, శృంగారవతి = సువాసినీ స్త్రీ, ఎభ్భంగి = ఏ విధముగా.

**దండాన్వయము :** నరుడు సద్గురు పుంగవుచే భుక్తి, ముక్తి క్రియలన్ ఇంగితము నెరిగి । సంగ అసంగములు ఎడలిన, చూచే వారలకు, వాడునట్లు తోచే వారలకు, వాని చేష్ఠ శృంగారమే । మంగళ సూత్రము శృంగారవతికి, అశృంగారవతికి ఎభ్భంగి శృంగారము అట్లు ॥

**భావము :** మానవుడు సద్గురు మూర్తిని చక్కగా ఆశ్రయించి భుక్తి ముక్తి క్రియల విశేష భావములను చక్కగా తెలుసుకొని, కూడియున్న దానిని (ఎరుకను) విడిపోయి ఉన్నదానిని (జగత్తును) రెంటిని విడిచి నడచుకొనే వాని విధానము, ఆ కాలములో వానిని ప్రత్యక్షముగా చూచే వారికి, ఇట్టి వాడని ఎరిగి తెలుసుకొన్న వారికి, ఇద్దరికి కూడా ఆనందము గానే యుండును. అదెట్లనగా సువాసినీ స్త్రీకి, పూర్వ సువాసినీ స్త్రీకి ఇద్దరకు కూడా మంగళ సూత్రము మంగళప్రదమైనదనే భావము సమానమే కదా। ఆ విధాముగా ॥

**విశేష భావము :** "భుక్తి, ముక్తి క్రియలన్ సంగా సంగములెడలిన" దేహమునకు - భుక్తి క్రియ, దేహికి - ముక్తి అవశ్యకము. దేహమునకు దేహికి, భుక్తి ముక్తి విషయములయందు న్యాయముగా తగురీతిని ప్రవర్తించుచు, గురుముఖతా పరిపూర్ణ పరబ్రహ్మము నెరిగినవాడై, సంగా అసంగములను విడచి వర్తించవలెను. సంగము అనగా కూడియున్నది. ఎరుక (జగదధిష్ఠానము) సమస్తము దాని యందు బీజరూపముగా నున్నది. అసంగము = విడిపోయియున్నది. జగత్తు లేక శరీరము.అనగా దేహి - దేహములు, ఎరుక - జగత్తులు రెండునూ లేనివే అని గుర్తించి, రెంటిని విడచి వర్తించవలెను. అట్టివాని నడక ప్రత్యక్షముగా చూచేవారికి పరోక్షములో అట్టివాడని తెలుసుకొన్న వారికి ఇద్దరకు కూడా ఆనందముగానే యుండును. సువాసిన్తి స్త్రీ మంగళ సూత్రము ధరించియున్న స్త్రీ (చూచువారు)కి పూర్వసువాసినీ స్త్రీ. (మంగళ సూత్రము ఇది వరలో ధరించి ఇప్పుడు ధరించని స్త్రీ విధవ) అనగా అట్లుతోచువారలు) ఆ ఇద్దరికి కూడా మంగళ సూత్రము మంగళప్రదమైనది పూజ నీయమైనది అనే సమాన భావము కల్గియుందురు. ఉదా॥ శ్రీ కృష్ణ దేశికేంద్రులు ఇంగితము నెరిగి, సంగా సంగములు విడచి వర్తించువారు. ఆ కాలములో ఆయన్ని చూచిన వార్కి, ఇప్పుడు వారు అట్టివారు అని తెలిసిన మనకు (తోచువారు) వారు మహానుభావులు అని గుర్తించుకొనుచున్నాము కదా. అట్టి విధముగా అని తెలియవలెను.

---

**247వ పద్యము : జనులందరు గురుబోధము । గనిరా జనులందు నేను గలియక యున్నన్ । నను మన్నింతురె వారని । మనసున తలపోస్తే బోధ, మర్మమబ్బినా ॥ అబ్బిన వారి ధర్మమబ్బీనా ॥ జనన మరణము లేని ఘనమైన త్రోవ, నే । గనవైతి నని బోధ గనకున్న యీ బోధ ॥ మర్మమబ్బినా । అబ్బినవారి ధర్మమబ్బీనా ॥**

**టీక :** మన్నింతురె = గౌరవింతురె, మర్మము = రహస్యము (లక్ష్యార్థము) ధర్మము = ఆచారము, స్వభావము (బ్రహ్మమును చూచే విధానము)

**భావము :** శిష్యా! తనబంధు జనులందరు ఈ గురుబోధను తెలుసుకొన్నారు. వారితో పాటు నేను కూడా తెలిసికొనకపోతే, వారు నన్ను గౌరవించరు అని తలచి, ఈ బోధ తెలుసుకొన్నచో అట్టి వారికి ఈ బోధ యొక్క రహస్యము తెలియదు

ఒక వేళ తెలిసిననూ ఆచరణ విధానము మాత్రము వారికి తెలియదు, జనన మరణములు లేకుండా జేసే యీ గొప్ప బోధను నేను తెలసికొని తీరాలి అని తపించి గురువును ఆశ్రయించి తెలుసుకొన్నవార్కి మాత్రమే యీ పరిపూర్ణ బోధ మర్మధర్మములు తెలియును అని భావము.

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతా ఽ ద్వైత రహిత పరమతత్త్వే
శిష్య లక్షణన్నామ
పంచదశోధ్యాయమునకు
భావ, విశేష భావములు సమాప్తము

# 15వ అధ్యాయమునకు - సంక్షిప్త భావము

ఈ అధ్యాయములో సచ్ఛిష్యుని లక్షణములు, కుచ్ఛిత శిష్యుని లక్షణములు కూడా తెలియపర్చిరి. వినయముతో సద్గురుమూర్తి పాద పద్మములకు తను, మన, ధనములు ధార పోసి, పరిపూర్ణ బోదను చక్కగా గురుముఖతా తెలిసికొన్న వారికి సాటి యెవ్వరు ఉండరు. అట్టి వాని పేరు విన్నంత మాత్రమునే నమస్కరించవలెను. గురుమూర్తిని హృదయపద్మమందే నిలిపి ఇతర చింతలు విడచినవాడై గురుమూర్తియే సమస్తము అని సేవించుకొనవలెను. సచ్ఛిష్యుడు ఎల్లప్పుడు గురుమూర్తికి చెంతనే ఉండాలనే కోరికతో నుండును. బోధను ఎల్లప్పుడు విడువక మననము చేయుచుండవలెను.

చతుర్విధ శుశ్రూషలు గురుమూర్తికి చేసుకొనుచు, సాంఖ్య తారక అమనస్క మహా వాక్య బోధను గ్రహించి ఆ తరువాత లోకాతీతంబైన పరిపూర్ణ బోధను గుర్తించి "నేను" తో సహా లోకములను విడచి వర్తించిన వాడే సచ్ఛిష్యుడు. పునరావృత్తి రహితుడు. గురుమూర్తియే రామభద్రుడు, కాశీ విశ్వేశ్వరుడు అని, గురు చరణ జలమే గోదావరి, గంగ తీర్థములని గురుమూర్తి యున్న ప్రదేశమే భద్రాచలము, కాశీ ప్రయాగ మొదలగు సమస్త పుణ్య తీర్థ ప్రదేశములనే గురితో ఉంటూ, గురుమూర్తి ఉపదేశించినదే తన భవతారకమని భావించును. సద్గురుమూర్తి ద్వారా బోధను గ్రహించి భుక్తి ముక్తి క్రియలు చక్కగా నిర్వహించుకొనుచు, ఎరుక-జగత్తులను విడచి, తానులేక వర్తించుకొనే సచ్ఛిష్యుడు పునరావృత్తి రహితుడు. అట్టి సచ్ఛిష్యుడు ప్రత్యక్షములో చూచే వారికి, పరోక్షములో విని తెలుసుకొని అట్టి వాడని తోచిన వారికి కూడా వాని యొక్క వర్తనము, మంగళ సూత్రము సువాసిని, పూర్వ సువాసినీ స్త్రీలు ఇద్దరకు మంగళ ప్రదమైనదనే సద్భావము ఎట్లు కలిగియుందురో అట్లు వాని యొక్క నడనుడులు గౌరవ ప్రదమైనదిగా యుండును.

కుటిల శిష్యుడు గురుమూర్తి వద్ద బోధ తెలుసుకొనే పర్యంతము చక్కగా వర్తించి ఆ పైన గురుమూర్తిని ధ్యానించడు. ఇంటికి వచ్చిననూ ఆదరణ చేయడు తనను తన శిష్యులు అతి గౌరవము చేయు నిమిత్తము గురునామ స్మరణము

విపరీతముగా చేయుచు, బోధ తన గురువు చెప్పలేదు, తానే పుస్తక రీతిని గ్రహించితినని చెప్పుకొనుచుండును. ధన లోభమగ్నుడై ప్రవర్తించును.

తన బంధుజనులందరు ఈ బోధను తెలుసుకొన్నారు కనుక నేను కూడా తెలుసుకొంటే వారిలో గౌరవింపబడగలనని బోధను గ్రహించిన వార్కి పరిపూర్ణ బోధ మర్మధర్మములు తెలియదు. గొప్పదైన యీ బోధ తెలుసుకొనకపోతే జన్మవ్యర్థమని తెలుసుకొన్నవాడే సచ్ఛిష్యుడు.

॥ జై గురు ॥

## అధ్యాయము - 16

# గురుశిష్యోభయ లక్షణము (12)

**అవతారిక :** గురుని లక్షణము, శిష్య లక్షణములు చెప్పి, బోధ విషయములో గురుశిష్యుల ఉభయుల లక్షణము చెప్పుచున్నారు.

**248వ పద్యము : హృదయగ్రంధి విడుటకై । సదయత యీ బోధ దెల్పజనదా గురుడై । వదలక చిత్తములో గురు । పద యుగళము దలుప వలదె, భక్తుడైనపుడు॥ భ్రాంతి రహితాసక్తుడైనపుడూ ॥ కుదరదు యివి రెండు గురు శిష్యులకు లేక । కదలిక లేనట్టి ఘన బోధోక్త స్థితి ॥ భక్తుడైనపుడూ । భ్రాంతి రహితాసక్తుడైనప్పుడూ॥**

**దండాన్వయం :** హృదయ గ్రంధి విడుటకై సదయత యీ బోద దెల్ప గురుడై జనదా ॥ భక్తుడైనపుడు, భ్రాంతి రహితా సక్తుడైనపుడు, గురుపద యుగళము, వదలక చిత్తములో దలుపవలదె? । యివి రెండూ గురు శిష్యులకు లేక, కదలిక లేనట్టి ఘన బోధోక్త స్థితి కుదరదు ॥

**టీక :** భ్రాంతి రహిత = ఎరుక రహిత (జన్మరహిత), హృదయ గ్రంధి = అజ్ఞానపు ముడి, అవిద్యా బంధము, అహము, ఎరుక కూకుడు వేరు, ఘనబోధోక్త స్థితి = పరిపూర్ణ బోధలో చెప్పబడిన స్థితి, నేను లేని స్థితి.

**భావము :** శిష్యా! గురుమూర్తి తన శిష్యుని యొక్క హృదయ గ్రంధి విడిపించుటకై, దయతో యీ పరిపూర్ణ బోధను తెలియపర్చవలెను అను ఉద్దేశ్యముతో శిష్యుని వద్దకు వెళ్లవలెను. అట్లే శిష్యుడు గురుభక్తుడై భ్రాంతి రహిత మార్గమును తెలుసుకొనవలెనను ధృడ సంకల్పముతో, సద్గురు మూర్తి పాద పద్మయుగళము, తన హృదయ కమలము నందు ఉంచుకొని నిత్యము అర్చించుకొనుచుండవలెను. ఈ విధముగా గురుశిష్యులు ఇద్దరకు ఉండవలెను. అట్లు కానిచో రాకడ పోకడ లేని యీ గొప్ప బోధ స్థితి (నేను రహితస్థితి) కుదరదు.

**విశేష భావము :** హృదయగ్రంధి అనగా అజ్ఞానపు ముడి, అనగా జన్మకు కారణమైన అవిద్య (అదే అహము, అంతఃకరణ). ఇది తనకు తానుగా పరిపూర్ణ బ్రహ్మములో లేనదే (అనాదిగా) తోచినది. స్వతఃజడము ఇది అద్దము వలె ప్రతిబింబింప జేసుకొనే

లక్షణము గలది. మరియు త్రిగుణాత్మికము, ఇది ప్రతిబింబించుకొనే లక్షణము గలది కనుక, ఇది తోచుచుండగానే తనకు అంతటా నిండియున్న పరిపూర్ణమును ప్రతిబింబించుకొన్నది. పరిపూర్ణ ప్రతిబింబము అవిద్య యందు ఉండుటచే అవిద్య సత్తా మాత్రమై, చైతన్యవంతమై త్రిగుణములచే సమస్త సృష్టి స్థితి లయ కార్యములు అవిద్య చేయుచున్నది. ఈ ప్రతిబింబమే సాక్షి చైతన్యము. ఎరుక, నేను అనని నేను (నా స్వరూపము). అవిద్య చేసే సమస్త కర్మల వలన జన్మజన్మలకు కారణమగుచున్నది. అవిద్య - అవిద్యా ప్రతిబింబ చైతన్యము ఈ రెండు భిన్న గుణములు కలది. ఎన్నడును విడిబడి యుండనేరవు. కనుక యీ రెంటి మొత్తమే హృదయ గ్రంధి, ఇందులో అవిద్యను గురుకరుణచే రహిత పర్చబడినచో, ప్రతిబింబము లేకుండాపోవును. అవిద్య ప్రతిబింబములు రహితమైతే ఎరుక రహితము అనబడును. ఇదే హృదయగ్రంథి విడుట. ఈ హృదయగ్రంధి విడుటకు గురుబోధ, గురు కరుణ కావలయును. ఇదే గురువు చేసే పని. ఇందుకు గురుగీతలో "భిద్యతే హృదయ గ్రంధిః । ఛిద్యంతే సర్వసంశయః । క్షీయన్తే సర్వకర్మాణి । గురోః కరుణ యాశివే । అని చెప్పబడినది.

---

**249వ పద్యము : గురుడాస వదలకుండిన । మరిశిష్యుడు ద్రవ్య లోభ మగ్నుండైనన్। మరియాద దక్క దిరువుర । కె, రిగుండుము, వీరలతి, హీనులోయన్నా ॥ గట్టిగ దురభిమానులోయన్నా ॥ గురుడు శిష్యుని కన్నకొడుకుగ గనకున్న । గురుని పై శిష్యుడా గుఱి నిల్పకుండిన । హీనులో యన్నా । గట్టిగ దురభిమానులోయన్నా ॥**

**టీక :** అభిమానము = అజ్ఞానము, దురభిమానము = చాలా గొప్ప అజ్ఞానము, గుఱి=నిర్ణయము.

**భావము :** శిష్యా! గురుమూర్తి ఆశ విడువక పోయిననూ, శిష్యుడు ధనలోభము కలవాడైనను, ఇద్దరకు ఒకరిపై మరొకరికి గౌరవము ఉండదు. గురువు శిష్యుని తన కన్న కుమారునిగ చూడకపోయిన, శిష్యుడు గురుమూర్తిపై ఆ నిర్ణయము నిలుపకపోయిన, (అనగా గురుమూర్తిని తండ్రిగా జూడకపోయినను) ఆ గురుశిష్యులుఇద్దరు అతిహీనులు, చాలా గొప్ప అజ్ఞానులు.

---

**250వ పద్యము : గురు గురుబోధల చేతను । పరిపూర్ణము నెరిగి యెరుక బాసిన యతనిన్ । గురు తెరుగ నౌరుల శక్యమె । యెరిగిన వరులిట్టి బోధ, నెరిగోరోయన్నా॥ వారెరుగని మరుగుండదన్నా॥ చిరుత పాపని రీతి, మరి పైశాచము భాతి । తిరుగుచు నుండు వెక్కురు మూడ్కి, గురుడెట్లు ॥ ఎరిగే రోయన్నా । వారెరుగని మరుగుండవన్నా॥**

**టీక :** గురు = గొప్పది, బంధింపరానిది, గురుబోధ = పరిపూర్ణబోధ, బాసిన = విడచిన, ఎరిగేరా + ఓయన్నా = ఎరిగేరోయన్నా = తెలిసిన వారేనా? (కాదు), మరుగు=రహస్యము, వెక్కురు = వికారము కలవాడు, పిచ్చివాడు, మాడ్కి = విధము.

**దండాన్వయము :** చిరుత పాపని రీతి, మరి పైశాచము భాతి, వెక్కురు మాడ్కి, గురుడు తిరుగుచుండూ ॥ ఎట్లు ఎరిగేరోయన్నా (ఎరిగేరా ఓయన్నా)

**భావము :** శిష్యా! గొప్పదైన పరిపూర్ణ బోధచే, పరిపూర్ణ బ్రహ్మమును దెలిసి యెరుక విడిచిన వారిని, గుర్తించుట యితరులకు శక్యము కాదు. అలా యెరిగినచో వారు ఇట్టి బోధ నెరుగనివారు. ఎరుకను విడచిన మహాత్ముడు అయిన గురువు ఎరుగని రహస్యమేదియు యుండదు. వారు చిన్న పిల్లల వలె, పిశాచము పట్టిన వాని వలె, పిచ్చివాని వలె (చేష్టలు) ఏ నిర్ణయమును లేక తిరుగుచుందురు. (ద్వంద్వ రహితులు, సంకల్ప రహితులు)



**251వ పద్యము : మలయాద్రి చెంత చెంచుల । కిల, చందన భూరుహములె యింధనమట, మి । క్కిలి గలుగబట్టి, యట్లనె । చులకన సుమి యింట గలుగు సూరిభూషణుడు ॥ బహు మాన్యుడు దూరస్థుడెపుడు ॥ తెలియనివారికి తెలిసేది కఠినము । తెలివిచే తెలిసితె తెలియజేసును బోధ ॥ సూరి భూషణుడు । బహుమాన్యుడు దూరస్థుడెపుడు ॥**

**టీక :** మలయాద్రి = మలయ పర్వతము, చెంత = వద్ద, దగ్గర, చెంచులకు = ఆటవికులకు, చందన భూరుహములు = మంచి గంధపు చెట్లు, యింధనము లట = వంటె కట్టెలట, మిక్కిలిగలుగబట్టి.= ఎక్కువగా ఉండబట్టి, చులకన సుమీ = తేలిక సుమా ! సూరిభూషణుడు = పండితశ్రేష్ఠుడు । బహుమాన్యుడు = గొప్పగా

గౌరవింపబడువాడు, బోధ = జ్ఞానము, దూరస్థుడు = దూరముగా నుండువాడు, బ్రహ్మమునకు దూరముగానుండువాడు.

**దండాన్వయము :** ఇలన్ మలయాద్రి చెంత చందన భూరుహములు మిక్కిలి గలుగబట్టి, చెంచులకు ఇందనమట, అట్లనె తెలియని వారికి యింట గలుగు సూరిభూషణుడు చులకన సుమీ। దూరస్థుడు ఎప్పుడూ బహుమాన్యుడు (అట్టివారికి) బోధతెలిసేది కఠినము. తెలివిచే తెలిసితే సూరిభూషణుడు తెలియజేయును.

**భావము :** శిష్యా! మలయ పర్వతమువద్ద నున్న ఆటవికులు అచ్చట మంచి గంధము చెట్లు ఎక్కువగా ఉండుటచే వాటినే వంటకట్టెలుగా ఉపయోగింతురు. అట్లే తన ఊరిలోనే (దగ్గరగా) ఉన్న పండిత శ్రేష్ఠుడు (సద్గురుమూర్తి) బహుచులకనగా మూర్ఖులకు తోచబడును. అట్టివారికి బోధ తెలియకపోయినను డాంబికుడు గొప్ప గౌరవనీయునిగా తోచును.

అట్టి మూర్ఖులకు యీ బోధ తెలియుట దుర్లభము. జ్ఞానముచే తెలిసికొనే వారికి సూరిభూషణుడు (గురుమూర్తి) బోధ చక్కగా తెలియజేసును.



**252వ పద్యము : దూరముప నుండి విన్నను। చేరును పజ్జనుడు గురుని చెంతకు బోధ। గోరి దుర్జనుడు కోరడు। దూరస్థుడు గాక గురునితో గూడి యుండీ॥ యెట్లని యున్న దూరాన నుండీ॥ కోరి తుమ్మెద తమ్మిఁజేరి తేనియ గ్రోలు। వా రీతి నెరుగవు చేరి కప్పలు తమ్మి॥ తో గూడి యుండీ॥ యెట్లని యున్న దూరావయుండీ॥**

**టీక :** తమ్మి = తామర పద్మము; తేనియ = మకరందము, గ్రోలును = గ్రహించును, ఆ రీతిని = ఆ విధానము.

**దండాన్వయము :** సజ్జనుడు దూరమున నుండి విన్నను, గురుని చెంతకు బోధం గోరి చేరును। దూరస్థుడు గాక గురునితో గూడి యుండి దుర్జనుడు గోరడు। యెట్లని యున్న, తుమ్మెద దూరాన ఉండి కోరి తమ్మి జేరి తేనియ గ్రోలును। కప్పలు తమ్మితో గూడి యుండి ఆ రీతిని ఎరుగవు॥

**భావము :** శిష్యా! సజ్జనుడు గురుమూర్తికి దూరముగా నున్నను, బోధవినినచో, ఆ బోధను కోరి గురువు వద్దకు చేరును. గురుమూర్తికి దగ్గరగానే యున్ననూ దుర్జనుడు ఆ బోధను కోరుడు, ఎట్లనగా తుమ్మెద తామరపువ్వుకు దూరముగానున్న, ఆ తామర పద్మము వద్దకు వచ్చి మకరందమును తీసుకొనును. కాని ఆ పద్మములకు దగ్గరగానే యున్నను కప్పలు ఆ మకరందమును తీసుకొనే విధానము తెలియవు.



**253వ పద్యము : చూసి మదిదెలసి శిష్యుని । యాశయమును, తగిన బోధనతనికి దెలియన్ । జేసి ముద మొందజేసెటి । దేశికుడే ముఖ్యుడనుచు, తెలుసుకోవోయీ॥ కనియత గాణ్ణి కలుసుకోవోయీ ॥ చేసినీ దయతో నీ యాశ సంపూర్తిట్లు । వ్రాసైతే వేసుకో, చూచేవు తార్ఖాణ ॥ తెలుసుకోవోయీ । కనియతగాణ్ణి కలుసుకోవోయీ ॥**

**టీక :** చేసిని = చేసేత యొక్క రూపాంతరము = చేయును, తార్ఖణ = దృష్టాంతము, ఆశయము = అభిప్రాయము, కని = విచారించి, ముదమొందజేసేటి = సంతోషింపజేయునట్టి, ముఖ్యుడు = ప్రధానమైనవాడు, ఆశ = కోరిక.

**దండాన్వయము :** శిష్యుని చూసి మదిన్, ఆశయమును తెలసి, అతనికి తగిన బోధ దెలియంజేసెటి దేశికుడే ముఖ్యుడనుచు తెలుసుకోవోయీ । కని, అతగాణ్ణి కలుసుకోవోయీ । దయతో జేసిని నీ యాశ సంపూర్తి । ఇట్లు వ్రాసైతే వేసుకో । తార్ఖాణ చూచేవు ॥ తెలుకుకోవోయీ ॥

**భావము :** శిష్యుని ప్రవర్తన చూసి, అతని మనస్సును అభిప్రాయమును తెలుసుకొని, అతనికి తగిన బోధ తెలియపర్చి, సంతోషింపజేసే వ్యక్తే దేశికుడు (సద్గురువు) అని తెలిసికొనుము. విచారించి అట్టి వానిని గుర్తించి ఆశ్రయించుము. గురుమూర్తి దయతో ఆ విధముగా చేసినచో నీ కోరిక ఫలించినదగును. ఈ విషయము నీ మనస్సులో వ్రాసుకొని దృష్టాంతము చూచుకొనుము.

**విశేష భావము :** ఈ పద్యములో గురుమూర్తిని శిష్యుడు విచారించి తెలిసికొని ఆ తరువాత చక్కగా ఆశ్రయించుమనియు, అట్లే శిష్యుని చక్కగా గురుమూర్తి పరిశీలించి అతని మనస్సు తెలుసుకుని తగిన బోధ చెప్పమనియు చెప్పిరి. ఇది చాలా ఆవశ్యము. అట్టి గురువు వలనే శిష్యుని కోరిక ఫలించును. గురుమూర్తి ఎట్టివాడై యుండాలి? అని ఈ పద్యములో నిర్ణయించిరో, ఆ మాటలను మనస్సులో వ్రాసుకొని శిష్యుడు

తార్థాణము చూచుకోవాలి. అంటే వెదకి అట్టి లక్షణములు గల గురుని సంపాదించుకోవాలి. అట్టి గురువు వలనే శిష్యుడు సరియైన బోధ పొందగలరని విచారించి ప్రత్యక్షముగ కని తెలుసుకోమని భావము.

**254వ పద్యము : మంతనమున గురుబోధన । యెంతో వింతనుచు నమ్మితింతే కదా । యే వింతలు గనరావని, దా॥ వతితము వొందేటి వాని బ్రతుకంతకంతే ॥ చింతలు లేని గతి గాన డింతే ॥ అంతకంతకు వాని కతి చాదస్తమె కాని । సంతకూటము తోటి సంభాషించడు వాని ॥ బ్రతుకెంతకంతే । చింతలు లేని గతి గాన డింతే ॥**

**టీక :** మంతనమున = ఆలోచించగా, రహస్యముగా, వింతనుచు = గొప్పదనుచు, దావంతము = దుఃఖము, చాదస్తము = వెఱ్ఱితనము, సంతకూటము = వేదపాఠము చేసెటి ఇల్లు, లేక చావడి, కూటము = సమూహము.

**భావము :** ఈ గురుబోధ యెంతో గొప్పది అని ఆలోచించి ఈ గురు బోధను చెప్పుకున్నాను. కాని ఇందులో ఏ గొప్పతనము కనుపడుట లేదు. అని దుఃఖించే వాని బ్రతుకు ఎంతకు అంతే (ఎప్పటికి అంతే). అట్టి వాడు దుఃఖములేని దారి తెలుసుకోలేడు. అంతకంతకు వానికి వెర్రితనము వృద్ధగునే కాని, జ్ఞానము చెప్పుకొనే స్థానము, సమూహముతో చేరడు సంభాషించడు. అట్టి వాని బ్రతుకు ఇదివరలో ఎంతదుఃఖముతో ఉండునో ఇప్పుడూ ఎప్పటికి అట్లే ఉండును.

**విశేష భావము :** గురుబోధ వలన ఏ రకమైన ఇహ, పరలోక భోగములు గాని, ఆపద నివారణ గాని ఏర్పడదు. కేవలం పునర్జన్మ రహితత్వము మాత్రమే సిద్ధించును. అట్టి ప్రయత్నము చేయు వారికి మాత్రమే సరియైన మార్గమును జూపును. జన్మ సాఫల్యమును ప్రసాదించును. మహిమలు గాని సిద్ధులు గాని ఇతర విధమైన కోరికలు గాని కోరువారు ఈ బోధను గ్రహించలేరు.

**అవతారిక :** ఈ గురుబోధలో ప్రచారము చేసే వారు ఏ విధముగా బోధను చెప్పాలో సూచించినారు. వినువారు ఈ బోధ తప్పక నేర్వాలి అనే కోరిక పుట్టేలా చెప్పాలే తప్ప, నికృష్ట నీచ వ్యాఖ్యానములతో, జనులు నిరసించులాగున బోధ చెప్పరాదని, చెవులకు ఇంపు కలిగేలా చెప్పాలి అని ఈ పద్యములో సూచించుచున్నారు.

**255వ పద్యము : తనగురు బోధను తా । జదివిన, విను జనవితతి మదికి వింతై, యీ బో। ధను నేర్వకున్న వ్యర్థము। జననంబని తోచి, శరణు శరణనెటట్టూ ॥ వెంటనే వాండ్లు దరిజేరెటట్టూ ॥ ఘనమైన యుక్తి జేసినవాడె శిష్యుడు । అనుమాన మేమిందు గనరాదు వినవోయీ ॥ శరణానె టట్టూ । వెంటనేవాండ్లు దరిజేరేటట్టూ॥**

**దండాన్వయము :** తన గురుబోధను తాజదవిన, విను జన వితతి, మదికి వింతై, యీ బోధను నేర్వకున్న జననము, వ్యర్థమని తోచి, (గురుని అన్యాపదేశము) వెంటనే వాండ్లు దరిజేరెటట్టు శరణుశరణనెటట్టూ.

**టీక :** వింతై = గొప్పదిగా తోచి, జన వితతి = జన సమూహము, యుక్తి = న్యాయము, ఉపాయము.

**భావము :** శిష్యా! తన గురువు తనకు జెప్పిన యీ పరిపూర్ణ బోధను చదివేటప్పుడు లేక ఇతరులకు చెప్పేటప్పుడు, వినే ఇతరజనులు "ఈ బోధను నేర్వకపోతే, జన్మ వృధా, కనుక మనము తప్పకుండగ బోధను నేర్చుకోవాలి" అని వారి మనస్సుకు తోచి, వెంటనే వారు గురుమూర్తికి వద్దకు వచ్చి గురుమూర్తికి శరణని పాదాశ్రయము పొంది తమకు కూడా ఈ బోధ చెప్పమని అడిగేటట్లుగా ఉపాయముతో బోధ చేసేవాడే నిజమైన శిష్యుడు. ఇందులో ఏ రకమైన అనుమానము లేదు.

అనగా ఇతరులకు ఈ బోధయందు నీచభావమును, భక్తి రహిత భావమును, పాపములు చేసినా ఫరవాలేదనే అశాస్త్రీయ విధానములను ఎంతమాత్రము చెప్పరాదని భావము.

**256వ పద్యము : తన భార్య రూపురేఖలు । తన పుత్రుల సద్గుణములు, తన సంపదయున్ । తన పెరటి మందు చెట్టులు । తన గ్రామపు సాధుజనులు, తనకు మెప్పావా? ॥ యీ యిలలో యెంతటి వానికైనా ॥ వినలేదే నీవా యహల్యను జూచి మోహించె । ఘన వాహనుండు చక్కని భార్యగలిగుండి ॥ తనకు మెప్పావా । యీ యిలలో యెంతటి వానికైనా ॥**

**టీక :** సాధుజనులు = బ్రహ్మజ్ఞానులు (సత్ వస్తువును గుర్తించినవారు) రూపురేఖలు = సౌందర్యము సౌభాగ్యము; సంపద =భాగ్యము; మందుచెట్టు = వనమూలిక, నీవాహల్యను = నీవు ఆ అహల్యను, ఘనవాహనుడు = గొప్ప వాహనము కలవాడు, ఐరావతమను వాహనము కలవాడు (ఇంద్రుడు)

**భావము :** శిష్యా! యీ భూమి పై యెంతటి వానికైనా, తనభార్య అందచందములు, తన కుమారుల సద్గుణములు, తన సంపద, తన పెరటి యందలి వనమూలిక, తన గ్రామంలో ఉన్న బ్రహ్మజ్ఞాన సత్పురుషులు, తనకు గొప్పగా కనుపించునా? (కనపడవు) ఇంద్రుడు చక్కని భార్యను కలిగియుండి కూడా అహల్యను కామించెను అను విషయము వినలేదా ?



**అవతారిక :** ఈ గ్రంథము (పద్యములు) రత్నముల హారమనియు, కంఠమున ధరించమనియు అనగా కంఠస్థము చేయమనియు, అట్లు చేసినచో జ్ఞానము ఆరూఢమగుననియు చెప్పుచున్నారు.

**257వ పద్యము : జతనముగ దాచి చదువుము । రతనమ్ముల హారమిదియు రసికుల గళమా । యతనము, దీనికినే బహు । యతనము గావించి తెచ్చి యిస్తీర నేడూ ॥ బోధకు బందో బస్తార చూడూ ॥ రతనాలెట్లారాళ్ళు, రతనాలంచని యంటె, రతనాలీ పద్యాలే రసికులెరిగెద రివి, నీ । కిస్తీర చూడూ । బోధకు బందో బస్తారచూడూ॥**

**పదవిభాగము :** జతనముగ దాచి చదువుము । రతనమ్ముల హారము ఇదియు, రసికుల గళము ఆయతనము । దీనికి నే బహుయతనము గావించి, తెచ్చి యిస్తి రానేడు । బోధకు బందోబస్తార చూడు । రతనాలు అంచు అని అంటే, రాళ్ల

రతనాలు ఎట్లొ ॥ రతనాలు ఈ పద్యాలే, ఇవి రసికులు ఎరిగెదరు. ఇవి నీ కిస్తిర నేడూ ॥

**టీక :** జతనముగ = పదిలముగ, ప్రయత్నము చేసి, దాచి = భద్రపరచి, రసికుల గళము = పండితుల కంఠసీమ, ఆయతనము = నివాసము, దీనికి నే బహుయతనము గావించి = ఈ గ్రంథము వ్రాయుటకు నేను అధిక ప్రయత్నము చేసి, బోధకు = జ్ఞానమునకు, బందోబస్తు = పరిష్కారము, భద్రము, ఔర = అగును, చూడు = తెలిసికొనుము.

**భావము :** శిష్యా! ఈ గ్రంథమును భద్రపరచుకొని ప్రయత్నము చేసి (కష్టపడి) చదువుకొనుము. రత్నముల హారము ఇది. ఇది చక్కటి బ్రహ్మజ్ఞాన పండితుల గళ సీమకు ఉనికి పట్టు (అనగా కంఠస్థముగా చదువుకొని, ఎప్పుడు కంఠసీమయందు ఉంచుకొనుము అని భావము) దీనికి నేను బహుప్రయత్నము చేసి తెచ్చి నీకు ఇచ్చుచున్నాను. మూర్ఖులు ఇవి రాళ్ళు, రతనాలు కావు అంటారు. రసికులైనవారు వీనిని రత్నములు గానే గ్రహించెదరు. (రసికులు అనగా ఈ గ్రంథ భావమును చక్కగా గ్రహించినవారు, లేక రస స్వరూపమైన బ్రహ్మతత్త్వమును తెలిసివారు.

---

**అవతారిక :** బోధను గురుముఖముగా పలుమార్లు విని, మననము చేసికొనుచు, ఇతరులకు చెప్పుచుండుటచే, బోధ యొక్క మర్మధర్మములు తెలియబడునని చెప్పుచున్నారు.

**258వ పద్యము : విననేర్చి చెప్పనేర్చిన । మనుజులకే దీనిలోని మర్మము దెలియున్। వినజెప్పనేర్వకుండిన । మనుజులు, యీ బోధలోని మర్మమెరిగేరా ॥ దీనందుండే ధర్మమెరిగేరా ॥ జనులె కొబ్బరికాయతివ నేర్పు కలవారు । తిన నేర్చునా కోతి తనకా కాయబ్బినా ॥ మర్మమెరిగేరా । దీనందుండే ధర్మమెరిగేరా ॥**

**టీక :** ధర్మము = న్యాయము, ఆచారము.

**భావము :** యీ బోధ గురుముఖతా చక్కగా వినుచూ, తిరిగి యితరుకు చెప్పుచుండినచో, అట్టివారికి యీ బోధలోని రహస్యములు బాగుగ తెలియును.

అట్లు వినక ఒకవేళ వినినను యితరులకు చెప్పకపోయినచో యిందులోని మర్మములు తెలియవు. ఒకవేళ మర్మములు తెలిసి, ఆచరణ విధానము తెలియరాదు (అనగా బోధలోని సూక్ష్మ వస్తు నిశ్చయము తెలియరాదు) కొబ్బరికాయను సంపాదించుట, తినుట, జనులు చేయుగలరు, కాని కోతి కొబ్బరికాయ సంపాదించినను తినే నేర్పు లేదు కదా !

**అవతారిక :** గురుపూజ, అనుష్ఠానము, ధ్యానము లేనిదే ఈ గురుబోధ, గురుమూర్తి ఎంతచక్కగా చెప్పిననూ శిష్యుని మనస్సులో నిలబడదు అని చెప్పుచున్నారు. ఈ విషయమును భక్తులు చక్కగా గుర్తించవలెను.

**259వ పద్యము : నేనెంత లెస్స చదివిన । దీనిని తెలియంగలరె దేశికవర్యున్ । పూని సేవించకుండిన । మానవులది యెట్లనన్న, మరి వినవోయీ ॥ నామాటందు మనసుంచవోయీ ॥ వానాకాలములోని వర్షము, ఒకబిందు। నైన మిట్టమ నిల్వదది నిశ్చయమెకదా । మనసుంచవోయీ ॥ నా మాటందు మనసుంచవోయీ ॥**

**టీక :** లెస్స = బాగుగ, జదివిన = చదివి చెప్పిననూ, దేశికవర్యున్ = పూజనీయుడైన గురుమూర్తిని, పూని = ప్రయత్నించి, (మన స్ఫూర్తిగా) సేవింపకుండిన = పూజించనిచో, మిట్ట = ఎత్తు ప్రదేశము, కొండ. నిశ్చయము = నిజము.

**దండాన్వయము :** నేనెంత లెస్స జదివిన, మానవులు దేశిక వర్యున్ పూని సేవించకుండిన, దీనిని తెలియంగ గలరె? (తెలియలేరు)

**భావము :** శిష్యా! ఈ గ్రంథ విషయమును నేను ఎంత బాగుగ వివరించి చెప్పిననూ, మానవులు మన స్ఫూర్తిగా గురుదేవుని ఆశ్రయించి పూజించి అనుష్ఠించనిదే, ఈ గ్రంథ భావము ఎంత మాత్రము తెలిసికొనలేరు, ఇది నమ్మేము. ఎట్లనగా వానాకాలములో పడిన వర్షపు నీరు, కొండమీదే పడిననూ, ఆ నీరు అక్కడ నిల్వకుండగా క్రిందికి జారిపోవును కదా ! అని తెలిసికొనుము.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ౨_ద్వైత రహిత పరమతత్త్వే
గురుశిష్యోభయ లక్షణన్నామ షోడశోధ్యాయమునకు భావ విశేషభావములు
సమాప్తము.

# 16వ అధ్యాయమునకు - సంక్షిప్త భావము

ఈ అధ్యాయములో గురుశిష్యుల ఉభయులకు ఉండవలసిన లక్షణములను చెప్పుచున్నారు. శిష్యుని యొక్క అజ్ఞానపు ముడి అనగా హృదయగ్రంథి విడిపించవలెను అనెడి దయతో కూడన మనస్సు గురుమూర్తికి, శిష్యునకు గురుమూర్తి సాక్షాత్తు పరమేశ్వరుడే తన పుణ్యము వలన ఈ రూపముతో అవతారించినట్లుగను, భావించకపోయినచో యీ బోధ అబ్బదనియు, మరియు గురుమూర్తి ధనాశాపరుడు కాకూడదనియు, గురుమూర్తి శిష్యుని తనకన్న కుమారుని కంటే అధికముగా జూడగలుగ వలెననియు, అట్లే శిష్యుడు తన గురుమూర్తి యందు పూజ్య పితృ భావము కల్గి యుండవలెననియు జెప్పిరి. మలయాద్రి వద్దనున్న ఆటవికులు చందన శాఖలనే వంటకట్టెలుగ ఉపయోగించుకొనునట్లుగ, తనయింటనే ఉన్న బ్రహ్మజ్ఞాన సంపన్నుని, యందు తగినంత గౌరవ భావము ఆ యింట్లో వారికి యుండక చులకనగా కనిపించును. దూరమున ఉన్నను సంస్కారవంతుడు బోధనుకోరి గురుమూర్తిని చక్కగా ఆశ్రయించి బోధను సంపాదించుకొనును. కుసంస్కారి, దగ్గరగా ఉన్నప్పటికీ బోధను గ్రహించలేడు.

మూర్ఖులైన వారు ఎంతో గొప్పది అని భావించి యీ బోధ చెప్పుకున్ననూ ఇందులో ఏ గొప్పతనము కనిపించుట లేదని బాధపడుచుందురు. అట్టి వారికి యీ బోధ అబ్బదు. చాలా కాలము నుండి యీ బోధ నేర్వాలనుకుంటున్నాను కాని సరియైన విధానము తెలియక బోధను తెలిసికొనలేక పోతిని, జన్మ వృధా పరచుకొన్నాను అని బాధపడే వారికి మాత్రమే, చక్కగా గురుమూర్తిని ఆశ్రయించి బోధను గ్రహింతురు. ఇది రత్నహారమనియు, బోధను గోరినవారు కంఠసీమను ధరించమనియు అనగా పద్యములను కంఠస్థముగా చదువుకొనిననో బోధ చెప్పుటకు భద్రముగా ఉండుననియు చెప్పిరి. మరియు బోధను విని ఊరకుండక ఇతరులకు తాను వినిన బోద తిరిగి చెప్పుటచే, బోధలోని మర్మధర్మములు తెలియబడగలవు అనియు జెప్పిరి. ఆఖరి పద్యం చాలా ముఖ్యమైనది. బోధ గురుమూర్తి ఎంత బాగా చెప్పిననూ శిష్యుడు గురుమూర్తిని పూజించి సేవించకపోయినచో బోధ మనస్సుకు పట్టదు. ఇది చాలా గుర్తించవలసిన విషయము.

॥ జై గురు ॥

# 17. గురుదత్తాభయ దానము (11)

**260వ పద్యము : నన్నా శ్రయించినావని । యన్నా యీ బోధ నీకు యతుకుట కొఱకై । యెన్నో యుక్తుల జెప్పితి । విన్నావా దీన్ని నీవు విడువకెప్పటికి ॥ నా యాజ్ఞను గడువకెప్పటికి ॥ నన్ను నీవు నిన్ను నే గన్న వేళ్లెట్టిదో ॥ నన్ను నీవు విడులేవు నిన్ను నే విడలేను ॥ విడువకెప్పటికి । నా యాజ్ఞను గడువకెప్పటికీ ॥**

**భావము :** శిష్యా! నీవు నన్ను యాశ్రయించినావని యీ పరిపూర్ణ బోధ నీ మనసుకు అతికేలా యెన్నో ఉపాయములు ఉదాహరణలతో నీకు తెలియజేసినాను. చక్కగా విన్నావు కదా ! దీన్ని నీవు ఎన్నటికి విడువక మననము చేసికొనుచుండుము. ఇది నా ఆజ్ఞ, నా ఆజ్ఞను మీరకముము, నన్ను నీవు, నేను నిన్ను ఎట్టి మంచి సమయములో కలసుకున్నామో? నన్ను నీవు, నేను నిన్ను విడచి యుండము, విడవవద్దు.

---

**అవతారిక :** శిష్యుడు తన మనస్సులోని సందేహములను, గురుమూర్తిని దాచుకొనకుండగ అడిగి తెలుసుకొనవలెనని చెప్పుచున్నారు.

**261వ పద్యము : పతియైనను సతి యైనను । సతి సాహసపరులు గాక, యాంతర్యమునన్ । రతివేళ్ల, లజ్జ పడ సం। తతి గలుగదు, చూడుమట్ల తగదు లజ్జించ ॥ గురుశిష్యులు తగు లజ్జ నొంచ॥ మతిని నీవిట్లు సమ్మతి జేసి, యేయే సం। గతి నన్నుడుగుము బోధ స్థితి నొంద ధృడపరతు ॥ తగదు లజ్జించ । గురుశిష్యులు తగు లజ్జ నొంచ ॥**

**దండాన్వయము :** పతియైనను సతియైనను, అతి సాహసపరులు గాక రతివేళ్ల యాంతర్యమునన్ లజ్జపడ, సంతతి గలుగదు చూడుము । అట్లు గురుశిష్యులు లజ్జించతగదు । మతిని నీవిట్లు సమ్మతి జేసి, యే యే సంగతి నన్ను అడుగుము, బోధ స్థితి నొంద దృఢపరతు । లజ్జించ తగదు ॥

**టీక :** లజ్జన్ ఒంచ తగు = సిగ్గు ఉంచుకొనతగదు.

**భావము :** శిష్యా! భర్త అయినను, భార్య అయినను రతి సమయములలో తెగువ చూపించకుండగ, మనస్సులో సిగ్గుపడినచో సంతానము కలుగదు. ఈ నిజము

చూడుము, అట్లే గురు శిష్యులు బోధ విషయములో సందేహములను సిగ్గుపడి దాచుకొనినచో ఫలితము లేదు. కనుక నీ మనస్సులో ఈ విషయమును ఆమోదించి ఏ ఏ విషయములు అడుగవలెనో అవి నన్ను అడుగుము. నిన్ను బోధ స్థితి పొందించుటకై చెప్పి ధృడపరతును.

---

**262వ పద్యము : రతి కొరకు గాదె సతి, పతి । కతి హిత మతి సేవ జేయు, నటువలె బోధ । స్థితి నీకు కుదురుటకు స । మ్మతితో గురు సేవ జేయుమా, నీతి వంతా ॥ అభిమానము పోనీ నీ దంతా ॥ అతనికి దయవస్తే అర నిమిషమున బోధ। స్థితి నీకు కుదిరించు, సిగ్గువిడచి కొల్వు॥ మా, నీతివంతా । అభిమానము పోనీ నీదంతా ॥**

**టీక :** అతి హితమతిన్ = అధికమైన మంచి బుద్ధి చే, సేవ జేయు = పూజ చేయును, సేవ చేయును.

**భావము :** శిష్యా! భర్తకు భార్య ఎంతో ప్రేమతో సేవ జేయుట, రతి సౌఖ్యమును పొందుటకే కదా! అట్లే నీకు బోధ స్థితి కుదురుటకు మంచి మనస్సుతో గురుమూర్తికి అనేక విధములుగా సేవలు జేయవలెను సుమా! ఓ నీతివంతుడా ! నీ అభిమానమును విడచి గురుమూర్తిని సేవించినచో, అతనికి దయ కలిగినచో, ఒక్క క్షణ కాలములో బోధ స్థితి కుదరించును. కనుక సిగ్గు విడచి గురుమూర్తిని చక్కగా సేవించుము.

**విశేష భావము :** గురుకరుణ చేతనే బోధ స్థితి కుదురును. గురు కరుణ 2 విధములు 1) మానుష గురుకరుణ - గురుమూర్తికి తగిన సేవ జేసినచో గురుమూర్తికి కరుణ కల్గి, బోద స్థితి కుదురుటకు శిష్యుడు ఆచరించవలసిన ధ్యానాది విషయములు, బోధ యొక్క మర్మధర్మములు దాచకుండగ తెలియపర్చును. 2) అఖండ గురువు అది మనలోని జ్ఞాన స్వరూపమే, ధ్యానముచే, జపము చేత, చక్కగా సేవించినచో గురు కరుణ ఏర్పడును. "హృత్పుండరీక మధ్యస్థం సకలామ్నాయ సంస్తుతం" ఈ గురుమూర్తికి దయకలిగినచో అంతఃకరణమయిన అవిద్యను భస్మము చేయును. అవిద్య పోయినచో, అందలి ప్రతిబింబిత చైతన్యము కూడా పోవును. ఇదే ఎరుక రహితము. పరిపూర్ణ బోధ స్థితి. ఇది ఒక్క క్షణకాలములో జరిగే పని. అయితే బోధ మర్మధర్మములు తెలియుటకు మానుష గురుకరుణయు, బోధ స్థితి కుదురుటకు

అఖండ గురు కరుణయు అవసరము. ఎంత ఎండ అయిననూ గడ్డిపోచ భస్మము కాదు. కాని ఆ ఎండను భూతద్దము ద్వారా ప్రసరించినప్పుడు గడ్డిపోచ భస్మమగును. అట్లే మానుష గురుకరుణ ఎండవంటిది. అఖండ గురుకరుణచే భూత అద్దములో ప్రసరించిన ఎండవంటిది. దీనిచే ఎరుక రహితమగును.

**అవతారిక :** గురుమూర్తి శిష్యునికి బోధ చెప్పుటలో ఎంతమాత్రము దాపరికముంచరాదు. అందుచేతనే ఈ పద్యములో బోధ పూర్తిగా తెలియపర్చితిని అని ప్రమాణము చేసి తెలియపర్చుచున్నారు.

**263వ పద్యము : నీ మానసమున సంశయు । మే మాత్రము నిల్పబోకు మిక నా తోడే । నా మాట నిశ్చయము, నే । నే మాత్రము దాచలేదు నీ తోడు సుమ్మీ ॥ యింతకు మిక్కిలిక లేదు లెమ్మీ ॥ నా మీద తలపుంచు, నను మరువకిక నేను । నీ మీద దయవుంతు నిజమిందు కిదెఒట్టు ॥ నీ తోడు సుమ్మీ । యింతకు మిక్కిలిక లేదు లెమ్మీ ॥**

**టీక :** నీ తోడు = నీ మీద ఆన (ఒట్టు), నిశ్చయము = తిరుగులేనిది; మిక్కిలి=ఎక్కువ, తలపు = భావము, జ్ఞప్తి.

**భావము :** శిష్యా! నీ మనస్సు నందు ఈ బోధ విషయముముగా ఏ మాత్రము సంశయము వద్దు. నా మీద ఒట్టు పెట్టి చెప్పుము. నేను చెప్పిన బోధ నిశ్చయమైనది, సత్యము. ఇంతకన్నా ఎక్కువైన బోధ, తత్త్వము ఏదియు లేదు. నిజము నీ మీద ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. నా మీద భావము పెట్టుకొని మరువకు. నేను నీ మీద దయ ఉంచెదను, ఇందుకు ఇదె ఒట్టు.

**విశేష భావము :** బోధ విషయమై ఏ మాత్రము సంశయము మనస్సులో ఉంచుకొనవద్దని తన మీద ఒట్టు పెట్టించుకొనెను గురుమూర్తి. అట్లే బోధ ఇంతకన్న ఎక్కువ బోధకాని, ఎక్కువ తత్త్వము కాని లేదనియు, తాను బోధించుటలో ఏ మాత్రము దాపరికము లేకుండా బోధించినట్లు ఒట్టు పెట్టి చెప్పియున్నారు. శిష్యుడు తన మీద భావము ఉంచినంత వరకు గురుమూర్తి దయ, శిష్యుని పై ఉంచగలననియు గురుమూర్తి ఒట్టు పెట్టి చెప్పినట్లుగా ఈ పద్యములో చెప్పినారు.

**264వ పద్యము : నీ గురు బోధను నీచే। బాగుగ విని నిందసేయు భ్రష్టుల మాటల్ । లోగొని విడిచేవిది, నీ। కే గురుడీలాంటి బోధ, వెరిగించడోయీ ॥ యెరుక లోదె యెరిగించునోయీ ॥ ఆ గురు బోధల నన్నీ నే దెలుసుండి । నా గురు బోధ, నే నయముగ నీకిస్తీ ॥ యెరిగించడోయీ । యెరుకలోదె యెరిగించునోయీ॥**

**టీక :** లోగొని = లోను + కొని = లోపల ఉంచుకొని (మనస్సులో పెట్టుకొని) నయముగ=తిన్నగ, మంచిగ

**భావము :** శిష్యా! గురుమూర్తి చెప్పిన యీ గురు బోధను భ్రష్టులు నీ ద్వారా విని నీ బోధను నిందించెదరు. అట్టి మూర్ఖుల మాటలు మనస్సులో ఉంచుకొని, యీ బోధ విడిచెదవేమో ! అట్టి మూర్ఖపు మాటలు వినకు. నీకు ఈలాంటి చక్కని బోధ ఏ గురుడు చెప్పడు. అట్టి అల్ప గురువుల బోధలు నేను విని, నా సద్గురు మూర్తి చెప్పిన యీ పరిపూర్ణ బోధ, నేను నీకు చెప్పితిని. ఇతరులు ఎరుక బోధలనే బోధించెదరు। యీ గురు బోధను యెన్నడు విడువకు సుమా !

**విశేష భావము :** పరబ్రహ్మతత్త్వము అతి రహస్యమైనది, రహస్యమైనది అనగా చెప్పరానిది అని అర్థము కాదు. విశదీకరించి చెప్పిననూ తెలియబడుట బహుకష్టము. అందుచేతనే వేదాంత శాస్త్రము చదువుకొన్న పండితులు సైతము. ఎరుకనే బ్రహ్మముగా గ్రహించుటయో, ఎరుక - బ్రహ్మముల బేధము నెరుగకుండుటయో జరుగుచున్నది.



**265వ పద్యము : నిక్కముగ బీరపీచుల । చిక్కు సుమి, విచ్చరాదు. ఛీ, యీ యెరుకన్ । మక్కువ నే బోధించిన । చక్కని బోధాగ్ని చేత సాధించు పోరా ॥ విచ్చేచింత చాలించుకోరా ॥ చొక్కమౌ యీ బోద కెక్కడ యీడౌను । తక్కిన బోధల దిక్కు చూడక, దీన ॥ సాధించుపోరా । విచ్చేచింత చాలించుకోరా ॥**

**టీక :** విచ్చరాదు = విడదీయరాదు, మక్కువతో = ప్రేమతో, సాధించు = నెరవేర్చు, చొక్కమౌ = దోషములేని, స్వచ్ఛమైన, దిక్కుచూడక = ఆవైపు చూడక.

**భావము :** శిష్యా! యెరుక నిజముగ బీరపీచువలె చాలా చిక్కులతో కూడియుండేది. దాన్ని ఒక్క పద్ధతిగా చక్కగ విడదీసి విచారించి తెలియపర్చరానిది. కనుక యెరుకను

విడదీసి విశేషించి తెలుసుకొనే ప్రయత్నము మానుము. నే ప్రేమతో బోధించిన యీ చక్కని పరిపూర్ణ బోధాగ్ని చేత ఎరుకను లేకుండా చేసికొనుము. పో, తక్కిన సామాన్య బోధలు, యీ దోష రహితమైన (ఎరుక రహితమైన) బోధతో సరిపోవునా? కనుక తక్కిన సామాన్య బోధల వైపు మనసు పెట్టక, యీ బోధ చేత ఎరుకను రహితపర్చుకొని నీ పని సాధించుకొనుము.

ఇతరమైన ఏ బోధల చేత (యోగ, కర్మాదుల చేత) జన్మరహితము సాధించలేము. యీ ఒక్క పరిపూర్ణ బోధ చేత మాత్రమే జన్మ రహిత సిద్ధియగును అని నిష్కర్ష "నాన్యః పంథాః".



**266వ పద్యము : అడవి వుసిరికయు జలనిధి । బొడమిన లవణం బటంచు బొగడిన రీతిన్ । పుడిమిని ఈ స్థల మందున । కడువేడుక నీవు నేను గలసుట వినరా ॥ నా ప్రేమ గలసె కన్గొనరా ॥ విడలేవు నీవు నన్ను, విడలేను నే నిన్ను । పొడజూచి నీవు నేనెక్కడ బోక నిలిచిట్లు గలసుట వినరా । నీనా ప్రేమ గలసె కన్గొనరా ॥**

**టీక :** పొడమిన = పుట్టినది, పుడమిని = భూమిమీద, కడువేడుక = అతిసంతోషముతో, పొడజూచి = రూపుచూచి.

**భావము :** శిష్యా! అడవిలోని ఉసిరికాయ, సముద్ర మందు పుట్టినఉప్పు ఈ రెండు కలిసిన అనే సామెత రీతిగ, ఈ స్థల మందు అతి సంతోషముతో నీవు నేను కలియుట కూడా అట్లే యున్నది. నీ యందు నాకు, నా యందు నీకు గొప్ప వాత్సల్యము కలిగినది. కనకు నీవు నన్ను విడువలేవు. నేను నిన్ను విడువలేను, నీవు నన్ను జూచనప్పటి నుండి, నేను ఎక్కడకు పోక నిలచి యీ చక్కని బోధను విచారించికొన్నాము.

**విశేష భావము :** గురుశిష్యులు ఇద్దరు ఒకరిని విడచి మరొకరు ఉండలేరు. వారి పని పూర్తయ్యే పర్యంతము (హృదయగ్రంథి విడిపోయే పర్యంతము) శిష్యుడు గురువును విడచి ఉండలేడు. అదే నిజమైన గురు శిష్య సంబంధము. కర్పూరము శిష్యుడు, అగ్ని శిఖ గురుమూర్తి. యీ రెండు కలిసిన తరువాత, కర్పూరము పూర్తిగా

నిశ్శేషమైపోయేంత వరకు అగ్ని విడువదు. కర్పూరము అగ్నిని విడవదు. కనుకనే గురు శిష్యుల, మధ్య నుండి ఎవరూ వెళ్లరాదు. దోషము అని నియమము కలదు.



**267వ పద్యము : పెద్దల నింద యొనర్చకు । పెద్దల సేవించు కొఱకు పిరదివియకు, మే । పెద్దలతో వాదించకు । పెద్దలు జెప్పేటి సుద్ది పెడ చెవుల వినకూ ॥ పెద్దలు నడిచే నడక నేమనకూ ॥ పెద్దల కన్నానే పెద్ద నంచమకోకు । పెద్దల గనుగొన్న ప్రియముతొ మ్రొక్కుము ॥ పెడచెవుల వినకూ । పెద్దల నడిచే నడక నేమనకూ॥**

**టీక :** పిరిదివియకు = వెనుకాడకు, పెద్దలు = అధికమయిన వారు, శ్రేష్ఠులు, పండితులు, సుద్ది= మంచిమాట, పెడచెవుల = విపరీతపు చెవులతో, అనగా వారు చెప్పినది విపరీతముగా గ్రహించకుము అని భావము.

**భావము :** శిష్యా! శ్రేష్ఠులను (పెద్దలను) ఎన్నడూ నిందించకుము. అట్టి వారిని సేవించుటకు వెనుకాడకుము. ఏ పెద్దలతోను వాదించకము. అట్టి పెద్దల చెప్పే మంచి మాటలను విపరీత బుద్ధితో వినకుము. పెద్దల యొక్క ప్రవర్తనను విమర్శించకుము. పెద్దలకన్నా "నేనే పెద్దను" అని ఎన్నడూ భావించకుము. శ్రేష్ఠులు, పండితులు, గురువులను చూచిన వెంటనే నమస్కరించుము.

**విశేష భావము :** ఈ పద్య భావము బోధ కాదు. కాని శ్రీ కృష్ణ దేశికేంద్రులు భవిష్యత్తులో (అంటే ఈ కాలములో) శంకరాచార్యుల బొంకులకు జంకేలేదా? అనే పాటలు, ఉపన్యాసములలో మూడు కట్టెలు పట్టుకుంటాడు. ఎందుకో అంటూ జీయర్ స్వాములను అవహేళన, ఈ సంప్రదాయకులు విమర్శించెదరని తెలిసే ఈ పద్యము చెప్పినట్లు తోచుచున్నది. ఎవ్వరిని విమర్శించుట, నిందించుట, మహాపాతకము, వాక్పారుష్యము హెచ్చుగనున్నది. బోధ అత్యల్పము, వాక్పారుష్యము అత్యధికము. ఇది సంప్రదాయమునకు శ్రేయస్సు కాదు.



**268వ పద్యము : పెత్తనమున యేమంగిల । చెత్తను దినవలసె, చీమ చిన్నతనముచే। హత్తుకొని తినును చక్కెర । యిత్తరి యీ రెంట్లో నీకు యిష్టమేదైతే ॥ చేకొనుమదె, స్పష్టమిదైతే ॥ పెత్తనమున చేటెపెంపొందుచుండుమ । చిత్తములో దెలియ చిన్న తనమె మేలు ॥ యిష్టమేదైతే । చేకొను మదెస్పష్టమిదైతే ॥**

**పద విభాగము, దండాన్వయము :** పెత్తనమున యేనుంగు ఇల చెత్తను దినవలసె। చిన్నతనముచే చీమ చక్కెర (న్) హత్తుకొని తినును । యిత్తరి యీ రెంట్లో నీకు యిష్టము ఏద్దైతే అదె చేకొనుము. పెత్తనమున చేటే పెంపొందుచుండును. చిత్తములో దెలియ చిన్న తనమేమేలు. ఇద్దైతే స్పష్టము.

**టీక :** చేటు = కీడు, పెత్తనము = పెద్దతనము, ఆధిక్యము, చక్కెర = పంచదార (రేణువు) స్పష్టము = వెల్లడియైన విషయము.

**భావము :** శిష్యా! పెద్దతనముచే (పెద్ద శరీరముచే) యేనుగు అనేక విధములైన చెత్తను (ఆకులు కొమ్మలను) తినవలసి వచ్చుచున్నది. చీమ చిన్నతనముచే చక్కెర రేణువును హత్తుకొని తినుచున్నది. ఈ విధముగా యీ రెండింటిలో (పెత్తనము, చిన్నతనము) నీకు ఏది యిష్టమో అదే గ్రహించుము. వెల్లడియైన విషయమేమనగా, పెద్దతనముచే (అధికారముచే) చేటే ఎక్కువగుచుంచుడను. విచారించగా చిన్నతనమే (అనధికారత్వమే) మేలు శుభము. కనుక నీకు ఏది యిష్టమో దానినే పొందుము.

**విశేష భావము :** అధికారముచే అనగా గురుత్వముచే, ఇతరులకు బోధించుట కొరకై అనేక గ్రంథములు భాష్యములు చదివి తెలిసికొనవలసియున్నది. కాని శిష్యునికి గురువు బోధించిన సూక్తులు, యుక్తులు, మంత్ర భావములు, ఆచరణ, బుద్ధి యందుంచుకొని ప్రవర్తించుకొనినచో బోధ స్థితి కుదురగలదు. అనేక గ్రంథ విషయములు (చెత్త) అవసరము లేదు. గుర్వధికారముచే అనేక రకములైన శిష్యులకు అనేక యుక్తులతో వారి మనస్సుకు సరిపడేలా చెప్పుటకు అనేక గ్రంథస్థ విషయములు బోధ స్థితికి ఉపకరించేవి కాకపోయిననూ, శిష్య అవగాహన నిమిత్తము చెప్పుటకు ఉపయోగించును. అందుచే చెత్త అన్నారు. అన్నంత మాత్రమున నిందార్థముగా గ్రహింపరాదు. మరియు నేను "గురువు" నని అహంకారము వద్దు. దాని వల్ల కీడేకల్గును. అట్లు కాకుండా నేను (నా గురుమూర్తి యొక్క) శిష్యుడను అని భావించుకుంటూ గురుదాసునిగా భావించుటచే శుభము కల్గునని మనకు తెలియపర్చిరి.



**269వ పద్యము : తనకు శరణన్న వారల । మనసెట్టిదో తరచి చూచి మరి దెల్పదగున్ వినువారికి తగినట్టిది । యనిరిట్లు మహానుభావులతి చాతుర్యమునా ॥ విని కని నీ మనసతి చాతుర్యమునా ॥ ఘనమైన యీ బోధ కరుణిస్తి దీన్ని చ। చ్చినదాక నిదుర వచ్చిన దాక మరువాకు ॥ మతి చాతుర్యమునా ॥ విని కని నీ మనసతి చాతుర్యమున॥**

**టీక :** చాతుర్యమున = నేర్పరితనము చేత, మహానుభావులు = గొప్ప అనుభవము కల వారు (పెద్దలు), ఘనమైన, గొప్పదైన మరి = తరువాత.

**దండాన్వయము :** తనకు శరణనన్న వారల మనసెట్టిదో తరచి చూచి, మరి వినువారికి తగినట్టిది తెల్పదగున్ । ఇట్లు మహానుభావులు అతి చాతుర్యమున అనిరి. (అది) విని, నీ మనసు కని, అతి చాతుర్యమున, ఘనమైన యీ బోధ (నీకు) కరుణిస్తి! దీన్ని చచ్చినదాక, నిదురవొచ్చినదాక మరువకుము (అని దీన్ని, అన్యాపదేశములు)

**భావము :** శిష్యా! తనకు శరణని మ్రొక్కి వచ్చిన శిష్యుని మనసెట్టిదో చక్కగా విచారించిన తదుపరి, వినే శిష్యునికి తగిన బోధ తెలియపర్చవలెనని అతి నేర్పరులైన పెద్దలు చెప్పిరి. అది విని నీ మనసు విచారించి తెలుసుకొని నేర్పరితనము చే యీ బోధ నీకు కరుణించితిని. కనుక నీవు యీ బోధను నిదురవచ్చు వరకు, మరణ పర్యంతము మరువకుము.

**విశేష భావము :** తగిన బోధ దెల్పమనిరి. అంటే వచ్చిన వానికి ప్రతీవానికి ఈ పరిపూర్ణ బోధ తెలియపర్చమనలేదు. వానికి అర్థమయిన సాంఖ్యాది బోధలు చెప్పి, పరిపూర్ణ బోధకు అర్హునిగా జేసి ఆ తరువాతనే పరిపూర్ణ బోధను చెప్పమని భావము.

"ఆసుప్తేః ఆమృతేః కాలే నయం వేదాన్త చింతయా"

అనగా నిదురవచ్చుదాక, చచ్చుదాకా వేదాంత విచారణ చేయుచుండవలెను. ఈ శాస్త్ర వచనమును ఈ పద్యములో ఉదహరించిరి.

**270వ పద్యము : చెప్పదగు గురుడు బోధను । చెప్పిన పని జేహఎనేని శిష్యాగ్రణికిన్ । చెప్పతగదు చెప్పిన పని । తప్పని వాదించే వేని దయతల్చిబోధ । యుద్దరికుండదగు నిట్టి మేధా ॥ చెప్పిముందుగ బోధ చెప్పండి పనులన్న । చెప్పకూడదు వాన్ని తిప్పల పెట్టక । దయతల్చి బోధ । యుద్దరికుండదగు నిట్టి మేధ ॥**

**టీక :** మేథ = ధారణశక్తి గల బుద్ధి, తిప్పలు = కష్టములు.

**దండాన్వయము :** చెప్పిన పని జేసి నేని శిష్యాగ్రణికిన్ దయతలచి బోధ గురుడు చెప్పదుగన్। చెప్పిన పని తప్పని వాదించెనేని చెప్పతగదు। యిట్టి మేధ యిద్దరికుండ తగును। ముందుగ బోధ చెప్పి, పనులు చెప్పండి అన్న, వాన్ని తిప్పలు పెట్టక చెప్పగూడదు।

**భావము :** శిష్యా! చెప్పిన పని వెంటనే చేసిన శిష్యునకు యీ బోధ గురుడు దయతల్చి చెప్పవచ్చును. చెప్పిన పని తప్పని వాదించే శిష్యునకు యీ బోధ చెప్పతగదు. ముందుగా బోధ చెప్పి ఆ తరువాత పనులు చెప్పిండి అనినచో, అట్టి వానిని తిప్పలు పెట్టకుండగ యీ బోధ చెప్పరాదు. యీ విధమైన చక్కని బుద్ధి గురు శిష్యులకు ఇద్దరికి ఉండతగును.

**విశేష భావము :** "యిద్దరికుండగదు నిట్టి మేధా" అన్నారు ఈ పద్యములో. అనగా మేధ అంటే ధారణా శక్తి గల బుద్ధి అని అర్థము. అంటే గురు శిష్యులకు ఇద్దరికి కూడా యీ బోధను చక్కగా గ్రహించగల, నేర్పు గల బుద్ధి కల్గిన వార్తై ఉండవలెనని భావము.

ఇది శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ఽ ద్వైత రహిత పరమతత్త్వే
గురుదత్తా భయ ప్రధానం నామ
సప్త దశోధ్యాయమునకు భావ విశేష భావములు సమాప్తము.

# సప్త దశోధ్యాయమునకు సంక్షిప్త భావము

ఈ అధ్యాయమునకు "గురుదత్తా అభయ ప్రదానము" అని పేరు పెట్టిరి. గురు = గురుమూర్తిచే, దత్త = ఈయబడిన, అభయ = భయరహితమైన (జ్ఞానము) దానము = ఇచ్చుట. దానము అనగా తగిన వ్యక్తికి తగిన ప్రదేశములో తగిన సమయులో ఇచ్చుట. శిష్యుడు తగిన వ్యక్తి, తగిన సమయము = శిష్యుడు ఘోర సంసార బాధ పడలేక సద్గురుమూర్తిని చక్కగా ఆశ్రయించిన సమయము. గురుశిష్య సమాగమమే తగిన ప్రదేశము. ఇట్టి పరిస్థితులలో, అభయము అనగా బ్రహ్మము అని అర్థము. రెండవది ఉన్నప్పుడే భయము ఏర్పడును. రెండవది లేనప్పుడు భయము లేదు. అట్టి విధముగా రెండవది లేనిది ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. ఇక్కడ అభయ ప్రదానము అనగా బ్రహ్మ జ్ఞానమును అనగా పరిపూర్ణ బోధను చక్కగా శిష్యునకు ఇచ్చుట. గురుమూర్తి శిష్యునకు పరిపూర్ణ బోధను చక్కగా ఆశీః పూర్వకముగా ఇచ్చుట అని అర్థము.

కనుకనే నన్నాశ్రయించినావని యీ బోధ నీకు అతుకుట కొరకై యెన్నో ఉపాయములతో నీ మనస్సుకు హత్తించినాను. ఎన్నిటికి విడచి పెట్టకుము అన్నారు. ఇంకను నీకు ఇందులో ఏమైనా సందేహములున్నచో సిగ్గుపడికాని భయపడి కాని అడుగకుండగ దాచుకోవద్దు, నన్ను అడుగుము. సిగ్గుపడితే బోధ యొక్క పూర్ణ ఫలితమును పొందలేవు. నేను యీ బోధ గురుమూర్తి చెప్పిన దంతయు నీకు చెప్పినాను. ఎంతమాత్రము దాచలేదు. మరి ఇంతకు మిక్కిలియైన బోధ లేదు. నేనా చిల్లర బోధల నన్ని యెరిగి వాటి యందు మనసుంచక నా గురుమూర్తి ఇచ్చిన ఈ అఖండ పరిపూర్ణ బోధను గ్రహించి, నీకు ఈ బోధను యిచ్చినాను. మిగిలిన సమస్త బోధలు జన్మను రద్దు పరుచలేవు. అర్హులు కాని భ్రష్టులకు యీ బోధ చెప్పవద్దు. ఎరుకను పూర్తిగా లేకుండ జేసే ఈ బోధ, యీ పరిపూర్ణ బోధ మాత్రమే. కనుక శిష్యా తక్కిన బోధల వంకజూడకుము. అని శిష్యునకు గురుమూర్తి చెప్పిరి. మరియు కొన్ని నీతి ప్రవర్తనలను కూడా చెప్పిరి. ఎంత జ్ఞాని అయినను సత్ప్రవర్తన లేనిచో జ్ఞానము ప్రకాశించదు. అందుచే పైదలను నిందించవద్దని, వారు చెప్పే సూక్తులు పెడచెవుల పెట్టవదద్దని, పెద్దలకు నమస్కరించి సేవించుచుండమని చెప్పిరి. శిష్యుల మనసు బాగా విచారించి బోధకు తగిన వాడని నిర్ణయించుకొనిన తరువాతనే యీ బోధ చెప్పవలెనే కాని, అడిగిన వెంటనే వాని స్థితి తెలుసుకోకుండా బోధ చెప్పరాదు అని చెప్పిరి.

॥ జై గురు ॥

# 18. సుజన లక్షణము - (6)

**అవతారిక :** యీ బోధ సుజనులయిన వారికి మాత్రమే తెలియపర్చుమని ఆదేశించుచున్నారు.

**271వ పద్యము : ఇవి వినుమనినను సుజనులు । చెవి యొగ్గి ద, రివియు సృష్టి జేసి కృతికి బల్ । చవి బుట్టింతు రదెట్లవ । శివుడు కళానిధిని చక్కజేసే నాలేదా ॥ నీ మది శంక బాసెనా లేదా ॥ అవనిలో శ్రీరాముడ వగుణి నాహల్య । నెవరేమి యున కుండ సవరించి సుగుణిగ ॥ జే సేనలేదా । నీ మది శంకబాసెనా లేదా ॥**

**టీక :** కృతికి = గ్రంథమునకు, ఇవియు సృష్టిజేసి = చక్కని భావములను కల్పించి, బల్ చవి బుట్టింతురు = చక్కని రుచి పుట్టించెదరు. (ఇవురు అనగా చిగురు అని అర్థము) = ఇవురు రూపాంతరము ఇవియు) కళా నిధి = చంద్రుడు, అవగుణి = చెడుగుణము కల, ఇవియు = చిగురు.

**భావము :** శిష్యా! యీ పద్యములను సుజనులైన వారికి వినుమని వినిపించినచో చెవియొగ్గి చక్కగా వినెదరు. మరియు సుజనులు ఈ గ్రంథములోని పద్యములకు చక్కని భావములు మంచి రుచి పుట్టు లాగున కల్పించి చక్కని భావమును సృష్టించెదరు. ఎట్లనగా క్షయశాపస్తుడయిన చంద్రుని, ఈశ్వరుడు తన తలపై ధరించి అవమాన రహితునిగ జేసెనుగదా ! అట్లే చెడుగుణి అయిన అహల్యను శ్రీరాముడు శాపవిముక్తి జేసి ఎవరు తప్పు పట్టకుండగ చేసెనుగదా! ఇపుడు నీ మనసులో శంకపోయినదా లేదా ?

---

**అవతారిక :** ఈ గ్రంథమును గురుసూచన అయిన భక్తులకు మాత్రమే వినిపించమని చెప్పుచున్నారు.

**272వ పద్యము : గురుసూచనైన నరులను । మరి మరి వినమనుచు జదువుమా పద్యములన్ । గురు సూచన యెరుగని యా । నరులను వినుమనుచు చదువ, నగుబాటే కదరా ॥ అది యెట్లన్న యిదిగోనే దెల్పెదరా ॥ పురుష సంగతి లేని పాలతి**

**కొక్కోక శాస్త్ర । మరసి మెచ్చునె దాన్ని యతి ప్రౌఢ సతివలె ॥ నగు బాటె గదర । అది యెట్లన్న యిదిగొనే దెల్పెదర ॥**

**టీక :** సంగతి = చేరిక, కలయిక, ప్రౌఢ = భర్తతో దాంపత్య సౌఖ్యమనుభవించెడి స్త్రీ. ప్రౌఢ = స్త్రీ జాతి విశేషము. "పతి మాత్ర విషయకేళీ కలాపకోవిద ప్రౌఢ" రతి ప్రీతి మతి - కొక్కోకం రసమంజరి.

**భావము :** శిష్యా! గురు సూచనైన వారి వద్ద ఈ పద్యములను పదే పదే వినుమని చదువుము. వారు సంతృప్తిపొందగలరు. గురు సూచన యెరుగని వారి వద్ద చదివినచో వారు ఇందలి రసమును గ్రహించలేక వారు అవహేళన చేయుదురు. ఎట్లనగా పురుషుని పొందుబాగుగ ఎరిగిన స్త్రీ (ప్రౌఢ) వద్ద కొక్కోక శాస్త్రము చదివినచో ఆమె ఆనందము పొందగలదు. పురుష కలయిక ఎరుగని బాలిక ఆ కొక్కోక శాస్త్రమును మెచ్చుకొనలేదు కదా !



**273వ పద్యము : యెవరుంటె యేమి భయమురా । సవరింతురు తప్పులుంటే సాధులు విన్నన్ । సవరించనివ్వుమిది విని । యవనీతులు నిందజేస్తే అయ్యేదేమోయీ॥ అందుల మనది పోయ్యేదేమోయీ ॥ భవ నాశ స్థితి లేని పద్ధతి యీ బోధ । చౌరంగ వినిపించు చాటేల మాటేల ॥ అయ్యేదేమోయీ । అందులో మనది పొయ్యేదేమోయీ॥**

**టీక :** అవనీతులు = అశాస్త్రజ్ఞులు, దుష్టులు, నిందజేస్తే = అపహాస్యము చేసినచో, చౌరంగ = చెవులకు ఇంపు అయేటట్లు, చాటు + ఏల = మరుగుఎందుకు, మాటు + ఏల = దాపరికము ఎందుకు.

**భావము :** సభలో ఎవరున్ననూ, ఈ పద్యములు చదువుటకు భయపడకుము. చదివినప్పుడు తప్పులున్నచో సాధువులైన వారు విని సవరణ జేసెదరు. మంచిదేకదా సవరణ జేయనిమ్ము । అట్లు కాక మూర్ఖులు విని దీనిని నిందించినచో, దాని వలన మనకు కల్గే నష్టమేమి ? కష్టమేమున్నది ? ఈ బోధ ప్రభవ, ప్రతిష్ఠ, పరాయణత్వములు ఎంతమాత్రము లేకుండా జేసే గొప్ప బోధ. ఈ బోధకు చాటు దాపరికములు అక్కర లేదు. అందరికి చెవులకు ఇంపు కలిగేలా వినిపించుము.

**274వ పద్యము : పుట్టింట బిడ్డ బహుగా, ది । ట్టై యుండినను, ఎవరు దిట్టరు భువిలో । పుట్టింటివారు, కోడలు । దిట్టైనను అత్తవారు దిట్టేరు సుమ్మీ । చేతులకొద్ది కొట్టేరు సుమ్మీ ॥ అట్టుంబలెనే బహు దిట్టైన శిష్యుని । తిట్టడు గురుమూర్తి వట్టివారు జూస్తే॥ తిట్టేరు సుమ్మీ । చేతులకొద్ది కొట్టేరు సుమ్మీ॥**

**దండాన్వయము :** పుట్టింట బిడ్డ బహుద్దిట్టై యుండినను భువిలో పుట్టింటి వారు ఎవరూ తిట్టరు । అత్తింటి వారు కోడలు తిట్టైనను దిట్టేరు సుమ్మీ ॥

**టీక :** తిట్టై యుండిన = తిట్టు అయి యుండిన - ఎక్కువగా తిట్టబడేదే అయినప్పటికి, తిట్టైనను = తిట్టు అయినను, తిట్టబడేదే అయినను.

**భావము :** శిష్యా! పుట్టింట బిడ్డ (ఆడపడుచు) అధికముగా తిట్టబడేదే అయిననూ, పుట్టింటివారు, ఎవరూ తిట్టరు. ఆ ఆడపడుచును అత్తింటివారు ఊరుకొనక తిట్టెదరు, ఇంకా చేతుల కొద్ది కొట్టెదరు కూడా కదా! ఆ విధముగానే శిష్యుడు తప్పు చేసిననూ గురుమూర్తి తిట్టక పోవచ్చును. కాని ఇతరులు ఊరుకొనరు. తిట్టెదరు మరియు కొట్టెదరు కూడా.



**275వ పద్యము : అందముగ ఘనులు మెచ్చెద । రెందుకు మెచ్చెదరు దీన్ని యితర జనంబుల్ । చందురు డుదయంబందిన । సింధువు చెలరేగినట్లు చెలగువే చెర్లూ ॥ కోనేర్లు నూతులు బావులేర్లూ ॥ మందయానల పొందు మగ వారె నుతి జేతు । రెందుకు నుతి జేతురిల షండ పురుషులు ॥ చెలగువె చెర్లూ ॥ కో నేర్లు నూతులు బావులేర్లూ ॥**

**టీక :** ఘనులు = పండితులు, తత్త్వజ్ఞులు. (భగవద్గీతలో తత్త్వజ్ఞులకు పండితులకు పదము వాడిరి) యితరజనంబుల్ = అల్పజ్ఞులైనవారు, చందురుడు = చంద్రుడు, సింధువు, సముద్రము, చెలరేగినట్లు = పొంగినట్లు, కోనేర్లు = చుట్టు మెట్లు గల చెరువులు, పుష్కరిణి వగైరా; బావులు = దిగుడు బావులు, ఏర్లు = సెలయేర్లు మందయాన = యవ్వనములో ఉన్న స్త్రీ, పొందు = కలయిక, నుతిజేతురు = కీర్తింతురు, హర్షింతురు, షండపురుషులు = నపుంసకులు, అందముగ = చక్కగ అని భావము.

**భావము :** శిష్యా! ఈ గ్రంథమును తత్త్వజ్ఞులైన పండితులు గొప్పగా మెచ్చుకొందరు. అల్పజ్ఞులైనవారు దీనిని మెచ్చుకొనలేరు. ఎట్లనగా చంద్రోదయమైనచో అధిక జలనిధి అయిన సముద్రము ఉప్పొంగుచున్నది. కాని అల్ప జలాశయములైన చెరువులు, బావులు, ఏర్లు పొంగుట లేదు కదా ! యవ్వన స్త్రీల పొందు మగవారు కోరుదురు గాని, నపుంసకలు కోరరు కదా !



**276వ పద్యము : కాకంబులు సంపూర్ణ, త । టాక కలపమనిగీట్లు =స్థజలంబు లెట్లు త్రాగక తృషచే । గైకొమనొ కుంభజల మ। ట్లీ కలియుగ మందు దుష్టులింపు మీర గనూ॥ నిల్వరు బోధకంపు బారివనూ ॥ మీకు దీనికె లంకె, మాకేల యిట్టి చీకాకు । కొక్కోక మైతే గైకొందు మందురు ॥ యింపు మీరగమా । నిల్వరు బోధకంపు బారివనూ ॥**

**టీక :** కాకంబులు = కాకులు, తటాక స్థజలము = చెరువునందున్న నీరు, తృషచే = దాహముచే, కుంభ జలము = కుండలో ఉన్న నీరు, గైకొనునో = తీసుకొనును; దుష్టులు = చెడువారు, బోధకంపు = జ్ఞానము యొక్క సువాసన, బారినను = హింసపెట్టినను, నిల్వరు = నిలువరు, ఉండరు, ఇంపుమీరగను = అధికమైన ఆనందము। లంకె = జత, మాకేల = మాకు + ఏల = మాకు ఎందుకు?

**భావము :** శిష్యా! కాకులు దాహముచే జలము అధికముగా ఉన్న చెరువుల యందలి నీరు త్రాగక, తక్కువ జలము యుండే కుండ యందలి నీరు త్రాగును. అట్లే ఈ కలియుగములో ఆనందము ఇచ్చే బోధను మాని, కొక్కోకము లాంటి గ్రంథములకు యిష్టపడుదురు. ఈ బోధ మాకెందుకు? మీకు దీనికి జత, మాకెందుకు? అక్కరలేదని యందురు, ఈ బోధందు నిల్వక వెళ్లిపోదురు.

**విశేష భావము** : "ఈ కలియుగమున దుష్టులింపు మీరగను, నిల్వరు బోధ కంపూబారినను" అన్న వాక్యములో "బోధ కంపు = బోద యొక్క సువాసన అని అర్థము. కంపు అన్న పదమునకు సువాసన అని గ్రాంధిక అర్థము. చెడువాసన వాడుక అర్థము. బోధ యొక్క సువాసన, బారినను - కష్టపెట్టుటచే, దుష్టులు నిల్వరు. కలియుగములో బోధ సువాసన గొప్ప ఆనంద దాయకమైనదైనను, దుష్టులకు

కష్టపెట్టుటచే అనగా వారి మనస్సుకు బాధ కలుగుటచే యీ బోధందు నిలవక వెళ్లిపోదురు అని భావము.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతా ఽ ద్వైత రహిత పరమతత్త్వే
సుజన లక్షణం నామ
అష్టాదశోధ్యాయమునకు
భావ విశేష భావములు సమాప్తము.

# పదునెనిమిదవ అధ్యాయమునకు సంక్షిప్త భావము

ఈ అధ్యాయములో ఈ పద్యములు ఈ బోధ కేవలము సుజనుల కొరకు మాత్రమే అని చెప్పిరి. జ్ఞానము, కేవలము పుణ్య సంస్కార జనులకు మాత్రమే అబ్బును. మరియు సుజనులు ఈ బోధకు చక్కని సూక్తియుక్తులు చెప్పి వినువారికి ఆనందము కలిగించేలా చెప్పుదురు. ఆలాగున అని అందరికి ఆనందము కలుగదు. పురుష సాంగత్యము యెరుగని కన్యకు కామ సూత్రశాస్త్రము ఎట్లు అర్థము కాదో అట్లే గురు సూచన అయిన వారికి మాత్రమే యీ పరిపూర్ణ బోద యొక్క సువాసనను గొప్పతనమును గ్రహించగలరు. మిగతా వారికి అంతగా రుచించక పోవచ్చు అని చెప్పిరి.

మరియు శిష్యుడు గురుమూర్తి వద్ద ఉన్నంత సేపు తప్పులు చేస్తున్నప్పటికి శిష్య వాత్సల్యముతో గురుమూర్తి తిట్టకపోవచ్చును. కాని ఆ శిష్యుడు గురువును వదలి బయట జనులతో కలిసి తిరుగుతూ తప్పులు చేస్తే జనులు ఊరుకొనక కొట్టి హింసించెదరు. కనుక గుర్వాశ్రమములో సత్ప్రవర్తన నేర్చుకొని బయట ప్రపంచములో కూడా సత్ప్రవర్తనులై యుండవలెను.

ఈ గ్రంథమును తత్త్వజ్ఞులు (పండితులు) మెచ్చుకొనగలరు గాని అల్పజ్ఞులు ఈ గ్రంథసారమును గుర్తించలేరు. చంద్రోదయమును చూసి సముద్రము పొంగినట్లు, అల్పజలాశయములు పొంగవు. కాకులు అధిక జలమున్న చెరువలలో నీరు త్రాగవు. అల్పజలమున్న కుండలో నీరు త్రాగును. అట్లే దుష్టులు గొప్ప ఆనందమును జన్మ రాహిత్యము నొసగు పరిపూర్ణ బోధ సువాసన వారి మనస్సుకు ఆనందమును కలిగించదు. మనస్సుకు బాధ కల్గి ఈ బోధ యందు దుష్టులు నిలపడరు. సామాన్య లౌకిక గ్రంథములకో లేక పురాణాదులకో వారి మనస్సు సంతోషించును. దుష్టులు అంటే ఇక్కడ చెడ్డవారు అని అర్థము కాదు. జ్ఞానమును అందుకొనుటకు తగినంత పుణ్యసంస్కారము లేని వారు అని అర్థము చేసుకొనవలెను.

అధ్యాయము - 19

# 19. కుజన లక్షణము - (4)

**277వ పద్యము : కుచ్ఛిత మతియగు శిష్యుని । చెచ్చెర వినుమనుచు జదువ, శిష్టుల వలె తా । ముచ్చట పాటుగ విన, డివి । కుచ్చుల కుళ్లాయి కుక్కకూన కెందుకురా॥ పిడుదుకు దుగ్ధపాన మెందుకురా ॥ హెచ్చైన ముత్యాలు, పచ్చల పతకము । గ్రుచ్చి పేరుగ జేసి తెచ్చివేసితె, కోతి ॥ కూన కెందుకురా । పిడుదుకు దుగ్ధపాన మెందుకురా॥**

**టీక :** చెచ్చెర = చెర + చెర = శ్రీఘ్రముగ, శిష్టుల వలె= మంచి వారి వలె, కుచ్ఛితమతి = నికృష్టపు బుద్ధి, కుచ్చుల కుళ్లాయి = పట్టు మొదలగు వానితో కూడిన కుచ్చులు గల వస్త్ర భూషణము, పేరుగ జేసి = హారముగ జేసి, పిడుదు = పశువు పొదుగున జేరి రక్తమును పీల్చెడు ఒక పురుగు; దుగ్ధపానము = పాలుత్రాగుట.

**భావము :** శిష్టులు ఈ గ్రంథమును జదివి సంతోషించినట్లుగా, చెడుబుద్ధి గల వారు విని సంతోషించలేరు. అది ఎట్లనగా పొదుగును ఆశ్రయించియున్నను పిడుదు పాలను త్రాగక రక్తమునే త్రాగును. అట్లే పట్టుకుచ్చులతో తయారుచేసిన వస్త్ర భూషణము కుక్కపిల్లకు ఎందుకు? ఖరీదైన ముత్యాలు పచ్చల పతకములతో కూడిన హారము కోతి పిల్లకు ఎందుకు? అట్లే యీ గొప్పదైన గ్రంథము, శ్రేష్ఠులైన వారికే గాని కుచ్ఛితులకు పనికిరాదు అని భావము.

---

**278వ పద్యము : అక్షయ బోధ స్థితి గల । లక్షణ వేత్తలకు మెప్పులైన కృతులలో । కక్షకు తప్పులు కుమతి ప। రీక్షింపుచుండు, నెన్నోరీతుల వినుమీ ॥ తద్భావ మీరీతిది గనుమీ ॥ మక్షిక మెప్పుడు మాని సుగంధము । వీక్షించు వ్రణము, ప్రత్యక్షమె కద, యెన్నో ॥ రీతుల వినుమీ । తద్భావ మీ రీతిది కనుమీ ॥**

**దండాన్వయము :** అక్షయబోధ స్థితి లక్షణ గల వేత్తలకు మెప్పులైన కృతులలో కుమతి కక్షకు తప్పులు ఎన్నో రీతుల పరీక్షింపుచుండు వినుమీ ॥ తద్భావ మీ రీతిది కనుమీ ॥ మక్షికము సుగంధాదులు మాని, ఎప్పుడు వ్రణము వీక్షించు । ప్రత్యక్షమె కదా ।

**టీక :** అక్షయబోధ స్థితి కల = నశింపులేని బోధ స్థితి = పరిపూర్ణ బోధ స్థితి, లక్షణ = గుర్తు, చూపు, వేత్త = తెలసిన వాడు, మెప్పు = ప్రీతికరము, కృతులలో = గ్రంధములలో, కక్షకు = పగచేత, మక్షికము = ఈగ, ఈక్షించు = చూచును, వ్రణము = కురుపు, గాయము.

**భావము :** పూర్ణ బోధ స్థితి లక్షణులైన వేత్తలకు ప్రీతికరమైన గ్రంధములలో దుష్టులు కోపము చేత (ఈర్ష్య చేత) అనేక విధములుగా తప్పులు పట్టుచుందురు. వారి భావము అంతే, అది ఎట్లనగా ఈగ సుగంధ ద్రవ్యమును మాని ఎల్లప్పుడు గాయము పై వాలుటకే ప్రయత్నించును. ఇది లోక ప్రసిద్ధమే కదా !



**279వ పద్యము : రమ్మని పిలువనిదే, ప । ద్యమ్ములు చదువంగ వచ్చి, యతి నిందుంచున్ । సమ్మతి గాక కుమతి విని । యిమ్మహి యది యెట్ల నన్న యిట్లనె వినుమీ ॥ వాని బుద్ధ్యదట్లనె కనుమీ ॥ బొమ్మలాటలో దిచ్చు బొమ్మ తోనాకటి, ఛీ। పొమ్మనిన హాస్యమ్మెనర్చుదె పోక ॥ నిట్లనె వినుమీ । వాని బుద్ధ్యదట్లనె కనుమీ ॥**

**దండాన్వయము పదవిభాగము :** (నీవు) పద్యమ్ములు చదువగ, కుమతి రమ్మని పలువనిదె వచ్చి। సమ్మతి గాక అతినిందించు యిమ్మహిన్। వాని బుద్ధి అది, అట్లనె కనుమీ । అది ఎట్లనన్న వినుమీ । బొమ్మలాటలో దిచ్చు బొమ్మ ఒకటి తా (వచ్చి), ఛీ ఛీమ్మనిన పోక, హాస్యమ్మొనరించును, ఇట్లనె, వినుమీ ॥

**టీక :** అతి నిందించున్ = ఎక్కువగా దూషించును, సమ్మతి గాక = మనస్సుకు సరిపడక, కుమతి = దుష్టుడు, దిచ్చుబొమ్మ = దిష్టిబొమ్మ (ఇప్పుడు జుట్టుపోలిగాడు అని భావము) బొమ్మలాటలో = తోలు బొమ్మలాటలో.

**భావము :** శిష్యా! నీవు యీ పద్యములు చదువుచుండగ, ఎవ్వరూ రమ్మనిదే దుష్టుడు తనకై తావచ్చి పద్యములను విని, అతని బుద్ధికి సరిపడక, పద్యములను అతిగా దూషించును. అది వాని బుద్ధి అట్టిది అని తెలుసుకొనుము. ఎట్లనగా తోలు బొమ్మలాటలో జుట్టుపోలిగాడు మధ్యలో తనకు తానే వచ్చి, ఛీ పోరా అని నను, పోకుండగ హాస్యము చేయుచుండును. అట్టి విధముగా అని తెలుసుకొనుము. (యతి నిందుంచున్'' అన్న వాక్యములో "అతి నిందించున్'' అని భావము. "అ''కు

సంధిలేనిచో "య" డాగమంబుఅగు అను వ్యాకరణ సూత్రము ప్రకారము "అతి"కి "యతి" అన వాడిరి.



**280వ పద్యము : వటియించిన చన్నులు గల । కుటి లాలకి నిందజేయు గుత్తపు రవికన్ । యెటువలె, తన తప్పెరు గక । యటువలె గ్రంథమును మెచ్చడతి దుర్జనుడూ॥ లేనిదె తప్పు వెదకుచునుండూ ॥ యిటువంటి బోధ నేనెరిగేదెట్లనుకోక । కటు వాక్యములు పల్కి, ఘనుల గాసిల జేయు ॥ నతి దుర్జనుడూ॥ లేనిదె తప్పు వెదకుచు నుండూ ॥**

**టీక :** వటియించిన = శుష్కించిన, చన్నులు గల = స్తనములు గల, కుటిలాలకి = కుటిలాలస అన్న (గ్రాంధిక పదమునకు వాడుక పదమనవచ్చును) బుడిపె, లాలస = విషయేచ్ఛ గల స్త్రీ; గుత్తపు - శరీర సౌష్ఠవమునకు తగినట్లు బిగుతుగా ఉన్న, కటు వాక్యములు = చేదుమాటలు, ఘనులన్ = గొప్పవారిని, కాసిల జేయు = నొప్పించును.

**దండాన్వయము :** వటియించిన చన్నులు గల కుటిలాలస తన తప్పెరుగక గుత్తపు రవికన్ యెటువలె నిందసేయు (నో) । అటువలె అతి దుర్జనుడు గ్రంథమును మెచ్చడు। (తప్పు) లేనిదె, తప్పు వెదకుచు నుండూ । అతి దుర్జనుడు యిటువంటి బోధ నేనరెరీగేదెట్లు? అనుకోక, కటువాక్యములు పల్కి ఘనులు గాసిల జేయును।

**భావము :** శుష్కించిన చన్నులు గల కురచ యువతి, తన మరుగుజ్జు తనము తెలియక, తను ధరించిన గుత్తపు రవికను సరిగా కుట్టలేదని నిందించును. అట్లే దుర్జనుడు యింతటి గొప్ప బోధను నేను తెలియకపోతినే యని భావించక ఈగ్రంథమును చూచి లేని తప్పులు వెదకుచుండును. తప్పులెంచి, పెద్దల మనసును బాగా నొప్పించుచుండును.

ఇది శ్రీమద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ౨ ద్వైత రహిత పరమతత్త్వే
కుజన లక్షణం నామ ఏకోనవింశోధ్యాయమునకు
భావ విశేషభావములు సమాప్తము.

## అధ్యాయము - 20

# శిష్య విజ్ఞాపన - 8

**అవతారిక :** గురుమూర్తి బోధ, ధర్మములను చెప్పి, తన్ను సంశయ రహితునిగ జేసిరి అని శిష్యుడు కృతజ్ఞతాపూర్వకముగా విజ్ఞప్తిని గురుమూర్తితో చెప్పుచున్నాడు.

**281వ పద్యము : గురువర మీనా సందున । యెరుకను తెర కలిగియుండె యిన్నాళ్ళు గొలెన్ । కరుణా రసే క్షణములన్ । తెరదీసితి రెరుక మాట దీరె నిక్కడికీ ॥ చాలు బోధ దూరె దెక్కడికి ॥ పరిపూర్ణమును, లేని యెరుకను జూపించి । యెరుక లేదని యంత్రి యెరుకె లేదాయెను ॥ తీరె నిక్కడికి । చాలు బోధ దూరె దెక్కడికి ॥**

**టీక :** యిన్నాళ్ళు గొలిన్ = యిన్న రోజుల నుండి, దూరెదెక్కడికి = ఎక్కడ గ్రహించేది, తీరెను = సరిపోయినది.

**భావము :** గురుదేవా ! మీ - నా సందున యెరుక అనే తెర ఇంత వరకు ఉన్నది. మీ కరుణామృత దృష్టి చేత ఆ యెరుక అనే తెర తీసి వేసిరి. ఇక యెరుక మాట తీరినది (లేకపోయినది) ఇక బోధ చాలును. ఇక బోద వినవలసిన పని లేదు. పరిపూర్ణమును లేని యెరుకను చూపించి, లేని యెరుకను లేదని చెప్పగా, యెరుకే లేకుండా పోయినది. సంశయము తీరెను. ఇంక బోధ చాలును స్వామీ ॥

**విశేష భావము :** "ఎరుకను తెర కల్గియుండెను" అన్నారు గురుమూర్తి ఎరుక లేనివాడు, శిష్యుడు ఎరుకతో ఉన్నవాడు. ఇంత బోధ చేసిన పిమ్మట శిష్యునికి ఎరుక భ్రాంతి తీరిపోయినది. అందుచే శిష్యునికి కూడా ఎరుక లేకపోవుటచే యిద్దరికి ఎరుక లేకపోయినది ఎరుక అను తెర లేకుండా పోయినది. అందుచే "ఎరుక మాట తీరెను" అన్నారు.

శాశ్వతమైన పరిపూర్ణమును, లేనిదె ఉన్నట్లు కనిపించె యెరుక (ప్రతిబింబ చైతన్యము) ను నిర్ణయము చేసి లేనిది ఎరుక అని తెలిపి, ఎరుకను విడిపించిరి. ఇక తెలుసుకొన వలసినది ఏమున్నది. అందుచే బోధ ఇక అవసరము లేదని చెప్పెను.

**282వ పద్యము : ధారుణి గొంత జరించి, వి । చారించితి, గాని యీ విచారము నే, నె। వ్వారలు జెప్పగ వినలే । దారయ మీ నోట విన్న । దయ్యా గురుమూర్తీ ॥ నా తరమా నుతి జెయ్య మీ కీర్తి ॥ సారసనయన పురారి నీరజబృం। దారక ముఖులైన నేరరు మిము దెలియ । నయ్యా గురుమూర్తీ । నా తరమా నుతి జెయ్యా మీ కీర్తి॥**

**టీక :** ధారుణిన్ = భూమి మీద కొంత జరించి = కొంతవరకు తిరిగి (అనగా అనేక చోట్లకు తిరిగి) విచారించితి = ఈ ఆధ్యాత్మిక బోధలు విచారించి తెలుసుకొన్నాను. ఆరయ = ఆలోచించగా, నుతి జెయ్య = స్తోత్రము జేయుటకు, సారసనయన = పద్మముల వంటి కన్నులు గలవాడు, విష్ణువు, పురారి = త్రిపురములను హరించినవాడు, ఈశ్వరుడు, నీరజ = పద్మ భవుడు, బ్రహ్మ, బృందారకముఖులు = దేవతా శ్రేష్ఠులు, నేరరు = అలవి కాదు.

**దండాన్వయ పదవిభాగము :** ధారుణి గొంత జరించి విచారించితి, గాని అయ్యా! మీ నోట విన్నది, యీ విచారము, ఆరయ, నేను ఎవ్వారలు జెప్పగ వినలేదు. మీ కీర్తి నుతిజెయ్య నా తరమా! సారసనయన పురారి నీరజ బృందారక ముఖులైన మిము దెలియన్ నేరరు. అయ్యా! గురుమూర్తీ! కీర్తి నుతిజెయ్య నాతరమా !

**భావము :** అయ్యా గురుదేవా! భూమి పై కొన్ని ప్రదేశములు తిరిగి అనేకులు చెప్పే బోధ విచారణ విన్నాను. కాని విచారించగా మీ నోట విన్న ఈ విచారణ నేనెవ్వరూ చెప్పగా వినలేదు. ఇంతటి మహానుభావులైన మిమ్ము కీర్తించ బ్రహ్మ, విష్ణు, ఈశ్వరాది దేవతా శ్రేష్ఠులైనను సరిపోరు. ఇక నేనెంతవాడను స్వామీ ! నాతరము కాదు.

---

**283వ పద్యము : ఘట మెదుట బెట్టి జూపిన । యటువలె బయలుండ జూపి, యతి మాయలచే । నటి యింపుచున్న యెరుకను । తృటిలో విడిపిస్తిరిపుడు, దీరె మచ్ఛంకా ॥ యిక బుట్టదు యేరీతి శంకా ॥ యెటుదోచకిలు వెడని యిట మిమ్ము జూచి, వ। ప్పటి నుంచి దయజేసిప్పటి దాక బోధిస్తె ॥ తీరె మచ్ఛంకా । యిక బుట్టదు ఏ రీతి శంక ॥**

**టీక :** ఘటము = కుండ, నటియించుచున్న = కపటముగా కనుపడుచున్న, తృటిలో=క్షణములో, మచ్ఛంకా = మత్ + శంకా = నా యొక్క యెరుక, తీరె = లేకపోయినది.

**భావము :** స్వామీ ! కుండ యెదురుగ పెట్టి యిదిగో కుండ అని ప్రత్యక్షముగ చూపించినట్లుగా, పరిపూర్ణమె ఉన్నది యిదిగో అని ప్రత్యక్షముగా ఉన్నట్లు చూపించి, అనేక మాయలచే లేనిదె ఉన్నట్లు కపట వర్తనతో ఉన్న యెరుకను క్షణములో విడిపించితిరి. ఇప్పుడు నా యొక్క (అనుమానము) యెరుక లేకుండా పోయినది. ఇక యెరుక యే రీతి గను (యెనుబది నాలుగు లక్షల జీవోపాదులలో యే రూపము గాను) బుట్టదు. ఆనాడు ఏమీ దోచక, యిల్లు విడచి, ఇక్కడ మిమ్ములను జూచి ఆశ్రయించినప్పటి నుండి, తమరు ఇంత వరకు బోధించిరి యెరుకను పూర్తిగా తొలగించిరి. ఇక తిరిగిపుట్టదు స్వామీ !

**విశేష భావము :** గ్రంథ లక్షణము, అధ్యాయ లక్షణముచే బోధ పూర్తి అయినది. కనుక శిష్యునికి ఎరుక రహితమైనది అని చెప్పవలసి వచ్చినది. కుండ యొక్క ప్రత్యక్షజ్ఞానము కలిగినట్లుగా శిష్యునికి గురుమూర్తి పరిపూర్ణము - ఎరుకల గురించి ప్రత్యక్ష జ్ఞానము కలిగించి ఆరూఢనిగ శిష్యుని జేసెను. ఇక శిష్యునికి ఎరుక భ్రమ ఎన్నటికి కలుగదు. వెనుకకు తిరుగడు. ఇక కేవల అఖండ గురుకరుణచే పరిపూర్ణ పరబ్రహ్మమును, ప్రత్యక్షముగా చూచుట (అపరోక్షత్వము) వలన పూర్ణ స్థితుడై ఎరుక పూర్తిగా నశింపజేసికొనిన వాడగును. అంత పునర్జన్మకు ఎంతమాత్రము అవకాశము లేదు. ఇక్కడ శిష్యుడు ఇంకను అట్టి స్థితిని పొందలేదు. అట్టి స్థితిని కందపద్యములలో చివర వచ్చినట్లు చెప్పబడినది. కనుక ఇప్పుడు దీని తరువాత పద్యములో ప్రశ్నించుట శిష్యుడు జవాబు చెప్పుట కలదు. అంటే శిష్యునికి ఇంకను ఎరుక ఉన్నట్లే కదా! ఆలాగునని శిష్యునికి యెరుక వదలలేదు అనరాదు.

---

**అవతారిక :** బోధ చెప్పుట పూర్తి అయినది కనుక, యిప్పుడు శిష్యుని గురుమూర్తి ప్రశ్నించి, బోధ చక్కగా తెలిసెనో, లేదో పరీక్షించుచున్నాడు.

**284వ పద్యము : ఒరులు నేవనక విండిన । దెరిగింపు మదేమొ, బయలు, యేనారులనుచన్ । యెరుగు నీవెవరు? యూలే । వెరుకను, వున్నావు వుంటే యిది లేనంచనుకో ॥ నేనానిను నీ మదిని లేనను కో ॥ యెరిగి యూలే నెరుక యిట్లా లేకుండితె । పరిపూర్ణ మో, దాన్నే పగిది గుర్తెరిగేమూ ॥ యిది లేనంచనుకో ॥ నేనా నిను నీ మదిని లేననుకో ॥**

**టీక :** ఒరులు = ఇతరమని, జగత్తని, నేననక = ఆత్మ అని అనక, నిండినది అది ఏమో = వ్యాప్తమై యున్నది అది ఏమిటో, ఎరిగింపుము = తెలియజెప్పుము, బయలు = పరిపూర్ణము, యేను = నేనని.

**భావము :** ఇది గురుమూర్తి ప్రశ్న - శిష్యుని జవాబుగ విడదీసుకొనినచో సరిపోవును.

| గురుని ప్రశ్న | శిష్యుని జవాబు |
| --- | --- |
| 1) ఒరులు నేను అనక నిండినది ఆదేమో యెరిగింపుము? | బయలు |
| 2) యేను ఒరులు అనుచున్ యెరుగు యీ నీవు ఎవరు ? | లేనెరుకను |
| 3) వున్నాను. (ఉన్నావు కదా!) | వుంటే యిది లేనంచునుకో నేనో నీ మదిని లేననుకో |
| 4) యెరిగి, యీ లే నెరుక యిట్లా లేకుండితే, పరిపూర్ణమో ? | దాన్నే పగిది గుర్తెరిగేము. యిది (ఎరుక) లేనంచనుకో |

ఆత్మ - జగత్తని అనక వ్యాప్తమై యున్నది ఏమిటి? - పరిపూర్ణము
ఆత్మ - జగత్తని తెలుసుకొనేది ఎవరు - లేనెరుక.
ఉన్నావు కదా - ఉంటే లేనని అని తెలుసుకోవాలి.
నేనో నినున్ నీ మదిని లేననుకో - ఆత్మ జగత్తులనునవి నీ మనస్సులో ఎంతమాత్రము ఉంచవద్దు. అవి లేనివే. యీ విధముగా తెలుసుకొని యీ లేనెరుక లేకపోయినచో, పరిపూర్ణము మాత్రము ఉండును. కాని దాన్నెరిగే యెరుక లేదు. కనుక యెరుక లేకపోయిన వెనుక నేను ఉన్నానని కాని, లేనని కాని, పరిపూర్ణము ఉన్నదని కాని గుర్తించలేము అనలేము.

---

**అవతారిక :** గురుమూర్తి ప్రశ్నలకు శిష్యుడు సరియైన జవాబు చెప్పుటచే, గురుమూర్తి సంతోషించి శిష్యుని ప్రశంసాపూర్వకముగా చెప్పుచున్నాడు.

**285వ పద్యము :** నా బుద్ధికి సరిపడ్డది । నీ బుద్ధే కాని యన్ని నేర్పులగనినన్ । ఛీ బద్ధులయా బుద్ధులు । నా బుద్ధికి మెప్పురావు నా తండ్రీ వినరా ॥ శెబాస్ నిన్నే

తండ్రి గనెరా ॥ యీ బుద్ధినికమానకే బుద్ధి బూనకు। యే బుద్ధి బూనిన నీ బుద్ధి చెడిపోవు ॥ నా తండ్రి వినరా! శెబాస్ నిన్నే తండ్రి గనెరా ॥

**టీక :** అన్ని నేర్పులగనినన్ = అన్ని విధములుగ చూచిననూ (శృతి, యుక్తి, అనుభవములతోను, షట్ప్రమాణములతో జూచిననూ)

ఆ బుద్దులు = ఆశాస్త్రాదులు, ఆ చదువులు, బద్ధులయా = కట్టబడి నవేనయ్యా, మెప్పురావు = గొప్పవి కానేరవు; బుద్ధి = జ్ఞానము.

**పద విభాగము :** నా బుద్ధికి సరిపడ్డది నీ బుద్దే కాని। అన్ని నేర్పుల గనినన్ ఆ బుద్దులు ఛీ భద్దులయా। నా బుద్ధికి మెప్పురావు.

**భావము :** బుద్ధి అను పదమునకు విద్య అని గాని, బోధ అని గాని అర్ధము. నా బోధకు సరిపడునది నీ బోధయే కాని, అన్ని విధముల జూచిననూ ఆ బోదలు ఛీ బద్దులయా నా తండ్రీ వినరా। శెబాస్ నిన్నే తండ్రి గనెనో కదా ! యీ బోధను విడువకుము. మరి యే ఇతర బోధ మనసులో ప్రవేశపెట్టకు. ఏ బోధ పూనినా యీ బోధ చెడిపోవును. నా తండ్రీ! యీ బోధ విడువకుము.

---

**286వ పద్యము :** కొట్టితి, తిట్టితి, శ్రమలన్। బెట్టితి, నీ మనవి చెవునం (లం) బెట్టక పెడచౌ। బెట్టిత, మొట్టితి, వెడలన్। గొట్టితి నీ మనసు దెలియ, కోపము లేకా ॥ సరె తెలిసె నీ వోపిక పోకా ॥ పట్టు మిచ్చెద యింక నట్టేమి యని దయ। బుట్టి యిచ్చితి బోధ, గట్టి వాడవు వోరి ॥ కోపము లేకా। సరె తెలిసె నీ వోపిక పోకా॥

**టీక :** నట్టేమి - నట్టు ఏమి = ఆలస్యమెందుకు, నీ వోపిక = నీ పట్టుదల, పోక = విడువకుండగ (ఉన్నావు)

**భావము :** (నాకు) కోపము లేక, నీ మనసు తెలుసుకొనేందుకు (నిన్ను) కొట్టితిని, తిట్టితిని, శ్రమ పెట్టితిని, మొట్టితిని, నీవు చెప్పే మాట వినకుండా బయటకు వెడలగొట్టితిని. సరే నీ పట్టుదల తెలిసినది. పోకుండా నన్నే ఆశ్రయించి ఉన్నావు. ఇక ఆలస్యమెందుకు బోధ యిచ్చెద గ్రహింపుము. అని దయబుట్టి, యీ బోధ పూర్తిగా చెప్పితిని. నీవు గట్టివాడవురా.

---

**287వ పద్యము :** నీవెంత కొట్టి, తిట్టిన। నే విడచేవాడను గాను, నీ చరణంబుల్। చావైన పెండ్లియైనను। నే విడువనటింటి వట్టి, నిజభక్తుడ వేరా ॥ నేగను గొంటి నీ

నిష్ఠనౌరా ॥ కావున నీ కిట్టి ఘనమైన యీ బోధ । నే వేగ దయజేస్తి నీ విది విడువకు ॥ నిజ భక్తుడవేరా ॥ నేగను గొంటి నీ నిష్ఠనౌరా ।

**టీక :** నిష్ఠ = ఉనికి, పద్ధతి, నిజ భక్తుడవు = స్వచ్ఛమైన భక్తుడవు, నా భక్తుడవు.

**భావము :** నీవు ఎంత కొట్టిననూ, నీ పాదములను నేను విడువను. చావు అయినను పెండ్లి అయిననూ, నేను విడచి వెళ్లిపోయే వాడను కాను, అని అంటివి. నీవు నా భక్తుడవెరా ! నీ పట్టుదలను తెలుసుకొన్నాను. కావున నీ కిట్టి గొప్పదైన పరిపూర్ణ బోధను వెంటనే ప్రసాదించితిని. ఇది ఎంతమాత్రము విడువకు సుమా ! అని శిష్యుని ప్రశంసించెను.

---

**288వ పద్యము :** నా నోటి మాట వెంబడి । తానెప్పుడు సంచరించె తగ నీ చిత్తం। బే నది గని యీ బోధ । నీ ధానము నీ కిస్తి దీన్ని దాచుకో సుమ్మీ॥ నిత్యము నీవు చూచుకో నమ్మీ ॥ యే నరుడైన నిన్నీ బోధ నడిగితే । వాని మనసరయక వానికి జూపేవు ॥ దాచుకో సుమ్మీ । నిత్యము నీవు చూచుకోనమ్మీ॥

**టీక :** నిధానము = పాతర, నిధి బోధనిధానము = జ్ఞాననిధి అని అర్థము.

**భావము :** శిష్యా! నా నోటి మాట ఏ విధముగా వచ్చినదో, అదే విధముగా వెంటనే నీవు ఆచరించితివి. ఆ విధముగా నీ మనసు దెలుసుకొని యీ బోధ నిధి (జ్ఞాన నిధి) నీకు ఇచ్చినాను. దీన్ని జాగ్రత్తగా దాచుకొనుము. నిత్యము నమ్మి మననము చేసికొనుము. ఎవరైన వచ్చి నిన్ను బోధ చెప్పమని అడిగితే, వారి మనసు ఎట్టిదో, అర్హులు అవునో కాదో తెలిసికొనకుండగ యీ బోధ చెప్పకుము. జాగ్రత్తగా దాచుకొనుము.

**విశేష భావము :** "బోధ నిధానము నీ కిస్తి" అన్నారు. నిధానము అనగా నిధి, పాతర అని అర్థము. కనుక జ్ఞాన నిధి, కొరత లేని జ్ఞాన నిధిని శిష్యునకిచ్చిరి. జ్ఞాననిధి కన్న నవనిధులు తక్కువైనవే. కనుకనే యీ పరిపూర్ణ బోధ చాలా గొప్పది, జ్ఞాన నిధి, జాగ్రత్తగ దాచుకోమన్నారు. ఎవరికి పడితే వారికి ఇయ్యక, అర్హులు అయినచో మాత్రమే యీ పరిపూర్ణ బోధను చెప్పమని గురువు ఆజ్ఞ.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత
ద్వైతా ౽ద్వైత రహిత పరమ తత్త్వే
శిష్య విజ్ఞాపనం నామ, వింశత మో అధ్యాయమునకు
భావ విశేష భావములు సమాప్తము.

---

# అధ్యాయము - 21

# గ్రంథ సంపూర్తి - 3

**289వ పద్యము :** కూడి గురుశిష్యు లిద్దరు । వేడుకతో బయలున్న విధమెరిగెరుకన్ । వీడిరిది లేనిదని, మా । టాడుట కిక యేమి దోచ దదియేమొకానీ ॥ వింటిరె మీర విది యిందులో, నీ । జాడ మీకెరుకని వేడితి వినమంచు । యీడికి సరిముచ్చటాడుట కిక దోచ ॥ దదియే మొ కానీ । వింటి రె మీర లివి యిందులోనీ ॥

**టీక :** యీడికి సరి = ఇక్కడితో సరి, జాడ = త్రోవ, విధము.

**భావము :** గురు శిష్యులిద్దరు కలిసి సంతోషముతో పరిపూర్ణమే శాశ్వతముగా నున్నదని యెరిగి, యెరుక లేనిదని యెరుకను విడచిరి. ఇక ఎందుచేతనో కాని, మాట్లాడుట కింకయేమీ దోచుట లేదు. ఇది మీరు విన్నారు కదా! యిందులో చెప్పబడిన బోధ మీకు తెలియబడునని, చక్కగా వినండి అని మిమ్ము వేడుకొనుచున్నాను. (ఇంకొక విధము)

యిందులో (పరిపూర్ణములో) నీ జాడ - నీవు లేను అనే విషయము మీకు తెలియబడునని యీ బోధ వినమని వేడుకొనుచున్నాను. యిక్కడితో సరి. మాట్లాడుటకు ఏమియు తోచుట లేదు.



**290వ పద్యము :** శర శాస్త్ర స్వర హిమకర । పరిమితమైనట్టి శాలివాహన శకమం। దరయగ, శోభ కృదను, వ । త్సర మార్గశిరంబు కృష్ణ చవితి నాటికి నీ ॥ పద్యాల్పది తక్కువ మున్నూటికినీ ॥ మురయుచు జేస్తి నెవ్వరు విన్న జదివిన । పరిపూర్ణ మెరుకై లేనెరుక లేకుండు ॥ చవితి నాటికినీ ॥ పద్యాల్పది తక్కువ మున్నూటి కినీ ॥

**టీక :** శర = అయిదు, శాస్త్ర = ఆరు, స్వర = ఏడు, హిమకర = చంద్రుడు, ఒకటి (అంకానాం వామనో గతిః) కనుక కుడి నుండి ఎడమకు లెక్కించవలెను. కనుక 1675 ఇది శాలివాహన శక సంవత్సర పరిమితమైనట్టి = సరిపోవునట్టి, దీనికి సరిపోవునది క్రీ.శ. 1843 సంవత్సరము.

**భావము :** శాలివాహన శకము 1765 సంవత్సరమునకు సరిపోవు శోభ కృత్ నామ సంవత్సర మార్గశిర బహుళ చవితి నాటికి, సంతోషముతో 290 పద్యములు

రచించితిని. దీన్ని ఎవరు వినినా, చదవినమూ పరిపూర్ణము తెలియబడి, లేనెరుక లేకుండగ పోవును. అని ఆశీర్వాద పూర్వకముగా గ్రంథ సమాప్తి చేయుచున్నారు.

**విశేష భావము :** శర - బాణము అనగా మన్మధ బాణములు అయిదు కనుక శర - అయిదు. శాస్త్ర - ఆరు శాస్త్రములు - 6, స్వర - సప్తస్వరములు - 7 హిమకర - చంద్రుడు 1కి సంకేత వచనములు. ఇది పూర్వ కవుల సదాచార సంప్రదాయము.

శరములు - (మన్మధ) 5-1) ఏ - హృదయము 2) ఔ-స్తనములు, 3) అ=చూపులు, 4) ఇ - శిరస్సు, 5) ఉ=మర్మస్థానము ఇది కొక్కోక శాస్త్ర విషయము. శాస్త్రములు - 6. 1) తర్కము, 2) వ్యాకరణము, 3) ధర్మ శాస్త్రము, 4) మీమాంస, 5) వైద్యము, 6) జ్యోతిష్యము.

స్వరములు - 7, స, రి, గ, మ, ప, ద, ని

**291వ పద్యము :** ఏ పురుషుడు గురువర్యుని । శ్రీ పాదము బట్టలేదో, సేలుగ నాతం । డీ పుస్తకమును జూచిన । యే పట్టున నిలువకేగు నిది నిజమయ్యా॥ నరులారా మీ మది తెలియరయ్యా । యీ పరమ గోప్యము యెవ్వరెరుగరోరయ్య । నా పల్కు మదిలోన నాటిన వారికె ॥ యిది నిజమయ్యా । నరులారా మీ మది తెలియరయ్యా ॥

**టీక :** శ్రీ = ఐశ్వర్యము, సంపద, జ్ఞానము, సేలుగ = మంచిగ, పరమగోప్యము = అతి రహస్యము - పరిపూర్ణము.

**భావము :** ఎవరు సద్గురుమూర్తి యొక్క శుభకరమైన పాదమును చక్కగ ఆశ్రయించలేదో, అట్టివాడు ఈ పుస్తకమును చూచినచో ఆ ప్రదేశమును విడచి లేచిపోవును. (బుద్ధికి సరిపడక). నే చెప్పిన ఈ మాట నిజము. ఇది అతి రహస్యమైనది, ఎవ్వరూ ఎరుగరు. నా మాట మనస్సులో అతికిన వారికే యీ బోధ నిజము. చక్కగా తెలియబడును.

ఇతి శ్రీమద్భాగవతకృష్ణ విరచిత
ద్వైతా ద్వైత రహిత పరమతత్త్వే
గ్రంథ సంపూర్తి నామ
ఏకవింశోధ్యాయమునకు
భావ - విశేష భావములు - సమాప్తము.

# అధ్యాయము - 22

# గ్రంథ సమాప్తి - 1

**292వ పద్యము :** ఎరుక నెరుంగని బయలులో । గురుడును శిష్యుండు వారి గొడవయి, నేమీ । కెరిగించినవన్నియు, మీ । రెరిగిన వన్నియు మీర లేనః వుళ్లక్కీ ॥ వుళ్లక్కీ తానెప్పుడుళ్ళక్కీ । మరియింక మాటాడమాటేలేదాయెను । సరిపోయ, సరిపోతెసరి పాయ సరిమీర ॥ లేను నుళ్లక్కీ । ఉళ్లక్కీ తానెప్పుడుళ్ళక్కీ ॥

**టీక :** ఉళ్లక్కీ = లేనిది, గొడవయు = విచారించినదంతయు

**భావము :** ఎరుకను ఎంతమాత్రము దెలియని పరిపూర్ణ పరబ్రహ్మములో గురువు, శిష్యుడు, వారి విచారణయున్ను, మీరును. నేనును లేనివే. ఆ పరిపూర్ణ బ్రహ్మము ఎప్పుడునూ ఏమీ లేనిదే. అనగా అందులో ఏమియు లేనిది. ఇక మరి మాటాడుటకు ఎరుక లేకపోయెను. సరిపోయె సరిపోతే మంచిదే, సరి మీరు, నేను, జగత్తు, ఆత్మ ఎప్పుడును లేనివే సరి.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణవిరచిత
ద్వైతా ద్వైతరహిత పరమతత్త్వే
గ్రంథ సమాప్తి నామ
ద్వావింశోధ్యాయమునకు
భావ విశేష భావములు సమాప్తము

ఇతి శ్రీ నితుందినస గోత్రోద్భవుండును
సూర్యనారాయణావధాని దత్తత పుత్రుండును
శ్రీ సమరస నిర్మల ప్రజ్ఞాన విలక్షణ రామారాయ
సద్గురు ప్రభు ప్రియ శిష్యుండును
బుధ జన విధేయుడనగు
శ్రీ సమరస బోధానంద వెంకటరామ విరచితంబైన
టీక, దండాన్వయ, అవతారిక, భావ, విశేష భావములు సమాప్తము
సర్వమ్ సద్గురు చరణారవిందార్పణమస్తు

॥ స్వస్తి ॥

శ్రీ గురుభ్యోనమః

శ్రీమద్భాగవత కృష్ణదేశికేంద్రుల వారిచే

రచింపబడిన

క్షరా ఽక్షరోపాధి ద్వయ దోష రహిత

పరమతత్త్వ కందములు (కు)

# టీక, దండాన్వయ, భావ, విశేష భావములు

ఖానపల్లి
తూర్పుగోదావరి జిల్లా

రచయిత
శ్రీసమరస బోధానంద
**నేమాని వెంకటరామం**

# క్షరా క్షరోపాధి ద్వయ దోష రహిత కంద పద్యములు

## శ్రీ గురుభ్యోనమః

### క్షరా ౨ క్షరోపాధి ద్వయదోష రహిత కందపద్యములు

**అవతారిక :** పరిపూర్ణ పరబ్రహ్మములో కలవలె లేక తోచిన అఖండ యెరుక వలననే సమస్త పిండాండ బ్రహ్మాండములు ఏర్పడుచున్నవి. కలలో ఏర్పడిన సమస్తము కలయే కాని శాశ్వతము ఏదీ కాదు. ఈ కల ఉపాధి సహితమైనది. కనుక గుర్తెరుగు లక్షణము కలదు. ఈ కలయే ఎరుక. ఇది బ్రహ్మమును (పరిపూర్ణమును) తన గురు కరుణచే చూచినచో (మేల్కొనుట) కల లేకపోవును. బ్రహ్మము శాశ్వతము, కల అశాశత్వము లేనిది. ఈ ఎరుక మేల్కను చూచి తాను లేకపోయిన తరువాత గుర్తెగునది లేదు. ఇదే ఎరుక రహిత స్థితి. కనుక విషయమును నిర్ణయించి చెప్పుచున్నంత వరకు, ఎరుక లోని వారే కాని పూర్ణ స్థితి పొందినవారు కారు. ఎరుకలోని వారే నిర్ణయములు చేయగలరు. నిర్ణయములు తెలిసికొనగలరని చెప్పుటయే ఈ 1వ పద్య భావము.

**1వ పద్యము : ఈ కల కందములను, విను । డోకల నరులార, మీకు వొప్పిదమైనన్ । నేకల గనుక రచించితి । యాకల మోక్షమును జెందవగు నివి వినివన్ ॥**

**దండాన్వయము :** ఓక కల నరులారా! ఈ కల కందములను మీకు వొప్పిదమైనన్ వినుడు । నే కల గనుక రచించితి । ఇవి వినినన్ యా కల మోక్షమును జెందనగును॥

**టీక :** కల = ఎరుక, (జీవాత్మ - ఈశ్వరాత్మలు) వొప్పిదము = అంగీకారము, మోక్షమును జెందనగును. విడువ గలుగుదురు.

**భావము :** ఓ ఎరుక నరులారా! నేను ఎరుకలో ఉన్నాను (జ్ఞానమును తెలిసి ఉన్నాను) కనుక ఈ తత్వ సంబంధిత కంద పద్యములను రచించితిని. మీకు అంగీకృతమైనచో చక్కగా వినుడు. ఇవి వినినచో కల అని చెప్పబడే ఎరుక బంధము నుండి విడివడగలరు.

**విశేష భావము :** ఈక్షర అక్షర ఉపాధి ద్వయ దోష రహితమైన పరిపూర్ణ పరబ్రహ్మము (పరమతత్త్వమును) నిరూపించి, ద్వయ దోషములతో కూడిన ఎరుకను రహితపర్చే ఈ కంద పద్య రచన శ్రీ భాగవతుల కృష్ణ దేశికేంద్రులు రచిస్తూ "నే కల గనుక రచింతితి" నేను అనునది కల. అనగా సమస్తమును గుర్తెరిగే చైతన్యము "నేను". అది కలవలె మూలము లేకుండగా, తనకు తాను గానే లేక కలిగినది. గుర్తెరిగే

లక్షణము కలది. గుర్తెరుగు లక్షణము ఉన్నంత వరకు ఇది మంచి, ఇది చెడు అను నిర్ణయములు చేయగలడు, వినగలడు. ఈ గుర్తెరిగే చైతన్యమునే "ఎరుక" అని వ్యవహరించిరి. దానికే ఈ పద్యములో "కల" అను పదముతో చెప్పిరి. చెప్పేవారు, వినేవారు, చెప్పబడేది సమస్తము ఎరుకయే (జ్ఞానము - జ్ఞాత - జ్ఞేయము) కనుకనే ఈ పద్యములో "నేను కల, కల నరులారా! కల కందములు" అని పద ప్రయోగము చేసిరి. ఇట్టి కల (ఎరుక), పరిపూర్ణ బ్రహ్మమును చూచినచో పూర్తిగా లేకపోవును. ఈ పద్యములు ఎట్టివో చెప్పుచూ "ఇవి వినినన్ ఆ కల (ఎరుక) మోక్షమును జెందనగును" అని ఫల శృతిని గూడ చెప్పినారు. ఎరుక ఉన్నంత వరకు జన్మ పరంపర తప్పదు. అట్టి యెరుక పరిపూర్ణ బ్రహ్మమును చూచి లేక పోవును. అదే మోక్షము, అట్టి వారు తిరిగి జన్మకురారు.

"నేను కల - నేను అనునది జీవాత్మ, లేక బ్రహ్మాండములో ఈశ్వరుడు. ఈ రెండును ఎరుకయే. అవిద్య అను అంతఃకరణ ప్రతిబింబము, జీవాత్మ, మాయ అందలి ప్రతిబింబము ఈశ్వరుడు. బ్రహ్మాండాధిష్ఠాత, అవిద్య అనాది, లేనిదే తనకు తానుగా ఏర్పడినది. అందు పరిపూర్ణ పరబ్రహ్మము ప్రతిబింబితమయినది. ఈ ప్రతిబింబము సాక్షీ మాత్రము, నిర్గుణము, శుద్ధ చైతన్యము ఇదే ఎరుక నేను. దీని యొక్క చైతన్య సత్తాచే అంతఃకరణము చైతన్యవంతమైనది. ఈ అంతఃకరణ (అవిద్యయే) సమస్త పిండాండ జగత్తును నిర్మించుచున్నది. ఈ విధానమైన విచారణలో ప్రతిబింబము అక్షరుడు. అంతఃకరణము (అవిద్య) క్షరము. ఈ రెండు కలిసియే ఉండును. ఎన్నడూ విడిపోవు. విడిపోతే తిరిగి ఇక ఏర్పడవు. ఈ రెంటి కలయికయే ఎరుక. అక్షరునకు ఉపాధిక్షరము. క్షరమైన అంతఃకరణము ఉపాధి శరీరము. క్షరోపాధి శరీరము, అక్షరోపాధి అవిద్య లేక అంతఃకరణము, అంతఃకరణ వలన ప్రతిబింబము, ప్రతిబింబ చైతన్యముచే అంతఃకరణ ఉన్నది అనిపించుకొనుచు సమస్తమునకు కారణ కార్యములుగా అగుచున్నది. ఇదే ఉపాధి ద్వయదోషము. ఇట్టి ఉపాధి ద్వయదోషమైన ఎరుకను (చైతన్య ప్రతిబింబమును) రహిత పర్చువిధానమును చెప్పేదే ఈ కంద పద్యములు. ఇట్టి ఎరుక రహితమే పునరావృత్తి రహితము.

వేదాంత శాస్త్రములో అనుబంధ చతుష్టయము చెప్పవలెను. ఈ పరమతత్త్వ కందములను గ్రంథములో 1) విషయము = శాశ్వతమైన పరిపూర్ణ బ్రహ్మమును నిరూపించి, ఎరుకలేనిదని నిర్ణయించుట, 2) అధికారి : ఎవరు దీన్ని తెలుసుకొనుటకు

అధికారి? అనగా - "నేను కల" అని తెలుసుకొనే కలనరులారా! 'నేను' అను దాని స్వరూపమును తెలిసినవారు - సాధన చతుష్టయ సంపన్నులు వీరే అధికారి. 3) సంబంధము = సాధన, చతుష్టయ సంపన్నునకు చివర సాధించవలసినది "మోక్షము" అను అపవర్గసాధన. అందుకు బ్రహ్మతత్త్వమును తెలిసికొనవలసియున్నది. కనుక ఇదియే సంబందము. 4) ప్రయోజనము : "కల మోక్షము చెందనగునివి వినినన్" అన్నదే ప్రయోజనము. కనుక ఈ చిన్న పద్యములో శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు "అనుబంధ చతుష్టయము"ను చెప్పి వేదాంత శాస్త్ర సంప్రదాయబద్ధముగా గ్రంథ రచన గావించినట్లు తెలిసికొనవలెను.

---

**2వ పద్యము : మాట లేనట్టి బయలున । మాట గలిగె ననుట వినుట, మాయ గదయ్యా! మాట మాయైతె, మానెను । మాటను మాట్లాడి మనము మానుదమవలన్॥**

**దండాన్వయము :** మాట లేనట్టి బయలున, మాట గలిగెను అనుట, వినుట మాయ గదయ్యా! మాట మాయైతే మనము మాటను మాట్లాడి మానుదము। అవలన్ (మాట) మానెను ।

**టీక :** మాట = శబ్దము (ఎరుక), మాయ = మిధ్య, మాట్లాడి = విచారించి, మానుదము = విడిచెదము, మానెను = లేకపోవును.

**భావము :** శబ్దము (ఎరుక) ఎంత మాత్రము లేని పరిపూర్ణములో ఎరుక కలిగినది అని చెప్పుట, వినుట మాయయే అగును. అయితే ఆ ఎరుక ఎట్లు కలిగినది, ఎట్లు లేకపోవును ! అని మనకు చక్కగా విచారించి విడిచిపెట్టవచ్చును. తరువాత ఆ ఎరుకయే లేకపోవును.

**విశేష భావము :** మాట అనగా శబ్దము. అదే "ఓం" అనే శబ్ద బ్రహ్మము. అదే నేను, ఎరుక. మాటలేనట్టి బయలున అనగా ఎరుక ఎంత మాత్రము లేని పరిపూర్ణములో అని అర్థము. ఆ ఎరుక మాయ మిధ్య అయిననూ, ఆ లేని ఎరుకను ఆసాంతము విచారించి, అది ఏ విధముగా లేనిదో, ఎరుక పూర్తిగా లేకుండా పోయే విధానము ఇవన్నియు, ఎరుక విచారణ, మాటను మాట్లాడి అగును. శాశ్వతమైనది పరిపూర్ణమని తెలిసి ఎరుక లేనిదని విడచినచో, ఆలా విడిచిన వారికి ఎరుక లేకపోవును. "మాట మానెను" ఇందులో మాట అనునది అన్యాపదేశము.

---

**అవతారిక :** ఈ గ్రంథములోని ప్రతి ఒక్క పద్యము రసవంతమైనదే కాని, వ్యర్థ పద్యము లేదని చెప్పుచున్నారు.

**3వ పద్యము : ఏ కందముకాకందమె । మా కంద ఫలరసరుచిని మరిపించు రుచిన్। మీ కందములైనను విను । ఈ, కందములన్ని సత్యవీంద్రుల్లారా ॥**

**పద విభాగము :** మీకు అందములైనను వినుడు ఈ కందములన్నీ, సత్యవీంద్రుల్లారా॥

**టీక :** మా కందఫల రసరుచిని = మామిడి పండ్ల రస రుచిని, మరపించు రుచిన్ = అధిగమించే రుచి (కలిగినవి) మీకు అందములైనను = మీకు ఇష్టము అయినచో.

**భావము :** ఏ కంద పద్యమునకు ఆ కంద పద్యమే మామిడి పండ్ల రసరుచిని మరిపించు (అధిగమించు) రుచి కలిగినవి. మీకు ఈ పద్యములు ఇష్టమైనచో, ఓ సత్యవీంద్రుల్లారా వినండి !

**విశేష భావము :** మామిడి జాతిపండ్లు, ఏ జాతి పండుకు ఆ జాతికి ఒక ప్రత్యేక రుచి కల్గియుండును. అట్లే ఈ కంద పద్యములు ఒక్కొక్క పద్యము ఒక్కొక్క భావ రస భరితమై మామిడి పండ్ల రసరుచిని అధిగమించే రుచి కల్గియుండునని చెప్పిరి.

---

**4వ పద్యము : నే ఛందము జదివెరుగను । నా చందం బిదియు గురుని నమ్మి రచిస్తిన్ । యీ చందపు పద్యములను । చూచందరు నగక దిద్దురుడీ సుకవుల్ ॥**

**టీక :** ఛందము = ఛందస్సు, చందము = విధము, నగక = నవ్వక, దిద్దురుడీ =దిద్దండీ.

**భావము :** ఓ సుకవుల్లారా! నేను ఛంద శాస్త్రము బాగా చదివిన వాడను కాను, నా గురుమూర్తిని నమ్మి వారు, పలికించిన విధముగా యీ విధానమైన పద్యములను రచించితిని. ఇది నా విధము. యీ పద్యములలో (తప్పులున్నచో) చూచి అందరు నవ్వక సుకవులైన మీరు దిద్దండి.

---

**5వ పద్యము : కథ కాదు, జనన మరణ । వ్యథ మానుటకై రచిస్తి వర కవులారా! మథియించి చూచి దిద్దుడి । పథమే మాత్రంబు దప్పి పారకయుండన్ ॥**

**దండాన్వయము :** మథియించి చూచి, పథమే మాత్రంబు దప్పి పారకయుండన్ దిద్దుడీ ॥

**టీక :** వ్యథ = బాధ, వరకవులారా = శ్రేష్ఠమైన కవులారా! మథియించి = తరచి, పథము = మార్గము, పారక యుండన్ = పరుగెత్తి పోకుండగ.

**భావము :** ఓ శ్రేష్ఠమైన కవులారా! యిది కల్పిత కథ కాదు. (వినువారికి) జనన మరణ బాధ బాపుటకై రచించితిని. దీనిని చక్కగా తరచి చూచి (విచారించి) నేను చెప్పిన మార్గము తప్పి పారి పోకుండగ (నా భావము చెడకుండగ) దిద్దుడు.

---

**6వ పద్యము : తక్కువ పాండిత్యముచే । నిక్కే పండితులు మెచ్చ నేరరు వీటిన్ । ఎక్కువ పాండిత్యము గల । చక్కని పండితులు మెచ్చి సరె నన్నట్లున్ ॥**

**టీక :** నిక్కే పండితులు = గర్వించే పండితులు.

**భావము :** ఎక్కువ పాండిత్యము గల పండితులు, ఈ గ్రంథమును చదవి అంగీకరించి మెచ్చుకొనినట్లుగా, తక్కువ పాండిత్యము కల్గి అహంకరించే పండితులు, దీనిని మెచ్చుకొనలేరు.

**విశేష భావము :** ఎక్కువ పాండిత్యము - అనగా "పండితాః సమదర్శినః" గీతా వాక్యము, సర్వత్ర నిండియున్నది ఒక్కతత్త్వమే అని దర్శించగల వారు మాత్రమే పండితులు. అట్లు అఖండ తత్త్వ దర్శనము చేయగల వారు మాత్రమే. ఈ పద్య భావమును మెచ్చగలరు, అంతటి జ్ఞాన దర్శకులు కాని వారికి ఈ పద్య భావమును సరిగా గ్రహించలేరు. (275వ పద్య భావము కూడా దీనికి సరి)

---

**7వ పద్యము : సూరిజనులె యీ గ్రంథపు । సారము గనువారు, గాని సంసార మహా । ఘోర వారాసి జేరిన । వారలు దీన్ని చూచి వచియింపుదురె ॥**

**టీక :** సూరిజనులు = పండిత జనులు, సంసార = జనన మరణ ప్రవాహ రూప, ఘోరవారాశి = గొప్ప భయకంకర సముద్రము.

**భావము :** పండితులు (సమదర్శకులైన జ్ఞానులు) మాత్రమే యీ గ్రంథము యొక్క విశేష భావమును గుర్తించగలరు. కాని జనన మరణ ప్రవాహ రూప భయంకరమైన సముద్రములో నున్న అల్పులు, ఈ గ్రంథమును జూచి ఏమి మాట్లాడగలరు? (అనగా వారికి ఏమీ అర్థము కాగలదు?) సమదర్శకులు = పండిత శబ్దార్థము.

---

**అవతారిక :** ధన, దాన, పదవులచే సంపాదించే కీర్తి ప్రతిష్ఠలు కోరే జనులకు, ఇట్టి ఆధ్యాత్మిక బోధ పట్టదు అని చెప్పుచున్నారు.

**8వ పద్యము : గొప్ప ప్రతిష్ఠకు మిక్కిలి । తిప్పలబడు నృతతి కెపుడు దీరదు వినన్‌।**
**యొప్పుల కుప్పగు బోధను । తప్పక నా మాట నమ్మదగు దప్పనకన్‌ ॥**

**దండాన్వయము :** గొప్ప ప్రతిష్ఠకు మిక్కిలి తిప్పలు బడు నృతతికి, ఈ ఒప్పుల కుప్పగు బోధను వినన్‌ దీరదు. నా మాట తప్పనక తప్పక నమ్మదగు ॥

**టీక :** ప్రతిష్ఠ = కీర్తి, మిక్కిలి తిప్పలుబడు = ఎక్కువగా ప్రయత్నించి కష్టపడే, నృతతికి= నర సమూహమునకు, ఒప్పులకుప్పగు బోధన్‌ = మిక్కిలి చాలా మంచిదైన యీ బోధను, వినన్‌ = వినుటకు, ఎప్పుడున్‌ తీరదు = ఎప్పటికి తీరిక కలగదు.

**భావము :** ఆడంబరములు, కీర్తి ప్రతిష్ఠలు గురించి, నానా యాతనలు పడే జనులకు, ఈ గొప్పదైన బోధను వినుటకు తీరికయే యుండదు. నేను చెప్పిన యీ సూక్తి తప్పు అని భావించక తప్పకుండా నమ్మదగును.

**విశేష భావము :** కీర్తి కాముకులు ఎల్లవేళలా జగత్సంబంధమైన కార్యకలాపములతోనే కాలమంతయు గడుపుచుందురు. అట్టి వారికి ఈ బోధ వినుటకు తీరికయే కుదరదు. కనుక అట్టి వారికి ఈ బోధ చెప్పవద్దు అని ఇందుమూలముగా మనకు చెప్పుచున్నారు. భగవద్గీతలో 13వ అధ్యాయము జ్ఞాని లక్షణములలో "అరతిర్జనసంసది" అన్నారు.

---

**9వ పద్యము : మెప్పైన బోధ గల, మా। యప్పలు తప్పుంటే దిద్దుడది నాకిష్టం। బి, వ్వగిది కందములనే । జెప్పితి యీ కవిత జూచి శిడిముడి పడకన్ ॥**

**దండాన్వయము :** ఇప్పగిది కందములనే జెప్పితి, యీ కవిత జూచి తప్పుంటే శిడిముడిపడకన్, మెప్పైన బోధ గల మాయప్పలు దిద్దుడు, అది నాకు ఇష్టంబు ॥

**టీక :** ఈ + పగిది = ఇప్పగిది, ఈ విధమైన, మెప్పైన బోధ గల = గొప్ప జ్ఞానులైన, మా అప్పలు = మా తండ్రులు, శిడిముడి = కోపము.

**భావము :** గొప్పదైన యీ బోధను చక్కగా నెరిగిన మా తండ్రులు, యీ విధముగా నేను చెప్పిన యీ పద్యములలో తప్పులున్నచో కోపపడక దిద్దుడు, అది నాకు యిష్టమే.

**విశేష భావము :** గొప్పదైన యీ పరిపూర్ణ బోధను బాగుగా గుర్తించిన పెద్దలను మాత్రమే, యిందు తప్పులున్నచో దిద్దమని సెలవిచ్చిరి. అంతే కాని ఎవరిని పడితే వారిని దిద్దమనలేదు అని గుర్తించవలెను.

---

**10వ పద్యము : ఒకసారియైన వినకన్ । వికవిక నవ్వేటి కుకవి వేత్తల్లారా । ప్రకటించక మీ శౌర్యం । బిక దాచుటె, మీకు మాకు హితవై యొప్పున్ ॥**

**టీక :** విక విక నవ్వేటి = పక పక నవ్వేటి, (హేళనగా నవ్వేటి) కుకవివేత్తల్లారా = చెడు పాండిత్యము గల వారలారా !, శౌర్యము - ప్రతాపము, ప్రకటించక = ప్రత్యక్ష పరచక, ఇక దాచుటె = ఇక చాలించుటె, హితవై = మంచిదై, కోరదగినవై, ఒప్పున్ = తగును.

**భావము :** ఈ పద్య (గ్రంథ) భావమును ఒకసారియైన వినని ఓ అల్పపండితులారా! దీనిని జూచి హేళనగా నవ్వకండి, మీ ప్రతాపమును కట్టి బెట్టి, ఏమియు మాట్లాడకుండుటె, మీకు మాకు మంచిని కలుగజేయును.

**విశేష భావము :** ఇది బ్రహ్మ జ్ఞాన సంబంధిత గ్రంథము, ఈ భావము ఎంతమాత్రము తెలియని వారు, ఈ గ్రంథము యొక్క విశేష భావమును గుర్తించలేరనియు, అట్టి

వారు దీన్ని గురించి ఎంతమాత్రము విమర్శించనర్హులు కారనియు, ఈ పద్యములో అట్టి అల్పులను హెచ్చరించిరి. అందుకే "మౌన మపండితానాం" అల్పజ్ఞులకు మౌనమే మేలని భర్తృహరి ఉదహరించిరి.

---

**11వ పద్యము : స్వచ్ఛాన్వయ గుచ్ఛములని । పృచ్ఛయొనర్చెదరు కవులు పృథు యశులారా! యిచ్ఛ జనించిన చదువుడి । అచ్ఛా పద్యంబు లివ్వి యాసాంతముగాన్॥**

**టీక :** స్వచ్ఛ = శుద్ధమైన, అన్వయ = పొందిక గల, గుచ్ఛములు =మణులు గల హారములు, పృచ్ఛ యొనర్చెదరు = కీర్తించుచుందురు, కవులు = పండితులు, పృథుయశులారా = గొప్ప కీర్తి గల వారలారా, యిచ్ఛ జనించిన = కోరిక పుట్టినచో, అచ్ఛా పద్యములు = మంచి పద్యములు.

**దండాన్వయము :** పృథుయశులారా! కవులు స్వచ్ఛాన్వయ గుచ్ఛములని పృచ్ఛ యొనర్చెదరు । ఇవ్వి అచ్ఛా పద్యములు । (మీకు) యిచ్ఛ జనించిన యాసాంతముగన్ చదవుడీ ॥

**భావము :** ఓ గొప్ప కీర్తి గల వారలారా! ఈ పద్యములు చాలా మంచి పద్యములు. శుద్ధమైన మణులతో పొందిక చేయబడిన హారములు అని, పండితులు కీర్తించుచుందురు. కనుక వీటిని చదువవలెనని మీకు కోరిక పుట్టినచో మొదటి నుంచి చివరి వరకు చదువుడు ॥ (ఆసాంతము) అ లగాయతు స వరకు అని భావము. అనగా "అ" మొదటి నుండి "స" చివర వరకు అని భావము.

---

**అవతారిక :** యీ బోధలో చిక్కులు లేవనియు, శాస్త్రములో చెప్పిన గజిబిజి యెంత మాత్రము లేకుండగ, శాశ్వత బ్రహ్మమును పరిపూర్ణము అని, మాయను ఎరుక అనే పదములతో వేరు వేరుగా నిరూపితమైనందున చిక్కులు లేని బోధ యని చెప్పుచున్నారు.

**12వ పద్యము : తక్కిన బోధల వలె నిది । చిక్కులు బోధ గాదు, చేపట్టదగున్ । మక్కువతో మీ మునుపటి । చిక్కుల బోధలను చూర్ణ జెక్కి ముదమునన్ ॥**

**దండాన్వయము :** తక్కిన బోధల వలెన్ ఇది చిక్కులు గల బోధ కాదు। ముదమునన్ మీ మునుపటి చిక్కుల బోధలను చూర్ణ జెక్కి మక్కువతో (దీన్ని) చేపట్టదగున్ ॥

**టీక :** చిక్కులు = మెలికలు, చేపట్టదగున్ = గ్రహించతగినది, మక్కువతో ప్రేమతో, చూర్ణ జెక్కి = గుండజేసి, ముదమునన్ = సంతోషముతో ॥

**భావము :** తక్కిన బోధల వలె యీ బోధ చిక్కులు మెలికలు కలది కాదు, కనుక మీ యొక్క పూర్వపు చిక్కుల బోధలనన్నింటిని వదిలిపెట్టి ప్రేమతో యీ బోధను చేపట్టతగును (గ్రహింపతగును)

**విశేష భావము :** తక్కిన బోధలన్నియు ఏది బ్రహ్మమో, ఏది మాయయో, సూటిగా నిర్దేశించక చాలా గజిబిజిని కలిగించుచున్నవి. మాయకు, బ్రహ్మమునకు ఉన్న సంబంధము తేడాలను సూటిగ నిరూపింపబడక, పూర్వపక్ష, సిద్ధాన్త, తర్క వితర్కములతో కూడి యున్నవి. యీ పరిపూర్ణ బోధ అట్లు గాక బ్రహ్మమును - పరిపూర్ణమును, బట్ట బయలు అను నామములతోను, మాయను, మాయా కార్యములను ఎరుక అను నామములతోను, విడమర్చి సంశయము ఏర్పడకుండ నిర్వచించి బ్రహ్మ తత్త్వమును సూటిగ తెలియజేసినది. కనుక సర్వులు దీనిని తెలిసికొనగలుగుచున్నారు.



**అవతారిక :** ఈ బోధ చాలా గొప్పదనియు, దీనికి మించిన బోధ మరొకటి లేదనియు చెప్పుచు, యీ బోధ తెలిసికొనుట వలన కలిగే ఫలితమును కూడా చెప్పుచున్నారు.

**13వ పద్యము : సకల కార్యప్రయత్న, జ। నకమగు వస్తువును బట్టి నలచివైచు, దీ। న్నొక సారి వినిన చదివిన । నికనింతకు యెక్కువైన వే బోధల యా॥**

**దండాన్వయము :** దీన్నొకసారి వినిన, చదివిన, సకల కార్యప్రయత్న జనకమగు వస్తువును బట్టి నలచివైచును ।ఇకన్ ఇంతకు ఎక్కువైనవి ఏ బోదలయా ॥

**టీక :** సకల కార్య = సమస్త సృష్టి, స్థితి, లయ కార్యములకు, ప్రయత్న జనకమగు = ముఖ్య కారణమగు, వస్తువును = బ్రహ్మమును, పట్టి = గుర్తించి, నలచివైచును = నలిపివేయును (లేకుండా జేయును)

**భావము :** దీన్ని (యీ గ్రంథమును) ఒకసారి వినిన, చదివిన, సమస్త సృష్టి కార్యములకు మూలమైన బ్రహ్మమును (ఎరుకను) గుర్తించి దానిని లేకుండా చేయును. కనుక యింతకన్నా గొప్పదైన బోధలు ఏమి గలవు? అనగా మిగిలిన బోధలు చిల్లర బోధలే యని భావము.

**విశేష భావము :** "యతో వా ఇమాని భూతాని జాయంతే" అను శృతి లక్ష్యార్థ స్వరూపమైన ఎరుకను లేకుండో జేయును ఈ బోధ అన్నారు. ఈ పద్యములో "వస్తువు" అన్నారు "వస్తువు" అనగా వేదాంత పరిభాషలో బ్రహ్మము అని అర్థము "వసతి ఇతి వస్తుః" ఉన్నది అనునది వస్తువు, అనగా బ్రహ్మము, అయితే ఇచ్చట సకల కార్యప్రయత్న జనకమగు వస్తువు, అంటే ఎరుక. ఇది పరిపూర్ణ బ్రహ్మము యొక్క ప్రతిబింబమే కనుక, బింబమునకు ఉన్న పేరుతోనే ప్రతిబింబము కూడా వ్యవహరింపబడును. ప్రతిబింబము కనుక నే ననే బ్రహ్మము, మాయా శబళిత బ్రహ్మముగా దీనిని తెలుసుకొనవలెను.

---

**14వ పద్యము : కేరుచు మిము వినుమని, నే । సారెకు మీ చుట్టు దిరిగి సన్నుతి జేసే। తోరపు బోధకు మూలం। బైరెవ్వరో వార్ని దలచి వరుస నుతింతున్ ॥**

**దండాన్వయము :** మూలంబైరెవ్వరో, వారిని వరుస దలచి నుతింతున్ ॥

**టీక :** కేరుచు = సంతోషముతో పిలచుచు, సారెకు = పదే, పదే, తోరపు బోధకు = గొప్పదైన బోధకు, మూలంబైరెవ్వరో = ఆది పురుషులైన వారెవరో, నుతింతున్ = స్తోత్రము జేతును, సన్నుతి జేసే = గొప్పగా పొగడచు ॥

**భావము :** మిమ్ములను పదే పదే వినుమనుచు సంతోషముతో పిలచుచు చెప్పే గొప్పదగు, ఈ పరిపూర్ణ బోధకు, మొట్టమొదటగా భూమి పై పీఠస్థాపన చేసి ప్రచారము చేసిన ఆది పురుషులను వరుసగా తలచుచు ప్రార్థించెదను.

---

**15వ పద్యము : ఈ క్షితి శివరామాహ్వాయ । దీక్షితులకు, బోధ జేసి దిద్దిన సామ్యా। దక్షుని శ్రీధర మూర్తిని । నిక్షేపముగా దలచి నే వినుతింతున్ ॥**

**టీక :** ఈ క్షితి = ఈ భూమిపై, శివరామహ్వాయ = శివరామ అను పేరు గల, బోధ జేసి = బ్రహ్మమును (జ్ఞానమును) తెలియపర్చి, దిద్దిన సామి ఔ=సరి జేసిన ప్రభువు అయిన, దక్షుని = రక్షణ జేసిన, నిక్షేపముగ (జ్ఞాన) నిధిగా, వినుతింతున్ = ప్రస్తుతి జేసెదను.

**భావము :** ఈ భూమిపై (ఈ బోధకు పీఠ స్థాపన జేసిన) శివరామ అను పేరు గల దీక్షితులకు, ఈ పరిపూర్ణ బ్రహ్మతత్త్వమును చక్కగా తెలియపరచి సరిజేసినట్టియు, జన్మ కర్మల నుండి రక్షణ జేసిన ప్రభువు అయిన శ్రీధరస్వామిని, జ్ఞాన నిధిగా భావించి, వారికి నమస్కరించెదను.

---

**16వ పద్యము : దక్షిణామూర్తి యనగదగు । నీ క్షితి శివరామ నామ దీక్షితులనుచున్। వీక్షింతు రార్యులతని, క । పేక్షను దండములు బెట్టి ప్రేమ నుతింతున్ ॥**

**టీక :** వీక్షింతురు = చూచెదరు, భావించెదరు, ఆర్యులు = పూజించదగినవారు, అపేక్షను = కోరికతో ।

**దండాన్వయము :** శివరామ నామ దీక్షితులు ఈ క్షితిన్ దక్షిణామూర్తియనదగు ననుచున్ ఆర్యులు వీక్షింతురు। అపేక్షన్ అతనికి దండములు పెట్టి ప్రేమ నుతింతున్॥

**భావము :** ఈ భూమిపై దక్షిణామూర్తి అని చెప్పదగినవారు, ఈ శివరామదీక్షితులు అని పూజ్యులైన వారు భావించెదరు. అట్టి శివ రామ దీక్షితుల వార్కి కోరి నమస్కరించి పూజ్య భావముతో స్తోత్రము చేసెదను.

---

**17వ పద్యము : ఆ దీక్షితుల కృపకు, దా పాత్రుడై య్యప్పయ్య మంత్రి పఠియించెను, యీ। మేదిని తద్బోధ, నతని । పాదములకు నతులొనర్చి ప్రార్థింతుమదిన్ ॥**

**టీక :** కృపకు = దయకు, దాపాత్రుడై = పాత్రుడై, మేదిని = భూమి మీద, నతులు = నమస్కారములు.

**దండాన్వయము :** ఆ దీక్షితుల కృపకు అప్పయ్య మంత్రి దాపాద్రై, యీ మేదిని తద్భోదను పఠియించెను । అతని పాదములకు నతులు ఒనర్చి మదిన్ ప్రార్థింతు ॥

**భావము :** యీ భూమిపై ఆ దీక్షితుల కరుణకు పాత్రుడై అప్పయ్య మంత్రి, దీక్షితుల వారి బోధను తెలుసుకొనెను. అట్టి అప్పయ్య మంత్రి పాదములకు నమస్కరించి మనస్సులో ప్రార్థించెదను.



**18వ పద్యము : నతి జేసెద నప్పయ్యన్ । గతి కై కొల్చతడు బోధ గనెనో, నేనా । ప్రతి లేని పరశురామ। క్షితి సుర వంశమణియైన సీతా పతికిన్ ॥**

**దండాన్వయము :** అప్పయ్యన్ గతికై కొల్చి, అతడు బోద గనెనో, ఆ ప్రతిలేని క్షితి సురవంశమణియైన పరశురామ సీతాపతికిన్ నేను నతి జేసెదను ॥

**టీక :** గతికై = సద్గతికై, కొల్చి = సేవించి, బోధ గనెనో = బ్రహ్మమును గుర్తించెనో, ప్రతి లేని = సాటిరాని, క్షితి సుర వంశమణి = బ్రాహ్మణ వంశములో శ్రేష్టుడైన, నతి జేసెద = నమస్కరించెదను.

**భావము :** అప్పయ్యమంత్రిని, భూసుర వంశశ్రేష్ఠుడైన పరశురామ సీతాపతి తన సద్గతికై సేవించి బ్రహ్మతత్త్వమును తెలిసికొనిరి. అట్టి ప్రతి రహితమైన పరశురామ సీతారామస్వామికి నేను నమస్కరించెదను.

**విశేష భావము :** ప్రతి లేని అనగా సాటి లేని అని సామాన్యార్థము, అవిద్య యందు బ్రహ్మము ప్రతిఫలించుటచే ఏర్పడిన ప్రతిబింబమే ఎరుక అట్టి ప్రతిని (ప్రతిబింబమైన ఎరుకను) రహిత పర్చుకొనిన వారే తన గురుమూర్తియైన సీతారామస్వామి అని ఈ పద్య భావము. ప్రతి రహితమైన వారే జన్మరహితులు.



**19వ పద్యము : బుచ్చి వెంకమ్మ తల్లిని । చెచ్చెర పెండ్లాడి కాశి సేతువుదాకన్ । విచ్చలవిడి యెగ జల్లెను । సచ్చరితులకచల బోధ సాకల్యముగన్ ॥**

**టీక** : చెచ్చెర = బాగుగ, కాశి సేతువు దాకన్ = కాశీలగాయతు రామేశ్వరం (సేతువు) వరకు, విచ్చలవిడి = ప్రతిబంధకము లేకుండగ, యెగజల్లెను = విస్తరింప తెలియజేసెను. సచ్చరితులకు = సత్పురుషలకు, సాకల్యముగన్ = అనుకూలముగ

**దండాన్వయము :** (ఆ సీతాపతి) బుచ్చి వెంకమ్మ తల్లిని చెచ్చెర పెండ్లాడి సచ్చరితులకు కాశి సేతువుదాకన్ అచల బోధ సాకల్యముగన్ విచ్చలవిడి యెగజల్లెను.

**భావము :** ఆ పరశురామ సీతారామస్వామి బుచ్చివెంకమ్మ అనే సాధ్విని వివాహము చేసుకొని, కాశీ లగాయతు రామేశ్వరము వరకు సత్పురుషులకు ఈ పరిపూర్ణ బోధను బోధపడేటట్లుగా చక్కగా విస్తరింప తెలియజేసెను.



**20వ పద్యము : ఆ సీతాపతి వతి వి। శ్వాసమువం గొల్చుకొంటి, సర్వేశ్వరుడం। చీ, సద్బోదను,. తేటగ । జేసితి విని సకల జనులు చెవి యొగ్గి వినవ్ ॥**

**దండాన్వయము :** ఆ సీతాపతిని సర్వేశ్వరుండంచున్ అతి విశ్వాసమున గొల్చి, యీ సద్బోదను కొంటి। ఇవి సకల జనులు చెవి యొగ్గి సాకల్యముగ వినన్ తేటగ జేసితి ॥

**టీక** : విశ్వాసమునన్ = నమ్మికతో, గొల్చికొంటి, సేవించుకొంటి = సర్వేశ్వరుడు అంచు = అఖండ దివ్య గురు స్వరూపముగ భావించి, తేటగ = తేలికగ, గొల్చి = సేవించి, కొంటి = గ్రహించితిని.

**భావము :** 1) ఆ సీతాపతిని సర్వేశ్వరునిగ (అఖండ గురుమూర్తిగా) భావించి అతి నమ్మికతో సేవించుకొన్నాను. సమస్తమైన జనులు ఆనందముతో వినుటకు తగినట్లుగ, ఈ పరిపూర్ణ బోధను తేలికగా వివరించితిని. 2) ఆ సీతాపతిని సర్వేశ్వరునిగ అతి నమ్మికతో సేవించుకొనుచు, ఈ అచల బోధను సాకల్యముగ గ్రహించితిని. దీనిని సమస్త జనులు ఆనందముతో వినుటకు తగినట్లుగా తేలికగా రచించితిని.

**విశేష భావము :** "గురు స్సకలధర్మాత్మా" షడ్గుణైశ్వర్య యుక్తోహి "భగవాన్ శ్రీ గురుః" అనే గురు గీతా వచనముల రీత్యా సకల ధర్మములు కల్గినది. అఖండ గురు స్వరూపము, కనుక తన గురువు అఖండ గురు స్వరూపునిగా భావించి సేవించుకొనెను.

**21వ పద్యము : భాగవత వంశభవుడను । భాగవతోత్తముల పాద పద్మంబులకున్ । సాగిలి మ్రొక్కేవాడను । బాగుగే నను జనులు కృష్ణ భట్టందురిలన్ ॥**

**టీక :** భవుడను = పుట్టినవాడను, భాగవతోత్తముల = భక్తి జ్ఞాన, వైరాగ్య, తత్త్వ ముముక్షములలో ఉత్తములైన, సాగిలి మ్రొక్కేవాడను = సాష్టాంగ నమస్కారము చేసేవాడను.

**భావము :** (గ్రంథకర్త) భాగవత అను ఇంటి పేరు గల వంశములో పుట్టినవాడను, భాగవతోత్తములైన వారికి సాష్టాంగ నమస్కారము చేసేవాడను. నన్ను జనులు "కృష్ణ భట్టు" అందురు (అని పిలిచెదరు)

**విశేష భావము :** భాగవతోత్తములు = భక్తి గ = జ్ఞానము, వ=వైరాగ్యము, త=తత్త్వము (ముముక్షత్వము) అని "భాగవతము" అను పదమునకు ఆర్ష భాష్యము. అనగా గురుభక్తి, అఖండ జ్ఞానము, ఇహ అముత్రార్థ ఫలబోగ వైరాగ్యము, అఖైండకతత్త్వ జ్ఞానము. జన్మ బంధ ముముక్షత్వము అనునవి కలిగిన మహానుభావులకు సాష్టాంగ నమస్కారము చేసేవాడను అని చెప్పుకున్నారు. 2) జనులు కృష్ణబట్టందురు = నన్ను కృష్ణ భట్టు అని పిలిచెదరు. నా పేరు కృష్ణ భట్టు అని చెప్పలేదు. ఎందుచేతననగా తన పేరు గురువు పేరు, భర్త పేరు తన నోటితో చ్పెపరాదు అని శాస్త్ర సమ్మతము. అందుచేత తన పేరు కృష్ణ భట్టు అందురు అని ఈ పద్యములో చెప్పిరి. దీనిని బట్టి కృష్ణదేశికేంద్రులు ఎంత శాస్త్రసమ్మతముగా వ్యవహరించిరో గ్రహించనగును.

**22వ పద్యము : ధారుణ్యాత్ర్యన సూయులు । వీరేయని జనులు బొగడ వెలసిన వారల్। నారాయణ జానకియను ।వారిరువురు గన్నయట్టి వాడను సుమ్మీ ॥**

**పద విభాగము :** ధారుణి అత్రి అనసూయలు వీరేయని బొగడ వెలసిన, నారాయణ జానకియను వారల్, వారిరువురు గన్నయట్టి వాడను సుమ్మీ ॥

**టీక :** ధారుణి = భూమిపై, పొగడన్ = కీర్తించినట్లు, వెలసిన వారల్ = ప్రకాశించిన వారలు.

**భావము :** భూమిపై అత్రి అనసూయ, వీరే అని కీర్తించబడుచు, ప్రకాశించిన నారాయణ, జానకి అను పుణ్య దంపతులకు పుట్టినవాడను, అని కృష్ణ దేశికులు తమ తలిదండ్రులను కీర్తించెను.



**23వ పద్యము : ఆ నే నొనర్చినాడను । యీ నిజ కందముల గ్రంథమెప్పుడు దీనన్। వీనుల విని కన్నుల గని । రే నట్టి జనంబు బల్కునే, నేనచున్ ॥**

**దండాన్వయము :** ఆ నేను ఈ నిజ కందముల గ్రంథము ఒనర్చినాడను । ఎప్పుడు దీనన్ వీనుల విని, కన్నుల గనిరేని, అట్టి జనంబులు నేనచున్ బల్కునే ।

**టీక :** యీ నిజ కందములు = యీ శాశ్వత కంద పద్య గ్రంథము, అనగా పరిపూర్ణ బోధ కంద పద్యముల గ్రంథము.

**భావము :** ఆ నేను పై పద్యములో చెప్పబడిన కృష్ణ భట్టు అను పేరు గల నేను యీ పరిపూర్ణ బోధ కంద పద్యముల గ్రంథమును రచించినాను. దీనిని ఎప్పుడు చెవులతో విని, కన్నులతో జూచిరేని, అట్టి జనులు "నేను" అని పలుకగలరా? అనగా "నేను" అని పలుక లేరు.

**విశేష భావము :** "ఆ నేను" - నేను అనగా ఆత్మ, అదే ఎరుక. ఆ నేను అనగా అఖండ ఎరుక. ఆ నేను రచించితిని. యీ గ్రంథము జీవ బుద్ధితో వ్రాయలేదు. శుద్ధ సత్త్వబుద్ధి, అఖండ గురు జ్ఞానబుద్ధితో, ఆ అఖండ గురుస్థానమును అలంకరించిన "నేను" వ్రాసితిని అని భావము. అఖండ గురు సానము నుండియే వేదము వెలువడినది కనుక వేదము స్వప్రమాణము. ఏ ప్రమాణము చేత నిర్దేశించపబడేది కాదు, మరియు కేవల జ్ఞాన స్వరూప స్థానము భ్రమ రహితమైనది ప్రమాద రహితమైనది. స్వ ప్రమాణమయిన వేదము అటులనే ఈ కందార్థములు

అఖండ జ్ఞాన బుద్ధితో చెప్పబడినది. కనుక వీటి యందు వేదముల వలె భ్రమ ప్రమాద రహితమైనది. ప్రమాణమునకు అందేది కాదు అని చెప్పడమే. మరియు భ్రమ ప్రమాదరహితమైనది అని చెప్పడమే ఆ నేను రచించినాడను.

2) "యీ నిజకందములు"= నిజ అనగా శాశ్వతమైన అని అర్ధము, శాశ్వతమైనది. ఒక్క పరిపూర్ణము మాత్రమే. మిగతా సమస్తము అశాశ్వతమైనది, అట్టి శాశ్వత బ్రహ్మమును గురించి తెలియజేసిన పద్యములు కనుక శాశ్వత కందములు. నిజకందములు అని చెప్పబడెను. వస్తువు - పలుకు ఒక్కటే కదా! "వాచ్య వాచక రుభయో రభేదః" అన్నారు. వాచ్యమునకు వాచకమునకు బేధము లేదు. ఈ పద్యములలో చెప్పబడిన బ్రహ్మతత్త్వమును చక్కగా గురుముఖతా విని, ఆ బ్రహ్మమును కన్నులతో గనిరేని (అనగా అపరోక్షముగా తెలియబడెనేని) అట్టి వారికి నేను అనే ఎరుక రహితమగును. కనుక ఎరుక రహితమైనవారు "నేను" అని పల్కలేరు. అనగా నేను ఉన్నాను అని కాని, నేనే బ్రహ్మమును అకి కాని అనలేరు అని భావము. ఎరుకపోతే బ్రహ్మమే (పరిపూర్ణమే) ఉన్నది. పరిపూర్ణము "నేను" అనలేదు అని యీ పద్య విశేష భావము.

**24వ పద్యము : చిల్లర బోధల నన్నిటిని । నొల్లరు నిజ బోధ దెలసి యొప్పెటి పెద్దల్‌। పొల్లని, యందుకె నేనవి । నొల్లక, యీ బోధ యందె వర్తిస్తి జామీ ॥**

**దండాన్వయము** : నిజ బోధ తెలసి యొప్పెటి పెద్దల్, చిల్లర బోధల నన్నిటిని పొల్లని ఒల్లరు.

**టీక** : చిల్లర బోధలు = సామాన్య బోధలు, పొల్లని = సారము లేనివని, నిజబోధ= పరిపూర్ణ బోద, ఒప్పెటి = ప్రకాశించెటి, ఒల్లరు = అంగీకరించరు. వల్లక=అంగీకరించక, ఇష్టపడక, వర్తిస్తి జామీ = అనుసరించితి సుమా.

**భావము** : పరిపూర్ణ బోధ తెలసి ఆరూఢులైన పెద్దలు, సామాన్యమైన ఇతర బోధలు సారహీనమైనవని, వాటిని ప్రమాణముగా అంగీకరింపరు. అందుకే నేనును ఆ బోధలను విడచి, యీ పరిపూర్ణ బోధనే అనుసరించుచున్నాను సుమా!

**25వ పద్యము : గురుశిష్యుల మాటల వలె । పరిపూర్ణపు బోధ, కంద పద్య ఫణితిచే। విరచిస్తి వినుడి, ముందర । జరిగే ముచ్చట్లు మీకు సహ్యంబైనన్ ॥**

**దండాన్వయము :** పరిపూర్ణ బోధ, గురు శిష్యుల మాటల వలె, కంద పద్య ఫణితిచె విరచిస్తి । ముందర జరిగే ముచ్చట్లు మీకు సహ్యంబైనన్ వినుడీ ॥

**టీక :** కంద పద్య ఫణితిచే = కంద పద్య రీతిగ, ముచ్చట్లు = బోధ (సంభాషణ) సహ్యంబైనన్ = మనస్సుకి ఇష్టమైనచో, రుచిగా తోచినచో.

**భావము :** పరిపూర్ణ బోధను గురు శిష్య సంవాద పద్ధతిలో కంద పద్య రీతిగా, చక్కగా వ్రాసితిని. యీ చెప్పబోవు సంభాషణ మీ మనస్సుకు ఆనందమును, రుచిని కలిగించినచో వినుడీ ।

**విశేష భావము :** కంద పద్యమునకు ఛందస్సు - గా, భ, జ, స, న ల ములను గణములతో వ్రాయవలెను. లేక మొదటి పాదము 12 మాత్రలు, రెండవ పాదము 20 మాత్రలు, మొత్తం 32 మాత్రలు కల్గియుండవలెను. ఈ రెండు నియమములను అనుసరించుచు ఈ గ్రంథమును వ్రాసిరి.



**26వ పద్యము : సకల నిగమాగ మాది । ప్రకర మహా నారికేళ ఫలసారము, దీ । సోక గ్రంథము జేసితి, లౌ । కిక జనులొక వేళ గొన్న కీడు దొలంగున్ ॥**

**టీక :** సకల = సమస్తమైన, నిగమ = వేదములు, ఆగమ = దేవతా సంబంధిత శాస్త్రములు, ఆది = మొదలైన శాస్త్రములు, ప్రకర = సమూహము, మహానారికేళఫల= గొప్ప కొబ్బరికాయ యొక్క, సారము = విశేషము, దీసి = తీసుకొని, లౌకిక జనులు = జ్ఞానము నెరుంగని సామాన్యులు, ఒకవేళ = వారి పుణ్య విశేషముచే ఒకసారి, కొన్నన్ = దీన్ని గ్రహించినచో, కీడు = పునరావృత్తి దోషము, తొలంగున్ = పోవును.

**భావము :** సమస్తములైన వేదములు, శాస్త్రములు అనే ఒక కొబ్బరి పండు యొక్క సారమును తీసి ఒక గ్రంథముగా రచించితిని. సామన్య జనులు వారి పుణ్య విశేషముచే ఈ గ్రంథమును గ్రహించినచో, వారికి అనేక జన్మల నుండి వచ్చుచున్న పునరావృత్తి దుఃఖము నశించిపోవును.

**విశేష భావము :** కొబ్బరికాయ, పై డొక్క వలచుట కష్టము, ఆ తరువాత దాన్ని బద్దలు కొట్టి అందున్న కొబ్బరిని తీయుట కూడా కష్టమే అనగా కొబ్బరి కాయ నుండి, ఆ ఫల రసమును ముక్కను గ్రహించుట ఎంత కష్టమో, సమస్త వేదశాస్త్ర విజ్ఞానములో నిక్షిప్తమయిన బహ్మాజ్ఞానమును గ్రహించుట అంతకంటే కష్టము. కనుక మహా నారికేళము వంటి శాస్త్ర వేద విజ్ఞానము యొక్క సారమును తీసి, సామాన్య జనులు కూడా గ్రహించుటకు తగు రీతిని ఒక గ్రంథము చేసితిని అని ఈ పద్యములో చెప్పిరి. కనుక ఈ గ్రంథస్థ విషయము, సకల నిగమ, ఆగమాది ప్రకరణము యొక్క సారము అని గ్రహించనగును. ఈ మధ్య మన బోధస్థులు ఈ పరిపూర్ణ బోధ మహాఋషులకు తెలియదు, వేదములలో చెప్పబడలేదు అని అజ్ఞాన విమర్శోపన్యాసములు చేయుచున్నారు. ఇది అజ్ఞానపు విమర్శలు. పరిపూర్ణ బోద సనాతనమైనది. వేద విహితమైనది. ఆర్ష విద్య అని గ్రహించవలెను.

**అవతారిక :** తన యొక్క పుణ్య సంస్కారముచే బ్రహ్మజ్ఞానమును తెలుసుకోవలెనను ప్రయత్నించే వారికి మాత్రమే గురుమూర్తి ఈ పరిపూర్ణ బోధను తెలియపర్చవలెను. కాని తెలుసుకొనే ఇచ్ఛ లేని వారికి పిలచి శిష్యునిగా జేసుకొని బోధించరాదని ఈ పద్యములో తెలియపర్చుచున్నారు.

**27వ పద్యము : తనకు దా వచ్చి, సద్బో । ధను దెల్పు మటంచు మ్రొక్కు శిష్యునకున్ । వినజెప్ప దొణగె నొక గురు । డను మానించకను వాని కతి దయ తోడన్ ॥**

**దండాన్వయము :** ఒక గురుడు అనుమానించకను అతి దయ తోడన్ వానికి విన జెప్ప దొణగెన్ ॥

**భావము :** తనంత తానుగా సద్గురుమూర్తి వద్దకు వచ్చి, నమస్కార పూర్వకముగా, ఈ బోధను తెలియపర్చమని కోరి ప్రార్థించిన శిష్యునకు, గురుమూర్తి అనుమానము లేకుండగ అతి దయతో ఈ బోధను వినజెప్పనారంభించెను.

**విశేష భావము :** "తనకు దా వచ్చి" - శిష్యుడు తన పుణ్య విశేషముచే ఇట్టి సద్బోధను తెలుసుకొనవలెనను ఇచ్ఛ జనించి సద్గురు మూర్తిని వెదకి సంపాదించుకొని ఈ బోధను తెలియపర్చమని మ్రొక్కి వేడుకొనిన వానికే యీ బోధ తెలియపర్చవలెను. ఇచ్ఛ ఉన్నా లేక పోయినా పిలచి బోధ చేయరాదు. శిష్యుడు అనగా అవిద్య, అవిద్య తనకు దానే మూలము లేకుండగా వచ్చినది, అని విశేష భావము.

**అవతారిక :** గ్రంథము యొక్క సారమునంతయును సంక్షిప్తముగా ఈ పద్యములో తెలియపర్చుచున్నారు.

**28వ పద్యము : పరమ పురుషుడను, లేనిది । యెరుకయు గలదరసి, లేని యెరుకను విడుమం । చెరిగించిన, శిష్యుడు, గురు । వరునడిగెను మ్రొక్కి రెంటి వర్తనలపుడున్॥**

**పద విభాగము :** పరమ పురుషుడును, లేనిది యెరుకయు గలదు. అరసి, లేని యెరుకను విడుము అంచు యెరిగించిన, అపుడున్ శిష్యుడు గురు వరున్ మ్రొక్కి రెంటి వర్తనల్ అడిగెను ॥

**టీక :** పరమ పురుషుడు = పరిపూర్ణ బ్రహ్మము, అరసి = విచారించి తెలుసుకొని, మ్రొక్కి = నమస్కరించి, వర్తనలన్ = వృత్తాంతమును

**భావము :** శిష్యా! పరమ పురుషుడును (పరిపూర్ణ పరబ్రహ్మమును), లేని యెరుకయు గలవు, వాటిని చక్కగా విచారించి చూచి, లేని యెరుకను విడచి పెట్టుము. అని గురుమూర్తి చెప్పగా శిష్యుడు గురుమూర్తికి నమస్కరించి ఆ రెంటి యొక్క వృత్తాంతమును సవివరముగా తెలియపర్చమని కోరెను.

**విశేష భావము :** పరమ పురుషుడు అనగా ఇక్కడ పరబ్రహ్మము అని చెప్పవలెనే కాని క్షర, అక్షర అన్యయములకు పరమైన పురుషోత్తముడని అర్థము చెప్పరాదు. ఎందుచేతననగా పురుషోత్తముడు ఎరుకయే కనుక.



**29వ పద్యము : పరమ పురుషుడన వెవ్వడొ । యెరుకెట్టిదొ దెల్పి, యవల యెరుకను విడచే । తెర వెట్టిదో యున్నియు, నా । కెరిగించు మటంచు బల్కనిట్లనె గురుడున్॥**

**టీక :** తెరవు = మార్గము; విధానము

**భావము :** గురువర్యా! పరమ పురుషుడనగా ఎవరో, యెరుకనగా యేదో, సవివరముగా తెలియపర్చి, ఆ తరువాత ఆ లేని యెరుకను విడచే విధానము ఎట్టిదో ఇవన్నియు నాకు ఎరిగించుము స్వామీ । అని శిష్యుడు పల్కెను, అంత గురుమూర్తి యీ విధముగా చెప్పెను.



**30వ పద్యము : నే పెద్దలచే విన్నది । నీ పై దయ బుట్టి చెప్పవే బూనితి, నీ॥ కా పద్ధతి, వంతయు విని । యే పద్ధతి కాశపడకు మిది విడువకుమీ ॥**

**పద విభాగము :** నే పెద్దలచే విన్నది; నీకు ఆ పద్ధతిని అంతయు, నీ పై దయ బుట్టి చెప్పబూనితి, విని, యే పద్ధతికి ఆశపడకుము, ఇది విడువకుమీ ॥

**టీక :** పద్ధతి = విధానము (బోధ), ఏపద్ధతికి = ఏ ఇతర బోధలకు.

**భావము :** శిష్యా! నీ పై దయ బుట్టి, నే పెద్దల ద్వారా (గురుముఖతా) విని గ్రహించిన బోధనంతయు, ఇప్పుడు నీకు చెప్పపూనితిని. ఈ బోధ విని, మరి యే ఇతర బోధలకు ఆశపడకుము. ఈ బోధను ఎంతమాత్రము విడిచి పెట్టకుము.

---

**అవతారిక :** పరిపూర్ణ బోధ ఈ పద్యము నుండి ప్రారంభమగుచున్నది.

**31వ పద్యము : కదలడట పరమ పురుషుడు । కదలిక మాయ యట, యిట్టి కదలిక కేదో॥ మొదలన పెద్దలు బల్కిరి । కదలనిదే కలదు, లేదు కదలిక యనుచున్॥**

**భావము :** పరమ పురుషుడు (పరిపూర్ణ బ్రహ్మము) కదలదు, చలించదు, చలించే సమస్తము మాయ, ప్రకృతి యని పేరు. చలించే మాయకు మూలమేమియు లేదనియు, కదలిక లేని పరిపూర్ణమె, శాశ్వతమైనది అనియు, కదలే సమస్తము లేనిది అనియు, పెద్దలు చెప్పిరి.

**విశేష భావము :** పరమ పురుషుడు అనగా పరిపూర్ణ బ్రహ్మము, దీని యందు కదలిక లేదు. అనగా ఒక దానిని కదలించదు, తాను కదలదు. పరిపూర్ణము కదులుటకు వెల్తి లేక సర్వత్రా నిండి యుండుటచే కదలదు. కదలించే సత్తా లేనిది కనుక కదలించదు. కదలుట అంటే చలించుట, చైతన్యము అని కూడా భావము. పరిపూర్ణము, చైతన్యము లేనిది. అనగా కదిలించే సత్తా లేనిది అని భావము. అంతేకాని అచేతనమైనది అని భావము కాదు. చేతన, అచేతనములకు అతీతమైనది.

---

**అవతారిక :** బ్రహ్మము తనయందలి మాయా శక్తిచే సృష్టిక్రియ జరిపించుచున్నాడు అను వాక్యమును ఈ పద్యములో ఖండించుచున్నారు.

**32వ పద్యము : పురుగుక్కు స్తంభమును । కొరకిన దన, వీతి హోత్రు గొని మ్రింగె చెదల్ । ధరవనినను, మాయా సతి । హరిని చీకాకుగ యొనర్చెనన, వినదగునే ॥**

**దండాన్వయం :** ధరన్ పురుగు ఉక్కు స్తంభమును కొరికిన దన, చెదల్ వీతి హోత్రుగొని మ్రింగె ననినను, మాయా సతి హరిని చీకాకుగ యొనర్చెను అన వినదగునే ।

**టీక :** ధరన్ = భూమిపై, పురుగు = కీటకము, చెదల్ = చెద పురుగులు, వీతి హోత్రున్ గొని = అగ్నిని పట్టుకొని, మాయా సతి = మాయాదేవి (ప్రకృతి) హరిన్ = బ్రహ్మమును, చీకాకు యొనర్చెన్ = సంకల్పములను కలిగించెను, చలింపజేసెను.

**భావము :** శిష్యా! ఈ భూమిపై పురుగు ఉక్కు స్తంభమును కొరికినద నినను చెదలు అగ్రిహోత్రుని పట్టుకొని తిని వేసినదనినను, వినదగినవి కావు. అట్లే మాయా (ప్రకృతి) బ్రహ్మమునకు సంకల్పములు కలిగించినదనినను వినదగదు.

**విశేష భావము :** బ్రహ్మము తన యందలి మాయా శక్తి వలన ఇచ్ఛ జనించి "సో కామయతా! బహుస్యాం ప్రజాయతే" అని సృష్టి రచన సంకల్ప మాత్రముచే చేసెనని శృతులు చెప్పుచున్నవి. అయితే అట్లు సృష్టి చేసిన బ్రహ్మ అఖండ గురు స్వరూపము (అఖండ యెరుక) ఇది ఉపాధి సహితమైన బ్రహ్మ. పరిపూర్ణము యొక్క ప్రతిబింబము. ప్రతిబింబమునకు నిజమైన ఉనికి లేదు. కనుక ఈ సంప్రదాయములో ఇది లేని యెరుక అని నిర్వచించిరి. కనుక శృతి వాక్యము పరిపూర్ణ బ్రహ్మమునకు అన్వయించరాదని యీ పద్య భావము. పరిపూర్ణములో సంకల్పము లేదు. ఏ కార్యములు లేనిది, నిర్వికారమైనది అని తెలియవలెను.

---

**అవతారిక :** పరిపూర్ణ బ్రహ్మములో అఖండ యెరుక కలవలె తోచినది అని అనుట కంటే, అసలు లేనే లేదని చెప్పుటయే సరియైన సిద్ధాన్తముగా శివరామదీక్షితులు వారు భావించినట్లు ఈ పద్య భావన.

**33వ పద్** [illegible] **హరి యందు దోచు విశ్వము । నర స్వప్నము వంటి దనిరి నానా జనముల్** [illegible] **స్వప్నము వంటిది యనె । స్థిర మతి శివరామ నామ దీక్షితుల్ ధరన్॥**

**దంర** [illegible] **ము :** హరి యందు దోచు విశ్వము, ధరన్ నానా జనముల్ నర స్వప్నము వంటిది అనిరి. స్థిర మతి శివరామ నామ దీక్షితులు సురస్వప్నము వంటిదియనె॥

**టీక :** హరి యందు = పరిపూర్ణ బ్రహ్మమునందు, దోచు = లేనిదె యున్నట్లు కనిపించె, విశ్వము = జగదధిష్ఠానము (అఖండ యెరుక) నానా జనముల్ = నానా విధ శాస్త్రజ్ఞులు, స్థిరమతి = చలన రహిత బుద్ధి (కల్గిన) సుర స్వప్నము = దేవతల కల (అనగా లేదు అని అర్థము)

**భావము :** శిష్యా! పరిపూర్ణ పరబ్రహ్మములో తోచిన అఖండ యెరుక (మూల ప్రకృతి)ను మానవులకు స్వప్నము ఏలా మూలము లేకనే కల్గినదో అట్టి విధముగా ఏర్పడినది, అని నానా విధ శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. కాని స్థిర బుద్ధి కల శివరామదీక్షితుల వారు, ఆ ఎరుక దేవతల స్వప్నము వలె కలిగినది అన్నారు. దేవతలకు కన్నుమూయుట ఉండదు కనుక స్వప్నము ఉండదు, అనగా ఎరుక అసలు లేనే లేదని ఆరూఢ భావములో చెప్పిరి.

**విశేష భావము :** నర స్వప్నము, నరునకు కలిగిన కల. ఎరుక పరిపూర్ణ పరబ్రహ్మములో కలవలె కలిగినది అని అన్నచో, ఆ కల ఎవరికి కలిగినది? పరిపూర్ణమునకా? అలా అనరాదు. కనుక శివరామదీక్షితుల వారు నర స్వప్నము వలె కాదు, సురస్వప్నము వలె కలిగినది అన్నారు. అనగా దేవతలకు కలే లేదు. కనుక పరిపూర్ణములో ఎరుక పుట్టనే లేదు అని భావము. ఇది స్థిరమతుల భావము అనగా ఆరూఢ భావము. నర స్వప్నము వంటిది అనిన అది అభ్యాస భావము అని చెప్పవలెను. నర స్వప్నము అనగా నరులకు కల్గిన స్వప్నము అని కాకుండగ "స్వప్న" పద ప్రధానముగా అర్థము చెప్పవలెను. స్వప్నము ఏలా లేనిదే ఉన్నట్లు ఆ అవస్థలో గుర్తించినామో, అట్లే ఎరుక అజ్ఞాన అవస్థలో లేనిదే ఉన్నట్లు తోచుచున్నది. ఉన్నట్లు తోచినా విచారిస్తే లేనిది అని తెలియుచున్నది, అశాశ్వతమైనది.

**34వ పద్యము : సురలందు దోచు స్వప్నము । హరి యందు దోచు విశ్వ, మా సురల హరిన్ । యెరిగిన, కల విశ్వము, తా । మరుగవె తమ లేమి నెరిగి, యతి బిడియమునన్ ॥**

**దండాన్వయము :** ఆ సురల హరిన్ యెరిగిన, కల విశ్వము తమ లేమి నెరిగి, అతి బిడియమునన్ తామరుగవె ॥

**టీక :** సురలందు = దేవతలయందు, స్వప్నము = కల (జగత్తు) హరియందు = పరిపూర్ణమందు, విశ్వము = జగదదిష్ఠానము (అఖండ యెరుక) లేమిన్ = లేని విధమును, అతి బిడియమునన్ = ఎక్కువ సిగ్గు చేత, అరుగవె = లేకపోవును కదా!

**భావము :** శిష్యా! దేవతల వలన తోచిన సమస్త జగత్తున్ను, పరిపూర్ణ మందు తోచిన అఖండ యెరుకయున్ను, దేవతలను పరిపూర్ణమును చక్కగా విచారించినచో, జగత్తు జగదదిష్ఠానమైన అఖండ యెరుకయు తాము పరిపూర్ణములో ఎంతమాత్రము లేని విధమును గుర్తించి అతి సిగ్గుచే తాము లేకపోవును కదా !

**విశేష భావము :** సురలందు దోచు స్వప్నము - దేవతల వలన యీ జగత్తంతయు తోచుచున్నది. సంకల్ప మాత్రముచే సృష్టి జరుగుచున్నది అని శాస్త్ర వచనము. సంకల్ప సృష్టి కనుక ఈ పద్యములో "సురలందు దోచు స్వప్నము" అని చెప్పిరి. స్వప్నము అనగా జగత్తు అని భావము చెప్పవలెను.

---

**35వ పద్యము : కదలనిది కదలదెన్నడు । కదలిక గలదనిన దాని కగుపడదు మొదల్ । కదలిక లేదది, గావున । యిది పరమ రహస్య । మెవ్వరెరుగరు దీనిన్ ॥**

**టీక :** కదలిక = చలనము, చైతన్యము, సంకల్పము, మొదల్ = మూలము.

**భావము :** శిష్యా! చలించనిది ఎన్నడూ చలించదు, చలనము కలిగినది అని చెప్పబడే దానికి మూలము లేదు. అనగా లేనిది. అది (పరిపూర్ణము), చలనము (సంకల్పము, ఎరుక) లేనిది. కావున ఈ పరిపూర్ణమును ఎవ్వరు ఎరుగరు, అతి రహస్యమయినది.

**విశేష భావము :** "కదలుట" అనగా తనకు తాను చలించినా, ఇతరముచే చలించబడినా, ఇతరమును చెలింపజేసినా అది చలనమే, కదిలేదే చైతన్యమే. కదలనిది

అనగా ఏ విధముగాను చలించనిది, కదలుటకు వెల్తి లేక సర్వవ్యాప్తమయినది, అనియు, సంకల్పము (ఎరుక) లేనిది అని అర్థము. ఎరుక ఉన్నచో ఆ వస్తువు ఇతరమును తెలిసికొనును. మరియు ఇతరముచే తెలియబడును ఎరుక లేనిది పరిపూర్ణము కనుక దీనిని ఎవ్వరూ గుర్తించలేరు.



**36వ పద్యము : కదలనిది కదిలెనన్నను । ముదమున వినదగదు వారి ముచ్చట వెపుడున్ । కదలిన, కదలని దెట్లగు । నది గావున, కదల దనుచు నమ్మదగు జామీ॥**

**భావము :** శిష్యా! కదలని - చలించని, సంకల్పము లేని పరిపూర్ణము. సంకల్ప మాత్రముచే సృష్టి చేయబడినది అని చెప్పే వారి మాటలు ఎప్పుడునూ నమ్మరాదు. అలా సంకల్పించినచో, బ్రహ్మము సంకల్పము లేనిది అని ఎట్లు చెప్పగలము? కావున పరిపూర్ణ బ్రహ్మము చలించనిది, కదలనిది, సంకల్పము (ఎరుక) లేనిది, అని గుర్తించమని పద్య భావము.



**అవతారిక :** పరిపూర్ణమొకటి తప్ప ఇతరమంతయు ప్రకృతి స్వరూపమే, కనుకనే కృష్ణ దేశికులు పరిపూర్ణమును "పరమ పురుషుడు" అన్నారు.

**37వ పద్యము : నిను మేమను ప్రకృతి ద్వయ । మని, నిను నీ మేను మృషని మానిరినీ జో । లిని పెద్దలు, నీ వెరుగక । నిను నీవొక కొండనంటే నిజమా మాటా॥**

**పద విభాగము :** నిను, మేనును - ప్రకృతి ద్వయమని, నిను - నీ మేను మృషని, పెద్దలు నీ జోలిని మానిరి । (అది) నీ వెరుంగక, నిను నీ వొక కొండను అంటే - నిజమా? ఆ మాట ।

**టీక :** ప్రకృతి ద్వయము = పరాప్రకృతి, అపరాప్రకృతి అని ఒక్కటే ప్రకృతి రెండు భిన్న రూపములు, మృషని = లేనిది అని, జోలిని = సాంగత్యమును, కొండను అంటే = అచలమును అంటే - బ్రహ్మమును అని అంటే

**భావము :** శిష్యా! నేను - మేను ఈ రెండు ప్రకృతి రూపములే, బ్రహ్మము కాదు. కనుక నేను మేనులు రెండును మృష - మిథ్యయే కనుకనే పెద్దలైన వారు, నేను -

మేనుల సాంగత్యమును విడచిరి. అది నీవు ఎరుకగ నీవు "నేను బ్రహ్మను" అని భావించినంత మాత్రమున అది బ్రహ్మము అగునా? (కాదు ప్రకృతియే)

**విశేష భావము :** అజ్ఞానమును విడచి జ్ఞానమును గ్రహించుటకు మొదటి మెట్టుగా మేను అనగా శరీరము, అనాత్మయనియు, శరీరమనే పుర మందు అను ప్రవేశమైన చైతన్యమునకు "నేను" - ఆత్మ, పురుషుడని చెప్పుదురు. ఆ వాక్యముచే సాధకునకు అభ్యాసములో శరీరము అశాశ్వతమైనదనియు, శరీరమందున్న నేను అను చైతన్యము శాశ్వతమైనదని గుర్తించి, శరీర భ్రాంతిని విడచుటకు ఉపకరించును. ఆ తరువాత బోధ పై స్థాయికి పోయినప్పుడు "నేను" అను చైతన్యము కూడా పురుషుడు కాడనియు, శరీరమును ఆధారముగ జేసికొని ప్రకాశించువాడు కనుక ఆ నేను కూడా ప్రకృతియే యనియు, ఇట్టి "నేను"కు అతీతమైన పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే శాశ్వతమైనది నిర్వికారమైనది అని తెలియజేసి, శరీరము, అందలి చైతన్యమైన "నేను" రెండును లేనివే అని క్రమ పద్ధతిగా బోధించెదరు. మరియు శరీరము అనగా ఇచ్చట స్థూలము కాదు "అవిద్య" అను ఉపాధియే కారణ శరీరము. దీనికే మేను అని పేరు. ఇదే ప్రకృతి, ఇందు ప్రతిబింబించిన చైతన్యము కూడా స్వత్ససిద్ధమైన ఉనికి లేనందున, ఇది కూడా పురుషుడు శాశ్వతుడు కాడనియు, ఇది కూడ ప్రకృతియే యనియు, అవిద్య - అపరాప్రకృతి, అందలి ప్రతిబింబము పరాప్రకృతియని నిరూపించి, ఈ రెంటికి ఆవల ఉన్న, ఈ మేను-నేనులు కాని పరిపూర్ణమే బ్రహ్మము, శాశ్వతమైనదని చెప్పి, దీనినే పరమ పురుషుడు అని పై పద్యములో నిర్ణయించి చెప్పిరి.

---

**అవతారిక :** బ్రహ్మము నామ, రూప, క్రియా రహితమైనది అని చెప్పుచున్నారు.

**38వ పద్యము : పేరచలమనుచు, బయలని । పేరెప్పుడు లేని, మనము బెట్టుట చేతన్ । పేరాయ బయలుకిప్పుడు । పోరా నివు నేను మృషని పోతే జాలున్ ।**

**దండాన్వయము :** ఎప్పుడు పేరు లేని బయలుకు అచల మనుచు, బయలని ఇప్పుడు మనము పేరు పెట్టుట చేత పేరు ఆయె । నివు నేను మృషని పోరా । పోతే చాలున్॥

**భావము :** నామ రూపములు ఎంత మాత్రము లేని పరిపూర్ణమునకు అచలమని, బయలని, పరిపూర్ణమని ఇప్పుడు మనము పేరు పెట్టుటచేతనే దానికి పేరు కలిగినది.

ఇప్పుడు నీవు - నేను పోతే చాలును (ఉన్నది పరిపూర్ణమే)

**విశేష భావము :** బ్రహ్మమునకు పేరు ఏ కాలమందున లేదు, శిష్య అవగాహన నిమిత్తము, గురుమూర్తి పరిపూర్ణ బ్రహ్మమును శిష్యునికి తెలియజేసి ధృడపరిచే నిమిత్తమై అచలమని, బయలని కల్పిత నామములతో వ్యవహరించిరి. కనుక బ్రహ్మమునకు పేరు లేదు.

"నివు - నేను పోరా : మృషని పోతే జాలున్" - నేను అనగా ప్రతిబింబ చైతన్యము, "నివు" అనగా నేనుకు ఉపాధి అయిన అంతఃకరణమనే మేను, మేను వలన నేను, నేను వలన మేను ఉనికి పొంది, లేని సమస్త జగత్తును కల్పించుచున్నది. కనుక ఈ మేను - నేనులు రెండు మృష, మిధ్య అని విచారంచి చూచి, గురు కరుణచే ఉపాధి అయిన మేనును రహితపర్చుకొనినచో, ప్రతిబింబము ఉపాధి లేనిదే ఉండదు. కనుక మేను - నేను రెండును లేకపోవును. అట్లు ఆ రెండు లేకపోతే చాలును. అంటే గుర్తెరిగేదే లేదు. తిరిగి వచ్చేది లేదు. ఇదే జన్మ రహితము, చాలును. నీవు ధన్యత పొందితివి అని భావము.

---

**39వ పద్యము : పరమ పురుషుడీ బయలని । గురుడెరిగించునను జూచి, గొప్పకు రుచలై । యెరిగెటి నిను, నే మృషనని । యెరిగరుగుము, నీవె మాయ, విక బుట్టవిలన్॥**

**దండాన్వయము :** పరమ పురుషుడు ఈ బయలు, గొప్ప కురచలై యెరిగెటి నిను, నీవె మాయవు అని గురుడు ఎరిగించినను జూచి, నే మృషనని యెరిగి అరుగుము. ఇలన్ ఇక బుట్టవు.

**టీక :** పరమ పురుషుడు = పరిపూర్ణ బ్రహ్మము, గొప్ప కురుచలై = మహత్తుకన్న మహత్తు గాను, అణువు కన్న అణువుగాను, మృషనని = మాయ లేనిది అని.

**భావము :** పరిపూర్ణ బ్రహ్మము ఈ బయలే అనియు, అణువు కన్న అణు స్వరూపము, మహత్తు కన్నా మహత్తు అయినది నేను అని తెలుసుకొనే నీవు మాయవు. బ్రహ్మము కాదు, అని గురుమూర్తి తెలియజేసిన, విచారించి నేను అను చైతన్యము నీవు అను అవిద్యోపాధి ఈ రెండు లేనివే, అని తెలుసికొని లేకుండా పోవలెను. అట్లు "నేను" లేకపోయినచో యిక భూమిపై తిరిగి జన్మకు రావు.

**విశేష భావము :** "అణో రణీయాన్, మహతో మహీయాన్" సమస్త జీవులందు చిన్నవాటి యందు ఉపాధి కన్నా చిన్నది గాను, ఈ సమస్త బ్రహ్మాండము దాని గర్భమందే ఉండుటచే మహతో మహీయాన్ గాను ఎరుక ఉన్నది. రెండు రూపములు దానివే. ఇది మాయయే కాని బ్రహ్మము కాదు. అనేక కోటి బ్రహ్మాండ జననీ - అని లలితా సహస్రం, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకా" అని గురు వాక్యము. గొప్పది చిన్నది కానిది బ్రహ్మము, "ఇంతింతని యనరానిది" పరిపూర్ణ బ్రహ్మము. ఇది తప్ప మరేదియు లేదు. మిగిలినదంతయు మాయ స్వరూపమే అని తెలిసి అట్లు ఎరిగిన ఎరుకను విడువవలెను.



**అవతారిక :** "అయమాత్మ బ్రహ్మ" అను మహా వాక్య రీతిగ పరిపూర్ణ బ్రహ్మమును "అయం" అను శబ్దముచే నిర్ణయించ తగినది కాదని చెప్పుచున్నారు, అది అభ్యాసఅర్థమే అగును.

**40వ పద్యము : అయమాత్మ యనిన రీతిగ । నయముగ యీ బట్ట బయలు నదుగో యనుటల్ । అయమియ మని యనుటుళ్ళక్కి యయిన ననవలసె నీదు కీడుడుగుటకై ॥**

**భావము :** "అయమాత్మ బ్రహ్మ" అను మహావాక్యరీతిగ, ఈ ఉత్తర బట్ట బయలు" అని పరిపూర్ణ బ్రహ్మమును "ఈ" "ఆ" అని నిర్దేశించి చూప వీలుకానిది, అయినను శిష్య అవగాహన నిమిత్తమై ఈ ఉత్త బట్టబయలు ఇదిగో అని చూపించుట, శిష్యుడు గ్రహించి తాను లేకపోయే విధానమును గుర్తించుటకై అట్లు చెప్పితిరి.

**విశేష భావము :** పరిపూర్ణ పరబ్రహ్మము మలుగ్రుచ్చ సందు లేక సర్వత్ర నిండియున్నది. కనుక "ఇదిగో" "అదిగో" అని చెప్ప వీలుకానిది. అయినను శిష్యునికి అర్థమయే నిమిత్తమై "పరిపూర్ణము ఇదగో చూడు" అని చెప్పుట కలదు. అయం, ఇయం అనుట ఉళ్లక్కి, అదిగో, ఇదిగో అని చెప్పినపుడు - చెప్పేవాడు, చెప్పబడేది, చూచేవాడు, మూడు ఉన్నవి. కాని పరిపూర్ణములో జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయయము అనే త్రిపుటి రహితము. చెప్పబడేది, చూడబడేది కాదు. అవగాహన నిమిత్తమై చెప్పబడుచున్నది. మరియు "అయమాత్మ బ్రహ్మ" యొక్క భాష్య రీత్యా - అయం అనగా - ఘటాదుల వలె ప్రత్యక్షము కాదనియు, స్వర్గాదుల వలె యెన్నటికి కనిపించేది కాదు అని

భాష్యము. పరిపూర్ణ బ్రహ్మము "అయం" చేత చెప్పుటచే ఎదురుగా ప్రత్యక్షమే, కాని చూచేది కాదు సుమా అని గ్రహించవలెను.

**అవతారిక :** కారణ కార్యములు, ఆధార ఆధేయములు మొదలగు త్రిపుటి, ద్వంద్వ రహితమైనదిన 41, 42, 43 పద్యములు చెప్పుచున్నారు.

**41వ పద్యము : లేని నే నీవు లేని । స్థానంబును కారణంబు, సర్వమున కధి ।ష్ఠానంబు, సాక్షి సత్య । జ్ఞానానందంబు, లనిన సత్యములగునే ॥**

**టీక :** లేని నే నీవు = లేని ఆత్మ జగత్తులు, లేని స్థానమును (పరిపూర్ణ బ్రహ్మమును)

**భావము :** శిష్యా! లేని ఆత్మ జగుత్తలు లేని స్థానమయిన పరిపూర్ణ పరబ్రహ్మమును, ఆత్మ - జగుత్తల కధిష్ఠానము, కారణమయినది సమస్తమునకు సాక్షీమాత్రమయినది, సత్య, జ్ఞానానంద స్వరూపము అని చెప్పిన మాటలు సత్యమగునా?

**విశేష భావము :** పరిపూర్ణ పరబ్రహ్మము - ఆత్మ -జగత్తులు నేను - మేనులు ఇట్టి ద్వంద్వ రూపమయిన ఎరుక లేని స్థానము, అందుచే నేను - మేనులు రెండును లేనివే. కనుక లేనినే - నీవు లేని స్థానము అని పద్యములో చెప్పిరి. అనగా పరిపూర్ణ పరబ్రహ్మము అని అర్థము. అట్టి లేని ఆత్మ జగత్తులకు పరిపూర్ణము కారణము కాదు. అధిష్ఠానము కాదు, సర్వ సాక్షియున్ను కాదు, ఆత్మ జగత్తులకు కారణము, అధిష్ఠానము, సాక్షి అయినది అఖండ యెరుకయే, యెరుకకు యెరుకే మూలము అధిష్ఠానము అని పద్య భావము. సత్యము, జ్ఞానము, ఆనందము కానిది పరిపూర్ణము అని పద్య భావము. శాస్త్రములో సత్యజ్ఞానానందమయినది బ్రహ్మము అన్నారు. ఆ భాష్యములో శాశ్వతమైనది కనుక - సత్యము, జ్ఞాన అజ్ఞానములకతీతమైనది కనుక జ్ఞాన అజ్ఞానములు కాని కేవల జ్ఞానము అనియు, అనుభవమునకందని కేవల ఆనందమనియు చెప్పిరి. ఇది అనుభవించుటకు వీలు కానిది కనుక సత్యజ్ఞానాంద పదము అనుభవైక వేద్యమయిన ఎరుకకు చెల్లును అనే భావముతో ఈ పద్యము చెప్పబడినది.

**42వ పద్యము : అట్టిది యిట్టిది యనరా । నట్టిది బయలనుచు దెలసి, యా మీదట, నీ । నట్టిది యిట్టిది యనరా । నట్టిది బయలనిన దాని నరయకు మెపుడున్॥**

**పద విభాగము :** అట్టిది, యిట్టిది అనరానట్టిది బయలు అనుచు దెలసి । ఆ మీదట, నీవు అట్టిది ఇట్టిది యనరానట్టిది బయలు అనిన దానిని అరయకుము ఎపుడున్ ॥

**టీక :** అనిన దానిని = అని తెలుసకున్న యెరుకను, అరయకుము = చూడకుము (విడిచిపెట్టుము)

**భావము :** పరిపూర్ణ బ్రహ్మము ఇట్టి లక్షణములు కలిగినది అని యెంత మాత్రము చెప్ప వీలుకానిది అని ధృడముగా తెలుసుకొనుము. అటువంటిది అని తెలుసుకొన్న ఎరుకను పూర్తిగా విడచిపెట్టుము.

**విశేష భావము :** "నిర్దేశ రహితం నిత్యం బాహ్య బ్రహ్మేతి నిశ్చయః" అన్నా రు. కనుక పరిపూర్ణము ఇట్టిది అని నిర్దేశించుటకు వీలు కానిది "ఎందుచేతననగా పరిపూర్ణములో ఎరుక లేదు కనుక. ఎరుక ఉన్న దాన్నే ఇట్టిది అని ఎరుక నిర్దేశించగలదు. పరిపూర్ణము ఇట్టిది అని తెలిసికొనతగినది కాదు అని ఎరుక గుర్తించినది. పరిపూర్ణము ఎట్టిదో ఎరుగ వీలుకానిది అని తెలుసుకొన్న ఎరుకను విడుచుటయే పరిపూర్ణ స్థితి, పరిపూర్ణములో ఎరుక లేదు. కనుకనే శృతియును "యత్రనాన్యత్ పశ్యతి, నాన్యత్ శృణోతి, నాన్యత్ విజానాతి - సభూమ" అని చెప్పబడినది.

**43వ పద్యము : అది యిది యంచన రా । నిది, బయలని తెలసి, నీవు, యిది యది యనరా । నిది బయలని తెలిసిన నిను । వదలియుండుము లేనటంచు వరుగుణవంతా॥**

**భావము (42వ పద్యము వలె)** శిష్యా! అది యిది అని నిర్దేశించరానిది పరిపూర్ణము అని ధృడముగా తెలుసుకొని, ఆ తరువాత అది యిది యని నిర్దేశించ వీలు కానిది పరిపూర్ణము అని తెలుసుకొనినది (ఎరుకను)। అది పరిపూర్ణములో లేదని దానిని విడువుము.

**44వ పద్యము : కల, నీకు జగము కంతతట । గల బయలుకు కలిగియున్న ఘనమగు తిప్పల్ । కలయగని, మేలుకొని యా । కల వలె మేలుకను జూచి కదులు ముళ్లక్కీ॥**

**పద విభాగము :** "కల" నీకు జగముకు, అంతట గల బయలుకు కలిగియున్న ఘనమగు తిప్పల్ (తప్పవు) । కలయగని, మేలుకని ఆ కల వలె మేలుకను జూచి కదులుము । ఉళ్లక్కీ ॥

**టీక :** ఉళ్లక్కీ ఓ లేనివాడా ! కల = భ్రమ, పుట్టుక, ఘనమగు తిప్పల్ = గొప్పవైన బాధలు (జనన మరణములు) తప్పవు, అని అన్యాపదేశ పదము, కలయగని= విచారించి, మేలుకని = పుట్టుక ఎవరికి ఉన్నదో విచారించి తెలుసుకొని, ఆ కల వలె = ఆ సామాన్యమైన స్వప్నము వలె మేలుకను జూచి = పరిపూర్ణమును జూచి, కదలుము = లేకుండా పొమ్ము.

**భావము :** ఓ లేనివాడా! శిష్యా! కల (ఎరుక) నీకు, జగత్తుకు అంతట ఉన్న పరిపూర్ణమునకు ఉన్నచో, చావు పుట్టుకలు తప్పవు. ఇప్పుడు ఎరుక (కల) యెవరికి కలదో విచారించి చూడుము. విచారించినచో, నీకు, జగత్తుకు మాత్రమే ఎరుక కలదు. బయలుకు ఎరుక లేదు, అని తెలిసికొనుటయే మేల్కొ. కనుక స్వప్నము జాగ్రత్త (మేల్కొ) యందు ఎట్లు లేకపోవుచున్నదో, ఆ విధముగా నీకు (ఎరుకకు) మేల్కొ అయిన పరిపూర్ణమును జూచి నీవు లేకుండా పొమ్ము ॥

**విశేష భావము :** ఈ పద్యములో "కల" అను పదమునకు "ఎరుక" అని అర్థము చెప్పవలెను. మరియు అర్థ సమన్వయమునకై "ఘనమగు తిప్పల్ (తప్పవు) అన్న పదమును అన్యాపదేశముగా తీసుకోవలెను. అనగా ఎరుక ఎవరికి కలదో వారికి జనన మరణములు తప్పవు అని అర్థ సమన్వయము చేసుకోవలెను. కనుక ఎరుక ఎవరికి ఉన్నది అని విచారించినచో, నీకు జగమునకు కలదు. అంతట గల బయలుకు ఎరుక లేదు అని విచారించినచో తెలిసినది. ఇట్లు తెలిసికొనుటయే "మేలు కని" అని అర్థము. అంతట నిండియున్న పరిపూర్ణము శాశ్వతమైనది. అందులో "ఎరుక" లేక తోచినది, విచారించగా "లేనిది" అని తెలుసుకొనుటయే మేలుకొనుట. అట్లు మేలుకొని లేకుండా పొమ్ము అని శిష్యునికి బోధ చేసెను. శిష్యుని "ఉళ్లక్కీ" అని సంబోధించెను. అనగా లేనివాడా! అని సంబోధించినట్లు గ్రహించవలెను.

**45వ పద్యము : కల నేన్గ సింహమును క । న్నుల గన మృతి జెందినట్లు యుళ్లక్కగు, నీ । వల గురుకృపచే బయలున్ । తెల నూరికె యుంటివేని తీరును మాటా ॥**

**దండాన్వయము :** కలన్ ఏన్గ సింహమును కన్నుల గన మృతి జెందినట్లు; నీవు అల గురుకృపచే బయలున్ తెలసి ఊరక యుంటివేని, మాటా ఉళ్లక్కగు, తీరును ॥

**టీక :** కలన్ = స్వప్నమందు, ఏన్గ = ఏనుగు, అల గురుకృపచే ఆ దివ్య గురు కృపచే, ఊరికె యుంటివేని = నేను లేనని తెలసి ఏమీ అనలేకపోతే, మాటా = ఓ యెరుకా ! ఉళ్లక్కగు = లేకుండా పోవును, తీరును = ఇంతటితో సరిపోవును.

**భావము :** ఏనుగు తన స్వప్నములో సింహమును కండ్లారా చూసినచో, ఏనుగు మృతి చెందును. ఆ విధముగా నీవు ఆ దివ్య గురుకరుణచే పరిపూర్ణమును విచారించి చూచితివేని, ఓ యెరుకా నీవు లేకుండా పోదువు, అంతటితో అన్నియు తీరును.

**విశేష భావము :** ఏనుగు స్వప్నములో సింహమును చూడగానే, మృతి చెందును. అనగా సింహము ఏనుగును ఏమీ చేయకనే ఏనుగు చనిపోవుచున్నది. సింహమునకు కర్తృత్వము లేదు. అట్లే దివ్య గురుమూర్తి (తనలో ఉన్న గురుమూర్తి) కరుణచే ఎరుక పరిపూర్ణమును విచారించి చూచి, పరిపూర్ణములో తాను లేనని తెలసి "ఊరకయుంటివేని" అనగా అది ఉన్నది, నేను లేను అనే సంకల్పము లేకుండగ ఉన్నచో ఎరుక లేకపోవును. ఇందులో చెప్పిన యుక్తి ప్రకారము ఎరుక లేకపోవుటకు పరిపూర్ణము ఎంత మాత్రము కర్త కాదు. కర్తృత్వము లేనిది పరిపూర్ణము అని గుర్తించవలెను. "తీరును" అనగా సమస్త కర్మలతో నిండియున్న జనన మరణ పరంపర లేకపోవును అని భావము.

---

**46వ పద్యము : ఎప్పటికి యొక్క రీతిగ । తప్పక నిలచున్న దాన్ని దయతో గురుడున్ । చెప్పిన గని, యగణితమగు । తిప్పలు గల నిన్ను నీవు తీసితె సరిరా ॥**

**టీక :** ఎప్పటికి = సర్వకాలము, ఒక్క రీతిగ = మార్పు లేకుండగ, తప్పక నిలచున్న దాన్ని = శాశ్వతముగ ఉన్న పరిపూర్ణ పరబ్రహ్మమును, గని = విచారించి చూచి, అగణితమగు = లెక్కలేనన్ని, తిప్పలు గల = జనన మరణములు గలిగిన, నిన్ను = ఎరుకను దీసి = తె సరిరా = లేకుండా జేసితె సరి పోవును.

**భావము :** శిష్యా! సర్వకాల సర్వావస్థలయందు ఒకే రీతిగ ఏ వికారములు లేకుండగ శాశ్వతముగ ఉన్న పరిపూర్ణ పరబ్రహ్మమును గురుమూర్తి దయతో తెలియపర్చినచో, దానిని చక్కగా విచారించి చూచి, లెక్కలేనన్ని జనన మరణములతో కూడిన (నిన్ను) ఎరుకను, లేనని నీకు నీవే లేకపోయినచో సరిపోవును. అనగా ఎరుక లేకపోయినచో ఇక జన్మకు రావు అని భావము.

**విశేష భావము :** "గురుడున్ దయతో చెప్పిన గని" పరిపూర్ణ పరబ్రహ్మమును గురుమూర్తి శిష్య వాత్సల్యములతో చూపించగా మాత్రమే తెలియబడును. శిష్యుడు చూడగలడు. (ఇది రహస్యము. గురుముఖతా మాత్రమే తెలియవలెను, వ్రాసేది కాదు) అంతే కాని ఏ శాస్త్రముల చేతను బ్రహ్మమును చూడలేరు. చూడబడేది కాదు, అందుకే "శాస్త్ర కోటి శతైరపి । దుర్లభా చిత్త విశ్రాన్తిః । వినా గురుకృపా పరాం" అన్నారు.

---

**47వ పద్యము : నీవున్న చోట మందును । నీ వివిధ విచిత్ర జగము నీతో గూడన్। నీవు లేనట్టి చోటను । నీ వివిధ విచిత్ర జగము నిలువదు కుర్రా ॥**

**టీక :** నీ వున్నచోట = ఎరుక ఉన్న స్థానము నందు.

**భావము :** శిష్యా! నీవు ఉన్న చోటనే యీ వివిధ విచిత్ర జగుత్త అంతయు ఉన్నది. ఇట్టి జగత్తు నీవు లేని స్థానమునందు (పరిపూర్ణము నందు) ఎంత మాత్రము లేదని తెలసికొనుము.

**విశేష భావము :** జగత్తు నా నుండే ఏర్పడుచున్నది. నేనే జగత్తుకు మూలము. కనుక "నేను" లేకపోయినచో జనించుట, గతించుట అనే జగత్తు లేదు అని భావము.

2) నేను (నీవు) అనగా ఎరుక. ఎరుక వల్లనే జగత్తంతయు ఏర్పడుచున్నది. పరిపూర్ణము జగత్తునకు కారణము, ఆధారము కాదు. ఎరుక లేనిది - పరిపూర్ణము, ఎరుక లేని స్థానము నందు అనగా పరిపూర్ణము నందు జనించుట గతించుట అనే చిత్ర విచిత్రములు లేవని భావము.

3) నేను పరిపూర్ణ బ్రహ్మమును చూచినచో నేను లేకపోవును. అదే జనన మరణ రహిత స్థితి.

---

**48వ పద్యము : నానా వికారములు గల । నానా విధనామ రూప నటనలు గల యీ । నీ నా దశదిశలును గల । దీనందే లేక మనము తిరుగుట మప్పా ॥**

**భావము :** ఓ తండ్రీ ! అనేక రకములు మార్పులు గలిగి, అనేకమైన నామములు, రూపములు, క్రియలు గలిగిన యీ ఎరుక జగత్తులకు, దశ దిశల యందు శాశ్వతమై ఉన్న పరిపూర్ణ బ్రహ్మము నందే మనమందరము లేక తిరుగుచున్నాము.

**విశేష భావము :** నీ - నా అనగా నీ అనగా నీవు (జగత్తు), నా అనగా నేను - ఆత్మ, అనగా జీవాత్మ. అనగా జగత్తు ఆత్మలకు దశ దిశలా అనగా సర్వత్రా మిలుగుచ్చు సందు లేకుండగ శాశ్వతముగ ఉన్నది పరిపూర్ణము ఒక్కటే. ఇక రెండవది ఏదియును లేదు. అభ్యాస రూపములు మాత్రమే. అట్టిచో ఎరుక జగత్తులు ఎక్కడ ఉన్నవి? పరిపూర్ణములో లేవు, అనగా పరిపూర్ణము తప్ప మరేదియును లేదని సిద్ధాన్తము. కనుకనే పరిపూర్ణములో మనము లేక తిరుగుచున్నాము అని ఈ పద్యములో చెప్పిరి. ఆత్మ - జగత్తులు లేక ఉన్నవి. ఉన్నట్లు కనిపించేవే కాని విచారిస్తే లేవు. అజ్ఞాన దృష్టి గోచరమే కాని జ్ఞాన దృష్టిలో లేవు.

---

**49వ పద్యము : అబ్బీ యీ బయలున్నది । దబ్బున గురుడెరుక జేయ దబ్బరననుచున్ । దెబ్బకు మాయము గాకను । కబ్బము చెప్పుటకు నిల్వ గలవే నీవున్ ।**

**దండాన్వయము :** అబ్బీ! యీ బయలున్నది । నీవున్ దబ్బర ననుచున్, గురుడు దబ్బున నెరుక జేయ, దెబ్బకు మాయము గాకను । కబ్బము చెప్పుటకు నిల్వ గలవే।

**టీక :** అబ్బీ! = తండ్రీ!, దబ్బర = మోసము, దబ్బున = శీఘ్రముగా, దెబ్బకు వెంటనే, కబ్బము = కావ్యము (ఇక్కడ కథ అని భావము)

**భావము :** తండ్రీ! ఈ ఉత్తబయలైన పరిపూర్ణమే ఉన్నది. నీవు (ఎరుక) మోసమైనదే. అనగా లేనిదె ఉన్నట్లు తోచబడునదే అని సద్గురుమూర్తి శీఘ్రముగా తెలియజెప్పగా, వెంటనే ఎరుక మాయమై పోవును. అట్లు కాక ఇంకను కధలు చెప్పుటకు నిలవబడునా? లేకపోవును అని భావము.

---

**50వ పద్యము : మూలము లేకనె వచ్చిన । నీ లీలలు జూచుకొని నీవె మురుతు; పీ, బైలున్నదనుచు దోచితె । నీ లేమిని నీ వెరింగి నిలువవు కుర్రా ॥**

**టీక :** లీలలు = క్రియలు, పనులు, మురుతువు = గర్వింతువు; లేమిని = లేనితనము.

**భావము :** కుమారా! నీవు (ఎరుక) మూలము లేకుండగ తనకు తానుగానే వచ్చి, ఎన్నో చిత్ర విచిత్ర కార్యములు జేసి, ఆపనులు చూచి, తానే గర్వించి తిరుగును. అట్టి నీవు (ఎరుక) పరిపూర్ణమే ఉన్నదని రూఢిగ తెలుసుకొన్నచో, నీవు లేవని తెలసి ఒక్క క్షణమైనను నిలువక లేకపోదువు.



**51వ పద్యము : జ్ఞాన కర్మ స్వరూపము । గాని బయల్ వదిగో చూచి, కలకాలము యీ । జ్ఞాన కర్మ స్వరూపం । బౌనిమ నీ వెరిగి మృష నీవని వినవోయీ॥**

**దండాన్వయం :** నీవు కలకాలము జ్ఞాన కర్మ స్వరూపముగాని బయలున్ అదిగో చూచి, యీ జ్ఞాన కర్మ స్వరూపంబౌనినిను, నీవు మృషని ఎరిగి । వినవోయీ ॥

**భావము :** ఓ శిష్యా! వినుము, జ్ఞాన కర్మ స్వరూపములు గానిది. యీ పరిపూర్ణము శాశ్వతమైనది అని నీవు విచారించి చూచి తెలుసుకొని, జ్ఞాన కర్మ స్వరూపమైన నిను (ఎరుక) మృష (లేనిది) అని నీవు తెలుసుకొనుము.

**విశేష భావము :** జ్ఞానము + కర్మము. ఇదే శక్తిద్వయము. జ్ఞానశక్తి, క్రియాశక్తి. ఈ రెండే మనః + ప్రాణములు, రస + బలము, పురుష + ప్రకృతి, నేను + మేను, అయిన ద్వంద్వ రూపమయిన ఎరుక. యీ రెంటి కలయికయే యెరుక. అంతః కరణము లేక అవిద్య కర్మ స్వరూపము ఇదే సమస్త సృష్టి స్థితి, నాశములను సమస్త కర్మలను శరీరము అనే ఉపకరణము ద్వారా చేయుచున్నది. కనుక కర్మ స్వరూపము, అవిద్య యందలి ప్రతిబింబము, జ్ఞాన స్వరూపము. ఇది సత్తామాత్రము, అవిద్య సమస్తకర్మలు చేయుటకు సత్తానిచ్చేది. సాక్షీమాత్రము కనుక జ్ఞాన స్వరూపము, జ్ఞానము + కర్మము రెంటి కలయికయే యెరుక. రెండును ఎన్నడు విడివడియుండవు. ఇట్టి జ్ఞానము కాని, కర్మము గాని కానిది పరిపూర్ణము.



**అవతారిక :** వేదములు, బ్రహ్మముఖము నుండి పుట్టినవి. అనే వాక్యమునకు ఈ పద్యములో వివరించుచున్నారు.

**52వ పద్యము : ఈ నిర్మల మౌ బయలున । నానాగమ నిగమ కల్పనాయ నటంటే। యేనరులు నమ్మరిందుకు । నా-నీ యందున నటంటె, నమ్మిన మాడ్కిన్ ॥**

**పద విభాగము :** నానా ఆగమ నిగమ కల్పన నా - నీ యందున ఆయెను అటంటె నమ్మిన మాడ్కిన్, ఈ నిర్మలమౌ బయలున ఆయెను అటంటె యే నరులు నమ్మరు॥

**టీక :** నిర్మలముఔ = పరిశుద్ధమగు, నానా ఆగమ నిగమ = అనేక వేదములు, శాస్త్రములు మొదలయినవి, కల్పన ఆయెను = ఏర్పడినవి, పుట్టినవి, అటంటె = అట్లుఅనిచో, ఏనరులు = యేపండితులు, మాడ్కిన్ = విధముగా.

**భావము :** శిష్యా! నానా ఆగమములు, శాస్త్రములు మొదలగునవి నీ-నా అనగా కర్మ+జ్ఞాన స్వరూపమయిన ఎరుక యందు కల్పింపబడెనని చెప్పినచో నమ్మిన విధముగా, నిర్మలమైన అనగా జ్ఞాన + కర్మములు లేని పరిపూర్ణము నందు కల్పింపబడినవి అని చెప్పినచో యేజ్ఞానులు నమ్మరు.

**విశేష భావము :** నీ-నా అనగా 51వ పద్యము భావము ననుసరించి నీ అనగా కర్మ స్వరూపమైన అవిద్య అని అర్థము. నా అనగా జ్ఞాన స్వరూపమయిన ప్రతిబింబ చైతన్యము. ఈ రెండు కలసిన ఎరుకయే సమస్త సృష్టికి ఆధారము. మూలము అనగా జ్ఞాన రూపమయిన వేదములకు, అజ్ఞాన రూపమయిన జగత్తుకు కూడా మూలము, ఎరుకయే. జ్ఞానకర్మము కాని పరిపూర్ణము నిర్మలమైనది. అందు ఏదియు సృష్టింపబడదు. కనుక "వేదములు బ్రహ్మముఖము నుండి అని అర్థము చెప్పరాదు. జగధాధారభూతమయిన ఎరుక బ్రహ్మ" "నేననే బ్రహ్మ" నుండియే వేదములు పుట్టినవి అని అర్థము.

---

**అవతారిక :** పరిపూర్ణ స్థితిని పొందిన (ఎరుక విడచిన) మహాత్మునికి బోధ విచారణ అవసరము లేదని ఈ పద్యములో చెప్పుచున్నారు.

**53వ పద్యము : నేనీ వనని మహాత్మని । కీనిగ మాగమ విచార మిష్టతి యౌనా । నేనీ వని యీ పల్కే । నా నీ కే యిష్ట తారా నా, నాయాన్నా ॥**

**టీక :** నే - నీవనని = ఆత్మ జగత్తుల విషయము విడచిన, నిగమాగమ విచారము = వేదాంత శాస్త్ర విచారణ, ఇష్టతి = అంగీకారము.

**భావము :** ఓ నా తండ్రీ ! నేను, నీవు అనని మహాత్మునికి ఈ వేద వేదాంత శాస్త్ర విచారణ ఇష్టపడడు (అక్కరలేదు). అట్టి వానికి ఈ వాదోపవాదములు విచారణలతో పని లేదు. ఏక స్థితిని పొందినవాడు, ఇట్టి విచారణ అంతయు ఆత్మ - జగత్తులనే ద్వంద్వముతో కూడియున్న ఎరుక స్థితిలోని వానికే అవసరము. ఇష్టత కలిగించును, అనగా పరిపూర్ణ స్థితిలో వానికి ఏ విచారణ బోధ అవసరము లేదు అని భావము.

**విశేష భావము :** నే - నీ వనని మహాత్ముడు, అంటే ఆత్మ అని కాని అనాత్మ అని కాని అనని మహాత్ముడు, అనగా పరిపూర్ణ బోధ స్థితి పొందిన వానికి ఎట్టి విచారణతోను పనిలేదు. ఉన్నది - లేదు అని విచారించే ఎరుకను రహిత పర్చుకొనుటచే గుర్తించే లక్షణము లేదు. అట్టి వానికి విచారణ ఎందుకు? విచారణ స్థితిని పొందుటకే. స్థితిని పొందిన వానికి విచారణతో పనిలేదు.

---

**54వ పద్యము : కల వేళ్లను యీ మేల్కను । గల యీ బయలుండ జూచి, కల మేల్కలలో । గల, లేని నిన్ను నీ మే ।నులు లేవని నీవు దెలసియుండుము చాలున్॥**

**పద విభాగము :** యీ కల వేళ్లను, మేల్కను గల, యీ బయలు ఉండ జూచి, కలమేల్కలలో గల, లేని నిన్ను నీ మేనులు లేవని, దెలసియుండుము । చాలున్ ॥

**టీక :** యీ కల వేళ్లను = యీ స్వప్న (సుషుప్తి) అవస్థల యందున, మేల్కను = జాగ్రదవస్థ యందున, గల = ఉన్నటువంటి.

**భావము :** జాగ్రత్త, స్వప్న, సుషుప్త్యావస్థలలో (సర్వకాలము) శాశ్వతముగా ఉన్న పరిపూర్ణమె ఉన్నదని విచారించి చూచి, జాగ్రత్త స్వప్న సుషుప్తి అవస్థలలో (సర్వకాలము నందున) ఉన్న, లేని నీవు - నీ మేనులు లేవని విచారించి తెలుసుకొని యుండుము, చాలును.

**విశేష భావము :** జాగ్రదవస్థలో - స్వప్న సుషుప్తి లేదు. స్వప్నములో - జాగ్రద, సుషుప్తి లేవు. సుషుప్తిలో - జాగ్రద స్వప్నములు లేవు. ఒక అవస్థలో ఉండి మిగిలిన రెండు అవస్థలు లేవు. అనగా మూడు అవస్థలు కూడా లేనివే. ఈ మూడు అవస్థల యందు ఏ మార్పు లేకుండగా శాశ్వతముగానున్నది. పరిపూర్ణ బ్రహ్మము మాత్రమే అని విచారించి తెలసికొన్నచో, జాగ్రత్త స్వప్న సుషుప్తులు లేనివే అని తెలియబడుచున్నది. ఈ మూడు అవస్థలు పొందుచున్నది. ఎరుకయే అంటే ఎరుక, స్వప్నతుల్యమైనది. లేనిదే ఉన్నట్లు తోచుచున్నది. అందుకే ఎరుక కలవంటిది అన్నారు. ఇది ఏ అవస్థలోను ఎక్కడ శాశ్వతముగా లేనిదే. పరిపూర్ణ మొక్కటియే సర్వకాలము శాశ్వతముగానున్నది అని ధృడముగ తెలియవలెను.

2) "నిన్ను - నీ మేనులు లేవని" అనగా నేను-మేనులు రెండును లేనివి అని అర్థము. నేను అనగా కారణ శరీరమైన అవిద్యయందున్న ప్రతిబింబ చైతన్యము. మేను అనగా ఆ ప్రతిబింమమునకు ఉపాధిగా ఉన్న కారణ శరీరమైన అవిద్య, లేక అంతః కరణము. ఈ రెండు కలిసి యెరుక" అని వ్యవహారము. మేను అయిన అవిద్య స్వతః జడము కనుక లేనిది. అందలి ప్రతిబింబమైన "నేను" ప్రతిబింబము స్వతః ఉనికి గల్గినది కాదు. లేనిది అని స్పష్టము. కనుక నేను - మేనులు రెండును లేనివే. అయితే రెండు కలిసి ఎరుక అని చెప్పబడేది "లేనిది" అని స్పష్టము. ఇక మిగిలినది పరిపూర్ణము మాత్రమే. ఇది ఒక్కటే శాశ్వతమైనది అని నిర్ణయము. ఇట్టి విచారణ ఉంటే చాలును అని పద్య భావము.

---

**అవతారిక :** నేను, మేనులు రెండును గలిసియే యెరుక అనబడును. యీ రెండు ఒక్కటే అని చెప్పుచున్నారు.

**55వ పద్యము : మేను జడ మజడ మనినను । నేనను మీ, రెండు గలసి నేనబడు, స్వః ప్నానందమె మదవస్థగు । నేనే నను మృషని తెలియ, నే మృషనౌదున్ ॥**

**పదవిభాగము :** మేను జడము, అజడమనినను నేను అనుము, ఈ రెండు గలసి నేను అనబడు । స్వప్నానందమె మత్ అవస్థ అగు । నేనే నను మృషని తెలియ, నే మృషన్ అవుదున్ ॥

**టీక :** మేను = శరీరము (ఉపాధి), జడము = చైతన్య రహితము, నేను = ఉపాధి యందున్న ప్రతిబింబము, అజడము = చైతన్యము, మత్ అవస్థ = నా యొక్క అవస్థ. అవస్థ = కాలకృతమైన స్థితి, ఉనికి.

**భావము :** శిష్యా! (ఉపాధి) జడము అందలి ప్రతిబింబము "నేను" అనునది చైతన్యమైనది. ఉపాధి అయిన అంతఃకరణము జడము. అందలి ప్రతిబింబము "నేను" చైతన్యము. ఈ మేను నేను కలిసియే "నేను" అనగా ఎరుక అనబడును. స్వప్నగత ఆనందము ఎంత శాశ్వతమో, అదే నా యొక్క స్థితి. అవస్థ. ఈ విధముగా ఎరుకయే ఎరుకను విచారించి తెలుసుకొనినచో ఎరుక లేనిదని శాశ్వతముగాదని తెలిసి, లేకపోవును.

**విశేష భావము :** మేను అనగా ఉపాధి (శరీరము) అదే అంతఃకరణము, అవిద్య అనబడే కారణ శరీరము. ఇది స్వతస్సిద్ధముగా జడమే. అందలి ప్రతిబింబ చైతన్యము, "నేను" ఇది చైతన్యము. ఈ చైతన్యముచే జడమైన అవిద్య చైతన్యవంతమై, ఈ అవిద్యయే పంచకోశములను సృష్టించుకొనుచున్నది. ఈ అవిద్యయున్ను అందలి ప్రతిబింబము ఈ రెండును ఎన్నడూ విడివడి ఉండనేరవు. ఒకటి పోతే రెండును పోవును. ఇందులో ఏదియు సత్యము కాదు. ఈ రెండును కలసియే ఎరుక అనబడును. ఇది ఏ కాలమందున లేదనియు, స్వప్నములో కలిగిన ఆనందము ఎట్లు లేనిదో, అదే విధముగా "ఎరుక" యొక్క ఉనికి కూడా స్వప్న దృశ్యము అని తెలియవలెను. ఇట్లు ఎరుకయే తనను గూర్చి గురుముఖతా విచారించినచో పరిపూర్ణమె ఉన్నదని, తాను లేనని మృష అని తెలసి లేకుండా పోవును.

---

**56వ పద్యము : నేనె తానైతే, నా వలె । యీ నే లేనట్టి బ్రహ్మనేననకున్నే । నే నందు నే లేనిదె । మేను జగత్తులయి తోచి, మృష వొకొంచున్ ॥**

**పద విభాగము :** నేనే తాను అయితే, నా వలె యీ లేనట్టి బ్రహ్మ నేను అనుకున్నే! అందు నే లేనిదె । నేను, మేను జగత్తులయి మృషను ఔకొంచున్ ॥

**టీక :** మృషను = లేనిది, ఔకొంచున్ = అయిపోవుచును.

**భావము :** నేనే పరిపూర్ణ బ్రహ్మము అయినచో, ఎరుక లేని ఆ పరిపూర్ణము కూడా నా వలెనే "నేను" అని అనకుండునా? ఆ పరిపూర్ణము నందు ఎరుక అనే అంతఃకరణ, అవిద్య అనే ఉపాధి ఎంత మాత్రము లేదు. ఎరుక అనే అవిద్య తోచబడినదై చైతన్య వంతమై, జీవ శరీరము, ఈశ్వర శరీరములుగ (మేను - జగత్తులయి) ఏర్పడినది. ఆ యెరుక తన్ను విచారించుకొనినచో, నేను, శరీరము, జగము ఈ మూడును లేనివే అని తెలియబడును.

---

**57వ పద్యము : కానరావారు మతములు ! నానాగమ నిగమ సమితి నామము రూపం। బేను లేనప్పుడు, నాకై । నేనరు దెంచినను, వెంటనే యవి వచ్చున్ ॥**

**టీక :** కానరావు = కనిపించవు (లేవని భావము) సమితి = సమూహము, అరుదెంచినను = వచ్చినచో.

**దండాన్వయం :** ఏను లేనప్పుడు, ఆరు మతములు, నానాగమ నిగమ సమితి, నామము రూపంబు కానరావు। నాకై నేను అరుదెంచినను, వెంటనె యవి వచ్చున్॥

**భావము:** "నేను" లేనప్పుడు, నానా విధ వేద శాస్త్రాదులు, షణ్మతములు, నామ రూపాత్మక శరీర - జగత్తులు ఏమియు లేవు. నాకై "నేను" వచ్చిన వెంటనే ఆ సమస్తము శరీర జగత్తులు వచ్చును. (తోచును)

**విశేష భావము:** "నేను" లేనప్పుడు అనగా ఎరుక లేనప్పుడు అని అర్థము ఎరుక లేనప్పుడు, పరిపూర్ణ బ్రహ్మమె సనాతనమై ఉన్నది. అందులో ఎరుక తనంట తానుగా (కలవలె) లేక తోచనిది. ఎరుక వచ్చిన తరువాతనే ఎరుక వల్లనే సమస్త శరీర జగత్తులు సమస్త వాఙ్మయము, మతములు, సిద్ధాంతములు అన్నియు ఏర్పడుచు, తిరిగి ఎరుక లేకపోగానే అన్నియు ఎరుక తోనే పోవును. పరిపూర్ణముతో ఏవియు రాలేదు. పరిపూర్ణములో ఏదియు లయించుట లేదు. పరిపూర్ణము సనాతనము. శాశ్వతము. ఇది తప్ప మరేదియు లేదు.

---

**అవతారిక :** శాస్త్రములో మాయా శబళిత బ్రహ్మమును బ్రహ్మమని చెప్పుచు సత్యమైనది అని చెప్పినను మాయా బ్రహ్మము ఎన్నటికి సత్యము గాదని ఆరూఢ భావమును చెప్పుచున్నారు.

**58వ పద్యము : నా మీది ప్రేమ చేతను । యీ మనుజులు నిలుపదలచి యెన్నో యుక్తుల్ । తా మొనరించిన నిల్తునె । నే, మృష, మృష నిల్వ గలదె, నిశ్చయము వలెన్ ॥**

**పద విభాగము :** నా మీద ప్రేమ చేతను, యీ మనుజులు (నన్ను) నిలుపదలచి యెన్నో యుక్తుల్ తామొనరించిన (నేను) నిల్వగలనె? ! నే మృష । నిశ్చయము వలెన్, మృష నిల్వగలదె? నిలుపదలచి = శాశ్వతమైనది చెప్పదలచి, ఎన్నో యుక్తుల్ = ఎన్నోఉపాయములు, ఉదాహరణలు, తామొనరించిన = తాము ఏర్పాటు చేసినను, నిశ్చయము = శాశ్వతము (పరిపూర్ణము).

**భావము :** జీవాత్మ పై నున్న అభిమానముచే ఎరుకే అయిన జీవాత్మ శాశ్వతమైనదని చెప్పదలచి, శాస్త్రములలో ఎన్నో ఉపాయములు, ఉదాహరణములు చెప్పి రచించిరి. అయినా ఎరుక శాశ్వతమగునా? శాశ్వతమైన పరిపూర్ణము వలె, లేనిది శాశ్వతముగా ఉండగలదా ?

**59వ పద్యము : నీ తండ్రి తాతల వలెనె । నీ తనయులు నీవు జనుట నిశ్చయమె కదా । మీ తోటి రాదు గద, బయ । లీ తెరగెరి గిపుడు శూన్యమేదో కనరా ॥**

**టీక :** నిశ్చయమె కదా = నిజమె కదా, ఈ తెరగు = ఈ విధానము, కనరా = విచారించి చూడుము.

**భావము :** శిష్యా! నీ తండ్రి తాతల వలెనే, నీవు నీ తనయులు ఒకప్పుడు లేకపోవుట నిజమె కదా! మీ అందరి తోటి ఈ పరిపూర్ణ పరబ్రహ్మము రాలేదు. మీ తోటి పోదు గదా! ఈ విధానముగా విచారించి చూచినచో శూన్యమేదో తెలియును. ఎరుకయే శూన్యము, పరిపూర్ణము శాశ్వతమైనది అని భావము.

**అవతారిక :** పరిపూర్ణ పరబ్రహ్మము ఎట్టిదో గుర్తించుటకు వీలుగా కొన్ని లక్షణములు కాని లక్షణములను 60,61,62 పద్యములలో చెప్పుచున్నారు. ఒక్కొక్క పద్యములో 4 చొప్పున మొత్తం 12 లక్షణములు చెప్పిరి. ద్వాదశికి ద్వాదశ లక్షణములుగా

చెప్పిరి.

**60వ పద్యము : బయలెపుడు పుట్టి గిట్టదు । బయలెపుడు ముట్టుకోదు బ్రహ్మాండంబున్ । బయలెపుడు నన్నెరుంగదు । బయలెపుడు చేయబోదు పనులెవ్వైనన్॥**

**టీక :** గిట్టదు = మరణించదు, ముట్టుకోదు = అంటుకోదు తాదాత్మ్యముచెందదు.

**భావము :** శిష్యా! పరిపూర్ణము ఎప్పుడు పుట్టలేదు, మరణించదు. పిండ బ్రహ్మాండములతో తాదాత్మ్యము చెందదు. మరియు (నన్ను) ఎరుకనగా ఏదో ఎరుగదు. సృష్టి - స్థితి - లయములనే ఏ విధమైన పనులను చేయదు. (ఎరుగుట - మరచుట - తెలియబడుట - తెలుసుకొనుట) అనునని ఎరుక ఉన్నచోటనే జరుగును. పరిపూర్ణములో ఎరుక లేదు అనగా పరిపూర్ణము ఎరుగుట గాని, తెలియబడుట కాని లేనిది.



**61వ పద్యము : బయలనిన నిత్య వస్తువు । బయలన నొక రీతి నుండు బ్రహ్మాండములో । బయలనిన కండ్ల బడనిది । బయలన బ్రహ్మాండమవల బరగెడిది సుమీ ॥**

**టీక :** నిత్య వస్తువు = శాశ్వత బ్రహ్మము, బరగెడిది = ఒప్పెడిది; ఒప్పునది.

**భావము :** శిష్యా! పరిపూర్ణము శాశ్వతమైన బ్రహ్మము, ఒకేరీతిగా ఎట్టి మార్పులు లేనిది. సామాన్య చక్షువులకు కనపడనిది. అనగా దృశ్యదృక్ ద్రష్టరూపము కానిది. పరిపూర్ణము బ్రహ్మాండమునకు లోపల వెలుపల కూడా ఒకే రూపముగా శాశ్వతముగా నున్నదని తెలియుము.

**దండాన్వయము :** బయలనిని నిత్య వస్తువు। బయలన నొకరీతి నుండు। బయలనిన కండ్ల బడనిది । బయలనిన బ్రహ్మాండములో, బ్రహ్మాండ మవల, బరగెడిది సుమీ॥

**విశేష భావము :** వస్తువు అనగా వేదాంత పరిభాషలో బ్రహ్మము అని అర్థము "వసతి ఇతి వస్తుః" అని నిర్వచనము. ఉన్నది అని భావము. ఉన్నది ఒక బ్రహ్మము మాత్రమే కనుక వస్తు శబ్దమునకు బ్రహ్మము అని అర్థము. నిత్య వస్తువు అంటే

శాశ్వత బ్రహ్మము. ఎరుక కూడా బ్రహ్మమే. బ్రహ్మము యొక్క ప్రతి బింబమే కనుక ఎరుకను కూడా బ్రహ్మమని శాస్త్రములో వ్యవహరించిరి. కాని అది అశాశ్వత బ్రహ్మము లేని బ్రహ్మము. కనుకనే "బయలనిన నిత్య వస్తువు" అన్నారు.

పరిపూర్ణము బ్రహ్మాండమునకు లోపల వెలుపల అంతటా వెల్తి లేకుండగా నిండియున్నది. ఎరుక బ్రహ్మాండములోపల మాత్రమే లేక నిండియున్నది. నిజానికి లేనే లేదు.



**62వ పద్యము : బయలనిన నేమ లేనిది । బయలనిన నుపాధి గాన బడనిది యెపుడున్ । బయలనిన పలుకు లేనిది । బయలిట్టిది యనుచు దెలియబడ దెవ్వరికిన్॥**

**దండాన్వయము :** బయలనిని నేను లేనిది । బయలనిన యెపుడున్ ఉపాధి గాన బడనిది । బయలనిన పలుకులేనిది । బయలిట్టిది యనుచు యెవ్వరికిన్ తెలియబడదు।

**టీక :** నేను లేనిది = ఎరుక లేనిది.

**భావము :** శిష్యా! పరిపూర్ణములో ఎరుక (ఎరిగే లక్షణము) లేనిది. ఇది ఎప్పుడును ఉపాధి కలిగియుండదు. అనగా ఉపాధితో ప్రకృతితో తాదాత్మ్యము చెందదు. ఏ విధమైన శబ్దము లేనిది. పరిపూర్ణము ఈ విధముగా ఉన్నదని ఎవరికిని తెలియబడదు.

**విశేష భావము :** "నేను" లేనిది - ఎరుక లేనిది. ఎరిగేది, ఎరుగ బడేది ఎరుకయే. పరిపూర్ణము ఇతరమును ఎరుగుట గాని, ఇతరముచే ఎరుగబడుట గాని లేనిది. అందుకే ఎరుక (నేను) లేనిది. "ఉపాధి లేనిది" - అనగా ప్రకృతిలో ఉండుట తాదాత్మ్యము చెందుట లేనిది. అనగా సృష్టి స్థితి లయ కార్యములుతో కూడిన బ్రహ్మాండములో ఆ పనులకు సత్తా నిచ్చునది అని కాని, సాక్షిగా వ్యవహరించుట కాని లేనిది. ఎరుక పిండాండత్మ్యములో జాగ్రత్త స్వప్న అవస్థలలో తాదాత్మము చెందుచున్నది. సుషుప్తిలో పిండాండములో తాదాత్మ్యము చెందుట లేదు. అట్టి విధము ఏ మాత్రము లేనిది బయలు. ఉపాధి సహితమైన దానికే ఎరుగుట, ఎరుగబడుట ఉండును. ఎరుకకు, అవిద్య - మాయ ఉపాధి యుండుటచే ఎరుకకు

ఏరిగే లక్షణము కల్గినది, ఆ విధముగా బయలుకు ఎరుగుట లక్షణము లేదు. అంటే ఉపాధి లేనిది. అని భావము కనుక ఎవ్వరికి తెలియబడదు.

**అవతారిక :** పరిపూర్ణ బ్రహ్మము ఇదిగో అని చూపించరానిది, వర్ణించజాలనిది. కనుకనే బ్రహ్మమును అన్వయ వ్యతిరేక భావములతో చెప్పి చూపించవలెనని చెప్పుచున్నారు.

**63వ పద్యము : చెప్పి చూపించరానిది । యప్పా యల్లదిగో చూడమని నే నీకున్ ।**
**చెప్పి చూపిస్తి, మరువకు । యెప్పటికిది నమ్మి లేని యెరుకను విడరా ॥**

**టీక :** చెప్పి చూపించరానిది = పరిపూర్ణ బ్రహ్మమును.

**భావము :** ఓ శిష్యా! చెప్పుటకు చూపించుటకు శక్యము కాని పరిపూర్ణ బ్రహ్మమును అదిగో చూడుమని అన్వయ వ్యతిరేక భావములతో నిరూపించి తెలియజెప్పితిని. ఎప్పటికి దీనిని విడువకుము మరువకుము. ఇదే ఉన్నది, మరింకేదియు లేదని నమ్ముము. కనుక లేని ఎరుకను విడిచిపెట్టుము.

**విశేష భావము :** లేని యెరుక ఉన్నట్లు కనిపించుచున్నది. అట్లు లేనిది ఉన్నట్లు కనబడుటకు కారణమేమో ఆ ఎరుక లక్షణమును పూర్తిగా వివరించి, ఇది లేనిదని కల దృష్టాంతకముగా శిష్యునికి అన్వయ లక్షణములతో నిరూఢము గావించి, అట్టి లక్షణములు లేనిది పరిపూర్ణ పరబ్రహ్మమని "వ్యతిరేక లక్షణములతో" శృతి యుక్తి అనుభవములతో నిరూపణ చేయుటయే "చెప్పి చూపించుట" అనబడును. పరిపూర్ణము శబ్ద గమ్యము కానిది. "నవాగ్గచ్ఛతి" అన్నారు. కనుక చెప్పరానిది వర్ణించరానిది. జ్ఞాతజ్ఞానము, జ్ఞేయము కానిది. కనుక చూపించరానిది. అట్టిది బ్రహ్మము అని చెప్పి, ఎరుక, పరిపూర్ణమును చూచినచో, ఎరుక లేకుండా పోవును. కనకు ఎరుక ఎప్పుడు ఎట్లు లేకపోవునో శృతి యుక్తి అనుభవములతో అన్వయ వ్యతిరేకార్థములతో ఎరుక, పరిపూర్ణమును, గురుమూర్తి నిరూపించి చెప్పి, ఎరుకను లేకుండా చేసికొనినచో ఉన్నది పరిపూర్ణమే కదా అని బోధించి గురుమూర్తి యిది నమ్ముము. ఎరుకను విడిచిపెట్టుము అని చెప్పిరి.

**అవతారిక :** పరిపూర్ణము ఉన్నదని గుర్తించిన వెనుక, ఆ గుర్తించిన ఎరుక లేనిదని విడచి పెట్టుము అని చెప్పుచున్నారు.

**64వ పద్యము : ఉన్నది గద నే చెప్పిన । దన్నా, దాన్నుండజూచి, తలగుము, మృషయా। నిన్నంటి యున్న సంపద । లన్నియు గొని నీవు వచ్చినట్లు మృషగుచున్॥**

**దండాన్వయము :** అన్నా! నే చెప్పినది ఉన్నది గదా! దాన్నుండ జూచి, మృషయా నిన్ను అంటి యున్న సంపదలన్నియు గొని, నీవు వచ్చినట్లు మృషగుచున్ తలగుము॥

**టీక :** అన్నా = నాయనా, బిడ్డా, మృషయా = లేనిదే ఉన్నట్లు తోచబడే, సంపదలిన్నయు = సమస్తమైన పుణ్య పాప కర్మలు, తలగుము = లేకుండాపొమ్ము.

**భావము :** శిష్యా! నే చెప్పిన పరిపూర్ణ బ్రహ్మము శాశ్వతముగ ఉన్నదనీ నీకు దృఢముగా తెలియబడినది కదా! (ఎరుక) లేనిదె ఉన్నట్లు తోచబడే మృష రూపము గనుక, నీతో వచ్చిన సమస్త పుణ్య పాపకర్మ సంపదలన్నిటితో సహా "నేను" లేనని లేకుండా పొమ్ము.

**విశేష భావము :** సమస్త జగత్తు, శరీరము, పుణ్య, పాప కర్మలు, పాండిత్యము వగైరా జ్ఞానము ఇవన్నియు ఎరుక సంపాదించుకొన్న సంపదలు. ఈ సంపద అంతా అవిద్య లేక అంతఃకరణమని చెప్పబడే ఎరుక యందే ఉన్నవి. అట్టి అవిద్య అనే ఎరుక గురుకరుణచే లేకపోయినచో అందున్న సమస్త కర్మ విశేషములతో ఎరుక పూర్తిగా నశించును. ఇక ఉన్నది పరిపూర్ణము మాత్రమే. అదే శాశ్వతమైయున్నది. అది ఉన్నదని గుర్తించే ఎరుక ఎక్కడా లేదు.

---

**అవతారిక :** ఎరుక వల్లనే పంచకోశములు ఏర్పడుచున్నది. అందుచే పంచకోశ వ్యతిరిక్తుడు పరిపూర్ణము యనదగును. గానీ పంచకోశ వ్యతిరిక్తము అయినది ఎరుక అనతగదు.

**65వ పద్యము : పంచ కోశముల సంచును । మించినదీ యెరుక యనుట మేలా, బయలం। చెంచిన దగునా ముచ్చట । సంచిత సద్భక్తి యుక్త అమితా సక్తా ॥**

**టీక :** సంచిత = సంపాదించుకొన్న, సద్భక్తియుక్త = మంచిభక్తి కలిగినవాడా । అమితాసక్తా = అంతులేని ఆసక్తి కలవాడా, సంచును = కోశములనే సంచిని,

**భావము** : ఓ అంతులేని ఆసక్తి, గొప్ప భక్తి గల ఓ శిష్యా! యెరుక పంచకోశములనే పంచిని మించినది అని చెప్పుట యుక్తము కాదు. ఆ మాట పరిపూర్ణ పరబ్రహ్మమునకు తగును.

**విశేష భావము** : పంచకోశములు : 1) అన్నమయ, 2) ప్రాణమయ, 3) మనోమయ, 4) విజ్ఞానమయ 5) ఆనందమయ కోశములు. అవే మూడు శరీరములు. అన్నమయ కోశము = స్థూల శరీరము, ప్రాణమయ, మనో మయ, విజ్ఞానమయ కోశములు మూడును - సూక్ష్మ శరీరము, ఆనంద మయ కోశము = కారణ శరీరము. "అవస్థాత్రయములకు సాక్షీమాత్రుడును, పంచకోశ వ్యతిరిక్తుడు అయినదే ఆత్మ" అని శాస్త్ర వాక్యము. ఇచ్చట ఆత్మ అనునది జీవాత్మ (ఎరుక) అని అర్థము చెప్పవలెను. పంచకోశముల యొక్క పనులు సృష్టి స్థితి లయములు శుద్ధ చైతన్యమయిన జీవాత్మయందు లేదని చెప్పుటయే శాస్త్ర వాక్యము కాని పంచ కోశములతో కాని, శరీర త్రయములతో కాని ఎంత మాత్రము సంబంధము లేనిది ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే అని పద్య భావము. ఎరుక పంచకోశములతో కూడినదే.



**అవతారిక** : పరిపూర్ణము సర్వత్రా ఉన్నది. శరీర జగత్తులకు లోపల వెలుపల నిండియున్నది. పరిపూర్ణములోనే శరీర జగత్తులు లేక ఉన్నవి, అని చెప్పుచున్నారు.

**66వ పద్యము : లేని నేనను శరీరము। లోన బయట గలిగినట్టి లోక సమితికిన్ । లోన బయట గల బయలిది । దీనందే లేక మనము తిరుగుట మనఘా ॥**

**టీక** : లోక సమితి = లోక సమూహము (జగత్తు) అనఘా = పాపరహితుడా!

**భావము** : లేని నేను అను శరీరము అనగా అంతఃకరణ లేక అవిద్య। నేను = అందలి ప్రతిబింబము. ఈ రెండును లేనివే, ఈ రెండు విడిగానుండవు. కలసియే యుండును. కనుక లేని నేను, అను శరీరము అన్నారు. దానికి లోపల బయటను కూడా జగత్తు ఉన్నది. ఇట్టి జగత్తుకు లోపల బయట కూడా వెల్తి లేక నిండియున్నది పరిపూర్ణము. ఇట్టి పరిపూర్ణ బ్రహ్మము నందే మనము లేక తిరుగుచున్నాము.

**విశేష భావము** : జగత్తు రెండు రూపములు. ఒకటి దృశ్య రూప జగత్తు పంచభూతములతో నిండియున్నది. దీనినే కార్యరూప జగత్తు అని కూడా అందురు.

రెండవది బీజ జగత్తు. ఇది కారణ రూప జగత్తు. ఇదే నేను అనే అంతఃకరణము లేక అవిద్య. బాహ్యా దృశ్య రూప జగత్తంతయు దీని నుండే ఏర్పడుచున్నది. కనుక బాహ్యా జగత్తు, స్థూలము, కార్యము, దృశ్య రూపము. అంతఃకరణము, కారణ రూపము, సూక్ష్మము బీజ జగత్తు. ఇట్టి బీజ, స్థూల జగత్తుల రెంటికి లోపల వెలుపల సర్వత్రా నిండియున్నది పరిపూర్ణము. ప్రకృతి ద్వయమైన నేనను శరీరము స్థూల జగత్తు లేనివే. పరిపూర్ణము మాత్రమే ఉన్నది శాశ్వతము.



**అవతారిక :** జగత్తు, జగదధిష్ఠానము ఇది అంతయు జ్ఞానము, కర్మము రెంటి సమన్వయము. జ్ఞాన కర్మ ద్వయ రూపము కానిది పరిపూర్ణము మాత్రమే అని చెప్పుచున్నారు.

**67వ పద్యము : ముడిబడి కర్మము జ్ఞానము । విడువక నా రెండు వెలసె విశ్వమ నదే। కడు వేడ్క బయలు గనెనా । ఘడియైనను నిల్వ లేక కల్లైపోవున్ ॥**

**దండాన్వయము :** కర్మము జ్ఞానము విడువక ఆ రెండు ముడివడి, విశ్వమనన్ వెలసె। అదే కడు వేడ్క బయలు గనెనా - ఘడియైనను నిల్వ లేక కల్లైపోవున్ ॥

**టీక :** వెలసెన్ = ఏర్పడెను, విశ్వము = జగదధిష్ఠానము (అఖండ యెరుక, దేహి, నేను, అహము, కడు వేడ్క = అమితమైన ఆసక్తితో, కల్లైపోవున్ = అబద్ధమైపోవును, లేకపోవును.

**భావము :** శిష్యా! కర్మము- జ్ఞానము ఈ రెండును విడువనట్లుగా ముడిపడి, ఇదే విశ్వము (ఓంకారము) అనే పేరుతో ఏర్పడినది. ఈ విశ్వమే (అహమే) అమిత సంతోషముతో పరిపూర్ణమును చూచినచో, ఒక్క సెకను కాలము కూడా ఉండలేక, లేకపోవును.

**విశేష భావము :** విశ్వము అనగా ఇచ్చట జగత్తు అని చెప్పరాదు. జగదధిష్ఠానమైన ఎరుక. ఇది జగత్తునకు మూల కారణమైనది. కనుక కారణ - కార్యములు ఒకటే కనుక దీనికి విశ్వము అని చెప్పబడినది. ఈ ఎరుక మూడు స్థానములలో మూడు పేర్లతో వ్యవహరించుచున్నది. 1) జగదదిష్ఠానము, 2) బ్రహ్మాండ అధిష్ఠానము - ఈశ్వరుడు, 3) పిండాండ అధిష్ఠానము - జీవుడు. ఈ మూడు స్థానములయందును

అది కర్మ + జ్ఞానముల సమ్మేళనమే. జగదదిష్ఠానమైన ఎరుక పరిపూర్ణములో తోచబడిన మాయ + అందలి ప్రతిబింబ చైతన్య సమ్మేళనము. మాయ సమస్త సృష్టి క్రియకు మూలకారణమైనది. కనుక అది కర్మము. అందలి ప్రతిబింబము - జ్ఞాన స్వరూపము. అట్లే బ్రహ్మాండమందలి ఈశ్వరుడు మాయ (బలము) + అందలి ప్రతిబింబము కలయిక. ఇదియును మాయ కర్మ స్వరూపము. ప్రతిబింబము జ్ఞానము. కనుక ఈశ్వరుడు కర్మ + జ్ఞాన రెంటి కలయికయే. ఇక మూడవది పిండాండ అధిష్ఠాత జీవుడు. ఇది అవిద్య + అందలి ప్రతిబింబము స్వరూపము. అవిద్య నుండి సమస్త శరీర సృష్టి కర్మ జరుగుచున్నది. కనుక అవిద్య కర్మము. అందలి ప్రతిబింబము సత్తామాత్రము. జ్ఞాన స్వరూపము, కనుక జీవుడును కర్మము + జ్ఞానముల కలయికయే. కర్మ, జ్ఞానములు రెండు విభిన్నములే అయినను. రెండును కలసియే యుండును. ఎన్నడును విడివడి యుండనేరవు. రెండును కలిసియే యెరుక అగును. అందులో ఒక్కటి లేకపోయిననూ రెండవది ఉండదు. రెండును లేనివే, మాయ లేక అవిద్య, జడము, లేనిది. అందలి ప్రతిబింబము లేనిది, ప్రతిబింబమునకు సహజమైన ఉనికి ఎచ్చటనూ లేదు. ఇది అనుభవమే కదా! ఈ లేని అవిద్య, లేని ప్రతిబింబము కలిసి, లేక ఉన్న ఎరుక అయినది. ఇది ఎరుక యొక్క మూల గుట్టు. ఇట్టి ఎరుక పరిపూర్ణమును చూచినచో పూర్తిగా లేకపోవును.

---

**68వ పద్యము : సకలంబు లేని బయలున । సకలము లేని దిట కొచ్చి, చెనెనా లేన। చుకని, తా లేచిపోయిన । నిక నిలిచే బయలు నెరుగ నేదుండునురా ॥**

**దండాన్వయము :** సకలంబు లేని బయలున, లేనిది సకలము ఇటకు వచ్చి, లేనంచుకని చనెనా, - తాలేచిపోయినన్ ఇక నిలచే బయలును ఎరుగన్ ఏది ఉండునురా ॥

**టీక :** సకలము = సమస్తము (అనగా సమస్తమునకు కారణమయిన ఎరుక అని అర్థము) లేనంచుకని = లేనని విచారించి చూచి, నిలచే బయలు = శాశ్వతమై యుండే పరిపూర్ణము.

**భావము :** సకలము = సమస్తము, సమస్తమునకు మూల [illegible]ము ఎరుకయే. మరియు సమస్తము ఉన్నది ఎరుక యందే, కనుక ఇక్కడ సమస్తము అనగా ఎరుక అని భావము. కనుక సకలంబు లేని బయలున అనగా ఎరుక ఎంత మాత్రము లేని

పరిపూర్ణములో, ఎరుక లేనిదే ఏర్పడి, తనను గురుముఖతా విచారించుకొనినచో తాను ఎంత మాత్రము లేనని తెలిసి లేకుండా పోయినచో, ఇక శాశ్వతమైయున్న పరిపూర్ణమును, ఉన్నది అని చెప్పుటకు ఎవరు ఉందురు? అనగా ఎరిగేది ఎరుక ఎరుక లేకపోయినచో ఉన్నదానిని ఎరిగేది ఏదియు లేదని భావము.



**అవతారిక** : ఎరుక లేదని, పరిపూర్ణము మాత్రమే ఉన్నదని ఆరూఢముగా తెలియవలెనని చెప్పుచున్నారు.

**69వ పద్యము : ఉన్న లేనేమో యనకన్ । వున్నది బయలనుచు, యేమో వుంటిని లేనం। చెన్ను లేనట్టి విన్నును । పన్నుగ గని, లేని నీవు పరుగిడవోయీ ॥**

**దండాన్వయము** : వున్నది బయలనుచు, యేమో వుంటిని లేనంచు ఎన్ను అట్టి లేని నిన్నును, పన్నుగ గని । ఉన్న - లేనేమో యనకన్ లేని నీవు పరుగిడ వోయీ ॥

**టీక** : యోమోవుంటి = ఉన్నానేమో, లేనంచు = లేనేమో, అనుచు, ఎన్ను = భావించే, లేని నిన్నును = లేని ఎరుకను (జీవాత్మను) పన్నుగ = ధృడముగ, గని = విచారించి చూచి, ఉన్న లేనేమో యనకన్ = ఉన్నానో, లేనేమో అనే సంశయ పడక, పరుగిడవోయీ = లేకుంఢా పొమ్ము.

**భావము** : ఓ శిష్యా! శాశ్వతముగా ఉన్నది పరిపూర్ణము మాత్రమే. అని ఒకప్పుడు ఉంటున్నాను, మరొకప్పుడు లేకపోవుచున్నాను అని తలచే "లేని నేనును" చక్కగా శాస్త్ర యుక్తి అనుభవములచే గురు ముఖతా విచారించి ధృఢపడి, ఇంక ఉన్నానేమో? లేనేమో? అని అనకుండగ, లేని నీవు లేకుండా పొమ్ము.

**విశేష భావము** : "యేమో ఉంటిని లేనంచు ఎన్ను నిన్నను" అనగా జాగ్రత్త స్వప్న, తురీయములలో "నేను" ఉన్నట్లు, సుషుప్తి తురీయాతీతములలో లేనట్లు కనిపించే "నేనును" అని భావము. ఒకప్పుడు ఉన్నది మరొకప్పుడు లేనట్లు తోచబడేది, ఎన్నడూ లేనిదే. శాశ్వతముగా ఉన్నది అనేది ఒకప్పుడు "లేదు" అనుటకు వీలు లేదు. "ఆదావంతేచ యన్నాస్తి వర్తమానే పి తత్తథా" మొందట చివర లేనిది వర్తమానము నందు కూడా లేనిదే అని శాస్త్ర వాక్యము. కనుక ఒకప్పుడు ఉన్నట్లు, మరొకప్పుడు

లేనట్లు తోచబడే ఎరుక, ఏ కాలమందైనను లేనిదే. లేనిది లేదని ధృడముగా గుర్తించి, ఆ యెరుక చేతనే పరిపూర్ణమె ఉన్నదని, ఈ రెంటి వర్తనము ఎరిగిన ఎరుక అవిద్య, అంతఃకరణము లేనిదని గురుకరుణచే లేకుండా చేసికొనినచో, ఎరుక లేకపోవును. ఎరుక లేకపోయిన వెనుక పరిపూర్ణము ఉన్నదని తెలుసుకొనేది లేదు.

**70వ పద్యము : రెండు వస్తువుల నడుమ, వ । ఖండం బిదె కానుపించును గద, దీనిని నీ । వుండి కనొంగొని చనందగు । మండిత సత్కీర్తి సాంద్ర మానవ చంద్రా॥**

**టీక :** మండిత అలంకరింపబడిన, మానవ చంద్రా = మానవ శ్రేష్ఠుడా! కనుగొని = విచారించి చూచి, చనందగు = లేకపోవలెను.

**భావము :** ఓ మంచి కీర్తితో అలంకరింపబడిన మానవ శ్రేష్ఠుడా ! రెండు వస్తువుల మధ్యన అంతటా నిండి అఖండ రూపముగా ఉన్న పరిపూర్ణము ఇదే. ఈ పరిపూర్ణమును నీవు ఉండి (ఎరుకతో ఉండి) గురుముఖతా చక్కగా ధృఢముగా విచారించి చూచి, నీవు లేనని తెలసి "నీవు" లేకుండా పొమ్ము.

**విశేష భావము :** రెండు వస్తువుల నడుమ ఖాళీ అనగా అది మూడు రకములుగా ఉన్నది 1) భూతాకాశము - ఇది చీకటి వెలుతురులతో నిండినది, దృశ్య రూపము ఇది పరిపూర్ణము కాదు, అది విడచినచో మిగిలినది 2) మహాకాశము : ఇది చీకటి వెలుతురు కానిది. దృశ్యరూపము కానిది అయిను సత్తామాత్రమైనది. ద్వంద్వ రూపము. పిండ బ్రహ్మాండములకు సత్తానిచ్చేది లేని మాయ + లేని ప్రతిబింబ స్వరూపముల కలయిక. స్వతః లేనిది అజ్ఞాన దృష్టికి ఉన్నట్లు గోచరించే మిథ్యా స్వరూపము, విచారిస్తే 'మృష'. ఇది కూడా పరిపూర్ణము కాదని విడచినచో మిగిలినది పరిపూర్ణ పరబ్రహ్మమైన పరాకాశము. ఇది సత్తాలేనిది, ఉపాధి లేనిది. రెండు కాని అద్వయము. ఇది ఖండ స్వరూపము కాదు. (మితములో ఉపాధిలో ఉన్నది కాదు కనుక) అఖండము. ఇదే శాశ్వతమైనది అని గుర్తించి గురు కరుణచే ఖండ స్వరూపమైన ఎరుకను విడువవలెను.

**అవతారిక :** "నేను" ఒక్కటి లేకపోయినచో సమస్తము లేక పోవును, పరిపూర్ణము మాత్రమే ఉండును అని నిరూపించుచున్నారు.

**71వ పద్యము : ఉన్నదా నందు నిజముగ । నెన్నడు లేనట్టి మనము యే తెంచిట, యీ । తిన్నని ముచ్చట లాడితి। మిన్నియికన్ మనము బోతె యేదిర మాటా ॥**

**దండాన్వయము :** నిజముగా ఉన్నదానందున, ఎన్నడు లేనట్టి మనము ఇట యేతించి యీ తిన్నని ముచ్చటలు ఇన్నియు ఆడితిమి. ఇకన్ మనము బోతే యేదిర మాటా?

**టీక :** నిజముగ = శాశ్వతముగ, ఎన్నడు లేనట్టి = ఏ కాలమందున లేనటువంటి, ఇట = ఇక్కడ, తిన్నని = వంకర లేని (గజిబిజి లేని) ముచ్చటలు = మాటలు, ఆడితిమి = చెప్పుకొంటిమి, ఏదిర మాటా = ఏదిర ఎరుకా! మనము = అందరము (అనగా ఎరుక అని భావము)

**భావము :** శాశ్వతముగ ఉన్న పరిపూర్ణ పరబ్రహ్మములో ఏ కాలమందున లేని ఎరుక ఇక్కడ గురు శిష్య రూపముగా వచ్చి, యీ గజిబిజి లేని పరిపూర్ణ బోద గురించి వివరించుకొన్నాము. ఎరుక లేనిదె ఉన్నట్లు తోచుచున్నదని లేనిది (ఎరుక) లేకపోయినచో ఇక ఎరుక ఎక్కడ ఉన్నది. అనగా ఎరుక ఒక్కటి లేకపోయినచో సమస్తము లేకపోవును అని భావము.



**అవతారిక :** ఆపోజ్యోతి స్వరూపము బ్రహ్మము కాదనియు, అదియును ఒకప్పుడు లేకపోయేదే అని వివరించుచున్నారు.

**72వ పద్యము : ఓ పాప రూప బయ । లే పరమాత్మనుచు నమ్మి, లేనట్టి నినున్ । ఆపోజ్యోతి వనుచు దెల । పీ పట్లనె లేవటంచు చేరు ముళ్లక్కిన్ ॥**

**టీక :** పాప రూప = కనుపాపలో కనుపించే ఆపోజ్యోతి రూపా! పరమాత్మనుచు = పరబ్రహ్మమనుచు, ఆపోజ్యోతి = అమృతజ్యోతి, ఉళ్లక్కిన్ చేరుము = లేకుండా పొమ్ము (లేదా పరిపూర్ణమును జేరి లేకుండా పొమ్ము).

ఈ పద్యము మొదటి పాదము 12 మాత్రలకు 10 మాత్రలే ఉన్నవి. కనుక "ఓ పాప రూప యీ బయ!" అని ఉంటే సరిపోవును. మరియు నాల్గవ పాదము

కూడా 21 మాత్రలు ఉన్నది. అందుచే "సీ పట్లనె లేనంచుచేరు ముళ్లక్కిన్" అని ఉంటే సరిపోతుందని నా భావము.

**భావము :** ఓ కనుపాప రూపా (శిష్యా!) పరిపూర్ణమె పరబ్రహ్మము అని నమ్మి, కనుపాపలో కనుపించే ఆపోజ్యోతి బ్రహ్మము కాదనియు, అది నీ స్వరూపమె (ఎరుక రూపమె) అని తెలుసుకొని, ఆ పరిపూర్ణములో నీవు లేవని లేకుండా పొమ్ము.

**విశేష భావము :** ఆపోజ్యోతి అనగా అమృత జ్యోతి అని శాస్త్రార్థము. అనగా నశించని జ్యోతి. శరీరము పోయినను ఆపోజ్యోతి (ఎరుక) ఉంటున్నది కనుక అమృతజ్యోతి అన్నారు. అంతమాత్రముచే ఎన్నటికి నశించదు అని కాదు. పరిపూర్ణమును గురు కరుణచే చూసిన వెంటనే ఎరుక నశించును. అంతఃకరణ ప్రతిబింబము యొక్క ప్రకాశ ప్రతిబింబమే ఆపోజ్యోతి.

ఈ పద్యములో "బయలే పరమాత్మనుచు నమ్మి" అన్నారు. పరమాత్మ అనగా పరబ్రహ్మము అని అర్థము చెప్పవలెను. అంతే కాని అఖండ ఎరుక అని అర్థము చెప్పరాదు. పరిపూర్ణమును "పరమాత్మ" అన్నారు. తప్పు అర్థము చెప్పవద్దు - ఇది సంప్రదాయకులు గుర్తించి, ఆత్మ, పరమాత్మ, బ్రహ్మము ఇట్టి శబ్దములకు ఎరుకే అని అర్థము మాత్రమే కాదు. పరిపూర్ణమునకు కూడా చెప్పవచ్చును.



**73వ పద్యము : ఇచ్ఛా రాహిత్యంబునె । స్వచ్ఛంబగు బోధ యనుచు సజ్జనులనిరీ।**
**యిచ్చునెకూడని దనిరా । స్వచ్ఛందుల మాటలన్ని సత్యము వినరా ॥**

**టీక :** ఇచ్ఛారాహిత్యము= ఎరుక రహితమునె, స్వచ్ఛందులు = స్వంతత్రులు.

**భావము :** ఎరుకను, రహిత పర్చునదే చక్కని బోధయని సజ్జనులు చెప్పిరి. ఆ యెరుకనె కూడనిది, (శాశ్వతమని తలంచరానిది) ఆ స్వంతంత్రులు యొక్క మాటలన్నియు సత్యమైనవి, శిష్యా వినుము.

**విశేష భావము :** ఇచ్ఛయనగా ఎరుక అని అర్థము చెప్పవలయును. స్వచ్ఛందులు అనగా స్వతంత్రులు అనగా " ఆ పరమేశ్వరుడే ఉన్నాడు. అంతా వాడే చూసుకుంటాడు అని ఆదారపడనివారు, వీరు పరిపూర్ణమె శాశ్వతమై ఉన్నదనియు, లేని ఎరుకయే

సమస్త జగత్తుకు కారణమైనదియు, ఆ ఎరుక పరిపూర్ణములో లేనే లేదు కనుక ఎరుక లేకుండా పోవలెననే గురువాక్యముతో న్నునవారు, కనుక ఎరుక భ్రమను విడచిన వారు కనుక స్వతంత్రులు - స్వచ్ఛందులు.

ఆ ఇచ్ఛనె కూడనిది - అనగా ఆ ఎరుకనె కలువనిది, ప్రశంసించరానిది విడువ తగినది అని భావము.

**అవతారిక :** సమస్త కోరికలకు మూలము ఎరుక అనియు, అట్టి ఎరుకను విడచినచో కోరిక లేదని చెప్పుచున్నారు.

**74వ పద్యము : ఏయాపేక్ష జనించిన । నా యాపేక్ష లెల్ల మాయ యని తెలియదగున్।**
**ఆయాసమౌను దానను । ఛీయని విడువదగును సేమము కొఱకై ॥**

**టీక :** అపేక్ష = కోరిక, జనించినా = పుట్టినా,. కలిగినా, మాయ = ఎరుక, ఆయాసమౌను = దుఃఖించవలసి వచ్చును, సేమము = సుఖము.

**భావము :** శిష్యా! ఏ రకమైన కోరిక కలిగినను అవన్నియు ఎరుక వల్లన కలిగినవే (మాయా రూపమే) అని తెలియుము. అట్టి ఎరుక వలన దుఃఖమే కలుగును. కనుక నీ సుఖము కొఱకై (దుఃఖము లేకుండుటకై) ఆ ఎరుకను విడువలెను. ఎరుక లేకపోవడమే దుఃఖనివృత్తి జన్మరాహిత్యము అని పద్య భావము.

**75వ పద్యము : లేని నీ కలిమి, వంధ్యా! సూనుని వలె, పుష్కర ప్రసూనము వలె,**
**స్వ। ప్నానందము వలె, గంధ । ర్వానీక స్థానము వలె, వని తెలియదగున్ ॥**

**టీక :** కలిమి = సంపద (నేను బ్రహ్మను అనుభావము) వంధ్యాసూనుడు = గొడ్రాలిబిడ్డ; పుష్కర ప్రసూనము = ఆకాశ పుష్పము, గంధర్వానీకము = గంధర్వసమూహము.

**భావము :** శిష్యా! లేని ఈ ఎరుక గొడ్రాలి బిడ్డవలె, స్వప్నములో కలిగిన ఆనందము వలె, గంధర్వ నగరము వలె, ఆకాశ పుష్పము వలె అని తెలియవలెను. అనగా ఉన్నట్లు భ్రమరూపమెకాని విచారిస్తే లేనిదే సుమా! అజ్ఞాన దృష్టికి ఉన్నట్లు, జ్ఞాన దృష్టికి ఎన్నడూ ఉన్నది కాదని తెలియవలెనని భావము.

**76 వ పద్యము : నీ తండ్రి జనివ మీదట । నీ తనయుడు రాక మునుపు, నీవున్నపుడున్ । యేతత్త్వ మంతటను గల । దాతత్త్వము వరసి మృషని తలపుము మిమ్ముృన్ ॥**

**టీక :** తత్త్వము = బ్రహ్మము, మిమ్ముృన్ = అందరిని (అనగా ఎరుక)

**దండాన్వయము :** ఏ తత్త్వమంతటను గలదో ఆ తత్త్వము నరసి, మిమ్ముృన్ మృషని తలపుము.

**భావము :** సర్వకాలములందును ఏ బ్రహ్మము శాశ్వతముగా సర్వత్ర నిండియున్నదో, ఆ తత్త్వము (ఆ పరిపూర్ణ బ్రహ్మమును) గురుముఖతా విచారించి చూచి, ఈ మూడు కాలములయందున (సర్వకాలము) లేనిదే ఉన్నట్లు కనిపించే ఎరుకను లేనిదని విడిచిపెట్టుము.

**విశేష భావము :** నీ తండ్రి జనిన మీదట = భూత కాలము నందున, నీ తనయుడు రాకమునుపు = భవిష్యత్ కాలమునందున, నీవున్నప్పుడు = వర్తమాన కాలమందున అని గుర్తించవలెను. తత్త్వము అనగా బ్రహ్మము. ఈ పద్యములో ఏ తత్త్వమంతట గలదో అనగా ఏ బ్రహ్మము శాశ్వతముగా సర్వత్ర నిండియున్నదో అంటే పరిపూర్ణ బ్రహ్మము. ఈ పద్యములో పరిపూర్ణమును "తత్త్వము" అన్నారు. సంప్రదాయకులు గుర్తించ ప్రార్థన.

---

**అవతారిక :** సమస్త దృశ్యము ఎరుకే అనియు అట్టి ఎరుక పరిపూర్ణములో పుట్టలేదని చెప్పుచున్నారు.

**77వ పద్యము : నీవె సుమీ జీవశివుల్ । నీవె సుమీ మేమ జగము, నీవే సుమ్మీ! జీవ శివైక్యము; బయలున । నీవు గలుగ లేదు, లేదు నీ మొదలెచటన్ ॥**

ఈ పద్యములో "నీవు" అనగా "ఎరుక" అని అర్థము.

**భావము :** శిష్యా! జీవుడు - శివుడు ఎరుకయే. జీవ శివైక్యము ఎరుకయే. ఇట్టి ఎరుక పరిపూర్ణములో పుట్టలేదు. ఈ ఎరుకకు మూలమేమియు లేదు. తనకు తా లేక తోచినది ఎరుక. (కనుక లేనిది)

**విశేష భా**... నీవు అనగా నేను అనే ఎరుక అని అర్థము చెప్పవలెను. నీవె సుమీ జీవశివుల్ = ...ండాండమందలి అంతఃకరణ అందలి ప్రతిబింబ చైతన్యము జీవుడు. ఇది ఎరుకయే, బ్రహ్మాండమందలి మాయ + ప్రతిబింబ చైతన్యము - ఈశ్వరుడు, ఇది ... . జీవ శివైక్యము - పిండ బ్రహ్మాండ ఆవరణములు లేకపోయినచో ఉన్నది. మాయ + ప్రతిబింబ చైతన్యము - అఖండ ఎరుక ఇదియును ఎరుకయే. అనగా పిండాండము, బ్రహ్మాండము, జీవుడు, శివుడు అంతయు ఎరుక రూపమే. అనగా సమస్తము ఎరుకయే. పరిపూర్ణములో ఎరుక లేదు. కనుక పరిపూర్ణము మాత్రము ఎరుక కాదు. పరిపూర్ణమును చూస్తే ఎరుక లేదు. కనుక ఎరుక లేనిది, ఉన్నది కాదు.

**78వ పద్యము : కదలీనా మెదలీనా । కదలనియీ బయలు నిన్ను గనలేదు గదా! మొదలెక్కడ గనరాదిక । కదలుము నీకలి ముల్లక్కి గా దల్చి సుతా ॥**

**టీక :** కదిలీనా = చలించినా, ప్రయత్నించినా, మెదలీనా = సంచరించినా, నిన్ను గనలేదు = ఎరుకను పుట్టించలేదు, చూడలేదు, తెలుసుకొనుట లేదు, నీకలిమి = నీ సంపద, నీ ఉనికి, ఉల్లక్కిగా = లేనిదిగా.

**భావము :** కుమారా! ఎరుక చలించినా సంచరించినా, చలన రహితమైన (ఎరుక లేని) పరిపూర్ణము, ఎరుక చేష్టలను తెలుసుకొనుట లేదు. ఎరుకను పరిపూర్ణము కనలేదు. (పుట్టించలేదు) యెరుకకు మరేదియు మూలము ఎచ్చటను లేదు. కనుక ఎరుక యొక్క ఉనికి లేనిదిగా తలంచి, లేకుండా పొమ్ము.

**79వ పద్యము : మేనని నను దెలసిన గతి । నేననని బయలు గాను, నీ వెరుగోయీ। నేననని నేననదని । నేనను నే నరయ మృషని నే మృషనౌదున్ ॥**

**దండాన్వయం :** నను మేనని దెలసి నగతి, నేననని బయలు గాను, నీ వెరుగోయీ। నేననని నేననదని, నేనను నేను మృషని నరయ, నే మృషనౌదున్ ॥

**భావము :** శరీరము అనగా నేనే అని తెలిసికొనిన విధముగానే "నేను" అననిది పరిపూర్ణముగా తెలిసికొనుము. ఓ శిష్యా! "నేను" అనని పరిపూర్ణము నేనే బ్రహ్మమని

అనదు. నేననే ఎరుక తానే మృషని విచారించి తెలుసుకొనినచో నేను లేనిదగును. అనగా లేకపోవును.

**విశేష భావము :** "నను మేనని తెలసిన గతి" నేను అనగా ప్రతిబింబ చైతన్యము. నేను అని అనేది అవిద్య. ఈ అవిద్య ప్రతిబింబమునకు ఉపాధి అయిన కారణముగా, ప్రతిబింబము నేనని, అవిద్యను మేనని శాస్త్ర వచనము. అయితే అవిద్య వలననే ప్రతిబింబమునకు ఉనికి కలిగిన కారణముగా ప్రతిబింబము కూడా మేనే అని విచారణ. అనగా అది కూడా ప్రకృతియే. లేనిదే అని అర్థము. అవిద్యయే ప్రతిబింబ సత్తా చేత సమస్త కార్యములు, చేస్తూ "నేను" అని పలుకుచున్నది. నేననినిది అనగా నేనే బ్రహ్మమును అని పలుకనిది ఒక్క పరిపూర్ణ బ్రహ్మము మాత్రమే. కనుక నేనే బ్రహ్మమును అని పలికే అవిద్య గురు ముఖతా విచారించి తాను పరిపూర్ణములో లేనని, పరిపూర్ణమె శాశ్వతమై సర్వత్రా ఉన్నదని, తాను మృష అని తెలసి తానైన అవిద్య లేకపోయినచో అందలి ప్రతిబింబము కూడా లేకపోవును. ఇదే ఎరుక రహిత విధానము. ఈ విషయము గురుముఖతా విచారించి తెలుసుకొనవలెను.



**80వ పద్యము : మేనొక్కటి నే నొక్కట । నే, నీ మాటలను విడచి, నిను నీతనువున్। నేనేనని యచలము గని । నేనను నీవేగవోయీ నే మృషననుచున్ ॥**

**పదవిభాగము :** మేనొక్కటి, నేనొక్కటి, అనే నీ మాటలను విడచి నిను - నీ తనువున్ నేనేనని, అచలము గని, । నేనను నీవు నే మృషననుచు నీ వేగ వోయీ ॥

**భావము :** నేను వేరు నా శరీరము వేరు (నేను బ్రహ్మను, శరీరము ప్రకృతి) అనే నీ మునుపటి విచారణ విడచి, నేను - మేను ప్రకృతియే కాని, శాశ్వతమైనది ఏదీ కాదని, మిధ్యా స్వరూపములేయని, శాశ్వతమైనది పరిపూర్ణ బ్రహ్మమొక్కటే అని గురుముఖతా విచారించి తెలిసికొని, నేనే బ్రహ్మను అనే అవిద్య మృషయని తెలసి, అవిద్య చేతనే పరిపూర్ణ పరబ్రహ్మమును గురుకరుణచే చూచి, అవిద్యను లేకుండా చేసికొనినచో నేను లేకపోవును.

(శరీరము - అపరాప్రకృతి, దేహి - పరాప్రకృతి. ఇది ప్రాథమిక విచారణ
అవిద్య అనే ఉపాధి - అపరా ప్రకృతి - అందలి ప్రతిబింబము పరాప్రకృతి
ఇదే ప్రకృతి ద్వయము. ఇది ఆరూఢ విచారణ)

**81వ పద్యము : దేహమున కొంత నిజమని । మోహంబున నిల్పుకొనుటె మోసంబు, గురు । ద్రోహమగు, గాన విడువుము। మోహంబును, మేల్కని కల మునిగిన రీతిన్॥**

**దండాన్వయము :** దేహమున కొంత నిజమని మోహంబున నిల్పుకొనుటే మోసంబు, గురుద్రోహమగు, గాన కలమేల్కని మునిగిన రీతిన్, మోహంబును విడువుము.

**టీక :** మోహంబున = అజ్ఞానముచే, మోసము = ప్రమాదము, ద్రోహము = కీడు చేయు కోరిక, గురుద్రోహము = గుర్వాజ్ఞను ధిక్కరించుట, మునిగిన రీతిన్ = లేకపోయిన విధముగా, నిజమని = శాశ్వతమని.

**భావము :** శిష్యా! శరీరమున కొంత శాశ్వతమని, ప్రతిబింబము శాశ్వతమని బ్రహ్మమని దాని మీద ఉండే ప్రేమ చేత శాశ్వతమని భావించుట ప్రమాదము (పునర్జన్మ కారణము) మరియు అది గురు ద్రోహము అగును. కనుక కల మేల్కను చూచి లేకపోయిన విధముగా, ప్రతిబింబము గల అవిద్యను లేకుండ విడచిపెట్టుము.

**విశేష భావము :** మూడు శరీరములు (దేహములు) నశించిపోయేవే అనియు, దేహి అయిన ప్రతిబింబ చైతన్యము శాశ్వతమైనదని భావించుట అజ్ఞానము. దేహము ఆధారము, దేహి ప్రతిబింబము. ప్రతిబింబమునకు సహజమైన ఉనికి లేదు. కనుక ఇది కూడా లేనిదే. పరిపూర్ణము మాత్రమే శాశ్వతమైనది.

---

**82వ పద్యము : చలన మన నీవు సుమీ్మ ! చలన రహిత మనిన బయలు, చలనమె కల, యీ । చలనము చలన రహితము । గలదని కని, తొలగ మేలు కగునో యప్పా॥**

**టీక :** చలనము = ఎరుక, కల = లేక ఉన్నది; మేలుకగును = శుభము, కలుగును అప్పా = తండ్రీ !!

**భావము :** శిష్యా! ఎరుకనగా నీవె సుమా ! ఎరుక లేనిది పరిపూర్ణమె. ఎరుక లేక ఉన్నది. శాశ్వతమైనది కాదు. ఇట్టి కల వంటి ఎరుక, పరిపూర్ణము ఉన్నదని విచారించినచో అది మేల్క అగును. అనగా శుభము అనగా (జన్మ రహితము అగును అని భావము)

**విశేష భావము :** చలనము అనగా కదలిక, తాను కదలుట, తాను కదలకుండ తన సత్తాచే ఇతరమును కదలించుట ఈ రెండు లక్షణములు ఎరుకవే. కనుక ఈ పద్యములో "చలనము" అను పదము ఎరుకకు వాడిరి.

---

**83వ పద్యము : ఈ గుర్తెరిగే మేనును । బాగుగ విడచుండు, మిందు బట్టకు దేనిన్।**
**ఆగడమౌ దానను విని । త్యాగము నీకుంటె మంచిదౌరావోరీ ॥**

**టీక :** బాగుగ = ధృడముగ, పూర్తిగ ఇందున్ = ఈ రెంటిలో, పట్టకు = శాశ్వతమని నిలబెట్టకు, ఆగడము - వెర్రి పని, త్యాగము = విడుపు (విడచే శక్తి), ఔ = అగును, ఔరా = అగునురా ।

**పద విభాగము :** ఈ గుర్తెరిగే మేనును, బాగుగ విడచి ఉందుము । ఇందున్ దేనిన్ పట్టకుము । దానను ఆగడ ముఔ। విని నీకు త్యాగము ఉంటే మంచిది ఔరా, ఓరీ॥

**భావము :** ఓ శిష్యా! ఈ గుర్తు, ఎరిగే శరీరమును (ఈ రెంటిని కూడ) విడిచిపెట్టుము. ఇందులో దేనిని నిలబెట్టకుము. ఆ విధము ఆ రెంటిలో ఒకటి (గుర్తును, శాశ్వతమని భావించితే, అది వెర్రి పని అగును. ఈ విధముగా విని, వాటిని (ఆ రెంటిని) విడువ గల శక్తి (నేర్పరితనము) నీకు ఉన్నచో మంచిది. అనగా అక్కడితో సమస్త జన్మ కర్మలు నశించిపోవును. ఈలా జరుగుట మంచిది అగును అని భావము.

---

**84వ పద్యము : చలియించని దాకాశము । చలనంబే వాయువనుచు సాటింపదగున్।**
**చలనమె విశ్వము నేనన । చలనమె తను వెరుక లనిన, జగమనిన, సుతా ॥**

**పద విభాగము :** చలియించనిదా ఆకాశము? చలనంబే । చలనమె వాయువు అనుచు సాటింపదగున్ । చలనమె విశ్వము నేనన, తను వెరుకలనిన, జగమనిన సుతా ।

**టీక :** చలియించనిదా? = ఎరుక లేనిదా ? చలనమె = యొరుకయే, విశ్వము=జగదధిష్ఠానమైన ఎరుక (అఖండ ఎరుక) నేనన = ఈశ్వరుడన, తనువు = పిండాండము, ఎరుక = జీవుడు, జగము = బ్రహ్మాండము సాటింపదగున్ = తెలియపర్చదగును.

**భావము :** ఓ కుమారా! ఆకాశము ఎరుక లేనిదా ? ఎరుకయే, వాయువు - ఎరుకయే, సమస్త జగత్తు, జగదదిష్ఠానము, ఈశ్వరుడు, జీవుడు పిండాండము, సమస్తము ఎరుకయే అని తెలియపర్చదగును.

---

**85వ పద్యము : వలదెక్కువ ముచ్చట్లిక । చలనము లేనట్టి బయలు చందము గని, యీ । చలవమగు నీకు, నీవే । తలిదండ్రులటంచు దెలసి, తలగుము చాలున్ ॥**

**టీక :** ముచ్చట్లు = మాటలు (విచారణ) చందము = విధము, గని = చూచి, తెలసి, తలగుము = లేకుండా పొమ్ము, చాలున్ = సరిపోవును.

**భావము :** శిష్యా! ఇక బోధలు, వ్యాఖ్యానములు ఇక చాలును; ఎరుక లేని పరిపూర్ణము యొక్క విధమును విచారించి చూచి, యీ యెరుకే నీకు (నేనుకు) మూలమని (తలి, దండ్రియని) తెలుసుకొని లేకుండా పొమ్ము. అంతటితో సరిపోవును. ఇంతకన్న మరేమియు అక్కర లేదని భావము.

---

**అవతారిక :** పరిపూర్ణ బ్రహ్మము కేవల నిర్వికార నిర్గుణమైనదనియు, అందులేక ఏర్పడిన మాయా బ్రహ్మమే సకల ధర్మ కర్మ స్వరూపమని తెలియపర్చుచున్నారు.

**86వ పద్యము : బ్రహ్మందు లేక కలిగిన । బ్రహ్మను వేననెటి మాయ ప్రబలె జగంబై। బ్రహ్మను గని తానేగుటె । బ్రహ్మనవె మాయకు పని, బ్రహ్మందు జుమీ॥**

**టీక :** ప్రబలె = అతిశయిల్లెను, వర్ధిల్లెను, ఏగుటె = లేకపోవుటె, పనిజుమీ = పనిసుమా॥ బ్రహ్మందు = పరిపూర్ణ బ్రహ్మము నందు.

**భావము :** శిష్యా! పరిపూర్ణ పరబ్రహ్మమందు లేనిదె కలిగిన మాయ (మూల ప్రకృతి) తానే బ్రహ్మననుచు ఈ సమస్త జగత్తును ఏర్పరుచు వర్ధిల్లుచున్నది. ఇట్టి మాయా బ్రహ్మము (ఎరుక) తన ఉనికి లేనిదని గ్రహించి, పరిపూర్ణ బ్రహ్మను చూచి, పరిపూర్ణ బ్రహ్మము నందు తాను లేకపోవుటె మాయా బ్రహ్మమునకు పని సుమా!

**విశేష భావము :** పరిపూర్ణ బ్రహ్మములో తనకు తానే మాయ అనబడే మూల ప్రకృతి ఏర్పడినది. కనుకనే దీనిని స్వయంభూః అనిరి. ఇది లేకతోచినది. ఉన్నదనుటకు

గాని లేనిదనటకు గాని వీలు కాదు. కనుక మాయ లేకనే ఉన్నట్లు తోచబడేది. ఇది స్వతః జడమే, కాని అద్దము వలె ప్రతిబింబింప జేసుకొనే లక్షణము గలది. కనుక ఈ మాయ ఏర్పడిన వెంటనే పరిపూర్ణ బ్రహ్మము మాయ యందు ప్రతిబింబితమైనది. అనగా మాయ తన లక్షణముచే పరిపూర్ణ బ్రహ్మమును ప్రతిబింబించుకొన్నది. ఆ ప్రతిబింబ చైతన్యము వలననే, మాయకు అస్తిత్వము, చైతన్యము, అమృతత్వము ఏర్పడుచున్నది. తన చైతన్య శక్తిచే మాయ, సమస్త జగత్తును సంకల్పమాత్రముచే సృష్టించుచున్నది. అట్టి కల్పిత జగత్తుకు మాయయే కర్త భోక్త అగుచు, తానే బ్రహ్మనని ప్రచురించుకొనుచున్నది. ఇట్టి మాయ బ్రహ్మ ఉన్నంత వరకు జగత్తు శాశ్వతము. మాయ బ్రహ్మ నిజమునకు బ్రహ్మకాదు. కనుక లేకపోవుట కూడా దాని సహజగుణము. అది ఎప్పుడు లేకపోవునో అప్పుడు జగత్తు కూడా లేకపోవును. ఈ మాయ బ్రహ్మ (ఎరుక) గురుకరుణచే పరిపూర్ణ బ్రహ్మమును సాక్షాత్తుగ చూచిన వెంటనే పూర్తిగా లేకపోవును.

**87వ పద్యము : నిరుపాధిక మగు బయలున । మరి లేకనె కలిగినట్టి మారుతమునకే। పరియాయ నామములగు । కరువలియన, యెరుకయనిన కడు మాయయనన్ ।**

**టీక :** నిరుపాధికము = ఉపాధి ఎంతమాత్రము లేని, మారుతము = వాయువు, పరియాయ నామములు = అదే అర్థమునిచ్చే ఇతర పేర్లు, కరువలి = వాయువు.

**భావము :** ఉపాధిరహితమైన బయలులో (పరిపూర్ణములో) లేనిదే ఏర్పడిన వాయువునకే, కరువలియని, ఎరుకని మాయ అని ఇతరనామములు.

**విశేష భావము :** బయలుకు పరాకాశము అని పేరు గలదు. పరాకాశము కూడా ఆకాశము వలెనే నిరవయవమే. ఆకాశము మితి గలిగినది. పరాకాశము అమితము. ఉపాధి ఎంత మాత్రము లేనిదె. ఆకాశము నుండి వాయువు ఏర్పడినది. అట్లే ఉపాధి రహితమైన బయలు నుండి మాయ ఏర్పడినది. దీనికి చలించుట స్వభావము. కనుక ఈ పద్యములో చలనము గల ఎరుక యేర్పడినది అని చెప్పుటే మారుతము (వాయువు) కలిగినది అన్నారు. ఆ వాయువే పిండాండములో దేహి అను పేరుతో వ్యవహరించుచు, ఉచ్ఛ్వాస నిశ్వాస రూపమైన ప్రాణముగా తెలియబడుచున్నది. ఈ ప్రాణమే ఎరుక - ఉండుట లేకపోవుట, సహజ గుణములు. కనుకనే ఈ పద్యములో శ్రీ కృష్ణ దేశికేంద్రులు ఎరుకను వాయువని పేర్కొనిరి.

**అవతారిక :** ఎరుకకు ఉన్న ఇంకా వ్యవహారిక నామములు ఈ పద్యములో చెప్పుచున్నారు.

**88వ పద్యము : మానసము దేహి జీవుం। డా నందము సత్తు, చిత్తు లహము, జగదదిష్ఠానంబు, సాక్షి సత్య! జ్ఞానము, ద్రష్ట నిన నీవె, సత్యము సుజ్ఞా ॥**

**టీక :** మానసము = మనస్సు, దేహి = దేహమును ధరించినవాడు, జీవాత్మ, జీవుండు = శరీరమును జీవింపజేయునది; సత్తు = ఉన్నదని తెలియబడేది, చిత్తు = ప్రకాశ స్వరూపము, అహము = అవిద్య, సాక్షి = వికారరహితమైన అవిద్యా ప్రతిబింబము, సత్యజ్ఞానము = సత్వగుణ ప్రతిబింబిత జ్ఞానము, ద్రష్ట = సమస్తమును గుర్తించునది (కర్త) నీవె = ఎరుకయే, సుజ్ఞా = చక్కగా తెలిసినవాడా !

**భావము :** చక్కని విచారణ చేయు శిష్యా! మనస్సు, దేహి, జీవుడు, ఆనందము, సత్తు, చిత్తు, అహము, జగదధిష్ఠానము, సత్యజ్ఞానము, ద్రష్ట, సాక్షి ఈ పేర్లన్నియు నీవే అయిన ఎరుకకే సుమా !

---

**89వ పద్యము: జ్ఞానా జ్ఞానంబులు యీ। జ్ఞానంబువె కాని, వేరుగా వెన్నటికీ। జ్ఞానా జ్ఞానానికి పని। జ్ఞానా తీతమును గాంచి చనుట యె సుమ్మీ ॥**

**టీక :** జ్ఞాన = ఎరుగుట, అజ్ఞాన = మరుచుట, (ఎరుక - మరుపులు) యీ జ్ఞానంబువె = యీ యెరుక పనులె, జ్ఞానా జ్ఞానానికి = ఎరుకకు, జ్ఞానాతీతము = పరిపూర్ణము, చనుట = లేకపోవుట.

**భావము :** శిష్యా! ఎరుగుట, మరచుట యీ రెండు పనులు యీ యెరుకవే కాని మరొక దానివి అని భావించకుము. ఇట్టి యెరుక పరిపూర్ణమును చూచి లేకపోవుటయే యెరుక చేయవలసిన ముఖ్యమైన పని సుమా ॥

**విశేష భావము :** జ్ఞానము అనగా ప్రతిబింబ చైతన్యము, అజ్ఞానమనగా అవిద్య అనే ఉపాధి. ఈ రెండు కలిసియే ఎరుక అనబడుచున్నది. ఈ రెండు ఎన్నటికి విడవడి ఉండనేరవు. కనుకనే ఈ పద్యములో జ్ఞానాజ్ఞానమని ఎరుకకు వాడిరి.

---

**90వ పద్యము : జలమందు మొదలు లేకనె । జల చరములు పుట్టి పెరిగి సమసిన రీతిన్ । అల పరిపూర్ణములో, నీ । విల సజ్జననంబు స్థితియు విలయము లౌరా ॥**

**టీక :** సమసిన రీతిన్ = నశించిన విధముగా, నీవు ఇల సజ్జననంబు = నీవు (ఎరుక) భూమి పై చక్కగా పుట్టుట, స్థితియు = వృద్ధిపొందుట; విలయము = పూర్తిగా లేకపోవుట, ఔరా = అగును.

**భావము :** శిష్యా! నీటి యందు మొట్ట మొదట జలచరములు లేవు. అట్టి విధముగా ఉన్న నీటి యందు లేకనే జలచరములు పుట్టి, పెరిగి, నశించిన విధముగా, ఎరుక ఈ భూమి పై చక్కగా పుట్టి, పెరిగి చివరకు పూర్తిగా లేకుండా పోవుచున్నది.

---

**91వ పద్యము : అచలమున మొదలు లేకనె । సచరాచర జంతునిచయ జననమగు, య। ప్పుచయమున లేని జలచర । నిచయము జన్మించినట్లు నిశ్చయము సుమీ ॥**

**దండాన్వయము :** అప్పుచయమున లేని జలచర నిచయము, జన్మించినట్లు, మొదలు లేకనె అచలమున సచరా చర జంతునిచయము జననమగు । నిశ్చయము సుమీ ॥

**టీక :** అచలమున = పరిపూర్ణమందున, మొదలు లేకనె = మొట్టమొదట లేకుండానే, మూలము లేకనె, సచరా చర = కదిలేది కదలనివి, జంతునిచయ = జీవ సమూహము, అప్పుచయమున = సముద్రమునందు, నిశ్చయము = నిజము.

**భావము :** సముద్రములో మొట్టమొదటగా లేని జలచర జీవ సమూహము, తరువాత (ఒకానొకప్పుడు) పుట్టి, పెరిగి నశించినట్లుగా, పరిపూర్ణ పరబ్రహ్మమందు మొదట లేకనే చరాచర జీవ సమూహముతో గూడిన సమస్త జగత్తు, పుట్టుచున్నది. ఇది నిజము సుమా.

---

**అవతారిక :** సమస్త పిండ బ్రహ్మాండములు పరిపూర్ణ బ్రహ్మములోనే ఉన్నవి. అయితే పరిపూర్ణములో ఈ జగత్తు లేదు. పరిపూర్ణము మాత్రమే ఉన్నదని చెప్పుచున్నారు.

**92వ పద్యము : నీ రందు చేప లేకనె । నీరున జన్మించి మించి నీల్గిన రీతిన్ । తోర మగు బట్టబైటను । వారక గుర్తెరుగు మేము వచ్చుచ్ పోవున్ ॥**

**టీక :** నీరందు = నీటియందు, మించి = పెరిగి, నీల్గిన = చచ్చిన, తోరమగు = గొప్పదైన, వారక = లేని, గుర్తెరుగుమేను = గుర్తు ఎరిగే శరీరము (ఎరుక).

**భావము :** శిష్యా! నీటిలో మొట్టమొదటగా చేపలేకపోయిననూ, తరువాత కొంతకాలమునకు తనకు తానే చేప నీటియందే జన్మించి, పెరిగి, నశించి పోవుచున్నట్లుగా, అఖండమైన పరిపూర్ణ బ్రహ్మములో లేని యీ గుర్తెరిగే శరీరము (ఎరుక) పుట్టి పెరగి లేకపోవుచున్నది. (వచ్చును, పోవును)



**అవతారిక :** సమస్తము పరిపూర్ణములోనే లేక ఉన్నది. కాని నీలో పరిపూర్ణము లేదని యుక్తి పూర్వకముగా చెప్పుచున్నారు.

**93వ పద్యము : జలధి జలచరము లోపల । గలదా? జలరాశిలోని జలచరము వలెన్। జలధి నిత్యంబనిత్యము । జలచర, మట్లచల, చలము సరణుల గనుమీ ॥**

**టీక :** జలధి = సముద్రము, జలచరము = చేప, జలరాశి = సముద్రము, నిత్యము = శాశ్వతము, అనిత్యము = శాశ్వతము కానిది, సరణుల = త్రోవల, విధముల, మార్గముల, గనుమీ = విచారించి తెలుసుకొనుము.

**పద విభాగము :** జలధి నిత్యము, అనిత్యము జల చరము, అట్లు అచల చలము సరణుల గనుమీ ॥

**భావము :** శిష్యా! సముద్రములో ఉన్న చేప యందు నీరు ఉన్నదా? లేదు. సముద్రము శాశ్వతము. చేప అశాశ్వతము. ఆ విధముగా పరిపూర్ణము ఎరుకల యొక్క విధానమును కూడా, అని విచారించి తెలుసుకొనుము.

**విశేష భావము :** ఈ పద్యములో నీటిలోనే ఉన్న చేప యందు నీరు లేని విధముగా, పరిపూర్ణములోనే ఉన్న సమస్త పిండ, బ్రహ్మాండములయందు పరిపూర్ణము లేదని యుక్తితో సెలవిచ్చిరి. అయితే ఏ పరిపూర్ణము మేనికి లోపల వెలినిండి యుండు లోపము లేకన్'' అని కందార్థము 146లో, పరిపూర్ణము శరీరమునకు లోపల వెలుపల అంతటా నిండియున్నది అని సెలవిచ్చిరి. ఈ కంద పద్యములో శరీరములో పరిపూర్ణము లేదని చెప్పిరి. ఈ వైవిధ్యము ఎందుకు? పరిపూర్ణము యొక్క ప్రతిబింమము మాత్రమే పిండ

బ్రహ్మాండము లయందంతటా నిండియున్నది. కాని పరిపూర్ణము మాత్రము లేదు. అయితే బింబ ప్రతిబింబములు సామ్యము కలదు. అందుచే మేనికి లోపల వెలినిండియున్నది పరిపూర్ణము. ఎరుక లేనిది. అది లేక పోతే ఉన్నది అంతా పరిపూర్ణము. కనుక ఎరుకలో లేక ఉన్నది పరిపూర్ణము. అనగా ప్రతిబింబ రూపము అని అర్థము. కనుక ఈ కంద పద్యములో పరిపూర్ణము స్వతః ఎరుకలో లేదు అని చెప్పుచు, ఎరుకలో ఉన్నది పరిపూర్ణము యొక్క ప్రతిబింబము అని చెప్పక చెప్పిరి. ఈ విషయము చక్కగా గురుముఖతా విచారించి ధృఢ పరచుకోవలసియున్నది. పరిపూర్ణము ఎరుకలో ఎలా నిండియున్నది. తెలియకపోతే పరిపూర్ణము, ఎరుక రెంటి స్వరూపము తెలియనట్లే అగును.

---

**94వ పద్యము : జలరాశికి బుట్టవు గద । జలచరములు, వాటికవ్వె జనియించు గదా। కలకాల మిట్లు బయలెరు । కల గాంచిన, సంశయంబు కడకేగు జుమీ ॥**

**టీక :** జలరాశి = సముద్రము, కలకాలము = ఎల్లప్పుడు, గాంచిన = విచారించి తెలుసుకొనిన, సంశయంబు = ఎరుక, కడకేగు = చివరకు లేకుండును.

**భావము :** శిష్యా! చేపలు సముద్రమునకు పుట్టలేదు. సముద్రములో వాటంతట అవే పుట్టుచున్నవి. ఈ విధముగా పరిపూర్ణము ఎరుకలను విచారించి చూచినచో, ఎరుక చివరకు లేకపోవును సుమా !

**విశేష భావము :** చేప సముద్రములోనే పుట్టినది. కాని సముద్రమునకు (సముద్రము వలన) పుట్టలేదు. అట్లే ఎరుక పరిపూర్ణములో తనకు తానే పుట్టినది. పరిపూర్ణము వలన (పరిపూర్ణమునకు) పుట్టలేదు. ఈ విషయము బాగుగ విచారించి తెలిసికొనినచో, శాశ్వతమైనది. అనాది సిద్ధమైనది పరిపూర్ణమని, అందులో లేనిదే తనకు తానుగ లేక కలిగిన మిధ్యా స్వరూపము ఎరుక అనియు, కనుక ఎరుక మూలము లేనిదనియు,ధృడముగా తెలియబడి చివరకు లేని ఎరుక లేకుండా పోవును.

---

**అవతారిక :** పరిపూర్ణము ఎరుకల యొక్క ముఖ్యమైన భేద లక్షణములను చెప్పుచున్నారు.

**95వ పద్యము : పుట్టదు గిట్టదు వొకరిని । పుట్టించదు చంపబోదు భూమ, యెరుకతా। బుట్టును గిట్టును వొకరిని । పుట్టించును సమయజేయు భూమకితరమై ॥**

**టీక :** గిట్టదు = చనిపోదు, భూమ = పరిపూర్ణము, సమయజేయు = చంపును, ఇతరమై = వ్యతిరిక్తమై.

**భావము :** శిష్యా! పరిపూర్ణము పుట్టదు, చావదు, ఇతరమును పుట్టించదు, చంపదు. ఎరుక తాను పుట్టును, చచ్చును, ఇతరమును పుట్టించును, చంపును (నశింపజేయును) ఇది పరిపూర్ణ బ్రహ్మమునకు వ్యతిరిక్తమైనది. (అనగా పరిపూర్ణము - ఎరుక రెండు వ్యతిరిక్త లక్షణములు కలది అని భావము.



**96వ పద్యము : కల లోపల యేనుగు పై । గల, దొరమేల్కనిన నిల్వ గలడా?, గురుడున్ । తెలపి బయలు నీవు లేవిక । దలపకు మననిన నీకు నిల్వాదరమా తలపన్॥**

**దండాన్వయం :** గురుడున్ బయలు దెలపి, నీవు లేవు, ఇక దలపకు మననిన నీకు నిల్వాదరమా! తలపన్ ॥

**భావము :** స్వప్నములో యేనుగు పై సన్మానింపబడుచున్నట్లు కల గన్నవాడు, మేల్కొని జాగ్రదవస్థలోనికి వచ్చినప్పుడు, అతను ఏనుగు పై ఉండునా? లేడు. అట్లే తలచి చూడగా గురుమూర్తి పరిపూర్ణమును తెలియపరచి, నీవైన యీ యెరుక లేదని ధృడము చేయగా, ఇంకా నేను ఉన్నానని భావించగలవా? భావించలేవు. అనగా పరిపూర్ణమె శాశ్వతమై ఉన్నదనియు, ఎరుక స్వప్నములో తోచిన ప్రపంచము వలె మిధ్యా స్వరూపమని ధృఢపడిన పిదప, తాను శాశ్వతమని ఉన్నట్లు ఎంతమాత్రము భావించలేడు.



**97వ పద్యము : ఎందరు లేదన్నను తా । నెందుకు లేకుండు బయలు, నే నీవనకన్। యెందరు కలదని యన్నను । యెందుకు కలిగుండు యెరుక నే నీవచున్ ॥**

**దండాన్వయము :** నే నీ వనకన్ బయలు, ఎందరు లేదన్నను, తానెందుకు లేకుండు? నే నీ వనుచున్ ఎరుక, యెందరు కలదని యన్నను ఎందుకు కలిగుండు?॥

**భావము :** ఆత్మ అని (బ్రహ్మమ్మని) జగత్తని తెలియని పరిపూర్ణము, అజ్ఞానముచే ఎంతమంది లేదు అని అన్నప్పటికి ఎందుకు లేకుండును? అనగా శాశ్వతమైన దానిని ఎంతమంది లేదన్ననూ అది శాశ్వతముగా ఉండనే ఉండును. ఉన్నదన్నా లేదన్నా అది శాశ్వతముగా ఉన్నది. అదే విధముగా ఆత్మ అని జగత్తని వేరు పర్చే ద్వంద్వ ప్రవర్తన కల యెరుక, ఉన్నది అని అన్ననూ (అది) ఎరుక ఉన్నది కాదు. అనగా ఎరుక లేనిది. మిథ్యా స్వరూపము. లేనిది ఉన్నది అన్ననూ ఉండేది కాదు అని భావము. ఎప్పటికయినా లేదని తెలియబడును.

**విశేష భావము :** భగవద్గీత 2వ అధ్యాయం, 6వ శ్లోకం

"నా సతో విద్యతే భావో । నా భావో విద్యతే సతః"

లేనిది ఉంటుందని భావించకు । ఉన్నదానిని ఒకప్పుడైనా లేకపోవచ్చునని భావించకుము, అని చెప్పబడినది.

---

**98వ పద్యము : నీ కచ్చిరాని యూరున । నీకే గృహమచ్చునట్లు, నీవౌమేనన్ । నీ కచ్చిరాదు, నీవు విను । చేకొనుటము మానవయ్య, శ్రేయస్కామా!**

**టీక :** అచ్చిరాని = లాభించని, శుభమును కలిగించని, శ్రేయస్కామా = శ్రేయస్సు కోరువాడా!; మోక్షము కోరువాడా ॥

**భావము :** నీకు శుభము కలిగించని గ్రామములో ఏ యిల్లు అచ్చిరాని విధముగానే, నీవు అయిన నీ శరీరము (అవిద్య) నీకు శుభము కలిగింపనేరదు. కనుక మోక్షము కోరు ఓ శిష్యా! నీవే అయిన నీ శరీరమును (ఎరుక, అవిద్య, అంతఃకరణ) చేకొనుట మానుము. అనగా విడిచిపెట్టుము.

**విశేష భావము :** గ్రామార్వణము అను శాస్త్ర రీత్యా తన పేరుకు శుభమును కలిగించే పేరు గల గ్రామములో కాపురమునకు ఎంచుకొందురు. అట్లు శుభమును కలిగించని గ్రామములో ఏ యిల్లు అయినా శుభము కలిగించదు కదా! అట్లే నేను నీవు అనేది గుర్తెరిగే శరీరమే (అవిద్య + ప్రతిబింబము) దేవతా శరీరములతోను, సమస్తములైన జీవ శరీరములలోను ఉన్నదే. అవిద్య అనేది ఎరిగే శరీరము. అది నీకు శుభమును కలిగించదు. దుఃఖకారణము. ఆది దేవతా శరీరమైనను క్షుద్ర శరీరమైనను ఒక్కటే

కనుక అవిద్య అనే గ్రామమును పూర్తిగా విడువలెను. అనగా ఎరుకను పూర్తిగా విడువుము అని పద్య భావము.

**గ్రామార్వణము :** వ్యక్తి యొక్క నామ నక్షత్రము, గ్రామము యొక్క నామ నక్షత్రములో

మొదటి అయిదు నక్షత్రములలో ఉన్నచో - ఆరోగ్యము, శుభము. తర్వాతి మూడు నక్షత్రములలో ఉన్నచో - ధన నాశనము.

తర్వాతి అయిదు నక్షత్రములలో ఉన్నచో - శుభము.
తర్వాతి ఆరు నక్షత్రములలో ఉన్నచో - స్త్రీ అరిష్టము, ధన నాశనము
తర్వాతి 1 నక్షత్రములో ఉన్నచో - శరీర పీడ
తరువాతి 4 నక్షత్రములలో ఉన్నచో - ధన ధాన్య సంపద
తరువాతి 2 నక్షత్రములలో ఉన్నచో - మరణము
తరువాతి 1 నక్షత్రములో ఉన్నచో - దరిద్రము.

**99వ పద్యము : అష్టాంగ యోగముల నతి । కష్టించే ప్రజల వలెనె కష్టించక, యీ। స్పష్టమగు బోధ వినుమ, నీ । కష్టములన్నియును తొలగి కడుకేగునుమీ ॥**

**టీక :** అష్టాంగ యోగములు = యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులు; స్పష్టమగు = గజిబిజిలేని.

**భావము :** ఓ శిష్యా! అష్టాంగములు నభ్యసించుచు, అతిగా కష్టపడే భ్రాంతి మయ ప్రజల వలెనే, నీవు కష్టపడక తిన్ననైన, గజిబిజి లేని యీ పరిపూర్ణ బోధ విని సాధించినచో, సమస్త జన్మదుఃఖములన్నియు లేకుండాపోవును. తిరిగి జన్మకురావు అని భావము.

**100వ పద్యము : ఇది కాదు బోధ, నె దె । ల్పెద రమ్మని నీకు, వేరే పేరిడి యవలన్। ముదమువనే బ్రహ్మననుచు । వదరు మనిన వాడె మాయ, వసుమతి లోనన్ ॥**

**దండాన్వయం :** ఇది కాదు బోధ, నీకు నే దెల్పెద ముదమున, రమ్మని (బోధకు) వేరే పేరిడి, అవలన్ నే బ్రహ్మ నంచు వదరు మనిన వాడే మాయ, వసుమతిలోనన్॥

**భావము :** ఇది సరియైన బోధ కాదు, అని వేరే పేరు చెప్పి, ఆ బోధ నేను నీకు చెప్పెదనని, నిన్ను సంతోషముతో తనతో రమ్మని చెప్పి ఆ బోధ చెప్పి చివరకు "నేను" (అహం బ్రహ్మ) అని చెప్పేవాడే ఈ భూమి పై మాయ వేదాంతి (మాయ గురువు) అని తెలుసుకొనుము.

---

**101వ పద్యము : మంత్ర యంత్రములు ముద్రలు । తంత్రంబులు నీకు దెల్పి, ధన మడిగెటి, యూ । మంత్రజ్ఞుల మంత్రములకు । యంత్రములకు, తంత్రములకు నీగకు కూనా ॥**

**టీక :** యంత్రములు = బీజాక్షర, చక్ర, రేఖా విశేషములు, తంత్రము = కీడు తొలగించు ఉపాయములు, విష వైద్యము, ముద్ర = మూత-శాంభవి షణ్ముకి మొదలగు 6 విధములైన ముద్రలు, ఈగకు = ప్రవేశించకు, లోనుగాకుము, కూనా=కుర్రవాడా !

**భావము :** శిష్యా! పంచాక్షర్యాది మంత్రములు, బీజాక్షర లిఖితరేఖా విశేష యంత్రములు, ఇంకా అనేక తాంత్రిక ఇంద్రజాలాది విద్యలు, షడ్విద ముద్రలు నీకు ఈ రకమైనవి చెప్పి, నీ వద్ద నుండి విశేషముగా ధనము తీసుకొనే, మాంత్రికుల, తాంత్రికుల మోసములకు లోనుగాకు సుమా !

**విశేష భావము :** మంత్రములు - సప్త కోటి మహా మంత్రములు కలవు. ఈ మంత్రములకు చక్ర, రేఖా రచితమైనవి యంత్రములు. ఇవి ఇహలోక పరలోక భోగసాధకములు. ఆచరణ లోపము జరిగినచో గొప్ప కీడు కలిగించును. తంత్రములు-తామసీగుణయుక్త భోగ సాధకములు. ఇంద్రజాలాది 64 విద్యలు - తంత్రములు. పైన చెప్పిన మంత్రములు యంత్రములు, తంత్రములు మంత్ర రత్నాకరము 1, 2 భాగములలో చూడనగును. ముద్రలు వాటి విధానములు - పతంజలి యోగశాస్త్రములో చూడనగును.

---

**102వ పద్యము : దీపము గతి కన్నులలో । పాపవలెన్ మెలగు నిన్ను పరమాత్ముడ, వం। చీ ప్రజలు దలతు రెరుగక । నీ పాట్లెరుగుండి నేను నిను నమ్ముదునే ।**

**టీక :** గతి = విధముగా, పాపవలెన్ = కంటినల్లగుడ్డులోని ఫలనము వలెనే, మెలగు

= సంచరించు, నిన్ను = నేను యొక్క కళ, పాట్లు = దుఃఖములు (జనన మరణములు)

**భావము :** శిష్యా! కంటి నల్ల గ్రుడ్డు మధ్యలో సంచరించే ప్రతిబింబము వలెనే ఒక ప్రకాశము సాధనముచేయగా కనిపించును. ఇదే ఆపోజ్యోతి. ప్రజలు కొంతమంది అజ్ఞానముచే బ్రహ్మము ఏదో తెలియక, ఈ ఆపోజ్యోతినే పరమాత్మ (బ్రహ్మము)గా తలచెదరు. ఇది నీలోని యెరుక యొక్క చైతన్యమే. ఎరుక యొక్క పాట్లు తెలసిన నేను, ఆ ఆపోజ్యోతిని పరమాత్మ అంటే నమ్ముదునా? నమ్మనని భావము.



**103వ పద్యము : తర్జనుల వలన జూపును। అర్జున వర్ణగత నీలమని, శిష్యులకున్। దౌర్జన్యగురుడు, నీవు వి। సర్జింపు మసత్యమనుచు, సజ్జనతిలకా ॥**

**టీక :** తర్జనులు = అంగుష్ఠము వేలు తర్వాతి వేలు, అర్జున వర్ణగత = ఎరుపురంగుతో కూడిన.

**భావము :** శిష్యా! తర్జనీ వ్రేళ్లతో కనులు మూసి, ఆ కనులలో కనుపించే జ్యోతి, ఎరుపు రంగు మధ్యలో నీలి రంగుతో కూడిన ఆపో జ్యోతిని చూపించి అదే పరమాత్మయని దుష్టగురువులు చెప్పెదరు. అవన్నియు నిజము కాదు, అట్టి వారిని విడచిపెట్టుము.



**104వ పద్యము : పురుషోత్తముడని పూజలు। నరులొన రింపుదరు భువిని నానా చోట్లన్। ధర మొదలగు భూతములను। చిరుత శిశువులాడు కొనెటి చేష్టల రీతిన్॥**

**టీక :** పురుషోత్తముడని = పరబ్రహ్మమని, ధర మొదలగు భూతములను = భూమి మొదలైన పంచ భూతములను, చిరుత శిశువులు = చిన్న పిల్లలు, చేష్టలు = పనులు.

**దండాన్వయము :** చిరుత శిశువులాడుకొను చేష్టల రీతిన్, భువిని నానా చోట్లన్ నరులు ధరమొదలగు భూతములను పురుషోత్తముడని పూజలు ఒనరింపుదరు॥

**భావము :** చిన్న పిల్లలు ఆడుకొనే రీతిగా భూమి పై అనేక చోట్ల అనేక మంది, భూమి మొదలగు పంచ భూతములను పరబ్రహ్మమని (దైవమని) పూజించుదురు. చిన్న పిల్లలు ఆడుకొనే బొమ్మలాటలు వంటిదే అని భావము.

**105వ పద్యము : రస మనదగనిది వస్తువ । బసవన్న కదెట్టు లెరుక, ప్రభువుకు దెలుసున్ । రసమైతే విసము సగుణము । ససిగాదా ముచ్చటంత చెవుల వినుటకై॥**

**టీక :** రసము = నిర్విశేషరసము (అమృతము) వస్తువ = బ్రహ్మము, బసవన్నకు= పామరునకు, ప్రభువుకు = గురు ప్రభువుకు, రసమైతే = అమృతమైతే, విసము = విషము, ససిగాదు = బాగుకాదు.

**దండాన్వయము :** వస్తువ రసమనదగనిది । బసవన్నకు అదెట్టులెరుక ? ప్రభువుకు తెలుసున్ । రసమైతే విసము, సగుణము, ఆ ముచ్చటంత చెవుల వినుటకై ససిగాదు.

**భావము :** శిష్యా! బ్రహ్మము నిర్విశేష రసము కాదు. నిర్విశేషరసము ఒక్కటి కాదు, అది రెంటి కలయిక. అందులోనే విషమైన (జగతత్త్వమైన) బలములు అనేకము కలవు. కనుక అది సగుణమే. ఈ విషయము పామరునకు తెలియదు. గురు ప్రభువుకు మాత్రమే తెలియును. రసమే బ్రహ్మము అనే మాటలు వినుటకు బాగుండదు.

**విశేష భావము :** పరిపూర్ణములో లేక ఏర్పడిన అఖండ యెరుక రెంటి సమ్మిశ్రమము. 1) నిర్విశేషరసము, 2) బలములు. ఇవి వరుసగా జ్ఞాన కర్మము, పురుష + ప్రకృతి, నేను + మేను, నిర్గుణ + సగుణములని చెప్పవచ్చును. రసము యొక్క అమృతత్త్వ సత్తా చేతనే బలము నుండి సమస్త జగత్తు ప్రభవ, ప్రతిష్ఠ పరాయణత్వములు పొందుచున్నవి. కనుక నిర్విశేష రసము ఏకమాత్రమైనది కాదు, ద్వంద్వ రూపము. రెండు విభిన్న గుణ కరాత్మక మిశ్రమము. కనుక ఇది బ్రహ్మముకానేరదు. (ఈ విచారణ "ఇదం బ్రహ్మ చతుష్పాద్" అను పాఠము బ్రహ్మ జ్ఞాన ప్రబోధ అనే పుస్తకంలో వివరించబడియున్నది.

**106వ పద్యము : నీరాంశము సృగ్వోదన । సారము రేతస్సు, రెంటి సమ్మిశ్రంబే। ధారుణి తనువై నిలచును । నారీ నర సంగమమున నయగుణ రత్నా ॥**

**దండాన్వయము :** నయగుణ రత్నా । నీరాంశము అసృక్, ఓదన సారము రేతస్సు, నారీ నర సంగమమున రెంటిటి సమ్మిశ్రంబే ధారుణి తనువై నిలచును ॥

**టీక :** నీరాంశము = నీటి యొక్క అంశము, అసృక్ = రక్తము, ఓదన సారము = అన్నము యొక్క సారము, సమ్మిశ్రంబు = చక్కగా కలియుట. నారీ = స్త్రీ నర=పురుషుడు, నయగుణరత్నా = మంచిగుణశ్రేష్ఠుడా ॥

**భావము :** మంచిగుణ శ్రేష్ఠా । శిష్యా! నీటి యొక్క సూక్ష్మాంశము రక్తము, అన్నము యొక్క సారము, సప్త ధాతువులు - అందులోదే రేతస్సు (పురుష బీజము) ఈ రెండును స్త్రీ పురుష కలియక చేత చక్కగా మిశ్రమమై భూమి పై శరీరము అను పేరుతో వెలయుచున్నది. 106, 107 ఈ కంద పద్యములకు శృతి ప్రమాణములు బ్రహ్మజ్ఞాన ప్రబోధ అను గ్రంథములో విశేషించి వ్రాయబడినది.



**107వ పద్యము : మనసన్నపు సూక్ష్మాంశము । వినుజల సూక్ష్మాంశము వలన వెలసెను ప్రాణం । బును, రెండు గలసి పిండం । బన, బ్రహ్మాండంబనంగ బరగును వత్సా ॥**

**టీక :** పిండంబన = శరీరమనియు, బ్రహ్మాండంబనంగ = జగత్తు అనియు (ఈశ్వర శరీరము) వత్సా = కుమారా !

**భావము :** కుమారా! అన్నము యొక్క సూక్ష్మాంశము మనస్సు, జలము యొక్క సూక్ష్మాంశము ప్రాణమును, ఈ రెండు గలసి పిండాండ శరీరము, బ్రహ్మాండ శరీరము (జగత్తు) యేర్పడుచున్నది.

(దీని పూర్తి విచారణ "మన సన్నపు సూక్ష్మాంశము" అన్న కందార్థమున భావ విశేష భావములో తెలియపర్చబడినది.



**108వ పద్యము : రెండు రీతుల గనంబడు । చుండే, యీ మేని చేత చూచి బయలు, ను । ద్దండత దీని నుల్లక్యని । యుండుము, దీనందు వాంఛనుంచక శిష్యా!**

**దండాన్వయము :** రెండు రీతుల గనంబడుచుండే యీ మేని చేత బయలును ఉద్దండత చూచి, దీనందు వాంఛ నుంచక దీన్ని ఉల్లక్యని ఉండుము ॥

**టీక :** రెండు రీతుల = రెండు విధములుగ, యీ మేని చేత = యీ శరీరము చేత (యీ గుర్తెరిగే శరీరము చేత) ఉద్దండత = ధృఢముగా, వాంఛ=కోరిక, ఉల్లక్యని = లేదని.

**భావము :** శిష్యా! రెండు విధములుగా గనిపించే యీ గుర్తెరిగే శరీరముచేత పరిపూర్ణమును ధృఢముగా ఉన్నదని చూచి, ఆ చూచిన శరీరము లేనిదని, తెలసి దాని యందు కోర్కె లేక (అది బ్రహ్మము కాదు, మాయ యని) ధృఢముగా భావించుము.

**విశేష భావము :** రెండు విధములుగా కనిపించే యీ శరీరము - అనగా గుర్తు + ఎరిగే శరీరము 1) గుర్తు - ప్రతిబింబ చైతన్యము. కేవల నిర్గుణము జ్ఞానము. 2) ఎరిగే శరీరము = అంతఃకరణ లేక అవిద్య సగుణము కర్మమయము. ఈ రెండు విభిన్నములయిననూ, ఎన్నడూ విడివడక కలసియే యుండును. ఈ గుర్తెరిగే శరీరమే సమస్త జగత్తును తెలుసుకొనుచున్నది. దీని చేతనే బయలు శాశ్వతమైనదని గురుముఖతా తెలసి ఈ ఎరిగే శరీరము లేనిదని తెలసి ఇది బ్రహ్మము కాదని విడిచిపెట్టమని ఈ పద్య భావము.



**109వ పద్యము : ద్వైతాద్వైత విశిష్టా । ద్వైతుల మని కీచులాడు, దయ్యముల వలెన్ । ద్వైతా, ద్వైత విశిష్టా । ద్వైతులతో కీచులాడ తగునే నీకున్ ॥**

**టీక :** దయ్యముల వలెన్ = మూర్ఖుల వలె, కీచులాడ = తగవులాడ.

**భావము :** శిష్యా! ద్వైతులమని, అద్వైతులమని, విశిష్టాద్వైతులమని, ఒకరితో నొకరు మా సిద్ధాన్తమే గొప్పది అని తగవులాడుకొనే మూర్ఖులవలె, నీవును అట్టి వారితో

తగవులాడ తగునా? అనగా ఈ సంప్రదాయకులు ఏ సిద్ధాన్త వాదులతోను వాదించుట తగని పని ఈ పద్య భావము.

**విశేష భావము :** ద్వైతము = జీవుడు ఈశ్వరుడు వేరే కాని ఒకటి కాదనియు, అద్వైతులు = జీవుడు ఈశ్వరుడు ఒక్కరే అనియు, విశిష్టాద్వైతులు - జీవుడు ఈశ్వరుడు మొదట ఏర్పడక ముందు ఒక్కరే కాని విడిబడిన తరువాత ఒక్కరు కాదు వేరు వేరు గుణవృత్తులని జీవ ఈశ్వర సిద్ధాన్తవాదములు.

---

**110వ పద్యము : అనుభవ వేదాంతుల మని । తినరాని పదార్థమెల్ల తిను దుర్జనులన్। కనబోకుము తద్బోధను । వినబోకుము యెన్నటికి, వివేక విచారా ॥**

**టీక :** వివేక విచారా = నిత్యమైనది, అనిత్యమైనదని రెంటిని చక్కగా విచారించే ఓ శిష్యా !

**భావము :** ఓ వివేక విచారా! శిష్యా! మేము అనుభవ వేదాంతులమని చెప్పుకొనుచు, తినరాని నిషిద్ధ ద్రవ్యములను తినే ఆ దుష్టులను చేరకుము. వారు చెప్పే బోధ యెన్నడు వినకు సుమా !

**విశేష భావము :** తినరాని పదార్థములు = శ్లేష్మము, వమనము, మలము, మూత్రము, రేతస్సు ఇవి తినరాదని శాస్త్ర నిషిద్ధము; గురువు తన వీర్యమును మద్యముతో కలిపి, వ్యభిచార స్త్రీచే త్రాగించి వయనము చేసినకొనగా ఆవమనమును క్రింద పడకుండగా పాత్ర యందు పట్టి, దానిని కల్లుతో కలిపి, అది గొప్ప భగవత్ప్రసాదముగా "భైర్క" అను పేరుతో స్వీకరించెదరు. ఇది తాంత్రికము (రుద్రయామళ గ్రంథములో) అట్లే గురువు గారు తన పత్నితో కూడి, రేతస్సును గర్భమందు పడకుండగ తీసి, దాన్ని కల్లుతో కలిపి శిష్య బృందము దాన్ని త్రాగెదరు. ఇది ఎరుకను మ్రింగుటగా చెప్పెదరు. ఇట్టి వారిని కన్నులతో కూడా చూడవద్దని పద్యభావము.

---

**111వ పద్యము : జింహోపస్థ విషయము । లెవ్విగలవో వాటి విడువలేని గురువులన్। మెవ్వరు జేరి కొలుతురో । యివ్వసుధను వారు జెడుదు, రిది నిజము సుమీ ॥**

**టీక :** జింహ్వా విషయము = మంచిరుచుల యందు ఆశ, ఉపస్థవిషయము = శారీరక లైంగికానందనము.

**భావము :** శిష్యా! జిహ్వా విషయమైన రుచుల యందు అభిరుచిని, ఉపస్థ విషయమైన లైంగికానందనుభవములను విడువలేని (మితిమీరి వ్యవహరించుట) ఏ గురువులు ఉందురో, అట్టి గురువులను ఆశ్రయించి సేవించిన శిష్యులు ఈ భూమి పై వారు జ్ఞాన హీనులై నశించెదరు. ఇది నిజము సుమా ॥

**విశేష భావము :** రుచులు, ఆనందము (లైంగిక) వీటి యందు అమిత బుద్ధి గల వారు జ్ఞానహీనులు. కనుకనే జ్ఞాన హీనులై భ్రష్టులైపోవుచన్నారు. కనుక శ్రీ కృష్ణ దేశికేంద్రుల హిత వ్యాకమునుసరించి జిహ్వా చాపల్యము ఉపస్థా చాపల్యములను తప్పక విడువలెను.

---

**112వ పద్యము : పాషండ మతము వారల । వేషంబులు చూచి శిష్య వితతి భ్రమించున్ । ఈషత్తీ బోదెరుగక । దూషింతురు విన్న కన్న దుర్భాషణలన్ ॥**

**దండాన్వయము :** పాషండ మతము వారల వేషంబులు చూచి, శిష్య వితతి ఈషత్తీబోధెరుగక భ్రమించున్ । అట్టి వారి బోధ విన్న కన్న దుర్భాషణలన్ దూషింతురు ॥

**భావము :** పాషండమతములు = వైదిక బాహ్యమతములు వారి ఆడంబర వేషంబులు చూచి ఈ బోధ కొంచెమైనను ఎరుగక శిష్య సమూహము మోసపోవుదురు. వారి బోధలు విన్న, కన్న, ప్రజలు అట్టి వారిని దుర్భాషలతో దూషింతురు.

---

**113వ పద్యము : ఎందరు దూషించితె, యే । మందరు మన వారె కాని అన్యులె, నీవా । యందరితో వాదించక । నందంబౌ నిట్టి బోధ నరయుర తండ్రీ ॥**

**టీక :** అందంబు + ఔన్ + ఇట్టి = అందంబౌనిట్టి = చక్కనైన ఈ, అరయర = విచారించి తెలుసుకొనుము.

**భావము :** 1) శిష్యా! ఈ బోధను ఎంతమంది దూషించితెయేమి? వారందరు మనవంటివారే. కాని ఇతరులే. నీవు అట్టి వారందరితో వాదించక, చక్కని యీ పరిపూర్ణ బోధను బాగుగ విచారించి తెలుసుకొనుము.

2) శిష్యా! ఈ బోధను ఎంతమంది దూషించితే యేమి ? వారందరు అన్యులా ? మనవారే కధ ! అట్టి వారందరితో నీవు వాదించక చక్కనైన ఈ పరిపూర్ణ బోధను బాగుగ తెలిసికొనుము.

**114వ పద్యము : కోపమె పాపంబనబడు । కోపమెహంకార మనుచు కొనియాడ బడున్ । కోపమె తాపంబన బడు । కోపమె మృత్యువనబడును కుటిల విరహితా ॥**

**టీక :** కొనియాడబడున్ = అనేక గ్రంథములలో కీర్తించబడెను అని భావము, తాపము=విచారము, బాధ, కుటిల విరహిత = వంకర ఆలోచనలు లేని వాడా!

**భావము :** శిష్యా! దుష్ట ఆలోచనలు ఎంతమాత్రము లేనివాడా! కోపము వలన తప్పుడు ఆలోచనలు కలిగి దౌర్జన్యపనులు చేయుదురు. అందుచే పాపము వచ్చును. కోపము వలన అహంకారము (దురభిమానము, పట్టుదల) పెరుగును. అవి అనేక గ్రంథములలో చెప్పబడెను. చివరకు కోపము వలననే నశించును. కనుక ఆధ్యాత్మిక శిక్షణలో ఉన్నవారు ఎవరి పైనను కోపముతో ఉండరాదు. కోపము మనలో ఎంత మాత్రము ఉండకూడదని, కృష్ణ ప్రభువు భావము.

**విశేష భావము :** భగవద్గీతలో "క్రోధాద్భవతి సమ్మోహః" అన్న శ్లోకమునుకు తర్జుమాగా ఈ పద్యము చెప్పవచ్చును. ఆ శ్లోకములో "బుద్ధినాశాత్ ప్రణశ్యతి" అన్న పదమునకు ఈ పద్యములో "కోపమె మృత్యువు అనబడును అని అర్థము".

**115వ పద్యము : నిజగురు బోధనెరుంగక । గుజ గుజ శిష్యులకు జెప్పు గురువుల బోధల్ । భుజగ విషోపమగు సుమీ । సుజనౌఘము మెచ్చదట్టి సుద్దిని పట్టీ ॥**

**టీక** : గుజగుజ=పీడితముగ, త్రొక్కిటపడు, పట్టీ = కుమారా! నిజగురు బోధ = శాశ్వతమైన గొప్ప బోధ (పరిపూర్ణ బోధ) భుజగ విషోపము = పాము విషముతో సమానము, సుజనౌఘము = సుజన సమూహము.

**భావము** : కుమారా! శాశ్వతమైన పరిపూర్ణ బోధ తెలియక, శిష్యులను పీడించి (యోగములతో కష్టపెట్టి) చెప్పే గురువుల బోధలు (సరియైన ఆచరణలు లేనప్పుడు) అవి పాము విషముతో సమానమగును. అట్టి బోధలను సుజన సమూహము మెచ్చదు, అంగీకరించదు.

---

**116వ పద్యము : తనువును విడి బ్రహ్మమనే । వను, మునుపటి నీ విచారమటుబెట్టి పుడున్ । నిను నీతనువును వేరని । యనకను, పరిపూర్ణమరసి యవి విడువదగున్॥**

**భావము** : శరీరము అనాత్మ, శారీరకుడైన నేను బ్రహ్మను అనే నీ పూర్వపు విచారణ అవల పెట్టి, ఇప్పుడు నీ తనువు "నేను" రెండు ఒక్కటే యని రెండు వేరు కావనియు, రెండును ప్రకృతి రూపములే యని తెలసి, పరిపూర్ణమును విచారించి తెలసి, ఆ తనువును, నేనును ఈ రెంటిని కూడా విడువతగును.

**విశేష భావము** : ఈ పద్యములో తనువు - శరీరము అంటే అవిద్య అనే ఉపాధి. అందలి ప్రతిబింబ చైతన్యమే "నేను" అని తెలియవలెను. అవిద్య - ఉపాధి కనుక అనాత్మ అని, అందలి ప్రతిబింబ చైతన్యము - పరిపూర్ణము యొక్క ప్రతిబింబము కనుక అది బ్రహ్మము అని గుర్తించరాదు. ఎందుకననగా ప్రతిబింబమునకు ఉనికి లేదు. లేనిది మిథ్యా స్వరూపము. అవిద్య పోతే ప్రతిబింబము పోయేదే. కనుక రెండును భిన్నములైననూ, రెండూ లేనివే. శాశ్వత బ్రహ్మమనరాదు. శాశ్వతమైన బ్రహ్మము ఒక్క పరిపూర్ణము మాత్రమే.

---

**117వ పద్యము : కొందరు వైరాగ్యంబున । కొందరు తీర్థాటనమున, కొందరు కర్మం॥ బందున, వ్రత జపతపముల । కొందరు, నటి యింతు రిట్టి కోర్కెల మనుజుల్॥**

**టీక** : వైరాగ్యమున = సంసారము పై విరాగముచే సన్యసించి, తీర్థాటనమున = పుణ్యక్షేత్రసంచారముచేత, కర్మంబందున = యజ్ఞయాగాది కర్మల యందున, వ్రత = నోములు, కల్పములు చేత, జపము = మంత్రావృత్తి, వేదాధ్యయనము, తపము = తపస్సు, కర్మంబు=చాంద్రయాణాది పుణ్యకర్మలు, నటియింతురు = వర్తింతురు, ఆచరించు చుందురు.

**భావము** : శిష్యా! మనుజులు వారి వారి కోర్కెల ప్రవృత్తుల బట్టి, కొందరు సంసారమును విడచి సన్యసించియు, కొందరు పుణ్యతీర్థములు తిరుగుట యందు, కొందరు యజ్ఞయాగాది కర్మిష్ఠులుగను, కొందరు నోములు, దేవతా ప్రస్తుతి జపములు, వేదాధ్యయన చాంద్రయాణాది తపస్సులతో మరికొందరు మోక్షప్రదముగ భావించి ఆచరించుచుందురు. ఇవన్నియు ఉత్తమగతిని సాధించేవే కాని జన్మరహితమును చేయలేవని భావము.

---

**118వ పద్యము : కొందరు భక్తి త్రయమున । కొందరు యోగముల యందు, కొందరు జ్ఞానం । బందు రమింతురు వారల । కందరికీ బోధ యిష్టతౌన నాయనా॥**

**టీక** : భక్తిత్రయము = అనన్య, బాహ్య ఏకాంత భక్తులు (కర్మ, యోగ, భక్తి) యోగములు = యోగాభ్యాసములు, జ్ఞానము = బ్రహ్మము నేనను జ్ఞానము.

**భావము** : శిష్యా! కొందరు భక్తి త్రయము నందున, మరికొందరు ప్రాణాయామాది యోగాభ్యాసముల చేతను, కొందరు నిర్గుణ జ్ఞానోపాసన చేతను జన్మ రహితమగును అని భావించుచుందురు. అట్టి వారికి యిట్టి నిజ బోధ యిష్టత అగునా? అనగా యిష్టపడరు అని భావము.

---

**119వ పద్యము : భ్రమరహిత సహిత జనులకు । సుమన సులను వరుల సమము జూచిన, విశ్వం। బమరి లేకుండు, మండును । క్రమమున, కల వంటి దగుచు కడు నిజము జూమీ ॥**

**టీక** : భ్రమ = ఎరుక, సుమనసులు = దేవతలు, విశ్వంబు = జగత్తు, అమరి = ఒప్పును, క్రమమున = క్రమాలంకారము అని సూచన.

**భావము** : ఈ పద్యమును క్రమాలంకారముచే తెలియపర్చబడినది "క్రమమున"

అను పదముచే సూచించిరి.

| | |
|---|---|
| 1) భ్రమరహిత (ఎరుక విడచిన) జనులకు సుమనసులను సమము జూచిన విశ్వంబు అమరి కలవంటి దగుచు లేకుండును. | 2) భ్రమ సహిత (ఎరుకతో ఉన్న) జనులకు నరుల సమము జూచిన విశ్వంబు అమరి కడు నిజము జామి అని ఉండును. |

1) ఎరుక రహితమైన వారి దేవతలతో పోల్చవచ్చును. (వారికి కలలేదు) అట్టి వారికి జగత్తు కలలో దోచిన ప్రపంచము వలె లేనిదిగా ఒప్పును.

2) ఎరుక సహిత జనులని సామాన్య మానవులుగ చూడనగును. ఇట్టి వారికి జగత్తు చక్కగా నిజముగా ఉన్నదనియే ఒప్పును.

---

**121వ పద్యము : ఎరుగుట జ్ఞానము, దావను । జరిగే పని కర్మమనుచు జనులెన్నిరి, యీ । యెరుకయు కర్మము లేనిది । పరిపూర్ణము, వీటి నీవు బట్టకు మెపుడున్ ॥**

**టీక :** పట్టకుము = గ్రహించకుము, ఎన్నిరి = లెక్కించిరి.

**భావము :** జ్ఞానము చేసే పని ఎరుగుట, దాని వల్ల జరిగే పని కర్మము అని శాస్త్రజ్ఞులు చెప్పిరి. ఈ జ్ఞానమగు ఎరుక, దాని పని అయిన "కర్మ" రెండును కలసియే "యెరుక" అని చెప్పబడును. ఇట్టి జ్ఞానకర్మలు లేనిది పరిపూర్ణము కనుక జ్ఞానకర్మ స్వరూపమయిన ఎరుకను విడిచిపెట్టుము.

**విశేష భావము :** అవిద్య యందలి ప్రతిబింబము - జ్ఞానము. దీని సత్తా చేత అవిద్య చైతన్యవంతమై సమస్త జగత్తుకు ప్రభవ - ప్రతిష్ఠ - పరాయణత్వములు కలుగుచున్నది. అనగా అవిద్య కర్మ స్వరూపము. ప్రతిబింబము, జ్ఞానము + కర్మము ఈ రెండు కలసియే యున్నది. ఇదే ఎరుక. ఇట్టి ఎరుక ఎంత మాత్రము లేనిది అనగా జ్ఞాన కర్మలు లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము. మిగిలిన సమస్తము జ్ఞానకర్మ స్వరూపమే.

---

**120వ పద్యము : కలత నను లేను కలనని । తలపోసెటి వారి మాట తమకే నిజమౌ। కలలేని వారు కలవా । రలు, వీరలె నొకరి నొక రరయ రిరువురున్ ॥**

**టీక:** కలత = యదార్థముగ, అరయరు = చూడలేరు.

**భావము :** యదార్థముగ నేను లేనని భావించేవారు కొందరు, యదార్థముగా నేను ఉన్నానని భావించే వారు కొందరు, వారి వారి మాట భావన వారికే నిజము. ఎవరి భావన వారికి నిజము. ఎటలనగ్గా కలలోని వారికి వారు ఆకలలో చేసే పనులు యదార్థమే. మేల్కొలో వార్కి వారు చేసే పనులు యదార్థము. కలలో వారి పనులు మేల్కొలో వారు చూడలేరు. మేల్కొలో చేసే వారి పనులు కలలో ఉన్నవారు చూడలేరు గదా ! ఆ విధముగానే అని గ్రహించవలెను.

---

**122వ పద్యము : కల వారికి మేలు కలో । గల వారికి, జాగ్రతందు కలహము గలదా । కలహించి రేని వారలు । కల వారలె మేల్కొవారు గారెన్నటికిన్ ।**

**టీక :** కలవారికి = ఎరుకలో ఉన్న వారికి, మేల్కొలో గల వారికి = ఎరుక విడిచిన వారికి, జాగ్రతందు = జాగ్రదవస్థయందు (అనగా సమస్త వ్యవహారములయందు. కలహము = జగడము, యుద్ధము.

**భావము :** శిష్యా! ఎరుకలో కల వారితో, ఎరుకను విడచినవారు (బోధ గురుపుత్రులకు) సమస్తమైన లౌకిక వ్యవహారములయందు జగడము కలుగునా? (కలుగదు) ఆలా కాక కలహించినచో, ఇద్దరు ఎరుకలోని వారే కాని ఎన్నటికి ఎరుకను విడచినవారు కాలేరు. అనగా గురు సంప్రదాయకులకు ఇతరులతో కలహము ఏ వ్యవహారములోను పనికి రాదని కృష్ణ దేశికేంద్రుల సూచన.

---

**123వ పద్యము : సురలందు దోచు కలవలె । నరుదెంచెను బ్రహ్మమందు నఖిల జగంబుల్। యరుదెంచి యజుని గనుకొని । బిర బిర తామేగు నిల్వ బిడియంబగుచున్॥**

**టీక :** సురలందు = దేవతల యందు, బ్రహ్మయందు = పరిపూర్ణ పరబ్రహ్మము నందు, అఖిల జగంబుల్ = అఖిలాండకోటి బ్రహ్మాండములు (ఎరుక) అజుని =

పరిపూర్ణ బ్రహ్మమును, గన్గొని = చూచి, బిరబిర = అతి త్వరగా, బిడియము = సిగ్గు.

**భావము :** శిష్యా! దేవతల యందు తోచిన కలవలె (అనగా లేనిదె) పరిపూర్ణ బ్రహ్మములో లేనిదె సమస్త పిండ, బ్రహ్మాండములు గల ఎరుక వచ్చినది. అలా వచ్చిన యెరుక పరిపూర్ణమును చూచినచో తాను ఉండుటకు సిగ్గుపడుచు, అతి త్వరితముగ లేకపోవును. అనగా పరిపూర్ణ బ్రహ్మమును చూచి ఎరుక లేకపోవును అని భావము.

---

**124వ పద్యము : మనమీ బయలున లేనిదె । మనకు మనమె వచ్చి నిల్చి, మన మేగిన, యే । మనక మన జోలి గొనకన్ । తన కైతానుండి యున్నదదిగో కనరా ॥**

**టీక :** ఈ పద్యములో "మనము" అనే పదమునకు ఎరుక అని అర్థము చెప్పుకోవలెను; జోలి = సంబంధము, వృత్తాంతము.

**భావము :** శిష్యా! ఎరుక యీ పరిపూర్ణమందు లేనిదె తనకు తానే వచ్చి, పెంపొంది, చివరకు లేకుండా పోయినను, ఈ వృత్తాంతము లేమియు ఎరుగక, తనకు తానే స్వతశ్శిద్ధమై యున్న పరిపూర్ణము అంతటా నిండియున్నది అదిగో చూడుము.

---

**125వ పద్యము : జ్ఞానంబు సత్త్వగుణమను । దానికి జన్మించె ననుచు దామోదరుడా। మేనత్త కొడుకుతో ననె । జ్ఞానమునకు జన్మమొకటి గలిగెగదోయీ ॥**

**టీక :** దామోదరుడు = కృష్ణుడు, ఆ మేనత్త కొడుకుతో = అర్జునినితో, జన్మ మొకటి = పుట్టుక అనేది ఒకటి.

**భావము :** శిష్యా! భగవద్గీవలో 14వ అధ్యాయములో "సత్వాత్సంజాయతే జ్ఞానం" అని అనగా జ్ఞానము సత్వగుణమునకు పుట్టును. అని కృష్ణ భగవానుడు అర్జునునితో చెప్పెను. కనుక జ్ఞానమునకు పుట్టుక అనేది కలదు కదా! (గుణ త్రయ విభాగ యోగం 14 అధ్యా - 27 శ్లోకములు)

**విశేష భావము :** "సత్వాత్ సంజాయత్ జ్ఞానం" జ్ఞానము సత్వగుణమునకు పుట్టును. అని కృష్ణుడు అర్జునునితో భగవద్గీతతోపదేశములో చెప్పెను. అయితే ఈ జ్ఞానము

పుట్టినది, అసలు జ్ఞానము - జ్ఞాన అజ్ఞానములకు అతీతము. కేవల జ్ఞానము, అది పుట్టినది కాదు. ప్రతిబింబిత చైతన్యము. దీని ప్రకాశము సత్వగుణములతో ఏర్పడినచో అది జ్ఞానము. ఇది పుట్టిన జ్ఞానము తన స్వరూపమును, తనకు పైగా ఉన్న బ్రహ్మతత్త్వమును తెలుసుకొనేది. రజో గుణ ప్రకాశము అజ్ఞానము, మిధ్యా, జ్ఞానమును కలిగించును. జగత్తు ఉన్నట్లుగా కల్పించేది, తమోగుణ ప్రకాశము కేవల అజ్ఞానము మూర్ఖత్వము. ఈ సత్వగుణ జ్ఞానమే గురుముఖతా పరిపూర్ణము ఉన్నదని గుర్తించి తాను అవిద్యతో సహా సమస్తము లేకుండా పోయేది.

---

**126వ పద్యము : పుట్టింది గిట్టు, జ్ఞానము । పుట్టెనమచు కృష్ణమూర్తి పురుహూతజుడౌ। తన ముద్దు మఱదికి । గట్టిగ వివజెప్పె నిందు కలతే మోయీ ॥**

**టీక :** గిట్టు = చనిపోవును, పురుహూతజడు + ఔ = ఇంద్రుని కుమారుడు అయిన అర్జునుడు, గట్టిగ = ధృడముగ, కలత = సంశయము.

**భావము :** శిష్యా! పుట్టిన సమస్తము నశించవలసినదే ! అని భగవద్గీత 2వ అధ్యాయము - 27వ శ్లోకములో "జాతస్యహిధ్రువోర్మృత్యుః" అని చెప్పెను. కనుక జ్ఞానము పుట్టినది. కనుక జ్ఞానము నశించిపోయేదే. శాశ్వతము కాదు అని భావము.

**విశేష భావము :** 125వ పద్యములో జ్ఞానము పుట్టనదనియు, 126వ పద్యములో పుట్టినది నశించును కనుక జ్ఞానము కూడా నశించివలసినదే అని శృతియుక్తముగా నిరూపించిరి.

---

**అవతారిక :** పై పద్యములలో జ్ఞానము పుట్టినది అనియు, కనుక జ్ఞానము కూడా నశించేదే కాని శాశ్వతమైనది అనరాదనియు, అయితే ఆ జ్ఞానము ఎప్పుడు ఏ విధముగా లేకపోవునో 127వ పద్యములో చెప్పుచున్నారు.

**127వ పద్యము : జ్ఞానమగు నీవు, జ్ఞేయం । బైన బయలు గాంచి, జ్ఞానమగు నిమ నీవే । లేనంచు దెలియు మని, తా । నానరునకు వాసుదేవుడానతి యిచ్చెన్ ॥**

**టీక :** జ్ఞేయంబు = తెలియబడే (తెలుసుకోవలసిన) ఆనరురనకు = ఆ అర్జునునకు

ఆనతి = ఆజ్ఞ, శెలవు (చెప్పెను అనుటకు గౌరవ వాచకము)

**భావము :** జ్ఞానము అయిన నీవు (నేను) తెలియతగిన పరిపూర్ణ బ్రహ్మమును చూచి, నీకు నీవే లేనని దెలసి లేకుండా పోవలయునని శ్రీ కృష్ణ భగవానులు అర్జునునితో చెప్పిరి కదా ! అట్లు నీవే అయిన జ్ఞానము చేత తెలసికొనవలసిన పరిపూర్ణమును చూచి, నేను లేనని దెలసి లేకుండా పోవలెనని భావము.

**విశేష భావము :** "జ్ఞానేన జ్ఞేయ మాలోక్య పశ్చాత్ జ్ఞానం వినశ్యతి" అని ఉత్తరగీతలో చెప్పబడినది. జ్ఞానముచే (పుట్టిన జ్ఞానముచే) జ్ఞేయ రూపమయిన పరిపూర్ణమును చూచినచో, జ్ఞానము పూర్తిగా నశించిపోవును అని చెప్పబడినది. పరిపూర్ణము జ్ఞేయము, జ్ఞానము, జ్ఞాత కానిది ఇది సిద్ధాంత వాక్యము. ఈ పద్యములో "జ్ఞేయంబైన బయలు" అన్నారు. ఇది ఎట్లో చక్కగా గురుముఖతా విచారించవలెను. జ్ఞానమగు ఎరుక, పరిపూర్ణమును చూచినంత మాత్రముననే నశించును. మరొక విధముగా నశించదు పరిపూర్ణమును చూచుట ఎట్లో గురుముఖతా తెలియవలెను. వ్రాయ వీలుకాదు. ఇదే పరమ రహస్యము.

---

**అవతారిక :** బ్రహ్మము మాత్రమే ఉన్నది, రెండవది ఏదియు లేదు, అని యుక్తిగా ఈ పద్యములో చెప్పుచున్నారు.

**128వ పద్యము : మన మచల మనదగదు, తగ । దనటము మన మచలమునకు తగ వేరని, రెం। డని లేవు, మనమచల మని । విను, మన ముళ్లక్కి తెలియు, విడుమనము మనన్ ॥**

**దండాన్వయము :** మనము అచలము అనతగదు । మనము అచలమునకు వేరని అనటము తగదు । మనము అచలమని రెండని లేవు । మనము ఉళ్లక్కియని తెలియ మనము మనన్ విడు ॥

**టీక :** మనము = ఎరుక, అచలము = పరిపూర్ణము.

**భావము :** శిష్యా! మనము పరిపూర్ణమే (ఎరుక పరిపూర్ణబు ఒక్కటే అనరాదు. అయితే ఎరుక వేరే పరిపూర్ణము వేరు అని అవరాదు. ఎరుకని పరిపూర్ణమని రెండు లేవు. ఉన్నది ఒక్కటే, పరిపూర్ణము మాత్రమే. మనము (ఎరుక) లేనే లేదు. అందుచే

పరిపూర్ణము ఉన్నది అని గాని, ఎరుక పరిపూర్ణము రెండూ వేరు అని గాన అనరాదు. పరిపూర్ణములో ఎరుక ఎంతమాత్రము లేదు. అని తెలుసుకొని ఎరుక తనకు తానే లేకపోవుచున్నది.

**129వ పద్యము : జ్ఞానము నేనన నొక్కటే । జ్ఞానము నే వేరటంచు గనబోకు సుమీ। జ్ఞానము వచ్చును పోవును । జ్ఞానాతీతమును తాను గాంచిన దాకన్ ॥**

**దండాన్వయము :** జ్ఞానాతీతమును తాను గాంచిన దాకన్, జ్ఞానము వచ్చును పోవును।

**టీక :** నేనన = ఎరుకన, గనబోకు = భావించకు, చూడకు, వచ్చును పోవును = పుట్టును చచ్చును, జ్ఞానాతీతము = ఎరుకకు అతీతమైనది, పరిపూర్ణము. తాను = ఎరుక, గాంచిన దాకన్ = చూచే వరకు.

**భావము :** శిష్యా! జ్ఞానమన్ననూ, నేను అన్నను ఒక్కటే. ఎరుకయే, జ్ఞానము బ్రహ్మము, నేను మాయను అని భేదముచే చూడకుము. రెండును ఒక్కటే ఈ జ్ఞానము దేహమును ధరించుట (పుట్టుట) మరల దేహమును విడచుట (చచ్చుట) అనేది సహజ గుణములు. అయితే జ్ఞానము అయిన ఎరుక పరిపూర్ణమును చూచినచో తిరిగి ఎన్నటికి పుట్టదు. ఎరుక పూర్తిగా లేకపోవును. అంతవరకు జనన మరణములు తప్పవు.

**130వ పద్యము : నీ కలను వచ్చి పోయిన । లోకుల లోకములవలెనె లో నిను గనుమీ। నీ కలను నీవు మేల్కొని । యీ కలనటువలెనె చూస్తే యెటు విల్వవురా ॥**

**భావము :** శిష్యా! నీ స్వప్నములో అనేక మంది లోకులు, చిత్ర విచిత్ర జగము (లోకములు) వస్తూ ఉండును. మేల్కొ పొందిన తరువాత ఆ లోకులు లోకములు ఏమియు ఉండుట లేదు. అట్లనే నీవును "ఎరుక" అనే పెద్ద స్వప్నములో నీవు వచ్చితివి. అనగా కలలో వచ్చినవన్ని కలయే. కనుక నీవును కలే. నిజము కాదు. లేనిదే ఏర్పడితివి. కల అయిన నీవు, పరిపూర్ణమనే మేల్కొ పొందినచో, నీవైన కల ఎంతమాత్రము ఉండదు. నీవు లేకపోవటమనగా నీ జన్మ కారణమైన ఎరుక లేకుండా పోవును.

**131వ పద్యము : అందరి కల నీ కలె కద । అందరు నీ కలను వచ్చి అగుపడిపోవన్।**
**కందువు గద, నిన్నట్లనె । మందమతీ కవ గదోయి మరి లేవనుచున్ ॥**

**టీక :** కందువుగద = చూచెదవు కదా !

**భావము :** శిష్యా! అందరికి వచ్చే కల వంటిదె కదా నీ కల కూడా వచ్చును. అందరు నీ కలలో వచ్చి లేకపోవుట చూచుచున్నావు కదా! అట్లే నీవును అందరి కలలో అగుపడి లేకపోదువు కదా! కనుక అందరూ నీ కలలో కనపడి లేకపోయినట్లే నీవును ఎరుకను కలలో ఏర్పడి లేకపోదువు అని చక్కగా విచారించి తెలుసుకొనుము.

---

**అవతారిక :** ఆకాశము పరిపూర్ణము కాదు. ఆకాశము సగుణము, అని 132, 133వ పద్యములలో చెప్పుచున్నారు. పరిపూర్ణము కేవల నిర్గుణము.

**132వ పద్యము : ఆకాశమనిన శూన్యం । బాకాశం బనిన సగుణ మాకాశమనన్ ।**
**కాకి వలె నల్ల రూపుది । ఆకాశము మితము లోన నణగుండు జుమీ ॥**

**టీక :** శూన్యం = శూన్యాంశము, లేనట్లు తోచబడేది, మితములోన = ఆవరణ రూపముగా, నణగుండు = ఉండును.

**భావము :** శిష్యా! ఆకాశమనిన శూన్యాంశము (ఆకాశం, గగనం, శూన్యం అని అమరశ్లోకము) ఆకాశము సగుణస్వరూపము. ఆకాశము కాకి వలె నల్లని రూపము గలది, ఆకాశము మితములో ఉండును. సమస్తమిత స్వరూపములు (వస్తువులయందు) ఆకాశము ఉండును. కనుక అమితమైన పరిపూర్ణ బ్రహ్మము కానేరదు.

**విశేష భావము :** ఆకాశమనిన సగుణము - శబ్ద గుణము కలది. పంచభూతములో ఒక్కటైనది. ఆకాశము వాయువునకు జన్మస్థానము, ఆకాశము కాకి వలె నల్ల రూపుది. పగలు సూర్య ప్రకాశముచే వెలుతురుగా (తెల్లగా) కనుపించును ఇది సూర్యుని వలన కలిగినది. మరి రాత్రి సమయములలో చీకటి (నలుపు) దేని కలన కలిగినది?

వెలుతురు లేని కారణముచే ఆకాశము యొక్క రంగు అయిన నలుపు (చీకటి) కనుపించుచున్నది. కనుక ఆకాశము నలుపు రంగుది. ప్రత్యక్షముగా చెప్పినచో ఛాయ రంగునలుపే.

ఆకాశము మితములోన - ఘటాకాశము, మఠాకాశము మొదలగు ఉదాహరణములు. కనుక భూతాకాశ, మహాకాశములు, ఏ ఆకాశమైనను పరిపూర్ణ బ్రహ్మము కానేరదని నిర్ణయము.

**133వ పద్యము : ఆకాశమనిన కాలం । బాకాశంబన విలంబ మాకాశమనన్ । లోకమున చంచలంబగు । నాకాశము శబ్ద రూపమగు వినవోయీ ॥**

**టీక :** కాలము = సమయము, రాత్రింబవళ్ళు, విలంబము = జాగు, అవకాశము, చంచలము = స్థిరము లేనిది.

**భావము :** శిష్యా! ఆకాశమనిన కాల నిర్ణయము కలిగించేది (రాత్రింబవళ్ళు). అనగా ఆకాశము చీకటి వెలుతురులతో నిండినది. ఆకాశము అనగా అవకాశ రూపము. తిరుగనిచ్చుట ఉండనిచ్చుటకు అవకాశ రూపము. "అవకాశస్య ఆకాశః" ఆకాశము ఎల్లప్పుడూ ఒకేలా ఉండదు, తెల్లగా, నల్లగా, మేఘ రూపముగా చల్లని శీతలముగా ఉష్ణరూపముగా చంచలమై యున్నది. కాల బేధముతో కూడియున్నది. శబ్దము గుణము కలిగినది. కనుక ఆకాశము బ్రహ్మము కానేరదు.

**134వ పద్యము : అహమే తను వి, విశ్వం । బహమే జీవేశ్వరులన, నహమె తదైక్యం। బహమె, యహముకు మూలం । బహమణగిన నణగు నన్నియనఘ చరిత్రా !**

**పద విభాగము :** అహమే తనువు విశ్వంబు । అహమె జీవేశ్వరులన । అహమె తదైక్యంబు । అహమె అహముకు మూలంబు । అహమణిగిన అన్నియు నణగును అనఘ చరిత్రా ॥

**టీక :** అహమే = అంతఃకరణమే (అవిద్యయే), తనువు = శరీరము (పిండాండము, విశ్వంబు = జగత్తు (బ్రహ్మాండము) జీవుడు = పిండాండ చైతన్యము, ఈశ్వరుడు, బ్రహ్మాండ చైతన్యము, తదైక్యము = జీవేశ్వర ఐక్యము, అణగిన = లేకపోయిన

అనఘ చరిత్రా = పాపరహితమైన చరిత్ర కలవాడా! (కర్మ రహితుడా)

**భావము :** ఓ కర్మ రహితుడా! శిష్యా! అవిద్యయే నీ శరీర త్రయము, అవిద్యయే పిండాండ బ్రహ్మాండములు, అవిద్యయే జీవ - ఈశ్వరులు, అవిద్యయే జీవేశ్వర ఐక్యము. ఇదే అహము. ఇట్టి అహమునకు (అవిద్యకు) మూలము అహమే. మరేదియు మూలము లేదు. కనుక అహము ఒక్కటి లేక పోయినచో సమస్తము లేకపోవును.

**విశేష భావము :** పరిపూర్ణములో లేకతోచిన ఎరుకయే - మూల ప్రకృతి, మాయ, అఖండ ఎరుక అను పేర్లు. ఈ మాయ యొక్క అంశయే, పిండామందలి అవిద్య, బ్రహ్మాండమందలి ప్రతిబింబ చైతన్యము ఈశ్వరుడు. కనుక అహమన్నను, మాయ అన్నను, అవిద్య అన్నను, అంతఃకరణమన్నను, నేననే ఎరుకన్నను ఒక్కటే. అందలి ప్రతిబింబ చైతన్య సత్తావలననే, మాయ - అవిద్యలు చైతన్యవంతమై, సమస్త బ్రహ్మాండ పిండాండములను ఏర్పరుచుచున్నది. అవిద్య యందు ప్రతిబింబ చైతన్యము ఉన్నంత వర్కు అవిద్య శరీరమనే ఉపాధిని పొందుట, కర్మలనను భవించుట శరీరమును విడచి మరొక ఉపాధిని తయారు చేసుకొనుట మొదలగు జననము వృద్ధి మరణము, తిరిగి పునర్జన్మ తప్పవు. కనుక అవిద్యను అనగా అహమును లేకుండా జేసి కొనగలిగినచో అందలి ప్రతిబింబము లేకపోవును ఇదియే యెరుక రహితము. ఇదే "అహమణిగిన అన్నియు అణగును" భావము. అహము నశించుటకు అనగా అవిద్య నశించాలి అంటే గురు కరుణచే మాత్రమే. అది జ్ఞేయంబైన బయలును చూడాలి. ఆ గురు కరణుకై గురు ధ్యానము తప్ప వేరు మార్గము లేదు. కనుకనే "గురు ధ్యానేనైవ ముక్తిః" అనియు "ముక్తి మూలం గురోఃకృప" అనియు చెప్పిరి. ఈ ధ్యాన విధానము గురు ముఖస్థము, వ్రాయవీలుకాదు.

---

**135వ పద్యము : భ్రమ యనిన పుట్టుకనినను । భ్రమకే నామంబు లిట్టి భ్రమ నే, నీవున్ । భ్రమయె, యీ మేను జగత్తులు । భ్రమె, యెరుకయు మరపు రెండు భ్రమ వినరా ॥**

**టీక :** భ్రమ = భ్రాంతి, మిధ్య, భ్రమకే నామంబులు = ఎరుకకే పేర్లు.

**భావము** : మయనిన (మిధ్యయనిన) పుట్టుక అనినను ఎరుకకే పేర్లు. ఇట్టి యెరుకయే నేను, నీవు ప్రతిబింబము, అవిద్యయు. యెరుకయే ఈ శరీరము - జగత్తుయును, యెరుకయే ఈశ్వరుడు - జీవుడును. యెరుగుట మరచుట ఈ ఎరుకయే (జ్ఞానము - అజ్ఞానము) ఓ ఎరుక స్వరూపా వినుము.

**విశేష భావము** : ఎరుకయే - భ్రమ, మిధ్యా స్వరూపము, అనగా ఉన్నదనుటకు గాని లేదనుటకు గాని వీలు లేనిది. ఉండి లేనిది అని గాని లేక ఉన్నది అని చెప్పరానిది. అయినా శిష్య అవగాహన నిమిత్తమై ఆయా సందర్భములను బట్టి ఉన్నదని, లేనిదని, లేక ఉన్నదని వ్యవహరింతురు. ఇట్లు ఏమియు అనవీలు కానిది కనుకనే ఎరుకను కూడా అచింత్యము, అవ్యక్తము అని చ్పెపబడినది.

ఇట్టి భ్రమే నే-నీవున్ = యెరుకయే గురువు శిష్యుడు. కొందరు గురువు పరిపూర్ణము అనుట విన్నాను. కాదు గురువు కూడా ఎరుకయే అయితే అవిద్య శిష్యుడు ప్రతిబింబము గురువు అనుటచే ప్రతిబింబము పరిపూర్ణము యొక్క ప్రతిబింబము కనుక గురువు పరిపూర్ణము అనుట పూర్వాచారము. ఈ మాటను సరిగా అర్థము చేసికొనవలయును.

---

**136వ పద్యము : యెరుక సుమీ బ్రహ్మనినను । యెరుక సుమీ మాయ యనిన, యెరుకే జీవుం। డెరుక సుమీ ఈశ్వరుడనినను । యెరుక సుమీ నేను విశ్వమిది సత్యమురా ॥**

**భావము** : శిష్యా! బ్రహ్మ అనినను, మాయ అన్నను, జీవుడు, ఈశ్వరుడు, నేను జగత్తు ఇవన్నియు ఎరుకే సుమా. ఇది సత్యము వినుము.

**విశేష భావము** : "బ్రహ్మ అనినను యెరుక సుమీ ! కొన్ని పద్యములలో బ్రహ్మపదము పరిపూర్ణ శబ్దమునకు వాడిరి. ఉదా॥ - బ్రహ్మందు లేక కలిగిన మొదలగు పద్యములలో బ్రహ్మ అను పదముకు పరిపూర్ణ బ్రహ్మము అని అర్థము. ఎరుక అని చ్పెపబడే ప్రతిబింబ చైతన్యము పరిపూర్ణ బ్రహ్మము యొక్క

ప్రతిబింబము అయినందున, బింబ ప్రతిబింబములును ఒకే పేరుతో వ్యవహరించుట శాస్త్రములలో కలదు. కనుక కొన్ని చోట్ల బ్రహ్మ అను పదము ఎరుకకు వాడిరి, మరియు పరిపూర్ణ బ్రహ్మమునకు కూడా కృష్ణ ప్రభువులు ఈ గ్రంథములో వాడిరి.

**137వ పద్యము : మాట సుమీ నేనని నను । మాట సుమీ మాయ యనిన, మరి జీవశివుల్ । మాట సుమీ బ్రహ్మనినను । మాట సుమీ, మేను జగము మాటే సుమీ॥**

**టీక :** మాట సుమీ = ఎరుక సుమీ

**భావము :** నేను, మాయ, జీవుడు, శివుడు, బ్రహ్మ, మేను, జగత్తులు ఈ పేర్లన్నియు ఎరుకకే సుమా ॥



**అవతారిక :** ఎరుక "లేనిది" అనియు "లేని ఎరుక" అనియు వ్యవహారము లేని ఎరుక అంటే లేదనా? ఉందనా? అనే విషయమును చక్కని యుక్తితో నిరూపించుచున్నారు.

**138వ పద్యము : ప్రకటమగు బింబమందున । ముకురుము, ముకురస్థబింబములు లేవెపుడున్ । ముకురంబు వలన బుట్టును । ముకురస్థము, దాని వలన ముకురము దోచున్ ॥**

**పద విభాగము :** ప్రకటమగు బింబమందున, ముకురము, ముకురస్థబింబములు ఎపుడున్ లేవు । ముకురంబు వలన ముకురస్థము పుట్టును । దాని వలన ముకురము దోచున్ ॥

**టీక :** ప్రకటమగు = ప్రసిద్ధమగు, ప్రత్యక్షముగా నున్న, ముకురము = అద్దము, ముకురస్థబింబములు = అద్దమందలి ప్రతిబింబములు, ఎపుడున్ = ఏ కాలమందున, దోచున్ = ఉన్నట్లు తెలియబడును.

**భావము :** ప్రత్యక్షముగా ఉన్న (శాశ్వతమైన) బింబమందున (అనగా ఇక్కడ పరిపూర్ణ బ్రహ్మమందున, అద్దము అనగా మాయయు, ముకర స్థంబిబములు అనగా మాయలో ఉన్నట్లు తోచబడుచున్న ప్రతిబింబములు ఏ కాలము నందు లేవు. అద్దము వలన ప్రతిబింబములు, ప్రతిబింబముల వలన మాయకు ఉనికి కలుగుచున్నది.

**విశేష భావము :** బింబమనగా ఈ పద్యములో పరిపూర్ణము, ముకురము అనగా మాయ లేక అవిద్య అని అర్థము. ఎందుచేతననగా మాయకు తనకు ఎదురుగానున్న

దానిని అద్దము వలె తన యందు ప్రతిబింబింపజేసుకొనే లక్షణము గలదు. అందుచే మాయకు ఈ పద్యములో ముకురము అన్న పదము (అద్దము) వాడిరి. అద్దములో కనపడే ప్రతిబింబములు వలె మాయలోనే మాయ వలన జీవ, ఈశ్వర, జగత్తు అనే ప్రతిబింబములు ఏర్పడుచున్నది. సత్వగుణము వలన ఈశ్వర ప్రతిబింబము, రజోగుణము వలన జీవ ప్రతిబింబములు, తమోగుణము వలన జగత్ ప్రతిబింబము ఏర్పడుచున్నది. అయితే పరిపూర్ణము నందు, అద్దము వంటి మాయ కాని ప్రతిబింబము వంటి, ఈశ్వర, జీవ, జగత్తులు కాని లేవు. అద్దములో ఏర్పడిన ప్రతిబింబము, అద్దములో ఉన్నట్లు తోచబడుచున్నది. నిజానికి అద్దములో ప్రతిబింబములు లేవు. అద్దములో నా ముఖ ప్రతిబింబము ఉన్నట్లు తోచుచున్నది. ఆ ప్రతిబింబము కాని అద్దము కాని, నా ముఖములో లేవు. అట్లే ముకురము (మాయ) గాని, ముకుర స్థబింబములు (జీవ, ఈశ్వర, జగత్తులు) గాని, బింబమైన పరిపూర్ణములో లేవు. అద్దములో ఉన్నట్లుగా కనపడే ప్రతిబింబము ఉన్నది అనుటకు వీలు లేదు. ఆలాగని లేదంటే ఉన్నట్లు తోచబడుచున్నది కదా. దీనికే "మిధ్య" అని పేరు. లేనిదే ఉన్నట్లు తోచబడేదే ఎరుక. ఇదే పరిపూర్ణములో లేనిదే ఏర్పడినది. అందుకే "కల" వలె అన్నారు. "ముకురంబు వలన ముకుర స్థములు పుట్టును. ముకుర స్థములు వలన ముకురము దోచున్" అంటే అద్దమునకు ప్రతిఫలింపజేసుకొనే లక్షణము ఉన్నది. కనుక ప్రతిబింబములు అద్దములోనే ఏర్పడుచున్నవి. ప్రతిఫలించే లక్షణము బింబమునకు లేదు. నా ముఖమునకు ప్రతిఫలించే లక్షణము ఉన్నట్లయితే క్రయందైనా ప్రతిఫలించును, కాదు. అద్దములోనే ప్రతిఫలించినది. అంటే అద్దము యొక్క ప్రతిఫలింపజేసుకొనే లక్షణము చేతనే ప్రతిబింబములు ఏర్పడినవి. ప్రతిబింబములైన జీవ, ఈశ్వర, జగత్తులు కాని ముకురమయిన "మాయ" కాని పరిపూర్ణములో లేవు. కనుక జీవ, ఈశ్వర, జగములకు కారణము మాయ. అనగా మాయ నుండే ప్రతిఫలించిన ప్రతిబింబ చైతన్యము యొక్క సత్తాచేత సమస్త సృష్టి జరుగుచున్నది. ప్రతిబింబము వలన లేని మాయ (జడమైన) చైతన్యవంతమై ఉన్నది, అయినది. ప్రతిఫలింపజేసుకొనే లక్షణము గల మాయ వలన ప్రతిబింబ చైతన్యమేర్పడినది. ప్రతిబింబ చైతన్యము వలన మాయకు ఉనికి ఏర్పడినది. మాయ వలన ప్రతిబింబ చైతన్యమునకు ఉనికి ఏర్పడినది. దాని వలన ఇది దీని వలన అది ఉన్నవి అగుచున్నది. ఈ పద్యము పరిపూర్ణ బోధలో చాలా ముఖ్యమైనది. చక్కని విమర్శ శాస్త్రయుక్తముగా చేయవలసిన అవసరమున్నది.

**137వ పద్యము : మాట సుమీ నేనని నను । మాట సుమీ మాయ యనిన, మరి జీవశివుల్ । మాట సుమీ బ్రహ్మనినను । మాట సుమీ, మేను జగము మాటే సుమ్మీ॥**

**టీక :** మాట సుమీ = ఎరుక సుమీ

**భావము :** నేను, మాయ, జీవుడు, శివుడు, బ్రహ్మ, మేను, జగత్తులు ఈ పేర్లన్నియు ఎరుకకే సుమా ॥

---

**అవతారిక :** ఎరుక "లేనిది" అనియు "లేని ఎరుక" అనియు వ్యవహారము లేని ఎరుక అంటే లేదనా? ఉందనా? అనే విషయమును చక్కని యుక్తితో నిరూపించుచున్నారు.

**138వ పద్యము : ప్రకటమగు బింబమందున । ముకురము, ముకురస్థబింబములు లేవెపుడున్ । ముకురంబు వలన బుట్టును । ముకురస్థము, దాని వలన ముకురము దోచున్ ॥**

**పద విభాగము :** ప్రకటమగు బింబమందున, ముకురము, ముకురస్థబింబములు ఎపుడున్ లేవు । ముకురంబు వలన ముకురస్థము పుట్టును । దాని వలన ముకురము దోచున్ ॥

**టీక :** ప్రకటమగు = ప్రసిద్ధమగు, ప్రత్యక్షముగా నున్న, ముకురము = అద్దము, ముకురస్థబింబములు = అద్దమందలి ప్రతిబింబములు, ఎపుడున్ = ఏ కాలమందున, దోచున్ = ఉన్నట్లు తెలియబడును.

**భావము :** ప్రత్యక్షముగా ఉన్న (శాశ్వతమైన) బింబమందున (అనగా ఇక్కడ పరిపూర్ణ బ్రహ్మమందున, అద్దము అనగా మాయయు, ముకర స్థంబిబములు అనగా మాయలో ఉన్నట్లు తోచబడుచున్న ప్రతిబింబములు ఏ కాలము నందు లేవు. అద్దము వలన ప్రతిబింబములు, ప్రతిబింబముల వలన మాయకు ఉనికి కలుగుచున్నది.

**విశేష భావము :** బింబమనగా ఈ పద్యములో పరిపూర్ణము, ముకురము అనగా మాయ లేక అవిద్య అని అర్థము. ఎందుచేతననగా మాయకు తనకు ఎదురుగానున్న

దానిని అద్దము వలె తన యందు ప్రతిబింబింపజేసుకొనే లక్షణము గలదు. అందుచే మాయకు ఈ పద్యములో ముకురము అన్న పదము (అద్దము) వాడిరి. అద్దములో కనపడే ప్రతిబింబములు వలె మాయలోనే మాయ వలన జీవ, ఈశ్వర, జగత్తు అనే ప్రతిబింబములు ఏర్పడుచున్నది. సత్వగుణము వలన ఈశ్వర ప్రతిబింబము, రజోగుణము వలన జీవ ప్రతిబింబములు, తమోగుణము వలన జగత్ ప్రతిబింబము ఏర్పడుచున్నది. అయితే పరిపూర్ణము నందు, అద్దము వంటి మాయ కాని ప్రతిబింబము వంటి, ఈశ్వర, జీవ, జగత్తులు కాని లేవు. అద్దములో ఏర్పడిన ప్రతిబింబము, అద్దములో ఉన్నట్లు తోచబడుచున్నది. నిజానికి అద్దములో ప్రతిబింబములు లేవు. అద్దములో నా ముఖ ప్రతిబింబము ఉన్నట్లు తోచుచున్నది. ఆ ప్రతిబింబము కాని అద్దము కాని, నా ముఖములో లేవు. అట్లే ముకురము (మాయ) గాని, ముకుర స్థబింబములు (జీవ, ఈశ్వర, జగత్తులు) గాని, బింబమైన పరిపూర్ణములో లేవు. అద్దములో ఉన్నట్లుగా కనపడే ప్రతిబింబము ఉన్నది అనుటకు వీలు లేదు. ఆలాగని లేదంటే ఉన్నట్లు తోచబడుచున్నది కదా. దీనికే "మిధ్య" అని పేరు. లేనిదే ఉన్నట్లు తోచబడేదే ఎరుక. ఇదే పరిపూర్ణములో లేనిదే ఏర్పడినది. అందుకే "కల" వలె అన్నారు. "ముకురంబు వలన ముకుర స్థములు పుట్టును. ముకుర స్థములు వలన ముకురము దోచున్" అంటే అద్దమునకు ప్రతిఫలింపజేసుకొనే లక్షణము ఉన్నది. కనుక ప్రతిబింబములు అద్దములోనే ఏర్పడుచున్నవి. ప్రతిఫలించే లక్షణము బింబమునకు లేదు. నా ముఖమునకు ప్రతిఫలించే లక్షణము ఉన్నట్లయితే కర్రయందైనా ప్రతిఫలించును, కాదు. అద్దములోనే ప్రతిఫలించినది. అంటే అద్దము యొక్క ప్రతిఫలింపజేసుకొనే లక్షణము చేతనే ప్రతిబింబములు ఏర్పడినవి. ప్రతిబింబములైన జీవ, ఈశ్వర, జగత్తులు కాని ముకురమయిన "మాయ" కాని పరిపూర్ణములో లేవు. కనుక జీవ, ఈశ్వర, జగములకు కారణము మాయ. అనగా మాయ నుండే ప్రతిఫలించిన ప్రతిబింబ చైతన్యము యొక్క సత్తాచేత సమస్త సృష్టి జరుగుచున్నది. ప్రతిబింబము వలన లేని మాయ (జడమైన) చైతన్యవంతమై ఉన్నది, అయినది. ప్రతిఫలింపజేసుకొనే లక్షణము గల మాయ వలన ప్రతిబింబ చైతన్యమేర్పడినది. ప్రతిబింబ చైతన్యము వలన మాయకు ఉనికి ఏర్పడినది. మాయ వలన ప్రతిబింబ చైతన్యమునకు ఉనికి ఏర్పడినది. దాని వలన ఇది దీని వలన అది ఉన్నవి అగుచున్నది. ఈ పద్యము పరిపూర్ణ బోధలో చాలా ముఖ్యమైనది. చక్కని విమర్శ శాస్త్రయుక్తముగా చేయవలసిన అవసరమున్నది.

**139వ పద్యము : లేని నీ రాకడే స్వ। ప్నానందము, నీకు గురుడు, పరిపూర్ణంబున్ । పూని తెలిపి మేల్కోల్పిన । నేననకను నీవు బోవ, నీ మేల్కది రా ॥**

**టీక :** స్వప్నానందము = కలలో యేర్పడిన ఆనందము, పూని = ప్రయత్నించి, మేల్కొల్పిన = పరిపూర్ణము ఉన్నదని నిరూఢ పరచిన.

**భావము :** శిష్యా! (పై పద్యములో ప్రతిబింబ రూపము నీవు అని చెప్పబడినది) నీవు ఎరుకవు. అనగా అవిద్యోపాది అంతర్గత ప్రతిబింబము ఉపాధి గతమైనందున ఉన్నట్లు తోచుచున్నది. అది కలలో కల్గిన ఆనందము వంటిది. మేల్కొనుసరికి ఏమియు ఉండదు. అట్లే గురుమూర్తి నీ నిజ స్థితిని తెలియపరచి పరిపూర్ణ పరబ్రహ్మమును చక్కగా తెలిపి చూపించినచో, ఆ స్థితిలో నీవు "నేను ఉన్నాను" అని ఏ మాత్రము అనక వెంటనే లేకుండా పోయెదవు. అదే నీ వైన కలకు మేల్క అగును. (మేల్కలో కల లేనట్లు అగును)



**అవతారిక :** మాయ (ఎరుక) ఉపాధి సహితమైనది. శబ్దము గలది, పరిపూర్ణము శబ్ద రహితము. "నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే" అనుశృతిచే నిరూపించుచున్నారు.

**140వ పద్యము : తనకు దానొరులు చణికిన । ధ్వని బుట్టనిచోట బ్రహ్మ, తను దానొరులున్ । చణికిన ధ్వని గల చోటది । వినుమాయయు, లేని మాయ విడులేనని, నన్॥**

**దండాన్వయము :** తనకు దా చణికిన, తనకున్ ఒరులు చనికిన ధ్వని బుట్టనిచోట బ్రహ్మ। తను దా చణికిన, తనకు ఒరులు చణికిన ధ్వని గల చోటు అది మాయ (యని) విను । లేని మాయనన్ లేను అనివిడు ॥

**టీక :** చణకుట = తాకుట; మాయయు = ఎరుకయు,

**భావము :** శిష్యా! తనకు తానుగా ఉన్నప్పుడు గాని, తనకు ఇతరము తాకినప్పుడు గాని ధ్వని కలిగిన చోట ఎరుక యనియు, తనకు తానుగా ఉన్నప్పుడు గాని, తనకు ఇతరము తాకినప్పుడు గాని ధ్వని పుట్టని చోట, అది పరిపూర్ణ బ్రహ్మము అని తెలసి, లేని మాయ (ఎరుక) నేనే అని ఆ నేనును విడచిపెట్టుము.

**విశేష భావము :** సహస్రారమందు, భ్రూమధ్య స్థానమునందు ఇంద్రియములతో కలువక ఎరుక తనకు తానుగా ఉన్నది. అయినను అచ్చట శబ్దము గర్భితమయి యున్నది. కేవల నిశ్శబ్దము కానేరదు. ఆ ఎరుక జాగ్రత స్వప్నావస్థలలో ఇంద్రియములతో కలియుచున్నప్పుడు శబ్దము కలుగుచున్నది. కనుక ఎరుక తానుగా ఉన్నప్పుడు గాని, ఇంద్రియములతో కలిసినపుడు గాని శబ్దము కలుగుచున్నది. కనుక ఎరుక శబ్దము గలది. మాయా స్వరూపము.

సృష్టి (ఎరుక) ఏమియు లేనప్పుడు పరిపూర్ణము స్వతఃశ్శిద్ధమైయున్నది. కాని శబ్దము ఎంతమాత్రము లేదు. పరిపూర్ణములో ఎరుక జగములు లేక కల్గిన తరువాత కూడా పరిపూర్ణములో శబ్దము ఎంతమాత్రము లేదు. కనుక పరిపూర్ణమె శాశ్వతమైన సనాతనమైన బ్రహ్మమని నిరూపించుచున్నారు.

**141వ పద్యము : మనసుకు వాక్కుకు దెలియని । ఘన వస్తువు బయలటంచు గని, యా రెంటిన్ ॥ నిను నను విశ్వముగా గని । వినుమూలము లేనివి వీటి విడరా శిష్యా!!**

**టీక :** ఘనవస్తువు = గొప్పదైన బ్రహ్మము - వస్తుః = వసతి ఇతి వస్తుః - ఉన్నది అనేది వస్తువు (ఉన్నది బ్రహ్మము మాత్రమే కనుక "వస్తువు" శబ్దమునకు బ్రహ్మమని శాస్త్రయుక్తము.

**భావము :** శిష్యా! మనస్సుకు వాక్కుకు తెలియనిది గొప్ప బ్రహ్మమైన "పరిపూర్ణము" అని తెలియుము. ఆ మనస్సు, వాక్కుల రూపమే నీవు, నేను అఖండ యెరుక (జగదధిష్ఠానము) అని వినుము. ఇట్టి ఎరుక మూలము లేనిది. కనుక దీనిని విడిచిపెట్టుము.

**విశేష భావము :** మనో వాక్కులకు అందనిది పరిపూర్ణము. జ్ఞానముచే కాని (మనస్సు) సాధనలచే గాని (వాక్కు - కర్మ) అందనిది సాధించబడనిది బ్రహ్మము.

"ఆరెంటిన్ నీవని నేనని" - ఆమనో వాక్కులు. అనగా జ్ఞానము - కర్మము, జ్ఞానము గురుమూర్తి (ప్రతిబింబము), కర్మము - అవిద్య లేక మాయ. ఇది శిష్యుడు.

ఈ రెంటి వలన అనగా అవిద్య + అవిద్యా ప్రతిబింబము. ఈ రెంటి కలయిక అయినదే అఖండ యెరుక అనియు, అవిద్య ప్రతిబింబములు కలకయిక వలన ఏర్పడుచున్నదే సమస్త జగత్తు అని విచారించి తెలుసుకొనుము. కర్మ + జ్ఞాన రూపమయిన ఎరుకను విడిచిపెట్టమని ఈ పద్య విశేష భావము.

**142వ పద్యము : కలలో వానికి మేలుక । గలదని గుర్తెరుగ వశమె, కలమేల్కని వన్। కలవాడు గలడె, తెలియను తలపోయుము నిన్ను నీవు తగ నీ రీతిన్ ॥**

**దండాన్వయము :** "కల మేల్కనినన్ కలవాడు తెలియను గలడె?" "ఈ రీతిన్ నిన్ను నీవు తలపోయుము తగును" ॥

**భావము :** శిష్యా! స్వప్నములో ఉన్నవాడు, జాగ్రదవస్థలో ఉన్నవారిని గుర్తించగలడా? (లేడు) అట్లే స్వప్నము నుండి మేల్కొనిన తరువాత ఆ కలలో చూచిన వాని చేష్ఠలను తెలిసికొనగలడా (చూడగలడా?) ఇదే విధముగా నిన్ను నీవు విచారించుకొనిన నీవు లేవని తెలిసినచో సరిపోవును.

**విశేష భావము :** స్వప్నములో ఉన్నవాడు జాగ్రదవస్థ వాని విశేషములు తెలియవు. అట్లే మేల్కలో జాగ్రదవస్థ వాడు తన స్వప్న అవస్థ విశేషములను చూడలేడు. ఈ స్వప్న, జాగ్రతలు సుషుప్తి అవస్థలో లేవు. కనుక మూడు అవస్థలు కూడా స్వప్నతుల్యములే. అనగా లేనివే, కనుకనే "అవస్థా త్రయ స్వప్నః" అని శాస్త్రదృశ్యము. మరి ఉన్నది ఏది? అవస్థలు కలిగి ఉన్నది లేనిది, అనగా ఎరుక లేనిది. అవస్థలు లేని పరిపూర్ణము ఒక్కటే "ఉన్నది" అనుటకు తగినది.

"నిన్ను నీవు ఈ రీతిన్ తలపోయుము" - నీవు లేనిదె ఏర్పడిన మిధ్యారూపము. అనగా ఆ విద్య (నీవు) లేనిదే ఏర్పడినది. (నేను) పరిపూర్ణము యొక్క ప్రతిబింబము. ప్రతిబింబము ఎప్పుడును లేనిదే కనుక నీవు, నేను ఈ రెంటి వలన ఏర్పడిన జగము సమస్తము లేనివే. కనుక నీవైన కలకు, పరిపూర్ణమనే మేల్కను చూచి లేకపోవలెను అని నిర్ణయము.

**143 వ పద్యము : కలవాడు వాని చదువులు । గలవా, తామేలుకొనిన గమగొను మటులవ్ । కల నిన్ను నీ చదువును । ఫల మేమిక చాలు పెక్కు పలుకుల తండ్రీ!**

**టీక :** కలవాడు, స్వప్నములో ఉన్నవాడు, చదువులు, అనేక విద్యలు, శాస్త్రములు పలుకుల = విద్యల.

**భావము :** శిష్యా! స్వప్నములోనివాడు చాలా వేద శాస్త్రములు చదవి గొప్ప పాండిత్యము సంపాదించుకొన్నట్లు కల గనినమా, మేల్కొనిన తరువాత ఆ పాండిత్యము ఉండునా? ఉండదు. కనుక నీవే కల, నీవు నేర్చిన విద్య అంతయు కలయే కదా! ఈ పాండిత్యము వలన ఫలమేమి? చాలించి పరిపూర్ణమును తెలిసి లేకుండా పోయినచో చాలు. అనేక శాస్త్రాధ్యయనముల వలన జన్మ రహితము కానేరదని భావము.

**విశేష భావము :** ఎన్ని వేదములు చదివినమా, అందలి సూక్ష్మ భావమైన (రహస్యము) బ్రహ్మమును తెలియకున్నచో ఆ పాండిత్యము వలన ఫలము లేదు. "చతుర్వేదవిదో విప్రః సూక్ష్మ బ్రహ్మన విద్యతే । వేద భారభరక్రాంతా సవై బ్రాహ్మణ గార్ధభః॥ అన్న శాస్త్ర వాక్యమును చెప్పుచున్నది ఈ పద్యము.

---

**144వ పద్యము :** కలరాజు సర్వ సంప । త్కలితుండై తాను మేలుకన లేడెచటన్। కల నిన్ను వాని విధమున । దలుపుము, తలచితివె చాలు, ధన్యచరిత్రా ! ॥

**టీక :** సంపత్కలితుడు = సంపదలతో కూడినవాడు, । ధన్యచరిత్రా = పుణ్యచరిత్రా॥

**భావము :** శిష్యా! కలలో వాడు రాజు అయినట్లు సకల సంపద భోగ యుక్తుడయినట్లు కలగని, మేల్కొనినచో ఆ రాజ ఆ సంపదలు ఎంతమాత్రము కనపడవు కదా! అట్లే నీవు కల అని తలచి, మేల్క అయిన పరిపూర్ణ బ్రహ్మమును గాంచినచో చాలు. నీవు ధన్యుడవే. అనగా నీ జన్మ సార్థక్యమును పొందితివి అని భావము.

---

**145వ పద్యము : ఏ నిర్ణయమును జేయుడు । నేనవని మహాత్ముడెపుడు, నేననువాడే। నానా విధాల వదరును । నేనను తన వంటి వారినెప్పుడు గనినన్ ॥**

**టీక :** నిర్ణయము = నిశ్చయము, మహాత్ముడు = గొప్ప బుద్ధి కలవాడు, వదరును = మాట్లాడును.

**భావము :** శిష్యా "నేను" అని అనని మహాత్ముడు ఎట్టి నిర్ణయములు చేయడు. "నేను" అని పలికే వాడే తన వంటి వారిని చూచినప్పుడు అనేక విధములుగ మాట్లాడుచుండును.

**విశేష భావము :** పరిపూర్ణ స్థితిని పొందినవాడు "నేను" అను అహంకర్తృత్వమును పొందడు. అహంరహితుడు, పరిపూర్ణమె ఉన్నదని కాని, ఎరుక లేదు అని గాని ఏ విధమైన నిర్ణయయములు చేయడు. "నేను" అను వాడే అనగా ఎరుకలో ఉన్నవాడే తన వలె ఎరుక గల వారిని కలిసినప్పుడు అనేక నిర్ణయములు, చర్చలు, సిద్ధాన్తములు చెప్పుచుండును.



**146వ పద్యము : మలకలు లేవీ త్రోవను । చులకనగా దెలియవచ్చు, సుజనులకెల్లన్। తలపదగు దీనినెప్పుడు । మలకల త్రోవలకు బోక మాన్యచరిత్రా ॥**

**టీక :** మలకలు = మలుపులు, వంకరలు, చుట్టు, చులకనగా = తేలికగా, మాన్యచరిత్రా= గౌరవ చరిత్ర కలవాడా ! గౌరవనీయుడా అని భావము.

**భావము :** శిష్యా! మాన్యుడా! ఈ బోధ తెలియపర్చే పద్ధతిలో (శాస్త్రము వలె) ఏ విధమైన వంకరలు లేవు. సుజనులైనవారు చాలా తేలికగా తత్త్వమును గ్రహింపనగును. కనుక శిష్యా! ఆ వంకర మార్గములు కల శాస్త్ర పద్ధతులుకు పోకుండగ, ఈ తిన్నని పరిపూర్ణ బోదను చక్కగా గ్రహింపుము.

**విశేష భావము :** వేదాంత శాస్త్రములో మాయాసహిత బ్రహ్మమును, పరిపూర్ణ బ్రహ్మమును కూడా ఒకే పదముతో అనగా బ్రహ్మ అని, ఆత్మ అని రెంటికి ఒకే పదముతో సూచించిరి. అందుచే శాశ్వత బ్రహ్మము విడిగా ఉన్నదని తెలుసుకొనలేక, మాయా బ్రహ్మమే అనగా జగత్కారణ బ్రహ్మమునే శాశ్వత బ్రహ్మముగా అభ్యాసకులు (శాస్త్రజ్ఞులు) పొరబడుచున్నారు. అట్టి వంకర విధానము ఈ పరిపూర్ణ బోధలో లేకుండగా మాయా బ్రహ్మమును ఎరుక అనియు, శాశ్వత బ్రహ్మమును పరిపూర్ణమని రెంటికి వేర్వేరు నామములతో వ్యవహరించిరి. అందుచే ఇది మలకలు లేని బోధ

అని చెప్పిరి. అందుకే జగత్కారణమైన బ్రహ్మమును ఎరుకగా గుర్తించిన సుజనులకు ఈ పరిపూర్ణ బోధ చాలా తేలికగా అవగాహన కాగలదని ఈ పద్య భావము.

---

**అవతారిక :** శాస్త్ర వాసన ధృడముగా నున్న ఛాందసులకు ఈ బోధ రుచించదేమోనని భావించి ఈ పద్యము చెప్పుచున్నారు.

**147వ పద్యము : నా మాట నమ్మవేమో । నీ మానస మెరుగకంటి, వే నీ మాటన్। నా మాట పథ్యమైనను । యేమారకు దీన్ని నీ వికెప్పటి కప్పా ॥**

**పద విభాగము :** నామాట నమ్మవేమో। నీ మనాసము ఎరుగక అంటి ఈ మాటన్। నా మాట పథ్యమైనను, । అప్పా, దీన్ని నీవు ఇక ఎప్పటికి, ఏ మారకు ॥

**టీక :** మానసము = మనస్సు, పథ్యమైనను = హితవైనను, అప్పా = తండ్రీ, ఏ మారకు = మరచిపోకుము.

**భావము :** శిష్యా! నీ మనస్సు తెలియక ఈ మాట (ఈ బోద సూక్తులు) అన్నాను. నా మాట నమ్మవేమో ! కాని నా మాట నీకు రుచించినచో, ఈ బోధను నీవు ఎప్పటికి మరువకుము. విడచి పెట్టకుము.

---

**148వ పద్యము : సిద్ధాన్తోక్తులు యివి, నీ । బుద్ధికి దెలసుండి చదువబోకుము వీటిన్। బద్ధుల వినుమని, వారలు । యుద్ధమునకు కాలు ద్రువ్వుచుందురు పెలుచన్॥**

**దండాన్వయము :** సిద్ధాన్తోక్తులు యివి బుద్ధికి దెలసుండి, బద్ధుల వినుమని వీటిన్ చదువబోకుము । వారలు పెలుచన్ యుద్ధమునకు కాలు ద్రువ్వుచుందురు ॥

**టీక :** సిద్ధాన్తోక్తులు - శాస్త్రవేద విహితమైన (కాదని మార్పు జేయరాని) నిర్ణయ వాక్యములు, బద్ధులు = లోకులు (మోక్షాసక్తి లేని వారు) పెలుచన్=ఆగ్రహము చేత, కాలుద్రువ్వుచుందురు = తమకు తాముగా సిద్ధపడుదురు.

**భావము :** ఈ బోధ వేద విహితమైన నిర్ణయమైన వాక్యములతో కూడినది. అందరు దీనిని గుర్తించలేరు. మోక్షాసక్తిలేనివారు సంస్కారహీనులైన వారిని, నీకు తెలుసుండి

వినుమని వారి యెదుట చదువవలదు. ఇది వారికి వినబుద్ధి కాక ఆగ్రహముతో విపరీతముగా వాదించుచు కష్టపెట్టెదరు.

**149వ పద్యము :** ముద్దుగ యీ గ్రంథంబును । పెద్దల ముందర వచింప పిరిదివియకుమీ । దిద్దెదరు తప్పులున్నను । వద్దనకను దిద్దనివ్వు వరకీర్తి నిధీ ।

**టీక :** ముద్దుగ = ఆదరముగ (ఆనందముతో) పిరిది వియకుమీ = వెనుకాడకుసుమ, పెద్దలు = శ్రేష్ఠులు, వరకీర్తి నిధీ = శ్రేష్ఠమైన కీర్తి గలవాడా!

**భావము :** మంచికీర్తి గల శిష్యా! శ్రేష్ఠులైన వారి ముందు ఈ గ్రంథమును ఆనందముతో చదువుటకు వెనుకాడకుము. నీ చదువులో తప్పులున్నచో దిద్దెదరు (చక్కజేసెదరు) వద్దనక దిద్దనివ్వుము.

---

**150వ పద్యము : నేను గల, మేను లేదని । మేనున నీవుండి యిట్లు మిడుకుట మేలా? మేను విడచను, వినియెద । మానుగ నీవనక యున్న మాయవె సుమ్మీ॥**

**టీక :** నేను గల = నేను శాశ్వతమును (ఉన్నాను), మేను లేదని = శరీరము లేదని (అశాశ్వతమని) మిడుకుట = త్రుళ్ళిపడుట, మానుగ = చక్కగ.

**భావము :** శిష్యా! దేహమును ఆధారముగ జేసికొని దేహి అయిన "నేను" శరీరమందున్నప్పుడే నేను శాశ్వతమును, దేహము అశాశ్వతమైనది, అని త్రుళ్ళిపాటుతో (గర్వముతో) మాట్లాడుట తగదు. శరరీమును విడచి "నేను" శాశ్వతమైనదని అని అనినచో నమ్మదగును. శరీరమును విడచినచో "నేనుకు" ఏ రకమైన క్రియా విశేషములు లేవు గదా! శరీరమును ఆధారముగా ఉన్నప్పుడే నేను ఉన్నాను అనే నేను, బ్రహ్మము కానేరదు కదా! మాయయే అని భావము.

**విశేష భావము :** "నేను" ప్రతిబింబము - "మేను" అవిద్య లేక అంతఃకరణ. ఈ రెండు ఎన్నడు విడిగా ఉండవు. విడిపోతే ఏ ఒక్కటియు ఉండదు. ఈ ప్రతిబింబము పరిపూర్ణము యొక్క ప్రతిబింబమగుటచే పిండాండమందలి అవిద్యోపాధియందలి ఈ ప్రతిబింబమును బ్రహ్మమనియు, శాశ్వతమనియు, అవిద్య ఉపాధి అయినందున మేను అనియు అశాశ్వతమనియు చెప్పెదరు. కాని గురుముఖత విచారించినపుడు

అవిద్యను ఆధారముగ జేసికొని ఉన్నందునను స్వతస్సిద్ధముగా ప్రతిబింబమునకు ఉనికి లేనందునను ప్రతిబింబముయిన "నేను" బ్రహ్మము కాదు. శాశ్వతము ఎన్నడూ కానేరదు.

---

**151వ పద్యము : కట్టెలు పిడుకలు లేకనె। యెట్టుంబలె నిప్పు నిల్వకేగునొ పుడమిన్। అట్టుంబలెనే నీవును। యిట్టి శరీరంబు లేక నెందుందువురా ? ॥**

**టీక :** కట్టెలు = వంట చెరకు కొరకు ఉపయోగపడే కఱ్ఱలు, ఏగునో = పోవునో, పుడమిన్ = భూమిపై, ఎందుందువురా? = ఎక్కడ ఉందువురా ॥

**భావము :** శిష్యా! కఱ్ఱలు పిడకలు లేకుండగ నిప్పు ఉండుటకు వీలు కాదు. కఱ్ఱ ఉన్నంత వరకే నిప్పు ఉండి, కఱ్ఱ కాలిపోయిన తరువాత నిప్పు కూడా లేకపోవుచున్నది. అట్లే "నేను" అను చైతన్యము యిట్టి శరీరము లేకుండగ ఎచ్చటను ఉండదు అనగా నేను అనునది ఉపాధి లేనిదే ఉండనేరదని భావము.

**విశేష భావము :** "నేను" అను చైతన్యము యిట్టి శరీరము లేకుండగ ఎందునుండును? ఉండలేదు అన్నారు. అయితే ఈ స్థూల శరీరము పోయినను నేను ఉండుట చేతనే పునర్జన్మవచ్చుచున్నది. కనుక యిట్టి శరీరము అనగా యీ స్థూల శరీరము మాత్రమే అని అర్థం కాదు. స్థూల సూక్ష్మశరీరము లేక స్వర్గాది భోగములకు యాతనా శరీరము, మహా పుణ్యానుభవముతో దేవతా శరీరములు ఈ విధముగా "నేను" అను చైతన్యము ఏదో ఒక శరీరమందుండి సమస్త విషయములను ఆయా చోట్ల అనుభవించుచున్నది. ఇంకను విచారించినచో కారణ శరీరమైన అవిద్య అను మేనును ఎల్లప్పుడు ఈ నేను అను చైతన్యము ఆశ్రయించియే యుండును. కనుక నేను అను చైతన్యము ఉపాధి లేనిదే ఒక్క క్షణమైనను ఉండదు. ఉపాధి లేకపోతే దానికి ఉనికే లేదు. పూర్తిగా లేకుండా పోవును.

---

**152వ పద్యము : తనువునే గాననంటే। ఘన సుఖ దుఃఖములు రెండు గనపడె నీవై। గనుక తనువు నీ వొక్కటే। వినరా నా మాట నిట్టి వెఱ్ఱిన పడకన్ ॥**

**టీక :** తనువు = స్థూల శరీరము, ఘన సుఖఃదుఃఖములు = గొప్పవైన సుఖదుః ఖములు (జనన - మరణములు)

**భావము** : శిష్యా! స్థూల శరీరము నేను కాను అని అంటే యీ గొప్పదైన సుఖదుఃఖములు, జనన మరణములు అనుభవించుచున్నది శరీరమా? లేక నీవా? శరీరమే అనుభవించుచున్నదంటే చచ్చిన శరరీము కాల్చితే బాధపడు కదా? కనుక నీవే (నేనే) స్థూల శరీరము కూడా అయియున్నావు. కనుక నేను వేరు (బ్రహ్మను) అనే వెర్రిన పడక, నీ శరీరము కూడా నీవే అయి యున్నావు. "నేను"తో సహా శరీరము కూడా ఒక్కటే అని తెలియుము.

**విశేష భావము** : నేను అను ఎరుకయే సర్వ జగత్తు అనగా మూడు శరీరములను నిర్మించుకొన్నది. నేను లేకపోతే శరరీము తయారు చేసుకొనేది మరేదియు లేదు. అదే మోక్షమనే దానికి అర్థము. కనుక "నేను" కారణము. శరరీము - కార్యము. కార్య-కారణములు రెండును ఒక్కటే అనే శాస్త్ర దృశ్యా, కారణమైన నేను, కార్యమైన శరీరము ఒక్కటే అని తెలియవలెను, వేరుగావని నిర్ణయము.

**153వ పద్యము : ఎరుక లేవట్టి బయలున । బిరబిర నరుదెంచి యెవరు బిలువనిదె, తా । నరసి పరిపూర్ణమున్నది । యెరుకేగితె చాలు, లేనిదెరుకని లేకన్ ॥**

**దండాన్వయము** : బయలున లేనట్టి యెరుక, యెవరు బిలువనిదె తాన్ బిరబిర నరుదెంచి, పరిపూర్ణమున్నది, యెరుకే లేనిది, అని అరసి యెరుక లేకన్ ఏగితే చాలు॥

**టీక** : అరసి = విచారించి చూచి, యెవరు బిలువనిదె = ఏ కారణము లేకుండగ తనకు తానే, బిరబిర = ఏదో పని ఉన్నట్లు వేగమే వచ్చుట.

**భావము** : శిష్యా! పరిపూర్ణ పరబ్రహ్మములో లేనిదె యెరుక తనకు తానే అతి వేగముగా వచ్చిన యెరుకే, పరిపూర్ణమె ఉన్నదనియు, అందు ఎరుక లేదనియు గురుముఖముగా విచారించి తెలుసుకొని, తాను లేకుండా పోయినచో చాలును. (ఇంతకన్న నీవు చేయవలసిన పని ఏదీ లేదని భావము)

**154వ పద్యము : తనువునే గాననంటివి । వినుసుఖదుఃఖములు యెవరివిర నాతోడన్। వినజెప్పుము, నే వినియెద । తనయా తప్పితివె నిన్ను దండింతుజుమీ ॥**

**భావము :** కుమారా! స్థూలాదిశరీరములు నేను కాను అంటున్నావు. యీ అనుభవించే కష్ట సుఖములు శరరీము అనుభవించుచున్నదా? లేక "నేను" అనుభవించుచున్నదా? సరిగా విచారించి చెప్పుము. తప్పుగా మాట్లాడినచో దండించెదను సుమా ?

**విశేష భావము :** శరీరములు జడము. అది అనుభవించుచున్నది అనుటకు వీలు లేదు. ప్రత్యక్షముగా చూచుచున్నాము. ఇక నేను అనుభవించుచున్నది. నేను అనునది ప్రతిబింబ స్వరూపము లేనిదే ఏర్పడినది. పరిపూర్ణము మాత్రమే ఉన్నదని గురువాక్య వివరణచే (153వ పద్య వివరణ). ధృడమై ఎరుక లేనిదని నిర్ణయమైతే ఇక సుఖః దుఃఖములు ఎవరివని చెప్పవలెను? ఈ విచారణచే శరీరము లేనిదే. నేను లేనిదె కర్మ ఎక్కడిది? అనుభవమెవరిది. అంతా ఉళ్లక్కి అని ఆరూఢ విచారణ.

---

**155వ పద్యము : అందరి మాటల కురికే । వెందుకు, నా మాట నమ్మ్మ మిదె చాలును, యీ । యందరు లేని బయలు గని । యందున నీ లేమి నెరిగి యరగితె సరిరా ॥**

**టీక :** ఉరికేవు = ఆనందముతో తెలుసుకొనుటకు ప్రయత్నము. యీ అందరు = యీ సమస్త జగము (ఎరుక), యరగితె = లేకపోయినచో.

**భావము :** శిష్యా! అనేక ఇతర బోధల వారి యొక్క వాక్యములు విని అందులో మనస్సు పెట్టెద వెందుకు? అవి వినకు, నా బోధ పరిపూర్ణ బోధ నమ్మ్మము చాలును. నీకు జన్మకడతేరగలదు. యీ సమస్త జగత్తు (ఎరుక) లేని, పరిపూర్ణ పరబ్రహ్మమును విచారించి చూచి, అందులో యెరుక లేదని తెలసి, ఎరుకైన "నేను" లేకుండా పోయినచో చాలును.

---

**156వ పద్యము : నా బోతు రుచికి రుచినిడు । నీ బోధన పేక్ష చేత నేర్చిన వారిన్। యే బాధలు బాధింపవు । బాబూ యిది వీవు నేర్చి పఠియింప గదే ॥**

**పద విభాగము :** యీ బోధ నా బోతు రుచికి రుచినిడును । ఈ బోధనపేక్ష చేత నేర్చిన వారిన్ యే బాధలు బాధింపవు । బాబూ యిది నీవు నేర్చి పఠియింపగదే ॥

**టీక :** నా బోతు = పటిక బెల్లము (కలకండ) ఇది ప్రాంతీయ భాషాపదము. అపేక్షచేత = మిక్కిలి కోరిక చేత, యే బాధలు = జనన మరణములు.

**భావము :** బాబూ శిష్యా! యీ పరిపూర్ణ బోధ పటిక బెల్లము రుచికన్నా ఎక్కువ రుచిగా నుండును. యీ బోధను మిక్కిలి ఆసక్తితో తెలుసుకొని, మనన నిధిధ్యాసలతో ఉన్నచో అట్టి వారికి జనన మరణములతో సహా సమస్త బాధలు తొలుగును. కనుక బాబూ యీ బోధ నీవు నేర్చి మననము చేయుతగును కదా !

**విశేష భావము :** శ్రీ కృష్ణ దేశికేంద్రులవారు మధ్యాహ్న సమయమున శిష్యులకు బోధ చేయనారంభించు సమయములో, ఒక శిష్యుడు వచ్చి పటిక బెల్లపు ముక్కను గురువుగారి చేతిలో పెట్టి పాదాభివందనమొనరించి కూర్చుండెను. కృష్ణ ప్రభువులు ఆ పటిక బెల్లము ముక్కనొక దానిని వారి నోట్లో వేసుకొని, మిగతా ముక్కను శిష్యులందరికి పెట్టిరి. శిష్యులందరు ఆ గురు ప్రసాదమును నోట్లో వేసుకొనిరి. అందులో ఒక శిష్యుడు "పటిక బ్లెలము చాలా రుచిగా నున్నది" అని అనెను. అంత శ్రీ కృష్ణ దేశికేంద్రులు శిష్యునకు బుద్ధి చెప్పే విధముగా "నాయనా యీ బోధంద పేక్ష చేత నేర్చినచో నా బోతు రుచికి రుచినిడు" అని యీ (156) పద్యమును చెప్పిరి. కనుక తిండి పై ధ్యాస తగ్గించి యీ బోధ పఠింపుము అని వానికి హితవు చెప్పిరి. (ఇది ఆనాడు జరిగిన విశేషమునకు చెప్పిన చాటు పద్యము. ఋజువు చేయలేని నిజము).

---

**అవతారిక :** ఈ బోధ సంస్కారవంతులకు మాత్రమే అబ్బును. సామాన్య భక్తులకు అల్పజ్ఞానులకు ఇది పనికిరాదని చెప్పుచున్నారు.

**157వ పద్యము : తాము తమ తప్పునెరుగక । నా మాటలు తప్పులనుచు నవ్వే జనముల్ । సామాన్యులనుచు దెలియుము । నీ మానసమందు లెస్స నిరుపమ సుగుణా॥**

**దండాన్వయము : నిరుపమసుగుణా! తాము తమ తప్పు నెరుగక, నీ మాటలు తప్పులనుచు నవ్వేజనముల్, సామాన్యులనుచు నీ మానసము నందు లెస్స దెలియుము ॥**

**టీక** : నిరుపమసుగుణా = ఉపమానము లేని మంచి గుణవంతా ! తప్పు = ఎరుక (జన్మకారణము) తప్పులనుచు = శాస్త్ర విరుద్ధములనుచు, లెస్స = బాగుగ.

**భావము** : నిరుపమ సుగుణా! తమ యొక్క జన్మకా రణమైన ఎరుకను గుర్తించలేక, నేను చెప్పే యీ పరిపూర్ణ బోధ శాస్త్రబద్ధమైనది కాదని వాదించే జనులు, సామాన్యజనులు, (అజ్ఞానులుగా నీ మనస్సు నందు బాగుగా తెలియుము.

(ఈ బోధ ఆరూఢ జ్ఞానులైన సంస్కారులకు మాత్రమే ఆనందము కలుగ జేయును అని భావము)

---

**158వ పద్యము : దప్యప్పున జనివట్లుగ । నిప్పున చలిబాసినట్లు నిజమోగిరమున్। ఒప్పుగ దిన్నప్పుడె క్షుధ । దప్పినగతి, బోధ విన్న దప్పును బాధా ॥**

**టీక** : దప్పి = దాహము, అప్పున = నీటి చేత, ఓగిరమున్ = ఆహారమును, క్షుద=ఆకలి, బాధా=దుఃఖము (జన్మ)

**భావము** : శిష్యా ! నీరు త్రాగుట చేత దాహమును, ఆహారము తినినచో ఆకలియు, పోయిన విధముగానే, ఈ పరిపూర్ణ బోధ (గురుముఖతా) వినినచో జన్మదుఃఖము పోవును. ఇది నిజము.

**విశేష భావము** : ఈ పద్యము అన్వయ భావము పైన చెప్పిన భావము. వ్యతిరేకార్థముగా - దాహము కలిగిన వానికే నీరు కావలయును. ఆకలిగా ఉన్నప్పుడే అన్నము తినవలయును. కనుక దాహము లేని వానికి నీరు అక్కరలేదు, ఆకలి లేని వానికి ఆహారము రుచించదు. అట్లే జన్మదుఃఖము తప్పించుకోవలెనను గట్టి ప్రయత్నము చేసే వానికే ఈ పరిపూర్ణ బోధ అత్యంత రుచికరముగా ఉండును. పునరావృత్తి రహితము అంటే ఏమిటో తెలియని మూఢ భక్తులకు ఈ బోధ ఉపయోగించదు రుచించదు అని భావము.

---

**159వ పద్యము : సాధనలు జెప్పి శిష్యుల । బాధలు పెట్టే గురుని బాట వదలి, యే । బాధలు లేనీ బోధను । సాధుల సేవించి వినుము సద్గుణ శాలీ ॥**

**టీక :** సాధనలు = అష్టాంగ యోగ సాధనలు, బాట = మార్గము, యే బాధలు లేని = అష్టాంగ యోగమార్గము కాని, సాధుల సేవించి = సద్గురువులకు శుశ్రూష చేసి, సద్గుణ శాలీ = మంచి గుణములు కలవాడా !

**భావము :** శిష్యా! అష్టాంగ యోగసాధనలు చెప్పి శిష్యులను అనేక విధములుగా ప్రయాసపెట్టే గురువుల మార్గమును విడచి, ఏ యోగ సాధన లేని యీ గొప్పదైన పరిపూర్ణ బోధను అశరీర సద్గురువుల శుశ్రూష చేసి చక్కగా తెలిసికొని సమస్త దుఃఖకారణమయిన ఎరుకను విడువుము, అని కృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చుచున్నారు.

---

**160వ పద్యము : బోధల కెల్లను గురువగు । బోధ సుమీ, దీన్ని నీకు బోధిస్తిని, యీ। బోధను వదలకు మెప్పుడు । సాధు జన స్తుత వివేక, సతతాశోకా ॥**

**టీక :** సాధుజనస్తుత = మంచివారి చేత పొగడబడిన, వివేకా = నిత్య అనిత్యములను గుర్తించినవాడా! అశోకా = దుఃఖరహితుడా! గురువగుబోధ = గొప్పదైన బోధ, బోధిస్తిని = తెలియపరిచితిని.

**భావము :** సాధు జనులచే పొగడబడెడువాడా ! మాయా బ్రహ్మ, శాశ్వత బ్రహ్మలనెరిగినవాడా! దుఃఖరహితుడా! యీ పరిపూర్ణ బోధ మిగిలిన అన్ని బోధల కన్నను గొప్పదగు బోధ. అట్టి యీ బోధను నీకు పూర్తిగా తెలియపర్చితిని. యీ బోధను ఎన్నడు విడచిపెట్టుకుసుమా !

**విశేష భావము :** సాధుజన స్తుత, వివేకా, సతత అశోకా! ఈ మూడు శిష్యుని ప్రేమతో సంబోధించిన విశేషణ పదములు. సాధుజనులు = సత్‌వస్తువును గుర్తించిన జనులు అనగా పరిపూర్ణ బ్రహ్మమును ఆరూఢముగా తెలిసిన పెద్దలచే పొగడబడెడువాడా! 2) వివేకా = నిత్య, అనిత్య వస్తు వివేకా, నిత్యవస్తువు, అనిత్య వస్తు వివేకము గలవాడా! = నిత్యవస్తువు, శాశ్వత బ్రహ్మము = అనగా పరిపూర్ణమును అనిత్య వస్తువు = మాయా శబళిత బ్రహ్మము = అనగా ఎరుక. ఈ రెంటిని చక్కగా గుర్తించిన వాడా! సతత అశోకా = ఎల్లప్పుడు దుఃఖములేని వాడా! నిత్య అనిత్యములు ఎరిగినవాడు అనిత్యమును విడచుటచే (ఎరుకను విడచుటచే) దుఃఖరహితుడయ్యేను అనగా జన్మరహితుడని భావము.

---

**అవతారిక :** ఆశ, ప్రలోబాధి దుర్గుణములు కలవార్కి యీ బోధ ప్రకాశించదు. అట్టి వారు ఈ బోధకు అనర్హులని చెప్పుచున్నారు.

**161వ పద్యము : ఈ వికాసించు గరుడును । నా వద్దొక కాసులేదు నన్నడగకు, పో। పోవయ్య యనెటి శిష్యుడు । కే వల హీనాత్మలనుచు కీర్తింపదగున్ ॥**

**టీక :** ఈవికి = ఇచ్చుటకు, (ధనము కావలయుననెటి కోరిక గల) హీనాత్ములు = నీచులు, కీర్తింపదగున్ = చెప్పదగును.

**భావము :** ధనాశకు లోబడిన గురుడు, నా వద్ద ఒక్క రూపాయి కూడా లేదు పోవయ్య అని చెప్పే శిష్యుడు, ఈ ఇద్దరు కూడా కేవల నీచాత్ములు దుష్టులు అని చెప్పతగును. (ఇట్టి వారిని విడువతగును అని భావము)

---

**162వ పద్యము : దేవుడు తే తెమ్మనునా । జీవుడు లేదనుచు మదిని శిడిముడి పడునా। భావమున దెలసి యిద్దరు । నా విధమున నడువలయునందరు మెచ్చన్॥**

**టీక :** దేవుడు = గుడియందలి దేవుడు, జీవుడు = (ఈ సందర్భములో) జీవుడు అనగా భక్తుడు, శిడిముడి = బాధ.

**భావము :** గుడియందలి దేవుడు, అక్కడకు వచ్చే భక్తులను ధనము తెమ్మని కోరుచున్నాడా? (లేదు) అనగా ధనమును కోరుట లేదు. తన వద్ద డబ్బు లేదని భక్తుడు బాధపడునా? తనకు ఉన్నతంలో భక్తిగా ఎక్కువగానే పూజ, దక్షిణాదులను సమర్పించుకొనుచున్నాడు. ఆ రెంటి భావము వలనె, శిష్యుడు గురుమూర్తి వద్ద లోభత్వము చెందక తన శక్తి కొలది దక్షిణ సమర్పించుకొనవలెననియు, గురుమూర్తి ఇంత ధనము నాకు కావలెనను కోరిక లేకుండ ఉండవలెననియు భావము. ఇట్టి మంచి భావముతో నుండే గురు శిష్యులు అందరు మెచ్చే విధముగా నడచుకొనగలరు. చెడుపేరు రాదు.

---

**163వ పద్యము : కోటి విధంబుల జెప్పిన । చేటాదవెటి తనదు పూర్వచేష్టలు విడకన్। చాటున నేటున ద్వి విధము । గాటన మొవరించు నతని కతుకునె బోధా॥**

**టీక :** కోటి విధంబుల జెప్పిన = ఎన్నో విధములుగా చెప్పినమూ, చేటొదవేటి = కీడుచేసేటువంటి, పూర్వపు చేష్టలు = పూర్వపు నడక, చాటున = అందరికి కనపడకుండగ (రహస్యముగ), నాటున = అందరికి కనిపించేలాగున (ప్రత్యక్షముగ) గాటనము = ప్రవర్తనము, ఒనరించు = చేయు.

**భావము :** ఎన్ని విధములుగా చెప్పిననూ కీడు తెచ్చే, తన పూర్వపు నడకను విడచిపెట్టక, చాటుగా ఒక విధము, ఎదురుగా మరొక విధముగా, రెండువిధములుగా ప్రవర్తించే వానికి, ఇట్టి నిజ బోధ అతకదు. అనగా ఈ బోధలో నున్నవాడు పూర్వపు తన చెడు ప్రవర్తన పూర్తిగా విడచి, సత్ప్రవర్తకుడై యుండవలెనని శ్రీ కృష్ణదేశికుల ఆదేశము.

---

**164వ పద్యము : బంగారు వంటి యీ బో । ధాంగీకరణులను జేరి యదివిని వారిన్ । భంగ పరుచదలచెటి, యా । వెంగళులకు జెప్పకుమని వేడెద నిన్నున్ ॥**

**టీక :** బంగారు వంటి = బంగారము వంటి (గొప్పదైన) బోధాంగీకరణులను = యీ బోధను అంగీకరించి తెలుసుకొనిన వారిని, భంగపరుచ = అవమానపరుచ, వెంగళులకు = మూఢులకు.

**భావము :** గొప్పదైన యీ బోధ తెలుసుకున్నవారిని చేరి, బోధను తెలుసుకొని బోధను, బోధస్థులను అవమాన పరుచదలచే మూఢులకు, యీ బోధ తెలియపర్చవద్దని వేడుకొనుచున్నాను. (అనగా మూఢులకు, పాపులకు, దుష్టులకు సంస్కారహీనులకు ఈ బోధ చెప్పవద్దని గట్టిగా శ్రీ కృష్ణ దేశికేంద్రులు 'వేడెద నిన్నున్' అన్న పదములో సూచించిరి.

---

**165వ పద్యము : సదమల గురువెవరనినను । యిదిగో బయలిదుగో లేని యీ గురుతెరిగే । టిదగు శరీరము, దీనిని । వదలు మనుచు నీకు జెప్పవచ్చిన వారే ॥**

**టీక :** సదమల = సత్ + అమల = అమల = మలినము లేని

**భావము :** శిష్యా! మంచి గురువు ఎవరు? అనినచో, ఇదిగో పరిపూర్ణము, ఇదిగో లేని గుర్తెరిగేటి శరీరము (లేని యెరుక) అని రెంటిని శృతి, యుక్తి, అనుభవ పూర్వకముగా నీకు చెప్పి, లేని యెరుకను విడువుము అని చెప్పిన వారే అని తెలియుము.

**విశేష భావము :** సద్గురువెవరో ఈ పద్యములో చెప్పిరి. పరిపూర్ణము ఇదిగో అనియు, ఇదిగో లేని యెరుక అని చెప్పిన వారే అని ఈ పద్యములో చెప్పిరి. ఇదిగో అని చెప్పుటచే పరిపూర్ణ పరబ్రహ్మమును, లేని యెరుకను వస్తు నిశ్చయముగా శృతి, యుక్తి, అనుభవములతో నిరూపించి లేని యెరుక లేకుండా చేయవలెను. అంటే లేని యెరుక లేకుండా ఎట్లు పోవునో ఆ రహస్యము ఆ విధానమును విశదముగా చెప్పవలెను. అంతేకాని ఎరుక లేదు అని చెప్పినంత మాత్రము చేత గాని, ఎరుక లేదని ధృడపడినంత మాత్రముచే గాని ఎరుక నశించదు. లేకపోయే విధానము తెలియపర్చినవారే సద్గురువు.

---

**166వ పద్యము : రోగపు చేష్టలు బోయిన । రోగము గల దనిన మాడ్కి రోయక నిన్నున్ । నీ గుర్తెరుగుట మణగిన । నేగలనన నీదు మాట నిశ్చయమటరా ॥**

**టీక :** మాడ్కి = విధముగా, చేష్టలు = లక్షణములు, క్రియలు.

**పద విభాగము :** రోగపు చేష్టలు, బోయిన (తరువాత) రోగము గల దనిన, నిన్నున్ రోయక, మాడ్కి । నీ గుర్తెరుగుట మణిగిన, నే గలవన, నీదు మాట నిశ్చయమటరా।

**భావము :** శిష్యా! రోగము వచ్చి తగ్గిన పిదప, చూడవచ్చిన వానితో తను రోగములో ఉన్నప్పుడు ఎట్టి లక్షణములతో బాధపడెనో చెప్పుచున్నప్పుడు అది విన్న వాడు "రోగము పోయినది కదా, ఆ లక్షణములు అనుభవించుచున్నట్లు చెప్పుచున్నాడు. అని అసహ్యించుకొనని విధముగా, ఎరుక రహితమైనవాడు, కలలో పలవరించినట్లుగా "నేను ఉన్నాను" అని అన్నచో ఆ మాట నిజమగునా? అనగా ఉన్నవాడు కాడు, లేనివాడే అని భావము.

---

**167వ పద్యము : దిచ్చు తనవుశిష్యుని, మది । వొచ్చిన ధన మివ్వడనుచు నూహించిమదిన్ । యిచ్చకము లాడ బోకను । చెచ్చెర ఝాడించు వాన్ని సద్గురుడైతే॥**

**టీక :** దిచ్ఛుతనపు = ధనము ఎక్కువగా ఇచ్చే లక్షణము గల, మదినొచ్చిన = మనస్సు బాధపడినచో, యిచ్చకములు - ప్రియమైన మాటలు, చెచ్చెర = వేగమే, ఝాడించు = కంపమొందజేయు, అనగా చీవాట్లు పెట్టును.

**భావము :** బాగుగా ధనము ఇచ్చే లక్షణము గల శిష్యుడు తప్పు చేసినచో వాని మనస్సు బాధపెట్టినచో ధనము ఇయ్యడని ఊహించి ప్రియమైన మాటలు చెప్పక సద్గురుడైతే శిక్షించును. అనగా సద్గురువు అయినవాడు ధనాశకు లోబడక తప్పు చేసిన శిష్యుని గట్టిగా మందలించును అని భావము.

---

**168వ పద్యము : గురుడు తననెంత మెచ్చిన। వర శిష్యుడు లొంగి తిరుగవలయును, మదిలో। మురిపి భయభక్తి లేకను। తిరిగిన చేటొదవు, నిజము, తెలియుగదోయీ॥**

**టీక :** మెచ్చిన = ఇష్టపడిన, లొంగి = అణకువ, మురిసి = సంతోషించి, చేటు + ఒదవు = కీడువచ్చును.

**భావము :** శిష్యా! గురుమూర్తి తనను ఎంత మెచ్చుకొనిననూ శ్రేష్ఠమైన శిష్యుడైతే, గురుమూర్తి వద్ద అణుకువతోనే వ్యవహరించును. అట్లు గాక గురువు తనను మెచ్చుకొనుచున్నాడని మనస్సులో సంతోషించుచు గురువు వద్ద భయ భక్తులు లేకుండగ ప్రవర్తించినచో అట్టి వానికి కీడు కల్గును ఇది నిజము.

అనగా గురువునకు ఎంత ప్రియమైన శిష్యుడైనను, గురుమూర్తి ఎదుట, అహంకారము లేకుండగ, అణకువతో ప్రవర్తింపవలయును అని భావము.

---

**169వ పద్యము : గురుశిష్యుల లక్షణములు। గురు శిష్యుల బోధ రీతి, గురు గీతార్థం। బెరిగిన నరులకె మెప్పగు। నెరుగని యా మూఢనరుల కిష్టతి యౌనే॥**

**టీక :** మెప్పగు = అంగీకార యోగ్యమగును, మూఢనరులు = అజ్ఞానులు.

**భావము :** గురుశిష్యులు ఇద్దరూ ఏయే లక్షణములతో వ్యవహరించవలెనో, ఆ లక్షణములు, గురు శిష్యుల బోధ విధానము, ఇవన్నియు గురుగీత చదివి అర్థము

తెలిసిన వారికి చక్కగా బాగుండును. గురుగీత తెలియని అజ్ఞానులకు గురుశిష్య లక్షణములు, గురుబోధ అంగీకారము కాదు.

**విశేష భావము :** గురుగీత గురుపుత్రులు తప్పక చదివి అర్థము గ్రహించవలయునని శ్రీ కృష్ణ దేశికేంద్రులు ఈ పద్య రూపముగా గురు భక్తులను ఆదేశించిరి. గురుగీత చక్కగా అధ్యయనము చేసిన వారికి మాత్రమే గురువు అనేది ఎవరు? అనియు, గురుకృప ఎట్లు సాధ్యపడునో అనే విషయములన్నియు తెలియబడగలవు. కనుక సంప్రదాయకులు గురుగీతను తప్పక చదివి, భావమును చక్కగా విమర్శనాపూర్వకముగా గ్రహింతురు గాక !



**170వ పద్యము : స్థిరముగ నిల్చేదైతే । పరుగెత్తక భ్రాంతి నిల్వబడదాభువిలో । నరులు విమర్శించిన, తా । నురుకుట మది యెందుకోస మూహనుకనరా ॥**

**దండాన్వయము :** భ్రాంతి స్థిరముగ నిల్చేదైతే నరులు భువిలో విమర్శించిన పరుగెత్తక, నిల్వబడదా? తాను ఉరుకుటము అది యెందుకోసము? ఊహను కనరా ॥

**టీక :** స్థిరముగ = శాశ్వతముగ, భ్రాంతి = యెరుక, విమర్శించిన = విచారించిన, తా = తాను, ఉరుకుటము= పరుగెత్తుట (లేకపోవుట)

**భావము :** ఎరుక శాశత్వముగా ఉండేది అయితే, ఎరుకను గురుముఖతా విచారించినపుడు పారిపోకుండా ఉండాలి కదా! కాని విచారించినచో లేకపోవుచున్నది. అట్లు విచారించి చూడుము, ఉండునా? ఉండదు ... భావము.



**అవతారిక :** గురుశిష్యుల ప్రవర్తన మనో భావము ఎట్లు ఉండవలయునో ఈ పద్యములో చెప్పుచున్నారు.

**171వ పద్యము : తన సంతతి పై గల దయ । తన శిష్యుని మీద నుంచదగు, గురుడెపుడున్ । తన ధనము మనసు తనువులు । తన గురుని వటంచు దల్పదగు శిష్యవకున్ ।**

**టీక :** సంతతి = సంతానము, తల్పదగు = భావించతగును.

**భావము :** తన సంతానము పై ఎంతటి దయఉండునో, గురుమర్తి తన శిష్యులపై అంతటి దయ, ప్రేమ కలిగియుండవలయును. తన ధనము మనసు, శరీరములు తన గురుమూర్తివే కాని తనవి కావనే భావముతో శిష్యుడు ప్రవర్తించవలయును.

**విశేష భావము :** గురుమూర్తి తన శిష్యులను తన కన్నబిడ్డల వలెను, శిష్యుడు, గురు దంపతులను తన తలిదండ్రులగను భక్తితో భావించుచుండవలెను. తన సమస్తము (తను, మన, ధనములు) గురుమూర్తివే కాని తనవి కావనే అంకిత భావముతో మెలగవలయును.



**172వ పద్యము : శూరత్వ మాత్మ పనికై । వైరాగ్యము గురుని గొల్చు వర్తనకెపుడున్। యీ రీతి వృత్తి గలిగిన । నారీనరు లేగి చొరరె నరకము లోనన్ ॥**

**దండాన్వయం :** ఆత్మ పనికై శూరత్వము, గురుని గొల్చు వర్తనకు ఎపుడున్ వైరాగ్యము, ఈ రీతి వృత్తి కలిగిన నారీ నరులు నరకములోనన్ ఏగి చొరరె ?

**టీక :** శూరత్వము = పట్టుదల, ఆత్మ పనికై = స్వంత పనులకు, వైరాగ్యము = కోరిక లేకుండుట, వర్తనకు = పనులకు, వృత్తి = నడుక, ఏగిచొరరె వెళ్లిదూరరా?

**భావము :** తన స్వంత పనులు చేయుటలో పట్టుదల కలిగి చేసుకొనుటయు, గురుసేవా కార్యక్రమములందు వైరాగ్యము (కోరిక లేకుండుట) ఈ విధమైన ప్రవర్తన కల స్త్రీ పురుషులు (శిష్యులు) నరకములోనికి పోయెదరు. (వారికి జన్మ రహితము కాదని భావము)



**173 పద్యము : మనసున నొకటి దల్చు, వా। క్కున నొకటి బల్కుచుండు, కుటిలుడు, మరితా। తనువున నొక్కటి జేయును । వినుమ, వానికి బోధ దెల్ప విహిత మటోయీ॥**

**టీక :** కుటిలుడు = వంకర బుద్ధి కలవాడు, విహితము = మంచిది, అటోయీ = అగునా?

**భావము :** శిష్యా! వినుము. దుష్ట బుద్ధి కలవాడు మనస్సులో ఒక విధముగా సంకల్పించి, నోటితో ఒక విధముగా మాట్లాడును. మరియు శరీరముతో మరొక విధముగా

పనిచేయును. ఈ విధముగా త్రికరణ శుద్ధి లేనివారికి యీ బోధ తెలియపర్చుట మంచిది అగునా? ఇట్టి వార్కి బోధ తెలియపర్చవద్దని భావము.

---

**174 పద్యము : మనస్సున వాక్కున తనువున । పని యొక్కటి జరుపునట్టి భక్తునకు దయన్ । వినిపించు వినుమని యీ । ఘన బోధను వాని కతుక గలదుడుగకుమీ॥**

**భావము :** శిష్యా! మనో వాక్కాయములతో (త్రికరణశుద్ధిగ) పనిచేసే భక్తునకు, ఈ పరిపూర్ణ బోధను వినుమని దయతో బోధించుము. విడువకు సుమా !

---

**175వ పద్యము : మేలైన బోధ వినుటకు । చాలా విఘ్నములు వచ్చి సమకూడిన, యే॥ లీలన్ విడుసచ్ఛిష్యుడు । వాలాయము బోధ యందె వర్తించుజూమీ ॥**

**టీక :** మేలైన బోధ = గొప్పదైన బోధ (పరిపూర్ణ బోధ) యేలీలన్ = ఏదో విధముగా, వాలాయము = తప్పనిసరిగా (నిర్బంధముగా)

**భావము :** శిష్యా! మేలైన బోధ వినుటకు (పరిపూర్ణ బోధ) వినుటకు సహజముగా అనేక విఘ్నములు ఏర్పడును. సచ్ఛిష్యుడు ఆ విఘ్నములను ఏదో విధముగా నివృత్తి జేసుకొని, తప్పనిసరిగా ఈ పరిపూర్ణ బోధ యందె వర్తించును (ఉండును)

**విశేష భావము :** "శ్రేయాంసి బహు విఘ్నాని" అని శాస్త్ర వచనము. మంచి పనికి అన్నీ విఘ్నములే. కనుక అన్ని పనులలో చాలా మంచి పని ఈ బోధ నేర్చి జన్మ రహిత పర్చుకొనుట. కనుక ఈ బోధ వినుటకు చాలా విఘ్నములు కలుగుట సహజము. అట్టి విఘ్నములు 1) ఆధ్యాత్మిక తాపము, 2) అధి భౌతిక తాపము, 3) అధి దైవిక తాపము అని మూడు రకములు. కనుక వేదాంత శాస్త్రాధ్యయనము చేయునప్పుడు గురుశిష్యులు ఇద్దరు కూడా సమస్త విఘ్న నివారణకై (ఆధ్యాత్మిక అధి దైవిక, అధి భౌతిక తాపనివారణకై) శాంతి పాఠమును అధ్యయనమునకు ముందు చివరన కూడా చదువుట (సహనావతు మొదలగునవి) సత్సంప్రదాయము.

---

**176వ పద్యము : గురుడు తన యాజ్ఞ లోపల । చరియింపగ గోరునట్టి శిష్యునకెపుడున్॥ దురితంబు వృద్ధియైతా । నరకమునన్ గూలకున్నె నరనుత చరితా ॥**

**టీక :** తనయాజ్ఞలోపల = తనుచెప్పినట్లుగా ఉండుట, చరియింప = నడుచుకొనుట, దురితంబు = పాపము.

**భావము :** గురుమూర్తి తాను చెప్పినట్లుగా నడుచుకొనవలెనని భావించే శిష్యునకు పాపము వృద్ధి జెంది చివరకు మహానరకమున కూలుట తథ్యము.

---

**177వ పద్యము : గురుకనుసౌజ్ఞను గనుగొని । పరిచర్య యొనర్చుచుండు భక్తుడు భక్తిన్ । పరిపూర్ణ బోధ చెందును । పరమోదార ప్రచండ బంగరు కొండా ॥**

**టీక :** పరిచర్య = సేవ, బోధ జెందును = బోధ స్థితి కుదురును, ప్రచండ = అందుకోలేని, బంగారుకొండా = ముద్దుగ సంబోధన.

**భావము :** గురుకనుసాంజ్ఞను గనుగొని, భక్తిన్ పరిచర్య యొనర్చుచుండు భక్తుడు పరిపూర్ణ బోధ జెందును ॥

---

**178వ పద్యము : ప్రాకటముగ నిద్దుర యిక । యేకథలను వినిన రాదు, యీ బోధందున్ । రాకుండ, దదేమి చిత్ర మొ । ప్రాకృత నర మూకకెల్ల పావన చరితా॥**

**టీక :** ప్రాకటముగ = ప్రసిద్ధముగ, నిద్దుర = నిద్ర, ప్రాకృత = పూర్వజన్మలో చేసిన దుష్టకర్మలచే చుట్టబడిన, నరమూకకెల్ల = నరసమూహమున కందరకు, పావన చరితా = పవిత్రమైన చరిత్ర గలవాడా !

**భావము :** పవిత్రమైన చరిత్ర గల శిష్యా! పూర్వ దుష్ట కర్మలచే చుట్టబడిన నర సమూహమున కందరకు యీ పరిపూర్ణ బోద వినుచున్నంత సేపు ప్రసిద్ధముగ నిద్రవచ్చును. వారికి ఇతర ఏ కథలు విన్ననూ నిద్రరాదు, అదేమి చిత్రమో కదా!

---

**179వ పద్యము : కొత్త దంపతుల కూటమి । నెత్తరగువ లేమలంత నిదురలు బోకన్। మొత్తములై కను నటువలె । బత్తల దిరిగేటి చిన్ని బాలల కనునే ॥**

**టీక :** కూటమి = సంగమము, ఎత్తెరగున = ఏ విధముగా, లేమలంత = స్త్రీలందరు, మొత్తములై = సమూహములై, తరుచగ, ఎక్కువగా, కనున్ = చూచెదరు. బత్తలదిరిగేటి = బట్టలు లేకుండగ సంచరించేటి;

**భావము :** కొత్త దంపతుల సంగమము, భర్తలతో కాపురము చేసుకొనే స్త్రీలు మాత్రమే నిద్రమాని చాటుగా చూడాలనే కోరికతో చూచెదరు. ఆ విధముగా చిన్న పిల్లలకు (బట్టలు లేకుండా తిరిగే చిన్న పిల్లలకు) ఆ కోరిక ఉండదు కదా. బత్తలదిరిగేటి అనగా బట్టలు లేకుండగ సంచరించేటి అని అర్థము. ఇది తెలంగాణా ప్రాంతీయ భాష.

**విశేష భావము :** పై పద్యము యొక్క భావము ఏమనగా! సాధన చతుష్టయ సంపత్తి కల వారికి మాత్రమే ఈ బోధ వినవలెనను అత్యంత కోరిక గల్గి గురుసేవచే ఈ బోధను పొందగలరు. వారికి వేదాంత తత్త్వము కొంత వరకు అవగాహన చేసుకొన్న వారు కనుక, వారికి బ్రహ్మమును గూర్చి తెలుసుకొని పునరావృత్తి లేకుండా చేసుకోవాలని ప్రయత్నము ఉండును. ఆ మాత్రమైన వేదాంత పరిజ్ఞానము లేని వారికి అనగా సామాన్య ప్రజలకు ఇంతటి బోధను గ్రహించవలెనను విషయమే తెలియదు కదా! అని చెప్పుటకు యుక్తిగా (ఉదాహరణముగా) ఈ పద్యమును చెప్పినట్లు గ్రహించవలెను.

---

**180వ పద్యము : మనసరయక ప్రజలను, విను । మని చదువకు బోధ, బాధయని యిండ్లలో । పనులన్ని యాది జేసుక । చని యెద రాసమయ మంద సహ్యమున సుతా॥**

**టీక :** మనసరయక = మనస్సు తెలిసికోకుండగ, యాది జేసుక = జ్ఞాపకము చేసుకొని

**భావము :** కుమారా! ప్రజల యొక్క మనస్సు ఎట్టిదో తెలిసికోకుండగ యీ బోధ వారి వద్ద వినిపించ ప్రయత్నించకుము. అట్లు చదివినచో వారికి యీ బోధ, బాధయని అసహ్యమున (ఇష్టపడక) యిండ్లలో పనులు ఉన్నవని చెప్పి వెళ్లిపోయెదరు.

---

**181వ పద్యము : వీనుల వినడీ బోధను । నేనే బ్రహ్మవని నిక్క నీల్గెటి వాడున్। మానికము గాన వచ్చిన । దానిని రాయనుచు దలచు తార్కికుని గతిన్ ॥**

**దండాన్వయము :** మానికము గాన వచ్చిన, దానిని రాయనుచు దలచు తార్కికుని గతిన్, నేనే బ్రహ్మనని నిక్కి నీల్గెటి వాడున్ ఈ బోధను వీనుల వినడు ॥

**టీక :** నిక్కి = గర్వించి, నీల్గెటి వాడున్ = చచ్చేవాడు, మానికము = మాణిక్యము; తార్కికుని = శంకించువాని, గతిన్ = విధముగా.

**భావము :** శిష్యా! నిత్యము ప్రతి విషయమును అనుమానించే వాడు, దారిలో మాణిక్యము కనపడినచో అది రాయి అయి ఉండవచ్చునని ఊహించి విడిచిపెట్టువాని వలె, "నేనే బ్రహ్మ" అనుచు గర్వించి తిరిగేవాడు, ఈ పరిపూర్ణ బోధ సామాన్యమైనదిగా భావించి చెవులతోనైనా వినడు.

**విశేష భావము :** "ఈర్ష్యాళువు, జుగుప్సావంతుడు, నిస్సంతోషి, క్రోధనుడు, నిత్యశంకితుడు, పరభాగ్యోపజీవి యను ఈ ఆర్గురును దుఃఖబాగుల"ని నీతి చంద్రికలో చెప్పబడినది. ఈ పద్యములో తార్కికునిగతిన్" అన్న పదమునకు తర్క శాస్త్రము చదివినవాని విధముగా అని అర్థము చెప్పరాదు. ప్రతివిషయమును అనుమానము చేయువాడు అని అర్థ సమన్వయము. అనగా "నిత్య శంకితుడు" అని అర్థము. వాడు దారిలో మాణిక్యము కనిపించినచో, అట్టి విలువ గలది దారిలో ఎందుకు పడియుండును? ఇది రంగు రాయి అయి ఉంటుంది అని విడచిపెట్టిపోవును. అట్లే "నేనే బ్రహ్మ" అనే గర్వముచే తాను తెలియవలసినది ఏమీ లేదని భావించేవాడు తనకు సర్వ వేదాంత సారము తెలిసినట్లుగా భావించి, ఈ పరిపూర్ణ బోద యొక్క గొప్పతనము తెలియక కనీసము చెవులతో వినుటకైన అంగీకరించడు.

---

**182వ పద్యము : ఒకరు విని మెచ్చవలెవని । సకల పురాణములు వేద శాస్త్ర శ్రౌత। ప్రకరమును నేర్చు విద్వ । న్నికరంబీ బోధ మెచ్చ నేర్చునే సుమతీ ! ॥**

**టీక :** శాస్త్ర = షట్శాస్త్రములు, శ్రౌత ప్రకరము = శృతి సమ్మతిగా ఆచరించేవారు (యజ్ఞములు చేయువారు) విద్వన్నికరము = పండిత సమూహము.

**భావము :** సమస్తములయిన శాస్త్రములు, వేదములు, పురాణములు యజ్ఞములు మొదలగు క్రమ విధులు నేర్చుకొనే విద్వాంసులు ఈ బోధను ఇష్టపడక తెలిసికొనరు.

ఎందుచేతననగా ఆ పండితులు శాస్త్రాదులను అధ్యయనము చేసి వారి పాండిత్యమును చూచి అందరు గౌరవించాలనే కోరికతో (కీర్తి కాముకులై) అవినేర్చుకొందరు. అంతేకాని తాము జన్మరాహిత్యమును గూర్చి ఆలోచనయే చేయరు. కనుక అట్టి విద్వత్ సమూహము ఈ బోధను అంగీకరించదు.

**విశేష భావము :** శాస్త్రములు - 6, 1) తర్కము, 2) వ్యాకరణము, 3) ధర్మశాస్త్రము 4) మీమాంస, 5) వైద్యము, 6) జ్యోతిషము.

వేదములు 4 - 1) ఋగ్వేదము, 2) యజుర్వేదము, 3) సామవేదము, 4) అధర్వణ వేదము - పురాణములు - 18 1) బ్రహ్మము, 2) పద్మము, 3) వైష్ణవము, 4) శైవము, 5) భాగవతము, 6) నారదీయము, 7) మార్కండేయము, 8) ఆగ్నేయము, 9) భవిష్యత్తు 10) బ్రహ్మకైవర్తము, 11) లైంగము (లింగ) 12) వారాహము, 13) మాత్స్యము, 18) భారతము.

శ్లో॥ మద్వయం భద్వయంచైవ । బ్రత్రయం వచతుష్టయం
అనాపలింగ కూస్కాని । గారుడంచ పృధక్ ॥

శ్రౌత ప్రకరము : 1) గార్హ పత్యాగి 2) ఆహవనీయాగ్ని 3) త్రేతాగ్ని అని త్రేతాగ్నులతో కూడి కర్మకాండను ఆచరించువారు.

ఇట్టి విద్యలన్నియు నేర్చి పండితులై సమాజములో గౌరవమును పొందుటకే పనికి వచ్చును కాని, ఆధ్యాత్మిక విషయమైన జన్మరాహిత్యమును పొందుటకు ఉపయోగించవు.

---

**అవతారిక :** పైన చెప్పిన విద్వత్తు గల వార్కి ఈ బోధ రుచించదు. కనుక సాధారణముగా అందరికీ చెప్పేది కాదని, కేవల సంస్కార వశమున జన్మించిన వారికి మాత్రమే ఈ బోధ చెప్పదగునని ఈ పద్యములో చెప్పుచున్నారు.

**183వ పద్యము : సాధారణముగ దెల్పకు । మీ ధర మానవుల బిల్చి, యీ బోదను, బల్ । మేధా నిధి యాచించిన బోధించుము. వద్దు లోభ బుద్ధి సుబుద్ధీ ॥**

**దండాన్వయము :** సుబుద్ధీ ! ఈ ధర మానవుల బిల్చి యీ బోధను సాధరణముగా తెల్పకుము. బల్ మేధానిధి యాచించిన లోభ బుద్ధి వద్దు, బోధించుము.

**టీక :** సుబుద్ధీ = మంచి బుద్ధి కల వాడా ! బల్ మేధానిధి = గొప్పబుద్ధిమంతుడు, యాచించిన = కోరినచో, లోభ బుద్ధి = పిసినారి బుద్ధి.

**భావము :** ఓ సుబుద్ధీ ! యీ బోధను అందరిని పిల్చి యిది చెప్పుకోండి చాలామంచిది" అని అందరిని పిల్చి బోధించవద్దు. యీ బోధ పూర్వ జన్మ సంస్కారులకు గాని అబ్బదు. అట్టి సంస్కారులు, సాధన చతుష్టయ సంపత్తి పరులయిన వారు, వారంతట వారు వచ్చి యీ బోధను చెప్పమని ఆశ్రయించినచో అట్టి వారి వద్ద లోభత్వమును విడచి చక్కగా వారికి బోధించుము.

---

**184వ పద్యము : యే బోధ, శిష్యులకు గల । యీ బాధల నణిచి, వేసు నదె సద్బోధా। ఆ బోధ యేది యనివను । యీ బోధే సుమ్మి, దీన్ని యిక విడువకు మీ॥**

**పద విభాగము :** యే బోధ, శిష్యులకు గల యీ బాదల నణచి వేసును, అదె సద్బోధా॥

**భావము :** శిష్యా! యే బోధ, శిష్యులకు గల ఆ బాధలను అణచివేసునో అనగా జనన మరణములు లేకుండగ జేసునో అదే మంచిబోధ. ఆ బోధ యేదనగా యీ బోధే. (యీ పరిపూర్ణ బోధే) సుమా. కనుక యీ బోధను విడువకుము.

---

**185వ పద్యము : హెచ్చైన బోధ తెల్పే । సచ్చరితుల కియ్యలేరు జనులు ధనంబుల్। గచ్చుల గొట్టే దిచ్చుల । కిచ్చిన క్రియ, నిట్టి నృతతి నేమన నోయీ ॥**

**టీక :** గచ్చులు కొట్టే = యోగ్యుని వలె నటించే, దిచ్చులు = వ్యభిచారులు (అతిగా పొగిడే వారు) నృతతి = నరసమూహము.

**దండాన్వయము :** జనులు ధనంబుల్ గచ్చులు కొట్టే దిచ్చుల కిచ్చిన క్రియన్, హెచ్చైన బోద దెల్పే సచ్చరితులకు ఇయ్యలేరు.

**భావము :** శిష్యా! పైకి యోగ్యుని వలె కనపడుచు, పొగడ్తలతో ధనము సంపాదించే వారికి, ధనము ఇచ్చినట్లు, గొప్పదైన యీ బోధ తెలియపరిచే యోగ్యులకు ధనము ఇయ్యలేరు. అట్టి నర సమూహమును ఏమనగలము ?

---

**186వ పద్యము : నీ మదికీ నిజబోధన్। ప్రేమతో నాటించదలచి పెక్కు విధములన్। నే మొదలు బెట్టి చెప్పితి । దే మాత్రము రాత్రి బగలు యేమారకుమీ ॥**

**దండాన్వయము :** ఈ నిజ బోధన్ నీ మదికి ప్రేమతో నాటించ దలచి, నే మొదలుపెట్టి పెక్కు విధములన్ చెప్పితి. ఇది ఏ మాత్రము రాత్రి పగలు యేమారకుమీ॥

**టీక :** నిజ బోధ = శాశ్వతమైన బోధ = శాశ్వత బ్రహ్మమును గూర్చి చెప్పిన బోధ (పరిపూర్ణ బోధ) మదికి = బుద్ధికి, నాటించదలచి = హత్తుకునేలా చేయదలచి, పెక్కువిధములన్ = అనేక విధములుగా, యేమారకు = మరచిపోకుము.

**భావము :** శిష్యా! నీ బుద్ధికి యీ పరిపూర్ణ బోధ హత్తించదలచి, నేను ప్రేమతో యీ బోధ శృతి యుక్తి అనుభవములతో అనేక విధములుగా చెప్పితిని. యీ బోధను రాత్రి పగలు అనక యెంత మాత్రము మరువకు సుమీ. అనగా ఎల్లవేళల పఠించుచు మననము చేయుచుండుము అని భావము.

---

**187వ పద్యము : కమలంబులున్న కొలనుకు । భ్రమరము లేతెంచునట్లు బాగుగ బోధన్ । తమ మది గోరి గురుని పద । కమలములను గొల్వ సుజన గణమేతెంచున్॥**

**టీక :** కమలంబులు = పద్మములు, కొలను = సరస్సు, భ్రమరములు = తుమ్మెదలు

**భావము :** పద్మములు ఉన్న సరోవరమునకు తుమ్మెదలు దూరము నుండి వచ్చినట్లుగా, బోధను చక్కగా తెలుసుకొనే నిమిత్తమై సద్గురు పాద పద్మములను సేవించుకొరకు సజ్జనులు దూరము నుండి అయినను సద్గురుమూర్తి వద్దకు వచ్చెదరు.

---

**188వ పద్యము : సురవర్యు డహల్య కోసము । మరులొందిన రీతినెపుడు మరుగుదు రజ్ఞుల్ । పొరుగూరి సాధులకు తమ । పురమున గల సాధులందు బుద్ధి నిలువకన్॥**

**(మొదటి పాదము 13 మాత్రలు కలవు - సురవర్యు డహల్య కొరకు అంటే బాగుండును)**

**భావము :** ఇంద్రుడు గౌతముని భార్య అయిన అహల్య కొరకు మోహము చెందినట్లుగా, అజ్ఞానులు తమ గ్రామము నందే ఉన్న సత్ గురువులందు బుద్ధి నిలువక పొరుగూరి సాధు (సద్గురువులపై) వులపై మోహము చెందుదురు.

---

**189వ పద్యము : నే నీకు జెప్పబూనిన । యీ నిజ బోధ మనసు కిమిడిన వెనకన్।**
**నీ నా పని దీరుమరా । వోనా ముద్దుల కుమార వోనగధీరా ॥**

**టీక :** ఓనగధీరా = కదలిక లేని (పర్వతము వలె) ధీరత్వము కలవాడా ! నిజ బోధ = పరిపూర్ణ బోద.

**భావము :** ఓ చలనము లేని ధీరుడా ! నా ముద్దుల కుమారా! శిష్యా! నేను నీకు ప్రయత్నించి చెప్పుచున్న యీ పరిపూర్ణ బోధ నీ మనస్సుకు హత్తుకొనిన తరువాత, నీ - నా పని తీరును.

**విశేష భావము :** నీ - నా పనిదీరును. నీవు నన్నాశ్రయించిన పని, నేనునీకు బోధించవలసిన పని తీరును అని భావము. శిష్యుడు గురుమూర్తిని ఆశ్రయించినది, బోధ చేసి, జన్మ రహిత మార్గము తెలియపర్చమని, అందుచే గురుమూర్తి ఎరుక-పరిపూర్ణముల గురించి బోధించుచు శిష్యునకు ధృడపర్చుచున్నారు. బోధ శిష్యునకు ధృడమై ఆరూఢత్వము సిద్ధించే వరకు బోధించవలసియున్నది. అంత వరకు గురుమూర్తికి పనితీరదు. అందుచేతనే ఈ పద్యములో "మనసు కిమిడిన వెనుకన్ నీ - నా పని దీరును అన్నారు.

2) ఈ బోధ ఆరూఢమైతే నీ - అవిద్యయు, నా - ప్రతిబింబ చైతన్యములు రెండును లేకపోవును. దీనికే నీ - నా పనితీరును అన్నారు.

**అవతారిక :** గురునింద వినరాదు, గురునింద చేయరాదు, అన్న సూక్తికి **190, 191**వ పద్యములు చెప్పుచున్నారు.

**190వ పద్యము : త్ర్యక్షుని నిందించిన యా । దక్షుని గని ప్రాణమిడిన త్ర్యక్షసతి వలెన్ । యీక్షితి తవ దేశికుని, ను । పేక్షించిన జనుల దాను పేక్షించదగున్ ॥**

**టీక :** త్రక్షుని = మూడుకన్నులు గల వానిని (ఈశ్వరుని) ప్రాణమిడిన = ప్రాణము వదలిన, త్ర్యక్ష సతివలెన్ = ఈశ్వరుని భార్య సతీదేవి వలె, క్షితిన్ = భూమియందు, ఉపేక్షించిన = అశ్రద్ధ చేసిన, నిర్లక్ష్యము చేసిన, ఉపేక్షించదగున్ = విడువదగును.

**భావము :** ఈశ్వరుని నిందించిన ఆ దక్షుని చూచి, సతీ దేవి తన ప్రాణనాధుని

నింద విన్నందుకు గాను తన ప్రాణములను విడచినట్లుగా, ఈ భూమి పై తన గురుమూర్తిని నిర్లక్ష్యము చేసిన జనులను ఆ శిష్యుడు తప్పక విడువవలెను.

**191వ పద్యము : గురుని కపరాధి యగు, నా । నర నాథుని ద్రుపదునొంచు, నరుని విధమునన్ । ధర సచ్ఛిష్య వరుడు తన । గురు శత్రుని చేతనైతె క్రొవ్వణచ దగున్।**

**టీక :** గురునికి = (ఈ పద్యములో) ద్రోణాచార్యునికి, అపరాధియగున్, శత్రువైనట్టి (తప్పుచేసినట్టి) ఆనరనాధుని = ఆరాజు అయిన, ద్రుపదున్ ఒంచు = ద్రుపదుని ఓడించు, నరుని = అర్జునుని, క్రొవ్వణచదగున్ = గర్వము అణచదగును.

**భావము :** శిష్యా! ద్రోణాచార్యునికి అపరాధము చేసిన ద్రుపద మహారాజుని, అర్జునుడు ఓడించి గురువు గారి పదముల వద్ద పడవేసినట్లుగ, సచ్ఛిష్యుడైనవాడు తన గురుమూర్తికి శత్రువైన వానిని తనకు సాధ్యమైతే దండించతగును.

**192వ పద్యము : కాకులవలె కూకలిడే। లోకుల కీకలకు బెదరి లోగుంద కటన్ । మూకత్వమూను చాలును । లేకుడవై యుంటి వినివేవి నా మాటా ॥**

**టీక :** కూకలిడే = చీకాకు పరిచే, కీకలకు = చెడుమాటలకు, మూకత్వము=మౌనము.

**భావము :** శిష్యా! అల్పులు నిన్ను నీ బోధను గురించి కాకుల వలె చీకాకుగా మాట్లాడే మాటలకు మనసులో బాధపడక, తెలివైన వాడివైతే నా మాట విని, ఆ సందర్భములో మౌనము వహించుటయే మేలు. (అనగా అట్టి వారితో ప్రతి వాదన చేయవద్దని భావము)

**193వ పద్యము : పెద్దలనెవరిని జూచిన । ముద్దుగ మాట్లాడి వారు ముదమున జెప్పే। సుద్దుల కడ్డము చెప్పక । ఒద్దికతో మ్రొక్కి వినుము వో పుణ్యాతమా ॥**

**టీక :** ముద్దుగ మాట్లాడి = ప్రియముగ మాట్లాడి, సుద్దులకు = మంచి మాటలకు, అడ్డము చెప్పక = వ్యతిరేకించక, వొద్దికతో = వినయముతో మ్రొక్కి = నమస్కరించి.

**భావము :** ... ్యు తముడవైన ఓ శిష్యా! పెద్దలను ఎవరిని కలసినప్పటికి వారికి వినయముతో నమస్కరించి, వారితో ప్రియముగ మాట్లాడుము. వారు సంతోషముతో చెప్పే మంచి మాటలకు విపరీతముగా చెప్పక చక్కగా వినుము. (పెద్దలైన వారితో వాదించవద్దని భావము)

**194వ పద్యము : తన హిత వెరుగని మనుజుడు । వినడాప్తజనోక్తి, దుష్ట, వృత్తి గల సుయో । ధనుడు, దశాననుడు, విహిత । జన వాక్యము వినక గాదె సమసిరివురున్॥**

**టీక :** తన హితవు = తన మంచిని, ఆప్తజనోక్తి = తనక్షేమము కోరే వారి, మాటను, సుయోధనుడు= దుర్యోధనుడు, దశాననుడు = రావణుడు, విహిత జన వాక్యము ఇష్టులైన వారి యొక్క మాటలను, సమసిరి = చనిపోయిరి.

**భావము :** తన మంచి తెలుసుకోలేని దౌర్భాగ్యుడు, తన క్షేమము కోరే జనుల యొక్క మంచి మాటలను వినడు. దుష్ట స్వభావులైన దుర్యోధనుడు రావణుడు వీరిద్దరు, వారి ఆప్తుల వాక్యములు వినక పోవుట చేతనే కదా వారిరువురు యుద్ధములో చనిపోయిరి ।

**విశేష భావము :** "పోగాలము దాపురించినవాడు, మిత్రవాక్యమును, అరుంధతిని, దీప నిర్వాణ గంధమును, వినడు, కనడు, మూర్కొనడు (నీతి చంద్రిక). చావు కాలము సంభవించినవాడు మిత్రవాక్యమును వినడు, అరుందతిని చూడలేడు, దీపము ఆరిపోయినప్పుడు వచ్చే వాసనను గ్రహించలేడు, అని నీతి చంద్రికలోని సూక్తి. కనుక పెద్దల వాక్యమును, ఆప్తుల వాక్యమును పెడచెవిని పెట్టరాదని భావము.

**195వ పద్యము : ఎన్నో గ్రంథజలధులను । తిన్నగ మథియించి చూస్తే తేలిన సారం। బున్న బయలుగని, మృషయగు । నిన్నున్ నీ మేను మృషని నిలువకు మనుచున్॥**

**దండాన్వయము :** ఎన్నో గ్రంథ జలధులను తిన్నగ మదియించి చూస్తే, ఉన్న బలయుగని, మృషయగు నిన్నున్ నీ మేను మృషని, నిలువకు మనుచు సారంబు తేలెను.

**టీక :** గ్రంథ జలధులు = సముద్రము వంటి (పెద్ద పెద్ద) గ్రంథములు, తిన్నగ మథియించి చూస్తె, చక్కగా తరచి చూచినచో, నిలువకు మనుచున్ = లేకుండా పొమ్మ్మ అనుచు.

**భావము :** పెద్ద పెద్ద గ్రంథ రాజములను ఎన్నిటినో తరచి చూచినచో, శాశ్వతమైన పరిపూర్ణమును చూచి, లేని నిన్ను నీ శరీరము లేవని తెలసి లేకుండా పొమ్మ్మ అనుచు (ఈ సారము) తేలెను. అనగా సమస్త ఆర్ష గ్రంథముల సారము ఇదే అని శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు తెలియపర్చుచున్నారు.

**విశేష భావము :** సమస్త గ్రంథములను తరచి చూచినచో తేలిన సారము ఏమనగా - పరిపూర్ణమును చూచి మృషయైన నీవు లేకుండా పొమ్మని చెపిప్పట్లుగా - శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు, ఈ పద్యములో నిర్ధారణగా చెప్పుచున్నారు. అయితే ఈ నాటి మన బోధ ప్రచారకులు పరిపూర్ణ భావము ఏ మహఋషికి తెలియదు, ఏ ఆర్ష గ్రంథములో గాని, వేదములలో గాని లేదు అని చెప్పుచున్నారు. మరి మన కృష్ణ ప్రభువు చెప్పిన విషయమునైగా బాగా గుర్తించి పరిపూర్ణ బోధ గురించి ప్రచారము చేయవలెను.

2) "మృషయగు నిన్నున్ నీ మేను మృషని" - మేను అనగా అంతఃకరణ లేక అవిద్య అని అర్థము - ఇదే ఎరిగే శరీరము కనుక. ఇది కేవలు జడము లేనిది. కనుక దీనిని మృష అన్నారు. ఇందలి ప్రతిబింబ చైతన్యము - "నిన్నున్" నిన్ను అనగా "నేను" - ఇది ప్రతిబింబము కనుక స్వతశ్శిద్ధమైన ఉనికి లేనిది. కనుక ఇది కూడా లేనిదే కనుక మృష అన్నారు. కనుక గురుముఖత విచారణచే (శాస్త్రదృశ్యము, గురువాక్యము, అనుభవములచే) అంతఃకరణ అయిన మేను, ప్రతిబింబమైన నేను ఈ రెండునూ లేనివే అని తెలసి వీటిని విడువమని శాస్త్ర సందేశముగా గుర్తించనగును.

---

**అవతారిక :** సమస్త శాస్త్రాధ్యయనము చేసే ఈ జీవాత్మ వేదాంత శాస్త్రమును ఇష్టపడదు. ఒకవేళ పూర్వ పుణ్యసంస్కారముచే వేదాంత వాస్త్ర విచారణ చేసినచో తిరిగి జన్మకే రాడు అని చమత్కరించుచున్నారు.

**196వ పద్యము : కనక సుమ గంధ వాసన । తన, కొనగా దలచి షట్పదము గొన దటులన్ । వినదు లేనహ మె బహ్మం । చని పల్కే నృతతి నిల్వనని యీ బోధన్॥**

**దండాన్వయము :** అటులన్ లేనహామె బ్రహ్మంచని పల్కేనృతతి యీ బోధన్ నిల్వనని వినదు ।

**టీక :** కనక సుమ గంధ వాసన = సంపెంగ పువు యొక్క వాసనను, వాసన జూచినచో, తన కొనగా దలచి = తన చివరి సమయముగా భావించి, (చనిపోవునని తెలసి) షట్పదము = తుమ్మెద, కొనదు = గ్రహించదు.

**భావము :** సంపెంగ పువ్వు మీద వాలినచో తుమ్మెద చనిపోవును. అన్ని పువ్వుల మీద వాలే తుమ్మెద (బంగారు పుష్పమని పేరుబడిన) సంపగి పువ్వు మీద వ్రాలదు. ఎందుచేతననగా అట్లు వాలిన తుమ్మెద తిరిగి బయటికి రాదు, చనిపోవును. అటులనే నేను బ్రహ్మనని బోధించే నర సమూహము, యీ బోధ యందు "నేను" లేకుండా పోవుననే భయముచే యీ బోధను వినరు.

**విశేష భావము :** అన్ని పూలయందలి మకరందమును గ్రోలే తుమ్మెద, సంపెంగ పువ్వు మీద వ్రాలదు. ఒకవేళ పొరపాటున వ్రాలినచో చనిపోవును. (తిరిగి ఏ పువ్వు మీద వాలనవసరము లేదు) అట్లే సమస్త శాస్త్ర అధ్యయనము చేయాలని కుతూహలపడే (అధ్యయనము చేసే) ఈ జీవాత్మ, వేదాంత శాస్త్ర అధ్యయమునకు అంతగా సమ్మతించదు. ఒకవేళ వాని పూర్వ జన్మ సంస్కారముచే గురు ముఖముగా అధ్యయనము చేసినచో, హృదయగ్రంధి భేదము జరిగి తిరిగి ఏ శాస్త్రాధ్యాయనము చేయలేదు.



**197వ పద్యము : హద్దు సుమీ గురు వాజ్ఞన । ముద్దు సుమీ గురుని సేవ ముదమున జేయున్ । పద్దు సుమీ యిట్లుండుట ।వద్దుసుమీ గురుని తోటి వాదించుట మున్ ॥**

**టీక :** హద్దు = ఆజ్ఞ, ఆజ్ఞ = కట్టడి, ఆనతి, ముద్దు = ఆదరించతగినది, పద్దు=ప్రతిజ్ఞ.

**భావము :** గురువు ఆజ్ఞ అనగా అది కట్టడిగా గుర్తించుము, గురు సేవ సంతోషముతో చేయుట ఆదరించతగినది. యీ విధముగా చేయుటకు ప్రతిజ్ఞ చేయుము. గురుమూర్తితో ఎన్నడును వాదించకుసుమా !

**విశేష భావము :** గుర్వాజ్ఞనను ధిక్కరించరానిది, మీర రానిది, అని చెప్పుటకే "హద్దుసుమీ" అన్నారు. సన్యాసుల తోటి, వైద్యుల తోటి, న్యాయాధిపతుల తోటి, గురువుతోటి, వారు చెప్పేది ధర్మ విరుద్ధమైనను వారితో వాదించవద్దని శాస్త్ర వాక్యము. అందుకే గురునితో వాదించుట వద్దు సుమీ" అన్నారు.

---

**అవతారిక :** జింహ్వా చపలత గల తిండిపోతులకు ఈ బోధ పనికిరాదు, చెప్పవద్దని ఈ పద్యములో చెప్పుచున్నారు.

**198వ పద్యము : జంభాల పోతు గోరునె । సంభవ నాశముల బాపు చక్కని బోధన్।**
**కుంభిని షండున కుండునె । రంభా సంభోగ వాంఛ రంభను గనినన్ ॥**

**టీక :** జంభాలపోతు = తిండిపోతు, సంభవనాశములు = పుట్టుకచావు, కుంభిని = భూమిపై, షండునకు = నపుంసకునకు.

**భావము :** శిష్యా! తిండిపోతు చావు పుట్టుకలు లేకుండా చేసే యీ చక్కని పరిపూర్ణ బోధను కోరడు. ఎట్లనగా - రంభను చూచిననూ ఆమెను సంభోగించే కోరిక నపుంసకునకు కలుగదు కదా !

**విశేష భావము :** జ్ఞానము తెలుసుకొన గోరువారు శరీరమును పెంచరాదు. క్రొవ్వు మాంసము ఎక్కువగా పెరుగరాదు. అట్టి వారికి రజస్తమో గుణముల అధికముగ నుండును. కనుక జ్ఞానమును సంపాదించవలెననే కోరిక గల వారు సత్వగుణ ప్రధానమైన సామాన్య ఆహారమును మితముగా తీసుకొనుచు జంహ్వా చాపల్యమును పూర్తిగా విడువవలెను. అని ఈ పద్యభావము "స్థూలము పెరిగితే సూక్ష్మము (బుద్ధి) తరుగుచతుందనే నానుడి కలదు. (పెద్దల వాక్యము).

---

**199వ పద్యము : పతి భక్తి గల యువతి వలె । సతతము గురు భక్తి గలిగి సచ్ఛిష్యుడిలన్ । స్థితి గుదుర సేవ జేయును ॥ ప్రతి రహితాద్భుత చరిత్ర పరమ పవిత్రా ॥**

**టీక :** స్థితిగుదుర = ఎరుక రహిత స్థితి గుదురుటకై, సేవజేయును = గురుసేవ జేయును, ప్రతి రహిత = ప్రతిబింబ రహితమైన, అద్భుత చరిత్ర = గొప్ప చరిత్రకల.

**భావము :** శిష్యా! ప్రతిబింబ రహితము చేసుకొనే గొప్ప చరిత్ర కలవాడా! పరమ పవిత్రమైన వాడా! పతిభక్తి గల స్త్రీ, యెల్లప్పుడు పతి సేవ చేసుకొనే టట్లుగానే, సచ్ఛిష్యుడు గురుభక్తి కలిగి, ఎరుక రహిత స్థితి కుదురేందుకై చక్కగా గురుసేవ చేయుచుండును.

**విశేష భావము :** ఎరుక రహిత పర్చుకొనవలెననే కోరిక గల సాధకుడు అత్యంత గురుభక్తి కలిగినవాడై గురుసేవ తప్పక చేసుకొనుచుండును. అనగా గురుసేవ చేతనే ఎరుక రహిత స్థితి కుదురునని భావము. గురు సేవచే గురుకృప కలిగి ఎరుక లేకపోవును.

"ముక్తిమూలం గురోఃకృప" అని శాస్త్ర వాక్యము.

"ప్రతి రహితాద్భుత చరిత్ర" అంతఃకరణమే కారణ శరీరము. కర్మము అన్నారు. ఇట్టి అంతఃకరణము నశించుటకై గురు సేవ చేయుటచే గురు కృపను పొందుట ద్వారా సమస్త కర్మ స్వరూపమైన అంతఃకరణము నశించును. అంతఃకరణము లేకపోయినచో అందలి ప్రతిబింబమున్ను లేకపోవును కదా! ఇదే ఎరుక రహితము. బోధ స్థితి, అందుకే "జ్ఞానాగ్ని దగ్ధ సర్వకార్మాణి" అన్నారు. ఇట్టి అంతకరణ, ప్రతిబింబములు రహితపర్చుకొనే శిష్యుని "ప్రతి రహితాద్భుత చరిత్ర" అని సంబోధించిరి. ఈ విధమైన ప్రతిబింబము రహిత పర్చుకొన్నవాడు కర్మ రహితుడు కనుక "అద్భుత చరిత్రా" అని సంబోధించిరి. ఇట్టివాడు పరమ పవిత్రుడు అని కూడా చెప్పిరి. ఈ విధమైన అంతఃకరణ రహితము, ప్రతిబింబ రహితము, గురు సేవ, గురుకృప యీ విషయములలోని రహస్యములను శాస్త్ర దృశ్యము, గురుముఖము, అనుభవముల ద్వారా మాత్రమే తెలియనగును.

---

**అవతారిక :** సంస్కారవంతులకు మాత్రమే యీ బోధ తెల్పనగునని యీ పద్యములో చెప్పుచున్నారు.

**200వ పద్యము : జఠర జనితులైనమ బహు । కఠిన మనస్కులకు ఘోర కలుషాత్ములకున్ । శఠులకు జడమతుల కీవకు । పఠనా సక్తులకు బోధ పట్టుమటంచున్।**

**దండాన్వయము :** 1) పఠనాసక్తులకు బోధ పట్టుమటంచున్ (ఇచ్చినట్లుగా) జఠరజనితులైనను, బహుకఠిన మనస్కులకు, ఘోర కలుషాత్ములకున్, శఠులకు, జడమతులకు (బోధ) ఇవకు.

2) జఠర జనితులైనను బహు కఠిన మనస్కులకు ఘోర కలుషాత్ములకున్, శఠులకు, జడమతులకు (బోధ) ఇవకు । పఠనాసక్తులకు బోధ పట్టు మటంచున్ (ఇవ్వుము)

బ్రాకెట్లులోని పదముల అన్యాపదేశములుగా తెచ్చుకొనవలెను.

**టీక :** జఠర జనితులైనను = మనుజులైనను, తన కడుపున పుట్టినవారైనను, శఠులు = మూడులు, జడమతులు = మంద బుద్ధులు, కఠిన మనస్కులు = దయలేనివారు. (పాపకార్యములు చేయువారు) ఘోర కలుషాత్ములు = మహాపాపములు (పాతకులు) చేయువారు. ఆసక్తి = కోరిక.

**భావము :** శిష్యా! ఈ బోధ పఠించుట యందు ఇష్టత ఉన్నవారికి బోధ వినండి చెప్పెదను అని వారికి ఈ బోధ ఇచ్చినట్లుగా, దయలేనివారు మహాపాపములు చేయువారు, మూఢులు, మందబుద్ధి కలవారు, బోధ ఆసక్తి లేనివారు ఇట్టి వారు నీ కడుపున పుట్టినవారైనను (నీ పిల్లలే అయిననూ) ఈ బోధ తెలుసుకోమని చెప్పవద్దు.

---

**అవతారిక :** "కర్పూర శిఖి" - ద్వాదశి మంత్రార్థమును చెప్పుచున్నారు.

**201వ పద్యము : కప్పురము నిప్పు, గలసే । చొప్పువ, వెలిగవల కండ్ల జూస్తుండగనే। తప్పున గనరా వట్లనె । యిప్పుడు నిను నన్ను బోధ నెరుగుము బుద్ధిన్ ॥**

**దండాన్వయము :** యిప్పుడు నిన్ను నన్ను బోధన్ బుద్ధిన్ ఎరుగుము ॥

**భావము :** శిష్యా! హారతి కర్పూరము నిప్పు కలసినప్పుడు చక్కగా కొంత సేపు వెలిగి (కర్పూరము ఉన్నంత సేపు వెలిగి) ఆ తరువాత కర్పూరము లేకపోయిన వెంటనే నిప్పుకూడా లేకపోవును. ఆ విధముగా నిన్ను, నన్ను బోధను నీ బుద్ధిచే తెలిసికొనుము. అనగా - నిన్ను కర్పూరము, నేను అగ్ని శిఖ వెలుగుట - బోధ.

కర్పూరము ఉన్నంత సేపు నిప్పు ఏలాగున ఉండునో, అలాగే శిష్యుడు ఎరుకతో ఉన్నంత సేపు, గురుమూర్తి (జ్ఞానాగ్ని స్వరూపుడు) బోధించుచునే యుండును.

నిప్పుచే కర్పూరము కాలిపోగానే నిప్పుకూడా లేకపోవును. అట్లే గురుమూర్తి యొక్క జ్ఞానాగ్నిచే (బోధచే) శిష్యుని ఎరుక రహితమైన వెంటనే శిష్యుడు, గురుమూర్తియు ఇద్దరు కూడా లేకపోవుదురు. లేని యీ సమస్తము (శిష్యుడు - గురువు - బోధ) శాశ్వతమైన పరిపూర్ణ పరబ్రహ్మములో లేక వచ్చినవి. ఇవి లేకపోయినను శాశ్వతమైన పరిపూర్ణము ఏ మార్పు లేకుండా అట్లే యుండునని గుర్తించమని ద్వాదశాక్షరి మంత్ర భావమునకు ద్రాష్టాంతముగా ఈ పద్య భావము.

---

**అవతారిక :** ఈ పద్యముతో గురుమూర్తి బోధ పూర్తి చేసి, ఆశీర్వదించుచు బోధను మరవ వద్దని చెప్పుచున్నాడు.

**202వ పద్యము : దీవించి యిస్తి నేనీ । సేవించిన సేవ మెచ్చి చిత్తము లోనన్ । కావించుమెపుడు గానము । భావించిది ముఖ్యమనుచు పావనశీలా ॥**

**దండాన్వయము :** పావనశీలా! నీ సేవించిన సేవ చిత్తములోనన్ మెచ్చి, నే దీవించి (ఇది) ఇస్తి, ఇది ముఖ్యమనుచు భావించి ఎపుడు గానము కావించుము.

**టీక :** దీవించి = ఆశీర్వదించి, పావన శీలా = పవిత్రమైన శీలము కలవాడా !

**భావము :** ఓ పవిత్రమైన శీలము గల శిష్యా! నీ యొక్క సేవకు మనసు నందు నాకు సంతోషకము కలిగి, జన్మ కర్మ నివారణ సిద్ధిరస్తుగా ఆశీర్వదించుచు, యీ బోధ నీకు యిస్తిని. ఇది చాలా గొప్పది జన్మ రహిత స్థితికి ముఖ్యమైనది అని భావించి ఎల్లప్పుడు మననము చేసికొనిచుండుము. 2) ఇది ముఖ్యమనుచు భావించి అను వాక్యమును పై పద్యము 201తో అన్వయం చేసినచో కప్పురము నిప్పుగలిసే విధమైన గురు ధ్యానము - ఇది ఎరుక రహితపర్చుటకు అతి ముఖ్యమని భావించి ప్రతి దినము ధ్యానము, బోధ యొక్క మననము చేయుచుండుము అని అర్థము.

---

**203వ పద్యము : అని గురుడు బోధ జేసిన । విని శిష్యుడు హర్షమంది వేడుక తోడన్ । తన గురుని తోటి విజ్ఞా । పన మీ రీతిగ నొనర్చె పటు వాక్ప్రౌఢిన్ ॥**

**టీక :** హర్షమంది = సంతోషము పొంది, వేడుక తోడన్= సంతోషముతో, విజ్ఞాపన

= విన్నపము (వినియముతో చెప్పుకొనునది) పటు వా(క్పౌడిన్= రూఢియైన వాక్యముల నేర్పుతో.

**దండాన్వయము :** అని గురుడు బోద జేసిన శిష్యుడు విని హర్షమంది తన గురుని తోటి వేడుక తోడన్ పటు వా(క్పౌఢిన్ ఈ రీతిగ విజ్ఞాపన నొనర్చె ॥

**భావము :** పై విధముగా గురుమూర్తి బోధించగా, శిష్యుడు విని సంతోషమును పొంది, తన గురుమూర్తితో సంతోషము కలుగులాగున చక్కని నేర్పు గల వాక్యములతో ఈ విధముగా విన్నవించుకొనెను.

---

**204వ పద్యము : నా కొఱకు కష్టపడితిరి । మీకై మీరిటకు వచ్చి, మిము బొగడుట కా। కోదరేశు డోపం । డా కార్యము నాతరంబె యచల మనస్కా ॥**

**టీక :** అచల మనస్కా = చలించని మనస్సు గలవాడా! (పూర్ణస్థితి పరుడా!) పొగడుటకు = స్తోత్రము చేయుటకు, వినుతి చేయుటకు, ఆకాకోదరేశుడు = ఆ ఆది శేషువునకు సైతము, ఓ పండు = సరిపోడు, చాలడు ।

**భావము :** అచల మనస్కా ఓ గురుదేవా ! మీకుగా మీరు నా వద్దకు వచ్చి నా కొఱకు (నన్ను ఉద్ధరించుటకు) ఇంత వరకు కష్టపడి బోధించిరి. ఇంతగా నన్ను సంస్కరించిన మిమ్ముల స్తుతి చేయుటకు రెండు వేల నాల్కలు గల ఆ ఆదిశేషువునకైన తరము కాదు. ఇక నేనెంతటి వాడను స్వామీ !

ఈ పద్యములో అచల మనస్కా పొగడినను చలించని మనస్సు అని విశేష భావము.

---

**205వ పద్యము : తల్లివి దం(డివి దాతవు । వల్లభుడవు, బాంధవుడవు, వసుధీశుడవున్ । తెల్లమిగ దేవుడవు, నీ । వల్ల గదా యిట్టి బోధ వర్తన వినుటల్ ॥**

**టీక :** దాతవు = విద్యా దానము చేసిన వాడవు, వల్లభుడవు = భర్తవు, తెల్లమిగ=స్వచ్ఛమైన, నిర్మలమైన, బోధ = జ్ఞానము, వర్తన = ఆచరణ.

**భావము :** గురుదేవా! తమరు నాకు తల్లి, తం(డి, దాత, భర్త, బంధువు మరియు

స్వచ్ఛమైన దైవము (అని భావించుచున్నాను) అయియున్నారు. కనుకనే మీ వల్ల ఇంతటి గొప్ప జ్ఞానము, ధర్మ ప్రవర్తన వినగల్గితిని స్వామీ ॥

**విశేష భావము :** తల్లి = ఆదరించి, ఆహార పోషణ శరీర పోషణ చేయుట. తండ్రి=జ్ఞానము చెప్పి శిక్షణ చేయుటచే, దాతవు = విద్యా దానము చేయుటచే, వల్లభుడవు = భర్త, భరించేవాడు, తన లోటు పాట్లను భరించి పోషించుటచే, బాంధవుడు = ఆపదలో అడ్డుకొనేవాడు (జన్మ కర్మంబంధ రహిత పర్చుటచే, తెల్లమిగ దేవుడవు = నిర్మలమైన దేవుడవు. గుణ రూపరహితమైన దేవుడు.

**206వ పద్యము : అని శిష్యుడన్న మాటకు । మనమున హర్షించి గురుడు మరియిట్లనియెన్ । వినవోయి శిష్య రాయా । విని నాకోరికెను దీర్చ వేడుకయైనన్॥**

**టీక :** హర్షించి = పెద్దగా సంతోషించి, శిష్యరాయా = శ్రేష్ఠమైన శిష్యా! వేడుక = సంతోషము.

**భావము :** పై పద్యములో శిష్యుడు చెప్పిన మాటలకు గురుమూర్తి మనసు నందు సంతోషపడి, శిష్యునితో యీ విధముగా పలికెను. ఓ శ్రేష్ఠమైన శిష్యా! నా కోరికను విని నా కోరిక తీర్చవలెనని మనసు కలిగినచో నా కోరిక తీర్చుము. (ముందు పద్యముతో సమన్వయము)

**207వ పద్యము : నే జెప్పినట్లు జెప్పర । నే జెప్పిన బోధ లెస్స నీకతికుంటే । నే జూతు నీ చమత్కృతి । రాజిత సుగుణైక సారరమ్య విచారా ॥**

**టీక :** సుగుణైకసార = సుగుణరాశియైయున్న, రాజిత = ప్రకాశించెడు, రమ్యవిచారా = చక్కని విచారణ చేయునట్టి (శిష్యా!), లెస్స = బాగుగ, నీ కతికుంటే = నీ మనసుకు పట్టినచో, చమత్కృతి = నేర్పరితనము.

**భావము :** సుగుణ సారమై ప్రకాశించే ఓ శిష్యా! నే చెప్పిన బోధ నీ బుద్ధికి చక్కగా హత్తుకొని యున్నచో, నే చెప్పినట్లు గానే తిరిగి నాకు చెప్పుము. నీ నేర్పరితనమును జూచెదను (అని గురుమూర్తి కోరెను) అని పల్కెను.

**విశేష భావము :** సుగుణసారా = చక్కని విచారణ చేయువాడా అని శిష్యుని

సంబోధించెను. అంటే నీవు నాకు జెప్పే బోధ చక్కని విచారణతో కూడి యుండేలాగున చెప్పుము అని భావము. శిష్యుడు మొదట గురుమూర్తిని ఆశ్రయించి తనకు బోధించుమని అడిగినప్పుడు "బోధనామది నాటినది అని నీకై నీ నోట పల్కుదాకను" 29వ కందార్థము మరియు నే చెప్పిన బోధ తిరిగి నీ నోటి వెంట వచ్చే పర్యంతము చెప్పెదను అని గురుమూర్తి అభయమిచ్చెను. కనుకనే బోధించుట పూర్తి అయినది కనుక శిష్యుని నోటి వెంట తాను చెప్పిన బోధ చక్కగా చెప్పమని గురుమూర్తి ఈ పద్యములో అడిగెను.

---

**208వ పద్యము : అని గురుడు తనకు బల్కిన । విని శిష్యుడు లేచి, మ్రొక్కి, వినుతించి, ముదం। బున జెప్పదొణగె, మునుతా । వినినట్లుగ గురుని మదికి వేడుక దోపన్ ॥**

**టీక :** లేచి = నిలబడి, మ్రొక్కి = గురుపాదాభివందనము జేసి, వినుతించి = గురు ప్రార్థన జేసి, ముదంబున = సంతోషముతో, వేడుకదోపన్ = సంతోషము కలుగనట్లుగ.

**భావము :** (గురుమూర్తి అడిగిన వెంటనే) శిష్యుడు లేచి, గురు వందనము జేసి, గురుప్రార్థన జేసి, గురుమూర్తికి సంతోషము కలుగు లాగున తాను, వినిన గురుబోధను ఆనందముతో ఈ విధముగా చెప్పసాగెను.

(గురుమూర్తి అడిగిన తరువాత శిష్యుడు జవాబు చెప్పే విధము ఈ పద్యములో చెప్పిరి, లేచి, మ్రొక్కి, వినుతించి, గురుని మదికి వేడుక దోపన్.)

---

**209వ పద్యము : నే మొదలు లేని మేనును । నా ముచ్చట స్వప్నమనుచు నమ్మదగుసుమీ । నే మేలుకొన్న లేవని । నా ముచ్చట నేను నిల్వ నరఘుడియైనన్॥**

**దండాన్వయము :** మొదలు లేని నే, మేనును నా ముచ్చట .... నే లేనని మేలుకొన్నను.

**భావము :** ఆర్యా! మూలము లేని నేను, శరీరమును నేను జెప్పే మాటలు సమస్తము కలవంటిదే యని నమ్మతగును. నేను లేనని మేలుకొనినచో, నేను నా మాటలు అరఘడియైనను ఉండవు.

**విశేష భావము :** నేను, శరీరము - శరీరము అనగా అవిద్య అని చెప్పబడే ఎరిగే శరీరము, నేను అనగా అవిద్య యందలి ప్రతిబింబ చైతన్యము. ఈ రెండును మూలము లేనివే. కనుకనే మొదలు లేని నే, శరీరము అన్నారు. ఈ రెండు కలసియే గుర్తెరిగే శరీరము. దీని వల్ల చెప్పబడే సమస్త మాటలు కూడా కల వంటిదే కదా! కనుక నేను శరీరము నా ముచ్చటలు స్వప్నతుల్యము అన్నారు.

**210వ పద్యము : లేని నే లేక వచ్చిన । నే నేగిన నుండు బయలు, నే నెరుగను, యీ । నే నుండి దాన్ని కనుగొని । నే నేగితె మరల బుట్టనిక నెన్నటికిన్ ॥**

**దండాన్వయము :** లేని నే లేక వచ్చిన, నే నేగినన్, బయలు ఉండు, దాన్ని నేనెరుగను । యీ నేను ఉండి దాన్ని కనుగొని నేనేగితె ఇక నెన్నటికిన్ మరల పుట్టను॥

**భావము :** మూలము లేని నేను లేకనె వచ్చిన, పోయిననూ, పరిపూర్ణ బ్రహ్మము ఏ మార్పులు లేకుండా శాశ్వతమై యుండును. అట్టి బ్రహ్మమును యీ యెరుక యెరుగదు. అట్టి బ్రహ్మమును యీ యెరుకైన నేను ఉండి గురుముఖతా దాన్ని విచారించి తెలుసుకొని, నేను లేనని తెలసి నేను లేకపోయినచో యిక ఎన్నటికి తిరిగి జన్మకు రాను. (పుట్టను)

**211వ పద్యము : లేని నా రాక పోకలు । దేనందున దోచబడెనదె బయలు సుమీ । దానిని గురు కృపచే గని । నే నేగిన రాను పోను నిజమెన్నటికిన్ ॥**

**దండాన్వయము :** నే నేగిన యెన్నటికిన్ రాను పోను, నిజము.

**భావము :** లేని యీ యెరుక వచ్చుట పోవుట (పుట్టుట - చచ్చుట) అనే పరిణామములు దేనందున తోచబడుచున్నదో అదే పరిపూర్ణము. అట్టి పరిపూర్ణమును నేను (ఎరుక) గురుకరుణచే చూచిన నేను లేక పోవుదును. ఆ తరువాత ఎప్పటికిని తిరిగి పుట్టుట జరుగదు. ఇది నిజము స్వామీ !

**212వ పద్యము : తనువుకు నాకును వేరని । యన గూడ దదెట్టులనిన ననవరతంబున్। పనులన్ని తనువునే లే । కను జేయ వశము గాదు కావున సామీ ।**

**టీక :** అనవరతంబున్ = ఎల్లప్పుడును, సామీ = స్వామీ

**భావము :** శరీరము నేను వేరని యెన్నడూ అనరాదు. ఎందుచేతననగా యే పని యైనను ఎప్పుడైనను శరీరము నేను వేరుగా ఉండి చేయలేము కదా స్వామీ ॥

**213వ పద్యము : నను రమ్మని పొమ్మని తా । ననదు సుమీ బట్ట బయలు, నా కై నేనే । తనువును జగమును గైకొని । చనుదెంచుట చనుట నాకు సహజము తండ్రీ॥**

**టీక :** రమ్మని = పుట్టమని, పొమ్మని = చావమని, చనుదెంచుట = వచ్చుట (పుట్టుట) చనుట = వెళ్లిపోవుట (చచ్చుట), సహజము = స్వభావము.

**భావము :** తండ్రీ! గురుదేవా! యీ బట్ట బయలు (పరిపూర్ణము), నన్ను (ఎరుకను) రమ్మని గాని, పొమ్మని గాని అనదు. నాకు నేనే శరీరమును జగత్తును తీసుకొని వచ్చుట, పోవుట జరుగును. ఇది నా స్వభావము తండ్రీ.

**విశేష భావము :** పరిపూర్ణములో లేక తోచిన మాయ తనకు తానే తోచినది. పరిపూర్ణము ఎంత మాత్రము కారణము కాదు. అందు చేతనే "నను" (ఎరుకను) రమ్మని పొమ్మని "తాను" (పరిపూర్ణము) అనదు. ఎరుక (మాయ, అవిద్య) తనకు తానే ఏర్పడినది. ఇందు పరిపూర్ణము యొక్క ప్రతిబింబము ఉండుటచే ఈ ప్రతిబింబ చైతన్యము యొక్క సత్తా చేత ఎరుక చైతన్యవంతమై సత్తా కలిగి పంచకోశములను జగత్తును నిర్మించుచున్నది. ఇట్టి పంచ కోశములను (శరీర త్రయములను) జగత్తును నిర్మించుకొనుటకు కారణము, అవిద్య యందు అనేక జన్మ జన్మల కర్మవాసనలే కారణము. కర్మ వాసనలు సూక్ష్మము. దీని వలన ఏర్పడిన స్థూల రూపమే శరీర త్రయము, జగత్తు, సర్వ ప్రపంచమున్ను, కనుక నా కై నేనే తనువును జగమును గైకొని, చనుదెంచుట - చనుట" ఇది ఎరుక యొక్క స్వభావము. యెరుక యొక్క స్వభావము చచ్చుట పుట్టుట, మేల్కొంచ్చుట గాఢాసుషుప్తి నొందుట. (కందార్థము)

---

**214వ పద్యము : ప్రకటమగు బట్టబయలున । సకలముతో లేక వచ్చిచను దరఘడియన్ । నొక కోటి మాట్లనే రా । నొక వేళ్లను లే నటంచు వూహ బొడమినన్॥**

**దండాన్వయము :** ప్రకటమగు బట్టబయలున । అరఘడియన్ సకలముతో లేక వచ్చి చనుదున్ । ఒక వేళ్లను లేనటంచు మాహ బొడమినన్ ఒక కోటి మాట్లన్ నే రాను.

**టీక :** ప్రకటమగు = ప్రత్యక్షముగ, ప్రసిద్ధముగ, అరఘడియన్ = అరసెకనులో, సకలముతో = సమస్త జగత్తుతో, వూహ బొడమినన్ = సంకల్పము కలిగినచో, ఒక వేళ్లన్ = ఒకానొక సమయమందు, ఒక కోటి మాట్లన్ = ఒక కోటిమార్లు అన్ననూ (పుట్టెదను అని) అనేక మార్లు అన్నప్పటికి

**భావము :** గురుదేవా! ప్రత్యక్షముగ ఉన్న పరిపూర్ణమందు లేకనే నేను సమస్త జగత్తుతో కూడి అరసెకనులో పుట్టి, లేకోవుచుందును. ఒకానొక సమయమందు (నా పుణ్య వశమున గురుకరుణ కల్గిన వెంటనే) నేను లేను అని తెలిసినచో ఒక కోటి మార్లు (పుట్టుదువు అని ఎందరన్నను నేను తిరిగిరాను.

ఒక కోటి మాట్లు (ర్లు) నీవు వస్తావని ఎందరనినమూ - నేను తిరిగిరాను అని ధృడ నిర్ణయమును తెల్పుటకే ఒక కోటి మాట్లన్ అనే పద ప్రయోగము.

---

**215వ పద్యము : లేని వే వెరుగకుండిన । మేనుండదు, నేను నిల్వ మేనుండక, యీ । మేనగు నాజోలొల్లని । దానిని గుర్తెరిగి వేమ తలగితె చాలున్ ॥**

**దండాన్వయము :** లేని నే వెరుగకుండిన మేనుండదు । మేనుందక నే నిల్వను.

**టీక :** నే వెరుగకుండిన = నేను లేకపోయినచో, మేను ఉండదు. అవిద్య అయిన ఉపాధి శరీరము ఉండదు; నాజోలొల్లని = ఎరుక సంగతి తెలియని, తలగితె = లేకపోయినచో.

**భావము :** లేనిదే ఏర్పడిన నేను (ప్రతిబింబము) లేకపోయినచో శరీరము (అవిద్య ఉపాధి శరీరము) ఉండదు. అవిద్య శరీరము లేనిదే నేను (ప్రతిబింబ చైతన్యము) ఉండదు. కావున నేను మేనుల సంగతి ఎంత మాత్రము తెలియని పరిపూర్ణమును నేను చక్కగా తెలసి నేను లేనని లేకుండా పోతే చాలును స్వామీ ।

---

**216వ పద్యము : మనము మన పెద్దలందరు । చను దేరక మునుపు వారు చనినన్, గల యీ । ఘనమును గని మన మేగిన ।చనదు గదా మనను బోలి సారవిచారా!**

**టీక :** సారవిచార = శ్రేష్ఠమైన విచారణ కల మహానుభావా!, చనుదేరక మునుపు =రాక ముందు, ఘనమును గని = (గొప్పది) పరిపూర్ణమును చూచి, చనదుకదా = లేకుండా పోదుగదా!

**భావము :** శ్రేష్ఠమైన విచారణ చేయు గురుదేవా ! మనము మన మహాఋషులు అందరు పుట్టక ముందు, మనమందరము పోయిన తరువాతను శాశ్వతముగా ఉన్న ఈ పరిపూర్ణ పరబ్రహ్మము, ఎరుక పోయినచో యీ పరిపూర్ణము ఎరుకతో

పోదుగదా స్వామీ, అనగా ఎరుకతో రాలేదు. ఎరుక పోయిననూ పరిపూర్ణము శాశ్వతముగానే ఉండును స్వామీ అని భావము.

**217వ పద్యము : మేను మజ్జనని, నేనే । మేనికి జనకుడను, నేను మేను లొకటియై । దేనందున సంచరింతుమొ । దానిని పరిపూర్ణమనుచు దలచెదనయ్యా !**

**టీక :** మేను = శరీరము (అవిద్య) మజ్జనని = నా యొక్క తల్లి.

**భావము :** స్వామీ! ఈ నేనుకు తల్లి, శరీరము. శరీరమునకు నేను తండ్రిని. ఈ నేను మేనులు ఒకటిగా ఉండి (విడివడక) దేనందున తిరుగుచున్నదో, దానినే పరిపూర్ణమని తలచెదను స్వామీ !

**విశేష భావము :** నేనుకు తల్లి శరీరము అనగా - తల్లి అనగా జన్మ నిచ్చినది అని భావము. నేను అనగా ప్రతిబింబ చైతన్యము, అవిద్య అనే ఉపాధి వలన కలిగినది. అనగా అవిద్య వలన నేననే ప్రతిబింబము ఏర్పడినది. కనుక "నేను"కు అవిద్య అనే ఎరిగే శరీరము (మేను) తల్లి. ఆ మేను అయిన ఎరిగే శరీరము, అవిద్య, ప్రతిబింబ చైతన్య సత్తాచేత లేని అవిద్య ఉన్నదై సృష్టి స్థితి లయ కార్యములు చేయుచున్నది. తండ్రి సత్తామాత్రుడు. లేని అవిద్యకు "నేను" సత్తానిచ్చుచున్నది కనుక ఆ అవిద్య అయిన మేనుకు "నేను" జనకుడను (తండ్రిని) అని చెప్పిరి. తల్లి స్త్రీ రూపము ప్రకృతి. అవిద్య ప్రకృతి గనుక తల్లి అన్నారు. నేను ప్రకృతికి వ్యతిరిక్తమయినది పురుషుడు. కనుక తండ్రి, అని చెప్పిరి. ఈ నేను - మేనులు రెండును ఎన్నడూ విడిగా ఉండవు. రెండుగా తెలియబడుచున్నను, ఒక్కటి మాత్రమే అని చెప్పవలెను. ఇట్టి ఎరుక పరిపూర్ణములోనే తిరుగుచున్నది. అనగా లేక తిరుగుచున్నది.

**218వ పద్యము : మేనున్నది నే లేకను । నేనెరుగను, మేనులేక నే నిల్వను, యీ । మేనుకు నేనుకు మూలము । గానను, మము మేమె సృజన గావింతుమయా ॥**

**పదవిభాగము :** మేనున్నది నే లేకను నే నెరుగను। మేను లేకను నే నిల్వను । యీ మేనుకు నేనుకు మూలము గానను। మము మేమె సృజన గావింతుమయా।

టీక : మూలము గానను = మూలము ఏదో తెలియదు, సృజన = సృష్టి గావింతుము.

**భావము :** ఆర్యా! "నేను" లేకుండగ "మేను" ఉండుట నేను ఎరుగను (ఉండదని భావము) మేను లేకుండగ నేను ఉండదు. ఈ నేనుకు మేనుకు మూలము ఎక్కడా కనబడదు. కనుక మాకు మేమే అనగా నేను వలన మేను, మేను వలన నేను సృష్టిగావింపబడుచున్నది స్వామీ !

**విశేష భావము :** అవిద్య తనకు తానే పరిపూర్ణములో తోచినది. అవిద్య యందు పరిపూర్ణ పరబ్రహ్మము ప్రతిబింబించినది. అవిద్య అద్దము వలె ప్రతిబింబింపజేసుకొనే లక్షణము కలది. కనుక అవిద్యయే పరిపూర్ణమును ప్రతిబింబింపజేసుకొనినది. పరిపూర్ణము కారణము కాదు. ప్రతిబింబము వలన లేని అవిద్య ఉన్నది అయినది. కనుక అవిద్య ఉండుటకు ప్రతిబింబము కారణము. అవిద్య వలన ప్రతిబింబము అయిన నేను ఉన్నది. ప్రతిబింబము అవిద్య కారణకార్యములై ఉన్నది. "మముమేమే సృజన' నేను వలన మేను, మేను వలన నేను ఉన్నదని భావము. ఈ రెంటికి పరిపూర్ణము ఎంతమాత్రము మూలము కాదని పద్య భావము.



**219వ పద్యము : నేనిల్వ జగము లేకను । నేనేగిన జగము లేదు, నిజమీ, జగమున్। నేనును లేనప్పుడు గల । దానిని పరిపూర్ణమనుచు దలపోయదగున్ ॥**

**దండాన్వయము :** జగము లేకను నే నిల్వ । నేనేగిన జగము లేదు నిజము । ఈ జగమున్ నేనును ....

**భావము :** జగత్తు లేకుండా నేను ఉండదు. నేను లేకపోయినచో జగత్తు ఉండదు. నిజము. ఈ జగము నేను లేనప్పుడు శాశ్వతమై ఉన్నదేదో దానిని పరిపూర్ణమనుచు దలచవచ్చును.

**విశేష భావము :** నేను అనగా ఈశ్వరుడు. జగము = జగదధిష్ఠానము మాయ. మాయ పరిపూర్ణమందు లేనిదే తనకు తానే తోచినది. ఆ మాయ యందు దానికి ముందే శాశ్వతమై ఉన్న పరిపూర్ణ బ్రహ్మము ప్రతిబింబించినది. ఆ ప్రతిబింబ చైతన్యమే - నేను (ఈశ్వరుడు) ప్రతిబింబ చైతన్య సత్తా చేత మాయ చైతన్యవంతమై

సమస్త జగత్తును నిర్మించుచున్నది. ఈ మాయయే "జగము" నేను - ఈశ్వరుడు. కనుక నేను (ఈశ్వరుడు) లేకుండా జగము (మాయ) నిల్వదు. మాయ లేకుండా (జగము) ప్రతిబింబము (నేను) లేదు. 218వ పద్యము పిండాండమునకు 219వ పద్యము బ్రహ్మాండమునకు సరిపోల్చనగును.

**220వ పద్యము : లేని నే మాయమైనను । మానవులది మరపు మూర్ఛ మరణంబును, గా। ఢా నిద్రయు, నిర్నిద్రన ।నేన వి మృషని, నమ్మనేర్తునే వాటిన్ ॥**

**భావము :** లేని నేను (ఎరుక) మాయమైనను, అనగా శరీరమందు ఎరిగే స్థితి లేనప్పుడు లేక శరీరమును విడచిపోయినను, ఆయా స్థితులననుసరించి మానవులు ఆ స్థితులను మరపు (సమాధి స్థితి) మూర్ఛ, మరణము, గాఢ నిద్ర, నిర్నిద్ర (తురీయము) అని చెప్పెదరు. కాని అవన్నియు మృషయేనని వాటిని నమ్మలేను స్వామీ ।

**విశేష భావము :** ఎరుకకు ఎరిగే స్థితి, మరిచే స్థితి అని రెండు స్థితులు కలవు. మరిచే స్థితిని మూర్ఛ స్థితి అని, సమాధి అని, సుషుప్తి అని నిర్నిద్ర అని చెప్పుచు ఆ స్థితిలో ఎరుక లేదు అందురు. కాని ఎరుక లేకపోలేదు. మరుపు స్థితిలో ఉన్నది. శరీరము నుండి బైటకు పోయిన అది మరణము. ఆ స్థితిలో కూడా ఎరుక లేకపోలేదు. ఎరుకకు స్థూల శరీరము లేదు. సూక్ష్మ కారణ శరీరములతో ఎరుక ఉన్నది. కనుక ఇవన్నియు ఎరుక ఉన్న స్థితులే కాని ఎరుకలేని స్థితులు కావు. లేక ఉన్నది కనుకనే "మృష" అని నమ్మనేర్తునే అన్నారు.

**221వ పద్యము : విను భాష్యములను త్రాళ్లను । జనములు నను గట్టియుంచ జనక నిల్తునా । చనుదొత్తునాకు నేనై । కను కనె నను నమ్మరెపుడు ఘనులగు వారల్॥**

**టీక :** విను = ఆకాశము (పెద్ద పెద్ద అని భావము) భాష్యములు = సూత్రవ్యాఖ్యాన గ్రంథములు, జనక = వెళ్లకుండా, చనుదొత్తు, చనుదు = వెళ్లుదును, ఒత్తును = వచ్చెదను, ఘనులగువారు - గొప్పవారు పరిపూర్ణ జ్ఞానులు.

**భావము :** గురుదేవా! పెద్ద పెద్ద వ్యాఖ్యాన గ్రంథములనేత్రాళ్లతో "నేను" శాశ్వతమైనది అని వ్రాస్తూ, శాస్త్రజ్ఞులు నను కట్టి పడవేయదలచినను, నేను శాశ్వతముగా (ఏ మార్పు లేకుండగ) ఉందునా? నాకు నేనే పోతూ తిరిగి వచ్చెదను. రాకపోకలతో చలించుచుందును. కనుకనే పూర్ణ జ్ఞానులైన పెద్దలు "నేను" మాయ లేనిదే అని నిర్ణయించిరి.

**విశేష భావము :** వ్యాఖ్యాన గ్రంథముల్లో "నేను" అనగా బ్రహ్మము చలించేది కాదు అనియు, మాయయే చలించుచున్నది అనియు కనుక నేనే బ్రహ్మమని చెప్పుచున్నారు. నేను అనే ఈ బ్రహ్మము ప్రతిబింబమే సహజమైన ఉనికి లేనిది. మాయ అనే ఉపాధి సహితము కనుక శాశ్వత బ్రహ్మము కానేరదు.

---

**222వ పద్యము : నానా భాషల చేతను । నానా విధ శాస్త్రతతుల నను నమ్మ్మటకై నేనే రచించి పెట్టితి । నానా దేశములయందు నరరూపమునన్ ।**

**టీక :** శాస్త్రతతుల = శాస్త్ర సమూహముల చేత.

**దండాన్వయం :** నను నమ్మ్మటకై, నానాదేశములయందు, నానా భాషల చేత, నానా విధ శాస్త్రతతుల, నరరూపమునన్ నేనే రచించిపెట్టితి.

**భావము :** "నేను" బ్రహ్మమే అని నమ్మ్మటకై ఆయా దేశములయందు, ఆయా భాషలు చేత అనేక శాస్త్రములు ఎరుకయే నర రూపమున రచన చేసినది. అనగా ఎరుక చేతనే ఎరుకను గుర్తించుటకై సమస్త శాస్త్రములు రచింపబడినవి అని అర్థము.

---

**223వ పద్యము : ఒక చోట నవ్వుదును, వే । రొక చోటను మిడుకుచుందు, నొక చోటను నే । ప్రకట మగుదు, లేకుందును । నొక చోటను, యిట్టి చేష్టలుండును నాకున్ ॥**

**టీక :** నవ్వుదును = సంతోషింతును మిడకుట = త్రుల్లిపడుట, పరితపించుట, గర్వించుట, ప్రకటమగుదు = ప్రత్యక్షమగుదును, చేష్టలు = క్రియలు.

**భావము :** ఒక చోట సంతోషపడుదును. వేరొక చోట సంచరించెదను. (గర్వించెద) ఒక చోట ప్రత్యక్షమగుదును. మరొక చోట లేకుందును. ఇట్టి బిన్న బిన్న క్రియలు నాకు ఉన్నవి స్వామీ ॥

**విశేష భావము :** నేత్ర స్థానమున (జాగ్రదవస్థలో) సమస్తము అనుభవించుచు సంతోషించును. షట్చక్రములయందు సంచరించును (మిడుకుట) భ్రూమధ్య స్థానమున ప్రత్యక్షమగుదును. సహస్రారమందు లేకుందును. లేని స్థితిని పొందుదును.

---

**224వ పద్యము : కావేటి కాలువల వలె। నా వల్లనె కల్పనౌను నానా విద్యల్। యీ విశ్వమందు, విశ్వము నావెంటనే వచ్చు పోవు నా వలెను సుమీ।**

**టీక :** కావేటి కాలువలు = నది సముద్రములో కలిసే ముందు కొంత దూరములో నది అనేక చిన్న చిన్న (సన్నని) పాయలుగా చీలిపోవును. ఆ పాయలకు కావేటి కాలువలు అని పేరు.

**భావము :** స్వామీ! యీ జగత్తులో అనేక రకములైన విద్యలు అన్నియు కావేటి కాలువల రీతిగా నా వల్లనే (నాయందునే) కల్పితమగుచున్నవి. యీ జగత్తు కూడా నాతోనే వచ్చును, నాతోనే పోవుచున్నది.

---

**225వ పద్యము : నేనాడు దాన నౌదును। నేనే మగవాడనౌదు నేనే నన్నున్। నే నీ వటంచు గూడుదు। నేనే నను జెరుప మనుప నీగుదు సుమ్మీ॥**

**టీక :** చెరుప = పాడుచేయుట, మనుప - రక్షణ చేయుట, నీ గుదు = నివర్తించు, చత్తును.

**భావము :** గురుదేవా! నేనే (ఎరుకయే) ఒక చోట స్త్రీగను, మరొకచోట పురుషుడుగను ఉందును. నేనే (ఎరుకయే) నన్ను (ఎరుకను) నేను-నీవు అనుచు కలియుందును. నాకు నేనే పాడు చేయుట, రక్షించుట, చచ్చుట అను క్రియలతో (వేరు వేరుగా ఉన్నట్లు) ఉందును.

**విశేష భావము :** ఎరుక భ్రూమధ్య స్థానము నందు ఉన్నప్పుడు ప్రకృతియనియు (స్త్రీ గను) సహస్రారమందు పురుషుడనియు వ్యవహరింతరు. రెండు స్థానములయందు ఉన్నది ఒక్క ఎరుకయే. ఎరుకయే పిండాండమందు అవిద్యతో కూడి రజోతమోగుణ ప్రధానమైనప్పుడు జీవుడు (నీవు) సత్వగుణ ప్రధానమైనప్పుడు

ఈశ్వరుడు (నేను) అనబడును. జీవత్వమును వదలి జ్ఞాన స్వరూపునిగా అయినపుడు జీవేశ్వర ఐక్యము అందురు లేక తాను స్వతః ప్రతిబింబ స్వరూపుడు ఈశ్వరుడే కాని, అజ్ఞానావృతముచే జీవుడను అనుకొనుచున్నాడు. ఇది ఎరిగి తన నిజస్థితిని పొందుటయే "నేను నీవు అను నేనిన్నున్ గూడుదు" అనగా "జీవేశ్వర ఐక్యము అని భావము". అజ్ఞానముచే జగత్తు శాశ్వతమనుకొని తన్ను తాను పాడు చేసుకొనుచున్నది. జ్ఞాన దృష్టిచే తన స్వరూపము నెరిగి జగద్భ్రాంతి నుండి రక్షించుకొనుచున్నది. చివరకు ఏమియు లేనని తెలసి లేకుండా పోవుచున్నది.

**226వ పద్యము : నేనుల మేనుల కుప్పను । నేను, బయల్ నన్నెరుగదు, నేచను దోత్తున్ । మేనై నిమిషములో । మానుగ నా వృత్తి, నేనే మాయను సుమ్మీ ॥**

**టీక :** కుప్పను = సమూహమును, మానుగ = సహజమైన.

**దండాన్వయము :** నేనుల మేనుల కుప్పను నేను । బయల్ నన్నెరుగదు । నిమిషయములోనే, మేనై చనుదు ఒత్తును । ఇది మానుగ నా వృత్తి । నేనే మాయను సుమ్మీ ॥

**భావము :** ఆర్యా! నేను (ఎరుక) నేను మేనుల సమూహమును. పరిపూర్ణ పరబ్రహ్మము నన్ను (ఎరుకను) ఎంత మాత్రము ఎరుగదు. నేనే క్షణ కాలములో శరీర ధారినై జనించెదను. నేనే క్షణములో లేకపోదును. ఇది నా సహజమైన పని. కనుక మాయ అనగా నేనే స్వామీ (బ్రహ్మను కాను అని నిర్ణయము)

**విశేష భావము :** నేను - నేనుల మేనుల కుప్పను, అఖండ ఎరుక రస - బల సమన్వితము. బలములు అనేక బలములే మాయావృతములై అనేక కోటానుకోట్ల బ్రహ్మాండములుగా, తిరిగి ఒక బ్రహ్మాండములో అనేక పిండాండములు గాను అగుచున్నది. ఇదే మేనుల సమూహము. అందలి చైతన్యము రసము నేనులకుప్ప (సమూహము) అని తెలియవలెను.

**227వ పద్యము : నేను గాకొకటి శుద్ధ । జ్ఞానము గల దనుచు బల్కు జ్ఞానుల మాటల్ । పూని వినదగదు, శుద్ధ । జ్ఞానంబన నేనే, నేను లేనిది యౌనే ॥**

**భావము :** ఎరుక లేనిది మలిన రహితమైన శుద్ధ జ్ఞానము ఒకటి ఉన్నది. అదే బ్రహ్మము అనే జ్ఞానుల మాటలు వినదగినవి కావు. శుద్ధ జ్ఞానమైనను ఎరుకయే. జ్ఞానము ఏ రూపములో ఉన్ననూ ఎరుక లేనిది (పరిపూర్ణము) అగునా? స్వామీ (పరిపూర్ణము కాదు)

**విశేష భావము :** అవిద్య యందలి ప్రతిబింబ చైతన్యము మలిన రహితమైనది. అదే శుద్ధ జ్ఞానము. అది ఎరిగే లక్షణము లేనిది (ఎరుక లేనిది) అందురు. అందుచే ఇది బ్రహ్మము అని జ్ఞానుల వాక్యము. కాని ఆ శుద్ధ జ్ఞానము కేవల ప్రతిబింబము ఉన్నది అనుటకు వీలు లేదు. మరియు అవిద్యను ఉపాధిగా కలిగి ఉన్నది. ఉపాధి లేకపోతే ఆ ప్రతిబింబము ఉండదు. కనుక సహజముగా ఉన్నదిగాదు. అనగా ఎరుక లేనిది అంటే పరిపూర్ణము అగునా? అంటే ప్రతిబింబము అవిద్యను ఉపాధిగా పొంది ఉన్నది కనుక పరిపూర్ణము కాదు అని భావము.



**228వ పద్యము : నే మాత్ర ముందు నని యెను । నామాయలకూ తలన్ని యరసిన సుష్తిన్ । యే మాయె, మరణమప్పుడు । యేమాయెను, గురుని మాట నే మాయెన యా॥**

**టీక :** గురుని మాటన్ = గురు వాక్యముచే, ఏమాయెనయా ॥ కూతలు = మాటలు (నీచ ప్రయుక్తము) అరసిన = విచారించిన

**భావము :** దేవా! శరీరము సమస్త జగము పోయేదే, శాశ్వతము కాదు. నేను మాత్రము శాశ్వతము నశించదు అని అంటుంటాను. ఈ నా మాయ మాటలు అన్నియు చక్కగా గురుబోధ రీత్యా విచారిస్తే సుషుప్తి యందు ఏమాయెను? శరీరముతో తాదాత్మ్యము లేక లేని స్థితిలో ఉన్నది. మరణించినప్పుడు ఏ మాయెను ఉపాదిని విడచినచో ఉనికి లేకపోవుచున్నది. ఉన్నాను అని అనలేకపోవుచున్నది. గురువాక్యముచే విచారిస్తే ఏమయినది (షోడశాక్షరి మంత్ర విచారణచే ఎరుక లేకపోవుచున్నది గదా?) ఇట్టి ఎరుక అయిన నేను శాశ్వతమైన బ్రహ్మమును ఎంతమాత్రము కాదు. మాయా స్వరూపము.



**229వ పద్యము : నేనన్న నహ, మహంబన । నేను సుమీ, యహమటంచు నేనెపుడంటే।**
**నేనపుడు పుట్టుట, దిజన । నేను గతించుట మటంచు నీ వెరుగయ్యా !!**

**పద విభాగము :** నేను అన్న అహము । అహము అన నేను సుమీ ।అహము అటంచునే నెపుడు అంటే, అపుడు పుట్టుట । అది జన, నేను గతించుటము అటంచు నీవు ఎరుగయ్యా ॥

**టీక :** అహము = అంతఃకరణము, అవిద్య

**భావము :** నేను అనినను అహం అనినను ఒక్కటే. అహమని అనుచున్నంత వరకు పుట్టుట తప్పదు. అట్టి అహము అని పల్కే అవిద్య (అంతఃకరణము) లేకపోయినచో నేను అనే ఎరుక లేకపోవుట అని తెలియవలెను స్వామీ ।

**విశేష భావము :** అవిద్య, అంతఃకరణమునకు "అహ"మని పేరు. అందలి ప్రతిబింబిత చైతన్యమునకు "నేను" అని పేరు. ఇదే నా స్వరూపము కనుక అవిద్యను వదలి నేను, నేను లేకుండా అవిద్య విడిగా ఎన్నడూ ఉండవు. కనుక రెండును భేద రూపములే అయినను ఒక్కటే అని నిర్ణయము. అదే పద్యములో చెప్పిన "నేనన్న అహము, అహంబన నేను సుమీ" అని భావము. అయితే అహమైన అవిద్య ఉన్నంత వరకు జనన మరణములు (సృష్టి స్థితి లయములు) తప్పవు. "అహమస్మి" నేను ఉన్నాను. అంటే జన్మ తప్పదు. అట్టి అవిద్య గురుకరుణచే దగ్ధమయినచో అదే (అహం పదార్థ రహితః) జన్మ రహిత స్థితి.

**230వ పద్యము : నేనన నాలవ దేహము । మేనన నాలోని మూడు మేనులు సుమ్మీ।**
**నేను మేనన నదొక్కటే । కానిది తన మూల మరయ గనరాదు సుమీ ॥**

**పద విభాగము :** "నేను" అన నాలవ దేహము । మేను అన నాలోని మూడు మేనులు సుమ్మీ। నేను - మేను అననిది అది ఒక్కటే। కాని, ఇది తన మూల మరయ గనరాదు సుమీ ॥

**భావము :** "నేను" అనగా నాల్గవ శరీరము. అదే అవిద్య యందలి ప్రతిబింబ చైతన్యము. మేను అనగా మూడు శరీరములు. 1) స్థూల, 2) సూక్ష్మ, 3) కారణ శరీరము- అవిద్య. ఈ నేను మేను కానిది అది ఒక్కటే. అనగా పరిపూర్ణము

మాత్రమే నేను - మేను కానిది. అది తప్ప మిగతా సమస్తము నేను మేనులతో కూడినదే. నేను (సత్) మేను (అసత్) కనుక సమస్తము సద సత్పదార్థమే. పరిపూర్ణము ఒక్కటే సదసత్పదార్థము కానిది ఏమి కానిది, అవిద్య యందలి నేను అనే ప్రతిబింబ చైతన్యము తన మూలమును విచారించి చూసుకొనినచో తానే లేకపోవును అని పద్య భావము. తన మూలము విచారించి చూచట గురు ముఖముగా తెలియవలెను.

**231వ పద్యము : అంగము లింగము గలసుటె । లింగ శరీరంబటంచు లెక్కకు వచ్చెన్ । లింగంబంగము నెడసిన । లింగం బుల్లక్కొను, నేనే లింగంబనివన్ ॥**

**టీక :** ఎడిసిన = విడచిన, విడిపోయిన.

**భావము :** గురుదేవా! అంగము లింగము కలిసియున్నదేదో అదే లింగ శరీరము, కారణ శరీరము అని చెప్పబడెను. అంగము, లింగము విడిపోయిన లింగ (శరీరము) లేకుండా పోవును. లింగమనగా "నేనే" స్వామీ ।

**విశేష భావము :** అంగము అనగా శరరీము. అనగా అవిద్య అనే ఉపాధి. లింగమనగా అవిద్య యందలి ప్రతిబింబ చైతన్యము "నేను", అవిద్య. ప్రతిబింబ చైతన్యము ఈ రెండు కలిసియే యున్నది. దీనికే కారణ శరీరము అనగా శరీరము వచ్చుటకు (పునర్జన్మకు) కారణమైనది. కనుక కారణ శరీరము అన్నారు. అవిద్య, ప్రతిబింబ చైతన్యము విడిపోయినచో అనగా అవిద్య గురు కృపచే నశించి పోయినచో ప్రతిబింబమైన నేను" లేకుండా పోవును. ఇదే ఎరుక రహితము. అవిద్య గురుకృపచే ఎట్లు నశించునో గురు ముఖముగా చక్కగా విచారించవలసి యున్నది. ఇదే "గురు ధ్యానే నైవ ముక్తిః" అనియు "ముక్తి మూలం గురోఃకృప" అనియు "భిద్యతే హృదయగ్రంథి" అనియు శాస్త్రములలో చెప్పబడును. దీన్ని చక్కగా విచారించవలసి యున్నది.

**232వ పద్యము : లింగము విక్షేపంబన । నంగం బావరణ మనిన నగునీ రెండే । లింగ శరీరము, దీనికి । భంగము తన మూల మరయబడినప్పుడగున్ ॥**

**టీక :** విక్షేపము = లేనిది ఉన్నట్లు తెలియపర్చే శక్తి, ఆవరణము = బ్రహ్మము తెలియబడకుండ కప్పి ఉంచే శక్తి, భంగము లేకపోవుట.

**భావము :** లింగము - విక్షేప శక్తి, అంగము = ఆవరణ శక్తి, ఈ రెండు శక్తులు కలసియే కారణ శరీరము, లింగ శరీరము లేక అవిద్య అందురు. ఈ లింగ శరీరము తన మూలము. తానెవరో చక్కగా గురుముఖతా విచారించినపుడు లింగ శరీరము లేకపోవును.

**విశేష భావము :** పిండాండములోని అవిద్య లేక అంతఃకరణము అని చెప్పబడే కారణ శరీరము. అవిద్యకు స్వతః త్రిగుణాత్మికము మరియు శక్తి ద్వయ స్వరూపము. 1) ఆవరణ శక్తి, 2) విక్షేపశక్తి. అవిద్య తన ఆవరణ శక్తి వలన బ్రహ్మమును కప్పియుంచుటచే బ్రహ్మము కానరాకున్నది. రెండవ శక్తి విక్షేప శక్తి. దీని వలన లేని జగత్తును నిర్మించుచు అది ఉన్నట్లుగా తానే మోహ పడుచున్నది. ఆవరణ శక్తి తమోగుణము వలన రజోగుణము వలన విక్షేప శక్తి కలుగుచున్నది. మూడవది యైన సత్వగుణము వలన జ్ఞాన శక్తి కలుగును. ఈ జ్ఞాన శక్తిచే శ్రీ గురుముఖతా చక్కని విచారణ జేసి లేని జగత్తు కారణమయిన రజోగుణ శక్తిని, తమోగుణ శక్తులను నిర్మూలించుకొని పిదప గురు కరుణచే జ్ఞాన శక్తిచే (ఎరుకకు) మూలమైన అవిద్యను చక్కగా విచారించి చూసినచో అవిద్య దగ్ధమై పోవును. ఇదే "జ్ఞానాగ్ని దగ్ధ సర్వకార్మిణి" అవిద్య పోయినచో నేనైన ప్రతిబింబము కూడ లేకపోవును. ఇదే నేను-మేను రహితము ఎరుక రహితము. ఇక శాశ్వతమైన పరిపూర్ణమున్న దని గుర్తించే ఎరుక లేదు. ఈ విషయము గురుముఖతా శాస్త్ర జ్ఞానము, అనుభవములచే అభ్యసించవలసియున్నది. ఇదే భస్మాసురుడు లేకపోయిన విధముగా అనే విధము.

**233వ పద్యము : ఎరుకన మరుపన రానిది । పరిపూర్ణం; బీశ్వరుడన నెరుకెరుకన్ । మరచిన జీవుండనబడు । నెరుకచలము నెరుగ నరుగు నెరుక మరుపులున్ ॥**

**పద విభాగము :** ఎరుకన మరుపన రానిది పరిపూర్ణంబు । ఈశ్వరుడనన్ ఎరుక, ఎరుకన్ మరచిన జీవుండనబడున్ । ఎరుక అచలమను ఎరుగన్ అరుగు ఎరుక మరుపులున్॥

**భావము :** గురుదేవా। ఎరుకని గాని మరుపు అని గాని అనరానిది పరిపూర్ణము. ఎరుక అనగా ఈశ్వరుడు (జ్ఞానము), మరుపు అనగా జీవడు, జ్ఞాన స్వరూపమును ఎరుగనిది, అవిద్య. ఎరుకే పరిపూర్ణమును తెలిసినచో ఎరుక మరుపులైన అవిద్య, ప్రతిబింబ చైతన్యములు రెండును కూడ లేకపోవును స్వామీ !

**విశేష భావము :** ఎరుకనగా జ్ఞానము లేక బ్రహ్మాండ అధిష్ఠాత ఈశ్వరుడు అని చెప్పవలెను. అట్లే "ఎరుకన్ మరచిన జీవుండనబడు" అనగా జ్ఞాన స్వరూపమయిన ఎరుకను మరచి, నాకన్న అధికమైన వాడు లేడు అని గాని, కేవల ప్రాపంచిక జ్ఞానమునే కలిగినవాడు జీవుడు" అదే మరుపు అనబడును. ఈ జ్ఞాన అజ్ఞానములు రెండు కానిది అంటే, ఈశ్వరుడు - జీవుడు రెండు కానిది, రెంటికి అతీతమైనది పరిపూర్ణము అని చెప్పవలెను. జీవుడు (అజ్ఞానము) తన స్వరూపమునే ఎరుగడు. ఇక పరిపూర్ణమును ఎట్లు ఎరుగగలడు? కనుకనే గురు గీతలో "శివరూపం స్వరూపంచ నజానాతి యత స్స్వయం" అన్నారు. కనుక గురు శుశ్రూషచే గుర్వను అగ్రహము ద్వారా అజ్ఞానమును విడచి జ్ఞాని (ఈశ్వరుని)గా అవాలి. ఇదే శాస్త్రములో జీవత్వమును విడచి ఈశ్వరుడవే నీవని గుర్తించి ఈశ్వరత్వము పొందవలెనని చెప్పబడినది. అట్టి జ్ఞాన స్వరూపమే గురుకరుణచే పరిపూర్ణమును తెలుసుకోగలిగేది చూడగలిగేది. ఆలా చూచి జ్ఞాన అజ్ఞాన స్వరూపములు రెంటిని లేకుండ చేసికొనగలడు. ఇదే ఎరుక లేకపోవుట. అనగా జీవ-శివులు రెండును లేవు ఉన్నది పరిపూర్ణము మాత్రమే. ఇదే జన్మ రహిత స్థితి.



**234వ పద్యము : ఎరుకవ సత్వగుణంబని। మరుపవ తామస మటంచు, మరి యీ రెండున్। పరిస్థైన రాజసంబని। వరులెన్నిరి మూటి విడువ నర్హము సుమ్మీ ॥**

**టీక :** ఎరుకన - జ్ఞానము మరుపన = అజ్ఞానము, అర్హము = తగును.

**భావము :** జ్ఞానమనగా సత్త్వగుణ ఆధిక్యమనియు, అజ్ఞానమనగా తామసగుణ ఆధిక్యమనియు, సత్త్వ-తమస్సులు సమముగా కలిసి ఉన్నచో రజోగుణాధిక్యము అనియు శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. అయితే గురుదేవా ఈ మూడు గుణములు విడువ తగినవే అని నా నిర్ణయము.

**విశేష భావము :** రజోగుణ ప్రధాని సత్వ ప్రధానుడైనను జన్మకు రావలసినదే. కనుక ముముక్షువులు జన్మ రహితమును కోరువారు మూడు గుణములను విడువవలసినదే. అనగా అవిద్య త్రిగుణాత్మికము అవిద్య పూర్తిగా నశించినప్పుడే జన్మ రహితము (ఎరుక రహితము) అనబడును. ఏ ఒక్క గుణ ప్రధానమయినను మిగిలిన రెండు గుణములు ఎంతో కొంత ఉండును. అవిద్య నశించదు. అవిద్య పూర్తిగా నశించినచో మూడు గుణములు పూర్తిగా లేకుండును . అవిద్య లేక పోయినచో అందలి ప్రతిబింబము కూడా నశించును (లేకపోవును) ఇదే (అవిద్య) జీవుడు నశించుట. ప్రతిబింబము (ఈశ్వరుడు) నశించుట ఇదే జీవేశ్వర రహితము ఇదే ఎరుక రహితము.

---

**235వ పద్యము : నన్నెరుగనట్టి బయటన్ । యెన్నడు లేనట్టి నేను యీ విశ్వమునై। వున్నట్టు లుండి నే లేం । దున్నది గని నేను బోతె, దుందణుగు సుమీ ॥**

**టీక :** బయటన్ = పరిపూర్ణము నందు, నేను = ఎరుక, విశ్వము నై - జగత్తునై, వున్నట్టులుండి = లేనిదే ఉన్నట్లు తోచబడుచు. (మిధ్యా రూపము) దుందణుగు= దుష్టత్వము పోవును. (దుఃఖకారణము పోవును)

**భావము :** దేవాధిదేవా! ఎరుకను ఎంత మాత్రము ఎరుగని పరిపూర్ణ పరబ్రహ్మము నందు, ఏ కాలమున లేని ఎరుక తోచి, జగద్రూపముగా ఏర్పడినది. ఎరుక జగత్తులు అజ్ఞాన వృత్తికి ఉన్నట్లు తోచబడుచున్ననూ, సద్గురుమూర్తి కరుణచే ఎరుక పరిపూర్ణమును చూచినచో, చూచిన ఎరుక పూర్తిగా లేకపోవును. ఇదే సమస్త దుఃఖ కారణ స్వరూపమయిన ఎరుక రహిత స్థితి అని నా భావము.

**విశేష భావము :** "ఎన్నడు లేనట్టి ఎరుక" - ఎరుక ప్రతిబింబ స్వరూపము. అద్దములో ప్రతిబింబము ఎప్పుడును లేదు. కనిపించుచున్నను అద్దములో ప్రతిబింబము లేదు అన్నదే సత్యము. ఆ విధముగా ప్రతిబింబ రూపమయిన ఎరుక ఏ కాలమునందు లేదు. కనుక అది లేని ఎరుక అని నిర్ణయము.

---

**236వ పద్యము : ఈ అచల మొకటి బ్రహ్మని । మాయ మయమైన విశ్వమంతయు నేనన్ । చాయ మెరుంగక వను వరు । లీయడ బ్రహ్మంబటంచు లెక్కిడ నగుదున్॥**

**భావము :** గురుదేవా! ఈ పరిపూర్ణము ఒక్కటి మాత్రమే బ్రహ్మమని, మాయతో కూడిన ఈ సమస్త బ్రహ్మాండ జగత్తులు నానుంచే అయ్యెను (ఎరుక నుంచే ఏర్పడినవి) అని ఎరుగక, ఇట్టి నన్ను (ఎరుకను) బ్రహ్మమని శాస్త్రజ్ఞులు కొంతమంది అంటుంటే, నాకు నవ్వు వచ్చుచున్నది స్వామీ !



**237వ పద్యము : భూమను భద్రాచలమని । రాములనుచు లేని నన్న రక్షణమున నే । మీ మాట నెరిగుల్లక్యని । నా మాటను మరచి యునికి నయమని తోచెన్ ॥**

**దండాన్వయము :** భూమను భద్రాచలమని । లేని నన్ను, రాములనుచు, మీ మాటన్ అరక్షణమున "నేను" ఉల్లక్యని ఎరిగి, నా మాటను మరచినయునికి, నయమని తోచెన్ ॥

**టీక :** భూమను = పరిపూర్ణ బ్రహ్మమును, లేని నన్ను = లేని ఎరుకను రాములనుచు = శ్రీరాముడు అని, మీ మాటన్ = గురువాక్యముచే, (షోడశీమంత్ర విచారణచే) నేను ఉల్లక్కి అని ఎరిగి = ఎరుక లేదు అని తెలసి, నా మాటన్ మరచి = ఎరుక లేదని విడచి(న) ఉనికి = స్థితి, నయమని = మంచిది అని.

**భావము :** పరిపూర్ణ బ్రహ్మమును భద్రాచల మనియు, లేని ఎరుక (సర్వాధిష్ఠానమైన ఎరుక) శ్రీ రామ చంద్రమూర్తి యని భావించి, గురు వాక్యముచే (షోడశీ మంత్ర విచారణచే) నేను అనే ఎరుక లేనిదని గట్టిగ దెలసి, దానిని విడచిన స్థితి మంచిదని నాకు తోచినది.

**విశేష భావము :** "నా మాటను మరచి యునికి" అన్న వాక్యమును నా మాటను మరచి న యునికి (న) అన్యాపదేశము అయినచో వాక్య సమన్వయమగును.

శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు, వారి గురు పరంపర అందరూ రామోపాసకులు అందుచేతనే వారికి ఎరుక ఉన్నంత వరకు రామోపాసన చేస్తూ రామునికి గురు మూర్తికి అభేధ స్థితిని కలిగియుండిరి. రాముడే జగదదిష్ఠానము అని భావించిరి.

కనుకనే భద్రాచాలము (భద్ర + అచలము) పరిపర్ణమనియు అందులో మొదట లేని (ఎరుక) రాముడు ప్రతిష్ఠించబడిన నిజ స్థితిని శాస్త్ర జ్ఞానము సద్గురు ముఖముగా ఎరిగినచో లేని రాముడు (ఎరుక) లేకపోతే ఉన్నది శాశ్వతమైన పరిపూర్ణమే (భద్ర + అచలమే) అని ఈ పద్యములో చెప్పిరి.

భద్ర అచలము = శ్రేష్ఠమైన అచలము, పరిపూర్ణము, రెండవది శ్రేష్ఠము కాని అచలము అని చెప్పక చెప్పుచున్నారు. ఎరుక ప్రతిబింబ స్వరూపము మయోపాధి కలిగినది. కనుక బింబము అయిన పరిపూర్ణము శ్రేష్ఠమయిన అచలము అని, ప్రతిబింబ రూపమయిన అచలము ఎరుక, శ్రేష్ఠమైనది కాదు. మాయా సహితమైనదని అంతరార్థము భద్రాచలము అనగా శ్రీ రామ క్షేత్రమైన భద్రాచలము అనియు శ్రేష్ఠమైన అచలము పరిపూర్ణమనియు శ్లేషాత్మకమైన భావముతో ఈ పద్యమును గుర్తించవలెను.

---

**అవతారిక :** ఇంతటితో శిష్యుడు తాను గురుముఖముగా గ్రహించిన విద్యను గురుమూర్తికి నివేదించుకొని ఊరకుండెను.

**238వ పద్యము : నా గురుడు నాకు దెల్పిన । యీ గురు బోధంత మీకు యిప్పుడు నేనున్ । బాగుగ విన జెప్పితి సుమి । యోగురు వర్యయని శిష్యు డూరక యున్నన్॥**

**భావము :** ఓ గురువర్యా! నా గురుమూర్తి నాకు దెల్పిన యీ గురు బోధ అంతయు నేను ఇప్పుడు మీకు బాగుగ విన జెప్పితిని స్వామీ । అని శిష్యుడు ఊరకుండెను. (అంత తరువాత పద్యముతో అన్వయము)

---

**239వ పద్యము : విని శిష్యుని వచనోక్తులు । మనమున హర్షించి, గురుడు మస్తకమునచె । య్యునిచి, తొడ మీద జేర్చుక । తన శిష్యుని మేను నివిరి, తానిట్లనియెన్॥**

**దండాన్వయము :** శిష్యుని వచనోక్తులు గురుడు విని, మనమున హర్షించి, శిష్యుని మస్తకమున చెయ్యునిచి, తన తొడ మీద జేర్చుక । మేను నివిరి తానిట్లనియెన్ ॥

**టీక :** వచనోక్తులు = చెప్పిన మాటలు, హర్షించి = సంతోషించి, మస్తకమున = శిరస్సున, (హస్త మస్తక సంయోగము చేసి) జేర్చుక = చేర్చుకొని (కర్చుండబెట్టుకొని) మేను నివిరి = శరీరమును తాకుచు, వెన్ను మీద చేతితో తాకుచు (నివురుచు)

**భావము :** శిష్యుడు చెప్పిన గొప్ప బోధను గురుమూర్తి విని, మనస్సులో సంతోషించి శిష్యుని హస్త మస్తక సంయోగము చేసి (స్పర్శ దీక్ష) ఆశీర్వదించుచు, తన తొడ మీద కూర్చుండ బెట్టుకొని, సంతోషాతిశయముచే, వెన్ను భాగమును చేతితో రాయుచు ఈ విధముగా అనెను.

**విశేష భావము :** శిష్యుడు గురుమూర్తిని ఆశ్రయించిన మొదట్లో "కరుణామృత దృష్టి చేత గని" (దృక్ దీక్ష) మోదము ముప్పిరి గొన మృదు వాక్యములతో బోధించెను (వాక్ దీక్ష) దృక్ దీక్ష, వాక్ దీక్ష ఈ రెండు దీక్షలు అయినవి. ఇక త్రివిధ దీక్షలలో స్పర్శ దీక్షమిగిలియున్నది. బోధ శిష్యుని నోటి వెంట విని సంతోషించి ఆశీర్వాద పూర్వకమైన "స్పర్శ దీక్ష" హస్తమస్తక సంయోగము చేసినట్లు ఈ పద్యములో చెప్పిరి. ఇంతటితో త్రివిధ దీక్షలు శిష్యునికి ఇచ్చి శిష్యుని తనంతవానిగా (ఎరుక రహితునిగా) చేసెను.

---

**240వ పద్యము : నీ వంటి గట్టి వాడిక । భూ వలయము నందు ముందు పుట్టడు, వెనుకన్ । నే వినలే దున్నాడం । చీ, వేళ్లకు నిన్నె చూస్తినిట భళి శిష్యా !**

**టీక :** గట్టివాడు = బోధ ఆరూఢత్వము నొందినవాడు, భూ వలయము నందు = భూ మండలమునందు, ఈ వేళ్లకు, ఈ సమయము నందు, ఇట = ఇక్కడ, భళి=శెభాస్ (మెచ్చుకోలు సంకేత వచనము)

**భావము :** (గురుమూర్తి శిష్యునితో) నీ వంటి బోధారూఢుడు భూమి పై భవిష్యత్తులో తిరిగి జన్మించడు, ఇంతటి ఆరూఢుడు గతించిన కాలంలో కూడా పుట్టినట్లు వినలేదు. అట్టి ఆరూఢత్వమును ఇప్పుడు ఇక్కడ నేను చూచుచున్నాను. సంతోషించితిని శిష్యా! (అనెను)

**విశేష భావము :** బోధ ఆరూఢుడు తిరిగి జన్మకు రాడు, ఆరూఢులు జరిగిపోయిన కాలంలో పునర్జన్మకు వచ్చినట్లు వినలేదు. ఇట్టి ఆరూఢుడు భవిష్యత్తులో తిరిగి

జన్మకు రాడని భావము. అంతే కాని తన శిష్యుని వంటి ఆరూఢుడు గత కాలంలో లేరని కాని, భవిష్యత్‌లో కూడ ఇంతటి వాడు పుట్టడని అర్థము చెప్పరాదు.

---

**241వ పద్యము : చందురుని చీమ ముద్దా । డిందనిట్లిపుడు నీవు యీ సద్బోధన్। జెందితివి, నీకు సరి జగ । మందెవ్వరు లేరు, నిన్ను మది మెచ్చితిరా ॥**

**టీక :** చందురుని = చంద్రుని.

**భావము :** శిష్యా! చంద్రుని చీమ ముద్దు పెట్టుకొన్నట్లుగా, ఇప్పుడు నీవు యీ గొప్పదగు బోధను చక్కగా గ్రహించితివి. నీతో సరిపోల్చ తగిన వారు జగత్తులో లేరు. నిన్ను మనస్ఫూర్తిగా మెచ్చుకొనుచున్నాను.

**విశేష భావము :** భూమి పై నున్న చీమ (అతి అల్పజీవి) కైలాస లోక మందలి ఈశ్వరుని శిరస్సు మీద ఉన్న చంద్రుని ముద్దు పెట్టుకొన్నది అంటే ఎన్ని కోట్ల జన్మల పుణ్య ఫలమో అని అనుకున్నట్లుగా, అంతటి కోటాన కోట్ల జన్మల పుణ్య ఫలము వలన కాని ఇట్టి పరిపూర్ణ బోదను గ్రహించలేరని చెప్పుటయే ఈ పద్య భావము. (చీమ చంద్రుని ముద్దు పెట్టుకొన్నది అని ఒక కవి కల్పిత విశేషమును ఇక్కడ శ్రీ కృష్ణ దేశికులు ఉదహరించిరి). జన్మ రహితునికి సరిపోలిక ఉండదు, కనుకనే అట్టి ఆరూఢునికి సరి జగత్తులో లేరని భావము.

---

**242వ పద్యము : అని మెచ్చి యేమి యిచ్చెద । వని, గురు దక్షిణ నటంచు నత డడిగిన, వ । న్నని పల్కె శిష్య రత్నము । విని యిది యిక ముట్టబోక విహరించుమనన్॥**

**దండాన్వయము :** అని మెచ్చి, గురు దక్షిణన్ యేమి యిచ్చెదవని అటంచు నతడడిగిన (గురుడు)। "నన్ను" అని పల్కె శిష్య రత్నము। యిది విని (గురుడు) యిది యిక ముట్టబోక విహరించుము అనెన్ ॥

**టీక :** గురు దక్షిణ = శిష్యుడు విద్య పూర్తి అయిన పిదప గురుమూర్తికి ఇచ్చే ధనము, ముట్టబోక = తగుల్కొనక, విహరించుము = వ్యవహరించుము; అనన్ = అనగా.

**భావము :** గురుమూర్తి సంతోషించి శిష్యునితో గురు దక్షిణ ఏమి ఇచ్చెదవు అని అడిగిన వెంటనే, ఆ శిష్య రత్నము "నన్ను" (ఎరుకు) ఇచ్చెదను స్వామీ ! అని చెప్పగా.....

**విశేష భావము :** గురుమూర్తి శిష్యునకు మంత్రోపదేశము చేయునప్పుడు, శిష్యుడు గురుమూర్తికి తన శరీరము, మనస్సు, ధనము (తను మన ధనములు) ధారపోసెను. అనగా "నేను" అనే ఎరిగే శరీరము తప్ప మిగిలినవన్నియు గురు మూర్తికి ఇచ్చెను. అందుచే జ్ఞానము ఒక్కటే తన వద్దనున్నది ఏ కర్మైన చలనము లేకుండగా జ్ఞానముచే బోధను చక్కగా గ్రహించెను. బోధ పూర్తి అయిన తరువాత ఆఖరుగా తన వద్ద నున్న ఎరిగే శరీరమును "నన్ను" కూడా గురుదక్షిణగా గురుమూర్తికి ఇచ్చి ఏమీ లేని స్థితిని పొందెను. ఇదే "జ్ఞాన మజ్ఞానినం దృష్ట్వా ద్వయోస్త్యజతి నిశ్చయం। ద్వయోస్త్యజతి యద్ జ్ఞానం, తజ్ఞానంచ పరిత్యజేత్" అన్న శ్లోక భావము. సమస్తమును జ్ఞానము చేత తెలుసుకొని, ఆ తెలుసుకొన్న జ్ఞానమును కూడా విడువవలెను. ఇదే "అయమాత్మా తత్త్వమస్యాది జ్ఞాన రహిత కీలకం మరియు "నిర్గుణ ప్రజ్ఞాన రహిత కీలకం" అని షోడశాక్షరీ మహామంత్ర కీలక విచారణ.

---

**243వ పద్యము : విని శిష్యుడు గురుమూర్తిని । గనుగొని, చిత్తరువు ప్రతిమగా నిలచున్నన్ । తన శిష్యుని హస్తములన్ గొని దగ్గర తీసుకొని కొడుకాయనుచున్॥**

**టీక :** చిత్తరువు = బొమ్మ, ప్రతిమగా = పోలికగా

**భావము :** "నేను" అను దానిని గురు దక్షిణగా ఇచ్చిన శిష్యుని అది ముట్టకము అని గురుమూర్తి చెప్పగా శిష్యుడు విని, గురుమూర్తిని చూచుచు బొమ్మ పోలికగా (కదలక మెదలక) నిలబడి యుండగా గురుమూర్తి సంతోషించి, తన చేతులతో శిష్యుని దగ్గరగా తీసుకొని కుమారా! అని సంతోషముతో సంబోధించి...

(తరువాత పద్యముతో అన్వయము)

---

**244వ పద్యము : చెప్పదొణంగెను మునుతా । జెప్పని ముచ్చట్లు కొన్ని సేమము కొఱకై । యెప్పుల కుప్పా । ఓమా యప్పాయని దువ్వుకొనుచు వతి దయతోడన్॥**

**దండాన్వయము :** యెప్పులకుప్పా ! ఓమాయప్పా ! యని అతి దయతోడన్ దువ్వుకొనుచు, మునుచెప్పని ముచ్చట్లు కొన్ని (శిష్యుని) సేమము కొరకై చెప్పదొణంగెను॥

**టీక :** చెప్పదొణంగెను = చెప్పనారంభించెను, ముచ్చట్లు; సూక్తులు, మాటలు = సేమము = ఉన్న స్థితి చెడకుండుట, శుభము, యెప్పులకుప్పా = మంచి తనమే రాశిగా యేర్పడిన వాడా ! మాయప్పా = మా తండ్రీ !

**భావము :** ఓ యొప్పుల కుప్పా! మా అప్పా అని శిష్యుని సంబోధించి అతని స్థితి పాడుగాకుండుటకై ఇది వరలో చెప్పని సూక్తులు కొన్ని ఇప్పుడు (గురుమూర్తి) చెప్పనారంభించెను.

**విశేష భావము :** శిష్యునికి గురుమూర్తి ఇంత వరకు బోధను మాత్రమే చెప్పెను. బోధ చక్కగా శిష్యుడు గ్రహించెను. కనుక తన వద్ద నుండి బయటకు పంపుచున్నాడు. అయితే అతని బోధ స్థితి పాడుగాకుండుట కొరకు (సేమము కొరకు) ప్రాపంచిక జనులతో ఏ విధముగా నడుచుకొనవలెనో అట్టి సూక్తులను ఇప్పుడు చెప్పనారంభించెను.

(తైత్తరీయోపనిషత్తులోని శిక్షావల్లి వలె)

---

**245వ పద్యము : ఒప్పకుమీ పరబోధల । దప్పకు మీ బోధనెపుడు దలచుట మదిలో । రొప్పకు మీ సచ్ఛిష్యుల । చెప్పకుమీ దీన్ని దుష్ట చెనటుల కెపుడున్ ।**

**టీక :** పరబోధల = ఇతర బోధనలను, ఒప్పకుమీ = అంగీకరించకుము, గ్రహించకుము; రొప్పకు మీ = కోపించకుము, తరమకుమీ (విడవకు), దుష్టచెనటులు = దుర్మార్గులు.

**భావము :** శిష్యా! నే చెప్పిన బోధకు ఇతరమైన బోధల నెపుడు గ్రహింపకుము. ఈ బోధనెపుడు మననము చేయుట మరువవద్దు. సచ్ఛిష్యులను పారద్రోలకుము. ఈ బోధను ఎప్పటికి దుష్టులకు చెప్పకుసుమా!

---

**246వ పద్యము : కూడకు మీ దుర్జనులను । వీడకు మీ సాధుమనుజ వితతి స్నేహం। బోడకు మీ గురు సేవకు । పాడకు మీ పరుల నింద పాటల రీతిన్ ॥**

**టీక :** కూడకుమీ = సహవాసము చేయకుమీ; వీడకు = విడువకు, వితతి = స్నేహము, వోడకుమీ = వెనుకాడకుమీ ॥

**భావము :** శిష్యా! దుష్ట సహవాసము చేయకుము. సజ్జనుల సహవాసము వీడకుము. గురుసేవకు వెనుకాడకుము. ఇతరుల నిందించుచు పాటలతో పాడుచు తిరుగాడకుమా!

**విశేష భావము :** "శంకరాచార్యుల బొంకులకు జంకేలేదా ! "అంటూ పెద్దలను నిందారూపమైన పాటలతో ఈనాడు మన సంప్రదాయకులు నగర కీర్తలలోను సభలలోను వ్యవహరించుట అందరికి తెలిసినదే. ఇది తప్పు. ఈలా వ్యవహరించెదరని శ్రీకృష్ణ దేశికేంద్రులు ఆనాడే గ్రహించి (కాల జ్ఞానము వలె) ఈ పద్యము చెప్పియుండవచ్చును. అయినను మన వారికి ఈ గురు సూక్తులు మనస్సున కంట లేదు.

---

**247వ పద్యము : మీరకు మీ గురు వాజ్ఞను । చేరకు మీ దుష్టులంత చేరిన చోటన్ । దూరకు మీ బోధను, విని । యూరకుమీ సాధుజనుల యందున తప్పుల్ ॥**

**టీక :** మీరకుమీ = అతిక్రమించకు, దూరకుమీ = నిందించకుము; విడువకుమీ, యూరకుమీ = ఎంచకు సుమా.

**దండాన్వయము :** సాదు జనుల యందున తప్పుల్ విని యూరకుమీ ।

**భావము :** శిష్యా! గురువాజ్ఞను ఎన్నటికి అతిక్రమించకుము. దుష్టులు చేరిన స్థానము వద్దకు చేరకుము. అక్కడ ఉండకుము, యీ బోధను ఎన్నడు విడువకుము. సాధుజనులు పెద్దల యందలి తప్పులు విని ఎంచి చెప్పకు సుమా !

---

**248వ పద్యము : జనుల వలె జరుపుపనులను । వను నిను జన వితతి తిట్ట నడువకు మెపుడున్ । నిను నీవు బొగడుకోకుము । నిను బోలరటంచు, జనుల నిందించకుమీ ।**

దండాన్వయము : నిను బోలరటంచు నిను నీవు బోగడకోకుము । జనుల నిందించకుమీ ॥

**భావము :** శిష్యా! నిన్ను, నీ మూలముగా నన్ను, జన సమూహము తిట్టే లాగున ఎన్న  ంచకుము. వారందరు లౌకిక కార్యములు ఏలా చేయుదురో నీవును ఆలాగే చేయుము. (అట్లుచేయనిచో నిన్ను నీ మూలముగా నన్ను దూషించెదరు) నీకుగా నీవు నిన్ను స్తుతించుకోకుము. నీకు సాటెవ్వరూ లేరనుచు జనులను నిందించకుము.

**విశేష భావము :** జనులందరు ఆచరించే లౌకిక కర్మలో (అది వెర్రి పనిగా తోచినను) వారందరి వలెనే నీవును చేయనిచో, నిన్ను నీ మూలముగా నన్ను (గురుమూర్తిని) తిట్టెదరు. అట్లు ఎన్నడూ ప్రవర్తించకుము. అందుచే దేవతా కార్యక్రమములు లౌకిక కార్యక్రమములు అందరి వలెనే మనమును ఆచరించవలెనని ఈ పద్య భావము.

**249వ పద్యము : శ్రద్ధ బోధందు నిలి ప । శ్రద్ధను నీ నేర్పు చేత ఝూడించితివా । బద్ధత్వమంత బాయును । బుద్ధికి సరిపడి తె దీన్ని బూన గదోయీ ॥**

**టీక :** శ్రద్ధ = ఆసక్తి, అశ్రద్ధను = విరక్తిని, అనాసక్తిని, నేర్పు చేత = యుక్తి చేత, ఝూడించు = విదిలించు, బద్ధత్వము = సోమరితనము (కట్టడితనము) బూన గదోయీ = ప్రయత్నించవయ్యా !

**భావము :** శిష్యా!, బోధయందు ఆసక్తి కలిగియుండి, విరక్తిని సోమరితనమును ఏదో యుక్తి చేత వదలించుకొనినచో, నీ జన్మ బంధత్వము (కట్టడితనము) లేకుండా పోవును. నీ బుద్ధికి ఈ మాట సరిపడినచో ఈ విధముగా చేయుటకు ప్రయత్నించవయ్యా!

**250వ పద్యము : సంశయమె జన్మ హేతువు । సంశయమె గురుని మాట చవిగొనని యదీ । సంశయమె కీడు నొదవును ।సంశయ మెడ బాస్తి వేని చాలును వత్సా !**

**టీక :** సంశయమె = ఎరుకయె, హేతువు = కారణము, చవిగొననియది =

ఇష్టపడకుండ చేయునది; కీడు = దుఃఖము (జన్మ పరంపర) ఒదవును = తెచ్చిపెట్టును, ఎడబాస్తివేని = విడచినచో, వత్సా = కుమారా!

**భావము :** కుమారా! ఎరుకయే జన్మకు కారణము, ఎరుకయే గురుని మాట యందు విముఖత కలిగించేది, ఈ ఎరుకయే జన్మ పరంపర అనే దుఃఖమునకు కారణమైనది. ఇట్టి ఎరుకను విడచిపెట్టినచో చాలును (జన్మ దుఃఖమనేదే ఉండదు) నసపునరావర్తతే.

**విశేష భావము :** బోధ అంత చెప్పిన తదుపరి జనులతో ఏ విధముగా మెలగ వలెనో చెప్పుచూ, ఎరుక అన్ని ఆపదలకు దుఃఖములకు మూలమైనది. అట్టి యెరుకను ఒక్కదానిని వదలినచో చాలునని, మరొక్కసారి మరువకుండుటకై యీ పద్యమును చెప్పినారు. ఇదే చాలా ముఖ్యమైన పని అని చెప్పినారు.

వేద విద్య అంతయు పూర్తి చేసిన శిష్యుని గృహస్థాశ్రమ స్వీకారముకై ఇంటికి పంపుచూ గురుమూర్తి (వేదములో) తైత్తరీయోపనిషత్ శిక్షావల్లిలో కూడ ఇదే విధముగా ఆచరణ విధానము, వేదాధ్యయనమును విస్మరించవద్దని కొన్ని మెలకువలు చెప్పి పంపును. అట్లే శ్రీ కృష్ణ దేశికేంద్రులు శృతిని అనుసరించుచు గురుమూర్తి శిష్యునికి చివరలో **245** నుండి **252** వ పద్యము వర్కు చెప్పి పంపుచున్నారు.

ఇంతటితో బోధ రచన పూర్తి అయినట్లుగా "పదియిరువది అయిదులు" అని 255వ పద్యములు చెప్పుకొనిరి.

**251వ పద్యము : నరులంత మెచ్చ నడువను । హరి హర శతమఖానురాదులకైనన్। తరము గాదన మనకిక । తరమౌనన వశమె చూడు ధాత్రిని పుత్రా ! ॥**

**టీక :** మెచ్చ = ఆమోద యోగ్యము, హరి = విష్ణువు, హర = ఈశ్వరుడు, శతమఖామర = నూరు యజ్ఞములు చేసిన దేవుడు = దేవేంద్రుడు, ఆదులు = మొదలగు దేవతలకు, ధాత్రిని = భూమి యందు, పుత్రా = పున్నామ నరకము నుండి రక్షించువాడు = కుమారుడు (జ్ఞానము)

**భావము :** కుమారా! జనులందరు ఆమోదించులాగున ప్రవర్తించుటకు విష్ణుమూర్తి, ఈశ్వరుడు, దేవేంద్రుడు మొదలగు దేవతలకే తరము కాలేదు కదా! భూమి యందు మనకు వశమగునా? చూడుము.

**విశేష భావము :** ఈ బోధ సరియైన పద్ధతిగా శాస్త్ర సమ్మతముగా గురుడు జెప్పిన విధముగానే చెప్పుచున్ననూ అందరూ సమ్మతించలేరు. అది వారి వారి మూర్ఖత్వముచే మన బోధను తప్పుగా ప్రకటింతురు. అందుచే బాధ పడవలదని శ్రీకృష్ణ దేశికేంద్రులు తన శిష్యులకు ఈ పద్యములో చెప్పిరి.

**252వ పద్యము : అందరిని చణకు చుందురు । కొందరు దుర్మార్గ వృత్తి కుటిల జనంబుల్ । యెందరినో గిచ్చి కరచుచు । మందల వలె కోతులుండు మాడ్కిని కుమ్రా!**

**టీక :** చణుకుట=ఎదిరించుట, బాధించుట, గిచ్చి = నోటితోగీచి, మాడ్కిని=విధముగ

**దండాన్వయము :** కుమ్రా! మందల వలె కోతులు యెందరినో గిచ్చి కరచుచు ఉండు మాడ్కిని, కొందరు కుటిల జనంబుల్ దుర్మార్గవృత్తిన్ అందరిని చణుకుచుందురు. (చనుకు అని గ్రంథస్థ పదము)

**భావము :** కుమారా! కోతి మందలు యెంతో మందిని కాళ్లతో గోరి కరచుచుండును. అట్టి విధముగా దుర్మార్గులు కుటిల స్వభావులు అయిన కొందరు జనులు ప్రతీ ఒక్కరిని ఏదో ఒక విధముగా మాటలతో గాని చేతలతో గాని బాధింపుచుందురు. (అది వారి స్వభావము, బాధపడవద్దు అని శిష్యునికి గురుమూర్తి చెప్పుచున్నారు.)

**253వ పద్యము : ఈ చెప్పిన గురుబోధను । తా చెవి నిడి, బయలు గాంచి, తన లేమి నిజం । బై, చనియె శిష్యుడప్పుడు । లేచెను గురుడవలమాట లేదా మీదన్ ॥**

**దండాన్వయము :** ఈ చెప్పిన గురు బోధను తాచెవినిడి, అపుడు శిష్యుడు బయలు గాంచి, తన లేమి నిజంబై చనియె । అవల గురుడు లేచెను । ఆ మీదన్ మాట లేదు ।

**భావము :** ఈ చెప్పిన గురు బోధను తాచెవినిడి, అపుడు శిష్యుడు బయలు గాంచి, తన లేమి నిజంబై చనియె । అవల గురుడు లేచెను । ఆ మీదన్ మాట లేదు । (ఎరుక లేదు అని భావము)

**విశేష భావము :** బోధ పూర్తిగా శిష్యునికి గురు మూర్తి చెప్పెను. పరిపూర్ణమై ఉన్నదని తాను (ఎరుక) ఎంత మాత్రము ఎన్నడూ లేదని ఆరూఢుడై తాను లేకుండా పోయెను. ఇంక గురుడు ఎట్లు ఉండును? కర్పూరము ఉన్నంత వరకే నిప్పు. అవిద్య ఉన్నంత వరకే అందలి ప్రతిబింబము. శిష్యుడు లేకపోతే గురువు లేకపోయెను. ఇదే శిష్యుడు మేల్కొని గురువును మేల్కొల్పుట "నీవు మేల్కొని నన్ను మేల్కొల్పుడీ" అన్న పదమునకు భావమును ఈ పద్యములో చెప్పిరి. ఇక మిగిలినది ఫలానా అని చెప్పుటకు ఎరుకేది? "ఆవల ఏ మాట లేదు" అన్న పదమునకు అర్థము. ఇక్కడితో గ్రంధ సమాప్తి చేసినట్లై.

**అవతారిక :** గ్రంథము యొక్క ఫలశృతి పరిసమాప్తి ఏనాడు చేసిరో చెప్పుచున్నారు.

**254వ పద్యము : శరధి కరితురగ సితకర । పరిమితమైనట్టి శాలివాహన శకమం। దు, రచిస్తి మాఘ పౌర్ణమి । వరకివి, దుందుభి యనేటి వత్సర మపుడున్ ॥**

టీక : శరధి (సముద్రములు) 4, కరి = ఏనుగు -8, తురగ = గుఱ్ఱము 7, సితకర-చంద్రుడు -1, పరిమితమైనట్టి - సరిపడినటువంటి.

**భావము :** శాలివాహన శకము 1784 సం॥నకు సరిఅయిన దుందుభి నామ సం॥ర మాఘ శు॥ పౌర్ణమి నాటికి ఈ పద్యములు రచించితిని. (అని కృష్ణ ప్రభువులు ఈ పద్యములో తెలిపిరి).

**విశేష భావము :** "అంకానాంవామనోగతిః" అన్న సూత్రము ప్రకారము అంకెలను కుడి నుండి ఎడమకు వ్రాసి లెక్కించుట సంస్కృత భాషలో ఆచారము శరధి అను మాటకు నాలుగు (4) సముద్రములనియు, కరి అను పదమునకు ఏనుగు కనుక (మదము) అష్టమదములు (8) అనియు, తురగ అను పదమునకు గుఱ్ఱము, సూర్యరధమునకు 7 గుఱ్ఱములు కనుక (7) అనియు, సితకర పదమునకు చంద్రుడు (1) అనియు సంకేతములు. కుడి నుండి ఎడమకు వ్రాస్తే 1784 అని అర్థము. ఇందుకు సరి అయిన క్రీస్తు శకము 1862వ సంవత్సరము దుందుభి అనే తెనుగు సంవత్సరము మాఘ శుద్ధ పౌర్ణమి నాటికి ఈ కంద పద్య రచన పూర్తి చేసినట్లు చెప్పిరి.

శ్రీ కృష్ణ దేశికేంద్రులు ధాతృ నామ సం॥ర క్రీ.శ. 1876 కార్తీక శు॥ దశమి శుక్రవారం రోజున విదేహులైనట్లు తెలియుచున్నది.

శ్రీ శివరామదీక్షితుల వారు జననం క్రీ.శ. 1603 సం॥
శ్రీ శివరామదీక్షితుల వారు మరణం క్రీ.శ. 1671 సం॥ విరోధికృన్నామ సం॥ర కార్తీక శుద్ధ దశమి శనివారం మొత్తం ఆయుర్దాయం 68 సం॥ కృష్ణ ప్రభువుల జననం తెలియరాలేదు.
కందార్థములు 292 రచించినది క్రీ.శ. 1843 శోభకృన్నామ సం॥ర మార్గశిర బ॥ చవితి
కందపద్యములు 261 రచించినది క్రీ.శ. 1862 దుందుభి మాఘం శు॥ 15కి రచించిరి.

**255వ పద్యము : పదియిరు వై యైదులు యీ । సదమల కందములు వీటిని సదయా మతులై । ముదమున మీరు వినెదరని॥ మదిలోపల దలచి చేస్తి మానవులారా!**

**టీక :** సదమల = సత్ + అమల = సత్ = శాశ్వతమైన, అమల = మలిన రహితమైన, అనగా పరిపూర్ణ పరబ్రహ్మము, పది ఇరువై అయిదులు 10 x 25 = 250 పద్యములు, సదయామతులై = మంచి సత్వ ప్రధాన బుద్ధితో, ముదమున = సంతోషముతో, చేసి = రచించితిని.

**భావము :** ఓ మానవులారా! పరిపూర్ణ పరబ్రహ్మ బోధ కంద పద్యములు 250 వీటిని సత్వ గుణ ప్రధానులై సంతోషముతో మీరు వినెదరని భావించి రచించితిని.

**అవతారిక :** గ్రంతమునకు ఫలశృతి చెప్పుట అర్ష సంప్రదాయము. అందుకే ఈ పద్యమును చెప్పిరి.

**256వ పద్యము : ఎవరీ పద్యము లన్నియు, । వివరింతురో, వారి కెల్ల విద్యా విద్యల్ । దవిలి భాదింప వెన్నడు । భవ నాశ స్థితులు లేక ప్రబలు దురెపుడున్ ॥**

**టీక :** భవ = పుట్టుక, నాశ = చావు, స్థితి = వృద్ధి పొందుట, విద్యా అవిద్యల్ జ్ఞాన అజ్ఞానములు (ఎరుక) దవిలి = తగుల్కొని, భాదింపవు = దుఃఖ పెట్టవు, ప్రబలుదురు = వర్ధిల్లెదరు.

**భావము :** ఎవరైతే ఈ కంద పద్యములన్నిటిని నా మనో భావమును అనుసరించి వివరింతురో వారికి జ్ఞాన అజ్ఞానములు (ఎరుక) తగుల్కొని బాధింపదు.

**విశేష భావము :** "భవ నాశ స్థితులు లేకుండా వర్థిల్లుట ఏమిటి? అని వర్థిల్లుట అను శబ్దమునకు అనుమానము రావచ్చును. ఆ శబ్దము (వర్థిల్లుట) కేవలము ఆశీర్వాద శబ్దముగా గ్రహించవలెను. ఈ గ్రంథమును అర్థము చేసుకొని ఆచరించిన వారిని శ్రీ కృష్ణదేశికేంద్రులు "భవ నాశ స్థితులు" లేకుందురు గాక అని ఆశీర్వదించినట్లుగా భావించవలెను.



**అవతారిక :** సరియైన శాస్త్ర భాషా పరిజ్ఞానము లేక, యీ గ్రంథమును సరియైన రీతిలో అర్థము చేసికొనలేక ఈ గ్రంథము వట్టి పొల్లు గ్రంథము అని భావించే వారే పనికి మాలిన భ్రష్ఠ జనులని చెప్పుచున్నారు.

**257వ పద్యము : అర్థము తెలియక గ్రంథము । వ్యర్థంబని నిందసేయు వ్యర్థుల మాటల్ । వ్యర్థములని, యీ గ్రంథం । బర్థము సద్గురుని వలన బాగుగ వినుడీ ॥**

**టీక :** వ్యర్థము = ప్రయోజనము లేనిది, వ్యర్థులు = ప్రయోజనము లేనివారు, మూర్ఖులు ।

**భావము :** ఈ గ్రంథము యొక్క సరియైన భావము తెలియక, యీ గ్రంథము ప్రయోజనము లేనిది అని కూసే, పనికిరాని మాటలే, ప్రయోజనము లేని మాటలని తెలుసుకొని, ఈ గ్రంథము యొక్క సరియైన భావమును సద్గురు ముఖముగా చక్కగా వినమని శ్రీ కృష్ణ దేశికేంద్రులు చెప్పిరి.

**విశేష భావము :** ఈ గ్రంథము పైకి చాలా తేలికగా తెలియబడులాగున ఉన్నది.అయిననూ వీటి భావము చాలా గంభీరము. శాస్త్రజ్ఞులు సైతము చక్కగా గుర్తించలేరు అనుట అతిశయోక్తి కానేరదు. సద్గురుముఖముగా వినమన్నారు. సద్గురువు అనగా శ్రోత్రియుడు = ఉపనిషద్భావమును చక్కగా గుర్తించినవాడు, బ్రహ్మనిష్ఠుడు = మనస్సు బ్రహ్మతత్త్వమునే ఎల్లప్పుడు చింతించేవాడు, అయి ఉండాలి అని భావము. అంతేకాని గురువు ధన, కీర్తి వగైరా లౌకిక విషయములందు మనస్సు ఉన్నవాడు, భాషా జ్ఞానము లేనివాడు, దురాచారుడు పనికిరాడు. గురుని

లక్షణములు కందార్థములలోను, గురుగీతలోను చక్కగా చెప్పబడినది. అట్టి వారే సద్గురువు. అట్టి సద్గురు మూర్తి ద్వారా లక్షణయుతమైన సచ్ఛిష్యుడు ఈ గ్రంథ భావమును చక్కగా విని గ్రహించమని ఈ పద్య భావము.

---

**258వ పద్యము : పాట సుమీ భక్తులకిది। బాట సుమీ బోధ జెంద, భ్రమ రాకుండన్ । కోట సుమీ, కందములను । తోట సుమీ దీన్ని తొలగ ద్రోయక వినుడీ॥**

**దండాన్వయము :** భక్తులకు ఇది పాట సుమీ । బోధ జెంద బాట సుమీ । భ్రమరాకుండన్ కోట సుమీ । కందములను తోట సుమీ । (కనుక) దీన్ని తొ లగ ద్రోయక వినుడీ।

**టీక :** బాట = మార్గము, కోట = ప్రహారీ, తోట - ఫలవృక్ష సమూహము, ఆశ్రమము, తొలగ ద్రోయక = విడచిపెట్టక.

**భావము :** గురు భక్తులు నిత్యము మననము కొఱకై పాట రీతిగా చదువుకొనవలెసుమా! ఇది ఎరుక అను భ్రమను దగ్గరకు రాకుండగ ప్రహారీ వలె అడ్డుకొనును. పరిపూర్ణ స్థితి జెందుటకు ఇది మార్గము. కంద పద్యములనే ఫల వృక్షతోట (ఈ పద్యములు మీకు శ్రమ (బాధ) నివారించే ఆశ్రమము అని కూడా అర్థము. కనుక ఓ భక్తులారా! దీన్ని విడచిపెట్టక నిత్యము గానము చేయుడు.

---

**259వ పద్యము : పరమ హంసా శ్రమ ధరుని । పరిపూర్ణపు బోధ వాని పనులు సమమె, వా । ర్నెరిగెరుగక నుతి నిందలు । గరపిన తత్ఫలము ప్రజలకగు నిజము జూమీ॥**

**టీక :** పరమహంస = ఉత్తమ పదము పొందిన సన్యాసి, నుతి = స్తోత్రము, నింద = దుర్భాష, గరపిన = చేసిన.

**భావము :** ఉత్తమ పదము పొందిన గొప్ప సన్యాసాశ్రమ ధరుని పనులు, ఎరిగి వారు చాలా గొప్పవారు జ్ఞానులు అని స్తోత్రము చేయుచు, పరిపూర్ణ బోధస్థుల

వారి పనులు (సామాన్యముగా అందరి వలెనే యుండును గనుక) ఈ బోధ విషయమును ఎరుగక వీరిని నిందలు చేసే జనులకు ఆ దుష్ట ఫలము తప్పక అనుభవింతురు. ఇది నిజము సుమా !

**విశేష భావము :** ఈ పద్యమును క్రమాలంకారముగా విడదీయవలెను.

పరమహంసాశ్రమధరుని, పరిపూర్ణపు బోధ వాని పనులు సమమే? అనగా సమము కాదు అని భావించి,

1) పరమ హంసాశ్రమధరుని పనులు ఎరిగి నుతి గరపిన అట్టి ప్రజలకు తత్ఫలము అగు నిజము జూమీ .

2) పరిపూర్ణ బోధ వాని పనులు ఎరుగక నిందలు గరిపిన తత్ఫలము ప్రజలకు అగు నిజము జూమీ ॥

---

**260వ పద్యము : ప్రతి దినము జదివి యెవరీ । ప్రతి వర్చన జేతు రట్టి ప్రజలకు బోధ । స్థితి కుదురగలదు గురుకృప । కతి పాత్రులు వారు, వారి కడ్డము గలదే ॥**

**భావము :** ఈ ప్రతిన్ యెవరు ప్రతిదినము జదివి అర్చన చేతరో అట్టి వారు గురుకృపకు అతిపాత్రులు । అట్టి ప్రజలకు బోధ స్థితి కుదరగలదు । వారికి అడ్డము గలదె ?

**టీక :** ప్రతిన్ = గ్రంథమును

---

**261వ పద్యము : ఇతర మెరుంగని సతమం । దతి మృషయై కానుపించునట్టి మనము, యూ । కృతి, గురుశిష్యులు, వారల । యితరేతర వాగ్విలాస మివి మృషలు సుమీ ॥**

**టీక :** ఇతర మెరుంగని = ఇతరమును ఎంతమాత్రము ఎరుగని, సతము = శాశ్వతము (సత్ అను సంస్కృత పదమునకు, తెనుగు పదము సతము) మరియు రహస్యమైనది, లోతైనది అని కూడా అర్థములు గలవు; ఇతరేతర = ఇంకా ఇతర ఇతరమైన, వాక్ విలాసములు = మాటలు, చేతలు, మృష = లేనిది.

**భావము :** ఇతరమును ఎంతమాత్రము ఎరుగని శాశ్వతమైన దానియందు (పరిపూర్ణము నందు) ఎంతమాత్రము లేని యీ గ్రంథము, గురు శిష్యులు, వారి యొక్క ఇతరేతరమైన బోధలు, చేష్టలు సమస్తమైన పనులు యివన్నియు లేనివే సుమా !

॥ స్వస్తి ॥

ఇతి శ్రీమద్భాగతవ కృష్ణ దేశికేంద్ర విరచిత
క్షరా ఽ_క్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్త్వకందములకు
వానల్లి గ్రామ శ్రీ శివరామదీక్షిత అచగుర్వాశ్రమ
భక్తుడును, శ్రీ సమరస నిర్మల ప్రజ్ఞాన విలక్షణ అరట్ల రామారాయ
సద్గురుమూర్తి ప్రియశిష్యుండును,
నితుందినస గోత్రోద్భవ నేమాని సూర్యనారాయణావధాని
దత్తపుత్రుండను, వేంకట రామనామధేయునిచే రచింపబడిన
టీక, దండాన్వయ, భావ-విశేష భావములు సమాప్తము

॥ సర్వం సద్గురు చరణారవిందార్పణమస్తు ॥